'గీత' 'మంజరీ' ఛందములనే ఆశ్రయించితిమి. [illegible] దేశీయమగు [illegible]లకు ఆ దేశీయులు ఉచ్చరించు రూపాలను [illegible] నిచ్చితిమి. తెలిగించుటలో గురుదేవుని దివ్యసూక్తుల పటిమను [illegible] మాచేతనైనంతవఱకును ప్రయత్నించితిమి.

ఈ గ్రంథములో ఆధ్యాత్మిక జీవితమునకు [illegible]ములును ఉపాదేయాంశములును సమరస[illegible] [illegible] ప్రశ్నోత్తరరూపమున వివరింపబడియున్నవి. [illegible] ముముక్షువులకును పారమార్థిక జీవితమున [illegible], పండితులకును పామరులకును అందఱకును ఈ గ్రంథము [illegible]ను ఉత్సాహమును మనశ్శుద్ధిని వైరాగ్యమును [illegible] గలిగించు ననుటకు సందియము లేదు —

> "యది హాస్తి తదన్యత్ర;
> యన్నేహాస్తి న తత్ క్వచిత్" [వ్యాస

> "......ఇందుఁ గలుగు నదియ
> యొండెడలఁ గల్గు; దీన లే కుండు చొప్పె-
> ద క్కొకంటను లేదు వేదజ్ఞులార" [తిక్కన

అను ప్రశస్తి ఈ గ్రంథమునకు ప్రత్యక్షరము సరిపోవును, శ్రీ [illegible] కృష్ణుని బోధామృత మను గ్రంథములో కన వగు బోధన[illegible] రెవరికి ఏయేసందర్భములలో చేయబడినవో ఈ గ్రంథము [illegible] తెలియ జేయును; ఆ గురుదేవుని దివ్యజీవితమును అనుగ్రహ[illegible] ప్రేమను, నిరవధికజ్ఞానమును, భక్తిపరవశదశను కన్నులకు [illegible] చిత్రించి చూపును.

ఈ గ్రంథమును ఎల్లరును చదివి, సందేహాలు తీఱి, [illegible] లక్ష్యములను ప్రాపించి, ఈశ్వరానుగ్రహమును బడసి, [illegible]మున ఓలలాడుదురు గాక.

ప్రకాశకులు.

# ఆంధ్రానువాదక విజ్ఞప్తి

నా యోగ్యతను బట్టి కాక నాయందు దైవప్రేరితమై అవ్యాజముగ తమకు గలిగిన వాత్సల్యాతిశయముచేత, శ్రీరామకృష్ణసంస్థ పత్రికాప్రచురణ గ్రంథానువాద శాఖలో నాకు ప్రవేశ మిప్పించి ఈ మహోత్సవములో నన్ను అన్వయింపజేసిన పరమోదారులకు, ఆంధ్రాంగ్లగీర్వాణభాషాభినివిష్టులకు, ఆంగ్లగ్రంథముల ఆంధ్రీకరణమున సిద్ధహస్తులకు, నిరంతర శ్రీరామకృష్ణసేవాభిరతులకు, రిటైర్డు డెప్యూటీ కలెక్టర్లకు, విక్రమసింహపురీయులకు, రావుసాహేబు కందుకూరు మల్లికార్జునము (బి. ఏ.) గారికి ఈ గ్రంథముఖమున కృతజ్ఞతాపూర్వక ప్రణామసహస్రముల నర్పించుచు వారి కాయురారోగ్య భోగ భాగ్యములు ప్రసాదింప సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను. ముద్రణదోషసంశోధనసకలానిష్ణాతులు ఆశుకవిశేఖర శ్రీ చిలుకూరి [illegible]కృష్ణకవిగారు ప్రూఫులను సరిచూచుటలో ఎంతయు తోడ్పడిరి. వారి సవరణలచే మెఱుగెక్కని పుట ఈ గ్రంథములో లేనే లేదనుట మిథ్యోక్తి కాదు, వారికి కరము కృతజ్ఞుడను. ఈ పుస్తకమును ఇంత సుందరముగ అచ్చువేసి యిచ్చిన జ్యూపిటరు ముద్రణాలయమువారి తోడ్పాటు ఎంతయు అభినందనీయము.

సే. ఫ.

# ప్రకరణసూచి



---

# మున్నుడి

## [రచయిత - ఆల్డసు హాక్స్లి]

కళలచరితమును పరికింపుడు, ప్రతిభావంతులు చాల అరుదు. ప్రతిభావంతుల కన్నను, వారిని గూర్చిన విశేషములను గ్రంథస్థములుగా జేసి ప్రఖ్యాపించు సమర్థులు ఇంకను అరుదు. ప్రశస్త కవులును, తత్త్వజ్ఞులును లోకమున నూర్ల కొలదిగ ఉండి యున్నారు. అనంతసంఖ్యాకు లయినట్టి వారిలో 'బాస్వెల్', 'ఎక్కెర్మన్' వంటి జీవితచరిత్రకారులను తమవంకకు ఆకర్షించుకొను భాగ్యము ఏ యొక రిద్దఱకో దక్కినది.

కళారంగమును విడిచి ఆధ్యాత్మికరంగమునకును ఆస్తిక్య రంగమునకును వత్తుమేని, మహనీయుల విశేషములను గుర్తించి ప్రఖ్యాపింప గల వారి సంఖ్య ఇంక నింకను తక్కువ. ధ్యానశీలురును ఆత్మనిష్ఠులును అగు మహాయోగీంద్రులలో అనేకుల నిత్య జీవిత విశేషములు మనకు తెలియనే తెలియవు. వారి సిద్ధాంతములను గ్రంథస్థములుగ చేసిన వారు ఎందఱో ఉన్నారు అనుట నిజమే. 'సెయింటు అగస్టిను', 'సెయింటు తెరెసా', 'సూసో' మున్నగు కొందఱు ఎంతో విలువ గల స్వీయచరిత్రములను మనకు ఒసంగి యున్నారు అనుటయును నిజమే. పైని చెప్పబడిన సిద్ధాంతగ్రంథములు అన్నిటిలో సంప్రదాయ నిర్వహణము ఉండునే, కాని, వ్యక్తివిశేషములు తెలియనే తెలియవు. ఇకను స్వీయచరిత్రకారుడు అందమా, తనకు అముఖ్యములుగ తోచిన విషయములను విడిచిపెట్టుచుండును. అంతే కాక తన్ను గూర్చి ఇతరులు ఏమి అభిప్రాయపడుదురో అతడు తెలుప లేడు. తన మూలమున ఇతరుల జీవితములలో గలుగు పరిణామములను గూడ అతడు తెలుప లేడు. యోగులలో అత్యధిక

సంఖ్యాకులు స్వీయచరిత్రములను వ్రాసికొని లేరు, ఏ గ్రంథములను వ్రాయ లేదు. వారి జీవితములను, వారి శీలములను, వారి యుపదేశములను, తెలిసికొన వలయును అనిన, వారి శిష్యుల గ్రంథములే మనకు ఆధారములు. జీవితాంశములను ఉపదిష్టవిషయములను చక్కగా వ్రాసి ఉంచు నేర్పు శిష్యులలో ప్రాయికముగ చాల తక్కువగ ఉండును. శ్రీరామకృష్ణుని నిత్యజీవితమును, సంభాషణలను, చాల వివరముగ దెలుపు నట్టి యీ గ్రంథమున, పైని పేర్కొబడిన లోపములు లేవు. అందుచేతనే ఇది ప్రత్యేకముగ ప్రసిద్ధిని చూఱగొన్నది.

దీని రచయిత, వినయముచే, తన పేరును * పూర్తిగ వ్రాసికొనక ‘మ’ అను మొదటి యక్షరమును మాత్రమే వ్రాసికొన్నాడు. ఇట్టి గ్రంథరచనకు ఆయనకు ప్రత్యేక యోగ్యత కలదు. ఆయనలో గురుదేవుని పైని భక్తియు, గురూపదేశములను గూర్చిన స్వానుభవజ్ఞానమే కాక, ప్రతిదినమును జరిగిన చిట్టిసంభవాలను గూడ సమగ్ర సంతటి యమేయమగు జ్ఞాపకశక్తియు, వానిని కన్నులకు కట్టినట్లు ఇంపుగ వ్రాయు నేర్పును — కూడ కలవు. తన సహజశక్తులను పరిసర పరిస్థితులను చక్కగా ఉపయోగించుకొని, ‘మ’ ఈ గ్రంథమును వ్రాసి యున్నాడు. పుణ్యపురుషచరిత్రములలో నాకు తెలిసినంతవఱకును ఈ గ్రంథమునకు సాటి లేదు. ఇంత ఓపికయు, నేర్పును గల ‘బాస్వెలు’ (=జీవితచరిత్రకారుడు) వేఱు ఏ యోగికిని లభింప లేదు. ఒక ధ్యానశీలుని నిత్యజీవితములో చిన్న విషయములను దగ్గఱనే ఉండి ఇంత వివరముగ వర్ణించినవారు లేనే లేరు. గొప్ప బోధకుడైన యొక మహనీయుని నోట ఆలోచించుకొనకయే అప్రయత్నముగ వెలువడిన వాక్యములు ఇంత సూక్ష్మ వివరములతో గ్రంథస్థములు అగుట వేఱు ఎచ్చటను చూచినది లేదు. ఇంకొకటి పైపూర్వ

---

* పూర్తి పేరు మహేంద్రనాథుడు; గోత్రబిరుదము ‘గుప్త’; ‘మహేంద్రనాథగుప్త’ అని వంగభాషలో వ్యవహారము.

# పీఠిక

## [ శ్రీ నిఖిలానందస్వామి ]

గాస్పెల్ ఆఫ్ శ్రీరామకృష్ణ ( = శ్రీరామకృష్ణసూక్తిసుధ ) అను గ్రంథమును న్యూయార్కు నగర మందలి రామకృష్ణవివేకానంద కేంద్రమువారు మొదటిసారి 1942 లో ప్రకటించిరి. మత వేదాంత జిజ్ఞాసువులు అందఱును ఆ గ్రంథమును మిక్కిలిగ ఆదరించిరి. తమ ఆధ్యాత్మికసాధనలలో హిందుసిద్ధాంతమును ఆశ్రయించువారు దానిని విశేషించి ఆదరించిరి.

అందులోని విషయములనే ఈ గ్రంథమున సంక్షేపించితిని. ఈ చిన్న గ్రంథమును ప్రకటించుటకు ఉన్న కారణములు రెండు —

(౧) పెద్దగ్రంథములో హిందూపురాణముల ప్రస్తావనము, వానికి గాథల ప్రశంసయు ఎక్కువగ ఉన్నవి; హిందుసిద్ధాంతములలోని సూక్ష్మ మర్మములను గూర్చిన చర్చ కూడ ఉన్నది. పాశ్చాత్యపఠితలకు ఈవిషయములలో ఏదియు పరిచితము కానందున వారికి అక్కడ పెక్కు చిక్కులు ఏర్పడును, ఇది ఒక కారణము. (౨) శ్రీరామకృష్ణుని సంభాషణలను ప్రత్యక్షముగ విన్న ‘మహేంద్రనాథగుప్త’, వానిని అట్లే వ్రాసి ఉంచెను. పెద్దగ్రంథములో వానిని సమగ్రముగ అనువదించి ఉన్నాను. అందు పునరుక్తులు ఎన్నో కలవు. గ్రంథము 1062 పుటలకు పెరుగుటకు అదే కారణము. పోవుచోటికెల్ల, అంత పెద్ద గ్రంథమును మోసికొని పోయి నిత్యపారాయణమునకు ఉపయోగించుకొనుట కష్టము. ఇది రెండవ కారణము. ఈ సంక్షిప్త గ్రంథములో, పైని చెప్పిన చిక్కులు లేవు. సంగ్రహపఱచుటవలన గ్రంథపువిలువ కొంచెమైనను తగ్గ లేదు. అంతే కాక, ఈ గ్రంథమును జదివిన వారికి శ్రీరామకృష్ణుని సూక్తులను అన్నిటిని చదువవలెను అను కుతూహలము కలుగ వచ్చును అని నా ఆశ.

సంక్షిప్తగ్రంథమున సమ్మ[illegible] చెడకుండుటకై చాల మెలకువ వహించినాను. సంక్షేపించుటకై బోధనలను చెడగొట్ట లేదు. చదువరుల చిత్తములకు పెద్దపుస్తకమును చదివినప్పుడు ఎట్లుఉండునో ఈ చిన్న పుస్తకమును చదివినప్పుడు కూడ మొత్తమునకు అట్లే ఉండును. అందలి దీర్ఘోపోద్ఘాతములో, ఒకటి రెండు చిన్న విషయములను విడిచిపెట్టి, తక్కినవానిని అందు ఉన్నట్లే ఇందు చేర్చినాను. ఆ ఉపోద్ఘాతములో ఉన్న విషయాలు — (i) శ్రీరామకృష్ణుని సంగ్రహజీవితచరిత్ర (ii) హిందూమతమునకు సంబంధించి, 'గాస్పెలు' (సూక్తిసుధ) లో చర్చకు వచ్చిన విషయాల వివరణము. 'గాస్పెలు'లో శ్రీచైతన్యుని ప్రశంస తఱచు వచ్చుచుండును. భారతదేశమందలి అవతారపురుషులలో ఆయన ఒకడు. ఆయన జీవితచరిత్రమును ఇందు అనుబంధముగ పొందుపఱచినాను. కడపట ఉన్న టిప్పణిలో పాశ్చాత్యపఠితలకు అపరిచితము లైన పేర్లకును పదములకును అర్థమును వ్రాసితిని. పదములను ఎట్లు ఉచ్చరింప వలెనో తెలుపు గుర్తులనుకూడ ఉంచితిని.

'గాస్పెల్ ఆఫ్ శ్రీరామకృష్ణ' అనునది, వంగభాషలో ఉన్న శ్రీరామకృష్ణకథామృతమునకు సరి ఐన ఆంగ్లానువాదము. వంగభాషలో ఉన్న మూలగ్రంథమును రచించినది శ్రీ 'మహేంద్రనాథ గుప్త'. అందులో శిష్యులతోను, భక్తులతోను, చూడవచ్చినవారితోను శ్రీరామకృష్ణునకు జరిగిన సంభాషణలు కలవు. వానిని మహేంద్రనాథుడు తన దినదినివేదిక (డైరి)లో వ్రాసి ఉంచుకొన్నాడు; తనకు 'మ' అను గూఢనామము పెట్టుకొని, ఆ సంభాషణలనే, ఒక గ్రంథముగ రూపొందించినాడు. సంక్షిప్తలిపి (షార్టుహాండు)లో లిఖితము లైన నివేదికల(రిపోర్టుల)కు ఉన్నంత ప్రామాణ్యమును స్పష్టతయు, ఆ గ్రంథమున కలవు.

శ్రీరామకృష్ణుడు పరమపదించి ఏబది ఏండ్లు నిండులోపుగనే ఆయన పేరు భారతదేశమున ఇంటింటను నిత్యజప్యము అయ్యెను.

ఆ పేరే ఇప్పుడు అమెరికా యూరపు ఖండములలో వ్యాపించు చున్నది. శ్రీవివేకానందస్వామిగ్రంథములును శ్రీరామకృష్ణ సంప్ర దాయమునకు చెందిన సన్న్యాసులు ఉత్సాహముతో నిర్వహించు చున్న ప్రణాళికలును ఆ వ్యాప్తిని సాధించుచున్నవి. పాశ్చాత్య విద్వాంసులలో 'మాక్సుముల్లరు' 'రొమైఁ రోలా' అను ఇరువురు శ్రీరామకృష్ణుని గూర్చి గ్రంథములు వ్రాసిరి. శ్రీకృష్ణుడు బుద్ధుడు క్రీస్తు మున్నగు లోకాచార్యుల వరుసలో చేరినవాడే శ్రీరామ కృష్ణుడు అని స్వదేశీయులును విదేశీయులును గుర్తింపగలిగిరి. మన దేశ సనాతనాధ్యాత్మిక జ్ఞానహృదయము శ్రీరామకృష్ణునిలో రూపు దాల్చినది. అవిశ్వాసమును హేతువాదములును బలిసిన యీ కాల మున ఆధ్యాత్మికజగత్తునుండి సందేశమును మనకు సూటిగా అంద జేసినవాడు శ్రీరామకృష్ణుడు. ఆయనకు కలిగిన భగవత్సాక్షాత్కార మునకు ఆయన సూక్తులే నిరూపకములు. శ్రీరామకృష్ణుని దేహ మును, ఇంద్రియములును, మనస్సును, అహంకారమును ఆధ్యాత్మిక సాధనలచే విశుద్ధములయి, అతీంద్రియసత్యములను ప్రకటించు సాధ నము లయినవి. ఆయన మాటలు కంటి యెదుట ఉన్న విషయమును సూటిగ చెప్పుచున్నట్లు ఉండును. ఆ మాటలచే సకలసందేహము లును సమసిపోవును. అశాంతిని అణచి, శాంతిసత్యములను ప్రసా దించు అమోఘ శక్తి, ఆయన వాక్కులకు కలదు.

నిజమునకు, అన్ని యుగాలలోను మానవులను పీడించు రోగము ఆధ్యాత్మికము. ఈయుగములోను అంతే. లోభమును కామమునే మానవుల ఆధివ్యాధులకు కారణాలు. వానినే శ్రీరామ కృష్ణుడు ధ్వనిప్రధానముగ కామినీకాంచనములు అని పేర్కొనెను. అహంకారమునకు సుశిక్షణము లేనందున ఈరోగములు మిక్కుటము కెక్కినవి. నిగ్రహమే వీనికి మందు. ఆత్మ, ప్రకృతిని ఎట్లు వశపఱు చుకోగలదో తెలుపు ఉత్తమ లక్ష్యము శ్రీరామకృష్ణునిజీవితమే. ఆయనకు గలిగిన ఆత్మసాక్షాత్కారము ఎంత గాఢమో, అది దేశ

కాలావధులను దాటి సర్వ దేశ సర్వ కాల ప్రజల చిత్తములకును ఎక్కినది. ఏ మతమువారైనను సరే, ఏ నమ్మకమువారైనను సరే, వారిలో ఆర్జవసంపద ఉండినచో, వారిని శ్రీరామకృష్ణదేవుని జీవితోపదేశములు ఆకర్షించుచునే ఉన్నవి.

మానవుని ఆత్మ దివ్యము అని శ్రీరామకృష్ణుడు ఉపదేశించెను. మానవుని దుశ్చింతలును దుశ్చేష్టలును ఆత్మయొక్క యీ దివ్యత్వమును మఱుగుపఱుపవచ్చునే కాని, నశింపజేయలేవు. దేవుని మనలో సాక్షాత్కరించుకోవలె, సకల స్త్రీపురుషులను సాక్షాద్దైవ స్వరూపులుగ ఎంచి వారికి సేవ చేయవలె, — మానవజీవితమునకును ఆధ్యాత్మికసాధనలకును అవే లక్ష్యములు. ఈ జగత్తు ఆత్మాధిష్ఠితము. ఇందలి ప్రతిపదార్థములోను దేవుడు ఉన్నాడు. సత్యమును, ప్రేమయు, సానుభూతియు జగత్తునకు మూలాధారములు. ఒకదానికి ఒకదానికి పొందు పొసగని ఆశలచే మానవులు ఈ భూమిని కదనరంగముగ ఒనర్చుటకు హేతువు వారి అజ్ఞానమే. పారమార్థిక జ్ఞానము వారికి ఎప్పుడు ఉదయించునో అప్పుడు వారి మనో వాక్ క్రియలందు, వెలుగును ప్రేమయు తొణకుచుండును.



# ఉపోద్ఘాతము

## [శ్రీ నిఖిలానందస్వామి]

శ్రీరామకృష్ణుడు కామార్పుకురు అను గ్రామములో అవతరించెను. అది హుగ్లీ జిల్లాలో ఉన్నది. వంగదేశపు పల్లెప్రాంతాలలో ఉండిన అకృత్రిమ వాతావరణము క్రిందటి శతాబ్దిలో ఆ గ్రామములో నిల్చి ఉండినది. రైలుబాటకు అది చాల దూరములో ఉన్నందున నాగరకపు తళుకుల స్పృక్కు దానికి లేనే లేదు. ఆ గ్రామములో వరిపొలములు, పొడవైన తాటిచెట్లు, పెద్ద మఱ్ఱిచెట్లు, కొన్ని తటాకములు, రెండు శ్మశానములు — గలవు. పల్లెకు దక్షిణముగ, నది ఒకటి మందగమనమున ప్రవహించుచుండును. అచ్చట ఒక మామిడి తోట ఉన్నది. ప్రజల ఉపయోగముకై దానిని సమీపపు జమీందారు ఒకడు నాటించెను. మధ్యాహ్న వేళలలో బాలురు అచ్చట తఱచుగ ఆడుకొనుచుందురు. ఆ గ్రామమునుండి పూరీ జగన్నాథక్షేత్రమునకు చేర్చు పెద్ద బాట ఒకటి ఉన్నది. అందున పయనించు యాత్రికులను, సన్న్యాసులను, ఆ పల్లె ప్రజలు సత్కరించుచుందురు. ఆ పల్లె ప్రజలలో కర్షకులును శిల్పులునే అధిక సంఖ్యాకులు. వారికి పల్లెజీవితమున కలుగు విసుగు — ఉత్సవోత్సాహములు, పండుగుల కొనియాటలు, భజనలు మొదలైన అమాయికపు వినోదాలచే తీఱుచుండెడిది.

తన తల్లిదండ్రులను గూర్చి శ్రీరామకృష్ణుడే ఒకసారి ఇట్లు వాక్రుచ్చెను — "మా అమ్మ రూపుదాల్చిన శాంతిసౌజన్యములే అని చెప్పవచ్చును. లౌక్యమార్గాలు ఆమె ఎఱుగదు. ఏదైనను సరే దాచిపెట్టుకొనుట ఆమెకు చేత కాని పని, మనసులో ఉన్న మాటను, ఆమె చెప్పి వేయును. కపటము ఎఱుగని ఆమె [illegible] జనప్రీతిని చూఱగొన్నది. మా నాయన బ్రాహ్మణాచారనిష్ఠుడు. శూద్రులు ఇచ్చు దానమును ఆయన ఎన్నడును ప్రతిగ్రహింపడు.

ఆరాధనము, ధ్యానము, భగవన్నామజపము, భగవద్గుణసంకీర్తనము — వీనితోనే ఆయన కాలములో విశేషభాగము గడచిపోయెడిది. సంధ్యావందనములలో గాయత్రిని ఆవాహనచేసినప్పు డెల్ల, ఆయన హృదయము ఉప్పొంగి బాష్పములు చెక్కిళ్లపై జాలువారెడివి. ఆయన తనకు విరామము గలిగినప్పు డెల్ల, ఇలువేలుపు ఐన రఘువీరునకు పూలమాలలు గ్రుచ్చెడి వాడు.''

శ్రీరామకృష్ణుని తల్లి చంద్రాదేవి, తండ్రి క్షుదిరాముడు, గోత్రబిరుదము 'ఛట్టోపాధ్యాయులు'.* వారి పెండ్లి 1799 లో జరిగినది. అప్పుడు క్షుదిరాముడు తన తండ్రితాతలు వసించిన దెరేపూరులోనే ఉండెను. ఆ పల్లెకును కామార్పుకురుకును ఎంతో దూరము లేదు. వారి జ్యేష్ఠపుత్రుడు, రామకుమారుడు 1805 లోను, జ్యేష్ఠపుత్రి, కాత్యాయని 1810 లోను జన్మించిరి. 1814 లో దెరేపుర భూస్వామి తన పొరుగువానికి ప్రతికూలముగ న్యాయస్థానమున కూటసాక్ష్యము చెప్పుము అని క్షుదిరాముని నిర్బంధించెను. క్షుదిరాముడు అంగీకరింపక పోగా, భూస్వామి అతనిపై ఒక మిథ్యాభియోగము (ఫాల్స్ కేస్)ను తెచ్చి అతని పితృవ్యము ఐన ఆస్తిని సర్వమును హరించెను. ఇట్లు సర్వస్వమును పోగొట్టుకొన్న అతనిని వేఱు ఒక భూస్వామి ఆహ్వానించెను. ఆ పిలుపును అందుకొని క్షుదిరాముడు శాంతి సమృద్ధము ఐన కామార్పుకురుకు వచ్చి చేరెను. ఆ ఉదారుడు ఇతనికి ఒకయింటిని ఒక యెకరము పంటపొలమును ఇచ్చినాడు. ఆ చిన్నపొలమున పండు పంట ఇతని కుటుంబమునకు చాలి ఉండెను. వీరి అక్కఱలు అపాటివే. ఈ పల్లెలో క్షుదిరాముడు గౌరవముతోను, సంతృప్తితోను, అమాయికము ఐన జీవితమును గడపుచు ఉండెను.

కామార్పుకురునకు చేరి పది ఏండ్లు ఐన పిమ్మట క్షుదిరాముడు ఒకసారి పాదచారియై భారతదేశ దక్షిణపుకొసన ఉన్న రామేశ్వర

* వంగదేశమున కాశ్యపగోత్రబ్రాహ్మణులకెల్ల ఛట్టోపాధ్యాయులు అని బిరుదనామము.

మునకు యాత్ర చనెను. లంకలో రాక్షసరాజు ఐన రావణుని సంహారించి భరతఖండమునకు వెను దిరిగి వచ్చుచున్నప్పుడు శ్రీరాముడే రామేశ్వరుని ప్రతిష్ఠించెను అని వాడుక. రెండు ఏండ్లకు అనంతరము క్షుదిరామునకు రెండవ కొడుకు పుట్టెను. కొడుకునకు తండ్రి 'రామేశ్వరుడు' అని పేరు పెట్టెను. మరల 1835 లో, అనగా తన అఱువదవ యేట క్షుదిరాముడు యాత్రకు పోయెను. ఈసారి గయకు. భారతదేశము నలు మూలల నుండియు హిందువులు ఇచ్చటికి వచ్చి, విష్ణుపాదము నొద్ద తమ పితృదేవతలకు పిండోదకములను అర్పించు ఆచారము అనాదికాలమునుండియు జరుగుచు ఉన్నది. ఈ క్షేత్ర మున ఉన్నప్పుడు, క్షుదిరామునకు విష్ణుదేవుడు కలలో అగపడి "నేను నీకు కుమారుడనుగ జన్మింతును" అని చెప్పె నట. కామార్పుకురులో శివాలయమునకు ఎదుట ఉన్నప్పుడు చంద్రాదేవికి కూడె ఒక దివ్య దృశ్యము అగపడి, ఆమెకు దివ్యశిశువు జనించును అని సూచించె నట. క్షుదిరాముడు గయనుండి మరలునప్పటికే చంద్రాదేవి గర్భిణియై ఉండెను.

అనంతరకాలమున శ్రీరామకృష్ణుడు అని ప్రసిద్ధుడై, సత్య భారతమున అవతారపురుషుడుగ కైవారములు గాంచ నున్న శిసువు 1836 వ సంవత్సరము ఫిబ్రవరి నెల తే 18 ది నాడు జన్మించెను. గయలో వచ్చిన కలను స్మరించి, క్షుదిరాముడు సుతునకు గదాధరుడు అని పేరు పెట్టెను. అది విష్ణుదేవుని పేళ్లలో ఒకటి. మూడు ఏండ్లను అనంతరము గదాధరునకు ఒక చెల్లెలు పుట్టెను.

## బాల్యము

బాల్యములో గదాధరునకు మంచి ఆరోగ్యము కుదిరెను, అతడు క్షణము ఊరక ఉండెడి వాడు కాడు, అతని వేడుక చేష్టలును తుంటరితనమును అందఱికిని ఇంపు గొలిపెడివి. అతని బుద్ధి, ఈడుకు మించినది, చుఱుకు ఐనది. ధారణశక్తి అద్భుతము. అతడు తండ్రి యొద్ద తమ వంశ పూర్వుల పేళ్లను తెలిసికొనెను, దేవస్తోత్రాలను

దేవీ స్తవాలను నేర్చుకొనెను, పల్లెబడిలో వ్రాయుటకును చదువుట కును అభ్యసించెను. కాని హిందూ పురాణేతిహాస కథలను విన్నప్పుడు అతనికి కలిగెడి ఆనందము వేఱు ఎప్పుడును కలుగదు. తాను విన్న కథలను అతడు మఱవక పల్లెప్రజలకు వినిపించి, వినోదము కూర్చెడివాడు. చిత్రలేఖనములో అతనికి అభిరుచి కలదు. కుమ్మరి వాండ్ర యొద్ద అతడు దేవతల బొమ్మలను దేవేరుల బొమ్మలను చేయుటను నేర్చుకొనెను. లెక్కల పైని వెగటు మాత్రము అతనికి ఇంత అంత కాదు.

వయస్సు ఐదు ఆఱు ఏండ్లు ఐనప్పుడు, ఆత్మానుభవతన్మయత [స్పిరిచ్యువల్ ఎక్స్టసి] అతనికి మొదటి సారి కలిగెను. జూను నెల లోనో జూలై నెలలోనో ఒకనాడు అతడు వరిపొలాల నడుమ సన్నని బాటలో నడిచి పోవుచుండెను. అతని చేతిలో ఒక బుట్టయు బియ్యపు బొరుగులును ఉండినవి, వానిని తినుచు అతడు పోవుచుండెను. అప్పుడు అతడు ఒకసారి ఆకసమువైపు చూచెను. మనోహరము ఐన నీల మేఘము ఒకటి కానిపించెను. ఆ మేఘము విరివి చెంది ఆకసము అంతటను వ్యాపించెను. దానికి ఎదుట మంచువలె తెల్లనివి ఐన కొంగల బారు ఒకటి ఎగురుచుండెను. ఆ పరభాగ సౌందర్యము బాలునకు తన్మయతను గలిగించెను. స్మృతి తప్పి అతడు నేలపై బడెను. పేలాలు నలువైపుల చెదరినవి. పల్లెప్రజలు కొందఱు అతనిని చూచి ఎత్తుకొని పోయి ఇల్లు చేర్చిరి. ఆ దశలో తాను అనిర్వచనీయము ఐన ఆనందమును అనుభవించితిని అని గదాధరుడు తర్వాతి కాలమున చెప్పుచుండెడి వాడు.

క్షుదిరాముడు మరణించు నప్పటికి గదాధరునకు వయస్సు ఏడు ఏండ్లు. ఈ దుఃఖసంభవము అతనిని గాటముగ కలవరపఱచెను. పుడమి పైని బ్రతుకు అశాశ్వతము అను విషయము అతనికి మొదటి సారి అనుభవములోనికి వచ్చెను. ఇతరులకు ఎవ్వరికిని తెలుపక అతడు మామిడితోటలోనికో శ్మశానమునకో పోయి పెక్కు గంటల

సేపు ఆలోచనానిమగ్నుడై ఉండుటకు ఆరంభించెను. ఇంటి పనులలో అమ్మకు ఎక్కువగ తోడ్పడుచు ఉండెను. పురాణ కథలను చదువుట యందును వినుటయందును అతనికి శ్రద్ధ ఎక్కువ. పూరీక్షేత్రమునకు పోవుచు కామార్పుకురు నొద్ద మజిలీ చేయు భక్తయాత్రికులయందును, దేశసంచారులు ఐన సన్న్యాసులయందును అతనికి అత్యంత ప్రీతి. భారతదేశమున అనాదికాలమునుండి అవిచ్ఛిన్నముగ వచ్చుచు ఉన్న ఆధ్యాత్మికసంపదకు కాపరులును, వైరాగ్యమునకును పరమ భక్తికిని ప్రత్యక్షలక్ష్యములును ఐనట్టి ఆ యోగులు పురాణగాథలను, మహర్షుల చరిత్రములను, ప్రవక్తల వృత్తాంతాలను తమ పర్యటనములందలి సంభవాలను చెప్పి ఆ బాలునకు వినోదము గూర్చుచుండిరి. అతడును వారి జలకుండికలను సమిధలను మోసి, నానా రీతులసేవలు చేయుచు, వారి ధ్యానారాధనక్రమాలను శ్రద్ధతో పరిశీలించుచును ఉండెను.

తొమ్మిదవ యేట గదాధరునకు ఉపనయనము జరిగెను. అప్పటి నుండి అతడు బ్రాహ్మణాచారనియమాలను అన్నిటిని పాటింపవలసినవాడయ్యెను. ఇలువేలుపు ఐన రఘువీరుని ఆరాధించు అర్హతయు, బ్రాహ్మణులకు గల విశేషాధికారములు అన్నియు అతనికి సిద్ధించెను. ఉపనయన మప్పుడు తన దాది యైన ఒక శూద్రవనితను [illegible] తొలి భిక్షను గ్రహించెను. దానిని గని సకలబంధువులును ఆశ్చర్య వివశులు ఐరి. క్షుదిరాముడు అట్టి పనిని కలలో నైనను చేసి [illegible] కాని గదాధరుడు ఆమెయొద్దనుండి భిక్షము గొని [illegible] ఎప్పుడో వేడుక ధోరణిలో చేసిన వాగ్దానమును తప్పనీక నెరవేర్చెను. ఆ దాదికి ఉండిన భక్తియు శ్రద్ధయు ఆస్తిక్యమును, ఇవే గదాధరునకు ముఖ్యములు కాని, సంఘాచారముల కట్టుబాటులు అతనికి అంత ముఖ్యము కాదు.

రఘువీరుని ఆరాధించుటకు గదాధరునకు ఇప్పుడు అనుమతి చేకూరినది. ధ్యానములో అతని తొలి శిక్షణము ఇట్లు ఆరంభము

అయ్యెను. ఎంత మనఃపూర్వకముగా అతడు ఆరాధనలో దిగెను అనగా, అచిరకాలములోనే అతనికి ఆ జాతిబొమ్మ సాక్షా జ్జగన్మా తృకగ అగపడ సాగెను. ధ్యానదశలో అతనికి పరవశత కలుగుటకు ఇదే ప్రారంభము. పసివాడుగను, దేనిని లెక్కింపని వాడుగను అతడు పైకి అగపడుచు ఉండినను, లోలోన ఆత్మపరత వేరులు పాఱుచు ఉన్నది, అని కన నగు చుండెను.

ఒక మహాశివరాత్రినాడు నాటకమును ఒకదానిని ప్రదర్శించు టకు ఏర్పాటులు జరిగి ఉండినవి. ప్రధానము ఐన శివపాత్రమును నిర్వహింప వలసిన వానికి తటాలున వ్యాధి కలిగినది. అందఱును ఆ వేషమును వేయుము అని గదాధరుని ప్రోత్సహించిరి. మిత్రులే అతనికి వేషము వేయ ఆరంభించిరి — ఒడలికి విభూతి అలదిరి. కురులను జడలుగ మెలి వెట్టిరి. చేతిలో ఒక త్రిశూలమును ఉంచిరి. మెడకు ఒక రుద్రాక్ష పూసల దండను తవిల్చిరి. కాని ఈ వేష ధారణము జరుగుచు ఉండగనే అతనికి ఒక విధము ఐన పరధ్యానము కలుగుచున్నట్లు ఉండెను. మెల్లగ అడుగులు ఇడుచు మిత్రుల తోడ్పాటుతో అతడు రంగమును సమీపించెను. అతడు సాక్షా త్పరమ శివుని వలెనే ఉండెను. నటనము చాల బాగుగ ఉన్నది అని ప్రేక్షకులు అనుకొనిరి. సాధువాదములు మిన్ను ముట్టెను. కాని, అది నటనము కాదు అనియు, గదాధరుడు ధ్యానపరవశుడై ఉన్నాడు అనియు త్వరలోనే వెల్లడి అయ్యెను. అతని మొగమున తేజము వెలుగొందుచుండెను. నేత్రములనుండి బాష్పములు జాలు వాఱుచు ఉండెను. బాహ్యా లోక స్మరణమే అతనికి లేదు. ఈ దృశ్యము ప్రేక్షకులపై అద్భుతప్రభావము చూపెను. సాక్షాత్ పరమశివునే చూచినట్లుగ ప్రేక్షకులు నిర్వృతిని జెందిరి. నాటక మేమో ఆగిపోయెను. గదాధరుడు తెల్లవాఱునంతవఱకును పరవశ స్థితిలోనే ఉండెను.

గదాధరుడు స్వయముగ తన మిత్రులను అందఱను ఒక నాటకసమాజముగ కూర్చెను. నాటకరంగమును మామిడితోటలో

ఏర్పఱచెను. వారు ప్రదర్శించెడి నాటకముల యితివృత్తములు అన్నియును, రామాయణ మహాభారతముల లోనివే. ఆరితేఱిన సట్టువుల నోట పలుమార్లు వినుటచేత ఇంచుమించు అన్ని పాత్రల భాషితము లును గదాధరునకు కంఠస్థములై ఉండెను. గొల్లబాలుర భక్తిని గొల్లచెలువల ఉత్తమ ప్రేమ గాథలను వర్ణించు శ్రీకృష్ణుని బృందావనక్రీడలపై అతనికి మోజు ఎక్కువ. గదాధరుడు రాధపాత్రను ధరించుటయు కలదు, కృష్ణపాత్రను ధరించుటయు కలదు. ఎప్పుడు ధరించినను, రాధాభావనలోనో శ్రీకృష్ణభావనలోనో తన్మయుడై తన్ను మఱచెడివాడు. సహజముగ అతని రూపమున పొంగిపొరలుచున్న స్త్రీసౌందర్యము నాటకరక్తిని హెచ్చించెడిది. బాలుర నాటకం మామిడితోటలలో మాఱుమ్రోగెడివి. ఇట్లు ఆటపాటలలో ఆసక్తుడై గదాధరుడు బడిచదువున అశ్రద్ధ వహింపసాగెను.

1849 లో గదాధరుని జ్యేష్ఠభ్రాత రామకుమారుడు, కుటుంబమునకు ఆయతి చాలనందున, ధనసంపాదనకై కలకత్తానగరమునకు పోయెను.

గదాధరునకు ప్రాయము పొడచూపుచు ఉండెను. పల్లె మగువలకు అందఱకును ఇతడు ప్రాణపదము అయ్యెను. ఇతని మాటలును, పాటలును, ఇతిహాసపురాణపఠనములును వారికి సరసము ప్రీతికరములు. గొంతు మార్చుకొని వారిని వీరిని అనుకరించు నేర్పు గదాధరునకు కలదు. ఆ నేర్పు మహిళలకు వినోదప్రదము అయ్యెను. అతని వినిర్మల దేహము, పెల్లు ఐన శిరోజముల సొంపు, ఉజ్జ్వలములు ఐన నేత్రములు, మాయని మందహాసము, తఱుగని హాస్యము, హృదయశుద్ధి, అకృత్రిమత — వీనిని ఆ మహిళలు తమ సహజావబోధముచే గుర్తింప గలిగిరి. భర్తృరాండ్రలో వయసు చెల్లిన వారికి అతడు బాలగోపాలుడుగను యువతులకు బృందావన శృంగారనాయకుడుగను అగపడుచుండెను. గోపికల కృష్ణతృష్ణయే గదాధరునకును లక్ష్యము. కావుననే తనకు మఱు జన్మము ఉండు నేని, శ్రీకృష్ణుని

మన సార ప్రేమింప గలుగునట్లు స్త్రీజన్మము ఎత్త వలెను అని ఉబ లాటపడుచుండెను. లేదా — ఒక బ్రాహ్మణకన్యగా పుట్టి, వివాహము ఐన వెంటనే పతిని గోల్పోయి, శ్రీకృష్ణధ్యానాభిరతి తప్ప వేఱు ఏదియు లేక, అతనినే ఆరాధించుచు, అతనికొఱకే వండుచు, విరామవేళలలో నూలు వడుకుచు ఉండిన నైన బాగుండును అని అతని కోరిక. అట్టి వితంతువుగ ఉండు తాను సాయంప్రాతర్వేళలలో తానే వండిన మధురభక్ష్యములను శ్రీకృష్ణునకు అర్పించుటకై ఆ కృష్ణుడు ఎప్పుడు వచ్చునా అని నిరీక్షించుచు ఉన్నట్లుగ శ్రీరామకృష్ణుడు కల గనెడి వాడు. ఈ భావనయే అతనికి అనిర్వాచనీయము ఐన ఆనందమును గలిగించును.

## కలకత్తాకు వచ్చుట

కలకత్తాలో పౌరోహిత్యము చేయు చున్న రామకుమారుడు తనకు తోడ్పడుటకై, తమ్ముని, గదాధరుని అచ్చటికి రమ్మనెను. అప్పటికి గదాధరుని వయస్సు పదునాఱు సంవత్సరములు. తన వచ్చుబడి చాలనందున, రామకుమారుడు సంస్కృతపాఠశాలను ఒక దానిని నెలకొల్పి ఉండెను. తమ్ముని లక్ష్యమును క్రమక్రమముగ చదువువంకకు మరలింప వలెను అను ఉద్దేశము కూడ అతనికి కలదు. కలకత్తాలో పెక్కు కుటుంబములందు పురోహితకృత్యమును నిర్వర్తించుట, గదాధరునకు విధి అయ్యెను. ఆ పనికి, అతడు, తన్ను హృదయపూర్వకముగ అర్పించుకొనెను. అతని పూజాపద్ధతి, వృత్తి పురోహితుల పద్ధతి కంటె చాల భిన్నముగ ఉండెను. విగ్రహములను అలంకరించుటయందును, మంత్రములను భక్తిగీతములను పాడుట యందును అతనికి పెక్కు గంటల కాలము గడచి పోయెడిది. తన వృత్తికి సంబంధించిన తక్కిన కర్తవ్యములను అతడు ప్రీతితో చేసెడి వాడు. అతని ఉత్సాహము అనుపేక్ష్యమై ప్రజల హృదయములలో నాటుకొనెను. చదువునందు మాత్రము, అతడు చూపుచుండిన శ్రద్ధ అల్పాల్పమే.

వింత చిత్తవృత్తి గల తమ్ముని పద్ధతులకు రామకుమారుడు మొదట ఏమియును అడ్డుపడ లేదు. నగర జీవిత పరిస్థితులకు గదాధరుడు వాడుకపడిన బా గుండును అనుట ఆయన యిష్టము. కాని ఒక్కదినము “ ‘ఐహికవిషయములపట్ల ఇట్టి ఉదాసీనత తగదు’ అని ఆ బాలుని ఎచ్చరింప వలెను” అని నిశ్చయించుకొనెను. అచిరకాలములోనే గదాధరుడును గృహస్థుడై, బ్రాహ్మణధర్మములను నిర్వర్తించి, జీవికను గడింపవలసినవాడే గదా! బ్రాహ్మణధర్మములను నిర్వర్తించుటకు, హిందూధర్మశాస్త్రమును, జ్యోతిషమును, దానితో సంబంధపడిన విషయములను క్షుణ్ణముగ ఎఱిగి ఉండ వలెను. రామకుమారుడు మృదువాక్యములతోనే గదాధరుని మందలించి చదువునందు ఎక్కువ అక్కఱను చూప గోరెను. కాని బాలుడు తీవ్రభావపూరితుడై “అన్నా, ఈ కూటిచదువు నాకు ఎందులకు ? నా హృదయమును వెలుగొందజేసి నాకు శాశ్వతానందమును ఇచ్చు జ్ఞానము ఏదో, అది నాకు ప్రియతరము” అని బదులు చెప్పెను.

భారతదేశాంతరాత్మ పడు చున్న పరితాపమే, పసివాడు ఐన గదాధరుని యీ మాటలలో ప్రకట మయ్యెను. ఆ కాలమున కలకత్తానగరమే భారతదేశమునకు రాజధాని, నవ్యజ్ఞానమునకును నవ్యవిద్యకును కేంద్రము. అట్టి ఆ పట్టణమున అకృత్రిమములు ఐన గదాధరుని దృక్కులు చూచుచు ఉండిన విశేషములు — సంఘమున పైతరగతులవారిలో కామమును లోభమును సర్వప్రధానములై ఉండెను. మతాచారానుసరణము ఎప్పుడైన అగపడినను, అది నట్టి బాహ్య వేషమే కాని, వానిలో జీవము తొలగి చిరకాలము ఐనది. ఇట్టి పరిస్థితిని, గదాధరుడు, కామార్పుకురులో చూడనే లేదు. ఆ పల్లె ప్రజలు సరళహృదయులు, భక్తిమంతులు. పసితనములో అతడు సేవించిన సాధువులలోను ఊరుద్రిమ్మరులైన సన్న్యాసులలోను ప్రతిఫలించుచు ఉండిన భారతదేశము పూర్తిగా వేఱు తెఱగుది. ఆ మహాత్ముల శౌచమును, ఆత్మనిగ్రహమును, వైరాగ్యమును గదాధరుని హృదయమున నాటుకొన్నవి. ప్రాచీన భారతీయ మహా

ర్షులు 'బ్రహ్మసాక్షాత్కారమే జీవితలక్ష్యము' అని బోధించిరి. సాధువులయొద్దను, సన్న్యాసులయొద్దను, గదాధరుడు నేర్చుకొన్న దియు ఆ పాఠమే. అతనికి తన అంతఃప్రబోధముచే తెలియ నైన పాఠమును అదే.

తమ్ముడు చెప్పిన జవాబులో గూఢముగ ఉన్న అర్థమును, రామకుమారుడు తెలిసికో లేక పోయెను. కలకత్తాప్రజలలో చదువు కొన్నవారి నిర్దుఃఖమును సుసుఖమును ఐన జీవితమును, రామకుమా రుడు కొనియాడి వర్ణించెను. కాని ఆ చదువుకొన్నవారి స్వరూప మును, గదాధరుడు తన అంతఃప్రబోధముచేతనే ఎఱిగి ఉండెను. అతడే చెప్పిన చక్కని ఉపమానమును ప్రయోగించి చెప్ప వలెను అన్న, ఆ విద్వాంసులు అందఱును గ్రద్దలవంటివారు. నిరావేశములు ఐన వారి బుద్ధులే ఱెక్కలు, ఆ ఱెక్కలతో వారు ఎంత పైకి ఎగిరి నను, వారి చూపులు కామలోభాత్మక మయిన శవాల గర్తమునందే నిమగ్నములై ఉండును. ఈ సత్యము ఎఱిగినందున, గదాధరుడు తన పట్టు విడువ లేదు. రామకుమారుడే లోబడ వలసి వచ్చెను.

## దక్షిణేశ్వరమున కాళిగుడి

ఆ కాలమున కలకత్తాలో రాణి రాస్మణి అను ఒకతె ఉండెను. ఆమె విలంతువు, సంపన్నురాలు. ఆమెది శూద్రజాతి. వర్తక వ్యాపారముల నైపుణ్యమునకే గాక, బుద్ధిబలమునకును, ధైర్యౌదా ర్యములకును, శ్రద్ధాభక్తులకును దేశము అంతటను ఆమె పేరు పొంది ఉండెను. జమీను పనుల నిర్వాహమున, ఆమె అల్లుడు మథురా మోహనుడు ఆమెకు తోడ్పడుచు ఉండెను.

1847 లో రాణిరాస్మణి దక్షిణేశ్వరము నొద్ద ఇరువది యెకర ముల భూమిని కొనెను. దక్షిణేశ్వరగ్రామము కలకత్తాకు ఉత్తరముగ నాలుగు మైళ్ల దూరమున ఉన్నది. ఆమె అచ్చట ఒక ఆరామమును, అందు పెక్కు దేవాలయములను కట్టించెను. లోకజనని ఐన కాళియే ఆమెకు ఇష్టదైవము.

ఆ దేవాలయారామము సూటిగ గంగకు తూర్పు గట్టున ఉన్నది. కొన్న భూమిలో ఉత్తరభాగమందును, తూర్పున కొంత వఱకును ఫలవృక్షముల తోపును, పూవోటలును. రెండు చిన్న తటాకములును గలవు. దక్షిణభాగమున ఇటికల పఱపును, సున్నపు గచ్చును, గలవు. అచ్చటి స్నానఘట్టము హృదయాకర్షకము. పడవలో వచ్చు యాత్రికుడు మొదట దాని మెట్లనే ఎక్కును. ఆ మెట్ల దారి చాందినీకి చేర్చును. అది ఒక మేడ, మేడ పైని ఇల్లు ఉన్నది. దానికి ఉభయపార్శ్వములందును, ఒకటే వరుసగా, ఆఱు శివాలయములు ఉన్నవి. ఆ మేడకును శివాలయాలకును తూర్పున విశాలము ఐన ఒక ఖాళీస్థలము ఉన్నది. అది ఉత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించి దీర్ఘచతురస్రాకారము కలిగి ఉన్నది. దాని నేల గచ్చే. ఆ స్థలమునకు నట్ట నడుమ రెండు దేవాలయాలు ఉన్నవి. అందు పెద్దది దక్షిణపు వైపునను దక్షిణాభిముఖముగను ఉన్నది. అందు ప్రతిష్ఠ అంది ఉన్న వేల్పు కాళి. చిన్న దేవాలయము గంగకు అభిముఖముగ ఉన్నది. అందు వెలసి ఉన్న వేల్పు రాధాకాంతుడు, అనగా రాధకు వల్లభుడు ఐన కృష్ణుడు. కాళిగుడి మీద శిఖరాల తోడి గోపురాలు తొమ్మిది ఉన్నవి. దానికి ఎదుట విశాలము ఐన నటమందిరమును, సంగీతశాలయు ఉన్నవి. దాని మేడ పెద్ద స్తంభాలపై నెలకొని ఉన్నది. దేవాలయ ప్రాకారపు వాయవ్య మూలలో ఒకటియు, నైరృతిమూలలో ఒకటియునుగా నహబత్తులు (సంగీతగోపురాలు) రెండు ఉన్నవి. వివిధ కాలాలలో, ముఖ్యముగ ఆలయ పూజా వేళలలో, అనగా త్రిసంధ్యలయందును, సంగీతము ఆ గోపురాలనుండి వెలువడుచు ఉండును. ప్రాకారములో పడమటి వైపున తప్ప, తక్కిన మూడు వైపులను, వరుసగా గదులు ఉన్నవి. వంటకును, వస్తువులను భద్రపఱచుకొనుటకును, భోజనాలకును, ఆలయ కైంకర్యపరులయు సేవార్థులయు వసతికిని —— ఆ గదులు ఏర్పఱుపబడి ఉన్నవి. కడపటి శివాలయమునకు ఆవల, వాయవ్య మూలలో ఉన్న గది, మనకు ప్రత్యేకముగ చాల ముఖ్యము. ఏల

యన శ్రీరామకృష్ణుడు తన జీవితమున విశేషభాగమును అందు గడప నున్నాడు. ఆ గదికి పడమరగాను, నదికి ఎదురుగాను అర్ధవలయాకార ముగ ఒక మండపము (పోర్చ్) ఉన్నది. ఆమండపమునకు ఎదుట ఉత్తర దక్షిణములుగ పర్చిన కాలి బాట ఒకటి ఉన్నది. దానికి ఆవల ఒక పెద్ద తోటయును, తోటకు క్రింద గంగయును ఉన్నవి. కట్టడమునకు ఉత్తరమున ఉన్న పండ్ల చెట్ల తోపులో శ్రీరామకృష్ణుని ఆధ్యాత్మిక సాధనలకు తావలము ఐన పంచవటి అను మఱ్ఱిచెట్టును, మారేడు చెట్టును ఉన్నవి. గుడి ప్రాకారమునకు బయట ఉత్తరమున ఉన్న భవనమును, రాణి రాస్మణి కుటుంబమువారు తోటకు వచ్చినప్పుడు వాడుకొనుచు ఉండిరి. గుడితోటకు ఉత్తరముగా, ఎత్తు ఐన గోడకు ఆవల, ఆంగ్లప్రభుత్వమువారి తుపాకిమందుకొట్టు ఉన్నది.

## శివుడు

పన్రెండు శివాలయాలలోను, మహాభిక్షువు ఐన పరమశివుని వివిధ మూర్తులును, చిహ్నములు (లింగములు) ను ప్రతిష్ఠితములు ఐ ఉన్నవి. ఇచ్చట నిత్యారాధన యథావిధిగ జరుగుచుండును. శివపూజకు కావలసిన వస్తువులు తక్కువే. ఆ కృపామయుని తృప్తి పఱచి, ఆయన యొద్ద నుండి మోక్షము అనెడి వరమును గడింప వలెను అనిన, తెల్లి పూలను, బిల్వ దళాలను, కొంచెము గంగా తీర్థమును భక్తితో అర్పించిన చాలును.

## రాధాకాంతుడు

రాధాకాంతాలయమునకు విష్ణుదేవాలయము అనియు మఱి యొక పేరు కలదు. అందు రాధాకృష్ణుల విగ్రహాలు ఉన్నవి. ఆ దేవీ దేవుల కలయిక ఉత్కట ప్రేమ సిద్ధికి లక్ష్యము. విగ్రహములు రెండును పశ్చిమాభిముఖములై ఏకపీఠమున నెలకొని ఉన్నవి. నేల అంతయును చలువ రాళ్ల పఱపే. ముందటి మండపము పైకప్పునుండి దీపాల సెమ్మెలు వ్రేలుచు ఉండును. వానిపై దుమ్ము పడక ఉండు

టకై, ఎత్తు గుడ్డల కప్పడములు ఉన్నవి. సూర్యాస్తమయ మప్పుడు ఎండ విగ్రహాలపై పడక ఉండుటకై, కిత్తనార తెరలు ఉన్నవి. గర్భ గృహాపు గడపకు సమీపముగా ఒక చిన్న ఇత్తడి పాత్రలో పవిత్ర తీర్థము ఉండును. సేవార్థులు భక్తితో ఆ పాత్రనుండి కొన్ని తీర్థబిందువులను సేవింతురు.

## కాళి

ప్రధానాలయమున వెలసి ఉన్న వేలుపు లోకజనని కాళియే. ఆమెకు ఇచట భవతారిణి (సంసారమును దాటించునది) అని పేరు. ఈ గుడిలోను నేల చలువరాళ్ల పఱపే. దేవీ శిలా ప్రతిమ తళతళని బంగారు సరిగ ఉడుపులతో, సాగిలబడి ఉన్న ఒక చలువఱాతి ప్రతిమపై నిలబడిఉండును. ఆ సాగిలబడిఉన్న ప్రతిమ, దేవీవల్లభుఁడును పరాత్పరుడును ఐన శివునిప్రతిమయే. దేవిపాదములకు తక్కిన నగల తోబాటు పైడి అందెలు గలవు. భుజములకును సువర్ణాభరణములు గలవు. స్వర్ణ మౌక్తిక కంఠహారాలును, సువర్ణ నిర్మిత మైన మానవ శిరముల మాలికయును మానవహస్తముల ఒడ్డాణమును, బంగారు కిరీటమును, బంగారు కమ్మలును, ముత్తెములు తాపిన బంగారు ముక్కుపుడకయును, ఆ దేవి ధరించి ఉండును. ఆమెకు నాలుగు చేతులు ఉన్నవి. ఎడమ క్రిందిచేతిలో ఖండిత మానవ శిరము ఒకటియును, మఱి ఒక యెడమ చేత రక్త సిక్త ఖడ్గమును ఉన్నవి. కుడిచేతులలో ఒకటి తనబిడ్డలకు వరములు ఇచ్చునది, వేఱు ఒకటి అభయము ఇచ్చునది. ఆమె రూపవైభవము వాగతీతము. అందు జగత్సంహారోచితము ఐన భయంకరత్వమును, మాతృహృదయోచితము ఐన ధైర్యకరత్వమును రెండును మిళితములై ఉన్నవి. ఆమె విశ్వశక్తి, విశ్వస్వరూపిణి. ద్వంద్వములకు అన్నిటికిని మహోజ్జ్వలము ఐన ఏకావాసము. సంహరించు నదియును ఆమెయే, సృజించి సంరక్షించునదియును ఆమెయే. ఆమెకు మూడు కన్నులు, మూడవది దివ్య జ్ఞాన నేత్రము. భక్తుల మీద వాత్సల్యము కురిసెడి ఆ నేత్రములే, దుర్జనులను భయనిర్విణ్ణులను జేయును.

ఆ గుడితోటలో స్థూలజగత్తు అంతయును చిత్రితమై ఉన్నది. ప్రకృతిమాత (కాళి), పరమపురుషుడు (శివుడు), ప్రేమ (రాధా కాంతుడు) — అను తత్త్వములు మూడును ఉన్నవి. భూమ్యాకాశ ముల ఒరసికొను కమాను ఒకటి ఉన్నది. తంత్ర ప్రతిపాదిత ఐన భీకరశక్తియును, భాగవత ప్రతిపాదితు డై ఆత్మకు తన్మయతను ఒసంగు మురళీగానవినోదియు, వేదప్రతిపాదితమై ఆత్మనిష్ఠ మగు పరబ్రహ్మ మును ఒక్కచోట గూడి, సర్వమతములకును ఆత్యంతిక సామరస్య మును గలిగించు చున్నారు. సర్వప్రకారములలోను పరమార్థము అచ్చట రూపు ఒంది ఉన్నది. కాని ఈ దివ్యకుటుంబమునకు మూల భూతురాలు సర్వేశ్వరి ఐన కాళియే. ఆమెయే ప్రకృతి, ఆమెయే జనని, ఆమెయే సృష్టికర్త్రి, ఆమెయే సంహారకారిణి, అంతే కాదు, చూడ గల కన్ను గల వారికి ఆమె మహిమ ఇంకను ఉన్నతము. ఇంకను అగాధము. ఆమె విశ్వజనని, సర్వశక్తి, 'నా తల్లి' అని శ్రీరామకృష్ణుడు * ఆమెను పేర్కొనువాడు. ఆమె వివిధరూపముల లోను దివ్యావతారములలోను తన బిడ్డలకు తన్ను జూపుకొనును. తాను ఎన్నుకొన్న వారిని అప్రత్యక్షసత్యమునకు జేర్చు ప్రత్యక్ష దైవతము ఆమెయే. ఆమె వేడుకపడినచో ప్రాణుల అహంకారమును నిర్మూలించి, అభిన్న పరబ్రహ్మమున లయింపజేయును. ఆమె కృపచే, పరిచ్ఛిన్నాత్మ అపరిచ్ఛిన్నాత్మలో లీనము అగును.

ఈ దేవాలయారామ నిర్మాణమునకై, రాణి రాస్మణి ఒకింత మిక్కుటముగ ధనమును వ్యయించినది, ప్రతిష్ఠ చేయించుటకై కూడ మఱింత మిక్కుటముగ ధనమును వెచ్చించినది. ప్రతిష్ఠా మహోత్సవము 1855 వ సంవత్సరము మే నెల తే 31 ది నాడు జరిగినది.

* ఇక మీద గదాధరుని శ్రీరామకృష్ణుడు అను సుపరిచితనామముననే వ్యవహరింతము. ఆ పేరు ఎట్లు వచ్చెనో చెప్ప లేము. మథురబాబే ఆ పేరును పెట్టినా డని రామకృష్ణుడే తన మేనల్లుడైన రామలాలునకు చెప్పె నని ఒక వార్త కలదు.

కాళికాలయమున రామకుమారుడు పూజారిగ నియుక్తుడు ఐనపుడు అతనితోగూడ శ్రీరామకృష్ణుడును ఈ గుడితోటకు వచ్చెను. శూద్రవనిత యైన రాస్మణికై రామకుమారుడు గుడిపనులు చేయుట శ్రీరామకృష్ణునకు మొదట ఇష్టము లేకుండెను. తన తండ్రిగారి సనాతనాచారనిష్ఠను శ్రీరామకృష్ణుడు మఱవ కుండెను. ఆ దేవాలయ ప్రసాదమును భుజించుటయును తప్పే అని అతడు అనుచుండెను. ఏల యన, భగవన్నివేదిత పక్వాన్నమును బ్రాహ్మణునింట మాత్రమే తిన వచ్చును అనుట సనాతనాచారము. కాని క్రమక్రమముగ ఆ దేవాలయ పవిత్ర వాతావరణమును, నిర్జన ప్రశాంత కానన పరిసరములును, అన్నగారి ప్రేమపూర్వక మయిన అవేక్షణమును, తన పట్ల రాణి రాస్మణి మధురబాబులు చూపుచు ఉండిన ఆదర మును, ఆలయములో కాళికాదేవి యొక్క వాస్తవ సన్నిధానమును, వీని అన్నిటికంటె ఎక్కువగ పరమ పూజ్యము అని తాను భావించు పవిత్ర భాగీరథీ సామీప్యము — ఇవి శ్రీరామకృష్ణుని విముఖతను పోగొట్టినవి. అతడు అచ్చట హాయిగ ఉండ ఆరంభించెను.

అచిరకాలములోనే మధురబాబుదృష్టిని శ్రీరామకృష్ణుడు తనవంకకు మరల్చుకొనెను. ఉద్రిక్తము ఐన శ్రీరామకృష్ణుని ఆస్తిక్యము అతని మనమున నాటుకొన్నది. కాళికాలయమున ఆరాధనమును శ్రీరామకృష్ణునిచే చేయింప వలెను అని ఆయన ఆశ పడుచుండెను. కాని శ్రీరామకృష్ణుడు స్వేచ్ఛాప్రియుడు. లౌకికము ఐన ఏ ఉద్యోగమునందును అతనికి శ్రద్ధ లేదు. సంపన్నురాలు ఒకతె ప్రతిష్ఠించిన దేవాలయమున పూజారి పదవి అతని మనసునకు నచ్చ లేదు. అదియును గాక దేవాలయములోని విలువ గల భూషణాలం కారములను సంరక్షించు బాధ్యతను వహించుటకు అతడు వెనుదీసెను. తగిన సమయమునకై మధురబాబు వేచి ఉండ వలసెను.

ఈ సమయమున హృదయుడు దక్షిణేశ్వరమునకు వచ్చి చేరెను. శ్రీరామకృష్ణుని చరిత్రమున ఇతడు మిక్కిలి ప్రాముఖ్యము

వహింప నున్నాడు. ఇతని వయస్సు పదునాలు సంవత్సరములు. ఇతని జన్మగ్రామము కామార్పుకురునకు సమీపమున ఉన్న సిహోరు. ఇతడు శ్రీరామకృష్ణునకు మేనల్లుడు. హృదయునకును శ్రీరామ కృష్ణునకును బాల్యమునుండియే చెలిమి కలదు. హృదయుడు చురుకైన బుద్ధియు, అధికోత్సాహమును, చక్కని సమయస్ఫూర్తియు గల వాడు. అతడు తన మేనమామను తోడునీడవలె ఎడబాయక ఉండి స్వసుఖనిరభిలాషియై సదా సేవ చేయ నున్నాడు. శ్రీరామ కృష్ణుని ఆధ్యాత్మిక సాధనలకు పెక్కింటికి నోరు ఎత్తని సాక్షిగను, ఆ సాధనలు అత్యుత్కటముగ సాగు దినాలలో గురుదేవుని శరీరము నకు సంరక్షకుడుగను పనివడ నున్నవాడు ఇతడే. ఏది ఐన నౌకరి దొరకును అనెడి ఆసతో హృదయుడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. అతనిని జూచి శ్రీరామకృష్ణుడు సంతోషించెను.

మధురానాథుని ప్రార్థనను కాదు అన లేక శ్రీరామకృష్ణుడు తుదకు ఎట్లో దేవాలయకార్యమునకు పూనుకొనెను. హృదయుడు తనకు తోడ్పడినచో, తాను ఆ పనిని నిర్వహింతును అనెను. కాళీ విగ్రహమునకు వస్త్రాభరణములను సమర్పించి సింగారించుట మాత్రమే శ్రీరామకృష్ణునకు మొదటి దినాలలో అర్పితము ఐన పని.

ఒకనాడు రాధాకాంతాలయమున పూజారి, చేయి తప్పి, కృష్ణవిగ్రహమును నేల బడ వైచెను. విగ్రహమునకు ఒక కాలు విరిగెను. భిన్నవిగ్రహమును ఆరాధింప రాదు అని ఆగమ నిషేధము ఉన్నందున, క్రొత్తవిగ్రహమును ప్రతిష్ఠింపుము అని పండితులు రాణికి తెలియజెప్పిరి. కాని రాణీ ఆ విగ్రహముపై అభిమానమును వదలుకో లేక, శ్రీరామకృష్ణుని అభిప్రాయమును అడిగెను. పరధ్యానదశ యందు ఉన్న శ్రీరామకృష్ణుడు "పండితులు చెప్పిన పరిష్కారము పరిహాసనీయముగ ఉన్నది. రాణీగారి అల్లునకు ఒకనికి కాలు విరిగె నేని, ఆమె అతనిని తొలగించి అతని స్థానమున వేఱు ఒకనిని ఉంచునా? అతని కాలిని సరి చేసిన బాగుగ ఉండును అనియే కదా

ఆమె అనుకొనును! ఈ విషయమున గూడ ఆమె అట్లే ఏల చేయరాదు? విగ్రహమును సరిపఱచి ఆరాధనమును మునుపటివలెనే సాగింప వచ్చును'' అనెను. సరళమును ఋజువును ఐన ఈ పరిష్కారమును రాణి అంగీకరించెను. శ్రీరామకృష్ణుడే విగ్రహమునకు విఱిగిన కాలిని సరిచేసెను. తొంటి పూజారి జాగరూకత లేని వాడు అని అతనిని అధికారులు పదవినుండి తొలగించిరి. మథురబాబు మిాదు మిక్కిలిగ వేడుకొన్నందున రాధాకాంతాలయపు పూజారిపదవిని శ్రీరామకృష్ణుడు కైకొనెను.

## పూజారి శ్రీరామకృష్ణుడు

సదాచార సంపన్న మగు బ్రాహ్మణ కుటుంబమున జన్మించిన వాడు ఐనందున శ్రీరామకృష్ణుడు భగవదారాధన క్రమములకు సంబంధించిన సంప్రదాయములను ఎఱిగి ఉండెను. వర్ణనాతీతమును దురవగాహమును అగు పరతత్త్వమును మానవుడు పరిచ్ఛిన్న మయిన తన మనసున భావించినపుడు, ఆ పరతత్త్వమే హిందూసిద్ధాంతము పేర్కొను లెక్క లేని వేల్పులుగను స్త్రీదేవతలుగను – మానవ రూపములను దాల్చును. ఆ దేవతలు మానవుల ప్రేమోద్రేకములను తెలిసికొందురు, మెచ్చుకొందురు, మానవుల ఐహికాముష్మిక లక్ష్య సాధనలకు తోడ్పడుదురు, తుదకు దుఃఖ మయ సంసారము నుండి సైతము మానవులను విముక్తిని ఒందింతురు. వెలుగునకును, తెలివికిని, బుద్ధికిని, బలమునకును — ప్రభవము ఐన అద్వితీయుడే సకల ఫల ప్రదాత. అయినను మానవుడు తన హద్దులను దాటలేనంతవఱకును, దేవుని మానవ రూపములోనే గాని ఆరాధింప లేడు. మానవ చిహ్నములను అతడు ఉపయోగించి తీఱవలెను. కావుననే భక్తులు భగవంతుని ఆదర్శ పితగనో, ఆదర్శమాతగనో, ఆదర్శ భర్తగనో, ఆదర్శసుతునిగనో, ఆదర్శమిత్రునిగనో — భావింప వలెను అని హిందుసిద్ధాంతము చెప్పుచున్నది. కాని, నామము నామరహితు నొద్దకే చేర్చును, రూపము రూపరహితునొద్దకే చేర్చును, శబ్దము

నిశ్శబ్దునొద్దకే చేర్చును, ఉద్రిక్తభావము సచ్చిదానంద మయ బ్రహ్మమున శాంతిసిద్ధికే చేర్చును. వేల్పులు ఎల్లరును క్రమక్రమముగ సర్వేశ్వరునిలో లయింతురు. అయినను ఆ సిద్ధి కలుగనంత దాక భక్తుడు తన ఆరాధనలో మానవాంశములను వేఱు సేయ లేడు. కావుననే దేవుని స్నానము చేయించును, ఉడుపులను దొడి గించును, నగలతో సింగారించును, విందు ఆరగింపజేయును, నిద్ర పుచ్చును, మంత్రాలతోను పాటలతోను ప్రార్థనలతోను ప్రసన్నుని జేయును. ఈ పనులకు అన్నిటికిని సంబంధించిన అర్థ కర్మకలాపాలు ఉన్నవి. చూడుడు, బాహ్యశుద్ధికై పూజారి పవిత్రజలములో క్రుంకు లిడును, మడిబట్టలను కట్టుకొనును, అంతఃకరణశుద్ధికై జ్ఞానేంద్రియ ముల పవిత్రతకై ధ్యానములను దగిన రీతిని ఒనర్చును. తాను పూజ చేయు చోటికి దుష్టగ్రహాలను చొర నీయక ఆ చోటు చుట్టును అగ్నిప్రాకారాలతోను జలప్రాకారాలతోను దిగ్బంధనము గావిం చును. శరీర మందలి చైతన్య కేంద్రములను మేలుకొలుపుకొని హృదయమున పరమాత్మను ఆవాహన చేసికొనును, ఆ పరమాత్మను తనకు ఎదుట ఉన్న విగ్రహములోనికి మార్చును. అప్పుడు అది అతనికి మృచ్ఛిలా ప్రతిమ కానే కాదు, మఱి సచేతనమును చిన్మ యమును ఐన పరమాత్మయొక్క ప్రత్యక్ష రూపమే. ఆరాధన ముగిసిన పిమ్మట పూజారి పరమాత్మను విగ్రహములోనుండి, నిజముగ దానికి స్వస్థానము అగు తన హృదయములోనికి మరల్చుకొనును. విశ్వ మంతటను పర్వి, విశ్వమును అతిక్రమించి ఉన్న తత్త్వమును ఒక పీఠముపై ఉంచుట, దేహమున కంటె వేఱై నిరాకారము ఐన ఆత్మకు ఆహారములు అర్పించుట, బ్రహ్మాండాల పొగడ్తలకు అంద నట్టి పరముని సంకీర్తన చేయుట — ఇట్లు విశ్వాతీతతత్త్వమును ప్రకృతిద్రవ్యములతో ఆరాధించుట ఎంత అసంగతమో, పారమార్థిక భక్తుడు ఎఱుగును. ఎఱిగినను క్రతుకర్మలను, నామరూపాలను, స్తుతి సూక్తులను తుదకు అతిక్రమింప వలెను అనిన, ఆ క్రతుకర్మలను ఆచరించుటే అందులకు మార్గము అనియు, ఆ మార్గాన, విశ్వ

వ్యాపియు చిన్మూర్తియును అగు భగవంతుని సాక్షాత్కరించుకొనగును అనియును అతడు ఆసించును.

హిందూపూజారులకు ఆరాధనక్రమములు సుపరిచితములే కాని, వాని గూఢార్థములు ఎఱిగినవారు వారిలో అరుదే. కావున యంత్రావయవములవలె వారి హస్తాదికావయవములు వేదోక్త రీతులలో కదలుచు ఉండును, చిలుకపలుకులవలె మంత్రానుసంధానము జరుగుచు ఉండును. అంతే. మఱి శ్రీరామకృష్ణునకు అన్ననో ఆరాధనప్రకారముల అంతరార్థములు ఆదినుండియే ఎఱుకవడి ఉండెను. విగ్రహమునకు ఎదుట కూర్చున్నంతనే ఆతనికి వింత మనః పరిణామములు గలిగెడివి. విహితక్రియలను ఆచరించుచు ఉన్నప్పుడు నిప్పుకోట ఒకటి తన్నును తన ఆరాధనస్థలమును చుట్టి, ఆనాత్మ శక్తులను జొరనీయక కాచుచు ఉన్నట్లు అతనికి కానిపించును. లేదా, తన దేహమందలి వివిధ కేంద్రాలనుండియును గూఢము ఐన కుండలినీ శక్తి లేచుచు ఉన్నట్లు ఆయనకు తోచును. ఆయన వదనమందలి వర్చస్సు, గాఢమైన ఏకాగ్రత, గుడిలోని గంభీరవాతావరణము— ఇవి శ్రీరామకృష్ణుడు దేవిని ఆరాధించుచు ఉన్నప్పుడు, ప్రేక్షకుల మనస్సులలో నాటుకొనెడివి.

దేవీపూజాక్రమములో చిక్కులు ఉన్నవి. కావున ఆ క్రమాలను చక్కగా తన తమ్ముడు నేర్వవలెను అని రామకుమారుడు అనుకొనెను. కాళిగుడిలో పూజారిగా కావలెను అనిన సద్గురుముఖమున ప్రత్యేకోపదేశమును బడయవలయును. శ్రీరామకృష్ణునకు యోగ్యుడు ఐన బ్రాహ్మణుడు ఒకడు లభించెను. కాని ఉపదేశించునపుడు గురువు అతని చెవిలో ప్రణవమును ఉచ్చరించినంతనే అతనిని భావోద్రేకము పైకొనెను. బిగ్గఱగ అఱచి అతడు గాఢధ్యానమున మునిగెను.

కాళిగుడిలో పూజారిగ ఉండుము అని మథురానాథుడు శ్రీరామకృష్ణుని ప్రార్థించెను. ఆయన తనకు సామర్థ్యము లేదు అని

యును, ఆగమములు తెలియవు అనియును చెప్పెను. ఆగమపరి జ్ఞానము చాలక ఉన్నను, ఆస్థయును భక్తియును ఉన్న చాలును అనియు, ఆస్థయు భక్తియునే విగ్రహమున లోకమాతృ సాక్షాత్కారమును సాధించును అనియు, మథురానాథుడు పట్టుపట్టెను. కడకు శ్రీరామకృష్ణుడు మథురానాథుని ప్రార్థనకు అంగీకరింపక తప్ప లేదు. ఆయన కాళీగుడిలో పూజారి అయ్యెను.

1856 వ సంవత్సరమున రామకుమారుడు పరమపదించెను. తనకుటుంబమున, ఇంతకు మునుపే మఱి యొక మరణమును కూడ శ్రీరామకృష్ణుడు చూచి ఉండెను. ఐహిక జీవితము బుద్బుద ప్రాయము అని అతనికి స్పష్టపడెను. ఐహిక విషయాల క్షణభంగురత తెలిసివచ్చిన కొలదియును, అతనికి భగవ ద్దర్శన తృష్ణ హెచ్చసాగెను. భగవంతుడే కదా శాశ్వతత్వమునకు గని.

## కాళీ ప్రథమ దర్శనము

తాను అర్చింప గోరుకొన్న వేలుపు ఎట్టి అద్భుతమూర్తి ఐనదియు, అతడు అచిరకాలములోనే గుర్తించెను. విశ్వవ్యాప్తము ఐన దేవీసన్నిధానము అనెడి వలలో అతడు క్రమక్రమముగా తగులొ్కనెను. అజ్ఞుల దృష్టికి దేవి నిక్కముగ సంహారకారిణియే. కాని శ్రీరామకృష్ణునకు ఆమె దయా వాత్సల్య భరిత అగు మాతృమూర్తిగ కనిపించెడిది. ఆమె కంఠమును జుట్టి పుఱ్ఱెల దండ ఉన్నది. నడుము చుట్టును నరుల హస్తాల ఒడ్డాణము ఉన్నది. ఆమె చేతులలో రెంటిలో మారణాయుధాలు ఉన్నవి. ఆమె నేత్రాలు నిప్పులు గ్రక్కుచు ఉండును. ఐనను శాశ్వతత్వమునకు విత్తనము ఆమెయే అనియు, ఆమె నిశ్శ్వాసపు తాకుడు ప్రణయ శిశిరము అనియు శ్రీరామకృష్ణునకు అనిపించెను. అదే వింత. ఆమె తన వల్లభుడు ఐన శివుని ఱొమ్మును త్రొక్కి నిలబడి ఉన్నది. ఏల యన, ఆమె పరాశక్తి, పరతత్త్వమునుండి ఆమెను ప్రత్యేకింప శక్యము కాదు. వల్లకాటిలో వసించు నక్కలు మున్నగు అపవిత్రప్రాణులు ఆమెను

పరివేష్టించి ఉండును. మఱి పరతత్త్వము పవిత్రతకును అపవిత్రతకును అతీతము ఐనది కదా! పానమదముచే సుడియుచు ఉన్నట్లు ఆమె కనిపించును. ఆ దివ్య మదమే లేకున్నచో ఈ వెఱ్ఱి లోకమును ఎవరు సృజింతురు? విశ్వము, పైకి క్రమబద్ధమువలె అగపడినను, దాని మూలాధారము అక్రమమే. అనాది ఐన క్రంప [కేయాస్] నుండి ఈ జగత్తు రూపు దాల్చినది. కాళి, ప్రకృతిశక్తులకు అన్నిటికిని అత్యున్నత లక్ష్యము, విరుద్ధము లైనట్టి వానికి ఏకావాసము, స్త్రీ రూపమును దాల్చిన పరబ్రహ్మము. శ్రీరామకృష్ణునకు ఇప్పుడు ఆమె ఒక్కతెయే తథ్యముగను జగత్తు మిథ్యగను ఐనవి. ఆయన తన హృదయమును ఆమెసేవకే అర్పించెను. అవ్యయ సత్య ధామము నకు సుస్పష్ట ద్వారమును బోలి, దేవి, అతని యెదుట నిలబడి ఉండెను.

గుడిలో ఆరాధన సాగించు కొలదియును విశ్వమాతను ప్రత్యక్షముగ చూడ వలెను అను ఉబలాటము అతనికి తీవ్రము అయ్యెను. ఆరాధనకాలము తప్ప, తక్కిన కాలము ఎల్ల అతడు ధ్యానమున గడపుచు ఉండెను. అందులకై అతడు మిక్కిలి నిర్జనము ఐన ఒక చోటును ఏర్పఱచుకొనెను. గుడికి ఉత్తరమున ముండ్ల తీగలును క్రంపయును బలిసిన ఒక కీకారణ్యము కలదు. అది ఒకా నొకప్పుడు శ్మశానముగ ఉపయోగపడుచుండిన దట. దయ్యాలు ఉండును అను భయముచేత పగటివేళలలో సైతము జనులు అచటి నుండి దూరముగా తొలగుచు ఉందురు. అచ్చట శ్రీరామకృష్ణుడు రాత్రులు ఎల్ల, ధ్యానములో గడప జొచ్చెను. తెల్లవాఱునప్పటికే గాని, ఆయన గదికి రాడు. మిక్కుటముగ ఏడ్చినప్పుడు ఉబ్బు నంతగా అతని కన్నులు ఉబ్బి ఉండెడివి. ధ్యానసమయములో అతడు బట్టలను జందెమును కూడ తీసి వేయుచు ఉండెను. హృదయుడు అడుగగా, ఈ వింత చేష్టను వివరించుచు, అతడు ''దేవుని ధ్యానించు నప్పుడు బంధాలు అన్నియును తొలగ వలె కదా, పుట్టి నప్పటి నుండియే ఎనిమిది సంకెలలు మనలను బంధించి ఉన్నవి. ఏవి ఏవి

అనగా — (౧) ద్వేషము, (౨) అవమానము, (3) ఆభిజాత్యము, (౪) శీలగర్వము, (౫) వెఱపు, (౬) దాపటికము, (౭) వర్ణము, (౮) దుఃఖము. నేను బ్రాహ్మణుడను అనియును, కావున సర్వాధికుడను అనియును తలంపించునది జందెము. లోకమాతను సంబోధించునప్పుడు అట్టి తలంపులను అన్నిటిని దులుపుకో వలె'' అని చెప్పెను. తన మేనమామకు వెఱ్ఱి ఎత్తుచు ఉన్నది అని హృదయుడు అనుకొనెను.

తన భగవత్తృష్ణ గాఢము అగు కొలదియు, ఆయన, ఆరాధన సంప్రదాయాలను వదలివేయుచు ఉండెను, లేదా, అవే ఆయన జ్ఞప్తినుండి తొలగుచు ఉండినవి. ఆయన, విగ్రహమునకు ఎదురుగా కూర్చుండి కమలాకాంతుడు - రామప్రసాదుడు మొదలగు మాతృభక్త వరేణ్యులు రచించిన భక్తిగీతాలను పాడుచు గంటల కొలది కాలమును గడపును. ఆ గీతాలు భగవత్సాక్షాత్కారమును వర్ణించునవే. ఒకదానితో ఒకటి సంబంధింపని ఆపాటలు విన్న కొలదియు శ్రీరామకృష్ణుని ఉత్కంఠ ఉద్రిక్తము ఐనది. తల్లిని ఎడబాసిన శిశువువలె, అతడు బాధపడెను. గాఢవ్యధచే ఒక్కొక్కసారి అతడు మొగమును నేలకు ఏసి రాచుకొని బిట్టుగా ఏడ్చుచు ఉన్నప్పుడు చూచిన వారు అతని తల్లి మరణించెను గాబోలు అనుకొని సానుభూతి చూపుచు ఉండిరి. ఒక్కొక్కప్పుడు సందేహము పాలు అగుచు ''తల్లీ నీ ఉనికి నిజమేనా ? లేక, కల్పితమా ? అయథార్థము ఐన కవిత్వమా ? నీ ఉనికి నిజమే ఐన ఎడల నీవు నాకు ఏల అగపడవు ? ఆస్తిక్యము అనగా భ్రాంతియు అసత్కల్పనయునే అగునా ? మానవుల ఊహాసృష్టియేనా నీవు ?'' అని అతడు ఆక్రందించును. ఒక్కొక్కప్పుడు భజనకంబళము మీద అతడు రెండు గంటల సేపు అచేతనవస్తువునుబోలి కూర్చుండును. నానాటికిని అతని ప్రవర్తన విపరీతముగ పరిణమింప సాగెను. ఇహలోకస్మృతి ఉండు సమయము ఇంచుమించు లేదు అనియే చెప్ప వచ్చును. ఆహారమును మానినట్లే, నిదుర అతనిని వదలియే పోయినది.

కాని ఆయన చిరకాలము వేచి ఉండ వలసిన అక్కఱ లేక పోయినది. మొదటిసారి తనకు గలిగిన దేవీదర్శనమును ఆయనయే ఇట్లు వర్ణించి ఉన్నాడు — "తడి గుడ్డను పిండిన రీతిగా నాహృదయమును పిండుచు ఉన్నట్లు నాకు అనిపించెను. మిక్కుటము ఐన అశాంతిచేత నేను పరవశుడను ఐతిని. దేవిని సాక్షాత్కరించుకొను భాగ్యము నాకు ఈ జన్మాన లేదు కాబోలు అను దిగులు పుట్టినది. దేవినుండి ఆ యెడబాటును ఇక నేను ఓర్వ లేక పోయితిని. బ్రతుకు నిష్ప్రయోజనము అని తోచినది. అమ్మవారి గుడిలో ఒక ఖడ్గము ఉన్నది. నా చూపు తటాలున దానిపై వ్రాలినది. ఆత్మహత్య చేసికొందము అని నిశ్చయించుకొంటిని. ఉన్మత్తునివలె చుమికి, ఆ కత్తిని ఒడిసి పట్టితిని. అప్పుడు తటాలున జగజ్జనని దర్శనమును ప్రసాదించెను. కట్టడములును, అందలి వివిధ భాగాలును, దేవాలయమును, ఇతరములు అన్నియును గూడ నా దృక్పథమునుండి మాయము ఐనవి. వాని జాడయే లేక పోయెను. వాని స్థానమున నిరవధియు నిరంతమును ఉజ్జ్వలమును ఐన చైతన్యసాగరము ఒకటి కనిపించినది. కను చూపు మేరలో ఎటు వైపు చూచినను, తళతళని తరంగాలు ఉద్రిక్తములై భయంకరఘోషతో నన్ను కబళింప నా మీదికి ఉరవడించుచు ఉండినవి. నాకు ఊపిరి ఆడ లేదు. ఆ వేగములో తగుల్కొని నేను స్మృతి తప్పి పడిపోయితిని. బయటి లోకములో ఏమి జరుగుచు ఉన్నదియును నేను ఎఱుగను. నాలో మాత్రము చిక్కనైన అపూర్వానందవాహిని ఏకరీతిగ ప్రవహించెను. లోకజనని సాన్నిధ్యమును నేను అనుభవించితిని." — అతనికి మరల స్మృతి గలుగు నప్పటికి అతని నోట "తల్లీ" అను మాట వెలువడుచు ఉండెను.

## దైవోన్మాదము

ఇంకను ఎంతో తీవ్రములు ఐన అనుభవములు ముందు గలుగ నున్నవి. వాని మచ్చు ముక్కయే ఇది. దేవిని తొలి సారి దర్శించినది

మొదలు, సదా దేవినే చూచుచు ఉండ వలయును అను ఉబలాటము అతనికి మఱింత హెచ్చెను. ధ్యాన మప్పుడు మాత్రమే కాక, వట్టి యప్పుడు కూడ తాను మాతను చూచుచు ఉండ వలెను అని అతడు కోరెను. కాని మాత అన్ననో దాగుడుమూతలు ఆడుచు అతనిని విసిగింప సాగెను, ఆనందమును తాపమును గూడ అతనికి మిక్కుటము అగునట్లు చేసెను. దేవితో ఎడబాటు గలిగినప్పుడు బిట్టుగ ఏడ్చుచు, అతడు ఉద్రిక్త భావ పరవశుడు అగును, అప్పుడు ఆమె అతని యెదుట నిలబడి అగపడును, నవ్వును, మాటాడును, ఓదార్చును, ధైర్యము గొలుపును, ఉపదేశములు చేయును. ఈ ఆధ్యాత్మిక సాధనల కాలములో అతనికి అసాధారణములు ఐన అనుభవాలు కలిగినవి. ధ్యానముకై కూర్చున్నప్పుడు అతనికి కదలిక లేక ఉండుటకై ఎవరో అతని కాలి కీళ్లను బిగించుచు ఉన్నట్లు వింత ధ్వనులు విన నయ్యేడివి. ధ్యానపరిసమాప్తియప్పుడు కూడ అట్టి ధ్వనులే విన నై, అతడు స్వేచ్ఛగా సంచరింపగలిగి ఉండునట్లు కాలి కీళ్ల బిగువు సడలింపబడుట యును అతనికి తెలియ నయ్యేడిది. అతని యెదుట ఎగురుచు ఉన్న మిణుగురులబోలె మెఱుపులు అగపడెడివి. లేదా, తళతళని రజత ద్రవ తరంగాలు గలిగి అగాధము ఐన మంచు కడలి నడుమ తాను ఉన్నట్లు కన్పట్టెడిది. మఱి యొక పరి ప్రసన్నము ఐన మంచుకడలి నుండి లోకమాత పైకి వచ్చుచు ఉన్నట్లు అతనికి అగపడెడిది. మొదట పాదములు, పిదప నడుము, పిమ్మట ఉరము, తదుపరి మొగము, అటుతర్వాత శిరము, కడకు ఆమె సమగ్రరూపము, చూపట్టెడిది. ఆమె విడుచు ఊపిరి గాలి అతనిపై ప్రసరించును. ఆమె కంఠ స్వరము కూడ అతనికి విన నగును. గుడిలో పూజ చేయుచు ఉన్నప్పుడు ఒక్కొక్కప్పుడు ఒక ఉన్నతి అతనిని ఆవహించును. ఒక్కొక్కప్పుడు అతడు ఱాయివలె కదలక ఉండును. ఒక్కొక్కప్పుడు అతిమాత్ర భావోద్రేకముచేత ఇంచుమించు నిశ్చేతనుడు అగును. అతని పనులలో పెక్కులు సంప్రదాయ విరుద్ధము లై ఉన్నందున, అవి అపచారములు అని ప్రజలు అనుకొనిరి. ఒక్కొక

సారి అతడు పూవును అందుకొని దానితో మొదట తన తలను మొలను పాదాలను స్పృశించుకొని, తర్వాత ఆ పూవునే దేవికి అర్పించును. లేదా, పానమత్తునివలె దేవీపీఠమువంకకు తూలి, ఆమె గడ్డమును పుడికి, ప్రేమ చూపును, పాడును, మాటాడును, హాస్యము చేయును, హసించును, నర్తించును. లేదా, తట్టనుండి ఒక కడి అన్నమును చేత గొని, దేవి నోటికి అందించును, ఆరగింపుము అని వేడుకొనును, ఆమె నిక్కముగ ఆరగించినది అను నమ్మకము తనకు కలుగు దనుక తనివి జెందడు. రాత్రులందు, ఆమెను నిద్రపుచ్చి, తాను తన గదిలో ఉన్నప్పుడు, ఆమె హాయిగను నెమ్మదిగను అడుగులు ఇడుచు అందెలు మ్రోయ, గుడి మేడ పైకి ఎక్కుట అతని చెవికి తెలియ నగును. గంగను తిలకించుచునో, దూరమున ఉన్న కలకత్తా నగర దీపములను చూచుచునో, ఆమె గుడిపై నిల్చి యుండ, వ్రేలుచున్న ఆమె కేశపాశమును, ఆకాశాన పర్వి ఉన్న ఆమె నల్ల మేని నీడయు అతనికి అగపడెడివి.

గుడినౌకరులు అతనిని పిచ్చివాడు అనుకొనిరి. సహజమే కదా! అతని లౌకిక శ్రేయోభిలాషులు అతనిని సమర్థులు ఐన వైద్యుల యొద్దకు కొంపోయిరి. కాని, అతని వ్యాధిని ఏ మందును మాన్ప లేదాయెను. తనకు అస్వాస్థ్యము కలిగినదో ఏమో అని పెక్కు సారులు అతడే అనుమానించెను. ఏల యన తాను పయనించుచున్న సముద్రమునకు పటము [చార్టు] లేదు, దారి చూపు ప్రాణులే లేరు. సాక్షాల్లోకమాత ఒక్కతెయే అతనికి భద్రము ఐన రేవు. ఆమెను అతడు ఇట్లు వేడుకొనును — "ఇవి ఏవియును నేను ఎఱుగను, మంత్రాలును వేదాలును నాకు తెలియవు, అమ్మా, నిను జేరుటకు దారిని నీవే ఉపదేశింపుము. వేఱు ఎవరు నాకు సాయపడ గలరు? నాకు ప్రాప్యవును ప్రాపకురాలవును నీవే కదా!" అతనికి దుఃఖము గాని సందేహము గాని కలిగినప్పుడు, దేవీసాన్నిధ్యమే ధారకము అయ్యెడిది. ఆసాన్నిధ్యము అతనికి లభింపక పోయినది లేదు. అతని నడవడిని తప్పుపట్టువారికి ఐనను, అతని విశుద్ధత, నిష్కపటత,

సత్యపరత, విశ్వసనీయత, పవిత్రత — ఇవి చిత్తములకు ఎక్కుచునే ఉండెను.

సమాధి, ఆధ్యాత్మిక రంగ కవాటమును తెఱచును అందురు. వివిధ రీతుల దేవుని అనుభవింప వలె అను తృష్ణ శ్రీరామకృష్ణునకు దుర్నివారముగ కలిగెను. ధ్యానమునకై అతడు దేవాలయారామమున దట్టముగ ఉన్న ఉత్తరభాగమున ఒకప్రదేశమును ఏర్పఱచుకొనెను. హృదయుని తోడ్పాటుతో, ఆయన అచ్చట పవిత్ర వృక్షములను ఐదింటిని నాటెను. 'పంచవటి' అని ప్రసిద్ధము ఐన ఆ తావున ఆయన పెక్కు సాక్షాత్కారములను బడసెను.

ఆధ్యాత్మిక ప్రవణత గాఢము ఐన కొలదియును, తాను లోకమాతృశిశువు అను తలంపు ఆయనకు ముదిరెను, సర్వమును ఆమె యిష్టమునకు వదలి, తాను ఆమెనే పరిపూర్ణముగ శరణు జొర అతడు అలవఱచుకొనెను.

"అమ్మా, నేను నిన్ను శరణుజొచ్చితిని. ఏమి చేయ వలెనో ఏమి చెప్ప వలెనో నీవే నాకు బోధింపుము. ఏ విషయములో నైనను సరే, నీ సంకల్పమే, అన్నిటికిని మీదిది. నీ బిడ్డలకు శ్రేయస్కరము ఐనదియు అదే. నా తలంపులను నీ సంకల్పములో లీన మొనర్చుకొని నన్ను ఒక పనిముట్టుగ ఉపయోగించుకొనుము."—ఇదే సదా శ్రీరామకృష్ణుని ప్రార్థన.

అతని దివ్య దర్శనములు నానాటికిని ఎక్కువ ఆంతరంగికములుగను గాఢతరములుగను పరిణమించినవి. దేవిని దర్శింప వలెను అనిన అతనికి ధ్యానింప వలసిన అక్కఱ లేక పోయెను. బాహ్యలోక జ్ఞానము ఉండగనే, అతడు తన చుట్టును ఉన్న దేవాలయాలను, వృక్షాలను, నదిని, మనుష్యులను చూచినంత స్పష్టముగ లోకజననిని కూడ చూచుచు ఉండెను.

ఒకనాడు, గుడిలోని పూజను గమనింతము అని, మధురబాబు, ఎవ్వరికిని తెలియకుండ, లోపల ప్రవేశించెను. యువకుడు

ఐన ఆ పూజారియొక్క భక్తిశ్రద్ధలు చూచి, మధురబాబు మిక్కిలి చకితుడు అయ్యెను. జాతిబొమ్మను శ్రీరామకృష్ణుడు సాక్షాద్ దేవిగా పరిణమింపజేసినట్లు అతనికి తోచెను.

ఒకనాడు శ్రీరామకృష్ణుడు అమ్మవారికి అని ఉద్దిష్టము ఐన అన్నమును ఒకపిల్లిచేత తినిపించెను. దేవాలయారామాధికారికి ఇది దుస్సహముగ ఉండెను. పూజను సరిగా జరిగింప వలసిన బాధ్యత తనది అని ఆ అధికారి అనుకొనెను. కావున శ్రీరామకృష్ణుని చేష్టలను అతడు మధురబాబుకు తెలిపెను.

ఈ విషయమును శ్రీరామకృష్ణుడే ఇట్లు వివరించెను — "గుడిలో ఉన్న జగజ్జనని సమస్తమును తానే అని నాకు తెలిపినది. పరమాత్మచే వ్యాప్తము కానిది ఏదియు లేదు అని ఆమె నాకు చూపెను. విగ్రహము పరమాత్మయే, దాని పీఠము పరమాత్మయే, చలువరాతి నేలయు పరమాత్మయే, సర్వమును పరమాత్మయే. గదిలోని ప్రతివస్తువును దివ్యానంద శిశిరమై నాకు పొడకట్టినది. కాళిగుడికి ఎదుట ఒకదుర్జనుడు నా కంట బడినాడు. కాని అతనిలో తొణుకుచు ఉన్నదియు లోకమాతృశక్తియే అని నేను గుర్తించితిని. జగజ్జననికి ఉద్దిష్టము ఐన అన్నమును నేను పిల్లికి పెట్టుటకును కారణము అదియే. ఈ సమస్తమును జగజ్జననియే, పిల్లియును జగజ్జననియే, అనుట నాకు స్పష్టముగ పొడకట్టినది. అమ్మవారికి నైవేద్యము పెట్ట వలసిన అన్నమును నేను పిల్లికి పెట్టుచు ఉన్నాను అని దేవస్థానాధికారి మధురబాబునకు వ్రాసెను. కాని నా చిత్తవృత్తిని లెస్సగ ఎఱిగిన మధురబాబు "అతని యిచ్చ చొప్పున చేయనిమ్ము. అతనిని నీవు ఏమియు అనకుము" అని దేవస్థానాధికారికి జవాబు వ్రాసెను.

ఈ దినాలలో శ్రీరామకృష్ణుడు అనుభవించిన బాధలు పెక్కులు. వానిలో ఒడలి మంట ఒకటి. ఒక వింత దర్శనమును చూచిన వెంటనే అతనికి ఆ బాధ మానినది. ఆగమ నియమాను

సారము, పూజాసమయమున, 'పాపి' తనలో ఉన్నట్లును నశించినట్లును అతడు భావించును. పంచవటిలో ఒకనాడు అతడు ధ్యానించుచుండ, అతనికి, నీలవర్ణుడును రక్తనేత్రుడును అగు ఒకపురుషుడు, త్రాగుడుచేతనా అనునట్లు తూలుచు, తననుండి వెలువడుచు అగపడెను. వెంటనే ప్రశాంతవదనుడును కాషాయాంబరుడును త్రిశూలపాణియు అగు వేఱు ఒక పురుషుడును ఆలాగే వెలువడెను. రెండవ పురుషుడు మొదటివానిని మార్కొని శూలమున గ్రుమ్మి గెడపెను. అంతటితో శ్రీరామకృష్ణుని దేహబాధ తీఱిపోయెను.

ఇంచుమించు ఇదే కాలమున శ్రీరామకృష్ణుడు దేవుని 'స్వామిభృత్యభావము'తో ఆరాధింప బొడంగెను, హనుమంతుని ప్రవర్తనను అనుకరించెను. అహంకారభంజకము ఐన ఇట్టి భక్తికి అనాదికాలముగ ఉన్న లక్ష్యమును, ఆదర్శభృత్యుడును, ఆ రామాయణ వానరనాయకుడే కదా! హనుమద్భావనచే అతని నడకలును జీవితరీతులును కోతినడకలను కోతిజీవితరీతులను పోల సాగినవి. అతని చూపులు చంచలములు ఐనవి. పండ్లును వేరులును, అతనికి ఆహారములు ఐనవి. వస్త్రమును నడుమునకు కట్టుకొని, అందు కొంత భాగమును తోకవలె వ్రేలవేసికొని, నడచుట మాని గంతులు ఇడ సాగెను. కొంత కాలమునకు శ్రీరాముని దేవేరి, సీత అతనికి దర్శనము ఒసంగి "నా చిఱునవ్వును నీకు ప్రసాదించుచు ఉన్నాను." అని చెప్పి అతని దేహములో ప్రవేశించి, మాయము అయ్యెను.

మథురానాథునకు శ్రీరామకృష్ణుని ఆధ్యాత్మికతృష్ణ నిజమే అను నమ్మకము ఉన్నది. కాని ఇప్పుడు ఏ మైన పిచ్చి పట్టినది కాబోలు అని అనుకొనెను. ఏల యన కోతివలె అతడు గంతులు ఇడుచు ఉండగా మథురబాబు చూచెను. ఒకనాడు దేవాలయములో శ్రీరామకృష్ణుడు పాడుచుండగా, రాణి రాస్మణి వినుచుండెను. తటాలున అతడు ఆమెవంకకు తిరిగి అఱచేత ఆమెను కొట్టెను. ఆమె అతని పాటను వినుచు ఉన్నట్లు కనబడినను నిజముగ ఏదో ఒక

వ్యాఖ్యానమును గూర్చి ఆలోచించుచు ఉండెను. ఆ దండనను లోకమాత స్వయముగ విధించిన దండనగా భావించి ఆమె దానిని అనుమతించెను. కాని మథురుడు చిరాకు చెందెను. 'సంఘాచారాలను పాటింపుము' అనియును 'భావోద్రేకాలను అణచుకొనుము' అనియును అతడు శ్రీరామకృష్ణుని ప్రార్థించెను; దేవుడు ఐనను చట్టములను అతిక్రమింపడు అని వాదించెను, ఒక్క కొమ్మపై రెండు రంగుల పూలు పూచునట్లు దేవుడు చేయడు అనుటే అందులకు ఉదాహరణము అనెను. మఱునాడే శ్రీరామకృష్ణుడు ఒకటే కొమ్మపై తెల్లగ ఒకటియు ఎఱ్ఱగ ఒకటియునుగ పూచిన మందార పుష్పాలను రెంటిని మథురబాబునకు బహూకరించి చూపెను.

ఇంద్రియదమము శ్రీరామకృష్ణుని మనోవ్యధకు కొంతవఱకు ఐనను కారణము ఐ ఉండ వచ్చును అని మథురబాబును రాణి రాస్మణియు అనుకొనిరి. సహజ జీవితమును కొన్నాళ్లు గడపునేని అతని నరాల బిగువు కొంత సడల వచ్చును. అని తలంచి, వారు చెడుదారులలో పేరు పొందిన యిరువురు స్త్రీలతో కుట్ర పన్నిరి. ఆ స్త్రీలు శ్రీరామకృష్ణుని గదిలో ప్రవేశింపగానే, ఆయనకు వారిలో లోకమాతృస్వరూపమే కన్పట్టెను. మాతృనామమును ఉచ్చరించుచు ఆయన సమాధినిమగ్నుడు అయ్యెను.

## హాలధారి

1858 లో శ్రీరామకృష్ణుని బంధువులలో హాలధారి అను ఒకడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. అతడు అచ్చట ఎనిమిది ఏండ్ల కాలము ఉండెను. శ్రీరామకృష్ణునికి ఆరోగ్యము చెడి ఉన్నందున మథురబాబు హాలధారిని కాళిగుడిలో పూజారిగ నియమించెను. అతని శీలము వ్యామిశ్రము ఐనది. శాస్త్రాలను బాగుగా చదివి ఉన్నాడు గాని, వాని అంతరార్థమును అతడు ఎఱుగడు. మత శాస్త్ర విషయికములు ఐన సూక్ష్మసూక్ష్మాంశములను గూర్చి చర్చలు చేయుట అతనికి ప్రియము. తన పాండిత్యమునే కొలగఱ్ఱగా

కాని అతడు శ్రీరామకృష్ణుని కొలత వేయ జొచ్చెను. తాను బ్రాహ్మణుడు, సనాతనాచారనిష్ఠుడు, కావున శ్రీరామకృష్ణుడు ఆచారవిరుద్ధముగ చేయుచున్నవానిని అతడు అంగీకరింప లేదు. కాని శ్రీరామకృష్ణుని పవిత్ర జీవితమును, ఉత్కట భగవద్ భక్తియు సాక్షాత్కారతృష్ణయు అతని మనసునకు ఎక్కక పోలేదు.

ఒకనాడు హలధారి 'మానవుల మనస్సులు దేవుని ఎఱుగ లేవు' అనెను. ఆ మాట శ్రీరామకృష్ణుని చీకాకు పఱచెను. అతనికి గొప్ప సందిగ్ధ దశ కలిగినది. ఎన్నో దివ్యదర్శనములను తాను జూచెను గదా, అన్నిటను నిజముగ తాను మోసపోయినవాడేనా అని అతడు అనుమానింప సాగెను. ఆ పరిస్థితిని శ్రీరామకృష్ణుడే ఇట్లు వర్ణించెను. "వెక్కి వెక్కి ఏడ్చుచు, 'నేను అవివేకిని ఐనంత మాత్రమున, నన్ను ఇట్లు మోసగించుటకు నీకు మనసు ఎట్లు వచ్చినది' అని దేవిని వేడితిని. కన్నీరు ఎడతెంపు లేని ధారగ కాఱినది. కొంతసేపటికి నేలనుండి కొంత పొగ మంచు పైకి వచ్చుచు ఉన్నట్లు అగపడెను. ఆ మంచుతో నా యెదుటి ప్రదేశము ఎల్ల నిండి పోయినది. దాని నడుమ దాడి యెదిగిన ముఖము ఒకటి కాన నైనది. అది అందముగ ఉండెను, ప్రశాంతముగ ఉండెను, హృదయములోని భావాలను మిక్కిలి సూచించునదిగా ఉండెను. ఆ మోము దృష్టి నాపై నిలిపి గంభీరముగా 'భావముఖమున (=ద్వంద్వా తీతజ్ఞానద్వారమున) నిలిచి ఉండుము'' అని ముమ్మాఱు పలికి ఆ మంచులో క్రమముగ మఱుగుపడెను. ఆ మంచు కప్పు కూడ విరిసి పోయెను. ఆ దృశ్యము నా నమ్మకమును గట్టిపఱచినది.

శ్రీరామకృష్ణుని అనారోగ్యమును గూర్చియు, ఐహిక జీవిత మందలి అతని నిరాదరమును గూర్చియు, అతని వివిధ విపరీత చేష్ట లను గూర్చియు వార్త, అందించువారి వక్కణములో మార్పులకును తీర్పులకును లోనై, కామార్పుకురునకు అందెను. దానిని విన్నంతనే పాపము అతని తల్లి హృదయము మిక్కుట మైన సంతాపముతో

నిండిపోయెను. ఆమె పెక్కుమాఱులు కోరగా, వాతావరణములో మార్పు కలుగుట తనకును మంచిదే అనుకొని, శ్రీరామకృష్ణుడు గ్రామమునకు మరలి వచ్చెను. కాని చిన్న నాటి మిత్రులు ఇప్పుడు అతనికి నచ్చరైరి. ఒకానొక దివ్య జ్వరము అతనిని గ్రసించుచు ఉండినది. రాత్రింబగళ్లలో అధిక కాలము అతడు అచ్చట శ్మశానములలో ఒకదానిలో ధ్యానములో గడపుచు ఉండెను. మానవ శరీరము క్షణభంగురము అను విషయమును ఆ శ్మశానము తలంపించుచుండెను. సంహారకారిణి ఐన కాళినిగూడ, ఆ శ్మశానము సదా తలంపునకు దెచ్చుచు ఉండెను.

## వివాహమును, అనంతరచరిత్రమును

ఐనను కొన్ని నెలలకు అతని ఆరోగ్యము కొంచెము బాగుపడిన గుర్తులు కనిపించినవి. సహజమైన ఉత్సాహోల్లాసము కొంత వఱకు మరల కలిగినది. దానిని గని సంతసించి, తల్లి అతనికి పెండ్లియేర్పాటు చేయుటకు అదే మంచి అదను అని అనుకొన్నది. అతనికి అప్పుడు వయస్సు ఇరువదిమూడు ఏండ్లు. అతనికి భార్య ఒకతె ఉండునేని, ఆమె అతనిని లౌకిక జీవితమునకు మరల్పగలదు. తల్లి చేసిన సూచనను అతడు ఆదరించెను, అందులకు ఆమె ఆనందించెను. అది దైవనిర్ణయము అని అతడు ఎంచినట్లు ఉన్నది. తనకు పత్ని కానున్న కన్య ఉండు తావును గూడ శ్రీరామకృష్ణుడే తెలిపెను.

శారదామణి, పొరుగున ఉన్న జయరామవాటి గ్రామమున ఉండెను. అప్పటికి ఆమె చాల చిన్నది. వయస్సు ఐదు సంవత్సరములే. ఆ పసి ప్రాయమందు గూడ ఆమె తన శీలమును జాజిపూవు వలె స్వచ్ఛమైనదానినిగాను పరిమళవంత(ము = అనుభవయోగ్య)మైనదానినిగాను చేయుము అని దేవుని ప్రార్థించెడిది. నిండు చందురుని జూచినప్పుడు ఆమె "ఓ పరమేశ్వరా, చంద్రునిలో గూడ మచ్చలు ఉన్నవి. నా శీలమును అట్లు కాక నిష్కళంకముగ ఉండు

నట్లు చేయుము'' అని వేడుకొనుచుండును. అట్టి ఆమె శ్రీరామకృష్ణునకు పత్నిగ వరింపబడినది.

వివాహము యథావిధిగ జరిగినది. భారతదేశమున అట్టి బాల్యవివాహము ఇంచుమించు నిశ్చితార్థము (బిట్రోతల్) వంటిది. కన్య ఋతుమతి ఐనప్పుడు కాని పెండ్లికి సిద్ధి లేదు. ఆ పరిపూర్తి శారదారామకృష్ణుల వివాహమునకు కలుగనే లేదు. శ్రీరామకృష్ణుడు కామార్పుకురులో దాదాపు పదునెనిమిది నెలలు ఉండి దక్షిణేశ్వరమునకు తిరిగి వచ్చి చేరెను.

కాళిగుడి ఆవరణములో అడుగు పెట్టినాడో లేదో, మునుపటి సుడిగాలిలో మరల తగుల్కొనెను. మునుపటి ఉన్మాదము పదింతలుగ మరల వచ్చినది, ఆ ధ్యానమే, ఆ ప్రార్థనయే, ఆ భావోద్రేకములే, ఆ మంటలే, ఆ యేడుపే, ఆ నిర్నిద్రతయే, ఒడలి యెడను బాహ్య జగత్తుపైని ఆ నిరాదరమే, ఆ దివ్య భ్రాంతియే! కామము లోభము అను రెండును ఆధ్యాత్మిక పురోగతికి గొప్ప అడ్డంకులు కావున వానిని నిర్మూలించుటకై అతడు నూత్న తపఃక్రమములను అనుష్ఠించెను. ఒకచేత ఒకరూప్యమును, వేఱు ఒక చేత పిడికెడు మట్టిని పట్టుకొని, పరమాత్మప్రాప్తిసాధనములో ఆ రెంటి తారతమ్యమును గూర్చి ఆలోచించి, పనికిరానితనమున రెండును సమానములే అని కనుగొని, రెండింటియెడను సమానము ఐన నిరాదరముతో, రెండింటిని, విసరి, గంగలో పడవేయును. మహిళలు అందఱును లోకమాతృస్వరూపిణులు అని అతడు భావించెను. కలలో నైన, అతడు కామవశుడు కాలేదు. తాను బ్రాహ్మణుడను అను అహంకారమును తన మది నుండి నిర్మూలించుటకై అతడు దీర్ఘములును అసంస్కృతములును ఐన తన శిరోజములచేత, ఒక మాలవాని గుడిసెను ఊడ్చి శుభ్రపఱచెను. ధ్యానసమాధిలో ఆయన ఉన్నప్పుడు, పక్షులు ఆయన తలపై వ్రాలి గింజలు ఏవి ఐన దొరకును అని తమ ముక్కులతో వెంట్రుకలలో పొడుచుచుండెడివి. సర్పములు ఆయన

మేనిపై పారాడెడివి. పారాడెడివి పాములు అని ఆయన ఎఱుగడు, తాము ఒక సమాధినిష్ఠునిపై పారాడుచుంటిమి అని ఆ పాములును ఎఱుగవు. నిద్ర అతనిని పూర్తిగా వీడినది. రాత్రింబగళ్లు అప్రాకృత దృశ్యములు అతని యెదుట కాన నయ్యెడివి. మునుపు తన లోని 'పాపి'ని చంపిన సన్న్యాసి మరల తన ఒడలినుండి వెలువడి త్రిశూలము మును జూపి, తన్ను బెదరించి, "దేవుని నిశ్చలముగ ధ్యానింపుము" అని ఆదేశించినట్లు అతనికి చూపట్టెడిది. లేదా, ఆ సన్న్యాసియే జ్యోతిర్మార్గమున దూరప్రాంతములందు సంచరించి, అచటి సంభవాలను గూర్చిన వార్తను అతనికి దెలుపును. ప్రవృద్ధభక్తిమంతులకు వారి మనస్సే సచేతనముగను ప్రత్యక్షరూపముననుు సంచరించుచు గురుకృత్యము ఒనర్చును అని శ్రీరామకృష్ణుడే అనంతర కాలమున చెప్పుచుండెను.

ఆ దేవాలయారామములకు ప్రతిష్ఠాత్రి యైన రాణి రాస్మణి 1861 లో మరణించెను. ఆమెకు అనంతరము అల్లుడు మధురానాథుడు ఒక్కడే సర్వనిర్వాహకుడు అయ్యెను. అతడు తన్ను, తన సంపదను శ్రీరామకృష్ణుని వశమందు ఉంచి, అతని మేనికి ఉపచారములు చేయ ఆరంభించెను. జగజ్జనని నియమానుసారము తనకు వలసిన సామగ్రి అంతయు సరఫరా చేయుచు ఉండిన ఏవురలో అతడు ఒకడు అని శ్రీరామకృష్ణుడు తర్వాతికాలమున చెప్పెను. అతని మనసులో ఏ కోరిక కలిగినను దానిని మధురబాబు ఇంచుకేని వెనుదీయక నెఱవేర్చుచు ఉండెను.

## బ్రాహ్మణి

ఆ సమయమున దక్షిణేశ్వరమునకు ఒక బ్రాహ్మణ మహిళ అరుదెంచెను, శ్రీరామకృష్ణుని ఆధ్యాత్మిక వికసనమునకు ఆమె ముఖ్యముగ తోడ్పడ నున్నది. ఆమె తూర్పువంగదేశమున జన్మించినది. తాంత్రిక వైష్ణ వారాధన పద్ధతులలో ఆమె మిక్కిలి నిపుణురాలు. ఆమెకు వయసు ఏబది యేండ్లు దాటినది. ఆమె రూపము

సుందరము ఐనది. వేషము హిందూ సన్న్యాసినులకు ఉచితము ఐన కాషాయాంబర ధారణము. రెండు కట్టు బట్టలు, కొన్ని పుస్తకాలు, తప్ప ఆమెకు వేఱు ఆస్తి పాస్తులు లేవు.

శ్రీరామకృష్ణుడు ఆమెను మిక్కిలి గౌరవించెను. తన అనుభవాలను సాక్షాత్కారములను ఆమెకు వర్ణించి చెప్పెను. వానిని అన్నిటిని ఉన్మాదలక్షణములుగ లోకులు అనుకొనుచు ఉన్నారు అనియు తెలిపెను. హెచ్చరికతో విని ఆమె "వత్సా, ఈ లోకమున అందఱును పిచ్చివారే. కొందఱకు డబ్బుపిచ్చి, కొందఱకు భోగముల పిచ్చి, కొందఱకు పేరుప్రతిష్ఠల మీద పిచ్చి, నీకు దేవుని పిచ్చి" అనెను, అతడు అనుభవించుచు ఉండిన అత్యుదాత్త దివ్యప్రేమోన్మాదము ఆధ్యాత్మికానుభవములలో అరుదు ఐనది అనియు, శాస్త్రగ్రంథములు దానిని మహాభావము అని పేర్కొన్నవి అనియు తెలిపి ఆమె అతని సందేహమును తీర్చెను. ఆ మహాభావమునకు కన్నీరు, ఒడలి వణకు, గగుర్పాటు, చెమరు, తాపము మున్నగు పందొమ్మిది బాహ్యలక్షణములు కలవు అని ఆమె ఆయనకు తెలిపెను. భక్తిశాస్త్రగ్రంథములలో ఈ మహాభావానుభవమునకు లక్ష్యములుగా ఇద్దఱే పేర్కొనబడి ఉన్నారు — శ్రీరాధయు, శ్రీచైతన్యుడును.

అచిరకాలములోనే బ్రాహ్మణికిని శ్రీరామకృష్ణునకును గాఢ బాంధవ్యము ఏర్పడెను. ఆమెకు అతడు బాలకృష్ణుడు, ఆయనకు ఆమె తల్లి. ధ్యాన కీర్తన వేళలలో అతని ఉద్రేకమును సమాధిని తృష్ణోన్మాదమును ఆమె ప్రతిదినమును హెచ్చరికతో చూచెను. ఆధ్యాత్మికశక్తిని ఇతరులకు సంక్రమింప జేయు మహిమ గూడ అతని యందు ఉన్నది అని ఆమె గుర్తించెను. అట్టివి సామాన్య భక్తులకు గాని, ఎంత పెంపు ఒందిన ఆత్మలకు గాని సాధ్యములు కావు అని ఆమె నిశ్చయించుకొనెను. ఆత్మశక్తిని అంతగ ఆవిష్కరించుట అవతారపురుషునకు మాత్రమే సాధ్యము. శ్రీచైతన్యునివలె శ్రీరామకృష్ణుడును దివ్యావతారమూర్తి అని ఆమె చాటి చెప్పెను.

బ్రాహ్మణి మాటను శ్రీరామకృష్ణుడు మథురానాథునకు తెలిపెను. అతడు నమ్మ లేదు. అరుదు ఐన ఆత్మశక్తులు శ్రీరామకృష్ణునొద్ద ఉన్నవి కాని, అతడు శ్రీరామునకును శ్రీకృష్ణునకును బుద్ధునకును చైతన్యునకును సాటి అవతారపురుషుడు అని అంగీకరించుటకు మథుర బాబు ఇష్టపడలేదు. అంతట తనతో ఆ విషయమును చర్చించుటకై పండితుల పరిషత్తును ఒకదానిని సమావేశపఱుపుము అని ఆమె మథురానాథుని అడిగెను. అతడు అంగీకరించెను. పరిషత్సమావేశమునకు ఏర్పాట్లు ఐనవి. కాళిగుడికి ఎదుట నాట్యమందిరము[ముఖమండపము]న ఆ సమావేశము జరుగ వలసి ఉండెను.

వైష్ణవసంఘనాయకుడు ఐన వైష్ణవచరణుడు, గౌరి అను ఇరువురును ఆ కాలమున సుప్రసిద్ధులు ఐన పండితులు. వారికి ఇరువురికిని ఆహ్వానములు అందినవి. వైష్ణవచరణుడు మొదట వచ్చెను. పేరు పొందిన విద్వద్వ్యక్తులు అనేకులు అతనిని పరివేష్టించి వచ్చిరి. కొడుకు గొప్పతనమునకు గర్వించు తల్లివలె బ్రాహ్మణి తన అభిప్రాయమును ప్రతిపాదించి అందులకు వేదశాస్త్ర ప్రమాణములను ఉపన్యసించెను. అగాధము ఐన ఈ మత శాస్త్ర సమస్యను పండితులు చర్చించుచు ఉన్నప్పుడు అక్కడ జరుగుచు ఉన్న దేనిని గాని ఇంచుకేని లక్ష్యపెట్టక శ్రీరామకృష్ణుడు ఒక శిశువువలె వారి నడుమ కూర్చుండెను. తన తలంపులలో తాను మునిగి ఉండెను. అప్పుడప్పుడు నవ్వుచు ఉండెను, అప్పు డప్పుడు సంచి నుండి ఘాటు పరిమళ వస్తువును త్రుంచి నమలుచుండెను. అప్పు డప్పుడు సైగచేసి వైష్ణవచరణుని పిలిచి "ఇటు చూడుడు, అప్పు డప్పుడు నేనును ఆలాగు అనుకొనుచుందును" అని అనుచుండెను. వెంటనే వైష్ణవచరణుడు లేచి బ్రాహ్మణి ప్రతిపాదనతో తాను పూర్తిగ ఏకీభవించుచు ఉన్నాను అని చెప్పెను. శ్రీరామకృష్ణుడు అనుభవించినది మహాభావమే అనియు, దేవుడు అతనిలో రూపు ఒంది ఉన్నాడు అనుటకు యథార్థ లక్షణము-అదియే అనియు అతడు చెప్పెను. అచ్చట కూడిన ప్రజలు, ముఖ్యముగా ఆ దేవస్థానాధికారులు అచ్చెరువుచే నోరు

కదల్పలేకైరి. ఒకబాలునివలె శ్రీరామకృష్ణుడు మథురానాథునితో "చూడుము ఆయనకూడ అట్లే అనుచున్నాడు. నన్ను బాధించుచు ఉండినది వ్యాధి కాదు అని తెలిసికొంటిని, సంతోషము" అనెను.

కొన్నాళ్ల పిదప గౌరీపండితుడు ఏతెంచెను. పండితపరిషత్తు మరల సమావేశము ఐనది. గౌరీపండితుడును బ్రాహ్మణియభిప్రాయముతోను వైష్ణవచరణునియభిప్రాయముతోను ఏకీభవించెను. "నేను అవతారపురుషుడను అని వైష్ణవచరణులవారు చెప్పినారు" అని శ్రీరామకృష్ణుడు గౌరీపండితునితో అనెను. అందులకు ఆయన "నిన్ను గూర్చి ఆయన చెప్పగలది ఇంతేనా? ఇంతే అగుచో, ఆయన చాల కొంచెమే చెప్పినాడు. ఏ ఆధ్యాత్మిక శక్తినిధి నుండి ఒక లేశము అప్పు డప్పుడు అవతారమూర్తిగ భువికి అవతరించునో, ఆ నిధివి నీవే అని నా గట్టి నమ్మకము' అనెను.

శ్రీరామకృష్ణుడు నవ్వుచు "అహో! ఈ విషయమున నీవు వైష్ణవచరణుని చాల మించితివే! నాలో ఏమి ఉన్నది? దేనిని చూచి నీవు అట్లు అనుకొంటివి?" అని అడిగెను.

"నా అంతరాత్మ నాకు అట్లు చెప్పినది. నేను అనుకొన్న దానికి వేదప్రమాణములును గలవు. ఆక్షేపకుల యెదుట నా సిద్ధాంతమును రుజువు చేయుటకు నేను సిద్ధముగా ఉన్నాను." అని గౌరి అనెను.

శ్రీరామకృష్ణుడు "సరి, నీవు అట్లు అను చున్నావు. నాకు అది ఏమియు తెలియదు అని నేను అనుచున్నాను. నమ్ముము" అని పలికెను.

ఇట్లు ఒక వెఱ్ఱి పూజారిని మహాపండితసదస్సు భగవదవతారము అని చాటి చెప్పినది. అతనికి కలిగిన దర్శనములు, తలలోని మిక్కుటంపు ఉడుకుచేత కలిగినవి కావు. ఆధ్యాత్మిక చరిత్రలో వానికి పూర్వరూపములు (ప్రీసీడెంట్సు) కలవు. పరిషత్సిద్ధాంతముచే శ్రీరామకృష్ణునిలో ఏమి మార్పు కలిగినది? పుట్టినప్పటినుండి

ఉన్నట్లే ఇప్పుడును లోకజననికి తాను ఒక అమాయిక శిశువుగ ఉండెను. కొన్ని యేండ్ల పిదప శ్రీరామకృష్ణుని శిష్యులలో గృహస్థులు ఇద్దఱు తమ గురువు దివ్యావతారపురుషుడు అని చెప్పిరి అని శ్రీరామకృష్ణుడు వక్రోక్తినైపుణితో "అవతారపురుషుడను అన్నంత మాత్రాన నా ప్రతిష్ఠ హెచ్చును అనియా వారి తలంపు? వారిలో ఒకడు రంగముపై అభినయించు నట్టువు, రెండవ వాడు వైద్యుడు. అవతారాలను గుఱించి వారికి ఏమి తెలియును? కొన్ని సంవత్సరములకు మునుపు 'గౌరి' 'వైష్ణవచరణు'ల వంటి పండితులు నన్ను అవతారపురుషుడు అన్నారు. వారు గొప్ప పండితులు. తాము ఏమి చెప్పినదియు వారు ఎఱుగుదురు. అయినను వారి సిద్ధాంతమువలన నా మనస్సులో ఎట్టి మార్పును కలుగ లేదు" అని చెప్పినాడు.

శ్రీరామకృష్ణుడు బ్రతికి నన్నాళ్లు క్రొత్త సంగతులను నేర్చుకొనుచు ఉండెను. 'మిత్రమా, ఎంత కాలము బ్రతికిన, అంత నేర్చుకొందును' అను సామెతను ఆయన శిష్యుల యెదుట తఱచు ఉదాహరించుచు ఉండెను. బ్రాహ్మణి, తన సిద్ధాంతమును ప్రకటించినపుడు కలిగిన భావోద్రేకము తగ్గిన వెంటనే, అతడు తాంత్రిక వైష్ణవశాస్త్రగ్రంథములలో ప్రతిపాదింపబడిన సనాతనమార్గములలో తపఃక్రమముల అనుష్ఠింప బూనుకొనెను. ఇంతవఱకును అతడు తన మనస్సును హృదయమును చెప్పినట్టి ఆధ్యాత్మిక లక్ష్యములనే అనుసరించుచు ఉండెను. ఇప్పుడు బ్రాహ్మణిని గురువుగ ఆశ్రయించి పూర్వులచే క్షుణ్ణములైన రాచబాటలలో అడుగు ఇడెను.

## తంత్రశాస్త్రము

చిత్తు పరతత్త్వము అనియు, చిత్తును సత్తును ఆనందమును అభిన్నములు అనియు, — తంత్రశాస్త్రము చెప్పుచున్నది. ఈ సచ్చిదానంద పరతత్త్వమును వేద ప్రతిపాదిత పరతత్త్వమును అభిన్నములే. జీవుడును ఆ పరతత్త్వముకంటె అభిన్నుడే. అయినను మాయకును అజ్ఞానమున

కును వశుడై మానవుడు స్వస్వరూపమును విస్మరించెను. వట్టి బూటకము ఐన ఈ స్థూల సూక్ష్మ జగత్తు యథార్థము అని అతడు భ్రమించును. అతని దాస్యమునకును దుఃఖమునకును కారణము ఈ భ్రాంతియే. విస్మృతము ఐన జీవబ్రహ్మైక్యమును మరల కనుగొనుటే అన్ని తపస్సులకు లక్ష్యము. ఈ లక్ష్యసిద్ధికి వేదాంతము చూపు మార్గము కఠినము ఐనది. ఇది కాదు అది కూడదు అను సారాసారవివేకమును, త్యాగమును, వేదాంతము విధించుచున్నది. కావున అది చుఱుకు ఐన బుద్ధియు అప్రకంప్యము ఐన స్థైర్యమును కల వారు మాత్రమే అనుసరింపగల దారి. మఱి తంత్రము అంటిమా, మానవుల సహజదోషాలను అనుదాత్తములు ఐన తృష్ణలను శబ్దాది విషయప్రీతిని — గుర్తించును. వేదాంతములో కొంత క్రతు కలాపమును, ధ్యానములో కొన్ని కర్మలను, త్యాగములో కొంత అనుభవమును మేళవించును. పరతత్త్వమునకును తనకును గల అభేదమును మనసునకు తెచ్చుకొనుటకై సాధకుని మెట్టుమెట్టుగా సిద్ధపఱుప వలెను అనుట ఇందలి నిగూఢాశయము.

సామాన్య మానవుడు లోకములోని వివిధవస్తువులను అనుభవింప గోరును. "తప్పక అనుభవింపుము, కాని ప్రతివస్తువులోను దేవుడు ఉన్నాడు అనుటను గుర్తింపుము" అని తంత్రము ఉపదేశించును. అది విధించు కర్మలచేత, శబ్దాదివిషయములు ఆత్మాధిష్ఠితములై, ఇంద్రియతృష్ణ భగవద్భక్తిగా పరిణమించును. ఇచ్చట బంధనసాధనాలే బంధవిమోచనసాధనాలుగ మార్పు ఒందుచు ఉన్నవి. కాలకూటమే జీవితామృతముగ పరిణమించుచున్నది. బాహ్యత్యాగము ఆవశ్యకము కాదు. కావున భోగము(=సుఖానుభవము)ను యోగము(=పరమాత్మతోడిసంశ్లేషము)గా మార్చుటే తంత్రశాస్త్ర లక్ష్యము. దాని ప్రకారము నామరూపాత్మకము ఐన ఈ జగత్తు శివునియొక్కయు శక్తియొక్కయు లీలయే. శివుడే ద్వంద్వాతిరిక్తము ఐన తత్త్వము, పార్వతి అందు నిగూఢమై ఉన్న శక్తి.

సాధకుల అంతస్తులకు తగినట్లుగా తాంత్రికసాధనలలో మెట్లు కలవు. పశుభావన వీరభావన దివ్యభావన అను మూడు భావనలతో గూడిన వారికి సాధనాక్రమాలు దీనిలో విహితములు ఐ ఉన్నవి. కొన్ని క్రియలు జరుపునప్పుడు స్త్రీలు ప్రక్కనే ఉండ వలెను. అప్పుడు సాధకుడు స్త్రీని విశ్వజనని ఐన కాళికాదేవి యొక్క ప్రత్యక్ష రూపముగ భావింప నేర్చుకొనును. దేవునిలోని మాతృత్వమును మహిళారాధనమును అను ఇవి తంత్రశాస్త్రమున మూల విషయములు. స్త్రీల అవయవాలలో ఒక్కొక్కటియు రూపు దాల్చిన దివ్యత్వమే అని తలంపవలెను. అయినను ఈ క్రియలు సాపాయములు, సదాచార్య సాహాయ్యము అనివార్యము, సాధకునకు జాగరూకత లేనిచో, అతడు పట్టు ఊడి పాప గర్తమున కూలును.

శక్తియే విశ్వసృష్టిని చులుకుగ నిర్వర్తించును అని తంత్ర శాస్త్రము తెలుపు చున్నది. ద్వంద్వాతీతుడు ఐన శివుడు ఇంచు మించు నిర్వ్యాపార తత్త్వమే. మఱియును, దాహశక్తికిని అగ్నికిని వేఱుపాటు లేనట్లే, శక్తికిని శివునకును గూడ వేఱుపాటు లేదు. ఈ సమస్తవిశ్వమును శక్తిగర్భమున ఉన్నది. కావున శక్తియే విశ్వజనని. మహిళలు అందఱును అమ్మవారి చిహ్నములే, ఆమె రూపములు పెక్కులు. అందు కాళీరూపమును ఒకటి. సృష్టికర్త్రి ఐన కాళిని ధ్యానించుటే, తంత్రశాస్త్రమందలి ప్రధాన తపఃక్రమము. ధ్యానించుచు ఉన్నప్పుడు సాధకుడు మొదట పరమాత్మనుండి తాను అభిన్నుడు అని ఎంచును. తర్వాత ఆ నిర్గుణ తత్త్వము నుండి రెండు తత్త్వములు వెలువడినట్లు భావించును. అందు ఒకటి తానే. రెండవది కాళీదేవియొక్క సచేతనము అగు రూపము. అంత అతడు ఆ దేవిని ఎట్ట యెదుటి విగ్రహమున సంక్రమింపజేసి దానినే విశ్వజననిగా ఆరాధించును.

శ్రీరామకృష్ణుడు తంత్ర ప్రోక్త తపఃక్రమముల అనుష్ఠింప బూనుకొనెను. విశ్వజనని నియమానుసారము అతడు బ్రాహ్మణిని

గురువుగా వరించెను. దేవాలయ ప్రాకారమున ఉత్తరపువైపు, పంచవటిలో బిల్వవృక్షముక్రింద అతడు సూక్ష్మ గంభీర తపఃక్రియలను ఆచరించెను. తంత్ర శాస్త్ర గ్రంథాలు అఱువదినాలుగింటిలో విహితములై ఉన్న క్రమములను అన్నిటిని అతడు సాధన చేసెను. ఒక్కొక్కదానిలోను, చెప్పబడిన సిద్ధిని ఒందుటకు అతనికి మూడు దినాలకంటె ఎక్కువ కాలము ఎప్పుడును పట్టలేదు. ప్రారంభ క్రియలు ముగియగానే, అతనిని ఒక దివ్యౌత్సుక్యము పైకొనెడిది, అంతట సమాధి. సమాధిదశలో అతని మనసు ఆ దివ్యతత్త్వమున లీనమై ఉండెడిది. అతని దృక్పథమున పాపము అనునది అంతరించెను. ''ఐహికము'' అను పదము అతనికి అర్థరహితము అయ్యెను. ఈ సర్వజగత్తును, అందలి ప్రతివస్తువును, శక్తియొక్కయు శివుని యొక్కయు లీలగా అతనికి పొడకట్టెను. మాతృశక్తియు మాతృ సౌందర్యమునే సర్వత్ర ప్రకటము అగుచు అతనికి అగపడెను. చేతనా చేతనాత్మకము అగు విశ్వము చిదానందమయముగ అతనికి గోచరించెను.

జగత్తునకు ఆదికారణము ఉజ్జ్వల మహా త్రికోణ రూపమున అతని యెనుట కనబడెను. ఆ త్రికోణమునుండి అనుక్షణమును అనంత శబ్దజాలము వెలువడుచుండెను. అనాహత శబ్దము, ప్రణవము అతని చెవిని బడెను. విశ్వములో తక్కిన శబ్దములు అన్నియు ఆ ఓంకార పరిణామములే. యోగమువలన గలుగునవి ఐన అష్ట సిద్ధులును అతనికి గలిగినవి. ఆ సిద్ధులు కలిగిన యెడల, మానవుడు ఇంచుమించు సర్వశక్తి అగును. కాని ఆ సిద్ధులకు ఆధ్యాత్మికముగ ఎట్టి విలువయును లేదు, కావున శ్రీరామకృష్ణుడు వానిని తిరస్కరించెను. మాయ అనం బరగుచు, భగవంతునియందు నిగూఢమై ఉండి, సృష్టి స్థితి సంహారములు నిర్వర్తించు శక్తి అతనికి ప్రత్యక్షము అయ్యెను. అతడు చూచుచు ఉండగనే భువనమోహనసౌందర్యవతి ఒకర్తె గంగలో నుండి వెలువడెను. ఆసన్నప్రసవ ఐన ఆమె పంచవటిని దరిసి అట ఒక్క శిశువును గని, మహాప్రేమతో దానిని

సంరక్షించుచుండెను. మఱుక్షణముననే ఆమె కరాళరూపిణియై ఆ శిశువును తన నోట వైచుకొని, భీషణదంతములచే పటపట కొఱికి, మ్రింగివేసి, మరల గంగలో ప్రవేశించెను.

ఈ కాలమున శ్రీరామకృష్ణునకు గలిగిన అనుభూతులలో చాల ముఖ్యము ఐనది కుండలినీ శక్త్యున్మీలనము, మొట్టమొదట వెన్నెముకకు అడుగున ఆ కుండలిని నిద్రించుచు ఉండుటయు, తరువాత అది మేలుకాంచి, షట్కమలములగుండ నిగూఢము ఐన సుషుమ్నా మార్గమున లేచి, శిర మందలి కమలమును అంటుటయు – అతనికి ప్రత్యక్షముగ అగపడెను. ఆ కుండలిని ఉద్గమించినప్పుడు వివిధ కమలములకును గలిగిన వికాసమునుగూడ అతడు గుర్తించెను. అటు పిమ్మట సమాధి దశలును దివ్యదర్శనములును గలిగినవి. కుండలిని నడకలో ఉన్న జలచర – ఖగ – వాన రాది నానా రీతులను అనంతర కాలమున శ్రీరామకృష్ణుడు శిష్యులకును భక్తులకును వర్ణించి చెప్పి ఉన్నాడు. కుండలినీశక్తి మేలుకొనుటతో ఆత్మపరిజ్ఞానము గలిగినది. (కుండలినీశక్తికి శివునితో సహస్రారమున కలయిక కలిగినప్పుడు సమాధిదశ గలుగును.) తాంత్రిక తపఃక్రమములకు అన్నిటికిని అదే పరమావధి.

ఇంచుమించు ఈ కాలముననే, పెక్కురు భక్తులు అతనిని గురువుగ ఆశ్రయింప నున్నారు అను విషయము అతనికి ప్రకటితము అయ్యెను.

## వైష్ణవసాధనలు

తాంత్రికసాధనలు ముగిసిన వెంటనే, శ్రీరామకృష్ణుడు, బ్రాహ్మణీదర్శితమార్గుడై, వైష్ణవసాధనలను అనుష్ఠించెను. వైష్ణవులు విష్ణువును ఆరాధించువారు. విష్ణువు సర్వవ్యాపి, దేవదేవుడు. హరి అనియు, నారాయణుడు అనియును గూడ ఆ దేవునకు ప్రసిద్ధి కలదు. ఆ స్వామి ఎన్నియో అవతారములు ఎత్తినను అందు

రామావతారమును ఉపాసించువారి సంఖ్యయు, కృష్ణావతారమును ఉపాసించువారి సంఖ్యయునే చాల ఎక్కువ.

వైష్ణవమతము పూర్తిగా భక్తిమతమే. భక్తి అనగా దేవునందు అనన్యమును ఉత్కటమును ఐన ప్రేమ. అది ఆనందమయము. ఆ భక్తి, భక్తునకు విముక్తిని శాశ్వతత్వమును ఒసంగును. తర్కము చేతను యుక్తిచేతను దేవుని బడయ లేము అనియు, తపములును వ్రతములును నియమములును, భక్తి లేనిచో వ్యర్థములే అనియు – వైష్ణవసిద్ధాంతము తెలుపుచున్నది. దేవుని పొంద వలెను అనిన, అందులకుగా మానవుడు చేయు యత్నము మాత్రమే చాలి ఉండదు. దేవుని అనుగ్రహము మిక్కిలి ఆవశ్యకము. దేవుని అనుగ్రహము పవిత్రులు ఐన వారి హృదయాలకే ఎఱుకవడును. భక్తియే మన శ్శుద్ధికి సాధనము. పవిత్రహృదయము సదా భగవదనుభవోద్రేకమున నిమగ్నమై ఉండును. ఇట్టి దివ్యభక్తిని అలవఱచుకొని పెంపొందించుకొనుటే వైష్ణవ సిద్ధాంత సారము.

తామసము రాజసము సాత్త్వికము అని భక్తిలో, విధ్యుక్త భేదములు మూడు గలవు. పగ, అహంకారము, ఈర్ష్య, కోపము – మున్నగువానిచే ప్రేరితుడై ఒకడు భక్తి సలుపు నేని, ఆ భక్తి, తామసము. ఏల యన అందు తమోగుణప్రభావము ఉన్నది. తమస్సు అనగా, వెలుగును చలనమును లేని గుణము. సంపద కోరియో, కీర్తి కోరియో, వేఱు ప్రాపంచికాభిలాషలతోనో, ఒకడు భక్తి సలుపు నేని, ఆ భక్తి రాజసము. ఏల యన అందు రజోగుణ ప్రభావము ఉన్నది. రజస్సు, కార్య నిర్వహణాభిలాషా రూపము ఐన గుణము. లౌకిక లాభాపేక్ష సుంత ఐనను లేక, తన కర్తవ్యములను అన్నిటిని భగవన్ముఖోల్లాసమునకై నిర్వర్తించుచు, సర్వభూత సుహృద్భావము గలిగి, ఒకడు భక్తి సలుపు నేని, ఆ భక్తి సాత్త్వికము. ఏల యన అందు సత్త్వ గుణ ప్రభావము ఉన్నది. సత్త్వము సామరస్యాత్మక గుణము. మఱి ఉత్తమోత్తమము ఐన

భక్తి అన్ననో త్రిగుణాతీతము ఐనది. అది సర్వాంతర్యామి ఐన సర్వేశ్వరునియందు అవ్యాజమును అవిచ్ఛిన్నమును ఐన ప్రావణ్యము. భగవన్నామమునో గుణమునో విన్నప్పుడే, అట్టి భక్తి యథార్థ భక్తుల డెందములలో ఉప్పొంగును. అట్టి భక్తి గల వాడు, స్వర్గ సౌఖ్యము లభించినను చేకొనడు. మోదము రానీ, ఖేదము రానీ, చావు సంభవింపనీ, బ్రతుకు ఏర్పడనీ, మానము గలుగనీ, అవమానము కలుగనీ — ఎట్టి దశయందును సర్వేశ్వరుని యందలి తన భక్తి చలింపక ఉండ వలెను అనుట ఒక్కటే అతని కోరిక.

భక్తిలో రెండు దశలు ఉన్నవి. మొదటిదానికి 'వైధి' అని పేరు, అనగా శాస్త్రవిధులను అనుసరించెడి భక్తి. ఈ దశ యందలి భక్తులకు నియత సక్రమారాధనయును, జపింప వలసిన మంత్రాలును, ప్రార్థనలును, భగవన్నామ గుణ సంకీర్తనలును విహితములై ఉన్నవి. క్రిందితరగతిది ఐన ఈ భక్తియే కాలక్రమమున పరాభక్తిగా పరిణమించును. పరాభక్తికి ప్రేమ అనియు పేరు. ఆ ప్రేమ ఉత్కటకోటికము, దివ్యము. దివ్యప్రేమ స్వతఃప్రయోజనము. అది సకల మానవుల హృదయము లందును బీజరూపమున ఉన్నది. బద్ధాత్ములు ఆ ప్రేమను లౌకికవిషయములపై చూపుచుందురు.

భక్తులకు భగవంతునందు ఉన్న భక్తిని పెంపొందించుటకు, భగవంతుని మానవీకరించుటే వైష్ణవసిద్ధాంతము అవలంబించు ప్రక్రియ. భక్తుడు దైవమును తండ్రిగనో, స్వామిగనో, మిత్రునిగనో, శిశువుగనో, ప్రియునిగనో, భావింప వలెను. ఈ ఐదు చుట్టరికాలలో మొదటిదానికంటె రెండవదానను, రెండవదానిలోకంటె మూడవదానను, మూడవదానిలోకంటె నాల్గవదానను, నాల్గవదానిలోకంటె ఐదవదానను, ప్రేమ గాఢతరము. ఈ ఐదింటికిని వరుసగా శాంతభావము అనియు, దాస్యభావము అనియు, సఖ్యభావము అనియు, వాత్సల్యభావము అనియు, మధురభావము అనియు పేర్లు. ఈ భావములకు ఉత్తమ లక్ష్యములు వరుసగా, వైదిక

ఋషులు, హనుమంతుడు, బృందావనమందలి గొల్లబాలురు, రామ మాత కౌసల్య, శ్రీకృష్ణుని దయిత రాధిక. ఒక్కొక్క మెట్టు పైకి ఎక్కు కొలదియు, దేవుని పరత్వము క్రమక్రమముగ విస్మృతమై, భక్తునకు భగవత్సంశ్లేషము గాఢతరము అగును. కట్టకడపటి మెట్టున తన్ను తన ప్రియుని వల్లభగా భావించును. అప్పుడు ప్రాప్తకును ప్రాప్యమునకును నడుమ అడ్డము పూర్తిగా తొలగును. ఉన్ముఖము ఐన అట్టి సాధకుని హృదయమును సాంఘిక నైతిక నిబంధనలు ఏవియు ఐహికరంగమునకు కట్టువఱుప లేవు. పరమాత్మతో సమగ్ర సంశ్లేషమును అతడు అనుభవించును. వివిధములు ఐన స్థూల సూక్ష్మ సంబంధములను అన్నిటిని అతిక్రమింప ప్రయత్నించు వేదాంతివలె కాక, వైష్ణవభక్తుడు తన వ్యక్తిత్వమును బ్రహ్మముయొక్క సగుణతను నిల్పుకోగోరును. బ్రహ్మము అతనికి పురుషోత్తముడే కాని, అవ్యక్తమును నిర్గుణమును కాదు.

మధురభావమును సాధనచేయునపుడు భక్తుడు తన్ను స్త్రీగా భావించుకొనును, ఎందుకు అనగా అద్వితీయపురుషోత్తముడైన శ్రీకృష్ణునియందు అతిగాఢప్రేమను వర్ధిల్లజేసికొనుటకు; స్త్రీభావమును పురుషుడును పురుషభావమును స్త్రీయు ఆపాదించుకొన్నప్పుడు గాఢ మానసిక పరిణామములు ఏర్పడును. ఒక భావము పెంపు ఒందునేని, అది ఇతరభావములను మనస్సునుండి తఱిమివేయును అనుట సామాన్యముగా ఎల్లర అనుభవమున ఉన్న విషయమే. ఈ వింత మనస్స్వభావమును క్షుద్రకామములను అణచుటకును ఆత్మపరతను పెంపొందించుటకును ఉపయోగించుకొనవచ్చును. మానవుని కోరికలకును కామములకును మూలాధారము ఏది? మార్చుటకు వీలు కాని మగశరీరము తనకు ఉన్నది అను గట్టి నమ్మకమే. తాను స్త్రీ అను భావమును తనలో నింపుకో గలిగినచో, పురుషశరీరప్రాప్యములైన కోరికలను అతడు సులభముగ విడిచిపెట్టగలడు. ''నేను స్త్రీని'' అను భావము సైతము తొలగి ''స్త్రీని గాను, పురుషుడను గాను; రూపరహితము ఐన ఆత్మను'' అను మఱి ఒక ఉదాత్తతరముఐన భావము

నకు దారి చేయును. రూపరహితబ్రహ్మముతోడి సాయుజ్యమును అనుభవింప, నిజముగ రూపరహితాత్మకే వీలగును. కావున వైష్ణవుని సిద్ధులలో అన్నిటికంటెను పైది, సర్వాతిక్రాంతము ఐన వేదాంతి యనుభూతికి మిక్కిలి సన్నిహితమే అగుచున్నది.

భక్తిమార్గమున వైష్ణవులు చేయు భగవత్సేవ ఎట్టిదో, భాగవతములోని బృందావన చరితమున ప్రకటమగును. బృందావన గోపికలు ఆఱు ఏండ్ల బాలుడైన శ్రీకృష్ణుని తమ ప్రాణవల్లభునిగ భావించిరి. ఆ ప్రేమను వారు స్వార్థమునకు గాని, శరీరసౌఖ్యమునకు గాని, సాధనముగ చేసికొనలేదు. వారు తమ దేహములను మనస్సులను ఆత్మలను శ్రీకృష్ణునకు అర్పించిరి. అందఱ కృష్ణప్రేమ కన్న రాధికకు ఉన్న కృష్ణప్రేమ గాఢతమము. కావున ఆమెకు శ్రీకృష్ణునితో ఆత్యంతిక సాన్నిహిత్యము సిద్ధించినది. మహాభావము ఆమెలో రూపొంది, ఆమెకు ప్రాణవల్లభసాయుజ్యము సిద్ధించినది. ఇంద్రియానుభవరూపమున అగపడుచునే ఇంద్రియాతిగము ఐన అనుభవమునకు రాధామాధవుల సాయుజ్యము లక్ష్యము.

శ్రీచైతన్యునకు గౌరాంగుడు అనియు, గోరా అనియు, నిమ్మాయ్ అనియు నామాంతరములు గలవు. ఆయన వంగదేశమున 1485 లో అవతరించెను. ఆయనయు దేవుని యవతారముగ కొనియాడబడుచున్నాడు. వైష్ణవసిద్ధాంతమున జగదాచార్యులలో ఆయన ఒకడు. గోవిందనామజపమే కలియుగమునందు అమోఘతమము ఐన తపఃక్రమము అని చైతన్యుడు తెలిపినాడు.

తన్ను హనుమంతునిగా భావించుకొనుచు చేయు భగవదుపాసనను శ్రీరామకృష్ణుడు ఇంతకుపూర్వమే చేసి ఉండెను. గుడిలో అమ్మవారిని ఆరాధించుటలో, దేవుని తల్లిగ భావించుటయు నెఱవేఱినది. ఇక అతడు వైష్ణవశాస్త్రగ్రంథవిహితములు ఐన తక్కిన భావములను సాధన చేయవలసి ఉన్నది.

## రా మ లా లా

1864 వ సంవత్సర ప్రాంతమున దేశసంచారి వైష్ణవయోగి ఒకడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. అతని పేరు జటాధారి. శ్రీరాముడు అతనికి ఇష్టదైవము. ఆ దేవుని లోహవిగ్రహమును అతడు పోయిన చోటికెల్ల కొంపోవుచు మహాప్రేమతో రామలాలా (బాలరాముడు) అని పేర్కొనుచు ఉండును. కౌసల్య తన దివ్యసుతుని యెడ చూపుచు ఉండిన ప్రేమను, అతడు ఆ చిన్న విగ్రహముపైని జూపుచుండెను. బ్రతికినన్నాళ్లు చేసిన ఆధ్యాత్మిక సాధనల ఫలితముగ అతనికి ఆ లోహవిగ్రహమున రామసాన్నిధ్యము గోచరించెడిది. అతనికి 'రామలాలా' అనిన, లోహవిగ్రహము కాదు, సాక్షాత్ పరంధాముడే. రామునకు ఉపచారములు చేయుట, రామునకు విందు కుడుపుట, రామునితో ఆడుకొనుట, రాముని వాహ్యాళికి కొంపోవుట, రామునకు స్నానము చేయించుట — ఇవే అతని పనులు. ఆ విగ్రహమును, అతని పట్ల బదులు ప్రేమ చూపుచున్నట్లు అతనికి అగపడుచుండెను.

అతనిభక్తి శ్రీరామకృష్ణుని మదికి ఎక్కెను. శ్రీరామకృష్ణుడు అతనిని దక్షిణేశ్వరమున కొన్నాళ్లు ఉండుము అని ప్రార్థించెను. అచిరకాలముననే రామలాలా శ్రీరామకృష్ణునకు ప్రియసహచరుడు అయ్యెను. ఆ బాలరాముడు తన ఎదుట ఎంత మనోహరముగ వర్తించుచు ఉండినదియు, తన వీపుపైకి ఎగురుటయు, చేతుల లోనికి ఎత్తుకొమ్ము అని మొండి పట్టు పట్టుటయు, ఎండలో పొలాల మీదికి పరుగిడుటయు, పొదలలో పూలు గోయుటయు, కొంటెపిల్లవానివలె పోకిరిపనులు చేయుటయు — వీనిని అన్నిటిని అనంతర కాలమున శ్రీరామకృష్ణుడు తన భక్తులకు వర్ణించి చెప్పి యున్నాడు. రామలాలాకును శ్రీరామకృష్ణునకును మధ్య మనోజ్ఞము ఐన బాంధవ్యము కుదురుకొనెను. బిడ్డయెడ తల్లికి ఉండునట్టి వాత్సల్యము శ్రీరామకృష్ణునకు రామలాలా పట్ల ఏర్పడెను.

ఒకనాడు జటాధారి "ఈ విగ్రహమును నీవే ఉంచుకో" అని శ్రీరామకృష్ణుని ప్రార్థించి, విడువ లేక విడువ లేక, కన్నీటితో వీడ్కొనెను. లోలోన తాను ప్రార్థించినదానిని ఎల్ల రామలాలా నెఱవేర్చినందున, ఇక తనకు విగ్రహారాధనము అక్కఱ లేదు అని అతడు చెప్పెను. కొన్నాళ్లకు అనంతరము ఆ రామ విగ్రహమున శ్రీరామచంద్రుడే తన దర్శనమును శ్రీరామకృష్ణునకు అనుగ్రహించెను. దశరథపుత్త్రుడును రామాయణనాయకుడును ఐన రాముడే విశ్వవ్యాప్తము ఐన చిదాత్మ అనియు, అతడే విశ్వ సృష్టి స్థితి సంహార కర్త అనియు, మరియును ఒక్క ప్రకారమున అతడే నామ రూప గుణ రహితము ఐన పరబ్రహ్మము అనియు శ్రీరామకృష్ణునకు ప్రత్యక్షము అయ్యెను.

రామలాలాను దివ్య శిశువుగ ఆరాధించునప్పుడు శ్రీరామకృష్ణుని హృదయమున మాతృప్రేమ నిండెను. ఆయన తన్ను ఒక మహిళగా భావించుకొనెను. అతని మాటలును చేష్టలును మారిపోయినవి. మధురానాథు నింటి మగువలలో కలిసిపోయినాడు. వారును ఆయనను 'మాలో ఒకతె' అనుకొనుచుండిరి. ఈ దినములలో ఆయన తాను ఒక చేటిగాను సహచరిగాను లోకమాతను ఉపాసించెను.

## దివ్యవల్లభ సంశ్లేషము

శ్రీకృష్ణుని హృదయవల్లభునిగా భావించి, ఆ స్వామి సంశ్లేషమును పొందుట ద్వైత మార్గ విహితారాధనలలో చాల పైమెట్టు. ఆ మెట్టు ఎక్కుటకు శ్రీరామకృష్ణుడు ఇప్పుడు శ్రద్ధ వహించెను. కృష్ణ తృష్ణోన్మత్తలైన బృందావన గోపికలలో తన్ను ఒక తెనుగ ఆయన భావించెను. ఆయన కోరగా, ఆయనకు మధురానాథుడు ఆడు వేషమునకు వలసిన ఉడుపులను నగలను సరఫరా చేసెను. ఈ కామాన్వేషణలో అన్నపానములు విస్మృతములు ఐనవి. శ్రీకృష్ణుని దర్శనమునకై అతడు రాత్రింబగళ్లు బిట్టుగ ఏడ్చెను. ఆ

ఉబలాటము ఉద్రిక్తోన్మాదముగ పరిణమించినది. ఏల యన, కృష్ణదేవుడు మునుపు గోపికలతో ఆడిన జిత్తులనే, రామకృష్ణునితో ఆడ ఆరంభించెను. అప్పు డప్పుడు అగపడుచు, కృష్ణుడు సదా ఒకంత దూరముగనే ఉండి, అతనిని విసిగించుచు, దెప్పి పొడుచుచు ఉండును. ఈ మనోవ్యధకు ఫలితముగ శ్రీరామకృష్ణునకు దేహమునందు మునుపటి లక్షణములు, మంటలు, రోమకూపాలగుండ నెత్తురు కాఱుట, కీళ్లు సడలుట, శరీరవ్యాపారాలు ఆగిపోవుట – మరల గలిగినవి.

శ్రీకృష్ణుని పొంద వలయును అనిన, ముందుగా రాధను ప్రసన్నురాలిని జేసికొని, ఆమె అనుగ్రహమును బడయ వలెను అని వైష్ణవాగమములు చెప్పుచున్నవి. కావున అయోగ వ్యధను ఒందు చున్న భక్తుడు, శ్రీరామకృష్ణుడు, రాధను ప్రార్థించెను. అచిర కాలములోనే అతనికి ఒక శుభదర్శనానుభూతి గలిగెను. రాధా రూపము అతని యెదుటికి వచ్చి, అతడు చూచుచు ఉండగనే అతనిశరీరములోనికి సంక్రమించెను.

తర్వాత ఒకప్పుడు ఆయన ఇట్లు అనెను. "రాధాదేవి దివ్య సౌందర్య మాధుర్యములను వర్ణింప శక్యము కాదు. తీవ్రము ఐన కృష్ణతృష్ణచే ఆమె తన్ను పూర్తిగా మఱచి పోయినది అని—ఆమెను జూచిన తెలియ నగు చుండెను. ఆమె నెమ్మేను లేతపసుపువన్నె గలిగి వెలుగొందుచుండెను."

ఇట్లు రాధతో శ్రీరామకృష్ణునకు ఐక్యము సిద్ధించినంతనే, ఆమెలో పరిపూర్ణముగ ప్రకటమై ఉండిన మహాభావము, ఉత్కట ప్రేమోన్మాదము, ఆయనలో రూపుదాల్చినది. అనంతర కాలమున ఆయనయే ఇట్లు తెలిపి ఉన్నాడు — "భగవత్తృష్ణలో వేఱు వేఱు ప్రకారములు పందొమ్మిది కలవు. అన్నియును ఒక్క మానవునందు రూపు దాల్చు అనుభవమునే మహాభావము అని భక్తిగ్రంథములు పేర్కొనుచున్నవి. వానిలో ఏదైన ఒకప్రకారమును ఆవిష్కరించు కోవలెను అనినను సామాన్య మానవునకు అతని జీవితకాలము అంత

యును పట్టును. మఱి [తన్ను జూపుకొనుచు] ఈ శరీరమందు, ఆ పందొమ్మిది ప్రకారాలకును పరిపూర్ణసిద్ధి ఒనగూడినది''—అని.

రాధాప్రేమసిద్ధి, దేదీప్యమాన శ్రీకృష్ణసందర్శనము కలుగనున్నది అనుటకు పూర్వసూచనము. అచిరకాలముననే శ్రీరామకృష్ణుడు ఆ సందర్శనమును అనుభవించెను. శ్రీకృష్ణుని మోహనాకారము ఆయనకు అగపడి ఆయనతో లీనము అయ్యెను. ఆయన కృష్ణుడే అయ్యెను, తన వ్యక్తిత్వమును విశ్వమును పూర్తిగా విస్మరించెను. ఆయన తనలో కృష్ణుని సాక్షాత్కరించుకొనుటే కాదు, విశ్వమే కృష్ణమయముగ ఆయనకు గోచరించినది. ఇట్లు సగుణ బ్రహ్మోపాసన సమగ్రసిద్ధిని ఒందినది. అవ్యయ బ్రహ్మానంద రసపానము చేకుఱినది. హృదయవేదన పునరావృత్తిరహితముగ అంతరించినది. నాశగంధ మైనను లేక, అవ్యయమును అమృతమును అగు పరతత్త్వమును అతడు సాక్షాత్కరించుకొనెను.

ఒకనాడు రాధాకాంతస్వామిగుడిపంచలో శ్రీరామకృష్ణుడు భగవద్గీతను వినుచు, దివ్యభావ నిమగ్నుడు అయ్యెను. శ్రీకృష్ణుని విశ్వమోహనరూపము ప్రత్యక్షము అయ్యెను. కాంతి కిరణములు శ్రీకృష్ణునిపాదపద్మములనుండి వెలువడి, లావు త్రాటివలెనై, మొదట భాగవతమును దాకి, పిమ్మట శ్రీరామకృష్ణునిహృదయమునులంటెను. ఇట్లు భగవంతుడు, భగవంతుని ప్రతిపాదించు గ్రంథము, భక్తుడు,—అనెడి త్రితయమునకు సంబంధము కుదిరెను. ఆ దృశ్యమును గనిన పిదప భగవంతుడు అన్నను, భక్తుడు అన్నను, భాగవతము అన్నను, నిజముగ ఒక్కడే అను సత్యమును తాను గ్రహించితిని అని ఆయన చెప్పుచుండెడివాడు.

## వేదాంతము

శ్రీరామకృష్ణుని ఆధ్యాత్మికపురోగతికి, బ్రాహ్మణి ఉత్సాహభరిత ఐన ఆచార్యగను, ఆశ్చర్యస్తబ్ధ ఐన ప్రేక్షకురాలుగను ఉండెను. సాటిలేని ఆ తన శిష్యుని సిద్ధులను గాంచి ఆమె గర్వించెను.

కాని శిష్యున కేమో విశ్రాంతి లభింప లేదు. అతని విధి అతనిని ముందుకు సాగి ర మ్మని పిలుచుచుండెను. ఇందలి దృశ్యాలతోను అనుభూతులతోను స్వప్నతన్మయతతోను ఈ ద్వంద్వరంగమును పూర్తిగ అతిక్రమించునంతవఱకును లోకమాత అతనికి ఎట్టి విశ్రాంతిని కలుగనీయ లేదు. కాని అపూర్వము ఐన ఈ మెట్టు ఎక్కుటకు, ఆయనకు బ్రాహ్మణియొక్క ప్రాత సుకుమా రాచార్యకము చాల లేదు. మూడు ఏండ్ల కాలము ఆయన ఆమెపై ఆధారపడియుండెను గాని, ఇప్పుడు ఆమె చూచుచుండగనే ఆమె చేయి దాటి పోయెను. మగటిమియు, ఉగ్రతరవైఖరియు, గుబ్బు ఎక్కిన మేనును, గంభీరస్వనమును గల వేఱు ఒక గురువు నుపదేశమును అనుసరింప బూనెను. ఆ క్రొత్త గురువు తోతాపురి, ఆయన ఊరులు చుట్టు సన్న్యాసి, దృఢదేహుడు. అత్యంతానురాగముతో ఆ గురువును 'నజ్కా' (దిగంబరా) అని సంబోధించుట శ్రీరామకృష్ణునకు అలవాటు అయ్యెను. ఏల యన మొలకు సైతము ఆచ్ఛాదనము లేక, సకల వస్తువులను సకలసంగములను విడనాడిన సమగ్ర వైరాగ్యము ఆయనది.

ఏ వేదాంతమునకు తోతాపురి నిర్వాహకుడో, దానిని శ్రీరామకృష్ణుడు ఇంతవఱకు ఎఱుగడు. అది అద్వైతవేదాంతము. ఆ వేదాంత సత్యములు తోతాపురికి తనజీవితమునందే అనుభవము దాకినవి. అద్వైతవేదాంతము మిగుల ప్రాచీనము ఐనది. అది పరతత్త్వమును బ్రహ్మము అని పేర్కొని సచ్చిదానందము అని వర్ణించినది. బ్రహ్మము ఒక్కడే సత్యము. దానికి దేశపరిచ్ఛేదము లేదు, కాలపరిచ్ఛేదము లేదు, కార్యకారణనియతి లేదు, బహుత్వము లేదు. కాని ఆ బ్రహ్మమునకే తన దుర్జ్ఞేయ శక్తి యగు మాయచేత దేశకాలపరిచ్ఛేదమును కార్యకారణనియతియును గల్గుటే కాక అది ఏకము అయ్యును అనేకముగ అగపడును. ఏకమును అద్వితీయమును అగు పరమాత్మ వివిధరూపములు గలిగి, కాలావస్థలకు లోనగుచున్న జీవాత్మలుగ చూపట్టును. నిత్యము ఐన ఆత్మ, జననమరణములకు

పొల్పడును. ఏకరూపము ఐన ఆత్మ, పరిణామములకు లోనగును. పాపరహితము ఐన పవిత్రాత్మ, తన మాయచేత, పరతంత్రమై స్వర్గ సౌఖ్యములను నరకయాతనలను అనుభవించును. కాని భేదప్రభవము ఐన జ్ఞాతృజ్ఞేయసంబంధముపై ఆధారపడి కలిగెడి యీ యనుభూతులు ఎల్ల మిథ్యలే. తుదకు మూర్త బ్రహ్మసాక్షాత్కారము సైతము, తక్కిన విషయానుభూతుల పాటి మిథ్యయే. కావున మాయా యవనికను భేదించి జీవబ్రహ్మైక్యమును మరల కనుగొనినచే చేతనుడు మోక్షమును ఒందును. విశ్వాత్మయు తానును ఒక్కటే అని తెలిసి నంతనే అతనికి అనిర్వాచనీయానందము లభించును. అప్పుడే జనన మరణాత్మకము ఐన మాయను అతిక్రమించినవాడు అగును, అమృ తత్వమును బొందును. తన అజ్ఞానముచేతనే బంధమును ప్రాపించిన ఆత్మకు, ఆ బంధము తొలగుటే పరమప్రాప్యము అని అన్ని మతము లును చెప్పుచు ఉన్నవి.

వేదాంతసాధనమార్గము 'నేతి' (కాదు) అను ప్రతిషేధ మార్గము. ఆ మార్గమున ఏది మిథ్యయో అది ప్రతిషిద్ధము అగుటే కాక, పరిత్యక్తమును అగును. అది జ్ఞానమార్గము, బ్రహ్మప్రాప్తికి సూటి దారి. జ్ఞాత్రహంకారసమేతముగ ద్వంద్వరంగ మందలి సర్వమును ప్రతిషేధించి, సాధకుడు నిర్వికల్పసమాధ్యానందమున, అద్వితీయమును ఏకమును ఐన బ్రహ్మమున విలీనుడు అగును. జ్ఞాతకును జ్ఞేయమునకును ఉభయమునకును కలయిక చేకుఱును. ఆత్మ మనస్సునకు అందని స్థాయికి ఎక్కును. ద్వంద్వరంగము అతిక్రాంతము అగును. మార్పులతోను తీర్పులతోను గూడిన మాయ వెనుకబడి పోవును. సృష్టిస్థితిసంహారములు అనెడి భ్రాంతిని దిగద్రోసి జీవాత్మ పైమెట్టు ఎక్కును. అనిర్వాచనీయము ఐన ఆనందము, కొండపై నుండి మంచుగడ్డ అవతరించినట్లుగా, అవతరించి ద్వంద్వ రంగములోని సుఖదుఃఖములు మంచిచెడుగులు అనెడి భావములను అన్నిటిని తుడిచివేయును. హృదయమున సచ్చిదానందస్వరూపము ఐన శాశ్వతబ్రహ్మము మహోజ్జ్వలముగ దీపించును. అద్వితీయ

నిత్య చైతన్యసాగరమున జ్ఞాతయు కరగిపోవును, జ్ఞానమును కరగి పోవును, జ్ఞేయమును కరగిపోవును. ప్రేమించువ్యక్తియు, ప్రేమకు లక్ష్యము ఐన వ్యక్తియును, ప్రేమతో గూడ, నిరవధిక పరానంద సాగరమున లయించి పోదురు. జన్మ-వృద్ధి-వినాశములు అనంతము ఐన అస్తిత్వమున రూపు మాసి పోవును. సంశయములును వికల్పములును అన్నియు ఇక తల ఎత్తక అణగి పోవును. మనశ్చాంచల్యము ఆగి పోవును. ప్రారబ్ధ కర్మవేగము సమసి పోవును. ఆ యింద్రియాతీగ దశలో మధుర బ్రహ్మానందము ఉప్పొంగును, అది ఆత్మకు అనాదికాలముగ ఉండిన వాసస్థానపు మూలస్తంభమును పడగొట్టును, శరీరమును నెమ్మదిపఱచును, మనసును శాంతింపజేయును, అహంకారమును అంతరింపజేయును, అప్పుడు దేశము శూన్యతలో మఱుగుపడును. కాలము నిత్యత్వమున లీన మగును. కార్య కారణనియతి ఎన్నడో కన్న కలవంటిది అగును. అస్తిత్వము ఒక్కటే ఉండును. ఆహా! బ్రహ్మముతో ఐక్యము ఒందు నప్పటి జీవుని అనుభూతులను ఎవరు వర్ణింపగలరు?

తల ద్రిప్పు నట్టి ఆ శిఖరమునుండి దిగి నప్పుడు కూడ. మానవునకు అహంకార మమకారములు ఉండవు. దేహము నీడవలె (అయథార్థము) అనియు, అది ఆత్మను కప్పు నట్టి ఒర వంటిది అనియు, అతడు అనుకొనును. జరిగిపోయినదానిని అతఁడు తలంపడు, జరుగ నున్న దానిని యోచింపడు, జరుగు చున్న దానిపట్ల గూడ అతనికి ఉపేక్షయే. విశ్వమందలి అన్నింటిని అతడు సమదృష్టితో చూచును, పరిదృశ్యమాన జగత్తు నందలి అనంత వైవిధ్యమును గని, అతడు ఎట్టి మార్పునకును లోను గాడు. సుఖము కలుగనీ, దుఃఖము కలుగనీ, అతడు ప్రతిఘటింపడు. తన్ను (అనగా తనదేహమును) సజ్జనులు ఆరాధించినను, దుర్జనులు హింసించినను, అతనికి ఎట్టి మనోవికారమును గలుగదు. ఏల యన. ఒక్క బ్రహ్మమే అన్నిరూపములలోను అతనికి గాన నగుచుండును. అట్టి అనుభవపు ధాకకు మనశ్శరీరములు నాశము ఒందును. వెలుగు మిక్కుటమై, ఎఱుక

చెదిరినట్లు అగును. నిర్వికల్పసమాధిని అనుభవించిన పిమ్మట దేహము ఒక యెండుటాకువలె రాలిపోవును అని వేదాంతగ్రంథములు తెలుపుచున్నవి. మానవుల ఉజ్జీవింప జేయ వలె అను ప్రత్యేక లక్ష్యముతో అవతరించిన మహనీయులు మాత్రమే, ఆ ఉన్నతినుండి సాధారణ జీవితము అనెడి పల్లమునకు మగిడి దిగ గలరు. అట్టి మహాత్ములు లోకమున జీవించుటయు సంచరించుటయు మానవకోటి శ్రేయస్సునకే. సాటి లేని ఆత్మశక్తి వారికి సహజముగ ఉండును. ఒక దివ్య తేజము వారిలో వెలుగొందుచుండును.

## తో తా పు రి

1864 వ సంవత్సరము కడపటికి తోతాపురి దక్షిణేశ్వ రాల యారామము నొద్దకు వచ్చి చేరెను. అతని జన్మనగరము పంజాబు ఐయుండవచ్చును. మన భారతదేశమున పంజాబురాష్ట్రమునందు ఉన్న మఠములలో ఒకదానికి అతడు అధిపతి. ఆయన యేలుబడిలో ఏడు వందల మంది సన్న్యాసులు ఉండి రట. చిన్నతనమునుండియే అద్వైత వేదాంత సాధనలో శిక్షితుడై ఉన్నందున జగత్తు మిథ్య అను విశ్వాసము అతనికి దృఢముగ ఉండెను. ద్వైతమార్గమున ఆరాధింపబడు దేవతలును స్త్రీదేవతలును భ్రాంతచిత్తకల్పనలే అని అతని అభిప్రాయము, నిజ మయిన ఆస్తికతకు ప్రార్థనలును క్రతువులును కర్మలును అనుష్ఠానములును అక్కఱలేదు, కావున వానియెడ అతడు మిక్కిలి ఉపేక్ష గలిగి యుండెను. వివేకముతోను అప్రకంప్య సంకల్పముతోను అతడు ద్వంద్వజగత్తులో శబ్దాదివిషయము లందలి సంగమునుండి విడుపొందినాడు. పావన నర్మదా తీరమున నలువది ఏండ్ల కాలము తీవ్ర సాధనలు సలిపి, కడకు అతడు జీవ బ్రహ్మైక్య తత్త్వమును సాక్షాత్కరించుకొన్నాడు. అప్పటినుండి ఎట్టి బంధమును లేక, బోను వెలువడిన సింహమునుబోలి, ఆయన లోకములో సంచరించుచుండెను. కటి వస్త్రము ఒక్కటే ధరించి, ఆకాశ వితానము క్రింద, ఎండ అనక, వాన అనక, పిడికెడు భిక్షాన్నమే ధారకముగ

పెక్కు దినములు గడపెను; గంగా సాగర సంగమ క్షేత్రమును దర్శింప ఏగి, ఆ పవిత్ర నదీ తీరమునే అంటి వెను దిరిగి వచ్చుచు, దుర్జ్ఞేయ దైవ సంకల్ప ప్రేరితుడై దక్షిణేశ్వరము నొద్ద ఆగెను.

శ్రీరామకృష్ణుని జూచిన వెంటనే, వేదాంత విద్యను అభ్యసించుటకు అర్హత ఆయనకు గలదు అని తోతాపురి కనుగొని "ఆ రహస్యములను ఉపదేశింతునా" అని అడిగెను. అందులకు జగజ్జనని సమ్మతిని పొంది శ్రీరామకృష్ణుడు తన అంగీకారమును దెలిపెను. సన్న్యసించిన వారికి మాత్రమే వేదాంతవిద్యను స్వీకరించు అర్హత కలదు అని తోతాపురి చెప్పగనే, శ్రీరామకృష్ణుడు సన్న్యసింప అంగీకరించెను, కాని వయసు మీఱిన తన తల్లి తనతోనే దక్షిణేశ్వరమున ఉన్నందువలనను, ఆమె మనసు నొవ్వక ఉండుటకై సన్న్యాస దీక్షాస్వీకారము రహస్యముగ జరిగిపోవలెను అనిమాత్రము ఏర్పాటు చేసికొనెను.

నిర్ణీత దినమున చాల పెందలకడనే పంచవటిలో హోమాగ్ని సంధానము జరిగెను. తోతాపురియు శ్రీరామకృష్ణుడును ఆ అగ్నికి ఎదుట కూర్చుండిరి. దాని జ్వాలలు వారి వదనములపై డాలు కొట్టుచుండినవి. "రామకృష్ణుడు చిఱుతవాడు, మేని వన్నె చామనిచాయ, చిన్న దాడి ఉన్నది, కన్నులు అందముగ ఉన్నవి, నల్లగను విశాలములుగను ఉన్నవి, వానిలో వెలుగు తొణికిసలాడుచున్నది. అవి వంపుగ అమరి యించుక మూతవడి యున్నవి. వానిని అతడు పూర్తిగ తెరవనే తెరవడు. సగము మూత వడి ఉన్నప్పటికిని, లోపలను వెలుపలను చాల దూరము, ఆ కన్నుల చూపు పర్వుచుండును. తెల్లి దంతములు కాన నగు నట్లు విచ్చిన నోట చిఱునవ్వు వెలువడుచు ప్రేక్షకులను ముగ్ధులుగ ఒనర్చుచుండును. ఆ నవ్వులో అనురాగమును ఉన్నది, కొంటెతనమును ఉన్నది. అతని పొడవు సామాన్యమే, మేను మిగుల సన్నగిల్లి మిక్కిలి సుకుమారముగ ఉన్నది. అతనిది చాల చుఱుకైన ప్రకృతి. ఏల యన నైతిక

భౌతిక సుఖ దుఃఖ వాయువులు వీచి నప్పుడు, వాని అనుభూతిని అతి శీఘ్రముగ గాంచువాడు అతడు. అతని కన్నులు—లోవైపును వెలి వైపును — రెండు వైపులను ప్రతిబింబముల నీనెడి అద్దములను బోలినవి. ఆ అద్దములకు ఎదుట జరుగు వానికి అన్నిటికిని సజీవ ప్రతిబింబముగ ఆయన ఉండును''* అతనికి ఎదుట తోతాపురి గండ శిల వలె నిగుడుకొని ఉండెను. చాల పొడవును బలుపును బలమును గలిగి, అతడు అభేద్యము ఐన సిందూర వృక్షమును బోలి ఉండెను. అతని దేహమును ఇనుమే, మనస్సును ఇనుమే. అతడు ధీరుడైన ప్రజానాయకుడు.

బంధువు లందును మిత్రు లందును మనశ్శరీరము లందును ఇంద్రియము లందును అహంకార మందును లోక మందును తమకు సంగము నశించుటకై సన్న్యాసదీక్షను స్వీకరించు వారు కొన్ని క్రియలను చేయ వలెను, వానిని అన్నిటిని శ్రీరామకృష్ణుడు తనకు ఎదుట జ్వలించు చున్న నిప్పులో చేసెను. మంటలు ఎగమీటు చున్న అగ్ని అన్నిటిని గ్రసించి, సన్న్యాసదీక్షా ప్రతిగ్రహీతను బంధ రహితునిగను పవిత్రునిగను చేసినది. యజ్ఞోపవీతమును జుట్టును వేల్వబడుటతో జాతి – వర్ణ – సంఘ సంబంధములు పూర్తిగ తొలగి నవి. అన్నియు ముగిసిన పిమ్మట, కడపట, పవిత్ర పదార్థములను అన్నిటిని సాక్షులనుగ ఉంచుకొని, శ్రీరామకృష్ణుడు భోగాపేక్ష తనకు ఈజన్మ మందే కాక, భవిష్య జ్జన్మ లందు గూడ, లేకుండునట్లు దానిని అగ్నిసాత్కరించెను. తనయందు కాన నగు చున్న ఆత్మయే సకల ప్రాణు లందును గాన నగు చున్నందున, సకల ప్రాణులకును అభయభద్రతల ఒసంగు పుణ్యమంత్రములను అనుసంధించెను. ఈ క్రియలు ముగియగనే నూతనాశ్రమచిహ్నములుగ గురువు శిష్యునకు కౌపీనమును కాషాయవస్త్రమును ఒసంగెను.

---

* రోమైరోలా (Romain Rolland) ప్రణీత శ్రీరామకృష్ణ జీవిత చరిత్రము, పు. 64.

గురుశిష్యులు చెంతనే ఉన్న ధ్యానమందిరమునకు ఏగిరి. వేదాంత మహావాక్యములను తోతాపురి శ్రీరామకృష్ణునకు ఉపదేశింప దొడంగెను —

"బ్రహ్మము ఒక్కటే సత్యము, సదా పవిత్రము, సదా ప్రకాశవంతము, సదా స్వతంత్రము. బ్రహ్మమునకు దేశ కాల పరిచ్ఛేదము లేదు, కార్య కారణ నియతియు లేదు. బ్రహ్మమునందు నిగూఢముగ ఉండు శక్తియే మాయ. ఆ మాయ అసాధ్యములను సాధ్యములుగ ఒనర్చు మాంత్రికురాలు. మాయాప్రభావమున బ్రహ్మమునకు నామ రూపములు ఉన్నట్లు అగపడినను, నిజమునకు బ్రహ్మము ఏకము, అవిభక్తము. మాయాప్రభవములు ఐన దేశ కాల నామ రూపములు సమాధ్యానందమున నిమగ్నుడు ఐన సాధకునకు అగపడవు. మాయావశము ఐనది ఎల్ల అవాస్తవమే. దానిని విడువుము. నామ రూపాత్మక మైన కారాగారమును పడగొట్టి సింహబలుడవై వెలికి ఉఱుకుము. ఇంకను ఇంకను లోతునకు దిగి, ఆత్మను అన్వేషించి, సమాధిలో ఆత్మసాక్షాత్కారము ఒందుము. అప్పుడు నీ కంటి యెదుటనే నామ రూపాత్మక మైన యీ జగత్తు మాయము అగును. సంకుచితాహంకారము బ్రహ్మభావమున లయించిపోవును. ద్వంద్వాతీత మై సచ్చిదానందస్వరూప మైన బ్రహ్మముతో నీవు ఐక్యము ఒందెదవు." ఉపనిషత్తులను ప్రమాణీకరించుకొనుచు తోతాపురి ఇంకను ఇట్లు వివరించెను — "ఒకరు ఇంకొకరిని జూచుటకును వినుటకును తెలిసికొనుటకును ఉపయోగపడు జ్ఞానము పరిమితము ఐనది. ఏది ఏది పరిమితమో, దానికి విలువ లేదు. దానివలన నిజ మైన ఆనందము గలుగదు. వేఱు ఒకరు లేనే లేరు అను సత్యమును జూపి, వినిపించి, తెలియజేయు జ్ఞానము గొప్పది, పరిమితి లేనిది; ద్వంద్వాతీతము ఐనది. అట్టి జ్ఞానమే శాశ్వతానంద ప్రదము. సర్వాంతర్యామియై వెలుగొందు శాశ్వతాత్మను దెలిసికొనుట, ఇంద్రియములకు గాని మనసులకు గాని ఎట్లు శక్యము అగును?"

తోతాపురి శిష్యుని ద్వంద్వజగత్తు నందలి సకలవస్తువుల నుండియు, స్త్రీదేవతలనుండియు పురుషదేవతలనుండియును గూడ, మనసును మరల్చుకొని, ఆ మనస్సును బ్రహ్మమునందు ఏకాగ్రము ఒనర్పుము అనెను. కాని ఆ పని శ్రీరామకృష్ణునంతటివానికి సైతము సులువైనది కాదు. విశ్వజనని యైన కాళికాదేవినుండి తన మనసును మరలించుకొనుట అతనికి సాధ్యపడ లేదు. ఆయనయే అనంతర కాలమున ఈ సంగతిని ఇట్లు వివరించి ఉన్నాఁడు — "మం త్రోప దేశము ఐన వెంటనే నగ్నుఁడు నాకు వివిధ వేదాంత సిద్ధాంతములను బోధింప దొడంగెను, మనసును సకల వస్తువులనుండియు మరల్చుకొని ఆత్మ యందు గాఢముగ జొన్పుకొనుము అని ఆదేశించెను. నేను ఎంత ప్రయత్నించినను, నా మనస్సును నామ రూపాత్మక జగత్తును పూర్తిగ దాటించి నిర్వికల్పస్థాయికి ఎక్కించుకో లేక పోయితిని. లౌక్య వస్తువులలో ప్రతిదానినుండియు నా మనస్సును మరలించుకో గలిగితిని గాని, శుద్ధ చైతన్య స్వరూపిణి ఐన అమ్మవారి చిర సుపరిచితమును పరమ నిర్వృతికరమును మహోజ్జ్వలమును ఐన రూపము మాత్రము నా కంటి యెదుట వాస్తవముగ కనిపించు చుండినది. లోక మోహనము ఐన ఆమె మందహాసము నన్ను స ర్వాతిక్రాంత మహత్ స్థాయిని అందనీయక ఆపుచుండినది. మాటి మాటికిని నేను ప్రయత్నించినను, ప్రయత్నించినపుడు ఎల్ల ఆమె అడ్డ పడుచునే ఉండెను. ఆసపాటు మాని నేను నగ్నునితో "ఆ కోరిక నెఱవేఱదు. మనస్సును నిర్వికల్పస్థాయికి ఎక్కించి ఆత్మసాక్షాత్కా రము ఒందు సామర్థ్యము నాకు లేదు" అంటిని. ఆయన తీవరపడి "ఏమీ! సామర్థ్యము నీకు లేదా? నీవు అట్లు చేయక తప్పదు" అని చురుకుగా బదులు చెప్పెను. చుట్టును వెదకి, ఒకగాజుముక్కను గని, అందుకొని, దానితో నా కనుబొమల నడుమ పొడిచి "నేను పొడిచిన చోట నీ మనసును ఏకాగ్రము ఒనర్పుము" అని గద్దించెను. అప్పుడు దృఢసంకల్పముతో నేను ధ్యానమున కుదుట వడితిని. ఉదారమైన లోకమాతృరూపము నా యెదుట అగపడిన వెంటనే, వివేక

ఖడ్గముతో నేను దానిని రెండుగ ఖండించితిని. తుది అడ్డంకి తొలగి పోయెను. వెంటనే నా ఆత్మ ద్వంద్వాతీతమును దాటిపోయినది. నేను సమాధిలో నిమగ్నుడను ఐతిని.''

శ్రీరామకృష్ణుడు అట్లు సమాధిలో మునిగి మూడు దినములు ఉండెను. అద్భుతావిష్టుడు ఐన తోతాపురి ''ఇది వాస్తవమేనా? నలువది ఏండ్లు తీవ్ర తపశ్చర్యచే నేను సాధించినదానిని ఇతడు ఒక్క దినములో సాధించినాడే! ఇది రహస్యమా? ఔరా, ఇది పర మాద్భుతము'' అని కేకలు ఇడెను. ఆయన తోడ్పడగా, శ్రీరామకృష్ణుని మనసు కడకు మరల ద్వంద్వస్థాయికి దిగినది.

సనాతన సన్న్యాసాశ్రమాచారమును ఇంచుకేని తప్పక పాటించువాడు కావున తోతాపురి ఏచోటను మూడు దినముల కంటె ఎక్కువ కాలము ఇంతవఱకును ఉండ లేదు. దక్షిణేశ్వరమందు మాత్రము, ఆయన పదునొకండు నెలల కాలము ఉండెను. కొన్ని పాఠములను ఆయనయు నేర్చుకోవలసియుండెను.

కామలోభాకర్షణలకు చిక్కి సామాన్య మానవులు పడు తిప్పలను ― తోతాపురి ఎఱుగనే ఎఱుగడు. శిశువునకు ఉండునట్టి అమాయికత ఆయనలో బ్రతికి నన్ని నాళ్లు చెడక ఉండెను. కావున ఇంద్రియములు మానవులను చెడు దారులకు త్రిప్పును అనెడి విషయము ఆయన మదికి పరిహాసనీయముగ ఉండెను. జగత్తు మిథ్య అనియు, దానిని తలచూపనీయక నెట్టివేయ వలయును అనియు, అతని గట్టి నమ్మకము. పుట్టినప్పటినుండియే అద్వైతి అయిన ఆయనకు, సగుణబ్రహ్మమందు విశ్వాసము లేదు. కాళీ మాతృ కరాళవైఖరియం దేమి, వాత్సల్యవైఖరియం దేమి, ఆయనకు నమ్మకము లేదు. ఆయన యభిప్రాయమున భజనయు పుణ్య నామ సంకీర్తనమును అర్థరహితములే. సగుణ బ్రహ్మోపాసనలో చెల్లించు భావోద్రేకమును ఆయన వెక్కిరించెడి వాడు.

## కాళియు - మాయయు

మఱి శ్రీరామకృష్ణుడు, తన గురువువలె తానును, జగన్మిథ్యాత్వమును బాగుగ ఎఱింగిన వాడే; అయినను, వ్యావహారిక జగత్తున మాయకు గల శక్తినిగూడ గుర్తించినాడు. కావున దానిని నిరసింపడు. శుద్ధాద్వైతివైఖరి అట్లే కదా ఉండును. దివ్యతత్వమే మాయగా రూపొందినది కావున గంభీరమును దుర్జ్ఞేయమును ఐన మాయ యెడ కూడ ఆయనకు భక్తిగౌరవములు మెండే. సర్వమును బ్రహ్మమే కావున మాయయు బ్రహ్మమే అని ఆయన యభిప్రాయము. బ్రహ్మము దాల్చు ప్రత్యక్ష రూపమగు మాయయు ఒకటి. ద్వంద్వాతీతమైన ఉన్నత స్థాయిలో ఉన్నప్పుడు తాను ఏ బ్రహ్మమును దర్శించెనో, అదే బ్రహ్మము నిమ్నస్థాయులలో సర్వత్ర నామరూపములచే ఆచ్ఛాదితమై ఉన్నది అనియు ఆయన గుర్తించెను. నామరూపాచ్ఛాదనము సన్నపాటి ఒరను బోలినది. కావున దాని మఱుగున ఉన్న బ్రహ్మముయొక్క సర్వవ్యాపిత శ్రీరామకృష్ణునకు అగపడుచునే ఉండెను. నామరూపాత్మకము ఐన ఆ తెరను నేసిన మాయ ఎవరో కాదు, జగజ్జనని కాళియే. ఆమెయే మూలశక్తి, పరాశక్తి. దాహశక్తికిని అగ్నికిని వేఱుపాటు లేనట్లే, కాళికిని బ్రహ్మమునకును వేఱుపాటు లేదు. విశ్వ సృష్టి సంహారములు కాళి నెఱపు లీలలు. ఆమె కావించు సృష్టి సాలీడు నేయు సాలెపట్టును బోలినది. ఆమె విశ్వజనని. ఆమెయు, వేదాంత ప్రతిపాదిత బ్రహ్మమును, యోగశాస్త్ర ప్రతిపాద్యమాన మైన ఆత్మయు ఒక్కరే. ధర్మశాస్త్రములకు కర్త్రి, శాశ్వతురాలు ఐన ఆమెయే, కావున ధర్మములను కూర్చునదియు ఆమెయే, మార్చునదియు ఆమెయే. ఆమె అమోఘ సంకల్పముచేతనే కర్మలకు ఫలములు గలుగుచుండును. మాయచే ఆమె చేతనులను మోహితులను జేయును, మరల తన కృపావీక్షణముచే వారికి బంధవిముక్తియును బ్రసాదించును. జగన్నాటకమును కొనసాగించు వారికి అందఱకును ఆమె ప్రభ్వి. చేతనాచేతనములు అన్నియు ఆమె ఆడించినట్లు ఆడుచుండును. నిర్వికల్పసమాధిలో

బ్రహ్మసాక్షాత్కారమును ఒందినవారు కూడ వ్యావహారిక జగత్తునందు ఉన్నంత వఱకును ఆమె యేలుబడి లోని వారే.

నిర్వికల్ప సమాధికి అనంతరము, శ్రీరామకృష్ణునకు, మాయ, క్రొంగ్రొత్తరూపమున పొడకట్టినది. కాళిమాతకు ఉండినట్టి బంధించు స్వరూపము అతని దృక్పథమునుండి మఱుగుపడి పోయెను. కాళివలన అతని జ్ఞానమునకు ఎట్టి అడ్డంకియు లేదాయెను. ఈ జగత్తు, మహోజ్జ్వల మైన జగన్మాతృ స్వరూపమే అయ్యెను. మాయయు బ్రహ్మమే అయ్యెను. అంతర్యామి స్వరూపమును తెలిచుకొని సర్వవ్యాపి స్వరూపము వెలువడినది. వ్యావహారిక జగమున మాయ రెండు రీతులలో పనిపడును అని శ్రీరామకృష్ణుడు కనుగొనెను. ఒక రీతికి అవిద్యామాయ అనియు, వేఱొక రీతికి విద్యామాయ అనియు, ఆయన పేరిడెను. ఇంద్రియతృష్ణలు, దుర్భావావేశములు, పేరాస, కామము, క్రౌర్యము మొదలయిన తామసిక శక్తులు (డార్క్ ఫోర్సెస్) అవిద్యా మాయలోనివి. క్రింది మెట్లలో జగత్తునకు అవిద్యా మాయయే ఆధారముగ ఉండును. జనన మరణ చక్రమును చుట్టు త్రిప్పునదియు ఆ అవిద్యా మాయయే. ఆమాయను ప్రతిఘటింపవలెను, అణంపవలెను. ఇకను విద్యామాయ అనునది, సృష్టిలోని ఉన్నత శక్తి. పారమార్థిక సంపద, వెలుగును ఒసంగు గుణములు, కృప, శౌచము, ప్రేమ, భక్తి మున్నగునవి, విద్యామాయలోనివి. విద్యామాయ చేతనుని ఉచ్చ జ్ఞాన దశలకు ఎక్కించును. దాని తోడ్పాటున భక్తుడు అవిద్యామాయను తొలగించుకొనును. అప్పుడు అతడు మాయాతీతుడు అగును. ఈ రెండు రీతుల మాయలును, రెండు సృష్టిశక్తులు, రెండును కాళీమాతృశక్తులే. ఆమె స్థానము ఆ రెంటికిని పైది. ప్రభామండితుడైన సూర్యుడు పలు వన్నెల పలు రూపుల మేఘములను కల్పించుచు, వాని మఱుగున తాను ఉండి, వాని గుండ తాను ప్రకాశించుచు, శరన్నీలాకాశమున వింత దృశ్యములను పుట్టించుచుండును గదా, అట్లే కాళియు.

"నిర్గుణబ్రహ్మములో లీనుడవు కాకుము. పారమార్థిక వ్యావహారిక రంగముల నడుమ, పారమార్థిక జ్ఞాన ద్వారమున, 'భావముఖమున' ఉండుము" అని దేవి శ్రీరామకృష్ణుని ఆదేశించెను. తంత్రశాస్త్రము చెప్పిన ఆఱవ ఆధారమున ఆయన నిలువ వలసినవాడు అయ్యెను. అందుండి ఆయన ఏడవ ఆధారమహిమనే కాక, క్రిందిస్థానములలో కుండలినీ దివ్యావిష్కృతులనుగూడ, కనగలిగెను. ఆ సరిహద్దు నెలవునుండి ఆయన మెల్లగ ఒకపరి ముందునకును ఒకపరి వెనుకకును అడుగిడుచుండును. లోకమాతయెడ భక్త్యావేశమును, నెమ్మదిగ అద్వితీయబ్రహ్మసాగరమున మునిగియుండుట — అను ఈ రెండు అనుభూతులును ఆయనకు, దాని వెనుక ఇది, దీని వెనుక అదిగా, మాఱి మాఱి, కలుగుచుండినవి. ఈ విధముగ సగుణ బ్రహ్మమునకును నిర్గుణ బ్రహ్మమునకు శ్రీరామకృష్ణుడు ఏకత్వమును సాధించినాడు. బ్రహ్మమునకుగల అంతర్యామి స్వరూపమునకును సర్వవ్యాపిస్వరూపమునకును అభిన్నతను సాధించినాడు. లోకమున ప్రమాణ గ్రంథములకు ఎక్కిన ఆధ్యాత్మికచరితములో ఇట్టి అనుభూతి అపూర్వము ఐనది.

## తోతాపురి నేర్చుకొన్న పాఠము

వ్యావహారిక జగమున శ్రీకాళీమాత మహత్వము. దుర్జ్ఞేయము అయిన ఆమె శక్తియే మాయ. దేవీమాహాత్మ్యమును మాయాప్రభావమును తోతాపురి శ్రీరామకృష్ణునొద్ద నేర్చుకొనవలసి ఉండెను.

ఒకనాడు గురుశిష్యులు వేదాంతవిషయికముగ మహోత్సాహముతో చర్చించుకొనుచుండిరి. అప్పుడు గుడితోట పనివాండ్రలో ఒకడు తన పొగాకు చుట్టకు నిప్పు ముట్టించుకొనగోరి, అచ్చటికి వచ్చెను. అచ్చట హోమాగ్నికుండము ఉండెను, అందు తోతాపురి మునీంద్రుడు హోమార్థము అగ్నిసంధానము కావించియుండెను. ఆ నౌకరి అందుండి ఒక నిప్పుకణికను తీసికొనెను. స్థూలదృష్టికి

ఇది ఎంత అపచారము. దీనిని జూచి తోతాపురి ఆగ్రహపరవశుడై ఆ నౌకరిని కొట్టబోయెను. శ్రీరామకృష్ణుడు కడుపు చెక్కలు అగునట్లు నవ్వి "అయ్యో! ఎంత సిగ్గుచేటు! బ్రహ్మము ఒక్కడే సత్యము అనియు, జగత్తు మిథ్య అనియు నాకు వివరించి బోధించిన మీరే, మిమ్ము మరచిపోయి, క్రోధోద్రేక వివశులరై ఒకనిని కొట్ట ఉంకించితిరే! మాయాప్రభావము దుర్జ్ఞేయము అనుట యథార్థము" అని కేకలు ఇడెను. తోతాపురికి ఏమియు తోప లేదు.

ఇంచుమించు ఇదే కాలమున తోతాపురికి అతిసారవ్యాధి తీవ్రముగా పైకొనెను. అందుచే ఆయనకు ధ్యానము చేయ శక్యము కా లేదు. ఒక రాత్రి నొప్పి దుర్భరము అయ్యెను. ఆయన ఒక్క నిముస మేని బ్రహ్మముపై మనసును ఏకాగ్రము ఒనర్ప లేక పోయెను. చిత్తైకాగ్రతకు శరీరబాధలు అడ్డపడినవి. ఒడలి యక్కఱలు ఆయనను తొందరించినవి. ఆయన ముక్తాత్ముడే, దేహమును లక్ష్య పెట్టువాడు కాడు, కాబట్టి గంగలో దూకి దేహత్యాగము చేయుదము అని నిశ్చయించుకొని, గంగలోనికి చర చర నడచి పోయెను. కాని ఆశ్చర్యము ఏమి అనగా, పోయి పోయి ఆయన వెనుదిరిగి చూచు కొను సరికి తాను గంగకు ఆవలి గట్టున ఉండెను*. గంగలో చాలి నన్ని నీళ్లు లేవా? ఆశ్చర్యస్తబ్ధుడై ఆవలి గట్టున నిలబడి ఆయన గంగకు ఇటువైపు చూపు మరల్చెను. వృక్షములును దేవాలయము లును భవనములును ఆకాశ నీలిమచే పరభాగశోభ నొంది అమరి యుండినవి. కన్నులు మిఱుమిట్లు గొన్న ఒక్క క్షణమున తటాలున అన్నివైపులను దివ్యమాతృసాన్నిధ్యము అతనికి గోచరించెను. ప్రతి వస్తువునందును ఆమె ఉండెను. ప్రతివస్తువును ఆమెగనే ఉండెను. నీటిలో ఆమె ఉండెను. నేలపై ఆమె ఉండెను. దేహము ఆమెయే, మనస్సు ఆమెయే, ఖేదము ఆమెయే, మోదము ఆమెయే, జ్ఞానము ఆమెయే, అజ్ఞానము ఆమెయే, ప్రాణము ఆమెయే, మృత్యువును

* గురుదేవుని యంతరంగ శిష్యులలో అన్యతము లైన శ్రీశారదానంద స్వాములు రచించిన "లీలాప్రసంగము" నుండి.

ఆమెయే; చక్షుశ్శ్రోత్ర మనో గోచరములు అయిన పదార్థములు అన్నియు ఆమెయే. కలిమిని లేమిగను, లేమిని కలిమిగను ఆమె మార్చ గలదు. మానవునకు స్వేచ్ఛ లేదు. చావు కూడ మానవుని చేతిలో లేదు. దేవి కృప లేనిదే, ఎవరును ఆమె యెల్లుబడిని దాట లేరు. ఇంతే కాదు. మనశ్శరీరములకు అతీతమై, విశ్వవ్యాప్తమైన తత్త్వము ఆమెయే.' తోతాపురి తన జీవితకాలము అంతయు ఉపాసించుచు ఉండిన బ్రహ్మమును ఆమెయే.

తోతాపురి దక్షిణేశ్వరమునకు వచ్చి ఆరాత్రి శేషమును దేవీ ధ్యానమున గడపెను. మఱునాటి ఉదయమున అతడు శ్రీరామకృష్ణుని వెంట ఇడుకొని గుడికి జని మాతృవిగ్రహము నెదుట సాష్టాంగముగ ప్రణమిల్లెను. దక్షిణేశ్వరమున పదునొకండు మాసములు తాను గడపి నందుల ప్రయోజనము అతనికి అప్పుడు స్పష్టపడెను. ఇట్లు క్రొత్త సంగతిని దెలిసికొని, శిష్యుని వీడ్కొని, తోతాపురి తన దారిని బోయెను.

తోతాపురి నేర్చుకొన్న పాఠమునకు అంత రార్థమును శ్రీరామ కృష్ణుడు అనంతర కాలమున ఇట్లు వర్ణించెను — "పరతత్త్వమును, సృష్టి స్థితి సంహారాది వ్యాపార శూన్యముగ భావించి నప్పుడు ఆ నిర్గుణ తత్త్వమును బ్రహ్మము అనియో పురుషుడు అనియో పేర్కొందును. పరతత్త్వమును, సృష్టి స్థితి సంహారాది వ్యాపార కర్తగ భావించి నప్పుడు, ఆ సగుణబ్రహ్మమును శక్తి అనియో మాయ అనియో ప్రకృతి అనియో పేర్కొందును. మన భావనయు, పేరును, మారి నంత మాత్రముచేత తత్త్వములే వేఱుపడినవి అని అర్థము కాదు. పాలును దాని తెలివన్నెయు, రత్నమును దాని కాంతియు, సర్పమును దాని వక్ర గతియు అభిన్నము లైనట్లు నిర్గుణబ్రహ్మమును సగుణబ్రహ్మమును అభిన్నములే. లోకమాతయు బ్రహ్మమును ఒక్కరే."

తోతాపురి వెడలిన పిదప శ్రీరామకృష్ణుడు ఆఱు నెలల కాలము (నిర్వికల్పసమాధిలోనే) బ్రహ్మముతో పూర్తిగ ఐక్యము

ఒంది ఉండెను. ఆదశను ఆయనయే ఇట్లు వివరించి యున్నాఁడు — "సమాధిదశలో బ్రహ్మైక్యము ఒందిన మీఁదట సామాన్యమానవుఁడు వెను దిరిగి రా లేఁడు. మూఁడు వారములకే వాని దేహము ఎండుటాకు వలె రాలిపోవును. అట్టి దశలో నేను ఎడతెంపు లేక ఆఱు నెలల కాలము ఉంటిని. ఇది రాత్రి ఇది పగలు అను సంగతి కూడ నాకు దెలియుట లేదు. పీనుగు నోటను ముక్కురంధ్రాలలోను జొచ్చునట్లు, ఈగలు నా నోటను ముక్కురంధ్రాలలోను జొరబడుచు ఉండినవి. కాని నాకు ఏమియు తెలియుట లేదు. నా శిరోజములు దుమ్మునిండి జడలు కట్టినవి."

ఆ సమయమున ఎవరో ఒక సన్న్యాసి యాదృచ్ఛికముగ దక్షిణేశ్వరమునకు అరుదెంచి ఉండెను. ఎందులకు తోఁచినదో చెప్ప లేము కాని, "శ్రీరామకృష్ణుని దేహమును నిలుపుట లోక కల్యాణ సాధకము అగును" అని ఆయనకు తోఁచినది. ఆయన అచ్చట ఉన్నందుననే శ్రీరామకృష్ణుని దేహము రాలి పోక నిలువ గలిగినది. ఉత్క్రమించిన ప్రాణమును దేహము అనెడి కారాగారమునకు మరల్చుటకు ఆ సన్న్యాసి నానా మార్గములను అనుసరించెను. ఒక్కొక్కప్పుడు శరీరహింసను గూడ కావించెను. తత్ఫలితముగ క్షణకాలము అతనికి స్మృతి గలిగి నప్పుడు కొన్ని కబళముల ఆహారమును కంఠమున గ్రుక్కుచుండెను. ఇంతలో "భావముఖమున ఉండుము" అనిన లోకమాతాదేశము శ్రీరామకృష్ణునకు అందినది. అచిరకాలములోనే ఆయనకు దారుణము అయిన అతిసారవ్యాధి వచ్చెను. రాత్రిందివములు అనుభవింప వలసి వచ్చిన నొప్పిచే, ఆయన మనస్సు క్రమ క్రమముగ భౌతిక రంగమునకు అవతరించెను.

## సన్న్యాసులతోను భక్తులతోను సమాగమము

ఇప్పటినుండియు శ్రీరామకృష్ణుడు భక్తులతోను పూతాత్ముల తోను సాంగత్యము అభిలషింప దొడంగెను. ఇంత కాలమును ఆధ్యాత్మికసాధనలయు దివ్యదర్శనములయు కల్లోలమును ఒత్తిడిని

ఆయన అనుభవించి యుండెను. ఇప్పుడు లోలోన కొంత నెమ్మది చేకుఱగా ఆయన చూపఱకు సామాన్య మానవునివలెనే అగపడు చుండెను. కాని ఐహికపరులతోడి పొత్తును వారితోడి సంభాషణయు ఆయనకు దుర్భరములుగ ఉండెడివి. అదృష్టవశమున దక్షిణేశ్వర మందలి పవిత్ర వాతావరణమునకును మథురానాథుని ఔదార్యమున కును మోజుపడి దేశము నలు మూలల నుండియు సాధువులును సన్న్యాసులును నానాటికి హెచ్చుగా రా సాగిరి. ఆ సాధువులలో అన్ని తెగల వారును ఉన్నారు. అద్వైతులు ఉన్నారు, ద్వైతులు ఉన్నారు, వైష్ణవులు ఉన్నారు, వేదాంతులు ఉన్నారు, శాక్తేయులు ఉన్నారు, రామోపాసకులు ఉన్నారు. ఋషులును దివ్యద్రష్టలును శ్రీరామకృష్ణుని సలహాను బొందుటకు వచ్చు చుండిరి. ఆయన వైష్ణవ సాధనలు చేయుచుండిన కాలమున వైష్ణవులు వచ్చి యుండిరి. తాంత్రిక సాధనలు చేయ్యుచుండిన కాలమున తాంత్రికులు వచ్చి యుండిరి. తోతాపురి వెడలి పోయిన పిదప వేదాంతులు రా దొడంగిరి. అతిసారముచే బాధపడుచు శ్రీరామకృష్ణుడు పాన్పుపై పరుండి యున్న గదిలోనే వేదాంతులు వేద విషయక చర్చల సాగించు చుండ, ఆయన తన దేహబాధలను గూడ మఱచి, తన ప్రత్యక్షానుభవములను వివరించి, వారి సందేహములను దీర్చెడి వాడు. వచ్చిన వారిలో అనేకులు పారమార్థికపరులు, హిందూ సిద్ధాంతమునకు నిగూఢము లైన స్తంభముల వంటి వారు. వారి ఆధ్యాత్మిక జీవితములకు దక్షిణేశ్వర యోగీంద్రుని వలన గలిగిన చుఱుకుతనము ఇంతంత కాదు. వారివలన శ్రీరామకృష్ణుడును యోగుల చరితములను పద్ధతులను గూర్చిన ఐతిహ్యములను తెలిసి కొనెను. అనంతర కాలమున తన శిష్యులకును భక్తులకును ఆతడు దెలిపిన ఐతిహ్యములు అవే. యాత్రాప్రవణులై అచటికి వచ్చు సాధుపుంగవులకు అర్పింపను ఆహారపదార్థములు వస్త్రములు మున్నగు వానిని మథురానాథుఁడు శ్రీరామకృష్ణుని కోరిక మేరకు సమృద్ధిగ సరఫరా చేయుచుండెను.

శ్రీరామకృష్ణునకు గ్రంథపాండిత్యము లేదు. కాని మతములను మతసిద్ధాంతములను గూర్చిన అతని జ్ఞానము సర్వతోముఖము ఐనది. అసంఖ్యాకులు అయిన యోగీంద్రులతోను విద్వాంసులతోను సాంగత్యము చేకుటి నందుననే శ్రీరామకృష్ణునకు అట్టి జ్ఞానము గలిగినది. గ్రాహ్యాంశములను జీర్ణించుకొను సామర్థ్యములో శ్రీరామకృష్ణుడు అద్వితీయుడు. తెలిసికొన్న విషయములను, ధ్యాన ప్రభావమున, ఆయన తన బ్రతుకులో ఒకభాగముగ జేసికొనెను. "మీ జ్ఞానము అపారముగ ఉన్నదే, మీకు అంతటి జ్ఞానము ఎం దుండి వచ్చినది" అని ఒకానొకప్పుడు ఒకశిష్యుడు శ్రీరామకృష్ణుని అడిగెను. "నేను గ్రంథములను జదువ లేదు, కాని విషయములను పెద్దలయొద్ద నేర్చుకొంటిని. ఆ జ్ఞానమును ఒక మాలగా గూర్చుకొని కంఠమున ధరించి యున్నాను. దానినే మాతృచరణములకు ఉపహారముగను అర్పించితిని" అని ఆయన బదులు చెప్పెను.

పువ్వులు వికసించి నప్పుడు, తేనకై తుమ్మెదలు తమంతట వచ్చి చేరును అని శ్రీరామకృష్ణుడు చెప్పుచుండెడి వాడు. (అట్లే) ఇప్పుడు తమ ఆధ్యాత్మిక తృష్ణలను దీర్చుకొన ఎంద ఱెందఱో దక్షిణేశ్వరమునకు రా సాగిరి. భక్తుడుగను సాధకుడుగను ఉండిన శ్రీరామకృష్ణుడు గురుదేవుడు అయ్యెను. శ్రీరామకృష్ణుడు అవతార పురుషుడు అని తొట్టతొలి ఉద్ఘాటించిన గౌరీపండితుఁడు 1870 వ సంవత్సరమున గురుదేవుని సందర్శించి ఆయన దీవెన లంది సన్న్యసించెను. నారాయణశాస్త్రి అను మఱి యొక పండితుడు ఉండెను. ఆఱుదర్శనము లందును అతని ప్రజ్ఞ అసమానము. జయపుర మహారాజు గొప్ప జీతము గల ఒక నౌకరిని స్వీకరింప ర మ్మని ఆయనను పిలుచు చుండెను. ఆ నారాయణశాస్త్రి శ్రీరామకృష్ణుని గలసికొనెను. తాను వట్టి పుస్తక పాండిత్యమున తెలిసికొన్న లక్ష్యములు అన్నియు స్వానుభవమున ప్రత్యక్షీకరించుకొన్నవాడు శ్రీరామకృష్ణుడు అని ఆతడు గ్రహించెను. శ్రీరామకృష్ణుని ప్రార్థించి నారాయణశాస్త్రి

ఆయనయొద్ద నుండియే సన్న్యాసదీక్షను స్వీకరించెను. బర్ద్వాను మహారాజు నాస్థాన పండితుడును సుప్రసిద్ధ తర్క - వేదాంత విద్వాంసుడును అగు పద్మలోచనుడు శ్రీరామకృష్ణుని భగవ దవతారము అని శిరసా వహించెను. కృష్ణకిశోరుడు అను వేదాంతపండితుడు గూడ గురుదేవునికి భక్తుడు అయ్యెను. విశ్వనాథఉపాధ్యాయ్ అను నతడును అచ్చటికి అరుదెంచెను. అతడును గురుదేవునకు ప్రియ భక్తుడు కానున్నాడు. ఆయనను శ్రీరామకృష్ణుడు ఎప్పుడు పిలిచినను 'కాప్టన్' (సేనాపతి) అనియే పిలుచును. ఆయన నేపాళ మహారాజు నాస్థానమున గొప్ప ఉద్యోగి. ఆయన శక్తిసామర్థ్యములకు తగినట్లు ఆయనకు కర్నలు పట్టమును గలదు. ఆయన భగవద్గీత యందును భాగవతమందును వేదాంతశాస్త్ర మందును పండితుడు. మహాభక్తితో అతడు తన యిష్టదేవుని ప్రతిదినమును ఆరాధించు చుండును. ఆయన ఇట్లు అన్నాడు — "నేను వేదములను జదివి యున్నాను. ఇతర పవిత్ర గ్రంథములను జదివి యున్నాను. సన్న్యాసులను భక్తులను ఎందఱనో ఎన్ని యెడలనో కలిసికొని యున్నాను. కాని శ్రీరామకృష్ణుని సన్నిధికి వచ్చిన తర్వాతనే, నా ఆధ్యాత్మిక తృష్ణ తీఱినది. వేద ప్రతిపాదిత సత్యములు ఎల్ల అతనియందు రూపుగొన్నవి అని నా నిశ్చయము."

నిర్వికల్పసమాధిలో బ్రహ్మమును ఎఱిగిన వాడు కావున శ్రీరామకృష్ణునకు, ద్వంద్వాతీతబ్రహ్మమే ద్వంద్వరంగమున వివిధ మత ప్రతిపాదిత వివిధ దేవతలుగ రూపొందును అనియు, పరతత్త్వము వాగతీతము అనియు ఎఱుక దృఢపడెను. మతములు అన్నియు తమ అనుచరులను వేఱు వేఱు దారుల గుండ ఒక్క గంతవ్యమునే చేర్చు చున్నవి అని అతడు గ్రహించెను. అన్యమతములను కొన్నింటిని పరిశీలింతము అను కుతూహలము అతనికి కలిగెను. ఏల యన, ఎఱుగుట అనగా అనుభవమున ఎఱుగుటే ఆయన పద్ధతి.

## మహమ్మదీయమతము

1866 వ సంవత్సరము కడపట గురుదేవుడు మహమ్మదీయ సిద్ధాంత ప్రోక్త సాధనల ననుష్ఠింప నారంభించెను. ఆయన తన మహమ్మదీయ గురువు చూపిన మార్గమున తన్ను పూర్తిగ ఆ క్రొత్త సాధనకు అర్పించుకొనెను. మహమ్మదీయులు ధరించెడి ఉడుపులనే ధరించి ఆయన అల్లా నామమును జపించెను; ప్రార్థనలు మహమ్మదీయ సిద్ధాంత విహిత ప్రార్థనలుగ రూపొందెను. హిందూ దేవులను, హిందూస్త్రీ దేవతలను, కడకు కాళిని గూడ ఆయన మఱచి పోయెను; దేవాలయములకు పోవుటను మానుకొనెను; దేవాలయ ప్రాకారమునకు వెలుపల తన బసను ఏర్పఱచుకొనెను. మూడు దినములకు పిదప ఒక మహోజ్జ్వల మూర్తి ఆయనకు ప్రత్యక్షము అయ్యెను. అగపడినది, మహమ్మదే కాబోలును. ఆ మూర్తి మెల్లగ శ్రీరామకృష్ణుని సమీపించి కడకు ఆయనలో లీనమై పోయెను. మహమ్మదీయ దైవ సాక్షాత్కారము ఆయనకు ఆ రీతిని గలిగెను. ఆదశనుండి ఆయన సమాధిదశ నొంది బ్రహ్మముతో ఐక్యము అను భవించెను. మహమ్మదీయ మతము అనెడి నదియు, మరల ఆయనను బ్రహ్మము అనెడి సాగరమునకే చేర్చినది.

## క్రైస్తవము

ఎనిమిది ఏండ్లకు అనంతరము, 1874 వ సంవత్సరము నవంబరులో ఒకప్పుడు క్రైస్తవ సిద్ధాంత ప్రతిపాదిత తత్త్వమును గూడ గ్రహింప వలయును అను కోరిక శ్రీరామకృష్ణునకు అణంచు కొన రానిదై కలిగెను. తన భక్తుడును, కలకత్తా పౌర మహాశయు డును అగు శంభుచరణమల్లిక్కు చే బైబిలు ఘట్టములను చదివించు కొని శ్రీరామకృష్ణుడు విన తొడంగెను. జీససు జీవితచరిత్రమును ఉపదేశములును శ్రీరామకృష్ణుని మరులు గొల్పినవి. ఒకనాడు ఆయన దక్షిణేశ్వర మందలి 'యదుమల్లిక్' మహాశయుని ఆరామ

భవనమున ఒక చావడిలో కూర్చుండి మేరీమాతయు దివ్యశిశువును ఉన్న చిత్తరువును తదేకధ్యానముతో తిలకించుచుండెను. చూచుచుండగనే, దివ్యభావావేశము అతనిని పైకొనెను. ప్రతిమలు సచేతనములై అగపడ్డవి. వానినుండి తేజఃకిరణములు వెలువడి శ్రీరామకృష్ణుని హృదయమున ప్రవేశించినవి. మహమ్మదు దర్శనానుభవ ప్రభావమున కన్న, ఈ దర్శనానుభవ ప్రభావము అధికతరమై యుండెను. దిగులుపడి ఆయన "తల్లీ, నన్ను ఏమి చేయుచున్నావు" అని కేకలు ఇడెను. జాతి మతముల హద్దులను భేదించుకొని ఒక వినూత్నానంద రాజ్యమున చొచ్చెను. ఆయన డెందమును క్రైస్తు వశపఱచుకొనెను. మూడు దినములు ఆయన కాళిగుడిలో అడుగు పెట్టనే లేదు. నాలవనాటి మధ్యాహ్నమున పంచవటియందు పోవుచుండగా ఒకానొక వ్యక్తి ఆయనకు ఎదురుగ వచ్చుచు పొడకట్టెను. ఆవ్యక్తి కన్నులు విశాలసుందరములుగను, నెమ్మోము సుప్రసన్నముగను, మేను ధావళ్యవిరాజితముగను ఉండెను. వారు ఒకరు ఒకరికి ఎదురుగ నిలిచియుండ శ్రీరామకృష్ణుని హృదయాంతరాళమునుండి ఒక వాణి ఇట్లు వినవచ్చెను — "క్రైస్తుదేవుని దర్శింపవోయి, సకలచేతనుల విముక్తికై తన హృదయరక్తమును గార్చిన అతడు ఇతడే, ప్రాణుల మీది ప్రేమచే యాతనాసాగరమును ఓర్చిన కృపాళువు ఇతడే, బ్రహ్మసాయుజ్యసిద్ధిని అందిన యతిసార్వభౌముడు ఇతడే, ఇతడే ప్రేమమూర్తి, జీసను". క్రైస్తుదేవుని ఆ మూర్తి లోకమాతృనందనుడు ఐన శ్రీరామకృష్ణుని కౌగిలించుకొని ఆయనలోనే కలిసిపోయెను. ఇంతకు మునుపు కాళీ – శ్రీరామ – హనుమద్ – రాధికా – కృష్ణ – మహమ్మదులతోను బ్రహ్మముతోను తాను అనుభవించిన ఐక్యమునే ఇప్పుడు క్రైస్తుతోను శ్రీరామకృష్ణుడు అనుభవించెను. సమాధి నిమగ్నుడై సగుణబ్రహ్మముతో సంశ్లేషించి, "బ్రహ్మజ్ఞానప్రాప్తికి క్రైస్తవసిద్ధాంతము కూడ ఒక మార్గమే" అను సత్యమును స్వానుభవమున ఆయన తెలిసికొనెను. క్రైస్తు భగవదవతారము అను నమ్మకము శ్రీరామకృష్ణునకు కడవఱకును

ఉండెను, కాని క్రైస్తు ఒక్కడే అవతారమూర్తి అని మాత్రము ఆయన ఎన్నడును భావింప లేదు. ఆయన నమ్మకమున బుద్ధ కృష్ణాదులును అవతారపురుషులే.

## వివిధమతముల పట్ల గురుదేవుని వైఖరి

శ్రీరామకృష్ణుడు బుద్ధదేవుని దివ్యత్వమును అంగీకరించెను, అంతే కాక బుద్ధుని బోధనలకును ఉపనిషత్తుల బోధనలకును గల పోలికలను ఎత్తిచూపుచుండెను. జైన మతస్థాపకు లైన తీర్థంకరుల పట్ల గూడ ఆయన మహాగౌరవమును జూపెను. శిక్కు మత గురువులు పదుగురు. వారియందును ఆయనకు ఎంతో ఆదరము ఉండెను. కాని ఆగురువులను భగవ దవతారములు అని ఆయన చెప్ప లేదు. వారు జనకమహారాజు నవతారములు అని చెప్పెడి వా డట. దక్షిణేశ్వరమున తన గదిలో ఆయన మహావీరతీర్థంకరుని చిన్న ప్రతిమను ఒకదానిని, క్రైస్తుదేవుని చిత్రమును ఒకదానిని ఉంచుకొని, వానికి ప్రాతస్సాయం వేళలలో ధూపమును అర్పించుచుండెను.

ఇట్లు అన్య మత సిద్ధాంతముల, యథావిధిగ ఉపదేశము ఒందకే, శ్రీరామకృష్ణుడు వాని లక్ష్యములను సాక్షాత్కరించుకొనెను. ఏ దేని ఒక సిద్ధాంతమును అనుసరింప వలసిన అక్కఱ ఆయనకు లేదు. భగవంతునందు ఆయనకు గల ఉత్కటకోటికము అగు ప్రేమచే అన్ని పొలిమేరలును తొలగి పోయినవి. పోగా, ఆయన విశ్వ మందలి వివిధ మ తాదర్శములను భావములను గుఱించి సోపపత్తికముగ ప్రసంగింప గల నిపుణుడు అయ్యెను. ఆయన దివ్య సూక్తులు — ''హిందు మహమ్మదీయ క్రైస్త వాది మత బోధనలను అన్నిటిని నేను సాధన చేసితిని. ఒక్క హిందూమతములోనే ఉన్న వివిధ శాఖలను సైతము నేను అవలంబించి చూచితిని. మార్గములు వేర్వేఱుగా ఉన్నను అందఱును ఒక్క పరమాత్మ్మని జేరుటకే పయనించుచున్నారు. వివిధమార్గములు అన్నిటిలోను ఒకపరి సంచరించి

మీరు వానిని అనుష్ఠించి చూడ వలయును. హిందువు లేమి, మహమ్మదీయు లేమి, బ్రాహ్మసమాజమువా రేమి, వైష్ణవు లేమి, ఇతరు లేమి అందఱును మతమును సాకుగ జేసికొని ఒం డొరులతో కలహించుచున్నారు. ఏవంక చూచినను పరిస్థితి అట్లే ఉన్నది. ఎవడు కృష్ణుడో అతడే శివుడు అనియు, ''ఆదిశక్తి''యు ''జీససు''ను ''అల్లా''యు అతడే అనియు, ఒక రామునకే పెక్కు నామములు అనియు వారు ఎన్నడును తలంపరు. తటాకమునకు వేఱు వేఱు దిగుడుపట్టులు ఉన్నవి. ఒకపట్టున హిందువులు తమ బిందెల లోనికి నీళ్లు నింపుకొని ఆ నీటిని జలము అని పేర్కొందురు. వేఱు ఒక పట్టున మహమ్మదీయులు తమ తోలుసంచులలోనికి నీరు నింపుకొని ఆ నీటిని 'పాని' అని పేర్కొందురు. మూడవ పట్టున క్రైస్తవులు ఆ తటాక తోయమునే గొనుచు ఆ నీటిని వాటర్ అని పేర్కొందురు. ఆ నీరు పానియో వాటరో అగును కాని జలము కా దని తలంప నగునా? ఎంత సిగ్గుచేటు! వస్తువు ఒక్కటే. అందఱును ఒక్కదానినే ఆశ్రయించు చున్నారు, వేఱు వేఱు పేర్లతో పేర్కొను చున్నారు. వాతావరణము, చిత్తవృత్తి, పేరు — అనెడి యివే భేదములకు కారణములు. దేవు నెఱుంగుటకై ఒక్కొక్కడును తనదారినే అనుసరించును గాక. అతనికి ఆర్జవమును దీక్షయు ఉన్న జాలును. — ఓంశాంతి శ్శాన్తి శ్శాన్తిః — దైవసాక్షాత్కారము తప్పక గలుగును.

తప్పక గుర్తింప వలసిన ఒక చోద్యము ఏమి అనగా — శ్రీరామకృష్ణుడు మహమ్మదీయ క్రైస్తవ సిద్ధాంతముల నిష్కృష్ట సాధనలను ఆచరించు నప్పుడు, దేవాలయములకు ప్రతిదినమును బోవుట, భగవన్నామమును జపించుట, ఇతరభక్తి కార్యములు — ఈ హిందూ మ తాచారములను పూర్తిగ విడిచిపెట్టెను. అంతే కాదు, ఆయన హిందూదేవుల ప్రతిమలను హిందూస్త్రీ దేవతల ప్రతిమ లను తన గదిలో నుండి తీసియు వేయించెను. ధర్మనిష్ఠ ఉన్నచో, క్రైస్తవుడు కాని, మహమ్మదీయుడు కాని తన మతమునే అనుసరించి

బ్రహ్మభావమును అంద గలడు అని శ్రీరామకృష్ణుడు తన యాచర ణచే ప్రదర్శించినాడు.

తన తపశ్శ్రమ తీర్చికొందము అని శ్రీరామకృష్ణుడు 1867 వ సంవత్సరమున కామార్పుకురునకు మగిడి వచ్చెను. పల్లె పరిసరము లందలి శాంతిసమృద్ధిచేతను అమాయకులును సరళచిత్తులును అగు బాల్యసఖులతోడి పునస్సమాగమముచేతను, పరిశుద్ధమైన వాతా వరణముచేతను ఆయనకు చాల మేలు గలిగెను. లీలాప్రియుడును దాపరికము ఎఱుగని వాడును, సత్యపరుడును హాస్యరసికుడు ఐనను కృపాళువును అగు తమ గదాధరునితో మరల కలిసికో కలిగినందులకు పల్లెప్రజలు చాల సంతోషించిరి కాని అతడు కలకత్తాలో ఉండిన అన్ని యేండ్లలో అతనిలో గలిగిన గొప్ప మార్పును వారు గుర్తింప లేక పో లేదు. అతని భార్య శారదాదేవియు కామార్పుకురునకు వచ్చెను. అప్పుడు ఆమెకు వయస్సు పదునాలుగు సంవత్సరములు. ఆమెలో వయస్సునకు మించిన జ్ఞానపరిపాకము కుదిరి యున్నందున తనపెనిమిటి మనఃపరిస్థితిని ఆమె వెంటనే అర్థముచేసికో గలిగెను. పరిచర్యచేయుచు ఆయనయొద్దనే ఉండి దేవుని గుఱించిన విషయము లను ఆయనయొద్ద తెలిసికో వలెను అను ఆత్రము ఆమెకు కలిగెను. గురుదేవుడు ఆమెను సంతోషముతో తన శిష్యనుగను ఆధ్యాత్మిక రంగమున సయాత్రికురాలినిగను అంగీకరించెను. ఆ దినములలోని తన అనుభవముల ప్రస్తావము అనంతరకాలమున ఒకప్పుడు రాగా "ఆనంద పూర్ణ కలశమును ఒకదానిని సదా నా హృదయమున ఉంచుకొన్నట్లు ఉండినది. ఆ యానందమును వర్ణింప అలవి కాదు" అని శారదాదేవి చెప్పినది.

## యాత్ర

1867 వ సంవత్సరము జనవరి తే 27 ది నాడు మథుర్ బాబు సుమారు నూటయిరువదియైదుగురు సయాత్రికులను వెంట ఇడుకొని

ఉత్తరభారత మండలి పుణ్యక్షేత్రముల దర్శింప బయలుదేఱెను. బీహారమున వైద్యనాథమునొద్ద ఒకపల్లెలో ప్రజలు పేదఱికముచేతను పస్తులచేతను మిక్కిలి కృశించి అస్థిపంజరములవలె ఉండిరి. ఆ ప్రజలకు ఎల్లరకు కడుపు నిండుగ అన్నము పెట్టుము అనియు, ఒక్కొక్కరికి ఒక్కొక్కటి చొప్పున వస్త్రములను బహూకరింపుము అనియు శ్రీరామకృష్ణుడు తనకు ఆశ్రయుడును సంపన్నుడును అగు మథుర్‌బాబును కోరెను. వ్యయము పెచ్చు పెరిగి పోవునే అని మథుర్‌బాబు వెనుకాడెను. అప్పుడు గురుదేవుడు "నేను కాశికి రాను, ఈ పేదల దుఃఖములలో పాల్గొనుచు వీరితోడనే ఉందును" అని నిష్ఠురముగా పల్కెను. మథుర్‌బాబును వీడి ఆయన ఆ పల్లెప్రజల నడుమ కూర్చుండెను. ఇక అప్పుడు మథుర్‌బాబు సమ్మతింప వలసి వచ్చెను. మరల రెండు ఏండ్లు అయిన పిమ్మట ఒకప్పుడు పేదలపట్లను యాచకులయెడను శ్రీరామకృష్ణుడు ఇట్టి ఆదరమునే చూపెను. మథురానాథుడు శిస్తువసూలుకై తన జమీనులో సంచరించు చుండెను. శ్రీరామకృష్ణుడును ఆయనతో ఉండెను. రెండు ఏండ్ల కాలము పంటలే లేనందున రైతులు అందఱును తీవ్రదారిద్ర్యమున ఉండిరి. శిస్తులను తగ్గింపుము అనియు, వలసిన వస్తువులను పంచి పెట్టుము అనియు, ఆకలిచే నకనకబడుచున్న వారికి కడుపు నిండ విందు పెట్టుము అనియు గురుదేవుడు మథుర్‌బాబును వేడెను. ఆయన సణిగెను. అందులకు గురుదేవుడు "నీవు లోకజనని కాళీదేవి నియమించుకొన్న కార్యదర్శివి, అంతే, వారు ఆ తల్లి రైతులు, తల్లి సొమ్మును నీవు తప్పక ఖర్చుపెట్ట వలసినదే. వారు కష్టపడుచున్నప్పుడు నీవు ఎట్లు కాదు అన గలవు? నీవు వారికి సాయము చేయ వలసినదే" అని మందలించెను. మరల మథురుడు ఒప్పుకో వలసి వచ్చెను. మనుష్య స్వభావ జ్ఞానము కల వారికిని ఉపకారపరులకును మాత్రము ఉండునట్టి ఆదరము కాదు శ్రీరామకృష్ణునిది. శ్రీరామకృష్ణుడు సకలజీవు లందును భగవంతుని సాక్షాత్కరించుకొన్న వాడు కావుననే పేదల పట్ల ఆయనకు అట్టి సానుభూతి గలిగినది. మానవ

సేవ మాధవసేవయే, జీవసేవ శివసేవయే అను గట్టినమ్మకము ఆయనకు ఉండెను.

గంగలో, పడవలో, పయనించి — ఆ జట్టువారు కాశిలో ప్రవేశించిరి. యుగయుగములుగా అనంత సంఖ్యాకు లయిన ఆరాధకుల భక్తిశ్రద్ధలు అచ్చట రాశీభూతములై ఉన్నవి. ఆ నగరము బంగారుమయము అని వేదములు కొనియాడినవి. శ్రీరామకృష్ణుని చూపులు దానిపై ప్రసరించి నప్పుడు ఆ నగరము ఆయనకు బంగారు మయముగనే కన్పట్టెను. ఔత్సుక్యంపు పొంగు ఆయనలో ఇముడక ప్రకట మయ్యెను. ఆ నగరమున ఉన్నంత కాలము అచటి నేల యందలి ప్రతిరేణువుపైని ఆయన ఆత్యంతిక భక్తి చూపెను. మణికర్ణిక అని ప్రసిద్ధ మయిన అచటి శ్మశానములో భసితావయవుడును కపిలజటాజూటుడును అగు పరమశివుడు ప్రతిచితిని సమీపించి దానిపై ఉన్న శవము చెవిలో తారకమంత్రమును ఉపదేశించుటయు, అచటి ప్రేతముల బంధములను జగజ్జనని స్వయముగ తొలగించు చుండుటయు శ్రీరామకృష్ణునకు వాస్తవముగ కనబడెను. కాశిలో శరీరత్యాగము చేసిన వారికి పరమ శివుని అనుగ్రహమున మోక్షము తప్పక కలుగును అను శాస్త్రగ్రంథప్రతిపాదన యాథార్థ్యము శ్రీరామకృష్ణుడు తన కంటి యెదుట కాంచెను. కాశిలో త్రైలింగస్వామి అను ఒక ప్రసిద్ధసన్న్యాసి ఉండెను. గురుదేవుడు ఆయనను దర్శించెను. ఆయననుగూర్చి, అనంతరకాలమున, సాక్షాత్పరమశివుని ప్రతిరూపము అనియు యథార్థ పరమహంస అనియు గురుదేవుడు ఉద్ఘాటించి ఉన్నాడు.

గంగా యమునల సంగమము నొద్ద అలహాబాదును దర్శించి, అచటినుండి ఆయన గోపికలయు శ్రీకృష్ణునియు చరితములచేతను, గేయములచేతను, రూపకములచేతను, పావనము లయిన మథురా బృందావనములకు బయలుదేఱెను. అట ఆయన కన్న దివ్యదర్శనములు అనేకములు. ఆయన డెందమున దివ్యభావోద్రేకము నిండి

తొనకినది; విలపించి "ఓ కృష్ణా, నీవు ఒక్కడవు మాత్రము ఇప్పుడు ఇచ్చట లేవే కాని, తక్కినవి అన్నియు ఆ పురాణకాలమున ఉన్నట్లే ఉన్నవి" అనెను. అచట 'గంగామాయి' అను ఒక గొప్పయోగిని ఉండెను. ఆమె పూర్వజన్మమున శ్రీరాధికనుగొల్చిన అంతరంగ చేటికలలో ఒక్కర్తె అని అచటి సకల వైష్ణవులును ఆమెను గొల్చెదరు. ఆమెకు వయస్సు అరువది సంవత్సరములు, భక్తిభావ తన్మయ దశలు ఆమెకు తఱచు గలుగుచుండెడివి. శ్రీరామకృష్ణుడు ఆమెను దర్శించెను. రాధయే శ్రీరామకృష్ణుడుగ అవతరించినది అని ఆమె చెప్పినది. ఆమెను విడువ లేక విడువ లేక శ్రీరామకృష్ణుడు ఎట్టకేలకు ఎంతో కష్టముతో విడిచి వచ్చెను.

మరలి వచ్చుచుండి నప్పుడు, మథుర్‌బాబు గయకు పోవుదము అనెను. శ్రీరామకృష్ణుడు రాను అనెను. తాను పుట్టుటకు ముందు తన తండ్రికి అగపడిన దివ్యదృశ్యములు ఆయనకు జ్ఞప్తికి వచ్చినవి. కాబట్టి అచటి విష్ణుదేవుని గుడిలో అడుగు పెట్టినచో తన యాత్మ పునరావృత్తి రహితముగ భగవంతునిలో లయించి పోవచ్చును అని ఆయన అనుకొనెను. గురుదేవుని మాటను మన్నించి మథురుడు సరాసరి కలకత్తాకే తిరిగి వచ్చివేసెను.

బృందావనమునుండి గురుదేవుడు ఒక పిడికెడు మట్టిని తెచ్చియుండెను. అందు కొంతను పంచవటిలో చల్లి, మిగిలిన దానిని తాను ధ్యానము అభ్యసించు చిన్న కుటీరమున భూగర్భమున పదిలపఱచి "పవిత్రతలో ఇప్పుడు ఈచోటు బృందావనముతో సరితూగును" అనెను.

గురుదేవుడు 1870 లో చైతన్యుని అవతార స్థలమైన నదియాకు యాత్ర చేసెను. నావ నదియాతీరమును సమీపింపగనే సోదరకల్పులు అయిన శ్రీచైతన్యుడును ఆయన సఖుడువైన నిత్యానందుడును, స్వీయ ప్రభా పరివేష మండితులై, సాదరముగ చేతులెత్తుకొని తనకు ఎదురుగ వచ్చుచున్నట్లు శ్రీరామకృష్ణునకు అగ

పడెను. ''వారు వచ్చుచున్నారు, వారు వచ్చుచున్నారు, అదుగో అదుగో'' అని ఆయన కేకలు ఇడెను. వారు ఆయన దేహమున గలిసి పోయిరి. ఆయన గాఢభావసమాధిలో మునిగెను.

## ఇల్లాలితోడి సంబంధము

1872 వ సంవత్సరమున శారదాదేవి దక్షిణేశ్వరమున ఉన్న తన భర్తయొద్దకు మొదటిసారి వచ్చెను. అంతకు నాలుగు ఏండ్లు మునుపు ఆమె ఆయనను కామార్పుకురు నొద్ద కాంచి, ఆయనతోడి దివ్య సాహచర్యానందమును చవి చూచి యుండెను. ఈ నడిమి కాలమున ఆమెలోని శాంతము, కనికరము, లోచూపు, గాంభీర్యము, నిస్స్వార్థత—అను గుణములు పూర్వమున కంటె హెచ్చుగ పెరిగి ఉండినవి. తన పెనిమిటికి వెఱ్ఱి పట్టినది అను వార్త అనేకుల మూలముగా ఆమె చెవిని బడెను. ఆమె బ్రతుకు శోచనీయమైనది అని — ప్రజలు 'అయ్యో పాపము', అనుచుండిరి. ఆలోచించిన కొలదియు, పతియొద్దనే ఉండి, యథాశక్తి పరిచర్య చేయుచుండుటే— పత్ని యగు తనకు విహిత ధర్మము అని ఆమెకు తోచెను. అప్పుడు ఆమెకు వయస్సు పదునెనిమిది ఏండ్లు. తండ్రిని తోడు ఉంచుకొని, ఎనుబది మైళ్ల దూరము పాదచారిణిగనే పయనించి దక్షిణేశ్వరమునకు వచ్చి చేరెను. దారి నడుమ ఆమెకు జ్వరము వచ్చినది. దేవాల యారామమునకు ఆమె వచ్చి చేరగనే, గురుదేవుడు ''అయ్యో! నీవు ఇంత ఆలస్యముగ వచ్చితివే. నిన్ను విచారించు కొనుటకు లేక నా మథురానాథుడు (మనల వీడి) పోయెనే'' అని దుఃఖించెను. అంతకు ఒక్క సంవత్సరము ముందుగనే మథుర్ బాబు మరణించి యుండెను.

గురుదేవుడు తరుణ వయస్సున ఉన్న తన యిల్లాలికి నేర్ప వలసిన విషయములను నేర్పు పనిని తానే పూనుకొనెను. ఆయన బోధనలో ఇంటిపనులు మొదలు బ్రహ్మజ్ఞానమువఱకును అన్నియు

ఉన్నవి. దీపమును సరిచేయు విధమును, వివిధచిత్తవృత్తులు గల ప్రజలతో నడచుకొను విధమును, చూడ వచ్చిన వారి యెదుట ప్రవర్తింప వలసిన రీతియు — ఆయన ఆమెకు నేర్పెను. ప్రార్థన, ధ్యానము, జపము, గాఢచింతనము, సమాధి మొదలుగా ఆధ్యాత్మిక జీవిత మర్మములను ఆయన ఆమెకు బోధించెను. శారద నేర్చుకొన్న మొదటి పాఠము "చందమామ పసిపాపలకు అందఱికిని ప్రియమైనట్లు, దేవుడు ఎల్లరకును ప్రియవల్లభుడు. దేవుని ప్రార్థించు అధికారము ప్రతివ్యక్తికిని కలదు. తన్ను సేవించిన వారికి భగవంతుడు, తన కృపచే, దర్శనము ప్రసాదించు చుండును. నీవును దేవుని జూతువు, ప్రార్థించిన చాలును".

గురుదేవునకు పెండ్లి యైన సంగతి తెలిసిన వెంటనే, తోతాపురి ఒకసారి ఇట్లు అనెను — "పెండ్లివలన ఎట్టి చెడుగును లేదు. గృహస్థుడుగ ఉండియు వివేకవైరాగ్యములు నిల్పుకొన్నవాడు ఎవడో, వాడే బ్రహ్మజ్ఞానమున అప్రకంప్యుడుగ నెలకొన్న వాడు. స్త్రీపురుష భేద భావనను అతిక్రమించి సర్వమును బ్రహ్మమయముగ తలంపగల వాడు ఎవడో వాడే ఉత్తమోత్తమ జ్ఞాని. స్త్రీపురుష భేద భావనను దాటని వాడు మంచిసాధకుడే కావచ్చును గాని, లక్ష్యమునకు ఇటువైపే, చాల క్రింది స్థాయిలో ఉన్నవాడు అగును". శ్రీరామకృష్ణుడును ఆయనభార్యయు దక్షిణేశ్వరమున ఒకరు ఒకరితో కలిసియే ఉండిరి, అయిన నేమి? ఉభయుల మనస్సులును ఐహికమునకంటె చాల పైస్థాయికి ఎక్కి ఉండినవి. శారదాదేవి వచ్చి కొన్నినెలలు ఐన తర్వాత, ఒక సుదినమున శ్రీరామకృష్ణుడు జగజ్జనని యైన కాళికాదేవికి ఒక ప్రత్యేక పూజకు వలసిన సన్నాహములను జేసెను. పూజావిగ్రహమునకు బదులు, ఆస్థానమున శ్రీరామకృష్ణుడు దేవికి సచేతనప్రతికృతి యైన శ్రీశారదనే ప్రతిష్ఠించెను. ఆరాధకు డైన ఆయనయు ఆరాధనను అందుకొన్న ఆమెయు ఉభయులును గాఢసమాధిలో చొచ్చిరి. ద్వంద్వాతిరిక్త స్థాయిలో వారి యాత్మలకు ఐక్యము గలిగినది. పెక్కుగంటలకు

పిమ్మట శ్రీరామకృష్ణుడు వ్యావహారిక స్థాయికి దిగి, మహాదేవిని గూర్చి ఒక సంకీర్తనను పాడి, ఆ సజీవ ప్రతికృతి చరణములకు తన్ను, తన జపమాలను, తాను ఇంతవఱకు చేసిన సకల సాధనల ఫలితములను అర్పించెను. ఈ పూజ, తంత్రశాస్త్రమున 'షోడశీ పూజ' అనియు "మహిళారాధనము" అనియును ప్రసిద్ధము. "ఓ దేవా, నీవు స్త్రీవి, నీవు పురుషుడవు, నీవు బాలకుడవు, నీవు బాలికవు, నీవు చేత కఱ్ఱను ఊనుకొని వడవడ వణకు వృద్ధుడవును. విశ్వము అంతటను, దాని నానారూపములలోను నీవు వ్యాపించి ఉన్నావు" అనెడి ఉపనిషన్మహా వాక్య యాథార్థ్యమును శ్రీరామ కృష్ణుడు ప్రత్యక్షముగ ఎఱింగెను.

తాను వివాహము ఆడుటచే "ఆధ్యాత్మిక పరిణతిలో వివాహమునకు గొప్ప విలువ గలదు" అని శ్రీరామకృష్ణుడు అంగీకరించినవాడు ఆయెను. సన్న్యాస వ్రత నియమములను పాటించి, "బ్రహ్మ సాక్షాత్కారము కావలెనేని, ఆత్మనిగ్రహమును శుచితయు దమమును అత్యావశ్యకములు" అని ప్రదర్శించి చూపెను. తన భార్యతో తాను ఇంద్రియాతిగమును అద్వితీయమును ఐన చుట్టఱికము నెఱపి "దంపతులు ఆధ్యాత్మికరంగమున గూడ సయాత్రికులుగ ఉండ వీలు అగును" అని ఆయన నిరూపించెను. ఇట్లు ఆయన జీవితము గార్హస్థ్య సన్న్యాసముల మేలి కలయికగా వెలసినది.

## గురుదేవుని అహంకారము

బ్రహ్మముఒక్కడే తథ్యము అనియు జగత్తు మిథ్య అనియు శ్రీరామకృష్ణుడు నిర్వికల్పసమాధిదశలో స్పష్టముగ తెలిసికొని యుండెను. అద్వైతబ్రహ్మస్థాయిలో తనమనస్సును ఆఱు నెలల కాలము ఉంచి ఉండి నందున ఆయన విజ్ఞాని దశను పొందెను. విజ్ఞాని అనగా విశిష్టమును సమృద్ధమును అగు బ్రహ్మజ్ఞానము గలిగి, తన యందును ద్వంద్వాతీత తత్త్వమందును మాత్రమే కాక లోకము

లోని ప్రతివస్తువునందును బ్రహ్మమును సాక్షాత్కరించుకొను వాడు. ఈ విజ్ఞాన దశలో, ఒకొక్కప్పుడు దేహస్మృతియే లేక, ఆయన తానును బ్రహ్మమును అభిన్ను లని భావించును. ద్వైతప్రపంచస్మృతి ఉన్న సమయములలో తన్ను భగవద్భక్తునిగనో సేవకునిగనో శిశువును గనో అనుసంధించుకొనును. గురుదేవుని విశ్వ శ్రేయ స్సాధన దక్షునిగ దీర్చుటకై దేవి ఆయనయొద్ద రవంత అహంకారమును ఉండ నిచ్చెను. ఆ యహంకారమును, ఆయన, అప్ప టప్పటి తన మనఃపరిస్థితికి అనుగుణముగ, జ్ఞానాహంకారము అనియో, భక్త్యహంకారము అనియో, శిశుని అహంకారము అనియో, దాసాహంకారము అనియో పేర్కొనుచుండెను. కాలిన త్రాడు త్రాడువలె అగపడినను అది త్రాడు కా నట్లు, బ్రహ్మజ్ఞానాగ్నిచే దగ్ధము అయిన గురుదేవుని అహంకారము అహంకారమువలె కన్పట్టినను అది అహంకారము ఎప్పుడును కాదు. ఈ యహంకారమును ఆయన పక్వాహంకారము (రైప్ ఈగో) అని నిర్దేశించెడి వాడు. అజ్ఞానులకు ఉండు అహంకారము దీనికి వ్యతిరేకము ఐనది. ఆ యహంకారమును ఆయన అపక్వాహంకారము అనియో, పచ్చి యహంకార మనియో (అన్రైప్ ఈగో-గ్రీన్ ఈగో) తఱచు పేర్కొనుచుండెను. అజ్ఞానాహంకారము తన్ను ఒడలితోను చుట్టములతోను ఆస్తిపాస్తులతోను లోకము తోను గలుపుకొను చుండును. మఱి బ్రహ్మజ్ఞానజ్యోతిచే వెలుగొందిన పక్వాహంకారము అన్ననో, ఒడలిని చుట్టములను ఆస్తిపాస్తులను జగత్తును మిథ్యలు అని యెఱిగి ఈశ్వరునితో మాత్రము ప్రేమసంబంధమును ఒకదానిని స్థిరపఱచుకొనును. లోకముతోను తనభార్యతోను సంబంధమును శ్రీరామకృష్ణుడు ఈ జ్ఞానాహంకార మూలముననే నిర్వర్తించుకొనుచుండెను. ఒకనాడు శ్రీశారదాదేవి ఆయనకు పాదసంవాహనము చేయుచు "నన్ను గుఱించి మీరు ఏమి అని తలంతురు" అని యొక ప్రశ్న అడిగెను. క్షణము ఐనను యోచించుకొనక ఆయన ఇట్లు బదులు చెప్పెను — "ఆలయములో ఆరాధనను ఒందు చున్న దేవియు, సంగీత మందిరమున వసించు

చున్న నా కన్న తల్లియు, ఇప్పుడు నాకు పాదసంవాహనము చేయు చున్న నీవును ఒక్కరే. నిజముగ ఆనందమయి యైన శ్రీకాళీమాత దాల్చిన ప్రత్యక్షరూపమవే నీవు అని సదా నా అభిప్రాయము.''

భర్తతో ఉన్న కాలమున శ్రీశారదాదేవికి అరుదు ఐన ఆధ్యాత్మికానుభూతులు గలిగినవి. ఆమెయే ఇట్లు చెప్పుకొన్నది — ''వివిధ మనోభావనలతో ఉన్నప్పుడు ఎల్ల ఆయనను నేను జూచు చుంటిని. అప్పుడు నాకు గలిగిన అద్భుతోత్సాహమును వర్ణింప గల వాక్కు నాకు లేదు. దివ్యభావోద్రేకముచే ఆయన ఒక్కొక్కప్పుడు దుర్జ్ఞేయవిషయములను గూర్చి ప్రసంగించుచుండును. ఒక్కొక్కప్పుడు నవ్వుచుండును. ఒక్కొక్కప్పుడు ఏడ్చుచుండును. ఒక్కొక్కప్పుడు నిశ్చలసమాధిలో నెలకొనును. రాత్రియంతయు ఇట్లే గడచును. ఆయనలోని అసాధారణ దివ్యభావోత్కట్యమును జూచి నేను అప్పు డప్పుడు భయముచే గడగడ లాడు చుంటిని. 'ఈ రాత్రి ఎట్లు వేగునో' అనియు అనుకొనెడి దానను. ఇట్లే నెలలు గడచినవి. ఆయన సమాధి నిమగ్నుడు కాదగిన దశలోనే సదా ఉన్నందున, నేను నిద్రలో ఉన్న తటి ఆయనకు సమాధి పైకొను నేమో అని భయముచే, తరువాతి దినములలో రాత్రులు అంతయు మేలు కొనియే ఉంటిని. అట్లు నేను ఉండుటను ఒకనాడు ఆయన చూచి, నన్ను 'ఇక మీద సంగీత మందిరమునకు పోయి నిద్రింపుము' అన్నాడు.''

## గురుదేవుని ఆధ్యాత్మికానుభవముల సంక్షేపము

శ్రీరామకృష్ణుని జ్ఞానసాధనల ముగియికను మనము గుర్తించితిమి. సమాధిదశలో తనకు గలిగిన అనుభూతుల ఫలితముగ, తన్ను గూర్చియు స్థూలముగ ఆధ్యాత్మికజీవితమును గూర్చియు కొన్ని తీర్మానములు ఆయనకు ఏర్పడినవి. తన్ను గూర్చి ఆయనకు ఏర్పడిన తీర్మానములు సంగ్రహముగా ఇవి —

(i) తాను భగవంతుని అవతారము, విశిష్ట ప్రయోజనముల సాధనకై పుట్టినవాడు, తన ఆధ్యాత్మికానుభవములు అన్నియు మానవజాతి కంతటికిని మేలు గూర్చునవి. సామాన్యమానవునకు దేవుని యంశములలో ఒకదానినో రెంటినో ఎఱుంగ వలెను అన్నను యావజ్జీవము పాటుపడక తప్పదు. మఱి శ్రీరామకృష్ణుడో కొన్ని యేండ్ల లోపలనే భగవంతుని వివిధాంశములను అనుభవముద్వారా తెలిసికొన్నాడు.

(ii) తాను ఎల్లప్పుడును విముక్తి చెందిన ఆత్మయే; తాను నిర్వర్తించిన ఆధ్యాత్మిక సాధనలు అన్నియు నిజముగ తన విముక్తి కొఱకు కాదు, ఇతరుల శ్రేయస్సుకొఱకే, — అని ఆయన ఎఱుగును. కావున బంధము, ముక్తి అను పదములు ఆయనపట్ల వాడ వలసినవి కావు. తమ్ము బద్ధులనుగా భావించు జీవులు ఉండు నంత పఱకును వారిని బంధమునుండి విడిపింప భగవంతుడు భూలోకమున అవతరింపక తప్పదు. ఒక మాజిస్ట్రేటు తన జిల్లాలో సంకటము ఏ మూల ఉన్నను అచ్చటికి పోక తప్పదు గదా. ఇదియు అట్లే.

(iii) ఆయన తన మరణకాలమును ముందుగ తెలిసికొన గలిగెను. అందునుగూర్చి ఆయన ఏ మేమి అన్నాడో ఆ వాక్యములు అక్షరాల నిజమైనవి.

ఆధ్యాత్మిక జీవితసామాన్యమును గూర్చిన ఆయన తీర్మానములు ఇవి —

(i) అన్ని మతములును సత్యములే. ఏ సిద్ధాంతము ఐనను సరే దేవునొద్దకు జేర్చు ఒక మార్గమే — ఈ నమ్మకము ఆయనకు అత్యంత దృఢము. ప్రధానమార్గములు అన్నింటను ఆయన సంచరించి చూచినాడు. అన్నియు ఆయనను ఒక్క లక్ష్యమునొద్దకే తెచ్చి చేర్చినవి. సర్వ మత సామరస్యమును ఉపదేశించిన మహాచార్యుడుగ చరిత్రగ్రంథములకు ఎక్కిన వారిలో ప్రథముడు ఆయనయే.

(ii) ద్వైతము విశిష్టాద్వైతము అద్వైతము అను సిద్ధాంతములు మూడును ఆత్మప్రాప్తి సాధనలో మూడు దశలను సూచించును అని ఆయన స్వయముగ ఎఱిగెను. అవి మూడును ఒకదానికి ఒకటి పూరకములే కాని విరుద్ధములు కావు. ఒక్కొక్కటి ఒక్కొక్క చిత్తవృత్తి గల వారికి తగి యుండును. ఇంద్రియ విషయము లందు దృఢాసక్తి గల సామాన్యమానవునకు ద్వైతమార్గము ఎక్కువ ఉపయోగించును. ఏల యన ఆ మార్గము, సంగీతము, ఇతర చిహ్నములు మొద లయిన లౌకిక పదార్థములను ఆధారములుగా కొంతవఱకు విధించును. బ్రహ్మత్వ సిద్ధిని ఒందిన వాడు లౌకికవిధులను అతిక్రమించిన వాడే. కాని సామాన్య మానవులు తమవిధులను నిర్వర్తింప వలయును గదా, నిర్వర్తించుటలో నిస్సంగబుద్ధిని అలవఱచుకొని, ఆచరించిన కర్మల ఫలితమును ఈశ్వరార్పణము చేయ వలెను. విశిష్టాద్వైతము అను మెట్టువఱకును గల భావములను అనుభవములను మన మనస్సులు అర్థము చేసికొనగలవు, వర్ణింపను గలవు. ఆధ్యాత్మికానుభవములలో అన్నిటికంటె పై మెట్టు అద్వైతము. అది సమాధిదశలో మాత్రము అనుభవమునకు వచ్చుచు వాక్కులకును మనస్సులకును అందక ఉండును. అత్యంతోన్నత దృక్పథమున చూచిన ద్వంద్వాతీత తత్త్వము ఎంత సత్యమో దాని వివిధ రూపములును అంత సత్యములే. దేవుడు, దేవుని లోకము, దేవుని నామము — ఈ అన్నింటి పారమార్థిక సారము ఒక్కటే. అన్నియు బ్రహ్మమే, బాహ్యాకారములు మాత్రము భిన్నములుగ ఉండును.

(iii) శ్రీరామకృష్ణునిద్వారా ఒక క్రొత్త సంప్రదాయమును నెలకొల్ప వలెను అనియు, ఆయన జీవితములో నిర్వ్యాఖ్యములు ఐన విశ్వసిద్ధాంతములను ఆ సంప్రదాయమువారు నిలబెట్టవలె అనియు— విశ్వజనని కోరిక. ఆ కోరికను శ్రీరామకృష్ణుడు తీర్చెను.

(iv) ఎవ రెవరికి ఇదే తుది జన్మమో, ఎవ రెవరు తమ జీవితకాలములో ఒక్కసారి ఐనను మనఃపూర్వకముగ భగవంతుని

ఆశ్రయించినారో, అట్టి వారు అందఱును తన యొద్దకు తప్పక వత్తురు అని ఆయన తన దివ్యజ్ఞానముచే ఎఱింగెను.

శ్రీరామకృష్ణుని జీవితమున, ఈ ఘట్టములో, ఆప్తు లగు పెక్కుర మరణములు వాటిల్లినవి. ఆయన అన్న కుమారుడు ఐన అక్షయుని మరణము మొదటిది. ఆ యువకుని మరణమును జూచుచుండి శ్రీరామకృష్ణుడు ఇట్లు అనెను — "అక్షయుడు నా కంటియెదుటనే మరణించినాడు. కాని అందుచే నాలో ఎట్టి మార్పును గలుగ లేదు. ప్రక్కనే నిలుచుండి జీవోత్క్రమణమును నేను జూచుచుంటిని. అది, ఒర నుండి కత్తి వెలువడుటను బోలి ఉండినది. ఆ దృశ్యమును జూచి నేను వినోదించితిని, నవ్వితిని, పాడితిని, ఆడితిని. వారు ఆ శరీరమును గొనిపోయి దహన సంస్కారము చేసిరి. కాని ఆ మఱునాడు నేను (తన గదికి వాయవ్యముగ ఉన్న వసారను జూపుచు) ఆచోట ఉండగా అక్షయుని మరణము కొఱకైన దుఃఖము నన్ను ఉఱ్ఱూతలు ఊపినది. ఎవరో తడి గుడ్డనుం బోలె నాగుండెను పిండుచున్నట్లు నాకు అనిపించెను. అందులకు నేను ఆశ్చర్యపడి, లోకజనని నాకు ఒక పాఠము నేర్పు చున్నది అని అనుకొంటిని. నా దేహముపైనే నాకు ఉన్న అక్కఱ అం తంత. ఇక బంధువులపైని నా అక్కఱయా, అంత కన్నను తక్కువే. అట్టి నన్ను అన్న కుమారుని మృతి అంతగా బాధించినచో, ఇక తమ ప్రాణ బంధువులను గోల్పోవు నప్పుడు గృహస్థుల దుఃఖము ఎట్లు ఉండునో!" 1871 లో మథుర్ బాబు మరణించెను. మథురానాథుని అనంతరము గురుదేవుని పరిచర్యకు పూనుకొన్న శంభుమల్లిక్కను ఐదు ఏండ్లకు అనంతరము మరణించెను. 1873 లో శ్రీరామకృష్ణుని రెండవ అన్న రామేశ్వరుడు మరణించెను. 1876 లో ఆయన గారాబు తల్లి గతించెను. శ్రీరామకృష్ణుడు 'ఆత్మ నిత్యము', అనియు 'జనన మరణములు మాయ' అనియు తెలిసికొన్నవాడే ఐనను, ప్రాణబంధువుల మరణ దుఃఖము అతని మృదు హృదయమున నాటుకొనక పోలేదు.

తన తల్లి మరణించుటకు ఒక్క సంవత్సరము ముందుగా, 1875 మార్చినెలలో గురుదేవుడు కేశవచంద్రసేనుని కలసికొనెను. ఆ కలయిక ఉభయులకును అనుపేక్ష్యము ఐనదే. ఎట్లు అనగా కేశవ చంద్రసేనులో నవ్యభారతము చక్కగ రూపుదాల్చినది. ఆయనతో గురుదేవునకు వాస్తవముగ ఒనగూడిన ప్రథమ సమాగమము ఇది.

## బ్రాహ్మసమాజము

పందొమ్మిదవ శతాబ్దము ఉత్తరార్ధమున భారతదేశమునకు ఒక పునర్జన్మము గలిగినది; దానిని సాధించుటలో ప్రాముఖ్యము వహించిన ఉద్యమములు రెండు; వానిలో బ్రాహ్మసమాజము ఒకటి. దానికి నాయకుడు కేశవచంద్రుడు. బ్రాహ్మోద్యమమునకు ప్రారంభకుడు రాజా రామమోహన రాయి [1774-1833] అను మహనీయుడు. సనాతనాచార నిష్ఠమైన బ్రాహ్మణకుటుంబమున జన్మించినను రామమోహనరాయి మహమ్మదీయ క్రైస్తవ మతముల యెడ అధిక సానుభూతిని జూపెను. బౌద్ధ రహస్యముల శోధించుటకై ఆయన ఒక పరి తిబెత్తు దేశమునకు గూడ పోయెను. క్రైస్తవ సిద్ధాంతమునుండి ఆయన నైతిక భాగమును మాత్రము గ్రహించెను, కాని 'క్రైస్తు అవతారపురుషుడు' అను నమ్మకమును ఖండించెను. కొందఱు అవతారపురుషులు అను నమ్మకము హిందువులలో గూడ కలదు కదా. క్రైస్తవుల నమ్మకమును ఖండించుటకు ముందే హిందువుల నమ్మకమును గూడ ఆయన నిరసించి యుండెను. ఎక్కువగ ఆయన మదికి ఎక్కినది మహమ్మదీయ మతము. అందుల ఫలితమే అతడు ప్రతిపాదించిన ఏకేశ్వరసిద్ధాంతము. కాని పారమార్థి కౌత్సుక్యమును వర్ధిల్ల జేసికొన వలసి వచ్చినప్పుడెల్ల అందులకై అతడు ఎప్పుడును వేదములనే ఆశ్రయించెడివాడు. 1828 లో ఆయన బ్రాహ్మసమాజమును స్థాపించెను. నిత్యుడును నిర్వికారుడును అన్వేషణలకు అందని వాడును సృష్టి స్థితి కర్తయు అగు సర్వేశ్వరుని ఆరాధనము ఆ సమాజ లక్ష్యము. ఈ వర్ణము

వారు, ఈ అభిప్రాయము వారు, ఈ జాతి వారు, ఈ మతము వారు, ఈ దేశము వారు అను నియమము లేక, ఎవరు ఐనను సరే, ఆ సమాజమున జేర వచ్చును.

బ్రాహ్మసమాజమునకు అంగక్రమమును నిజముగ నిర్మించిన వాడు రవీంద్రకవీంద్రుని తండ్రియైన దేవేంద్రనాథఠాగూరు (1815-1905). ఆయన మేని చక్కందనము, జ్ఞాన సౌందర్యము, సంపన్ను లందఱ వలె (మూకతో కలియక) దూరముగ ఉండుట, బుద్ధి తీక్ష్ణత, సహృదయత — అనెడి యీ గుణములచే వంగదేశీయులలో జదువుకొన్న వారికి అందఱకును అగ్రనాయకుడు ఐనాడు. వారు ఆయనను మహర్షి (=గొప్పద్రష్ట) అని పేర్కొనిరి. సంస్కృత పండితుడు ఐనట్టి ఆయన, రాజా రామమోహన రాయివలె గాక, ఉపనిషత్తులను తనకు ఉత్సాహవివర్ధకములుగ ఆశ్రయించెను. విగ్రహారాధనము అనిన ఆయనకు తీఱని ద్వేషము. క్రైస్తవుల భావములు తమ సమాజములో చొచ్చుకో రాదు అను పట్టుదలతో, అందుకొఱకు గూడ ఆయన పోరాడెను. బ్రాహ్మోద్యమమునకు ఒకసిద్ధాంతమును కర్మకలాపమును రూపు ఏర్పఱచినది ఆయనయే. ఆయన ఉపదేశానుసారము బ్రాహ్మసమాజమువారు "సర్వేశ్వరుడు స్వయంభువు" అనియు "పరాత్పరుడు" అనియు "శూన్యమునుండి విశ్వమును సృష్టించినవాడు" అనియు, "సత్యాధిష్ఠాత" అనియు "నిరవధిక జ్ఞాన సౌజన్య ప్రభావ సమన్వితుడు" అనియు, "నిత్యుడు" అనియు, "సర్వశక్తి" అనియు, "ఒక్కడు" అనియు, "అద్వితీయుడు" అనియు — ఉద్ఘాటించిరి. మానవుడు అట్టి దేవుని ప్రేమింప వలెను, అతని సంకల్పానుసారము నడచుకోవలెను, అతనిని విశ్వసింపవలెను, అతనిని ఆరాధింపవలెను, అట్లు చేసి, పరలోకమున మోక్షమునకు అర్హతను సంపాదించుకో వలెను.

బ్రాహ్మోద్యమనాయకులలో, తక్కిన అందఱ కన్నను చాల సమర్థుడు కేశవచంద్రసేను (1838-1884). రాజా రామమోహన

రాయివలెను దేవేంద్రనాథఠాగూరువలెను గాక, కేశవుడు వంగదేశ మున ఒక నడిమితరగతి కుటుంబమున జన్మించి, ఆంగ్లపాఠశాలలో చదువుకొన్నవాడు. ఆయనకు సంస్కృతభాష తెలియదు. అచిర కాలముననే వైదికహిందుమతమునుండి ఆయన చీలిపోయెను. చాల పసివాడుగ ఉన్నప్పుడే ఆయన డెందమును క్రైస్తు ఆకర్షించెను. జ్ఞానస్నాతుడు (బాప్టిస్టు) అయిన 'జాను'ను, 'క్రైస్తు'ను, సెయింటు [=మహర్షి]'పాలు'ను తన్ను విశేషముగ కటాక్షించిరి అని ఆయన చెప్పుకొనుచుండెను. క్రైస్తును బ్రాహ్మసమాజములోనికి తేవల యును అని ఆయన ప్రయత్నించి నప్పుడు, దేవేంద్రనాథునితో గలహము తప్ప దయ్యెను. 1868 లో ఆవృద్ధనాయకునినుండి వేఱై, కేశవచంద్రుడు 'భారతదేశబ్రాహ్మసమాజము' [బ్రాహ్మోసమాజ్ ఆఫ్ ఇండియా]ను స్థాపించెను. మునుపటి బ్రాహ్మసమాజము ఆది సమాజము అను పేరబరగెను. దానికి దేవేంద్రనాథుడే నాయకుడుగ ఉండెను.

కేశవునిశీలము వ్యామిశ్ర మైనది. ఒకప్పుడు నైతికముగ ఆయన గొప్ప సందిగ్ధ దశను అనుభవించెను, అప్పుడు తనకాలమున అధికభాగమును ఏకాంతమున గడపెను. ఆ యేకాంతములో దేవుని దివ్యవాక్కు ఆయనకు విన నగుచుండె నట. బ్రాహ్మసమాజమున ఆరాధనను భక్తిరూపమున అనుష్ఠింప దొడగి నప్పుడు, కేశవుడు తన యనుచరులతో గంటల కొలదిగ భజన చేయుచుండెను. 1870 లో ఆయన ఇంగ్లండు దేశమునకు పోయెను. అచట ఆయన పారమార్థి కౌత్సుక్యమును, మధుర కంఠమును, ఆంగ్లమున సరళ శైలియు, ప్రజల చిత్తములకు ఎక్కి మెప్పు పొందినవి. విక్టోరియామహారాజ్ఞి ఆయనను స్వయముగ సత్కరించెను. భరతఖండమునకు మరలి వచ్చిన పిమ్మట ఆయన దేశమున పెక్కు చోట్ల బ్రాహ్మసమాజ కేంద్రములను నెలకొల్పెను. శ్రీరామకృష్ణునితో ఆయనకు ప్రథమ సమాగమము లభించు కాలమునకు సరిగా, ఆయనయు, యూరోపియ విశ్వకళా పరిషత్తులలో మతములను బోల్చి పరిశోధించు ప్రొఫెసర్లు

వలె, సర్వ మత సామరస్యమును గుర్తింప ఆరంభించెను. హిందువులు ఆరాధించు దేవతలయు స్త్రీదేవతలయు ప్రాముఖ్యమును ఆయన ఉదారముగ వివరించెను. ఆ వేల్పు లందు ఆయనకు ఆదరము గలిగెను. అంతే కాదు. భగవంతుడు ఒక నూత్న సిద్ధాంతము నేర్పఱచి, దానిని లోకమునకు బోధింప తన్ను అంపి ఉండెను అను నమ్మక మొకటి ఆయనకు ఏర్పడెను. ఆ నూత్న సిద్ధాంతమే 'నవవిధానము' [న్యూ డిస్పెన్సేషను] అనబరగినది.

1878 లో కేశవుని 'సమాజము'న ఒక చీలిక ఏర్పడినది. కన్యలకు సమాజమువారు నిర్ణయించిన వివాహ యోగ్య వయస్సు ఒకటి కలదు. తన కూతురికి ఒక్కతెకు, ఆ వయస్సు వచ్చు లోపలనే, సంపన్నుడైన ఒక వరునకు ఇచ్చి, కేశవుడు వివాహము చేసి సమాజ నియమమును ఉల్లంఘించినవాడాయెను. సమాజమువారిలో మాటచెల్లుబడి గల ఒక కొందఱు ఒకటై, కేశవుని తప్పు పట్టి, తాము వేఱుగ చీలిపోయిరి. వారు ఏర్పఱచుకొన్న సమాజము "సాధారణ బ్రాహ్మసమాజము". 'నవవిధానము'నకు కేశవుడే నాయకుడుగ ఉండెను. ఆ దినాలలో, కేశవునకు ఒక ప్రక్క శ్రీరామకృష్ణునితో సంసర్గముచే లోకజననియందు భక్తి గాఢ మగుచుండెను. అగుచున్నను, వేఱొక ప్రక్క ఆయన క్రైస్తు నాదర్శమువంకకు ఎక్కువగ మ్రొగ్గ దొడగెరు. క్రైస్తువంకకును, హిందువుల 'లోకమాత' వంకకును ఉయ్యాలలు ఊగుచుండిన అతని మదికి నెమ్మది కలుగ దాయెను. బంగాళములో నేమి, భారతదేశమున మఱి కొన్ని చోట్లలో నేమి, బ్రాహ్మసమాజము క్రైస్తవులలోని ఏకమూర్త్యారాధకవర్గము(యూనిటేరియనుల)వలెరూపొందజొచ్చెను. ఆ సమాజమువారు హిందువుల కర్మకలాపమును గేలి చేసిరి, విగ్రహారాధనను రూపుమాపుడు అని ప్రజలకు బోధించిరి, ప్రతిమానవునకును తన బుద్ధియే పరమప్రమాణము అని ఉద్ఘాటించిరి. — ఈ యుద్ఘాటనకు పాశ్చాత్యసంస్కృతి సంసర్గ ప్రభావము కారణము — ఆ కారణముచేతనే వారు ఫ్రెంచి విప్లవ కారుల పక్షమును అవలంబించి,

వారి ఆదర్శములను సమర్థించిరి. తమలో వర్ణవ్యవస్థను రద్దు చేసికొనిరి; మహిళల పరిస్థితులను చక్కపఱచుట తమ పనిగా పూనుకొనిరి, బాల్యవివాహములను నిషేధింప వలెను అని ఘోష పెట్టిరి, వితంతు పునర్వివాహమును అనుమతించిరి, సంఘమును విద్యను సంస్కరించు నట్టి వివిధోద్యమములను ప్రోత్సహించిరి. బ్రాహ్మోద్యమమునకు తాత్కాలికముగ గలిగిన ఫలితములు ఇవి — (i) అన్యమతములవారిని తమ మతములోనికి దింపుకొనుటకు క్రైస్తవ మత ప్రచారకులు ఎదురు లేక సాగించు చుండిన కార్యక్రమమునకు ప్రతిఘటన ఏర్పడినది. (ii) ఆంగ్లప్రభువులకు మన భారతదేశీయ విజ్ఞానము పట్ల ఆదరము హెచ్చినది. ఇకను హిందుసిద్ధాంతమునకును బ్రాహ్మసమాజమునకును గల వాసి ఏ మనగా — మహర్షులయు ప్రవక్తలయు ఆంతరంగికానుభవములే ప్రమాణములుగ గలది హిందూ సిద్ధాంతము. బ్రాహ్మోద్యమము అట్లు కాదు. అది తాత్కాలిక పరిస్థితుల ఫలితముగ, బహు మతముల గ్రాహ్యాంశములందు అభిరుచితో పుట్టు వొందిన యొక వైజ్ఞానికపు పొంగు. దేశములో నూత్నవిద్యను అధికరించిన స్త్రీపురుషులలో ఏ కొలది మందికో అది నచ్చునది కాని, హిందు ప్రజా సామస్త్యము అన్ననో ఆ సమాజమున చొరక వెలుపలనే ఉండెను. హిందు సనాతన ధర్మము ఒక సమృద్ధ స్వర గ్రామము. అందుండి ఒక్క స్వరమును మాత్రమే కైకొని దానినే ఆలపించి యాలపించి విసిగించునది బ్రాహ్మసమాజము.

## ఆర్యసమాజము

పందొమ్మిదవ శతాబ్దమున భారతదేశమున మతపునరుద్ధరణమున ప్రాముఖ్యము వహించిన ఉద్యమములలో మఱియొకటి ఆర్యసమాజము, బ్రాహ్మసమాజము ముఖ్యముగ పాశ్చాత్యవిజ్ఞానముతో పొత్తు కుదుర్చుకొనుటకై ఏర్పడిన ఉద్యమమే. కావున ఆ సమాజమువారు పాశ్చాత్యుల ఉత్కర్షను మానముగ ఒప్పు

కొన్నట్లే. ఆర్యసమాజమును స్థాపించిన హిందుసన్న్యాసి అన్ననో కలహప్రియుడు, ఆయన మహమ్మదీయ క్రైస్తవ మతములతో పోటీకి నిలుచుటకు సిద్ధపడెను. విదేశీయుల ప్రభావమును మన దేశమున చెల్లనీయక అణంపవలె అనుట ఆయన నిశ్చయము. దయానందస్వామి (1824–1883) ఈ ఉద్యమము(=ఆర్యసమాజము)ను బొంబాయి నగరమున 1878లో ప్రవేశపఱచెను. కాని అచిర కాలములోనే దాని ఫాక పశ్చిమ భారత మం దంతటను పర్వెను. ఆ స్వామి వేదములందు గొప్పపండితుడు. వేదములు వేఱు చేనిని గాక ఏకమును అద్వితీయమును అగు బ్రహ్మమునే ప్రతిపాదించును అని ఆయన వివరించెను. ఆయన విగ్రహారాధనను ప్రతిషేధించి వైదిక క్రతు కలాపములను మరల ఆచరణలోనికి తెచ్చెను. మత విషయములలో ఆయనకు వేదములే పరమప్రమాణములు. అందు ఒక్కొక్క అక్షరమును సత్యమే అని ఆయన శిరసా వహించును. ఆర్యసమాజము తాను ఒక దాట రాని దుర్గమై మహమ్మదీయ క్రైస్తవ మత వ్యాప్తిని అరికట్టెను. దాని వైదిక రుచి పెక్కుర హిందువుల మనస్సులకు కరము ప్రియముగ ఉండెను. సంఘ సంస్కార విషయమున గూడ ఆర్యసమాజమువారు ముం దడుగు వేసిరి, వర్ణవ్యవస్థను ప్రతిఘటించిరి, సంఘమున మహిళలకు ఉండిన నిర్బంధములను పెక్కింటిని తొలగించిరి, విద్యావ్యాప్తికి గూడ ఆ సమాజము వారు ఎంతో తోడ్పడిరి, బాల్యవివాహములను నిషేధింప వలెను అను ప్రచారమును ఆరంభించిరి, హిందూవితంతువులకు పునర్వివాహము ఆవశ్యకము అనిరి, హిందు మహమ్మదీయ విజ్ఞానములకు కదన రంగమైన పంజాబురాష్ట్రమున ఆర్యసమాజమువారి పలుకుబడి చాల బలపడెను. నిద్రాణమై ఉండిన హిందుసంఘమున శత్రువులను ప్రతిఘటింప వలె అను నూత్నాభిరుచి పుట్టువొందెను. చదువుకొన్నవారి నడుమ మాత్రమే వ్యాపించిన బ్రాహ్మసమాజమువలె గాక, ఆర్యసమాజము తనప్రభావమును సామాన్యప్రజలలో గూడ ప్రసరింపజేసెను. ఇది చాల పట్టుదలతో గూడిన ఉద్యమము. తనతో

ఏకీభవింపని వారి యెడ ఆర్యసమాజమువారికి సహనము లేదు. ఆర్యసమాజమువారు చెప్పిన దారి యొక్కటి తప్ప, పరమార్థ ప్రాప్తికి వేఱు ఒక మార్గము లేదు అని వారు నొక్కి చెప్పెడివారు. దయానందస్వామి బంగాళమునకు వచ్చి నప్పుడు శ్రీరామకృష్ణుడు ఆయనను కలసికొనెను.

## కేశవచంద్రసేను

దక్షిణేశ్వరమునకు కొన్ని మైళ్లు దూరమున ఉన్న బెల్ఘారియా అను చోట జయగోపాలసేనుగారి ఆరామభవనమున బ్రాహ్మసమాజ నాయకు డైన కేశవచంద్రసేను తన శిష్యులలో కొంతమందితో గూడి బస చేయు చు న్నప్పుడు, ఆయనయు శ్రీరామకృష్ణుడును మొదటి సారి కలసికొనిరి. పెక్కు విషయములలో వారు ఒకరు ఒకరికి మిక్కిలి ఎడసిన వారు. ఒకరు ఉత్తర ధ్రువము ఐనచో వేఱు ఒకరు దక్షిణ ధ్రువము. అయినను ఆంతరంగికముగ పరస్పరము ఒక ఆకర్షణ ఉండుటచే వారు అంతరంగమిత్రులు కా నున్నారు. భగవంతుడు ఆత్మరూపి అనియు, చైతన్యమయుడు అనియు గురుదేవుడు ఎఱింగి ఉండెను. కాని భగవంతుడు దాల్చు వివిధ రూపములలో గూడ ఆయనకు నమ్మకము ఉండినది. మఱి కేశవుడు అన్ననో 'దేవుని విగ్రహమును పూజించినచో' అది విగ్రహారాధనము అగునే కాని దేవారాధన కాదు అని ఎంచును. హిందు దేవతలకు ఆయన అన్యాపదేశార్థములను (ఆలిగారికల్ ఎక్స్‌ప్లనేషన్స్) చెప్పుచుండును. కేశవచంద్రుడు వక్త, గ్రంథకర్త, పత్రికలకు వ్యాసరచయిత. శ్రీరామ కృష్ణునకు ఉపన్యసించుట అన్న భయము. ఆయన తన పేరును ఐనను సరిగా వ్రాయను ఎఱుగడు. కేశవుని పేరు ప్రతిష్ఠలు చాల దూరము వ్యాపించి ఇంగ్లండు దేశమునకుగూడ అందినవి. గురుదేవుడు అందమా, దక్షిణేశ్వరగ్రామమున సదా ఏకాంతజీవనమునే గడపుచుండును. భారతదేశమునకు పూర్వకాలములోవలె ఉచ్చస్థితి కలుగ వలెను అన్న, సంఘమును తప్పక సంస్కరింప వలెను అనును

కేశవుడు; బ్రహ్మప్రాప్తి ఒక్కటే జీవితలక్ష్యము అనును శ్రీరామ కృష్ణుడు. కేశవుడు తన్ను క్రైస్తుశిష్యునిగా భావించుకొని క్రైస్తవుల సంస్కారములను [సేక్రమెంట్సును] మూర్తిత్రయమును [ట్రినిటిని] కొంత పలుచపఱచి అంగీకరించెను. మఱి శ్రీరామకృష్ణుడో క్రైస్తు దివ్యత్వమును వేఱు ఒక మార్గమున అంగీకరించినవాడే ఐనను, తాను జగజ్జనని కాళియొక్క శిశువు, అమాయకుడు. కేశవుడు గృహస్థుడు. తన బిడ్డల యందు అతనికి వాస్తవ మైన అక్కఱ గలదు. మఱి శ్రీరామకృష్ణుడు ఐహికజీవితమున సంగము ఇంచుకేని లేని పరమహంస. ఐనను వారి పరిచయము మైత్రిగా పరిణమించి నప్పుడు వారికి ఒకరిపై ఒకరికి మిక్కుటములు ఐన ప్రేమాదరములు ఏర్పడినవి. ఎన్నో సంవత్సరములకు అనంతరము కేశవుని మరణవార్త విన్నప్పుడు శ్రీరామకృష్ణునకు తన శరీరార్ధము నిర్జీవ మైనట్లు అనిపించినది. కేశవునకు ఉండిన 'సర్వ మత సామరస్యము' 'భగవంతుని మాతృత్వము' అనెడి భావములు, శ్రీరామకృష్ణునితోడి సంసర్గముచే గాఢములై పెంపొందినవి.

జయగోపాలుని ఆరామ భవనమునకు వచ్చి నప్పుడు శ్రీరామ కృష్ణుడు ఎఱ్ఱంచుదోవతిని కట్టుకొని దాని కొసను ఒకదానిని అలక్ష్య భావముతో ఎడమభుజముపై వేసికొని యుండెను. ఆయనతో కూడ హృదయుడును ఉండెను. ఆడంబరము ఆయనయొద్ద కొంచె మైనను లేనందున, ఆయన వచ్చి నప్పుడు, ఎవ్వరును క న్నెత్తి యైన జూడ లేదు. అందఱను దాటుకొని గురుదేవుడు కేశవుని సమీపించి "నీవు దేవుని ప్రత్యక్షముగ జూచితివి అని ప్రజలు నాతో చెప్పియున్నందున దేవునిగుఱించిన విషయములను నీచే చెప్పించుకొని విందము అని నేను వచ్చినాడను" అనెను. అంతట ఉభయులకును దివ్య మైన సంభాషణ సాగినది. శ్రోతలకు రోమాంచము గలిగించు పాటను ఒకదానిని కాళీమాతను ఉద్దేశించి పాడి వెంటనే గురుదేవుడు సమాధి నిమగ్నుడు అయ్యెను. హృదయుడు ఆయన చెవిలో ప్రణవమును ఉచ్చరించెను. క్రమముగ ఆయనకు ఇహలోకస్మృతి గలిగెను. ఆయన

వదన మేమో ఇంకను దివ్యతేజమును వెదజల్లుచునే యుండెను. చూచి, కేశవుడును ఆయన అనుచరులును ముగ్ధులు ఐరి. శ్రీరామ కృష్ణునకును అచట ఉన్న బ్రాహ్మసమాజసభ్యులకును గల వ్యత్యాసము మిగుల చోద్యము ఐనది. శ్రీరామకృష్ణుడు ఒక వైపు కూర్చుండి యుండెను. ఆయన దేహము పరిమాణమున చాల చిన్నది, కృశించి ఉండెను, చాల సుకుమారముగ ఉండెను, అంత ర్జ్యోతి ఆయన కన్నులలో వెలుగొందుచు ఉండెను. చక్కని హాస్యము ఆయన చూపులలో తళతళమనుచు నోటిమూలలందు నిలిచి యుండెను. ఆయన మాటాడునది బెంగాలి వాడుక భాష. ఆయనకు కొంచెముగ నత్తి ఉన్నను, అదియు ఇంపుగనే ఉండెను. ఆయన మాటలలో భగవదనుభూతి సమృద్ధముగ ఉన్నది, ఉపమా రూపకాది అలంకారాల తఱుగని గని ఉన్నది, ప్రత్యక్షవిషయము లను అవలోకించునప్పుడు పొరవడని మెలకువ ఉన్నది, సూక్ష్మో జ్జ్వలము ఐన హాస్యము ఉన్నది, అద్భుతావహము ఐన వైశాల్యము ఉన్నది, అవిచ్ఛిన్న వివేక ప్రవాహము ఉన్నది. ఆ మాటలకు, మంత్రాలకు వశపడినట్లుగా, వశపడి శ్రోతలు నిశ్చేష్టులు ఐరి. ఇక అతనిని పరివేష్టించి ఉన్న (బ్రాహ్మసమాజము) వారా, పాశ్చాత్య విద్యను గడించి, కృత్రిమ జీవితములను అలవఱచుకొన్న బెంగాలీలలో శ్రేష్ఠులు. వారి నాయకుడు ఐన కేశవుడు ఆ నాటి బెంగాలి యువకులు ఆరాధించు వేల్పే.

కేశవుని ఋజుతయే చాలును శ్రీరామకృష్ణుని మెప్పునకు. అప్పటినుండి వారు ఉభయులును ఒండొరులతో దక్షిణేశ్వరము నొద్దనో, బ్రాహ్మసమాజ ప్రార్థనమందిరము నొద్దనో తఱచు కలసి కొనుచుండిరి. ప్రార్థనాలయమున పూజాసమయమున శ్రీరామ కృష్ణుడు ఉండుట తటస్థించిన యెడల, ఆ గోష్ఠిలో ఉపన్యసింపుము అని కేశవుడు ఆయనను ప్రార్థించెడివాడు. తానును ఫలపుష్పోపహార ములతో శ్రీరామకృష్ణుని దర్శింప బోవు చుండును.

క్రమక్రమముగ శ్రీరామకృష్ణుని ప్రభావము బ్రాహ్మసమాజ నాయకులలో తక్కినవారిపై నిగూఢ ప్రసరింప జొచ్చెను. కాని వారు గురుదేవుని తప్పులను ఎన్నకే ప్రశంసించువారు కారు. ముఖ్యముగ అర్షము ఐన ఆయన వైరాగ్యమును కామినీ కాంచన దూషణమును వారికి అసమ్మతములు. వారికి సొంతముగ గార్హస్థ్యాదర్శములు కొన్ని గలవు, వానిని కొలగట్టులుగ చేసికొని వారు ఆయనను విమర్శించు చుండిరి. కొందఱు ఆయన సమాధిని అర్థము చేసికొనక అది నరము లకు సంబంధించిన ఒక వ్యాధి అని వర్ణించిరి. కాని ఆయన వ్యక్తి మహిమ వారిని ఆకర్షించినపుడు తప్పకో లేక వశపడుచునే ఉండిరి.

శ్రీరామకృష్ణునితోడి సంసర్గమునకు ఫలితముగా (i) బ్రాహ్మ సమాజనాయకులకు ఉత్సాహము వర్ధిల్లెను. (ii) వారి మతదృక్పథము విశాలమై, వారిహృదయమున భగవత్సాక్షాత్కారతృష్ణ రగు ల్కొనెను. (iii) హిందూసిద్ధాంతమునందలి క్రతువులును చిహ్న ములును వారికి అర్థమై వానియందు వారికి మెప్పు గలిగెను. (iv) భగవంతుడు వివిధరూపములలో కననగుచుండును అను నమ్మ కము వారికి గట్టిపడెను. సర్వమతసామరస్యమును గూర్చిన వారి భావములు ఇంకను లోతుపాతినవి. బ్రాహ్మసమాజభక్తులు అంద ఱును ఎట్టి ఆస్థగలవారో శ్రీరామకృష్ణునకును మనసునకు ఎక్కెను. తాను సాధనలో కనుగొన్న విశేషములను ఆయన వారికి తెలిపెను. వైరాగ్యావశ్యకత, సాధనలో శ్రద్ధ, భగవద్భక్తి, నిష్కామకర్మా చరణము, నిత్యానిత్యవస్తువివేకము మొదలుగా, తన బోధన లందలి సారాంశములను వారికి ఆయన వివరించెను.

చదువుకొని పురోభివృద్ధి గాంచుచున్న బెంగాలీలతోడి కలయి కచే, శ్రీరామకృష్ణుని దృష్టికి కొన్ని క్రొత్త సంగతులు ఆలోచింప దగినవి గోచరించినవి. ఆయన పుట్టినదియు పెరిగినదియు మాయను ఎఱుగని పల్లెలో, ఆ కాలమున ఆచారము ప్రకారము అందఱును చదువుచుండిన చదువును ఆయన చదివి ఉండ లేదు. ఆధ్యాత్మిక

జీవితములో ఆయనను మన దేశీయ యోగీంద్రులే శిక్షించిరి. భారతీయుల తలంపులందును జీవితములందును చొచ్చుకొన్న ఆధుని కతాప్రభావమును పరిశీలించు అవకాశము ఆయనకు లేకుండెను. పాశ్చాత్యవిద్యవలన దేశీయ సంస్కృతిలో గలిగిన మార్పు ఇది అని ఆయన సరిగా నిర్ణయింప లేకుండెను. ఆయన హిందువు లందఱి కంటెను హిందువు. భగవత్ప్రాప్తికి ఆయనకు తెలిసిన మార్గము సర్వసంగపరిత్యాగము ఒక్కటే. భారతీయులలో క్రొత్తతరమువారు అట్లు కాదు. వారు దైవమునకై ఐహికమును వదులుకొనక రెంటికిని పొత్తు కుదుర్చుకొనిరి. ఈ సంగతిని బ్రాహ్మసమాజమువారివలన శ్రీరామకృష్ణుడు తెలిసికొనెను. దేశీయప్రవక్తలకంటె పాశ్చాత్య తత్త్వజ్ఞులే ఆ కాలపువిద్వాంసుల ఆదరమును ఎక్కువగ చూఱగొనిరి. ఆ పరిస్థితులను జూచి శ్రీరామకృష్ణుడు అధైర్యపడ లేదు. ఏల యన ఆ పరిస్థితులును దైవనిర్ణయమువలన ఏర్పడినవే అని ఆయన తెలిసి కొనెను. దేవునిగుఱించిన తనభావములను తీవ్రములు ఐన ఆధ్యాత్మిక సాధనలను అన్నింటిని శ్రీరామకృష్ణుడు బ్రాహ్మసమాజమువారికి వివరించినను "ఇందు మీ అభిరుచులకును చిత్తవృత్తులకును నచ్చిన వానినే అంగీకరింపుడు" అని కోరెను.

గురుదేవునితో సన్నిహిత పరిచయము గలిగిన బ్రాహ్మసమాజ నాయకులు — కేశవచంద్రసేను, ప్రతాపచంద్రమజుందారు, విజయ కృష్ణగోస్వామి, త్రైలోక్యనాథసన్యల్, శివనాథశాస్త్రి మున్నగు వారు.

## గురుదేవుడు తన భక్తుల రాకకై ఉవ్విళులూరుట

తనబోధనలను 'తు' 'చ' తప్పక అనుసరింప గల సాధకులతో కలసికోవలెను అను కోరిక శ్రీరామకృష్ణునకు ఉండినది. ఇప్పుడు బ్రాహ్మసమాజమువారితోడి సంసర్గముచే ఆ కోరిక హెచ్చెను. ఒకప్పుడు ఆయనయే ఇట్లు అనెను — "ఆ దినాలలో నేను అను భవించిన ఆత్రమునకు మితియే లేదు. పగటివేళలలో నేను దానిని

ఎట్లో అణచుకోగలిగి ఉంటిని. ఐహిక పరుల లౌకిక ప్రసంగాలు నాకు దుర్భరములుగ ఉండెడివి. నా గారాబు సఖులు నా యొద్దకు వచ్చు దినమునకై నేను మహాశతో నిరీక్షించుచుంటిని. వారితో సంభాషించుచు, నా సాధనానుభవములను వారికి జెప్పుచు నిర్వృతిని అంద గలను అని అనుకొనుచుంటిని. ఏ చిన్న సంఘటన సంభవించి నను సరే, వారే నా తలంపునకు వత్తురు, వారిని గూర్చిన తలంపు లలో నేను పూర్తిగ మునుగుచుందును. రాబోవు వారిలో ఎవరికి ఏమి చెప్ప వలెనో ఎవరికి ఏమి ఇయ్య వలెనో మొద లైన వివరా లను నేను అప్పుడే నా మనస్సులో నిర్ణయించుకొనుచుందును. పగటి వేళ దాటెనా, ఇక నా హృదయభావాలను నేను అణచుకో లేక పోవుదును. 'అయ్యో! వారు నా యొద్దకు రాక ఉండగనే మరల ఒక దినము గడచిపోయినదే' అను తలంపు నన్ను బాధించును. సాయంపూజాసమయమున, గంటలును శంఖములును మ్రోగు చుండగా నేను ఆరామ మండపము పై కప్పు మీాదికి ఎక్కి, హృదయ వేదనతో గింజుకొనుచు, బిగ్గఱగా 'రండోయి, నా వత్సలారా, మీారు అందఱును ఎక్కడ ఉన్నారు? మీా ఎడబాటు నేను ఓర్వ లేను' అని అఱచుచుందును. వారికై నేను ఉవ్విళులూరినంతగా ఏ తల్లియు తన బిడ్డకై ఉవ్విళులూరి యుండదు, ఏ మిత్రుడును తన సహచరుని కలసికొనుటకై అంత ఉబలాటపడి ఉండడు, ఏ కాముకు డును తన ప్రాణప్రియకై అంత తహతహపడి ఉండడు. నేను అను భవించిన అయోగవ్యథ వర్ణనాతీతము. ఆ వ్యథను కొంత కాలము అనుభవించిన పిదప భక్తులు* వచ్చి చేర దొడగిరి."

1879 లో బ్రాహ్మ సమాజ పత్రికలలో శ్రీరామకృష్ణుని గూర్చిన ప్రశంసలు అప్పు డప్పుడు వెలువడుచుండినవి. అవి, అనంతర

* భక్తులు = దైవభక్తులు, భక్తిమార్గానుసారులు; శ్రీరామకృష్ణభక్తులు = శ్రీరామకృష్ణునందు భక్తి కల్గి త దుపదేశములను అనుసరించువారు; శ్రీరామకృష్ణ శిష్యులు = ఆయనను గురువుగా ఆశ్రయించి మంత్రోపదేశము పొందినవారు.

కాలమున ఆయనకు శిష్యులు కానున్నవారిని ఆకర్షించినవి. వారు అందఱును చదువుకొన్నవారు, నడితరగతి బెంగాలీలు. అట్టి వారు ఆయన యొద్దకు 1884 వఱకును వచ్చుచునే ఉండిరి. వారే కాదు, ఇతరులు కూడ ఆయనలో నిగూఢముగ ఉన్న ఆకర్షణశక్తిచేత ఆకృష్టులై రాజొచ్చిరి. తిరుగే లేక ప్రజలు గుంపులుగుంపులుగ వచ్చిరి. వారిలో అన్ని వర్గములవారును ఉన్నారు. అన్ని మతముల వారును ఉన్నారు. హిందువులు ఉన్నారు, బ్రాహ్మసమాజమువారు ఉన్నారు, వైష్ణవులు ఉన్నారు, శాక్తేయులు ఉన్నారు, విశ్వకళా పరిషత్పట్టభద్రులు ఐన విద్వాంసులు ఉన్నారు, నిరక్షరులు ఉన్నారు, వృద్ధులు ఉన్నారు, తరుణులు ఉన్నారు, మహారాజులు ఉన్నారు, బిచ్చగాండ్రు ఉన్నారు, పత్రికలవారు ఉన్నారు, కళానిపుణులు ఉన్నారు, పండితులు ఉన్నారు, భక్తులు ఉన్నారు, తత్త్వపరులు ఉన్నారు, ఐహికపరులు ఉన్నారు, జ్ఞానులు ఉన్నారు, యోగులు ఉన్నారు, కర్మపరులు ఉన్నారు, విశ్వాసవంతులు ఉన్నారు, మహిళలలో సాధ్వీమణులు ఉన్నారు, వ్యభిచారిణులు ఉన్నారు, రాజోద్యోగులు ఉన్నారు, ఊరిద్రిమ్మరులు ఉన్నారు, ఉపకారపరులు ఉన్నారు, స్వార్థపరులు ఉన్నారు, నటకులు ఉన్నారు, త్రాగుబోతులు ఉన్నారు, నిర్మాతలు ఉన్నారు, నిర్మూలన దక్షులు ఉన్నారు. తన అనుభవజ్ఞానఖనినుండి ఆయన వారికి వెల్లికొల్లగ జ్ఞానదానము చేసెడివాడు. వట్టిచేతులతో వెనుదిరిగిపోయినవారు లేరు. వేదాంతశాస్త్రమున చెప్పబడిన ఉన్నతజ్ఞానమును, పురాణములందు వర్ణితము ఐన ఆత్మప్రదీకరణసమర్థము ఐన భక్తిని — ఆయన వారికి ఉపదేశించెను. ఇరువదినాలుగు గంటల సేపు విశ్రాంతి విరామము లేక ఆయన మాటాడుచునే ఉండెడివాడు. అందఱను కరుణించెను, అందఱకును జ్ఞానదానము చేసెను. ఆయన వారిని స్పృశించినప్పుడు ఆ స్పర్శలోని అమోఘ దివ్యాత్మశక్తిచేత ఎంతటి కఠినహృదయము ఐనను తప్పక కరగిపోయెడిది. ప్రజలు తమ తమ గ్రహణశక్తికి అనుగుణముగ ఆయనను అర్థముచేసికొనిరి.

## గురుదేవుడు బోధించు పద్ధతి

తాను ఒక గురువుగ ఉండ వలయును అను తలంపు శ్రీరామ కృష్ణునకు లేనే లేదు. తాను సదా జగజ్జననికి బిడ్డగను, దేవునిచేత ఒక పనిముట్టుగనే ఉండెను. మిక్కిలి ఇష్టముతో అట్లు ఉండెను. [శిష్యులకు] గురువు అగుట, [బిడ్డలకు] తండ్రి అగుట [దాసులకు] స్వామి అగుట — అనెడి యీ మూడు భావములును తన్ను ముల్లువలె బాధించెడివి అని ఆయన చెప్పుచుండెను. అయినను ఆయన ఒక లోకోత్తర గురువు కాక పోలేదు. ఆయన చేతల కన్నను మాటల కన్నను, ఆయనయొద్ద నిగూఢ సూక్ష్మముగ ఉన్న ఒక ప్రభావము శిష్యుల హృదయములకు ఎక్కువ సంచలనము గూర్చు చుండెను. ఒక క్రొత్త మతమునకు దాను స్థాపకుడను అని గాని ఒక నూత్న వర్గమునకు తాను నిర్మాతను అని కాని ఆయన ఎప్పుడును అనుకొనలేదు. అయినను మతరంగమున 'యంత్రశక్తిని విద్యుచ్ఛక్తిగ మార్చు యంత్రము' (డైనమొ)ను బోలిన వాడు ఆయన, అన్ని మతములలోను సిద్ధాంతములలోను ఉన్న నిజమును నిరూపించి చూపు వాడు; చెట్లు ఎదుగుటకును అవి ఫలముల ఒసంగుటకును వలయు శక్తి బీజ మందే ఉన్నది అను గట్టి నమ్మకముతో కలుపు తీయించి, నేలను సిద్ధపఱచు నేర్పరి యగు తోటమాలివంటివాడు. ఆయన ఎప్పుడు కాని 'నా భావములనే తల దాల్చుడు' అని ఇతరులను నిర్బంధించువాడు కాడు. ఎవరు ఎవరు ఎంతటివారో ఆయన చక్కగ గ్రహించును. ఒకరికి మేలు ఐనది వేఱు ఒకరికి కీడు కావచ్చును అను సూత్రమును ఆధారపఱచుకొనియే ఆయన పాటునడెడి వాడు. భక్తులను మొదటి సారి చూచునప్పుడే వారి మనోవృత్తులను అంతరాత్మను గ్రహించు ఒక వింత శక్తి ఆయనకు ఉండెను. అప్పటి వఱకును ఒక్కొక్కరి శీలము ఎట్టిదో, భవిష్యత్కాలమున ఒక్కొక్కరిలో ఎట్టి మార్పులు సుసంభవములో సమగ్రముగ తెలిసికొనియే, ఆయన శిష్యులను జేర్చుకొనెడివాడు. లోకములో ఎంత పాపము ఉన్నను దుఃఖము ఉన్నను ఆయన భయపడ లేదు. మతప్రకోపము

ఉన్నంత మాత్రముచే ఆయన ఎవరిని గాని హెచ్చుగ గౌరవింప లేదు. దేనికి ఐనను సరే అమోఘము ఐన జగజ్జననీ సంకల్పమే ప్రవర్తకము అని ఆయన కనుగొనెను. చెడుదారులకు త్రిప్పు వెలుతురు ఐనను, దేవునినుండి పుట్టు వొందునదే అని ఆయన అభిప్రాయము.

అంతరంగశిష్యులకు ఎల్ల, గురుదేవుడు సుహృత్తుగను సహచరుడుగను క్రీడాసఖుడుగను ఉండెను. ఆయన యెదుట ఉన్నప్పుడు ఎంత తీక్ష్ణమైన సాధనయు వారికి సులువుగనే ఉండెడిది. ఆయన సాన్నిధ్యముచే భక్తులకు నిర్మలానందపరవశత పైకొన్నప్పుడు — ఆయన అవతారపురుషుడా, పరిపూర్ణాత్ముడా, యోగియా అను శంకలకు వారికి అవకాశము ఉండనే ఉండదు. ఆయన వారి యెదుట ఉన్న జాలును, వారికి అన్ని విషయములును తమంతట బోధపడెడివి. ఆయన నోరు విచ్చి వివరింప వలసిన అక్కఱ ఉండెడిది కాదు. "ఆయనతో ఉన్నప్పుడు ఆయనను ఒక సఖునిగ ఎంచు వారము. తర్వాత ఆయనమహత్వముతో మా అల్పత్వమును పోల్చి యోచించుకొన్నప్పుడు గడగడలాడెడివారము." అని ఆయన శిష్యులు అనంతర కాలమున చెప్పి ఉన్నారు. గురుదేవుడు సంకల్పమాత్రముచేత తమ హృదయములలో భగవద్భక్తిని వెలిగించి భగవత్సాక్షాత్కారమును తమకు గలిగింపగలడు అని నమ్మించు ఆధారములు వారికి ఉండినవి. హాస్యములు, వేడుకప్రసంగములు, వినోదములు, రిత్తపనులు—ఇవి ఎన్ని ఉన్నను, సదా దేవునిజ్ఞాపకమును వైరాగ్యమును వారి ఉజ్జ్వల లక్ష్యములుగ ఉండునట్లు గురుదేవుడు కావించెను. సాధకుల శక్తిసామర్థ్యములకు తగినట్లు కొందఱకు ఒక్కొక్క మెట్టుగా ఎక్కు దారిని, కొందఱకు ఒక్కఊపుననే పైకి చేరుకొను దారిని ఆయన ఉపదేశించుచుండెను. మూలభూతములు ఐన శౌచనియమాలను కొంచెము అతిక్రమించినను, ఆయన సమ్మతింపడు. సాధకుడు తన దేహమును మనస్సును ఇంద్రియములను ఆత్మను నిష్కళంకములుగ ఉంచుకోవలెను, భగవంతునందు యథార్థము ఐన ప్రేమ గలిగి ఉండ

వలెను, భగవత్ప్రాప్తికై ప్రతిక్షణమును ఎక్కువ ఉబలాటపడు చుండవలెను. దానికి తరువాతిదానిని ఎల్ల లోకజనని తానే నెఱ వేర్చుకొనును.

గురుదేవుని శిష్యులలో రెండు వర్గములవారు ఉండిరి. గృహ స్థులు ఒక వర్గము, యువకులు ఒక వర్గము. ఈ యువకులలోనే ఒక కొందఱు అనంతరకాలమున సన్న్యాసులు ఐరి. గురుదేవుని భక్తలు ఐన మహిళల చిన్నవర్గము ఒకటికూడ ఉండెను.

## గృ హ స్థ భ క్తు లు

సర్వసంగపరిత్యాగము అను దారి చాల దుర్గమము. గృహస్థు లకు శ్రీరామకృష్ణుడు ఆ దారిని విధింప లేదు. వారు తమ కుటుంబ బాధ్యతలు నిర్వర్తించుటే ఆయనకు అభిమతము. వారి వైరాగ్యము మానసికముగ ఉండ వలెను. పారమార్థికజీవితము అనగా బాధ్యత లను విడిచి పాఱిపోవుట కాదు. ఒకరు ఇద్దఱు బిడ్డలు పుట్టిన పిమ్మట భార్యాభర్తలు పరస్పరము తోబుట్టువులవలె ప్రవర్తింప వలెను. తమకాలమును ఆధ్యాత్మికప్రసంగములకును ధ్యానమునకును వినియో గింప వలెను. "మీ జీవితము, ఒకవిధముగ, సన్న్యాసిజీవితమున కంటె, సులభము. శత్రువులను, మఱుగు లేని యుద్ధభూమిపై నెదు ర్కొనుటకంటె, కోటలోనుండి పోరాడుట సులభతరము కదా" అని ఆయన గృహస్థులను ఉత్సాహపఱచెడివాడు. అయినను వారు తఱచు ఏకాంతమునకు ఏగి, ప్రార్థన, జపము, ధ్యానము అనువానిచే తమ దైవభక్తిని విశ్వాసమును బలపఱచుకోవలెను అని ఆయన నొక్కి చెప్పుచుండును. ఆయన వారిని సాధుసాంగత్యము చేయుడు అనును. ఒకవైపు దైవమును ఊనుకొని వేఱు ఒకవైపు ప్రాపంచిక కర్తవ్యములను నిర్వర్తించుచుండుడు అనును, అట్టి కర్తవ్యములను క్రమముగా తగ్గించి పూర్తిగా దైవమునే ఆశ్రయించి ఉండ గల దశను ప్రసాదింప దేవుని వేడుకొనుడు అనును. జ్ఞానసాధనలలో అశ్రద్ధయే ఉండ రాదు అని గృహస్థులకును బ్రహ్మచారులకును

గూడ ఆయన హెచ్చరిక. స్థానాస్థానములు చూడక సహనమును పాటించువాడు కడకు మెలకువ తప్పి పిఱికిపంద అగును కావున అట్టి సహనమును పాటింపుడు అని ఆయన కోరడు.

శ్రీరామకృష్ణుని గృహస్థభక్తులలో ఒక కొందఱింగూర్చి సంక్షేపముగ ఈ క్రింద తెలుపుచున్నాము.

## సు రేం ద్రు డు

సురేశమిత్రుడు గురుదేవుని ప్రియశిష్యుడు. గురుదేవుడు అతనిని తఱచు సురేంద్రుడు అని పేర్కొనుచుండును. అతడు ఆంగ్ల విద్య నేర్చి ఆంగ్ల వర్తక సంస్థ[ఫరమ్] ఒకదానిలో ప్రధానపదవి యందు ఉండెను. ఆ కాలమున చదువుకొన్న యువకులలో పెక్కుర వలె అతడును నాస్తికవాదము చేయుచు విఱ్ఱవీగుచు ఉండెను, సంఘ నియమములకు లొంగక విశృంఖలముగ ప్రవర్తించుచుండెను. త్రాగుడును అలవఱచుకొనియుండెను. మానవుని స్వేచ్ఛను గూర్చి మితి మీఱిన భావములు అతనికి ఉండెను. అతడు ఒకసారి మనః ఖేదమునకు గుఱి కాగా, అతనిని శ్రీరామకృష్ణశిష్యులలో ఒకడు ఐన రామచంద్రదత్త గురుదేవుని చెంతకు పిలుచుకొని వచ్చెను. ఒకానొక భక్తునికి గురుదేవుడు 'ప్రపత్తిమార్గమును అవలంబింపుము' అని చెప్పుచుండగా, సురేంద్రుడు వినెను. ఆ మాటలు అతని మనసునకు ఎక్కినవి. అతడు ప్రపత్తిమార్గమును అనుసరింప ప్రయత్నించెను కాని తన చిరకాలమిత్రులను, పానమును మాత్రము వదలుకోలేక పోయెను. ఒకనాడు అతడు వినుచుండగా గురుదేవుడు "కోరదగని చోటునకు పోవు మానవుడు, జగజ్జననిని గూడ తన వెంట ఏల కొని పోడు" అని సభ్యులను అడిగి, అతనితో ఇట్లు అనెను — "మద్యమును మద్యముగా ఏల త్రాగుదువు? దానిని కాళికి సమర్పింపుము. ఆమె ప్రసాదముగ అది పవిత్రపానీయము అగును. అప్పుడు దానిని స్వీక రింపుము. కాని మత్తు జెందకుము. జాగ్రత్త! నీ తల తిరుగ కూడదు. నీ తలంపులును అణగక చెదరుచుండ గూడదు. మొదట నీకు

సాధారణము ఐన ఉద్రేకము కలుగును కాని అచిరకాలముననే ఉన్నతజ్ఞానదశను అధిరోహింతువు.'' — సురేంద్రుని జీవితము క్రమ క్రమముగా పూర్తిగా మారి పోయెను. గురుదేవునకు అగు వ్యయము లలో అధికభాగమును అచ్చుకొనుటకై జగజ్జనని నియోగించిన వారిలో సురేంద్రుడు ఒక్క డట. గురుదేవుడే అట్లు నిర్దేశించి చెప్పి ఉన్నాడు. గురుదేవుని పరిచర్యకై విచ్చలవిడిగ వ్యయించుటకు సురేంద్రుడు ధనమును సదా సిద్ధముగ ఉంచుకొనియుండును.

## మహేంద్రుడు ['మ']

మహేంద్రనాథ్ గుప్తకు 'మ' అను ప్రసిద్ధియే ఎక్కువ. అతడు దక్షిణేశ్వరమునకు 1882–వ సంవత్సరము ఫెబ్రువరిలో వచ్చెను. బ్రాహ్మసమాజములో అతడు ఒకసభ్యుడు. కలకత్తానగరమున శ్యాంబాజారులో ఉన్న విద్యాసాగరుని ఉన్నత పాఠశాల [హైస్కూలు]లో అతడు ప్రధానోపాధ్యాయుడు [హెడ్మాస్టరు]గ ఉండెను. మొట్టమొదటిసారి చూచినప్పుడే తన విశిష్టశిష్యులలో ఆయన అన్యతముడు అని గురుదేవుడు గుర్తించెను. శ్రీరామకృష్ణుడు భక్తులతో నెఱపిన సంభాషణలను మహేంద్రుడు తన నివేదికలో వ్రాసి ఉంచెను. విశ్వమందలి ఆధ్యాత్మికచరిత్రలో జీససుక్రైస్తుతోను బుద్ధదేవునితోను సాటి యైన ఒకమహనీయుని భాషితములను విన్న ప్పుడే వ్రాసి ఉంచుటకు ఇదే ప్రారంభము. మహేంద్రనాథుని నివేది కకు అనువాదమే మనము చదువనున్న గాస్పెల్ [సూక్తిసుధ] అను గ్రంథము. జ్ఞానతృష్ణ గల యువకులతో కలిసి మెలిసి వారిలో శ్రీరామకృష్ణునిఉపదేశములను వ్యాపింపజేయుటకు మహేంద్రనాథుడు సాధనముగ ఉపయోగపడినాడు.

## నాగమహాశయుడు

దుర్గాచరణనాగుడు అనియు నాగమహాశయుడు అనియు ప్రసిద్ధుడు ఐన వాడు శ్రీరామకృష్ణుని లౌకిక శిష్యులలో ఆదర్శ

గృహస్థు. ఐహికవాసన ఇంచుకేని లేని జీవితము గురుదేవునిలక్ష్యము. అట్టి జీవితము నాగమహాశయునిలో రూపుదాల్చినది. అతనికి సన్న్యసింపవలెను అను కోరిక గాటముగనే ఉండినది కాని "సన్న్యాసివలె నిర్లిప్తచిత్తవృత్తిని అలవఱచుకొనుము. సన్న్యసింపకుము" అని శ్రీరామకృష్ణుని ఆజ్ఞ. శిష్యుడు ఆ యానతిని అట్లే నిర్వర్తించెను. అతడు ఒక పేదకుటుంబమున జన్మించెను. పసివాడుగ ఉన్నప్పుడు కూడ, యాచకుల కష్టములను దీర్పను దేనినైనను అతడు త్యాగము చేయుచుండెను. అతనికి పెండ్లి బాల్యముననే ఐనది. భార్యచనిపోగా, తండ్రి ఆజ్ఞ మేరకు అతడు మరల వివాహమాడెను. ఆడినను, భార్యకు అతడు చేసిన ఉపదేశము — భౌతికప్రేమ క్షణికము. హృదయపూర్వకముగ నిండు ప్రేమను భగవంతునకు అర్పింప గలవాడు ధన్యుడు. దేహాభిమానము ఇంచుకంత ఉన్నను, అది పెక్కు జన్మలలో అనువర్తించుచుండును. కాబట్టి ఈ మాంసాస్థిపంజరము పైని మక్కువను విడువుము. జగజ్జనని చరణములనే శరణుగొనుము. ఆమెనే సదా ధ్యానింపుము. అట్లు చేసిన నీ జీవితము ఈ జన్మమునను జన్మాంతరముననుఉదాత్తము అగును". గురుదేవుడు నాగమహాశయుని 'దేదీప్యమాన జ్యోతి' అని కొనియాడెను. గురుదేవుని మాట అతనికి వేదవాక్యము. ఒకనాడు గురుదేవుడు "ఆధ్యాత్మికముగ అభివృద్ధిని అందుట వైద్యులకును, న్యాయవాదులకును, వర్తకులకును కష్టము" అని చెప్పుచుండగా నాగమహాశయుడు వినెను. "చిన్న చిన్న మందు బొట్లను లెక్కించు మనస్సు అనంతము ఐన తత్త్వమును ఎట్లు భావనలోకి తెచ్చుకొనగలదు?" అని వైద్యులను గుఱించి ప్రత్యేకముగను శ్రీరామకృష్ణుడు అనెను. దుర్గాచరణుడు తన వైద్యవృత్తిని ఆ నిమిషములోనే మానుకొనెను, తన మందుల పెట్టెను గంగలో పాఱవేసెను. "కుడువను కట్టను నీకు ఎన్నడును లోపము ఉండదులే" అని గురుదేవుడు అతనికి ధైర్యము గొలిపి "యోగులను సేవింపుము" అనెను. 'యోగులు ఎక్కడ దొరుకుదురు' అని నాగమహాశయుడు అడిగెను. "వారే నిన్ను వెదకికొని

వత్తురు'' అని గురుదేవుడు అనెను. దుర్గాచరణుడు గడపినంతకంటె హెచ్చుగ తపోజీవనమును గడపినవారు సన్న్యాసులలో సైతము లేరు.

## గిరీశఘోషు

గిరీశచంద్రఘోషు పుట్టినది మొదలు దైవద్వేషి, అవిశ్వాసి, విశృంఖలుడు, త్రాగుబోతు. అతడు నవ్య వంగ నాటక వాఙ్మయమునకు ప్రారంభకుడు అగుటే కాక ఆకాలపు నాటకరచయితలు అందఱిలో సాటిలేనివాడు. తక్కిన యువకులవలెనే అతడును పాశ్చాత్యుల చెడుగులను అన్నిటిని అలవఱచుకొన్నాడు. దుర్వ్యయ దుష్ప్రవర్తనలలో తగుల్కొన్నాడు. ఆస్తికత అనునది వట్టి బూటకము అని, అతని గట్టి నమ్మకము. ''జీవితములో కొంత వినోదమునైన ఒసంగునది'' అని అతడు లోకాయతవాదమును సమర్థించెడివాడు. ఇట్లుండ అతనికి ఆపదలు ఒకదానివెంట ఒకటిగ సంభవించి, అతనిని భయభ్రాంతుని చేసివైచినవి. జీవితము అనెడి సమస్యను పరిష్కరించుకోవలెను. అను ఆత్రము అతనికి గలిగెను. ఆధ్యాత్మిక జీవితములో గురుని తోడ్పాటు తప్పక కావలయును అనియు, గురువును దైవముగా భావింప వలయును అనియు, అతడు, పెద్దలు చెప్పగా, విని ఉండెను. కాని మానవస్వభావమును బాగుగా ఎఱిగినట్టి అతనికి మానవులలో నిష్కళంక గుణపూర్తి గలవాడు ఒక్కడు ఐనను అగపడరైరి. మొదటిసారి చూచినప్పుడు శ్రీరామకృష్ణుడు కూడ అతని మనసునకు ఎక్కలేదు. ఆ సమయమున గురుదేవుడు సగము స్మృతి గలిగి ఉండెను. గదిలో దీపము వెలుగుచుండెను. దానిని జూచుచునే ఉన్నను, గురుదేవుడు ''సాయంకాలము ఐనదా'' అని అడుగుచుండెను. అది సర్కసులోని వింత చేష్ట అనుకొని గిరీశుడు ఇంటికి మరలెను. కాని వారి దారులు తఱచు కలియుటచేత గిరీశునకు గురుదేవునితో మరల మరల సమాగమము తప్ప లేదు. గిరీశుని 'చుక్కలచావడి' [స్టార్ థియేటర్] లో ఏదో ఒక ప్రదర్శనమును జూచుటకు గురుదేవుడు వచ్చెను. అప్పుడు కూడ అతనిలో ఎట్టి

విశేషమును గిరీశుడు గుర్తింప లేక పోయెను. కాని ఒకనాడు గురుదేవుడు భక్తులతో కలిసి ఆడుచును పాడుచును ఉండగా అతడు చూచుట తటస్థించెను. అది అంటువ్యాధివలె తన్నును పైకొనగా, ప్రేక్షకుడుగ ఉండిన గిరీశుడు తానును ఆ యాటపాటలలో కలసి కొందము అనుకొనెను గాని, చూచినవారు పరిహసింతురేమో అని జంకి ఊరకుండెను. మఱియొక దినము శ్రీరామకృష్ణుడు అతనికి ఏదో ఆధ్యాత్మికవిషయమును బోధింప బూనుకొనగా, అతడు "బోధనలపై నాకు మనస్సు లేదు. ఎన్ని బోధనలనో నేనే వ్రాసి పెట్టి ఉన్నాను అవి నాకు కొంచెము ఐనను ఉపయోగపడుట లేదు. కాబట్టి నీకు సామర్థ్యము ఉన్న యెడల, ఇంత కన్న సులభసాధ్యము ఐన దారిలో నాకు తోడ్పడుము" అనెను. ఆ మాటకు గురుదేవుడు మురిసిపోయి అతనిని "విశ్వాసమును అలవఱచు కొమ్ము" అనెను.

శిష్యునిలో మఱుగువడి ఉన్న విశేషములను మఱుగు దొలంచి ప్రకాశపఱచువాడే గురువు అను సంగతి కాలక్రమమున గిరీశునకు స్పష్టము కా దొడంగెను. గురుదేవునియందు దృఢభక్తి కల వారిలో తాను ఒకడు అయ్యెను. గురుదేవునకు అతడు అవమానములు గూర్చిన సందర్భములు పెక్కులు. ఆయన యెదుటనే తాను మద్యపానము చేయుచుండెను. అతని విచ్చలవిడి నడవడిని జూచి తక్కిన భక్తులు వెఱగుపడిరి. కాని గిరీశుని హృదయము కోమలము అనియు, అతడు ఆస్థ కల వాడు అనియు, విశ్వాసార్హుడు అనియు, గురుదేవుడు ఎఱుగును. అతని నాటకముల పిచ్చిని వదలించుటకూడ గురుదేవునకు ఇష్టము లేదు. ఒకప్పుడు ఒకభక్తుడు "గిరీశునితో త్రాగుడు మానుమని మీరు చెప్పుడు" అని తన్ను కోరగా అందులకు గురుదేవుడు "ఆ జోలి నీకు ఏల? అతనికి ఆశ్రయము ఇచ్చిన వాడు అతనిని చూచుకొ గలడు. నా మాట విను. గిరీశుడు వీరభక్తుడు. త్రాగుడు అతనికి ఎట్టి చెఱుపును చేయదు" అని కటువుగ బదులు చెప్పెను. చిరకాలముగ స్థిరపడిన వ్యసనములను మాటలచే మాన్పుట దుస్సాధ్యము అనియు, ప్రేమలో నిగూఢము ఐన ఒక ప్రభావము

కలదు అనియు, ఆ ప్రభావముచేతనే అద్భుతములను సాధింప వచ్చును అనియు, గురుదేవుడు ఎఱుగును. కాబట్టి త్యాగుడు మానుము అని ఆయన గిరీశునితో ఎప్పుడును అననే లేదు. గిరీశుడే తనంతట త్యాగుడును అచిరకాలములో విడిచిపెట్టెను. అతని యా సంకల్పమును బలపఱచుటకు గురుదేవుడు ఏమి చేసెను? అతని స్వేచ్ఛకు ఏలాటి అడ్డమును లేదు అని అనిపించెను.

ఆధ్యాత్మిక సాధనా క్రమములను నిర్వహింప లేక గిరీశుడు ఒకనాడు నిరుత్సాహపడెను. ఆ సమయమున ఏదో ఉదాత్తజ్ఞాన దశలో ఉన్న గురుదేవుడు "సరి, సరి, నాకు అధికారపత్రము ఇమ్ము. ఇకమీద నీ భరమును నేను వహించెదను. నీవు ఏమియును చేయ నక్కఱలేదు" అనెను. గిరీశుడు నిబ్బరము చెంది నిట్టూర్పు విడిచెను. సాధనల బాధ్యత ఇక గురుదేవునిదే కదా అని గిరీశుడు హాయి చెందెను గాని, తన స్వేచ్ఛయు అంతటితో అంతరించెను అనియు, తాను గురుదేవునిచేతిలో ఒక కీలుబొమ్మ ఐనాడు అనియు, పాపము! అతడు అప్పుడు గుర్తింప లేదు. ఈ క్రొత్తతీరున, గురుదేవుడు గిరీశుని శిక్షింప దొడంగెను. ఒకనాడు ఏదో ఒక చిన్న పనిని గూర్చి గిరీశుడు 'దీనిని నేను చేయుదును' అనెను. గురుదేవుడు "అట్లు అనకుము, మాటలలో అహంభావము ఉండ కూడదు. 'దైవ సాహాయ్యము ఉన్నచో ఈ పని నాచే నెఱవేఱును' అన వలెను" అని దిద్దెను. ఆ దిద్దుపాటు గిరీశునకు అర్థము అయ్యెను. అతడు అప్పటినుండి తాను కర్త అనెడి అహంభావమును మాని భగవత్సంకల్పపరతంత్రుడుగ ఉండ ప్రయత్నించెను. అతని మనస్సు సదా శ్రీరామకృష్ణునిపైనే ఉండెను. అబుద్ధిపూర్వకము ఐన ఆ స్మరణముచే, అతనిలో అణగక ఉండిన అహంకారము క్రమముగా తొలగిపోయెను.

గృహస్థులైన భక్తులు ఆదివారములలో మధ్యాహ్నములకు అనంతరమును, తక్కిన సెలవుదినములందును శ్రీరామకృష్ణునొద్దకు

వచ్చుట పరిపాటి అయ్యెను. క్రమముగ అట్టి వారి సంఘము ఒకటి ఏర్పడెను. గురుదేవుడు వారిలో సోదరభావమును పెంపొంద జేసెను. అప్పుడప్పుడు భక్తులలో కొందఱు తమ గృహములందు సంకీర్తనలకు ఏర్పాట్లు చేసి, శ్రీరామకృష్ణుని, తక్కిన భక్తులను ఆహ్వానించు చుందురు. భక్తిగీతములును నృత్యములును గంటల కొలది జరుగు చుండును. గురుదేవుడు భావసమాధినిమగ్నుడు అగుచుండును, లేదా, తన హృదయమును విప్పి మతవిషయములనో తన సాధనానుభవము లనో వివరించి చెప్పుచుండును. దక్షిణేశ్వరమునకు పోలేని వారు అనేకులు ఈ సమావేశములలో పాల్గొనుచు ధన్యులు అగుచుండిరి. ఇట్టి సమావేశము జరిగిన ప్రతిచోటను తక్కిన కార్యక్రమము ముగిసిన వెంటనే భక్తులకు సమృద్ధము ఐన విందు జరిగెడిది.

తమ సంపదచేతను విద్యాసంపదచేతను సర్వత్ర కైవారములు అందుకొను పెక్కురతో శ్రీరామకృష్ణునకు పరిచయము ఏర్పడెను. ఆయన, దంభమును తళుకును ధాటిని జూచి భ్రాంతిపడువాడు కాడు. ఆయన యభిప్రాయమున — సారాసారవివేకము లేని పండితుడు గడ్డిపరకతో సమానుడు. దైవజ్యోతి ఏ మూల నైన ఉన్నదో ఏమో అని ఆయన ప్రజలహృదయమును వెదకును. ఎవరి హృదయ మున ఆ వెలుగు లేదో వారితో ఆయన ఎట్టి జోలియును పెట్టు కొనడు. గురుదేవుడు సర్వసంగపరిత్యాగమును నొక్కి చెప్పుచుం డును గదా. ఆ ఉపదేశమును, పాశ్చాత్త్యకృతు డైన క్రిస్తోదాస్ పాల్ ఖండించెను. ఆయన ఖండనవాక్కులు — "త్యాగము త్యాగము అనెడి యీ పల్లవి మన దేశమును ఇంచుమించు సర్వ నాశము చేసినది. భారతీయులు నేడు బానిసలుగ ఉండుటకు ఇదే కారణము. ఇతరులకు మేలు చేయుట, చదువు లేని వారికి చదువు కఱపుట, అన్నిటికంటె ముఖ్యముగ దేశమున ఆర్థికస్థితిని బాగు పఱచుట — వీనిని మనము మన కర్తవ్యములుగా భావింపవలెను. 'మతము', 'త్యాగము' అని సదా గోల పెట్టుచుంటి మేని, మనము బలహీనులము అగుదుము. దేశోద్ధరణమునకు ఉపయోగపడు పను

లను చేయుడు అని మీరు వంగదేశ యువకులకు బోధింప వలెను''. శ్రీరామకృష్ణుడు క్రిస్తోదాస్పాలును తేటిపాటి జూచెను. అతనిలో దివ్యజ్యోతి అగపడ లేదు. అంత, అతనికి, గురుదేవుడు చులుకుగా చెప్పిన జవాబు — ''త్యాగమును ధర్మనిష్ఠయు సర్వోత్కృష్టములు అని మన వేదశాస్త్రములు కొనియాడు చున్నవి. నీవు అల్పజ్ఞుడవు. వానిని తూలనాడు ధైర్యము నీకు గలిగినదా? నీవు చదివినదిఆంగ్లము, అదియు రెండు పుటలే, అంతమాత్రమునకే లోకజ్ఞుడను అని, సర్వజ్ఞుడను అని, అనుకొనుచున్నావు! సరియే, వానకాలము ప్రారంభము కాగానే గంగలో ఎండ్రకాయలు చిన్న చిన్నవి పుట్టునే, నీవు చూచి ఉన్నావా? వానిలో ఒక్కొక్కదాని ప్రాముఖ్యము ఎంత? అంతకంటెను కూడ తక్కువే నీప్రాముఖ్యము ఈ విశాల విశ్వములో. అట్టి నీకు లోకోద్ధరణమును గూర్చి ప్రసంగించునంతటి సాహసమా? లోకోద్ధరణము సర్వేశ్వరుని పని, అందులకు వలసిన శక్తిసామర్థ్యములు నీకు లేవు.'' క్షణము ఊరక ఉండి గురుదేవుడు మరల ఇట్లు అనెను —''ఇతరులకై నీవు ఎట్లు పాటుపడ గలవో నాకు వివరించి చెప్పెదవా? ఇతరులకు తోడ్పడుట అనగా నీ అర్థము ఏమో నాకు తెలియును. కొందఱకు అన్నము పెట్టుట, వారికి వ్యాధి వచ్చినచో మందు ఇచ్చుట, రస్తాలు వేయించుట, బావులు త్రవ్వించుట—ఇవేనా? ఇవి మంచి పనులే; సందేహము లేదు. కాని అనంతవిశ్వములో ఇవి ఏ పాటి? ఈ రీతిగ మానవుడు సాధింప గల పురోగతి ఎంత మాత్రము? కాటకము బారి నుండి ఎంతమందిని నీవు కాపాడ గలవు? మలేరియామారి ఒక రాష్ట్రమును పూర్తిగా నాశనముచేసినదికదా, దాని ధాకను మరల్చుటకు నీవు ఏమి చేయ గలిగితివి?! లోకమును సంరక్షించువాడు దేవుడు ఒక్కడే. కావున మానవుడు మొదట దేవుని గన వలయును. మానవునకు అధికారమును దివ్యశక్తిని దేవుడు ప్రసాదింప వలెను. ప్రసాదించిన తర్వాతనే, లోకోపకారమును తలపెట్ట నగును. మానవునిలో అహంకారమును మొట్టమొదట తుడిచివేయ వలయును. అహంకారము తొలగిన తర్వాతనే ఆనంద

మయి ఐన లోకజనని అతనిని లోకసేవ చేయ నియోగించును''—
ఏదో బిచ్చము పెట్టుచున్నాము అను తలంపుతో ఉపకారము చేయు
వారి యందు శ్రీరామకృష్ణునకు విశ్వాసము లేనే లేదు. అట్లు చేయ
రాదు అని ఆయన జనులను ఎచ్చరించి యున్నాడు. లోకోపకారు
లము అని చెప్పుకొనుచుండు వారిలో అనేకులలో అహంకారము,
వట్టి గర్వము, పేరుప్రతిష్ఠలకై ఉబలాటము, వేఱు ప్రయోజనము
లేక జీవితములోని విసుగును మాత్రము పోగొట్టుకొను ఉత్సాహము,
సాపరాధచిత్తమును సమాధానపఱచుకొను యత్నము — ఇవి తప్ప
వేఱు ఏమియు ఆయనకు కనిపింప లేదు. భగవద్భక్తిచేతనే నిజమైన
ధర్మపరత గలుగును అనియు, మానవసేవను చేయునపుడు దానిని
ఈశ్వరసేవగనే భావింప వలయును అనియు ఆయన బోధించెను.

## మొదట శిష్యులై పిమ్మట సన్న్యాసులైన వారు

సన్న్యాసులుగ కావలసినట్లు విధినిర్ణయము గల యువకులకు
గురుదేవుడు చూపినది నిగ్రట మైన బాహ్యాభ్యంతరవైరాగ్యమార్గము.
వారు సంపూర్ణబ్రహ్మచర్యవ్రతమును అవలంబించి, కామలోభ
చింతలను అన్నిటిని విడనాడ వలెను. బ్రహ్మచర్యవ్రతమును అను
ష్ఠించుటచే సాధకులలో ఒక సూక్ష్మశక్తి పెంపొందును. దానిచేత
వారు దేవునిగూర్చిన గూఢతరరహస్యములను తెలిసికొన గలరు.
వారిలో ఆత్మనిగ్రహము తప్పక ఉండ వలయును, శుద్ధముగ ఉండ
వలయును, ఆత్మనిగ్రహమే అన్నిటికిని మీదిది. సన్న్యాసులే లోకు
లకు ఆచార్యులు. కావున వారి జీవితములు నిష్కళంకములుగ ఉండ
వలయును. ప్రేక్షకుల చిత్తములలో మృగవాంఛలను రేకెత్తించు
పటములను సన్న్యాసులు కన్ను ఎత్తి ఐన చూడ కూడదు. కామినీ
కాంచన స్పర్శయే లేక, ఆధ్యాత్మికముగ తాను తీర్చినట్లు ఎల్ల,
రూపు దాల్చు మార్దవముగల వారినుండియే సన్న్యాసులుగ కానున్న
తన శిష్యులను గురుదేవుడు ఏరి కొనెను. వారికి తాను వివేక
వైరాగ్యములను గఱపునప్పుడు గురుదేవుడు గృహస్థులను సమీప

మందు ఎచ్చటను ఉండనీయడు. అట్టి సన్న్యాసశిష్యులలో అగ్రగణ్యులు ఇరువురు — నరేంద్రుడు, రాఖాలు.

## రాఖాలు

రాఖాలు దక్షిణేశ్వరమునకు వచ్చుటకు ముందే, శ్రీరామకృష్ణుడు అతనిని తన దివ్యదర్శనానుభవములలో చూచి ఉండెను. అతడు పూర్వజన్మములో శ్రీకృష్ణుని క్రీడాసఖుడు అనియు, ఈ జన్మమున తనకు ఆధ్యాత్మికపుత్రుడు కానున్నాడు అనియు తెలిసికొనియుండెను. రాఖాలు తల్లిదండ్రులు సంపన్నులు. పసితనమందే రాఖాలులో అద్భుతాధ్యాత్మికలక్షణములు పెంపొందినవి. అతని బాల్యక్రీడ సైతము దేవతల ఆరాధనమే. ఇరువది ఏండ్లు కాకమునుపే, అతనికి పెండ్లి ఐయ్యెను. అతని భార్య మనోమోహనమిత్రుని చెల్లెలు, మనోమోహనమిత్రుడు ఒకభక్తుడు, గురుదేవుని గూర్చి రాఖాలునకు మొట్టమొదట తెలిపినవాడు అతడే. రాఖాలు శ్రీరామకృష్ణునితో కలసికొనుటకు అతనితండ్రి మొదట సమ్మతింపలేదు. కాని ప్రఖ్యాతులు ఐన మహాజనులు ఎందఱో దక్షిణేశ్వరమునకు ఏగుచున్నారు అని విన్న తర్వాత ధైర్యము చెందెను. గురుదేవునకును ఈ ప్రియశిష్యునకును నడుమ తల్లిబిడ్డల చుట్టఱికము కుదురుకొనెను. ఇతరులకు అనుమతింపని పెక్కు స్వేచ్ఛలను శ్రీరామకృష్ణుడు రాఖాలునకు అనుమతించెను. కాని బాలుడు తప్పుపనులు చేసినప్పుడు మాత్రము ఎట్టి జంకుగొంకులును లేక అతనిని శిక్షించుచుండెను. ఒకప్పుడు గురుదేవుడు ఇతరశిష్యులపై అధికాదరము చూపుచున్నందులకు రాఖాలు ఈర్ష్య చెందెను. అట్టి యీర్ష్య శిశుసహజమే కదా. కాని త్వరలోనే ఆ యీర్ష్య తొలగెను. శ్రీరామకృష్ణుడు తనకు ఒక్కనికే గురువు కాడు అనియు, విశ్వమునకు అంతటికిని గురువు అనియు రాఖాలు తెలిసికొనెను. రాఖాలునకు పెండ్లి ఐనది అను వార్త గురుదేవుని చెవిని బడెను. క్షణకాలము ఆయన వెత చెందెను. కాని రాఖాలుభార్య, ఆధ్యాత్మికపరురాలు అనియు

పతిపురోగతికి అడ్డుతగులదు అనియు తెలిసిన వెంటనే సమాధాన పడెను.

## నరేంద్రుడు

శ్రీరామకృష్ణుని దేహమూ, దుర్బలము; అంగములూ, సుకుమారములు; కాబట్టి ఆయన చాల దూరములకు పెద్దపెద్ద ప్రయాణములను చేయ లేదు. తన ఉపదేశములను లోకమంతటను నలు దెసలందును వ్యాపింపజేయుటకు ఆయనకు మంచిబలిష్ఠుడు ఒకడు సాధన భూతుడుగ కావలసి ఉండెను. దత్తవంశీయుడు ఐన నరేంద్రనాథుడే ఆయనకు అట్టి సాధనముగ ఐనాడు. నరేంద్రుని ఆయన ముద్దుకు 'నరేన్' అని పేర్కొనెడివాడు. అతడే అనంతరకాలమున వివేకానందస్వామి అను పేర విశ్వవిఖ్యాతి గాంచెను. గురుదేవుడు నరేంద్రనాథుని కలసికొనుటకు ముందే అతనిని జ్ఞానదృష్టిలో చూచిఉండెను. ఆ జ్ఞానదృష్టికి నరేంద్రుడు బ్రహ్మజ్ఞాననిమగ్నుడు ఐన ఋషిగా గోచరించెను. ఆదివ్యానుభూతిని శ్రీరామకృష్ణుడు ఒకనాడు వర్ణించెను. ఒకదినము ఆయన ధ్యాననిమగ్నుడై ఉండినప్పుడు ఆయన మనస్సు దేహమును వీడి, భూమండలమునుండి పైకి ఎగసిన దట. దేవతలును దేవేరులును వసించు పెక్కు దివ్యలోకములను దాటి పోయిన దట, వ్యావహారిక జగత్తును పూర్తిగ దాటి, పారమార్థికజగత్తున ప్రవేశించిన దట. అట బ్రహ్మానుసంధానపరు లైన మునులు ఏడుగురు అగపడి రట. ఆ సప్తర్షులు పవిత్రతలో దేవతలకంటె గూడ అధికులు అని ఆయనకు తెల్లము అయ్యెను. వారిని ఆయన తేటిపాటు చూచుచున్నప్పుడు, పరతత్త్వమునుండి ఒక అంశము ఘనీభవించినట్లు అయి ఒక ముద్దుబిడ్డ రూపు దాల్చిన దట. ఆబిడ్డ దోగాడుచు పోయి ఆ ఋషులలో ఒకరి ఒడిని ఎక్కిన దట. ఆ సుఖస్పర్శకు ఆ ఋషీంద్రుడు కన్నులను తెఱచె నట, ఆ బిడ్డను అత్యనురాగముతో జూచె నట. ఆ బిడ్డ "భూలోకమున చేతనోజ్జీవనమునకై నేను మానవుడనై అవతరింతును. నాకు తోడ్పడ నీవు రావా" అని ఆ మునిని అడిగిన

దట. ఆయన సమ్మతించె నట. నరేంద్రుడే ఆ ఋషి అని శ్రీరామ కృష్ణుడు చెప్పినాడు. వేఱు ఒక ప్రశ్నకు జవాబుగా 'ఆ దివ్యశిశువను నేనే' అనియు శ్రీరామకృష్ణుడు చెప్పినాడు.

నరేంద్రుడు కలకత్తానగరమున ఒక సంపన్న కాయస్థకుటుంబ మున 1863 వ సంవత్సరము జాన్యువరి తే 12 ది జన్మించినాడు. అతని తల్లి హిందువుల మహాపురాణేతిహాసములలో బాగుగ ఆరితేఱినది. తండ్రియో, కలకత్తా ఉన్నత న్యాయస్థానము [హైకోర్టు]లో ప్రసిద్ధ న్యాయవాది. మతమునందు ఆయన [= నరేంద్రుని తండ్రి] అజ్ఞేయ వాది, పేదల పట్ల సౌహార్దము గలవాడు, సంఘునియమములను గేలి చేయువాడు. బాల్యమం దేమి, యౌవనమం దేమి నరేంద్రునిలో భౌతిక ధీరతయు, సమ యోచిత బుద్ధియు, ప్రసన్న భావనయు, గాఢము ఐన ఆలోచనాశక్తియు, చురుకు ఐన గ్రహణశక్తియు, అసా ధారణ జ్ఞాపక శక్తియు, సత్యాభిరతియు, పవిత్రతకై ఉబలాటమును, స్వేచ్ఛాభిలాషయు, మృదుహృదయమును అమరి ఉండినవి. సంగీత కళయందును, భౌతిక – జ్యోతిష – గణిత – తత్త్వ శాస్త్రములందును, చరిత్ర మందును సాహిత్య మందును నైపుణ్యము గడించి అతడు చక్కని యువకుడుగ తయారు ఐనాడు. శైశవమందే అతనికి ధ్యానము అలవాటుపడెను. మనసును ఏకాగ్రము ఒనర్చుకొనుటలో అతడు గొప్ప నేర్పు చూపెను. మాటయందును పనియందును స్వేచ్ఛయు భావోద్రేకమును గల వాడే ఐనను, అతడు మత విషయ మున అస్ఖలిత బ్రహ్మచర్యవ్రతమును పూనెను. దేహమునందును మనస్సునందును మాలిన్యమును ఇంచు కేని చేరనీయక పవిత్రతా జ్యోతిని మహోజ్జ్వలముగ కాపాడుకొనుచు వచ్చెను.

నరేంద్రుడు కళాశాలలో పందొమ్మిదవ శతాబ్దపు పాశ్చాత్య తత్త్వశాస్త్రకర్తల హేతువాద గ్రంథాలను జదివెను. వెంటనే బాల్యమునుండియు అతనికి దేవునందును మతమునందును ఏర్పడి ఉండిన నమ్మకము చెల్లాచెదరు అయ్యెను. వట్టి నమ్మకము మీద

ఆధారపడి, ఆయన మతమును అంగీకరించువాడు కాడు. దేవుడు ఉన్నాడు అనుటకు ఆయనకు ప్రత్యక్షనిరూపణము కావలెను. ఐనను ఉద్రేకపూరితము ఐన అతని ప్రకృతికి కొన్నాళ్లకే లోకసామాన్య తర్కము (యూనివర్సల్ రీసన్) విరసము అనియు సారహీనము అనియు అనిపించినది. మోసపోక ఉండవలెను అనిన, అందులకు అప్రత్యక్ష లక్ష్యము చాలదు. ప్రత్యక్షాధారము కావలసి వచ్చెను. తన ఎదుట గురువు ఉండ వలెను. ఆ గురువులో నిష్కళంక గుణ పూర్తి ప్రత్యక్షముగ ఉండ వలెను, అట్టి గురువు ఐననే అతనికి చిత్తశాంతి కూర్ప గలడు. అట్టి పరిస్థితిలో అతడు ఉన్నప్పుడు, అతనిని — వశీకరణసమర్థము ఐన వ్యక్తిమహిమ గలవాడు అగు — కేశవచంద్రసేను తనవంకకు ఆకర్షించెను. వెంటనే నరేంద్రుడు బ్రాహ్మసమాజములో చేరి, దాని భజనసంఘమున పాటపాడువాడుగ కుదిరెను. ఆ బ్రాహ్మసమాజమునగూడ "దేవుని నేను జూచితిని" అని చెప్ప గల గురువు నరేంద్రునకు లభింప లేదు.

భావసంఘర్షణకు లోనై, మనోవ్యథను ఒందుచు, నరేంద్రుడు దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణునొద్దకు వచ్చి చేరెను. అతనితో గూడ కొందఱు మిత్రులు ఉండిరి. వారు ఎట్టి వారు అనగా, జ్ఞాన విషయమున ఇంచు కేని శ్రద్ధ లేని వారు. అప్పుడు నరేంద్రుని వయస్సు పదునెనిమిది సంవత్సరములు. కళాశాలలో రెండు ఏండ్ల చదువు అప్పటికి సాగి ఉండినది. అతడు గురుదేవునిగదిలో ప్రవేశించెను. శ్రీరామకృష్ణుడు ప్రార్థింపగా నరేంద్రుడు తన హృదయ భావములను ఎల్ల వెల్లివిరియించుచు కొన్ని పాటలు పాడెను. విని, గురుదేవుడు సమాధినిమగ్నుడు అయ్యెను. కొన్నినిమిషములు ఐన తర్వాత గురుదేవుడు తటాలున ఆసనమునుండి లేచి, నరేంద్రుని చేయి పట్టుకొని, తన గదికి ఉత్తరమున ఉన్న వసారకు ఏగెను. ఆ వసారకు తడికె మఱుగు ఉన్నది. అచ్చట వారు ఏకాంతముగ ఉండిరి. నరేంద్రుని చిరకాలమిత్రుని బోలె కూర్మితో సంబోధించి, గురుదేవుడు ఇట్లు అనెను. "అయ్యో! ఇంత ఆలస్యముగ వచ్చితివే. ఇన్ని

నాళ్లు నన్ను కాచుకొని పెట్టితివే. నాపై నీకు అంత క్రౌర్యము ఏల ? ఐహికపరుల శుష్కాలాపములను విని విని నాచెవులకు విసుగు ఎత్తి ఉన్నది. నా ఉపదేశమును గ్రహింప అర్హుడు ఐన ఒకనిని చేరదీసి అతని హృదయమున నా భావములను నింప వలెను అని ఎంత ఉబలాటపడినాను'' — ఈ మాటలు చెప్పుచు ఉన్నంత సేపును ఆయన వెక్కుచునే ఉండెను. తర్వాత కేలు మోడ్చి, నరేంద్రుని ఎదుట నిలిచి, ''ఈ లోకదుఃఖములను తొలగింప భువియందు అవతరించిన నారాయణా'' అని సంబోధించినాడు. అతనిచేతిని పట్టుకొని ''నీవు మరల రా వలెను, ఒంటరిగ రా వలెను, చాల త్వరలోనే రా వలెను'' అని ప్రార్థించెను. నరేంద్రుడు వెఱగుపడెను, ''ఏ మిది! నేను వచ్చినది దీనిని జూచుటకా? నిజముగ ఈయన వట్టి వెఱ్ఱివాడు. నేను విశ్వనాథదత్తగారి కుమారుడను గానా, ఈ మాదిరిగా నాతో మాటాడు సాహసము ఈయనకు ఎట్లు కలిగినది ?'' అని తనలో అనుకొనెను.

ఇరువురును గదిలోనికి వచ్చిరి. గురుదేవుడు అచ్చట ఇతరులతో ఏ మేమో మాటాడుచుండెను. ఆ మాటలను నరేంద్రుడు వినెను. ఆ మాటలలో ఆంతరము ఐన పొందిక ఉండెను, అనుపేక్ష్యము ఐన త్రికరణశుద్ధి ఉండెను. ఆయన ఆధ్యాత్మికశీలమునకు స్ఫుటము ఐన స్ఫూర్తి ఉండెను. వానికి అన్నిటికిని ఆశ్చర్యపడి అతడు ఆయనను, ''మహాశయా, తాము దేవుని జూచితిరా'' అని అడిగెను. ఆయన ''ఔను, దేవుని జూచితిని. నిన్ను జూచుచున్నంతకన్న ఎక్కువ స్పష్టముగ నేను దేవుని జూతును. నీతో మాటాడుచున్నంతకన్న ఎక్కువ ఆంతరంగికముగ నేను దేవునితో మాటాడి ఉన్నాను. కాని అబ్బాయీ, దేవుని చూడ గోరు వారు ఎవరు ? ధనమునకు అనియు, ఆలుబిడ్డలకు అనియు, జనులు కడవలు కడవలుగ కన్నీరు కార్తురు. అట్లు వారు దేవునికై ఒక్క దినము ఏడ్చిన చాలును. దేవుని తప్పక దర్శింప గలరు'' అనెను. ఆ మాటలలో సందేహమునకు ఎట్టి అవకాశమును నరేంద్రునకు అగపడ లేదు

దేవుని జూచితిని అని ఒకమానవుడు చెప్పగా వినుటకు నరేంద్రునకు ఇదే మొదలు. కాని గురుదేవుని ఆ మాటలకును, కొన్ని నిమిషము లకు ముందే వసారాలో జరిగిన దానికిని సమన్వయమును కుదుర్చుకో లేక, శ్రీరామకృష్ణుడు ఒక్క విషయమున మాత్రము పిచ్చిపట్టిన వాడే అని తీర్మానించుకొని కలవరపడిన మనస్సుతో నరేంద్రుడు ఇంటికి మరలెను.

దాదాపు ఒక నెల దినములకు నరేంద్రుడు (గురుదేవుని) రెండవ సారి చూడ వచ్చెను. అప్పుడు గురుదేవుడు నరేంద్రుని తటాలున (తన చేతితో) తాకెను. తాకిన వెంటనే నరేంద్రునకు పరవశత తలముసుకలు అయ్యెను. తన చుట్టును ఉన్న గది గోడలును ప్రతివస్తువును తన కంటి ఎదుట గిరగిర తిరిగి మాయ మైనవి. నరేం ద్రుడు భయపడి "నాకు మీరు చేయుచున్నది ఏమి? ఇంటియొద్ద నాకు తల్లిదండ్రులు ఉన్నారు" అని అఱచెను. అతడు చూచుచుండ గనే అతని అహంకారమును, సమస్త జగత్తును, నామ రహితము ఐన ఒక శూన్యములో ఇంచుమించు లయించి పోయినవి. గురుదేవుడు ఒక నవ్వు నవ్వి, నరేంద్రుని మామూలు స్థితికి తెచ్చి విడిచెను. నరేంద్రుడు "ఈయన వశీకరణశక్తి (హిప్నొటిసం) చేత నా మనస్సును వశపఱచుకొనె నేమో!" అని అనుకొనెను. కాని తాను బలిష్ఠుడు, ఆయన పిచ్చివాడు. తన్ను ఆయన ఎట్లు వశపఱచుకోగలడో నరేం ద్రునకు అర్థము కాలేదు. ఎప్పటికంటె హెచ్చు కలవరపాటుతో, నరేంద్రుడు ఇంటికి మరలెను. 'ఆ వింతమానవుని ఎదుటికి ఈ తూఱి పోయినప్పుడు ఎక్కువ జాగరూకత వహింప వలెను" అని నిశ్చ యించుకొనెను.

కాని మూడవ సారి పోయినప్పుడు ఇంతకంటె మేలుగా నడచుకో లేదు. ఈ సారి గురుదేవుని స్పర్శచే నరేంద్రునకు స్మృతి పూర్తిగా పోయెను. ఆ దశలో అతడు నిశ్చలుడై ఉన్నప్పుడు శ్రీరామకృష్ణుడు అతనిని — అతని మునుపటి ఆధ్యాత్మికానుభూతు

లను గూర్చియు, ఉండుచోటును గూర్చియు, లోకమున అతడు చేయుటకు వచ్చిన కార్యమును గూర్చియు, అతని జీవిత కాల పరిమితిని గూర్చియు — ప్రశ్నలు అడిగెను. అతడు చెప్పిన జవాబులను బట్టి గురుదేవుడు తన అంతఃప్రబోధముచేతను ఊహచేతను మునుగనే తెలిసికొని ఉండిన విషయములు స్థిరపడినవి. గురుదేవుడు తెలిసికొనిన విషయములలో కొన్ని — నరేంద్రుడు ఇంతకు మునుపే పూర్ణసిద్ధిని బొందిన ఒక ఋషిపుంగవుడు. తన యథార్థస్వరూపము అతడు ఏనాడు తెలిసికొనునో ఆనాడే, స్వసంకల్పముచే, యోగమార్గమున శరీరత్యాగమును జేయును.

నరేంద్రుడు గురుదేవుని మఱి కొన్ని సారులు కలిసికొన్నాడు. ఆ కలయికల ఫలితముగ గురుదేవుడు పిచ్చివాడు అను తలంపును, చిత్తవశీకరణతాంత్రికుడు అను తలంపును నరేంద్రుని మనసునుండి పూర్తిగా తొలగి పోయినవి. ఆయనలో — సత్యమును పవిత్రతయు త్యాగమును నిస్స్వార్థబుద్ధియు ఎట్టి సంశయములకును అవకాశము ఈయక ప్రకాశించినవి. అయినను, గుణపూర్తి లేక, తప్పు చేయుటే స్వభావముగ గల, మర్త్యుని ఒకని, తన గురువుగ వరించుటకు మాత్రము అతనికి మనసు ఒప్ప లేదు. అతడు బ్రాహ్మసమాజ సభ్యుడు కావున, దేవునకును మానవునకును నడుమ ఉండి, ఉభయులను కలుపుటకు, వేఱు ఒక మానవుడు గురువుగ ఉండుట ఆవశ్యకము అని నమ్మ లేక పోయెను. అంతే కాక 'శ్రీరామకృష్ణుడు తాను చూచితిని అనెడి దివ్యదర్శనములు ఎల్ల అతని మతివిభ్రమములే' అని బహిరంగముగ గేలి చేసెను. కాని అంతరంగమున మాత్రము అతనికి గురుదేవునిపై మిక్కుటమైన ప్రేమ కుదురుకొనెను.

తన అనుభూతులను సంశయించు నట్టి వ్యక్తిని ఒకనిని తన యొద్దకు అంపినందులకు శ్రీరామకృష్ణుడు లోకజననికి తన కృతజ్ఞతను దెలుపుకొనెను. "చిల్లర ఇచ్చు సరాబు నాణెములను తాను తీసికొనుటకు ముందు ఎట్లు పరీక్షించునో, నీవు నన్ను అట్లు పరీక్షింప

వోయి'' అని ఆయన నరేంద్రుని పలుమారు అడిగి ఉన్నాడు. తన జ్ఞానానుభవములను సమాధిని నరేంద్రుడు చులుకుగా ఖండించి నప్పుడు ఆయనకు నవ్వు వచ్చెడిది. నరేంద్రుని చులుకు మాటలు ఎప్పుడైన ఆయన మనస్సును నొప్పించుటయు గలదు. అప్పుడు లోక జనని స్వయముగ ఆయనను ''అతనిమాటలు నీకు ఎందులకు? అతడు నీవు చెప్పు ప్రతిమాటను తలదాల్చు కాలము రానున్నది'' అని ఓదార్చుచుండును. నరేంద్రుని యెడబాటును ఆయన ఓర్వ లేడు. 'అయ్యో! నరేంద్రుడు అగపడ లేదే' అని ఆయన ఎన్నియో సార్లు బిట్టుగ వాపోయి యున్నాడు. ఒక్కొక్కప్పుడు గురుదేవుని ప్రేమ నరేంద్రుని కలవరపఱచు చుండెను. ఒకనాడు అతడు ఆయనను కటువుగ కసరి ''ఇట్టి వ్యామోహము నాపై ఉంతు వేని అచిరకాల ములోనే నీవు నా స్థాయికి దిగుదువు''అని హెచ్చరించెను. ఆయనయు విషాదముజెంది దేవిని ప్రార్థించెను. ప్రార్థించినపిమ్మట ఆయన నరేంద్రు నితో ''పోరా, టక్కరీ, నీమాటలు నేను ఇక వినను. నీమీాద నాకు ఇంత ప్రేమ ఉండుటకు కారణమును దేవి నాకు జెప్పినది. నీలో నాకు దేవుడు అగపడుచుండుటే ఆ కారణము. ఏనాడు నీలో నాకు దేవుడు అగపడడో ఆ నాడు నీముఖదర్శనము సైతము నాకు దుర్భర ముగ ఉండు నట'' అని చెప్పెను.

అద్వైత వేదాంత బోధనలలో నరేంద్రుని తర్ఫీదు చేయ వలెను అని గురుదేవుని కోరిక. కాని నరేంద్రుడు బ్రాహ్మసమాజ మున ఎదిగిన వాడు. కావున ''మానవుడును అతనిని సృష్టించిన దేవుడును ఒక్కరే అనినచో దేవుని తిట్టి నట్లే'' అని అనుకొనెను. ఒక నాడు గుడితోటలో ఎగతాళిగా నరేంద్రుడు తన మిత్రునితో ''ఎంత పిచ్చి! ఈ బిందె దేవు డట, ఈ గిన్నె దేవు డట, మనకు అగపడుచున్నవి అన్నియు దేవుడే అట, నీవును దేవుడవే అట, నేనును దేవుడనే అట! ఇంత కంటె అసంగతము వేఱు ఏమి ఉండును?'' అనెను. శ్రీరామకృష్ణుడు తన గదినుండి వెలుపలికి వచ్చి, తనచేతితో నరేంద్రుని మెల్లగ స్పృశించెను. నరేంద్రుడు

మంత్రముగునిబోలె అయ్యెను. ఆక్షణముననే ప్రతిపదార్థమును నిజముగ దేవుడుగనే అతని కంటికి అగపడెను. చుట్టును ఒక క్రొత్త ప్రపంచమును తెఱచినట్లు అయ్యెను. ఆ మైకముతో అతడు ఇంటికి పోయెను. అక్కడను అన్నము, తట్ట, భోక్త, పరివేష్టించియున్న జనము, అందఱును దేవుడుగనే అగపడిరి. వీధిలో నడచి పోవుచున్నప్పుడును బండ్లు గుఱ్ఱములు జనప్రవాహములు కట్టడములు అన్నియు బ్రహ్మముగనే కన్పట్టినవి. అతడు తన నిత్యకార్యక్రమమును నిర్వర్తించుకో లేని దశలో ఉండెను. అతనికి ఏదో రోగము వచ్చినది అని అనుకొని తల్లిదండ్రులు దిగులుపడిరి. ఈ అనుభూతి తీవ్రతకొంత తగ్గిన మీదట విశ్వము అంతయు ఒక కలగా అతనికి పొడకట్టినది. ఊరి చౌకమున షికారు పోవు నప్పుడు, అచటి యినుపకమ్ములు వాస్తవములేనా అనుటను తెలిసికొనుటకై వాని కేసి తన తలను కొట్టుకొనెడివాడు. మామూలు దశకు వచ్చుటకు అతనికి కొన్ని దినములు పట్టినవి. తరువాత తనకు గలుగ నున్న గొప్ప అనుభవములను ముందుగ కొంత రుచి చూచిన వాడాయెను. వేదాంత వాక్యములు సత్యములు అని అతనికి స్పష్టపడినవి.

1884 వ సంవత్సరప్రారంభమున నరేంద్రునితండ్రి గుండె జబ్బుచే తటాలున మరణించెను. కుటుంబము మహాదరిద్రదశలో ఉండెను. ఇంటిలో భుజింప వలసిన వారు ఆఱు – ఏడుగురు ఉండినారు, అప్పులవాండ్రు ఇంటిపై బడుచుండిరి. అతని తండ్రి యిచ్చిన దినములలో అపరిమితముగ ధనాదికమును తీసికొని పోయిన చుట్టములు అందఱును ఇప్పుడు శత్రువులు ఐరి. వారిలో కొందఱు నరేంద్రునకు గృహము నైనను మిగుల్ప రాదు అని అందులకై వ్యాజ్యము తెచ్చినారు. నరేంద్రునకు కాళ్లకు చెప్పులు లేవు. తినుటకు అన్నము లేక పస్తు పడి, నౌకరికిగాను వెదకెను, గాని దొరక లేదు. నిస్స్వార్థమైన ప్రేమ ప్రపంచములో ఏ మూల నైన ఉన్నదా అని అతడు సంశయింప దొడగెను. ధనవతు లైన మహిళలు ఇద్దఱు అతనికి

కొన్ని దురాలోచనలు చెప్పి, 'నీ పేదఱికమును తొలగింతుము' అని ఆశ చూపిరి. కాని అతడు వారిని ఏవగించుకొని తిరస్కరించెను.

దేవుడు నిజముగ ఉన్నాడా అను సంశయమును నరేంద్రుడు నోరు విచ్చి చెప్ప సాగెను. అతడు నాస్తికుడు ఐనాడు అని అనుకొని అతని మిత్రులు అతని అవిశ్వాసమునకు అవాచ్యములైన కారణములు ఏవేవో చెప్పుచు ప్రచారము సాగించినారు, అతని శీలమును నీతిని దూషించినారు. గురుదేవుని శిష్యులలో సైతము కొందఱు ఈ వదంతిని కొంతవఱకు నమ్మిరి. "కష్టములకును నరకమునకును భయపడి దేవుని నమ్మువారు పిరికిపందలు" అని నరేంద్రుడు వారియెదుటనే చెప్పెను. ఈ అసత్య వార్తలను శ్రీరామకృష్ణుడు కూడ నమ్మునో ఏమో అని అనుకొన్నప్పుడు మాత్రము నరేంద్రుడు వెత జెందెను. అతని గర్వము ఎదురు తిరిగినది. "జరుగనీ, దానివలన ఏమి? మానవుని పేరు ప్రతిష్ఠలు అట్టి అల్పాధారములపై ఆధారపడి యుండు నేని, నేను లక్ష్యపెట్టను" అని అతడు తనలో అనుకొనెను. శ్రీరామకృష్ణునకు మాత్రము నరేంద్రునియందు నమ్మకము చెడనే లేదు. ఆ సంగతి, తర్వాత తనకు దెలిసి నప్పుడు, నరేంద్రుడు ఆశ్చర్యపడెను. నరేంద్రుడు పతితుడు అయ్యెను అని ఒక శిష్యుడు గురుదేవునితో జెప్పినాడట. అప్పుడు గురుదేవుడు "ఛీ మూర్ఖా, ఆలాగు ఎన్నడును కానేఱదు అని జగన్మాత నాకు చెప్పి ఉన్నది. నీవు ఇట్టి ప్రసంగమును మరల ఎత్తుదు వేని, ఇక నీముఖము చూడను" అని అదల్చెను.

నరేంద్రుని దుఃఖము తలపోలము అందిన సమయమును వచ్చినది. ఒకదినము అంతయు అతడు పస్తుండెను. సాయంకాలము ఇంటికి వచ్చుచున్నప్పుడు, అతడు అంగములను కదల్పలేని స్థితిలో ఉండెను. కేవలము డస్సి పోయి, ఆలోచించుకొను శక్తి కూడ లేక, ఒకయింటి వాకిట కూర్చుండెను. అతని మనస్సు పరిపరివిధముల పో సాగెను. అప్పుడు తటాలున ఒక దివ్యశక్తి అతని ఆత్మను కప్పిఉండిన

తెరను తీసెను. "ఆనందమయుడు ఐన భగవానుని సృష్టిలో దుఃఖము ఉండుట ఎట్లు", "దైవనీతియు దుఃఖమును ఒకదానితో ఒకటి ఎట్లు ఉండ గలదు" అను సమస్యకు సమాధానము అతనికి స్ఫురించినది. అతని దేహమున నూత్న బలము పుట్టినది, అతని ఆత్మ శాంతిలో మునిగినది, నెమ్మదిగ అతనికి నిద్ర పట్టినది.

నరేంద్రుడు తాను లోకములో నెఱవేర్ప వలసిన పారమార్థిక సేవ ఒకటి ఉన్నది అని ఇప్పుడే గ్రహించెను. తన తాత వలె తానును సర్వస్వపరిత్యాగముచేయ నిశ్చయించుకొని శ్రీరామకృష్ణుని దీవెనలు అందుటకు ఆయన యొద్దకు వచ్చెను. చెప్పుటకై అతడు నోరు తెరవక ముందే అతని మనస్సులో ఏమి ఉన్నదో గురుదేవుడు గ్రహించి కలుగ నున్న వియోగమును తలంచుకొని దుఃఖించెను, "నీవు ఐహిక జీవితమును గడప లేవు అని నేను ఎఱుగుదును, కాని నేను ఉన్నంత కాలము నాకై నీవు ఈలోకమున ఉండ వలయును" అనెను.

ఇది జరిగిన కొంత కాలమునకు, ఒకనాడు నరేంద్రుడు "నా పేదఱికమును దొలంపుము అని జగన్మాతను మీరు ప్రార్థింపుడు" అని గురుదేవుని వేడుకొనెను. ఆయన "జననిని నీవే ప్రార్థింపుము. నీప్రార్థనకు ఆమె తప్పక చెవి యొగ్గును" అని పంపెను. నరేంద్రుడు కాళిగుడిలో ప్రవేశించెను. విగ్రహమునెదుట నిలబడెను. ఆయనకు ఏమి కనబడెను అనగా —— జ్ఞానమును మోక్షమును ఒసగుటకు సిద్ధముగ సాక్షాల్లోకజననియే ప్రత్యక్షముగ కనబడెను. ఆమెను, తుచ్ఛము లైన ప్రాపంచిక వస్తువులను అడుగ నోరు ఆడక నరేంద్రుడు "జ్ఞానమును వైరాగ్యమును భక్తిని విముక్తిని ప్రసాదింపుము" అని ప్రార్థించెను. పేదఱికమును తొలగింపుము అని అడుగకే వెనుదిరిగి వచ్చి వేసెను. గురువు అందులకు చీవాట్లు పెట్టి, నరేంద్రుని మరల గుడికి అంపెను. లోకమాతకు ఎదుట నిలబడిఉన్నంత సేపును నరేంద్రునకు తాను ఎందులకు వచ్చినదియు జ్ఞప్తికి రానే లేదు,

వెనుదిరిగి వచ్చి వేసెను, గురుదేవుడు అతనిని మరల అంపెను. ఇట్లు మూడుసార్లు రాకపోకలు జరిగెనే కాని పేదఱికమును తొలంచు ప్రస్తావమే లేదు. నరేంద్రుడు అందులకు ఆశ్చర్యపడుచుండగా, తటాలున "ఇది అంతయు శ్రీరామకృష్ణుని మాయయే" అని మనస్సునకు స్ఫురించెను. కాబట్టి అతడు "స్వామీ, నా దారిద్ర్యమును మీరే తొలగింపుడు" అని శ్రీరామకృష్ణునే ప్రార్థించెను. అంతట శ్రీరామకృష్ణుడు "నీ కుటుంబమునకు ఇక మీద కుడువను కట్టను లోపము ఉండదు" అని అనుగ్రహించెను.

నరేంద్రునకు ఇది చాల గంభీరమును ముఖ్యమును ఐన అనుభవము. దీనిమూలమున అతడు "లోకమున శక్తిని అలక్ష్య పెట్టుట శక్యము కాదు" అనియు "వ్యావహారిక జగమున సగుణబ్రహ్మోపాసనము అనివార్యము" అనియు తెలిసికొన్నాడు. అతనిలో గలిగిన యీ మనఃపరిణామమునకు శ్రీరామకృష్ణుడు మిక్కుటముగ సంతోషించెను. మఱునాడు తాను ఇంచుమించు నరేంద్రుని ఒడిలో కూర్చుండి, మొదట తన్నును తరువాత నరేంద్రుని నిర్దేశించి చూపుచు ఒకభక్తునితో శ్రీరామకృష్ణుడు ఇట్లు అనెను—"ఇదియు నేనే, అదియు నేనే అని నాకు అర్థము ఐనది. నిజముగ ఎట్టిభేదమును నాకు గోచరించుట లేదు. గంగలో పైని దేలుచున్న కొయ్య నీటిని వేఱు చేయుచున్నట్లు అగపడునే కాని, నిజముగ నీరు అంతయు ఒక్కటే కదా! అర్థమైనదా? మఱియు, ఉన్నది ఎల్ల జగన్మాత ఒక్కతెయే కదా?" – అని. అనంతరకాలమున నరేంద్రుడు ఇట్లు చెప్పుచుండెను — "నన్ను కలసికొన్నది మొదలు తుదివరకు నా యందలి నమ్మకమును మార్చుకొనక ఏకరీతిగ ఉంచుకొన్నవాడు శ్రీరామకృష్ణుడు ఒక్కడే. మా అమ్మయును తోబుట్టువులును కూడ అట్లు ఉండ లేదు. నా యందు అతనికి ఉండిన దృఢప్రేమ విశ్వాసములే నన్ను అతనికి శాశ్వతముగ కట్టు వఱచినవి. ఎట్లు ప్రేమింపవలెనో ఎఱిగిన వాడు శ్రీరామకృష్ణుడు ఒక్కడే. స్వార్థపరులు ఐన లౌకికులు చూపునది ఆభాస ప్రేమ." – అని.

పెదగోపాలు ఒక్కఁడు తప్ప, గురుదేవుని సన్న్యాసశిష్యులలో తక్కిన వారు అందఱును ఇరువదేండ్లకు లోపు వారే. వారు బంగాళ దేశమున నడి తరగతి కుటుంబముల నుండి వచ్చిన వారు. వారిలో అనేకులు పాఠశాలల [స్కూళ్ల] యందును, కళాశాలల [కాలేజీల] యందును చదువు చుండిన వారే. లౌకికముగా వారు గొప్పపదవుల అధిష్ఠింపగలరు అని వారి తల్లిదండ్రులును బంధువులును ఆశించు చుండిరి. [కాని] నిర్మల దేహములతోను చుఱుకు గల మనస్సులతోను, స్వచ్ఛములు ఐన ఆత్మలతోను వారు శ్రీరామకృష్ణుని యొద్దకు వచ్చిరి. జన్మప్రభృతి అసాధారణాధ్యాత్మిక గుణములు గలవారే వారు అందఱును! మొదటిసారి చూచి నప్పుడే శ్రీరామ కృష్ణుడు వారిని బిడ్డలుగను బంధువులుగను మిత్రులుగను సహచరులు గను అంగీకరించెను. ఆయన స్పర్శ ఒక యింద్రజాలమువంటిది. ఆ స్పర్శ వారిని ప్రకాశపఱచినది. వారిలో ఒక్కొక్కఁడును అనంతర కాలమున గురుదేవుని సందేశజ్యోతిని దేశాంతర ఖండాంతరములలో బరపి తాను తాను ఓపినంతగా గురుదేవుని జీవితమును ప్రతిబింబింప జేసినాడు.

## భక్త మహిళలు

శ్రీరామకృష్ణునకు ఆయన భక్తమహిళలతో గుదిరిన చుట్టఱికము మిక్కిలి మధుర మైనది. స్త్రీసహజము లైన మృదుగుణములు ఆయనలోనే రూపుదాల్చినవి. ఆయన ఉన్నతోన్నత మైన పారమార్థిక స్థాయిలో నెలకొన్న వాడు. ఆ దశలో స్త్రీ పురుష విభేదము లేనే లేదు. ఆయన యంతఃపవిత్రతను జూచిన మగవారికి గాని మగువలకు గాని ఉదాత్తభావములు మాత్రమే ఉద్రిక్తములు అయ్యెడివి. తద్భక్త లైన మహిళలు "శ్రీరామకృష్ణుని మగ వానినిగా మేము భావింపనేలేదు. మాలో ఒక్కతెనుగా భావించితిమి. ఆయన యెదుట ఉన్నప్పుడు మాకు ఎట్టి జంకును గలుగుట లేదు. మాఅంతరంగములను నమ్మికతో ఆయనకు అర్పించినట్లు వేఱు

ఒకరికి అర్పింపము'' అని తఱచు చెప్పుచుండురు. వారు ఆయనను తమ బిడ్డగా, మిత్రునిగా, గురువునుగా ప్రేమించిరి. జ్ఞానశిక్షణము ఒసగు నప్పుడు ''కామలోభములను విడువుడు, మగవారి వలలో దగుల్కొనక ఉండుడు, అదే ముఖ్యము'' అని ఆయన వారిని ఎచ్చరించెడి వాడు.

## గోపాల్ 'మా'

గురుదేవుని భక్తురాండ్రలో, తన భక్తిసంపదచేతను, జ్ఞానానుభవములచేతను సాటి లేక ప్రకాశించినది అఘోరమణిదేవి అను ఒక వైదిక బ్రాహ్మణమహిళ. ఎలప్రాయ మందే ఆమె విధవ యై, తన జీవితమును ఆధ్యాత్మికసాధనలకే అంకితము ఒనర్చు కొన్నది. బాల గోపాలుడు ఆమెకు ఇష్టదైవము. ఆ దైవమునే ఆమె తన సొంత బిడ్డగ భావించి వైష్ణవమతమున విహితమై ఉండు వాత్సల్యభావముతో ఆరాధించుచుండెను. తనివిని ఎఱుంగని తన తల్లిప్రేమను ఆమె ఆ దేవునిమూలముననే తృప్తిపఱచుకొనగోరి, గోపాలుని స్నానము చేయించును, గోపాలునికొఱకే వంట వండును, వండిన యన్నమును గోపాలునికి నివేదించును, గోపాలుని నిద్రపుచ్చును. గోపాలదేవునితో ఇట్టి అత్యంత మధుర బంధుభావము నెఱపుటచే ఆమెకు 'గోపాలునితల్లి' 'గోపాల్‌మా' అను ప్రసిద్ధ నామము ఏర్పడెను. ఆమె గంగాతీరమున ఏ సమృద్ధియు లేని ఒక చిన్న గదిలో నలువది ఏండ్ల కాలము కాపురము ఉండెను. అప్పుడు ఆమె యొద్ద శిథిల మైన రామాయణ పుస్తకము ఒకటియు, జపమాల ఉండు సంచి ఒకటియు, తప్ప, వేఱు ఏదియు లేదు. 1884 వ సంవత్సరమున, తన అఱువదవ యేట, గోపాల్‌మా దక్షిణేశ్వరమునకు వచ్చి శ్రీరామకృష్ణుని దర్శించెను. రెండవ సారి వచ్చి నప్పుడు ఆమెను గన్నంతనే గురుదేవుడు ''అమ్మా, నీవు వచ్చితివా? తినుటకు ఏమి ఐన ఇమ్ము'' అని అడిగెను. వచ్చు దారిలో, ఆయనకొఱకే ఆమె కొన్ని సాదా తినుబండములను కొని తెచ్చి యుండెను. మిక్కిలి

సంకోచపడుచు ఆమె ఆ తినుబండములను ఆయనకు ఇచ్చినది. శ్రీరామకృష్ణుడు మిగుల రుచితో వానిని ఆరగించి, "అమ్మా, నీవు నీచేతితో వండిన వట్టి కూరలనో తియ్యని భక్ష్యములనో తెచ్చి నాకు ఈయ వలెను" అని కోరెను. ఆయన ఒక వింత యోగి అని ఆమె తలచెను. ఏల యన ఆయనయొద్ద తిండి ముచ్చటే కాని, దేవుని ప్రసంగము కనిపింప లేదు. ఇక ఎప్పుడును ఆయనను జూచుటకు రా నక్కఱ లేదు అని ఆమె అనుకొనెను. కాని నెట్టివేయ సాధ్యము కాని ఒక ఆకర్షణము ఆమెను గుడిపూదోటయొద్దకు లాగుకొని వచ్చినది. వచ్చు నప్పుడు ఆమె సాదా కూరలను కొన్నింటిని వండి తెచ్చెను.

కొంతకాలమునకు పిమ్మట ఒకనాటి ప్రాతఃకాలమున ధ్యాన నిమగ్నయై ఉండిన గోపాల్ మాకు ఒక అద్భుతానుభవము గలిగెను. ఆమె యిష్టదైవమైన గోపాలుడు ఆమెకు ప్రత్యక్షము అయ్యెను, ఆమె ఒడిలో కూర్చుండెను, గది నలువైపుల సంచరింప సాగెను. ఆ గోపాలుడు మాటిమాటికిని శ్రీరామకృష్ణునిరూపు దాల్చు చుండెను. ఆమె ప్రొద్దు పొడుచు నప్పటికి దక్షిణేశ్వరమునకు పరుగున వచ్చెను. ఆ దివ్యశిశువును చేత ఎత్తుకొనియే వచ్చెను. గురుదేవుడు అప్పుడు సమాధిలో ఉండెను. ఆమె చూచుచుండగనే బాలగోపాలుడు మాటిమాటికిని గురుదేవుని దేహములో ప్రవేశించుచు, వెలికి వచ్చుచు ఉండెను. పరమానందమున మునిగి, ఆ తన్మయతలోనే, ఆమె తన కుటీరమునకు మరలి వచ్చెను.

బాలగోపాలుని క్షణము ఐనను ఎడబాయక, ఆమె ఇంచు మించు రెండునెలల కాలము అవిచ్ఛిన్న భగవత్సంశ్లేషమును అను భవించెను. పిమ్మట దివ్య దర్శ నానుభవ తీవ్రత కొంత తగ్గినది, తగ్గకే ఉండినచో, ఆమె దేహము గ్రుగ్గి పోయెడిది. ఆమె ఉదాత్త జ్ఞానదశను, గురుదేవుడు మిక్కిలి కొనియాడి, అట్టి దివ్య దర్శ నాను భూతి సాధారణ మానవులకు దుర్లభము అని చెప్పినాడు. వేడుక

పనులపై గురుదేవునకు మోజు గదా! ఒకనాడు ఆయన గోపాల్మాను నరేంద్రుని ఒక్కచోట సమావేశపఱచెను. ఆమె అమాయికురాలు; అతడు (=నరేంద్రుడు) గుణదోషవిమర్శరసికుడు, ఆ యిరువురి అంతటి పరస్పర భిన్న ప్రకృతులు వేఱు ఏ యిరువురును ఉండ బోరు. దివ్య దర్శనానుభవము అనిన నరేంద్రునకు మిక్కిలి వెగటు. ఆసంగతి గురుదేవుడు ఎఱుగును, ఎఱిగియు, భక్తయైన ముసలామెను "నీ దివ్య దర్శ నానుభవమును ఈనరేంద్రునకు జెప్పుము" అనెను. ఎంతో సంకోచపడుచు ఆమె నరేంద్రునకు తన కథను జెప్పెను. మాతృ ప్రేమను చిందు తనమాటలను నడుమ నడుమ ఆపి, ఆమె నరేంద్రుని "కుమారా, నేను ఆడుదానను, పేదరాలను, అజ్ఞానిని. నాకు ఏమియు బోధపడుట లేదు. నీవు పండితుడవు. నాకు గలిగిన యీ గోపాల సందర్శ నానుభవములు వింటివి కదా! ఇప్పుడు చెప్పుము, ఇది అంతయు నిజమేనా" అని అడిగెను. ఆ కథను వినుచున్నప్పుడు నరేంద్రునకు హృదయసంచలనము గాఢముగ గలిగి ఉండెను. "ఔను, అమ్మా, ఆ యనుభవములు అన్నియు సత్యములే" అని అతడు బదులు చెప్పెను. నరేంద్రుడు పైకి దోషదర్శిగా కనబడినను, అతని 'నిండుమనంబు నవ్యనవనీతసమానము', హృదయము ప్రేమ మయము.

## అనంతర సంభవముల క్రమము

1881 లో హృదయుడు అవివేకముచే ఏదో నేరము చేసెను, అది కారణముగా అధికారులు అతనిని కాళి గుడి కొలువు నుండి తొలగించి, పూదోటలోనికి ఇక ఎప్పుడును రాగూడదు అని ఆజ్ఞా పించిరి. ఒకవిధముగా ఇదియు లోకజనని సంకల్పముచేత జరిగినదే అని తెలిసికొన వీలు ఉన్నది. శ్రీరామకృష్ణుని జ్ఞానసాధనల తుపాను రేగుచుండిన దినములలో ఆయనను కాచియుండినవాడు హృదయుడు. కాబట్టి ఆయన పూర్తిగ తన అపేక్షణలోని వాడే అనియు, ఇక ఎవరికిని ఎట్టి జోక్యమును లేదు అనియు అతడు అనుకొనెను. అను

కొనుట సహజమే కదా. హృదయునకు ముందుగా తెలుపుకొనక, గురుదేవుని సమీపించుటకు ఎవరికిని వీలు లేక ఉండెను. గురుదేవుడు ఎవరిని ఐనను విశేషించి ఆదరించినను హృదయుడు మిక్కిలి అసూయ చెందుచుండెను. అతనిని తొలగించుటచే, ఆస్థ గల భక్తులకు ఎల్ల గురుదేవుని స్వేచ్ఛమై సమీపించుటకును గుడిపూదోటలో ఆయనతో గూడ ఉండుటకును అవకాశము ఏర్పడెను.

గృహస్థులు వార విరామ దినములలో గురుదేవుని సేవింప వచ్చుచుందురు. భానువారముల మధ్యాహ్నానంతర సమావేశములు ఇంచుమించు ఉత్సవములవలె ఉండెడివి. ఫలాహారముల విందు తఱచు జరుగుచుండెను. వృత్తిగాయకులు అప్పుడప్పుడు భక్తిగీతములు పాడుట గలదు. గురుదేవుడును భక్తులును పాడుచు నర్తించుచుందురు. భక్తిభావపరవశత శ్రీరామకృష్ణునకు మాటిమాటికిని గలుగుచుండును. ఒక్కొక్క ఆదివారమునాడు భక్తులు అనుభవించిన వినోదములు, వారి జ్ఞప్తిలో నిర్వృతికరములై చిరకాలము పాయక ఉండెడివి. ఎవరికి ఐనను విశేషాంశములను బోధింప గోరినప్పుడు గురుదేవుడు వారిని శని – మంగళవారములలో తనయొద్దకు రమ్మనుచుండును. కాళీపూజకు ఆ రెండు దినములును ప్రత్యేకముగ విశిష్టములు.

సన్న్యాసులుగ కానున్న యువ శిష్యులను గురుదేవుడు వారదినముల(వీక్డేసు)లో రమ్మనును. ఆదినములలో గృహస్థులు అచ్చట ఉండరు. గృహస్థులను తర్బీదు చేయు మార్గము వేఱు, సన్న్యాసులను తర్బీదు చేయు మార్గము వేఱు. మహేంద్రుడు [=మ]గురుదేవునొద్దకు వార విరామ దినములలో మాత్రమే వచ్చుచుండెను గావున ఆయన రచించిన గాస్పెలు[సూక్తిసుధానిధి]లో సన్న్యాసులు కానున్న శిష్యుల ప్రస్తావము ఎక్కువగ ఉండదు.

గృహస్థ శిష్యులలోను యువశిష్యులలోను మిక్కిలి అదృష్టవంతులు ఒక కొందఱు ఉండిరి. గురుదేవుని గదిలో ఆయన పార్శ్వ

ముననే ఉండి రాత్రులను గడపు భాగ్యము వారికి లభించినది. ఆయన ప్రాతఃకాలమున నిద్ర లేచుట, గది యందు ఇటు అటు నడచుట, మధురకంఠముతో గీతములను బాడుచు, మహాప్రీతితో దేవితో సల్లాపించుట —— వీనిని వారు ప్రత్యక్షముగ జూచిరి.

## చేతికి తగిలిన దెబ్బ

1884వ సంవత్సరము జాన్యువరి నెలలో ఒకనాడు దేవదారు వనమునకు బోవుచుండిన గురుదేవుడు సమాధినిమగ్నుడై పడిపోయెను. అప్పుడు ఆయన ఒంటరిగ ఉండెను. ఆయనను పట్టుకొనుటకుగాని నడిపించుకొనిపోవుటకుగాని ఎవ్వరును లేరు. నేలపై బడి నప్పుడు ఆయన యెడమచేత ఒకయెముక తావు తప్పి కదలిపోయెను. ఈ సంభవమునకుగూడ ఎంతో ప్రాముఖ్యము గలదు. ఇది ఆయన మనస్సుమీద బాగుగ పనిచేసినది. దేహాస్మృతిని అతిక్రమించి పైకి ఎగబ్రాకుచుండుట ఆయనమనస్సుకు సహజస్వభావము. చేతియందలి యీ మిక్కుటమైన నొప్పి ఆయన మనస్సును శరీరమువంకకును బాహ్యలోకమువంకకును బలాత్కారముగ మరల్చి వానిని స్మరింపజేసి నది. ఇదియు దైవసంకల్పముచేత జరిగినది అనియే ఆయన అర్థము చేసికొన్నాడు. ఏల యన ఆయన మనస్సు ఇట్లు భౌతికరంగమున నిర్బంధింపబడుటచే తాను లోకమాతచేతి సాధనమాత్రుడను అనియు, తన మనశ్శరీరములగుండ నిర్వర్తింపవలసిన పని దేవికి గలదు అనియు నమ్మకము ఆయనకు ఎప్పటి కన్నను ఎక్కువగ దృఢపడెను. మంచి వారును చెడ్డవారును అగు వివిధ మానవుల రూపమున ఈశ్వరుడు దుర్జ్ఞేయమైన రీతిలో తన దివ్య చిత్తమును వ్యావహారిక లోకమున ప్రకటించుచుండును అని శ్రీరామకృష్ణుడు చక్కగా తెలిసికొన్నాడు. కావున దుష్టులలో ఈశ్వరుడు ఉన్నాడు అనియు, ధర్మనిష్ఠులలో ఈశ్వరుడు ఉన్నాడు అనియు, మోసగాండ్రలో ఈశ్వరుడు ఉన్నాడు అనియు, కామాతురులలో ఈశ్వరుడు ఉన్నాడు అనియు —— ఇట్లు అంతయు ఆయన చెప్పుచుండుట గలదు. వ్యావ

హారిక లోకమున భగవంతుని లీల సాగుచున్న రీతిని చూడగా చూడగా ఆయనకు ఒక విశిష్టమైన యానందము గలుగ జొచ్చినది. సమస్తమును మిథ్యగా ఒనర్చు బ్రహ్మజ్ఞానమునకంటె సర్వేశ్వరుని తోడి బంధుభావమే అధిక ప్రీతికర మని ఆయనకు ఒక్కొక్కప్పుడు అనిపించెడిది. "అమ్మా, బ్రహ్మజ్ఞానమును ఒసంగి తక్కిన దానిని ఎల్ల మఱచు నట్లు చేయకుము. నాకు బ్రహ్మజ్ఞానము అక్కఱ లేదు. తల్లీ, నేను నీ బిడ్డను కానా? కాబట్టి సహజముగనే పిఱికివాడను. నాకు మా అమ్మ తప్పక ఉండ వలెను. బ్రహ్మజ్ఞానమునకు ఒక పది లక్షల నమస్కారములు. అది ఎవరికి కావలెనో దానిని వారికి ఇమ్ము" అని ఆయన తఱచు ప్రార్థించుచుండును. ఇట్లును ప్రార్థించి యున్నాడు — "అమ్మా, నన్ను ఒక శుష్కతపస్విని గా జేయకుము. మానవులతో సంబంధబాంధవ్యములు నాకు ఉండ నిమ్ము. లోకములో నీ లీలలను గని ఆనందించు చుండ వలెను అని నా కోరిక" — అని. సమృద్ధమైన యీ దివ్యానందమును, ఈశ్వరప్రేమను భక్తసంసర్గమును శ్రీరామకృష్ణుడు ఎట్లు అనుభవింపగలిగినాడు? చేతికి దగిలిన ఆ దెబ్బచేత మనస్సు దేహమును గూర్చిన తలంపుల వైపునకు మరలుటచేతనే — అనుభవింపగలిగినాడు! అంతేకాదు. ఆయనను అవతారపురుషుడు అని ఎందఱో కొనియాడుచుండిరి. వారికి అతడు విఱిగిన తన చేతిని జూపి వారిని గేలిచేయుచుండును. "దేవునకు చేయి విఱిగెను అని మీరు ఎన్నడైన విని ఉన్నారా?" అని అడుగును. ఆ చేయి బాగు అగుటకు దాదాపు ఐదు నెలలు పట్టినవి.

## వ్యాధి ప్రారంభము

1885 వ సంవత్సరము ఏప్రిలు నెలలో గురుదేవుని కంఠమున వ్రణము ప్రారంభము అయ్యెను. భావసమాధు లప్పుడును దీర్ఘసంభాషణ లప్పుడును రక్తము కంఠములోనికి ప్రవహించి నప్పుడు నొప్పి మఱింత హెచ్చుచుండెను. ఐనను, వైద్యుడు ఒక వంక వలదు అనుచున్నను, శ్రీరామకృష్ణుడు పాణిహాటిలో వైష్ణవ వార్షికోత్సవమున

పాల్గొన ఏగెను. కొంత శిష్యబృందముతో ఆయన, తాను ఓపినంత వఱకును, ఆట పాటలలోను ఆనందపరవశతలోను మునిగి తేలెను. వ్యాధి హెచ్చెను. 'పాదిరీల కంఠవ్రణము' [క్లెర్జిమన్స్ సోర్ త్రోట్] అని ఆ వ్యాధిని వైద్యుడు గుర్తించినాడు. సంభాషణలును భావావేశములును ఎంతమాత్రమును కూడదు అని వైద్యుడు ఎచ్చరించెను. మందు పుచ్చుకొనుటలోను ఆహారనియమములలోను ఆయన వైద్యుని మాటను పాటించెను గాని భావావేశములను అణచుకో లేకపోయెను. తన పాదముల ఆశ్రయించిన వారికి నిర్వృతికరమైన ఉపదేశమును చేయక ఉండ లేక పోయెను. ఐనను రాత్రిందివములు తనకు విరామము ఒసగక వచ్చుచుండిన ప్రజాతండములను గూర్చి చిఱచిఱలాడుచు శిశువువలె లోకమాతతో మొఱవెట్టుకొనును. "ఎందుల కును కొఱ గాని యీ మూకను నాయొద్దకు ఏల తెత్తువు? వీరు ఒకటికి ఐదింతలు నీరు గలసిన పాల వంటి వారు. ఆ నీటిని ఎండించు నిప్పును ఊది ఊది నాకు కన్నులు పోయినవే. నాకు ఆరోగ్యము చెడినది. ఈ పని యిక నాకు శక్యము కాదు. దీనిని చేయక తప్పదేని, నీవు చేసికొనుము. [తన దేహమును జూపుకొనుచు] ఇది తూటువడిన మద్దెలయే కాని వేఱు కాదు. దీనిని నీవు సదా మ్రోగించుచునే ఉందువేని ఇది ఎంత కాలము నిలువ గలదు?" అని ఆయన దేవితో బలుకుచుండగా కొందఱు చాటునుండి వినిరి.

కాని ఆయన హృదయము విశాలమైనది. తనయొద్దకు వచ్చిన యెవరిని గాని ఆయన వెనుకకు పొమ్మన లేదు. "ఒక్క ప్రాణి కైనను నేను ఉపకారము చేయ గల నేని, అట్లు చేయుటకై నాకు ఎన్ని జన్మములు గలిగినను గలుగనీ, కుక్క జన్మము కలిగినను కలుగనీ" అని ఆయన అనుచుండును —

కాయమున కెన్ని రుజలైనఁ గల్గుఁ గాక
డెందమా, బ్రహ్మనిర్వృతి యందె నిలుము

అని సంతోషముతో పాడుకొనుచు ఆయన నొప్పులను ఓర్చుకొనెను.

ఒకనాడు రాత్రి ఆయన కంఠమునుండి రక్తస్రావము ఆరంభమైనది. వైద్యుడు ఆ వ్యాధికి 'కొంటుకుపుండు' [కాన్సర్] అని నామనిర్దేశము చేసెను. హృదయ నిర్భేదకము ఐన యీ వార్తను శిష్యులకు తొలుదొల్త తెల్పినవాడు నరేంద్రుడే. వ్యాధి నిర్ణయమైన మూడు దినముల లోపలనే, మేలైన వైద్యమునకై భక్తులు గురుదేవుని కలకత్తాకు జేర్చిరి. కలకత్తాలో ఉత్తరభాగమున ఉన్న శ్యాంపుకూరులో తగిన యిల్లు దొరకునంతవఱకును, ఒకవారము దినములు, గురుదేవుడు బలరామునింట ఉండెను. దక్షిణేశ్వరమునకు తఱచు రాలేని శిష్యులు కొందఱు బలరాము నింటికి వచ్చిరి. వారికి ఉపదేశములు చేయుచు, గురుదేవుడు ఆ వారము దినములును కొంచెము ఐనను విరామము లేక గడపెను. అతని వాక్కున ఉపన్యాస ప్రవాహము ప్రవహించుచునే ఉండెను. భావసమాధులును తఱచు గలుగు చుండెను. కలకత్తాలో డాక్టరు మహేంద్ర లాల్ సర్కార్ అను ప్రసిద్ధ 'హోమియో' వైద్యుడు ఉండెను. గురుదేవునికి చికిత్స సేయ భక్తులు అతనిని ఆహ్వానించిరి.

## శ్యాంపుకూరు

1885 వ సంవత్సరము సెప్టెంబరు నెల ప్రారంభమున భక్తులు శ్రీరామకృష్ణుని శ్యాంపుకూరునకు చేర్చిరి. రాత్రింబవళ్లు గురుదేవునకు పరిచర్య చేయుటకై నరేంద్రుడు యువశిష్యుల ఏర్పఱచెను. వారు గురుదేవుని అనారోగ్యస్థితిని తమతల్లిదండ్రులు మొదలైన పెద్దలకు దెలియ నీయక ఉండిరి. కాని వ్యాధి హెచ్చినప్పుడు, వారు తమ పెద్దల మాటలను త్రోసివేసి తమకు ప్రాణపదమైన గురుదేవుని ఎడబాయక ఆస్థతో పరిచర్య చేయుచు అచ్చటనే ఉండిరి. గురుదేవుని అపేక్షణములోను నరేంద్రుని నాయకత్వమునను ఈ యువకులు శ్రీరామకృష్ణుని అంతరంగ భక్తకోటిగ ఏర్పడిరి. గురుదేవుని దివ్యశక్తులు పెక్కుమార్లు ప్రకటమైనప్పుడు వానిని

ప్రత్యక్షముగ చూచు భాగ్యము ఆ శిష్యులు అనుభవించిరి. తన అనంతరము తన ఉపదేశముల విశ్వమున ఎట్లు ప్రచారము చేయవలెనో గురుదేవుడు నరేంద్రునకు నేర్పెను.

శ్రీరామకృష్ణభక్తులు శారదామణిని మహాప్రేమతో 'శ్రీమాతృదేవి' యని వ్యవహరింతురు. వారు ఆమెను, వంటపనులను జూచుకొనుటకును రోగికి ప్రత్యేకపథ్యమును తయారుచేయుటకును, దక్షిణేశ్వరమునుండి రప్పించిరి. ఉండుటకు చోటు చాలదు. ఆ యిఱుకటమునకు ఆమె సరుదుకొని వాడుకపడ వలసి వచ్చెను. రాత్రి 3 గంట లప్పుడు ఆమె గంగకు పగి స్నానము చేసి, మిద్దె మీది చిన్నగదిలో ప్రవేశించును. వండుచును ధ్యానించుచును ఆమె అక్కడనే దినము అంతయు ఉండును. చూడ వచ్చిన వారు అందఱును వెడలి పోవుటకు రాత్రి 11 గంటలు అగును. అప్పుడు ఆమె క్రింది యంతస్తున ఉన్న చిన్న పడకగదికి వచ్చి కొన్ని గంటల సేపు నిద్రించును. ఈవిధముగ చాలియును చాలని నిద్రతో, కష్టపడి పనులు చేయుచు, గురుదేవుని వ్యాధి నయము కావలె అని సదా దేవుని వేడుకొనుచు, ఆమె మూడు నెలల కాలము గడపెను.

భక్తులు శ్యాంపుకూరులో గడపిన జీవితము చాల తీక్ష్ణమైనది. గురుదేవుని పరిచర్యయే ఒక విధమైన ఆధ్యాత్మిక సాధనగ అయ్యెను. గురుదేవుని మనస్సు సదా ఉచ్ఛస్థాయికి ఎగయుచుండును. అతని యాధ్యాత్మి కౌత్సుక్యము అప్పు డప్పుడు అంటువ్యాధివలె శిష్యులలోనికి సంక్రమించుచుండును. గురుదేవుడు భగవంతుని అవతారము అను నమ్మకము వారిలో అనేకులకు ఉండెను. అట్టి యవతారమూర్తికి గలిగిన ఆ వ్యాధికి అర్థము ఏమో కనుగొనవలయును అని వారు ప్రయత్నించిరి. వారిలో ఒకవర్గమువారికి గిరీశుడు నాయకుడు. మేలే కలుగును అనుకొనెడి ప్రకృతి గిరీశునిది. ఏదో ఒక గంభీర ప్రయోజనమును సాధించుటకు ఈ వ్యాధి వ్యాజ

మాత్రము అనియు, తనభక్తులను ఒక్కటిగ చేర్చి వారిలో ఒద్దికను పెంపొందించుటకై గురుదేవుడు తనసంకల్పముచేతనే ఈవ్యాధిని తెచ్చి పెట్టుకొనెను అనియు, ఆ ప్రయోజనము నెఱవేఱిన వెంటనే ఆయన తానే వ్యాధిని పోగొట్టుకో గలడు అనియు గిరీశానుచరులు నమ్మిరి. మఱి యొక వర్గమువారు—"గురుదేవుడు లోకమాతచేతి పనిముట్టును బోలిన వాడు. దుర్జ్ఞేయములైన తన లక్ష్యములను వేనినో సాధించు కొనుటకై ఆమెయే ఆయనకు ఈ వ్యాధిని దెచ్చినది." అని ఎంచిరి. శిష్యులలో యువకులు మూడవ వర్గమువారు. వారు హేతువాదులు. వారికి నాయకుడు నరేంద్రుడు. ప్రకృతి పరిణామమునకు ప్రకృతికి అతీతములు ఐన హేతువులను కల్పించినచో నరేంద్రాదులు సమ్మతింపరు. గురుదేవుని దేహము భౌతికము. అదియు, ప్రకృతిపదార్థములు అన్నింటి వలె భౌతికధర్మములకు లోబడియే ఉండును. పుట్టుట, పెరుగుట, వికాసము, క్షయము, మరణము అనునవి ప్రకృతి ధర్మములు. గురుదేవుని దేహము ఆ ధర్మములకు లోబడక తప్పదు—అని ఆ హేతువాదులు అనిరి. ఈ విషయము లందు శిష్యులలో ఇన్ని భిన్నాభిప్రాయములు ఉన్నను, తమకు ప్రాప్యప్రాపకుడు ఆ గురుదేవుడే అనుటలో మాత్రము అన్ని వర్గములవారును ఏకాభిప్రాయులై ఉండిరి.

వైద్యుడు వైద్యము చేయు చుండెను. భక్తులు పరిచర్యలు చేయుచుండిరి, దైవప్రార్థనలు చేయుచుండిరి. గురుదేవుని వ్యాధి ఏమో త్వరత్వరగా పెరిగిపోవుచునే ఉండెను. నొప్పి ఒక్కొక్కప్పుడు భరింప రానంతటిదిగ ఉండెను. ద్రవపదార్థము తప్ప వేఱు ఆహారము లేనందున, గురుదేవుని దుర్బలదేహము మఱింత శుష్కించి, వట్టి యెముకల గూడుగ తయారు అయ్యెను. కాని ముఖమున మాత్రము ఆనందము వెల్లివిరియుచునే ఉండెను. తన ఆశీస్సులను అందుటకై ఎడతెంపు లేని ప్రవాహము వలె వచ్చుచున్న ప్రజలను ఆయన ఆదరించుచునే యుండెను. ఆ సేవార్థులను అట్లు గుంపులు

గుంపులుగ రానీయక ఉందము అని శిష్యులలో అతిశ్రద్ధాళువులు కొందఱు ప్రయత్నించిరి. కాని వారిని గిరీశుడు "ఈ పని నెగ్గదు. లోకుల ఉజ్జీవనమునకై తన జీవితమును అర్పించుకొనుటకే గురుదేవుడు అవతరించియున్నాడు" అని చెప్పి మందలించెను.

వ్యాధిచే దేహము శిథిలము అగు కొలదియు అందు ఉన్న దివ్యాత్మ మఱింత ఉజ్జ్వలముగ ప్రకటము అయ్యెను. ఒఱగా ఉన్న దేహము పలుచబాఱుటతో లోపల ఉన్న దేవతలును దేవేరులును నానాటికి హెచ్చుగా ప్రకాశింప దొడగిరి. కాళీపూజనాడు 'లోకమాతయే గురుదేవుని రూపు దాల్చి ఉన్నది' అను సత్యము భక్తులకు ఎల్లరకును స్పష్టముగ ప్రత్యక్షము అయ్యెను.

## కడపటి దినములు – కాశీపూరులో

శ్రీరామకృష్ణుని వ్యాధి ఇంకను ముదురుచున్న చిహ్నములు అగపడినవి. వెంటనే, డాక్టరు సర్కార్ మాట ప్రకారము, భక్తులు కలకత్తాకు ఉత్తర పరిసరములందు ఉన్న కాశీపూరులో విశాలము ఐన ఒక తోటమాళిగ [ఆరామభవనము : గార్డెన్హౌసు] ను అద్దెకు తీసికొని తే 11–12–1856 ది నాడు గురుదేవుని అచ్చటికి చేర్చిరి.

స్థూల జగమున గురుదేవుడు నటించిన జీవితమహానాటకము ఈ కాశీపూరులో ఉండగనే ముగిసినది. తెర వ్రాలినది. ఆయన ఆత్మ దేహమును వీడుటకు ఎనిమిది నెలల జాగు చేసినది. ఆయనకు మహోద్వేగము గలిగినది, దేహము కొట్టుకొన పడి నంతగా నొగిలినదియు, ఆత్మ విజయవంతముగ ప్రకాశ మొందినదియును ఈ కాలముననే. గురుదేవుని మానవత్వమునకును దివ్యత్వమునకును నడుమ ఉన్న పొలిమేర మిగుల సన్ననిది. ఆ యెల్లకు ఇది అటును అది యిటును మాటిమాటికిని తొనకుచు మరలుచు ఉండుటయు స్పష్టముగ గన నగు చుండెను. ఆ యెనిమిది నెలలలోను ప్రతినిమిష

మందును మహానురాగమును అద్భుతా త్మోదాత్తతయు పొంగి పొరలు చుండినవి. ఆయన వాక్కున వెలువడిన ఒక్కొక్కమాటయు ఉన్నతము కరుణరసభరితము.

కొన్ని దినములలోనే క్షేత్రపరిసరములు అందఱకును వాడుక పడినవి. గురుదేవునకును ఆయన పరిచారకులకును అన్నము వండించు పనిని శ్రీమాతృదేవి చూచుకొను చుండెను. ఆమెకు శ్రీరామ కృష్ణుని మేనగోడలు లక్ష్మీదేవియు కొందఱు భక్త మహిళలును తోడ్పడుచుండిరి. అయిన వ్యయములో అధికభాగమును సురేంద్రుడు మహాప్రీతితో భరించుచుండెను. ఇతరగృహస్థులును యథాశక్తి తోడ్పడిరి. గురుదేవుని ఎడబాయక పరిచర్య చేయుచుండిన శిష్యులు పన్నిద్దఱు — (౧) రాఖాలు (౨) నరేంద్రులు, (౩) బాబురామ్ (౪) నిరంజన్ (౫) జోగిన్ (౬) లాటు (౭) తారకులు, (౮) కాళి (౯) శశి (౧౦) శరత్తులు, (౧౧) పెద గోపాలు, (౧౨) పిన గోపాలు. శారదా – హరీశ – హరి – గంగాధరులు అను వారు గురుదేవుని అప్పటికి అప్పుడు వచ్చి చూచి పోవుచు తమ యిండ్ల యొద్దనే సాధనలు చేయు చుండిరి. నరేంద్రుడు 'లా' పరీక్షకు చదువ వలసి ఉండెను. గురుసేవ నడుమ విరామకాలము అరుదు. అట్టి విరామకాలము లభించి నప్పుడు చదువుకొందము అని అతడు తన పుస్తకములను ఆరామభవనమునకు తెచ్చుకొనెను. ధ్యానమును శాస్త్రగ్రంథపఠనమును ఇతర జ్ఞాన సాధనలను ఇంకను గాటముగ ఒనర్పుడు అని నరేంద్రుడు సోదరశిష్యులను ప్రోత్సాహపఱచు చుండెను. వారు అందఱును తమ లౌకిక విధులను బంధువులను మఱచిపోయిరి.

పరిచర్య చేసిన శిష్యులలో, శశి విశిష్టుడు. గురుసేవ ఆయన లోనే రూపుదాల్చినది. ఇతర శిష్యుల వలె ధ్యానజపములను గాని సాధనలను గాని శశి అనుష్ఠింప లేదు. గురుసేవ ఒక్కటే తనకు

పరమధర్మము అని అతడు దృఢముగ విశ్వసించెను. ఆహారము మఱచి, విరామము లేక, అతడు సదా గురుదేవుని పాన్పు పజ్జనే సిద్ధముగ ఉండెను.

ఒకనాడు శశధరపండితుడు గురుదేవునితో "మీ మనస్సును మీ కంఠముపై ఏకాగ్రము ఒనర్చుకొంటి రేని, ఆ వ్రణము మాయము అగును. తమ వ్యాధులను తామే ఆ రీతిగ పోగొట్టుకొను శక్తి యోగులకు ఉన్నది అని శాస్త్రగ్రంథములు చెప్పుచున్నవి" అనెను. గురుదేవుడు "నీవంటి పండితుడు చెప్పదగిన మాటయేనా ఇది ? ఎంత సిగ్గుచేటు ! భగవంతుని చర ణారవిందమునుండి నామనస్సును నేను ఎట్లు మరల్చుకొనగలను ? దానిని ఈ తుచ్ఛ రక్త మాంస పంజరము వంకకు నేను ఎట్లు త్రిప్పగలను ?" అని అతనిని చీవాట్లు పెట్టెను. "మా కొఱకై నను అట్లు చేయుడు" అని నరేంద్రాది శిష్యులు బతిమాలిరి. అందులకు గురుదేవుడు— "నాకు ఏమి ఈ వ్యాధి భోగ్యము అనియా మీ తలంపు ? నేనును ఆరోగ్యమునే కోరు చున్నాను. కాని నా వ్యాధి నయము అగుట లోకమాత చేతిలో ఉన్నది."

నరేంద్రుడు — అట్లైన ఆమెనే ప్రార్థింపుడు, ఆమె మీ ప్రార్థనను చెల్లింపక తప్పదు.

గురుదేవుడు — నా దేహమునకై నేను ప్రార్థింపను.

నరేంద్రుడు — మీరు ప్రార్థింప వలసినదే, మా కొఱకైనను ప్రార్థింపుడు.

గురుదేవుడు — కానిండు, ప్రయత్నించి చూతును.

కొన్ని గంటల పిదప గురుదేవుడు నరేంద్రునితో ఇట్లు అనెను— "కంఠబాధచే ఆహారము మ్రింగ లేక ఉన్నాను, కొంతయైనను

ఆహారమును మ్రింగ గలుగు నట్లు కరుణింపుము'' అని నేను లోక మాతను ప్రార్థించితిని. ఆమె మిమ్ము అందఱను జూపి ''ఇన్ని నోళ్ల గుండ నీకు కావలసిన ఆహారము ముట్టుచునే ఉన్నది గదా'' అని అడిగినది. నాకు తలవంపులై మాఱు మాటాడ లేక పోయితిని — అని. ఈ మాటతో శిష్యులకు 'గురుదేవుని వ్యాధి నయము అగును' అనెడి ఆశ పటాపంచలు అయ్యెను.

'నేను మరణించులోపలనే, రహస్యములుగ ఉంచి యున్న విషయములను అన్నిటిని వెల్లడి చేయుదును' అని గురుదేవుడు కొన్నాళ్లకు ముందు చెప్పి యుండెను. తే 1–1–1886 ది నాడు ఆయన దేహమునకు ఒకింత స్వాస్థ్యము గలిగినది. కొంత పచారు చేయు దము అని ఆయన తోటకు దిగి వచ్చెను. అప్పటికి అపరాహ్ణము 3 గంటలై ఉండును. చావడిలో కొందఱును చెట్లక్రింద కొందఱునుగా దాదాపు ముప్పండ్రు లౌకిక శిష్యులు ఉండిరి. అప్పుడు శ్రీరామ కృష్ణుడు గిరీశుని ''సరి, గిరీశా, నేను దేవుని అవతారము అని నీవు అందఱితో చెప్పు చుందువే, నాలో నీకు అగపడిన విశేషము ఏమి'' అని అడిగెను. ఏ ప్రశ్నకు ఐనను సరే జవాబు గిరీశు నొద్ద సిద్ధముగ ఉండును. అతడు గురుదేవుని ఎదుట మోకరిల్లి, కేలు మోడ్చుకొని ''ఎవని మహిమను ఇంతటిది అని వాల్మీకి వ్యాసాది మహర్షులు సరిగా కొలువ లేక ఉన్నారో, అట్టి పరాత్పరుని గూర్చి నాయట్టి అల్పుడు ఏమి చెప్పగలడు?'' అనెను. గురుదేవుని హృదయము పరమానుగ్రహ భరితము అయ్యెను. ''ఇంత కన్న ఎక్కువ ఏమి చెప్పుదును? మిమ్ము అందఱను దీవించుచున్నాను. మీలో జ్ఞానజ్యోతి వెలుగుచునే ఉండును గాక'' అని పలికి ఆయన పారమార్థిక భావావేశమును ఒందెను. ఆయన పలుకులను విన్నంతనే భక్తులు అందఱును భావోద్రేకవశులై పరుగున వచ్చి ఆయన చరణముల వ్రాలిరి. ఆయన అందఱను స్పృశించెను. ఎవనికి తగిన ఆశీస్సు వానికి లభించినది. గురుదేవుని దివ్యస్పర్శచే ఒక్కొక్కరును అనిర్వాచనీయానందము

అనుభవించిరి. కొందఱు నవ్విరి, కొందఱు ఏడ్చిరి, కొందఱు ధ్యానింప గూర్చుండిరి, కొందఱు ప్రార్థింప దొడంగిరి, కొందఱు జ్యోతిని జూచిరి, కొందఱు తమ యిష్టదైవములను సాక్షాత్కరించుకొనిరి, కొందఱకు ఆధ్యాత్మిక శక్తి తమ దేహములలో చొచ్చుకొనుచుండుట తెలియ నయ్యెను.

నరేంద్రుడు బ్రహ్మజ్ఞానసిద్ధికై మిక్కిలి ఉబలాటపడుచుండెను. "అందఱకును శాంతి లభించెనే, నాకు మాత్రము ఇంకను సంతృప్తి చేకుఱ లేదే" అని అతడు గురువుతో మొఱ పెట్టుకొనెను. "నీకు ఏమి కావలె" అని గురుదేవుడు అడిగెను. "మూడు నాలుగు దినముల పాటు విశ్వమును ఎల్ల మఱచి సమాధి నిమగ్నుడనై ఉండ వలెను అని నా కోరిక. అట్టి సమాధిని నాకు ప్రసాదింపుము" అని నరేంద్రుడు అడిగెను. గురుదేవుడు అతనిని చీవాట్లు పెట్టి "నీవు మూర్ఖుడవు. సమాధికంటెను పైదశ కూడ ఒకటి ఉన్నది. 'ఓ దేవా, సకలమును నీవే' అని పాడుచుండువాడవు నీవే కదా! మొదట నీ కుటుంబ పరిస్థితులను చక్కబెట్టుకొని తర్వాత నా యొద్దకు రమ్ము. సమాధికంటె పైదైన దశను నీవు అనుభవింతువు" అనెను.

ఆధ్యాత్మికముగ నరేంద్రుని తనకు వారసుగా చేసికొన ఎంచి ఉన్నాను అని గురుదేవుడు ప్రకటముగ చెప్పుచుండెను. తాను ప్రారంభించిన పనిని, తనకు అనంతరము కొనసాగింప వలసిన వాడు నరేంద్రుడు. అతనికి గురుదేవుడు "ఈయువకులను నీచేత ఉంచుచున్నాను. వారు తమ పారమార్థికపరతను వర్ధిల్ల జేసికొను నట్లును గృహములకు మరలి పోకుండు నట్లును చూచుకొనుము" అని తెలిపెను. గురుదేవుడు ఒకనాడు, సన్న్యాసజీవితమును గడప సిద్ధపడుచున్న బాలురను 'వర్ణవ్యవస్థను పాటింపక ఇంటింటను భిక్షాటనము సేయుడు' అని నియోగించెను. ఆ యాజ్ఞను వారు మిగుల కొనియాడి భిక్షా పాత్రలతో బయలుదేఱిరి. కొన్నాళ్లకు అనంతరము వారికి ఒక్కొ

క్కనికిని, కావిబట్టలను గురుదేవుడు తానే ఇచ్చెను. గిరీశునకును గూడ నొసంగెను. అతడు త్యాగవైరాగ్యములలో ఎవ్వరికిని తీసి పోడు. ఇట్లు భవిష్యత్కాలమున ఏర్పడ ఉన్న శ్రీరామకృష్ణ మఠ సన్న్యాసి పరంపరకు గురుదేవుడు స్వయముగ పునాదులు వేసిన వాడు ఆయెను.

శ్రీరామకృష్ణుని యారోగ్యము నానాటికి క్షీణించు చుండెను. ఆహారము ఎంతకు తగ్గ నగునో అంతకు తగ్గినది. దేనినిగాని మ్రింగుట ఇంచుమించు అసాధ్య మయ్యెను. "దీనిని అంతయును నేను సంతోషముతో ఓర్చుకొనుచున్నాను. అట్లు నేను ఓర్వ కున్న, ఈ పాటికి మీరు ఏడ్చు చుందురు. ఈ యాతనను అనుభవించుటకన్న మరణమే మేలు అని మీరు అందఱును చెప్పుదు రేని నేను సిద్ధముగనే ఉన్నాను" అని గురుదేవుడు మహేంద్రుని చెవిలో చెప్పెను. మఱు నాటి ఉదయమున, ఖిన్నులై తన పాన్పు పజ్జ ఆసీనులై ఉన్న శిష్యులను గని "నాకు ఏమి అగపడుచున్నదో మీరు ఎఱుగుదురా? దేవుడే సకల వస్తువులుగను రూపొందినట్లు నాకు అగపడుచున్నది. మానవులు జంతువులు అన్నియు చర్మములు కప్పబట్టిన వట్టి చట్టములు. వారి బుఱ్ఱలందును అవయవములందును చైతన్యరూపమున ఉండునది సర్వేశ్వరుడే. యజ్ఞములందు బలిపీఠమును సర్వేశ్వరుడే, బలి అగు ప్రాణియు సర్వేశ్వరుడే, బలి ఇచ్చు వాడును సర్వేశ్వరుడే అని నా కంటితో స్పష్టముగ గుర్తించుచున్నాను" అని చెప్పి భావోద్రేకముచే స్మృతి తప్పి పడి పోయెను. స్మృతి ఒక్కింత కలుగగనే "ఇప్పుడు నాకు నొప్పి లేనే లేదు. మంచి ఆరోగ్యములోనే ఉన్నాను" అని, లాటును జూచుచు "అదుగో లాటు. తన తలను అఱచేత ఉంచుకొని కూర్చున్నాడు. అట్లు అచట లాటురూపమున కూర్చున్నది భగవంతుడే అని నా దృష్టికి కనబడు చున్నది" అనెను.

ఆ మాటలు ప్రేమపూర్ణములుగను వశీకరణసమర్థములుగను ఉండెను. ఆయన, తల్లివలె, రాఖాలు నరేంద్రుల మొగములను మెల్లగ తడవి వారిని ముద్దాడెను. మహేంద్రునితో "ఈదేహము నకు ఇక కొంతకాలము ఉండు వీలు ఉన్నచో, ఇంకను ఎందఱ ఆత్మలకో జ్ఞానజ్యోతి లభించి ఉండును" అని గొణిగి, కొంత ఆగి, మరల "కాని, దేవి నియమము వేఱు రీతిగ ఉన్నది. నా అవివేక మును అమాయికతను ఆధారపఱచుకొని ప్రజలు నన్ను వంచించి అరుదైన ఆధ్యాత్మిక సిద్ధులను పొందుదురో ఏమో అని చకితయై దేవి నన్ను కొని పోవనున్నది" అనెను. కొన్ని నిమిషములు అయిన తర్వాత తన గుండెపై చేయి ఉంచుకొని "ఇచ్చట ఇరువురు ఉన్నారు. ఒకతె లోకమాత, రెండవవాడు ఆమె భక్తుడు. చేయి విఱుచుకొన్న వాడు అతడే, ఇప్పుడు రోగగ్రస్తుడుగ ఉన్నవాడును అతడే. నా మాటలు అర్థమైనవా?" అని అడిగి, కొంత సేపు ఊర కుండి, మరల "అయ్యో! ఈమాటలను ఎవరితో చెప్పుదును? ఎవరు నన్ను అర్థము చేసి కొందురు" అని విచారపడి, "దేహము ఉన్నంత వఱకు బాధలు తప్పవు. భక్తులకై దేవుడు కూడ దేహధారి యగు చున్నాడు" అని ఓదార్చెను.

మిక్కిలి బాధ గలిగించెడి ఆ వ్యాధిచే గురుదేవుని ఆత్మకు నిజముగ బాధ గలిగెనో లేదో ఎవ్వరును నిర్ణయించి చెప్పలేరు. తక్కినప్పు డెట్లున్నను ఉన్నత బ్రహ్మజ్ఞాన దశలో ఉన్న సమయ ములలో నైనను ఆయనకు శరీరస్మృతియు వ్యాధిబాధలతలంపులును లేకుండిన వని చెప్ప వచ్చును. ఆయనకు తుది దినాలలో అట్టి జ్ఞాన దశ ఇంచుమించు అవిరతముగనే ఉండెను. ఆయనకు పరిచర్య చేసిన శిష్యులలో ఒక్కడు* అనంతరకాలమున ఇట్లు చెప్పి ఉన్నాడు — "రోగముతో పరుండి ఉన్నప్పుడు శ్రీరామకృష్ణుడు వాస్తవముగ నొప్పి అనుభవింపనే లేదు. "ఓ మనసా, దేహమును మఱచిపొమ్ము,

* లాటు అనియు, తర్వాత అద్భుతానందస్వామి యనియు ప్రసిద్ధుడు.

వ్యాధిని మఱచిపొమ్ము, ఆనందమున మునిగిఉండుము'' అని ఆయన తఱచు చెప్పుచుండెను. కావున బాధను అనుభవింపనే లేదు. నిజముగ ఒక్కొక్కప్పుడు ఆనంద రోమాంచము మేనియందు స్పష్టముగ కాన నగు దశలో గూడ ఆయన ఉండి యున్నాడు. మాటల చేత కాకున్నను ఏదో యొక మార్గమున తనకు బాధ లేదు అనియే మాకు ఆయన తెలుపు చుండెను. ఆయనను జూచుచుండిన వారు అందఱును బాగుగ ఎఱిగిన విషయమే ఇది. ఆయనను అర్థముచేసికో లేని వారు మాత్రము ఆయన ఏదో గొప్పబాధ పడుచుండి నట్లు అనుకొనిరి. ఆయన ఆ దినాలలో మాలోనికి ఎంత ఆత్మానందమును సంక్రమింప చేసినాడు! ఆయనకు శరీరబాధలు ఉండి ఉన్నచో మాకు అట్లు ఆనందము గూర్ప సాధ్యమై యుండునా? ఆ కాలములోనే మాకు ఆయన ఈ సత్యములను బోధించినాడు — బ్రహ్మము సదా నిస్సంగము. వాయువు పూలవాసనను మోచుచునే ఉన్నను, సొంతముగ దానికి వాసన లేదు గదా. అట్లే బ్రహ్మములో మూడు గుణములు ఉన్నను, ఆగుణములచే బ్రహ్మమునకు ఎట్టి పరిణామమును లేదు. బ్రహ్మము అఖండచిత్తు, అఖండసత్తు, అఖండానందము. దానికి మోహము లేదు, శోకము లేదు, వ్యాధి లేదు, మృతి లేదు, వృద్ధి లేదు, క్షయము లేదు. పరమాత్మయు జీవాత్మయు అభిన్నములు. రెండును ఒక్కటే. ఆత్మ ఒక్కటే. అది ద్వంద్వాతీతము, అవిభాజ్యము.''

ఒకనాడు శ్రీమాతృదేవి (=శారద) 'గురుదేవుని వ్యాధిని నిర్మూలింప చేయుము' అని ప్రార్థించుటకై, రహస్యముగ, గంగను దాటి, శివాలయమునకు పోయెను. అచ్చట ఆమెకు ఒక దివ్యదృశ్యము అగపడెను. అందు గురుదేవుని మరణము అనివార్యము అనియు అందులకు ఆమె సిద్ధముగ ఉండ వలె అనియు సూచన తెలియ నయ్యెను.

ఒకనాడు నరేంద్రుడు క్రింది అంతస్తున ధ్యానించు చుండెను. మిద్దెమీద తన పాన్పుపై గురుదేవుడు మేలుకొనియే పరుండి ఉండెను.

గాఢధ్యానమున ఉన్న నరేంద్రునకు తన తలకు వెనుక వైపు ఒక దీపము వెలుగు చున్నట్లు అనిపించెను. తటాలున అతనికి స్మృతి పోయెను. అది నిర్వికల్ప సమాధి దశ. అందులో జీవాత్మ పరమాత్మతో ఐక్య మొందును. తక్కినది ఎల్ల మిథ్య అనెడి అనుభవము గలుగును. ఆ సమాధికొఱకే అతడు ఇన్నాళ్లు త్వరపడు చుండినది. చాల కాల మైన పిమ్మట అతనికి దేహస్మృతి కొంత గలిగినది. కాని తన దేహము అతనికి కనిపింప లేదు; తల ఒక్కటే కనబడు చుండెను. "నా దేహము ఏదీ" అని అతడు అఱచెను. పెదగోపాలు అప్పుడే గదిలో ప్రవేశించి "నీ దేహమా? ఇదిగో ఇక్కడనే ఉన్నదే, నరేన్" అనెను. నరేంద్రున కేమో దేహము అగపడనే లేదు. గోపాలు భయపడి మిద్దె మీదికి గురుదేవునొద్దకు పరుగిడెను. గురుదేవుడు "ఆ దశలో అతనిని కొంతసేపు ఉండ నిమ్ము. ఆ దశను తనకు గలిగింపు మని నన్ను చాలదినములు తొందర పెట్టినాడు" అని మాత్రము చెప్పెను.

మఱి కొంత దీర్ఘ కాల మైన పిమ్మట నరేంద్రునకు పూర్తి స్మృతి గలిగినది. శాంతిలో మునిగి, అతడు గురుదేవు నొద్దకు బోయెను. గురుదేవుడు అతనిని గని "ఇప్పుడు లోకజనని నీకు సర్వము చూపినది. కాని ఇప్పుడు నీవు చూచిన దెల్ల బీగము వేయబడిన పెట్టెలో ఉండును. తాళపు చెవి నాచేతిలోనే ఉండును. లోకమాత నీకు విధించిన పనులను నీవు పూర్తిగ నెఱవేర్చిన మీదట ఈనిధి మరల నీవు పడయ గందువు" అనెను.

కొన్నాళ్లకు పిదప నరేంద్రగురుదేవులు మాత్రము ఏకాంతముగ ఉన్నప్పుడు గురుదేవుడు అతనిని జూచుచునే సమాధి నిమగ్నుడు అయ్యెను. తనలో ఒక సూక్ష్మశక్తి చొచ్చుకొను చుండుట నరేంద్రునకు అనుభవ గోచరము అయ్యెను. నరేంద్రునకును బాహ్యలోకస్మృతి పూర్తిగ తొలగెను. కొంత సేపటికి అతనికి మామూలు దశ గలిగెను. గురుదేవుని జూడగా, ఆయన ఏడ్చు చుండెను.

శ్రీరామకృష్ణుడు అతనితో "నేడు నాసర్వస్వమును నీకు ఇచ్చి వేసితిని. నేను ఏమియు లేని ఒక పేద పకీరను ఐతిని. ఈ శక్తిచే నీవు విశ్వమునకు అనంత శ్రేయములు ఒడగూర్పగలవు. దానిని సాధించిన తర్వాతనే నీవు నీ పూర్వస్థానమునకు చేరుకొందువు" అనెను. అప్పటి నుండి గురుదేవుడు శిష్యునిలో ఆంతరముగ వసించుచుండెను.

సందేహ పిశాచము సులువుగ తొలగి పోవునది కాదు. ఒకటి రెండు దినములకు తర్వాత నరేంద్రుడు తన మనస్సులో "ఈ దుర్భర దేహ బాధను అనుభవించు చున్నప్పుడు కూడ తాను దేవుడనే అని యీయన చెప్పగలిగినచో, ఈయన అవతారపురుషుడు అని నేను అప్పుడు ఒప్పికొందును." అని అనుకొనెను. అప్పుడు అతడు శ్రీరామ కృష్ణుని ప్రక్కన పాన్పుపై గూర్చుండి ఉండెను. అది తళుక్కు మని తోచిన ఒక తలంపే కాని, స్థిరముగ ఉండునది కాదు. ఐనను గురు దేవుడు చిరునవ్వు నవ్వెను; తనలో శేషించి ఉన్న బలము నెల్ల కూర్చుకొని స్పష్టముగ ఇట్లు అనెను—"పూర్వము ఎవడు రాముడుగ ఉండెనో, ఎవడు కృష్ణుడుగ ఉండెనో అతడే ఇప్పుడు ఈ దేహమున రామకృష్ణుడుగ ఉన్నాడు, కాని మీ *వేదాంతార్థమున గాదు"— విని, నరేంద్రుడు సిగ్గు జెందెను.

## మహాసమాధి

తే 15–8–1886 ది భానువారమునాడు గురుదేవుని నాడి క్రమము తప్పినది. భక్తులు ఆయన శయ్యాప్రక్కన నిలుచుండిరి. మునిమాపు వేళ యప్పటికి శ్రీరామకృష్ణునకు ఊపిరి ఆడుట కష్టము అయ్యెను. కొంతసేపటికి ఆయన తనకు ఆకలిగ ఉన్నది అనెను. కొంచెము ద్రవాహారమును నోట పోయగా అందు కొంత గొంతు లోనికి పోయెను, శేషించినది గడ్డము మీదుగా కాఱెను. ఇద్దఱు పరిచారకులు ఆయనకు విసనకఱ్ఱలతో వీచుచుండిరి. తటాలున గురు

* అద్వైతవేదాంతమున అవతారమూర్తి పారమార్థిక సత్యము కాదు.

దేవుడు అంతకు మునుపు ఎప్పుడును కనియుండని ఒక క్రొత్తతీరు సమాధిలో మునిగెను దేహము కొయ్యవాఱెను. శశికి దుఃఖబాష్పములు ఉప్పొంగెను. కాని సగమురాత్రియప్పటికి గురుదేవునకు మరల స్మృతి గలిగినది, అప్పుడు ఆకలి ఎక్కువగా ఉన్నందున ఒక గిన్నెడు గంజిని ఎట్లో త్రాగెను. తనకు మరల బలము గలిగినది అన్నాడు. శశి తన దేహమునకు ఐదాఱు తలగడలను ఆనించి పెట్టుకొనెను. ఆ తలగడలకు ఆనుకొని గురుదేవుడు కూర్చుండెను. శశి ఆయనకు విసనకఱ్ఱతో వీచుచును ఉండెను. నరేంద్రుడు గురుదేవుని పాదములను తన ఒడిలో ఉంచికొని వానిని తోమ దొడగెను. గురుదేవుడు అతనితో "ఈబాలురను చూచుకొనవోయి" అని పలుమార్లు చెప్పెను. తర్వాత తన్ను పరుండ బెట్ట గోరెను. ముమ్మాఱు ఖణిల్లు మను స్వరమున తనకు ప్రాణప్రియ మైన కాళీనామమును బేర్కొని పరుండెను. ఒంటిగంట దాటి రెండు నిమిషములు ఐనప్పుడు, గొంతున కొంత చప్పుడు వినవై ఆయన ప్రక్కకు వ్రాలెను. దేహము అంతయును ఝల్లు మనెను, గగుర్పాటు కలిగెను. ఆయన కన్నులు నాసికాగ్రమును లక్షించుచు ఆగిపోయినవి. వదనము మందహాసముతో వెలుగొందెను. చర మానం దోద్రేకము ఆరంభము అయ్యెను. అదే మహాసమాధి, పూర్తిలయము, అందుండి ఆయన మరల వెనుదిరుగ లేదు. దానిని జూడ లేక నరేంద్రుడు మెట్లు దిగి పరుగిడెను.

మఱునాటి మధ్యాహ్నము వచ్చిన డాక్టరు సర్కార్ "ప్రాణము పోయి అరగంట సేపే ఐనది" అనెను. ౫ గంట లప్పుడు గురుదేవుని శరీరమును క్రిందికి దెచ్చిరి, ఒక మంచముపై ఉంచిరి, కాషాయ వస్త్రములను దాల్చిరి, గంధపుష్పములతో అలంకరించిరి. ఊరేగింపు బయలుదేఱెను. గంగాతీరమున బరానగర ఘట్టమునకు గురుదేవుని శరీరమును గొంపోవుచున్నప్పుడు చూచి కన్నీరు విడువని వారు లేరు.

భక్తులు పవిత్ర భస్మ శేషమును దీసికొని ఆరామభవనమునకు వచ్చిరి. అప్పుడు వారి ఉల్లములందు శాంతియును తితిక్షయును నెలకొనగా వారు "శ్రీగురుమహారాజుకు జే" అని అఱచిరి.

శ్రీమాతృదేవి (=శారద) తన గదిలో ఏడ్చుచుండెను, భర్త లేడే అని కాదు, కాళిమాత తన్ను విడనాడెనే అని. హిందూ వితంతు వేషమును ఆమె ధరింపబూనుకొన్నప్పుడు క్షణిక దివ్య దర్శనము ఒకటి కానవై, అందు విశ్వాస జనకమైన వాణి ఇట్లు వినవయ్యెను—"నేను ఒక గదినుండి వేఱు ఒక గదికి వచ్చియున్నాను, అంతే".



ఓమ్

## మొదటి ప్రకరణము

# గురు శిష్యులు

ఫెబ్రువరి 1882

1882 వ సంవత్సరము వసంతకాలమున ఒక ఆదివారమునాడు శ్రీరామకృష్ణుని మహేంద్రుడు మొట్టమొదటి సారి కలసికొనెను. శ్రీరామకృష్ణుని జన్మదినము దాటి అప్పటికి కొన్నాళ్లు ఐ యుండినవి. శ్రీరామకృష్ణుడు అప్పుడు దక్షిణేశ్వరమున గంగగట్టున కాళీమాతకు వాసస్థానము ఐన కాళీబాడిలో వసించుచుండెను.

మహేంద్రునకు ప్రతిభానువారమును విరామదినమే. కావున ఆయన సిద్ధేశ్వరమజుందారు అను తన మిత్రునితో గూడి బరానగర మందలి పెక్కుతోటలను చూచి వత్తము అని పోయి ఉండెను. వారు ప్రసన్న బానర్జిగారి తోటలో తిరుగుచున్నప్పుడు సిద్ధేశ్వరుడు "గంగ గట్టున పరమహంస ఒకరు వసించు మనోహరస్థలము ఒకటి గలదు. అక్కడికి వచ్చుట నీకు ఇష్టమేనా" అని అడిగెను. మహేంద్రుడు అందులకు సరి అనెను. అంత ఇద్దఱును దక్షిణేశ్వరాలయారామమునకు బయలుదేఱిరి. సాయంకాల మప్పటికి వారు ప్రధానద్వారము నొద్దకు చేరుకొని సూటిగ శ్రీరామకృష్ణుని గదికి పోయిరి. అచ్చట శ్రీరామకృష్ణుడు తూర్పుముఖముగ ఒక కొయ్య మంచముపై కూర్చుండి ఉండగ ఇద్దఱును జూచిరి. మొగమున చిఱునవ్వుతో శ్రీరామకృష్ణుడు భగవంతుని గూర్చి ప్రసంగించుచుండెను. గది నిండుగ ప్రజలు మూగి ఉండిరి. అందఱును నేల మీద కూర్చుండి గాఢ మౌనముతో ఆయన 'సూక్తిసుధ'ను చెవు లార గ్రోలుచుండిరి.

మహేంద్రుడు అచ్చటనే కొంతసేపు నిలుచుండి జరుగుచున్న

దానిని కాంచుచుండెను. ఆయనకు నోరు ఆడ లేదు. పవిత్రస్థలములు అన్నియును ఒక్కటిగ కూడి ఉన్న చోట తాను నిలుచుండి ఉన్నట్లు ఆయనకు తోచినది. శ్రీశుకదేవుడే భగవంతునిగూర్చి ప్రసంగించుచు ఉన్నట్లుగానో, శ్రీచైతన్యుడు పూరిలో తన భక్తులతో కూడి భగవన్నామములను భగవన్మహిమలను కీర్తించుచు ఉన్నట్లుగానో ఆయనకు కనిపించినది.

అప్పుడు శ్రీరామకృష్ణుడు ఇట్లు అనుచుండెను — "హరి నామమునో రామనామమునో ఒక్కసారి విన్నంతనే నీకు బాష్పములును గగుర్పాటును కలుగు నేని, అటు పిమ్మట సంధ్యావందనాది కర్మలను నీవు అనుష్ఠింప అక్కఱ లేదు అని నీవు నిశ్చితముగ తెలిసికో వచ్చును. కర్మలను త్యజించుటకు అర్హత నీకు అప్పుడే కలుగును; లేదా, కర్మలే అప్పుడు నిన్ను విడిచి పుచ్చును అనుట ఇంత కన్న సరిగ ఉండును. అప్పుడు రామనామమునో హరినామమునో మాత్రమే జపించినను చాలును, ఓంకారమును మాత్రమే జపించినను చాలును."

మహేంద్రుడు తనచుట్టును చూచుకొని ఆశ్చర్యమున మునిగి తనలో మొదట ఇట్లు అనుకొనెను — "ఎంత చక్కని చోటు ఇది! ఇతడు విశ్వాకర్షక వ్యక్తి; ఇతని మాటలు ఎంతసొంపుగ ఉన్నవి. ఈ చోటును విడిచి ఆవలకు ఏగుట నాకు ఇష్టము లేదు." కొన్ని నిమిషములకు తర్వాత "మొదట ఈ చోటును అంతను చూతును గాక, తర్వాత మరల ఇచ్చటికి వచ్చి కూర్చుందును." అని అతడు అనుకొనెను.

అతడు సిద్ధేశ్వరునితో గూడి గదిని విడిచి వెడలిన వెంటనే, దేవాలయమునుండి సాయంపూజా సమయమున వెలువడు ఘంటా నినాదమును, మృదంగ ధ్వానమును, వాద్యధ్వనియు, తాళశబ్దమును కలిసిన మధురసంగీతము అతని చెవిని బడినది. తోటకు దక్షిణపు మూలలో ఉన్న వాద్యమండపమునుండి వెలువడు సంగీతముకూడ,

విన నయ్యెను. ఈ మధుర శబ్దములు గంగమీదుగ తేలుచు పర్వి చాల దూరము పోయి లయము ఒందినవి. మెల్లని మలయపవనము పూలపరిమళమును మోసికొని వీచుచుండినది. అంతకు కొంత ముందే చంద్రోదయము ఐ ఉండెను. ప్రకృతియును మానవుడును ఒకటిగ కలిసి సాయంపూజకు తయారు అగుచున్నట్లు తోచినది. మహేంద్ర సిద్ధేశ్వరులు పండ్రెండు శివాలయములను రాధాకాంతాలయమును భవతారిణీమాత వెలసి ఉన్న గుడిని దర్శించిరి. విగ్రహములకు ఆరాధన జరుగుచుండగా గమనించు నప్పుడు మహేంద్రునిహృదయ మున ఆనందము పొంగి పొరలినది.

శ్రీరామకృష్ణుని గదికి మిత్రులు ఇరువురును మరలి వచ్చు నప్పుడు వారు ఒకరితో ఒకరు మాటాడుకొనుచుండిరి. ఆ గుడి, రాణిరాస్మణి కట్టించినది అని సిద్ధేశ్వరుడు మహేంద్రునకు తెలిపెను. ప్రతిదినమును దైవమును అచట కాళిరూపమునను కృష్ణరూపమునను శివరూపమునను ఆరాధింతురు అనియు, ఆలయములోపల సాధువుల కును పేదలకును అనేకులకు అన్నప్రదానము జరుగు చుండును అనియు గూడ సిద్ధేశ్వరుడు చెప్పెను. వారు శ్రీరామకృష్ణుని గదిని సమీ పించి చూడగా, గది వాకిలి మూతవడి ఉండెను, బృందే అను దాసి బయట నిలుచుండెను. మహేంద్రుడు పాశ్చాత్యుల మర్యాదలకు అలవడినవాడు అగుటచేత, తనరాకను ముందుగా తెలుపుకొనక గదిలో ప్రవేశింపడు. కావున "సాధువు, లోపల ఉన్నాడా" అని బృందేను అడిగెను. 'ఔను, గదిలో ఉన్నారు' అని ఆమె జవాబు చెప్పినది.

మ—ఆయన ఎన్నాళ్లుగ ఇచ్చట వసించుచున్నాడు?

బృందే—ఆయన చాలకాలముగ ఉన్నారు.

మ—ఆయన అనేకగ్రంథములను చదువుచుండునా?

బృందే—గ్రంథములనా? చదువుట లేనే లేదు. గ్రంథములు అన్నియును ఆయన నాలుకపైని ఉన్నవి.

మహేంద్రుడు కళాశాలలో తనచదువును పూర్తి చేసి ఎంతో కాలము కాలేదు. శ్రీరామకృష్ణుడు పుస్తకములను జదువడు అని విన్నంతనే అతనికి ఆశ్చర్యము కలిగెను.

మ—ఆయనకు సాయంపూజావేళయా ఇది? మేము గది లోనికి పో వచ్చునా? ఆయనను దర్శింప వలెను అని మేము ఉబలాట పడుచున్నాము. ఆ సంగతిని నీవు ఆయనకు తెలిపెదవా?

బృందే—పొండు, బిడ్డలారా, సూటిగ లోనికి పొండు, పోయి కూర్చుండుడు.

వారు గదిలో ప్రవేశించిన వెంటనే శ్రీరామకృష్ణుడు ఒంటరిగ ఒక కొయ్యమంచము మీద ఆసీనుడై ఉండుటను జూచిరి. ధూపార్పణము అప్పుడే ఐనది, తలుపులు మూతవడియే ఉండినవి. మహేంద్రుడు గదిలోనికి వచ్చినంతనే గురుదేవునకు కేల్మోడ్చి మ్రొక్కెను. తర్వాత గురుదేవుని ఆజ్ఞ మేరకు అతడును సిద్ధేశ్వరుడును నేలపై కూర్చుండిరి. శ్రీరామకృష్ణుడు వారిని "మీ నివాసము ఎక్కడ? మీ వృత్తి ఏమి? బరానగరమునకు మీరు ఏల వచ్చితిరి?" అని అడిగెను. అందులకు మహేంద్రుడు జవాబులు చెప్పెను. కాని నడుమ నడుమ గురుదేవుడు వేఱు ధ్యానములో ఉన్నట్లు కానవచ్చు చుండెను. దానిని మహేంద్రుడు గుర్తించెను. ఈ దశకు భావసమాధి అనియు ఆనంద పరవశత అనియు పేరులు అని తర్వాత కొంత కాలము నకు తెలిసికొనెను. బెస్తవాడు ఒకడు తన గాలముతో కూర్చుండి ఉన్నప్పటి తీరుగ ఉన్నది అది. చేప వచ్చి, నీటిలోనికి జొన్పబడిన ఎరను మ్రింగును, జాలరిచేతి కొయ్య కదలును. జాలరి మిగుల మెలకు వతో ఉండును. అతడు కొయ్యను బిగబట్టి గాలమును ఆత్రముతోను ఎచ్చరికతోను జూచును. అప్పుడు అతడు ఎవరితోను మాటాడడు. శ్రీరామకృష్ణుని మనస్సును అట్లే ఉండెను. శ్రీరామకృష్ణుడు సాయం వేళలందు తఱచు ఆదశయందు ఉండును అనియు, ఒక్కొక్కప్పుడు

బాహ్యప్రపంచమును పూర్తిగ మఱచి ఉండును అనియు, మహేంద్రుడు విని తెలిసికొన్నాడు, ప్రత్యక్షముగ చూచినాడు.

మ—మీరు సాయంపూజ చేయవలె నేమో! అట్లు ఐన, మాకు సెలవు ఇత్తురా?

శ్రీరామకృష్ణుడు—[ఇంకను ఆనందపరవశతలోనే] - లేదు - సాయంపూజయా? కాదు. అట్లు అనుట పూర్తిగ సరిపోదు.

కొంత సంభాషణ ఐన తర్వాత మహేంద్రుడు గురుదేవునకు నమస్కరించి వీడ్కొనెను. 'మరల రమ్ము' అనెను శ్రీరామకృష్ణుడు.

ఇంటికి పోవు దారిలో, మహేంద్రుడు, తనలో ఆశ్చర్యపడుచు ఇట్లు అనుకొనెను — "నన్ను ఈయన మరల మరల తనవంకకు ఆకర్షించుచున్నాడే. ఈశాంతమూర్తి ఎవరో! పాండిత్యము లేక గొప్పవాడు అగుట మనుష్యునకు శక్యమా? ఇది ఏమి ఆశ్చర్యము! మరల ఆయనను జూడ వలయును అను ఆశ కలుగుచున్నది. మరల రమ్మని అన్నాడు కదా ఆయనయు! రేపో ఎల్లుండియో మరల వత్తును ఆయనయొద్దకు."

మహేంద్రుడు రెండవసారి శ్రీరామకృష్ణుని కలసికొనెను. ఆగ్నేయమూలలో ఉన్న వసారలో ఉదయము ఎనిమిదిగంటలకు గురుదేవుడు క్షౌరము చేసికొనుటకు సిద్ధముగ ఉండెను. మంగలివాడు అంతకు కొంత ముందే వచ్చి ఉండెను. చలికాలము అప్పటికి ఇంకను దాటిపోనందున ఆయన ఎఱ్ఱ అంచు శాలువను ఒకదానిని ఒడలికి కప్పుకొని ఉండెను. మహేంద్రుడు అగపడగనే గురుదేవుడు "ఓహో, నీవు వచ్చితివా, సరియే, ఇట కూర్చుండుము" అని అనెను. ఆయన చిఱునవ్వు నవ్వుచుండెను. ఆయన మాటలలో కొంచెము నత్తియు ఉండెను.

శ్రీరామకృష్ణుడు (మహేంద్రునితో) — నీ నివాసము ఎచ్చట?

మ—కలకత్తాలో, స్వామి.

శ్రీరామకృష్ణుడు—ఇక్కడ నీ బస ఎక్కడ?

మ—మా అక్కగారి యింట. అనగా ఈశానకవిరాజు నింట బరానగరమున ఉన్నాను.

శ్రీరామకృష్ణుడు— ఓహో, ఈశాను నింటనా? మఱి, ఇప్పుడు కేశవ్ ఎట్లు ఉన్నాడు? చాల జబ్బుపడి ఉండినాడే.

మ—ఔను, జబ్బుపడినాడు అనియే నేనును విని ఉంటిని. కాని ఇప్పటికి ఆయనకు స్వాస్థ్యము కలిగి ఉండును అనియే నా నమ్మకము.

శ్రీరామకృష్ణుడు— కేశవునకు వ్యాధి నిమ్మళించిన చో కొబ్బరిబొండలమును చక్కెరను అర్పింతును అని నేను దేవికి మ్రొక్కు కొంటిని. ఒక్కొక్కప్పుడు చాల వేకువనే లేచి దేవిని సమీపించి "తల్లీ, కేశవుడు జీవించి ఉండకున్న, నేను కలకత్తాకు పోయినప్పుడు ఎవరితో సల్లాపింతును, ముచ్చటింతును? అతనికి ఆరోగ్యము కలుగు నట్లు అనుగ్రహింపుమా" అని వేడుకొనెడివాడను. దేవికి కొబ్బరి బొండలమును చక్కెరను నివేదింపవలయును అని నిశ్చయించుకొన్న దియు అందులకే.

ఈ సంగతి చెప్పుము. కలకత్తాకు వచ్చి ఉన్న కుక్ అను ఒకనిని నీవు ఎఱుగుదువా? ఆయన ఉపన్యాసములు చేయుచున్నా డట, నిజమేనా? ఒకసారి కేశవుడు నన్ను పడవలో ఎక్కించుకొని పోయెను. అప్పుడు ఈ కుక్ అను నతడు మా కూటమిలో ఉండెను.

మ—ఔను, చేయుచున్నాడట ఉపన్యాసములను. నేనును ఇంచుమించు అలాగే విన్నాను. కాని ఆయన ఉపన్యాసములకు నేను ఒక్కసారి ఐనను పోలేదు. ఆయనను గూర్చి నాకు ఎక్కువగ తెలియదు.

శ్రీరామకృష్ణుడు— ప్రతాపునితో బుట్టువు ఇచ్చటికి వచ్చి నాడు, కొన్ని నాళ్లు ఉండినాడు. తనకు వేఱు పని ఏదియు లేనందున ఇక్కడ ఉందము అనుకొన్నాడు. ఉందును అన్నాడు. ఆయన తన భార్యను బిడ్డలను మామగారి యింటిలో ఉంచి ఉన్నాడు అని నాకు తెలియవచ్చినది. బిడ్డలు ఆయనకు చాలమంది. కావున నేను ఆయ నను చీవాట్లు పెట్టితిని. నీవే యోచించి చూడుము. ఆయనకా, బిడ్డలు అందఱు. వారిని ఇరుగుపొరుగువారు అన్నము పెట్టి పోషింతురా? తనభార్యయు తనబిడ్డలును అన్నమునకు వేఱు ఎవరిమీదనో ఆధారపడి ఉన్నందులకు గాని, వారిని తన మామగారి యింట తాను వదలి ఉన్నందులకు గాని ఆయన సిగ్గు నైన చెంద లేదు. నేను బాగుగ చీవాట్లు పెట్టి బ్రదుకు తెరువు చూచుకొమ్మని అంటిని. అటు పిమ్మట ఇక్కడినుండి పోవుటకు ఆయన సమ్మతించెను— నీకు పెండ్లి ఐనదా ?

మ— ఐనది, స్వామి.

శ్రీరామకృష్ణుడు— [ఉల్కిపడి] అయ్యో, రామ్లాల్,* ఈయనకు పెండ్లి ఐన దట కదా.

ఏదో గొప్ప నేరము చేసినవానివలె మహేంద్రుడు కదలక మెదలక చూపు నేలపై నాటి కూర్చుండెను. 'పెండ్లి చేసికొనుట అంత చెడ్డ పనియా?' అని తనలో అనుకొనెను.

గురుదేవుడు మరల ఆయనను ''నీకు బిడ్డలు ఉన్నారా'' అని అడిగెను.

ఈ సారి మహేంద్రునకు తన గుండె కొట్టుకొనుచున్న చప్పుడు విన నగుచుండెను. తడబడుచున్న గొంతుతో మెల్లగ 'ఔను, స్వామి, బిడ్డలు ఉన్నారు.'' అని బదులు చెప్పెను.

---

* శ్రీరామకృష్ణుని మేనల్లుడు, కాళిగుడిలో పూజారి.

మిక్కిలి పరితాపముతో శ్రీరామకృష్ణుడు 'అయ్యో, ఇతనికి బిడ్డలుకూడ ఉన్నారట కదా'' అనెను.

ఇట్లు చీవాట్లు తిని మహేంద్రుడు మౌన ముద్ర దాల్చెను. ఆయన గర్వమునకు ఇది ఒక దెబ్బయే. కొన్ని నిమిషములకు పిమ్మట శ్రీరామకృష్ణుడు దయతో అతనివంక చూచి ''ఇటు చూడుము. నీయందు కొన్ని మంచి లక్షణాలు ఉన్నవి. ఎవరియందు ఐనను సరే, ముఖము కన్నులు మొదలైన వానిని జూచి నేను ఆ లక్షణములను కనుగొందును. మఱి నీ భార్య ఎటువంటిదో చెప్పుము, ఆధ్యాత్మిక లక్షణములు ఏవైన కలదేనా, లేక ఏమియు తెలియనిదా ?

మ__ఆమెలో (వేఱు) ఏ లోటును లేదు. కాని అజ్ఞానము ఒక్కటి ఉన్నది.

గురుదేవుడు__ (అప్రీతి స్పష్టముగ అగపడునట్లు) — నీవు జ్ఞానివి కాబోలు!

జ్ఞానమునకును అజ్ఞానమునకును ఉండు భేదమును మహేంద్రుడు ఇక మీద తెలిసికొన వలసి ఉన్నది. మానవులకు జ్ఞానము గ్రంథములనుండియు పాఠశాలలనుండియునే కలుగును అని ఆయన ఇంతవఱకును అనుకొనుచుండెను. అయథార్థము ఐన ఈ అభిప్రాయమును, ఆయన తర్వాత త్యజించెను. దేవుని తెలిసికొనుటే జ్ఞానము అనియు, దేవుని ఎఱుగక ఉండుటే అజ్ఞానము అనియు ఆయన నేర్చుకొనెను. 'నీవు జ్ఞానివి కాబోలు' అని శ్రీరామకృష్ణుడు అదల్చినప్పుడు మహేంద్రుని అహంకారము మఱింతగా నొచ్చెను.

గురుదేవుడు__మఱి నీకు నమ్మకము సాకారదైవమందా ? నిరాకారదైవమందా ?

మహేంద్రుడు అచ్చెరువొంది తనలో ''సాకారదైవమందు నమ్మకము ఉన్నవానికి నిరాకారదైవమందు ఎట్లు నమ్మకము కుదురును ? నిరాకారదైవమందు నమ్మకము ఉన్నవాడు దైవమునకు

ఆకారము ఉన్నది అని ఎట్లు నమ్మును? పరస్పరము విరుద్ధములు ఐన ఈ సాకారతయు నిరాకారతయు ఏకకాలమున నిజములు కాగలవా? పాలు తెల్లగను నల్లగనుకూడ ఉండునా?'' అని పరిపరిరీతుల యోచించి ఇట్లు అనెను:

మ——అయ్యా, దైవము నిరాకారము అనుటే నాకునచ్చినది.

గురుదేవుడు——చాల మంచిది. . రెండింట ఒక్కదానియందు నమ్మకము ఉన్న చాలును. దైవము నిరాకారము అని నీనమ్మకము. అది చాల మంచిదే. కాని అది ఒక్కటే సత్యము అనియు తక్కినవి ఎల్ల అసత్యములు అనియు క్షణము ఐనను తలంపకుము. నిరాకార దైవము ఎంత సత్యమో, సాకారదైవము కూడ అంత సత్యమే అని జ్ఞప్తి ఉంచుకొమ్ము. ఐనను నీ నమ్మకమునే నీవు అనుసరింపుము.

రెండును సమానముగ సత్యములే అను మాట మహేంద్రునకు ఆశ్చర్యము గలిగించెను. ఆయనకు ఈ విషయమును గ్రంథములు తెలుపనే లేదు. ఇది ఆయన గర్వమునకు మూడవ దెబ్బ. ఐనను ఆ గర్వము పూర్తిగ నశింపనందున గురుదేవునితో కొంత వాదింతము అని అతడు ముందునకు వచ్చెను.

మ——అయ్యా, దైవమునకు రూపము ఉన్నది అని ఒకడు నమ్మును అనుకొనుడు. మట్టిబొమ్మ దైవము కానేరదు గదా!

గురుదేవుడు——(నడుమనే అందుకొని) మట్టిబొమ్మ ఎందుకని? అది పరమాత్మ ప్రతికృతియే.

'పరమాత్మప్రతికృతియే' అను మాటను మహేంద్రుడు సరిగా అర్థము చేసికోలేక పోయెను. కావున ''మట్టిబొమ్మను ఆరాధించు వారికి అది దైవము కాదు అనియు, ఆరాధించు నప్పుడు వారు గుడి యందు దేవుని ఉంచుకోవలెనే కాని మట్టిబొమ్మను ఉంచుకో రాదు అనియు తెలుప వలెను. మట్టిని ఎవ్వరును ఆరాధింప కూడదు'' అనెను.

గురుదేవుడు—(చురుకుగా) ఉపన్యాసములు చేయుటయు ఇతరులను వెలుతురులోనికి దీసికొని వచ్చుటయు కలకత్తావారు ఐన మీకు ఇది ఒక వినోదము! తనకు వెలుతురు సంపాదించుకొనుట ఎట్లో యోచించుకొను ఓపిక ఒకరికిని లేదు. ఇతరులకు తెలియ జెప్పుటకు మీరు ఎవరు?

జగదీశ్వరుడు ఎవడో అతడు ఒక్కొక్కరికిని బోధించును. ఈజగత్తును సృజించినవాడును, సూర్యచంద్రులను ప్రజలను జంతువులను తక్కిన సకలప్రాణులను సృజించినవాడును, వానికి జీవనాధారములను అమర్చినవాడును, బిడ్డలకు ఎల్ల, తల్లిదండ్రులను ఒసంగి, ఆ బిడ్డలను పోషించుటకు వలసిన ప్రేమను ఆ తల్లిదండ్రులకు గలిగించినవాడును ఎవడో, అతడు మనకు బోధించును. ఇన్నింటిని జేసిన సర్వేశ్వరుడు తన్ను ఆరాధించు మార్గమును ప్రజలకు చూపడా? వారికి బోధింపవలసిన అక్కఱ ఉన్నచో, అతడే గురువు అగును. మనకు అంతర్యామిగ ఉండి సర్వమును ప్రవర్తిల్ల జేయువాడు అతడే.

మట్టిబొమ్మను ఆరాధించుటలో దోషము ఉన్నది అనియే అనుకొనుము. ఆ బొమ్మ ద్వారా ప్రజలు తన్నే ఆవాహన చేయుచున్నారు అని స్వామి ఎఱుగడా? ఆ ఆరాధనము చేతనే సర్వేశ్వరుడు సంతోషించును. అందువలన నీకు ఏల తలనొప్పి కలుగ వలెను? నీ భక్తిజ్ఞానసాధనలను నీవు సాగించుకొమ్ము.

ఇంతటితో తన అహంకారము పూర్తిగ అణగిపోయినది అని మహేంద్రుడు తెలిసికొనెను. తనలో ఇట్లు అనుకొనెను—"ఔను, ఆయన నిజమునే చెప్పినాడు. ఇతరులకు తెలియజెప్పవలసిన అక్కఱ నాకు ఎక్కడిది? దేవుని నేను ఎఱింగితినా? దేవునియందు నాకు నిజముగ భక్తి ఉన్నదా?" 'తన పాన్పు తనకే చాలక ఉండగా, దానిమీాద తనతో పరుండుటకు మిత్రునిగూడ పిలిచినట్లు' అను ఒక సామెత కలదు. అది ఎంత అనుభవసాక్షికమైన మాట! దేవుని గూర్చి నాకు తెలిసిన విషయము ఒక్కటియు లేదు. నేను ఇతరులకు

ఉపదేశములు చేయుటకు ప్రయత్నించుచున్నాను. ఎంత సిగ్గుచేటు! ఎంత అవివేకిని నేను! ఇది ఏమి, గణితమా, చరిత్రమా, సాహిత్యమా, ఒకరు ఒకరికి బోధించుటకు? ఇది సర్వేశ్వరుని గుఱించినది, పరమ రహస్య మైన తత్త్వము. ఈయన చెప్పినది నాకు నచ్చినది''.

మహేంద్రుడు గురుదేవునితో వాదించుటకు ఇదే మొదటిసారి. భాగ్యవశమున ఇదే కడపటిసారియు ఐనది.

గురుదేవుడు——మట్టిబొమ్మను ఆరాధించుటను గూర్చి చెప్పు చుంటివే, బొమ్మ మట్టిదే కావచ్చును. ఆ రీతిని ఆరాధించుటకును ఆవశ్యకత కలదు. వివిధ పూజా ప్రకారములను ఆ సర్వేశ్వరుడే ఏర్పఱచినాడు. వివిధజ్ఞానదశలందు ఉన్న వారికి అనురూపములుగ ఈ వివిధప్రకారములను ఆ సర్వలోకేశ్వరుడే అనుగ్రహించి ఉన్నాడు.

ఒకతల్లి తనపలువురు బిడ్డలలో ఒక్కొక్కని జీర్ణశక్తికి తగినట్లు వాని వానికి ఆహారమును సిద్ధపఱచును. ఆమెకు ఐదుగురు బిడ్డలు ఉన్నారు అనుకొనుము. వండుటకు చేపలు మాత్రము ఉన్నచో, ఒకరికి పులావుగను, ఒకరికి ఉప్పులో ఊరవేసియు, ఒకరికి మంగల మున వేపియు, ఇట్లు ఒక్కొక్కని రుచికిని జీర్ణశక్తికిని తగినట్లు పెక్కు రకములను ఆమె తయారు చేయును. నేను చెప్పినది నీకు అర్థ మైనదా?

మ——[వినయముతో] అర్థ మైనది, స్వామి. భగవంతుని మీద నా మనస్సును ఏకాగ్ర మొనర్చుట ఎట్లు?

గురుదేవుడు——భగవంతుని నామమును జపింపుము. భగవం తుని మహిమలను కీర్తింపుము. అప్పు డప్పుడు భగవద్భక్తులను సాధువులను దర్శనముచేసికొనుచుండుము. రాత్రింబగళ్లు ఐహిక వ్యవహారములందును ప్రాపంచికకర్తవ్యములందును బాధ్యతలందును నిమగ్నమై ఉండు మనస్సు భగవంతునిపై గుఱి నిలుప లేదు. కావున అప్పు డప్పుడు ఏకాంతమునకు పోయి భగవంతుని ధ్యానించుట మిక్కిలి ఆవశ్యకము. ధ్యానమును ఏకాంతమున అభ్యసింపవల

యును, కానిచో, ప్రారంభదశలో దేవునిమీద మనస్సును నిలుపుట చాల కష్టము. చెట్టు చిన్నదిగ ఉన్నప్పుడు దానికి చుట్టును కంచె ఉండ వలయును, లేకున్న పశువులు దానిని నాశనము చేయును.

ధ్యానించు పద్ధతులు మూడు ఉన్నవి. నీ విహిత కార్యములను చేయుచున్నప్పుడే దైవమును స్మరించుచుండుట ఒక పద్ధతి, మీ యింటిలోనే ఏకాంతస్థలమున ఉండి భగవంతుని ధ్యానించుట రెండవ పద్ధతి, అడవికి పోయి అచట భగవంతుని ధ్యానించుట, మూడవ పద్ధతి. నీవు తథ్యమిథ్యావివేచనమును మాత్రము సదా చేయుచుండవలసినదే. పరమాత్మ ఒక్కడే సత్యము, నిత్యపదార్థము. తక్కినది అంతయు మిథ్య, అనిత్యము. ఇట్లు వివేచించుచు వచ్చి, తన మనస్సునుండి అనిత్యవస్తువులను గూర్చిన తలంపులను దులిపి వేయ వలయును.

ప్ర—[వినయముతో] ఈ లోకమున మనము జీవితమును ఎట్లు గడప వలయును?

గురుదేవుడు—నీకు విహితములు ఐన కృత్యములను అన్నిటిని నిర్వర్తింపుము, మనస్సును మాత్రము దేవునిపై ఉంపుము. భార్యతో, బిడ్డలతో, తండ్రితో, తల్లితో, — అందఱితోను కూడి వసింపుము. వారికి సేవ చేయుము, నీకు అత్యంతము ప్రీతిపాత్రులు ఐన వారిని జూచినట్లు వారిని జూడుము. కాని నీ అంతరంగమున మాత్రము వారు నీకు సొంతము కారు అని తెలిసికొనుము.

ఒక భాగ్యవంతుని యింటి పరిచారిక ఆ యింటి పనులను అన్నిటిని జేయును కాని, తన సొంతగ్రామములోని స్వగృహముపైని తలంపులను వీడదు. ఆ భాగ్యవంతుని బిడ్డలను ఆమె తనబిడ్డలను బోలెనే సాకును. వారినిగూర్చి చెప్పునప్పుడు 'నా రాముడు' 'నా హరి' అనియే చెప్పుచుండును. కాని అంతరంగమున మాత్రము వారు తనబిడ్డలు కానే కారు అను విషయము ఆమెకు బాగుగ తెలియును.

తాబేలు నీటిలో అటు ఇటు తిరుగుచుండును గాని, దాని తలంపులు దేనిమీద ఉన్నవో నీవు ఊహింప వచ్చును. దాని తలంపులు గట్టుపై ఉన్నవి. ఆ గట్టుపై ఉన్నవి దాని అండములు. లోకములో నీ విధులను అన్నిటిని నిర్వర్తింపుము, మనసునుమాత్రము దేవునిపై ఉండ నిమ్ము.

ముందుగా భగవద్భక్తిని అలవఱచుకొనక లోకమున ప్రవేశింతు వేని నీకు ప్రతిబంధకములు నానాటికి హెచ్చుచుండును. అందలి యిడుములు పరితాపములు ఏడుపులు నిన్ను ముంచివేయును. ఐహికవిషయములను నీవు ధ్యానించుకొలది నీకు వానియందు సంగము ఎక్కువ అగుచుండును.

మొదట నీ చేతులకు నూనె పట్టించుకొని, అటు పిమ్మట పనస పండును తరుగుము. లేకున్న, దాని పాల జిగట నీకు అంటుకొనును. మొదట దివ్య మగు ప్రేమతైలమును గడించుకొనుము, అటు పిమ్మట నీ లౌకిక విధులకు గడంగుము.

కాని ఆ దివ్యప్రేమ సిద్ధింప వలయును అనిన ఏకాంతవాసము ఆవశ్యకము. పాలనుండి వెన్నను కైకొన వలయును అనిన మొదట ఆ పాలను ఒక ప్రత్యేక స్థలమున తోడబెట్ట వలయును. పాలను ఎక్కువగ కలియ బెట్టిన, అది పెరుగు కానేఱదు. పెరుగు ఐన పిదప, నీవు, తక్కిన పనులను విడిచి, ఒక ప్రశాంతస్థలమున కూర్చుండి, పెరుగును చిలుక వలయును. అప్పటికి గాని, నీకు వెన్న లభింపదు.

అదియును గాక ఏకాంతమున దేవుని ధ్యానించుటచేత చిత్తమునకు జ్ఞానమును, వైరాగ్యమును, భక్తియు అలవడును. ఆ చిత్తమే లౌకికాసక్తికి లోనైన యెడల అధఃపతనము గాంచును. ఈ లోకములో ప్రతివ్యక్తికిని కామినీకాంచనముల * స్మృతి తప్ప వేఱు లేదు.

---

* ఆధ్యాత్మికపురోగతికి అడ్డంకులను పేర్కొను నప్పుడు శ్రీరామకృష్ణుని అమృతవాక్కున 'కామినీకాంచనము'ల ప్రస్తావము మాటిమాటికిని వచ్చుచుండును. కాని ఆపదములను అపార్థము చేసికొనుటయు తఱచు జరుగుచుండును.

లోకము నీటి వంటిది, మనస్సు పాల వంటిది. పాలను నీటిలో పోసిన రెండును ఏకము అగును. అటు తర్వాత అప్పటము ఐనపాలు నీకు అగపడదు. అట్లు కాక, పాలను పెరుగుగా చేసి, ఆ పెరుగును చిలికి వెన్నగా చేయుము. ఆ వెన్నను నీటిపై ఉంచిన, అది తేలును. కావున ఆధ్యాత్మికసాధనను ఏకాంతమున చేసి, భక్తి జ్ఞానములు అనెడి వెన్నను గడింపుము. ఆ వెన్నను నీవు ఈలోకము అనెడి నీటిపై ఉంచినను, అది తేలునే గాని, నీటితో కలిసి పోదు.

ఇందుతోబాటు నీవు సారాసారవివేచనమును అభ్యసింప వలయును కామినీకాంచనములు నశ్వరములు. దేవుడు ఒక్కడే నిత్యుడు. ధనమువలన మానవునకు ఏమి కలుగును? అన్నవస్త్రములు లభించును, నిలువ నీడ లభించును, అంతే. అంత కన్న ఎక్కువ ఏమియు లేదు. దేవుని సాక్షాత్కరించుకొనుటకు నీకు ధనము

---

'కామినీ' శబ్దమునకు 'కామము' అనియు, 'కాంచన' శబ్దమునకు 'లోభము' అనియునే అర్థము. అవే కదా ఆధ్యాత్మికాభివృద్ధిని వెనుకకు నెట్టునవి. మగవారిని దూరముగ పెట్టుడు అని స్త్రీలకును, స్త్రీలను దూరముగ పెట్టుడు అని పురుషులకును శ్రీరామకృష్ణుడు బోధించి ఉన్నాడు కావున, 'కామినికి లోబడకుము' అన్నప్పుడు 'కామమునకు లోబడకుము' అనుటే ఆయన హృదయము. అట్లే కాంచనము (= బంగారు) లోభవాచకము. ఆధ్యాత్మిక జీవితమున రెండవ అడ్డంకి లోభము గదా. స్త్రీని గాని స్త్రీజాతినే గాని ద్వేషింపుడు అని శ్రీరామకృష్ణుడు శిష్యులకు ఉపదేశింప లేదు. ఈ శీర్షిక క్రింద ఉన్న ఆయన బోధనలను ఎల్ల సమష్టిగ పరిశీలించిన ఈ విషయము స్పష్టపడును. మహిళలు జగన్మాతృప్రత్యక్షరూపములు అని గదా గురుదేవుని భావన. తాను తంత్రసాధనలు చేయునప్పుడు తనకు గురుస్థానమున, ఆయన ఒకానొక మహిళనే ప్రతిష్ఠించుకొన్నాడు. ఆయన సతి, మాతృదేవి శ్రీశారద, ఆయనకు నిత్యసహచారిణియు, ప్రథమశిష్యయు. తన ఆధ్యాత్మిక సాధనల పరిసమాప్తి సమయమున ఆయన, శారదనే లోకజనని కాళియొక్క ప్రత్యక్షరూపముగ గొని ఆరాధించెను. ఆయన నిర్యాణానంతరము శ్రీశారదామాత అసంఖ్యాకు లయిన గృహస్థులకు మాత్రమే కాక, శ్రీరామకృష్ణ సంస్థలోని సాధువులకు సైతము ఎందఱకో ఆధ్యాత్మిక మార్గదర్శకురాలు అయ్యెను.

తోడ్పడ జాలదు, కావున ధనమునకు జీవితలక్ష్యముగ ఉండు అర్హత ఎప్పుడు కాని లేనే లేదు. వివేచించు క్రమము ఇది, తెలిసినదా?

మ—చిత్తము.

గురుదేవుడు—యోచింపుము. ధనములో ఏమి ఉన్నది? అందము ఐన శరీరములో ఏమి ఉన్నది? వివేచింతు వేని, భువన మోహిని యగు వనిత శరీరమునందైనను సరే, ఎముకలును మాంసములును క్రొవ్వును మఱికొన్ని వెగటు గొల్పు పదార్థములును ఉండును. దేవుని మాని, మానవుడు వీనిని ఏల లక్షింప వలయును. వీనికై, అతడు, దేవుని, ఏల మఱవ వలయును?

మ—దేవుని ప్రత్యక్షముగ జూచుట సాధ్యమా?

గురుదేవుడు—ముమ్మాటికిని సాధ్యమే, దేవుని జూడ వలయును అనిన అందులకు అప్పుడప్పుడు ఏకాంతమున ఉండుట, భగవన్నామమును జపించుట, సంకీర్తనము చేయుట, తథ్యమిథ్యలను వివేచించుట — అనెడి ఇవే అవలంబింప దగిన సాధనములు.

మ—దేవుడు అగపడవలెను అనిన అందులకు అపేక్షితములు ఏవి?

గురుదేవుడు—హృదయమున గాటము ఐన ఆతురముతో దేవుని ఉద్దేశించి మొఱ పెట్టుము. నీకు దర్శనము తప్పక లభించును. అందఱును భార్యలకొఱకును బిడ్డలకొఱకును కడవలు నిండునట్లు కన్నీరు కార్తురు. ధనమునకై కన్నీళ్లలో ఈదులాడుదురు. దేవుని కొఱకు ఏడ్చువారు ఎవరు? దేవునికై ఏడువుము, వాస్తవముగ ఏడువుము.

చూడ వలెను అనెడి ఆతురము అరుణోదయము వంటిది. అరుణోదయానంతరము సూర్యోదయము. ఆతురము పుట్టిన పిదప భగవత్సాక్షాత్కారము. ఇహపరులకు ఐహికసంపదయందు ఉన్నట్టి ఆస, తల్లికి బిడ్డయందు ఉన్నట్టి ఆస, పతివ్రత ఐన సతికి పతియందు

ఉన్నట్టి ఆస — ఈ మూడు ఆసల ఉద్రేకమును ఒక్కటిగా కూడిన ఎంత అగునో అంతగా భక్తుడు భగవంతునికై ఉబలాటపడు నేని అతనికి దేవుడు దర్శనము అనుగ్రహించును. ఈ మూడు ఆశల శక్తి ఒక్కటిగ కూడిన ఎంతో అంత ఆతురము దేవునందు ఎవనికి గలుగునో అతనికి భగవత్సాక్షాత్కారము గలుగును.

అనగా తల్లి బిడ్డను ఎంత ప్రేమించునో భక్తుడు భగవంతుని అంత ప్రేమింప వలెను, పతివ్రత భర్తను ఎంత ప్రేమించునో భక్తుడు భగవంతుని అంత ప్రేమింప వలెను. ఇహపరులు ధనమును ఎంత ప్రేమింతురో భక్తుడు భగవంతుని అంత ప్రేమింపవలెను. ఈ ముప్విధముల ప్రేమశక్తిని ఆకర్షణశక్తిని ఒక్కటిగ చేర్చి ఆ మొత్తమును భగవంతుని వైపు మరలింపుము. అప్పుడు నీవు తప్పక భగవంతుని జూడ గలవు.

ఉబలాటపడుచున్న హృదయముతో దేవుని ప్రార్థింప వలయును. మ్యావు మ్యావు మని అఱచుచు తల్లిని పిలుచుట ఒక్కటే పిల్లికూనకు తెలిసినది. తన్ను, తల్లి ఎచ్చట ఉంచినను, ఆ కూనకు సంతోషమే. ఒకప్పుడు వంటయింటను, ఒకప్పుడు నేల మీదను, ఒకప్పుడు పాన్పు మీదను, పిల్లి, తన కూనను పెట్టుచుండును. తనకు బాధ గలిగినను కూన ఏమి చేయును? మ్యావు మ్యావు మని అఱచును. అంతే. దానికి తెలిసినది అంతే. కాని ఆకూత చెవిని బడెనేని, వెంటనే, తల్లి, తాను ఎచ్చట ఉన్నను, కూన యొద్దకు వచ్చి చేరును.

ఒక యాదివారము మధ్యాహ్నము మహేంద్రుడు గురుదేవుని మూడవసారి దర్శించుటకు వచ్చెను. ఈ వింత వ్యక్తి కడకు ఇప్పటికి రెండు పర్యాయములు సాగించిన రాకలే, మహేంద్రుని మనసున గాటముగ నాటుకొనెను. గురుదేవునిగూర్చియు, ఆధ్యాత్మికజీవిత మందలి గంభీరసత్యములను ఆయన వివరించు సరళి పద్ధతినిగూర్చియు,

మహేంద్రుడు సదా తలపోయుచునే ఉండెను. మానవులందు అట్టి వ్యక్తిని మహేంద్రుడు ఇంతవఱకును చూచి ఉండ లేదు.

శ్రీరామకృష్ణుడు చిన్న మంచముమీద కూర్చుండి ఉండెను. అది విరామదినము గనుక, గురుదేవుని దర్శించుటకు వచ్చిన భక్తులు గదియందు క్రిక్కిరిసి ఉండిరి. వారిలో ఎవరితోను మహేంద్రునకు ఇంతవఱకును పరిచయము లేదు. కావున అతడు ఒకమూలలో కూర్చుండెను. భక్తులతో సంభాషించుచున్న గురుదేవుడు చిఱు నవ్వు నవ్వెను.

ఆయన ముఖ్యముగ నరేంద్రనాథుడు* అను యువకుని ఒకని వైపు లక్షించి మాటాడుచుండెను. ఆ యువకుని వయస్సు పంతొమ్మిది సంవత్సరములు. అతడు కళాశాలలో చదువుచు తఱచు బ్రాహ్మ సమాజమునకు వచ్చుచుండెను. అతని కన్నులు జాజ్వల్యమానములై ఉండెను. అతని మాటలలో వీరోత్సాహము పొంగి పొరలు చుండెను. భగవద్భక్తలక్షణములు అతనిలో ఉట్టిపడుచుండెను.

ఆత్మప్రవణులను అలక్ష్య పఱచు లౌకికులను గూర్చి సంభాషణ సాగుచున్నది అని మహేంద్రుడు ఊహించెను. లోకమున అట్టివారు అసంఖ్యాకులుగ ఉన్నారు అని తెలిపి, వారితో నడచుకో వలసిన పద్ధతిని గూర్చి గురుదేవుడు ప్రసంగించుచుండెను.

గురుదేవుడు—[నరేంద్రునితో] అందుంగూర్చి నీకు ఏమి అని తోచుచున్నది? ఆత్మప్రవణులనుగూర్చి లౌకికులు ఏమేమో చెప్పు చుందురు. కాని, ఇటు చూడుము — వీధిలో ఏనుగు పోవుచున్న ప్పుడు, దానిని జూచి కుక్కలును తక్కిన నీచజంతువులును ఎన్ని ఐనను మొఱుగుచు గోల చేయుచుండవచ్చును. కాని ఏనుగు మరలి వానిని కన్నెత్తి చూడనైన జూడదు. లోకులు నిన్ను నిందింతు రేని, వారిని గూర్చి నీవు ఏమి తలంతువు.

* ఇతడే అనంతరకాలమున వివేకానందస్వామి అని విశ్వవిఖ్యాతిగాంచెను.

నరేంద్రుడు — నన్ను జూచి కుక్కలు మొఱుగుచున్నవి అని అనుకొందును.

గురుదేవుడు — [చిఱునవ్వుతో] ఓహోయ్ అబ్బాయీ, నీవు అంతదూరము పోగూడదు. [అందఱు నవ్వుదురు]. సకల ప్రాణులందును దేవుడు ఉన్నాడు. కాని నీవు అంతరంగికులనుగా జేర్చుకోవలసినది, మంచివారిని మాత్రమే, దుష్టచిత్తులనుండి నీవు దూరముగ ఉండ వలయును. పెద్దపులిలో గూడ దేవుడు ఉన్నాడు. కాని అంతమాత్రముచేత నీవు దానిని కౌగిలించుకో లేవు. [అందఱును నవ్వుదురు]. పులి దైవస్వరూపమే ఐనప్పుడు దానినుండి ఏల పాఱిపో వలయును అందు వేమో! అందులకు సమాధానము — పాఱిపొమ్మని చెప్పువాడును దైవస్వరూపమే, కావున వాని మాటను నీవు ఏల విన గూడదు?

ఒకకథను చెప్పెదను వినుము — ఒక అడవిలో మహాత్ముడు ఒకడు వసించి ఉండెను. అతనికి శిష్యులు పెక్కండ్రు ఉండిరి. ఒక నాడు ఆయన వారికి "సకలప్రాణులందును దేవుడు ఉన్నాడు. కావున దేనిని గన్నను నమస్కరింప వలయును" అని బోధించెను. తరువాత, హోమమునకు సమిధలను తెచ్చుటకై, శిష్యులలో ఒకడు అడవికి పోయెను. తటాలున అతనికి "దారితొలగు మోయీ, వెఱ్ఱి ఎత్తిన ఏనుగు ఒకటి పరుగున వచ్చుచున్నది" అను ఒకఘోష చెవిని బడెను. అక్కడ ఉన్నట్టి అందఱును పాఱిపోయినను, మన ముని శిష్యుడు కదల లేదు. "ఏనుగు అనగా ఏనుగు రూపున ఉన్న దేవుడే కదా! ఏల దానిని గని పాఱిపోవలెను" అని వాదించి, అక్కడే నిలుచుండి, దానికి మ్రొక్కి స్తోత్రములు పాడ దొడంగెను. "పాఱిపో, పాఱిపో" అని మావటివాడు కేకలు వేసెను. కాని మునిశిష్యుడు కదల లేదు. ఏనుగు అతనిని తన తొండమున జిక్కించుకొని ఒక వైపునకు విసరి వేసి తనదారిని బోయెను. అతనికి నొప్పి తగిలినది, గాయములు ఐనవి, అతడు మూర్ఛిల్లి నేల మీాద పడి ఉండెను.

జరిగిన సంగతిని విని అతని గురువును సోదరశిష్యులును వచ్చి అతనిని ఆశ్రమమునకు జేర్చిరి, ఏదో ఒకమందును ఇచ్చిరి, కొంతసేపటికి అతడు మూర్ఛనుండి తెప్పరిల్లెను. చుట్టును ఉన్న వారిలో ఒకడు అతనిని "ఏనుగు వచ్చుచున్నది అని నీకు తెలిసి ఉండెనే, ఏల నీవు అచ్చటినుండి కదల వైతివి" అని అడిగెను. అందులకు ఆ శిష్యుడు "ఈ మానవు లేమి, ఈ జంతువు లేమి — సర్వమును భగవంతుని రూపములే అని మనగురువుగారు చెప్పి ఉండిరి కదా, కాబట్టి, ఏనుగు రూపమున దేవుడే వచ్చుచున్నాడు అనుకొని, నేను పాఱిపోలేదు" అని చెప్పెను. అప్పుడు గురువు అందుకొని, "అబ్బాయీ, ఔను, ఏనుగురూపమున దేవుడే వచ్చుచుండెను అనుట నిజమే. కాని మావటివాని రూపమున ఉన్న దేవుడు నిన్ను అక్కడ నిలువకుము అని చెప్పినాడు కదా! అన్ని రూపములును దేవునివే ఐనప్పుడు నీకు మావంతుని మాటలలో నమ్మకము ఏల లేక పోయినది? మావంతుని రూపున ఉన్న దేవుని మాటలను నీవు ఆదరించి ఉండ వలసినది" అనెను. (అందఱు నవ్వుదురు).

నీరు భగవత్స్వరూపము అని వేదములు చెప్పుచున్నవి. కాని ఆరాధనకు ఉపయోగించు నీరు వేఱు, ముఖము కడుగుకొనుటకు ఉపయోగించు నీరు వేఱు, పాత్రలను ముఱికి బట్టలను శుభ్రపఱచు టకు మాత్రమే ఉపయోగించు నీరు వేఱు. ఈ కడపట పేర్కొన బడిన నీటిని —— త్రాగుటకు గాని పుణ్యకార్యములకు గాని ఉపయో గించుకో రాదు. అట్లే దేవుడు పవిత్రులందును అపవిత్రులందును ధార్మికులందును అధార్మికులందును సర్వత్ర అంతర్యామిగ ఉన్నాడు అనుటలో సందేహము ఆవంతయు లేదు. కాని మానవుడు అపవిత్రులతోను దుర్మార్గులతోను సకల్మషులతోను వ్యవహారములు పెట్టుకో రాదు. వారితో అతడు కలియ గూడదు. వారిలో కొందఱితో సంభాషింపను మాత్రము సంభాషింపవచ్చు నేమో, కాని తక్కిన వారితో అంతమాత్రము చొరవ సైతము కూడదు. అట్టివారినుండి అతడు దూరముగ ఉండ వలెను.

ఒక భక్తుడు — స్వామీ, ఎవడేని దుర్మార్గుడు మనకు హాని చేయుటకు ఉంకించినను, హానిని చేయనే చేసినను అప్పుడు మనము ఊరకుండవలసినదేనా ?

గురుదేవుడు — సంఘమున జీవితమును గడపుచుండు మానవుడు దుష్టచిత్తుల బారినుండి తన్ను కాపాడుకొనుటకుగాను, పైకి కోపమును జూప వలసి ఉండును. అంతే కాని, ఇతరులు తనకు హాని చేయ నున్నారు అని ఆశంకించి (ముందుగనే) వారిలో ఎవరికి గాని తాను హాని చేయ రాదు.

ఒక కథను వినుము — ఒక పచ్చిక బయలు ఉన్నది. అందు గొల్ల బాలురు ఆవులను మేపుకొనుచుండెడివారు. అక్కడనే భయంకర విష సర్పము ఒకటి ఉండెను. దానివలని వెఱపుచే, ఎల్లరును వేయి కన్నులతో మెలకువ గలిగి ఉండెడివారు. ఒకనాడు బ్రహ్మచారి ఒకడు ఆ పచ్చిక బయలు మీదుగ పోవుచుండెను. గొల్లపిల్లవాండ్రు పరుగున అతనిని సమీపించి "ఓ మహాశయా, అటువైపు పోకుము, దయచేసి మరలుము. ఆ ప్రాంతమున ఒక నాగుపాము ఉన్నది" అని ఎచ్చరించిరి. అందులకు ఆయన "ఉన్న ఏమి ? దానివలన నాకు భయము ఏమియు లేదు. మంచి పిల్లలారా, నాకు కొన్ని మంత్రములు తెలియును" అని బదులు చెప్పి తనదారిని ముందునకు సాగెను. కాని, ఆ గొల్లపిల్లలు ఆయనను వెంబడింప లేదు. ఏల యన, వారికి భయము. ఇంతలో సర్పము పడగ ఎత్తుకొని వేగముగ బ్రహ్మచారిని సమీపించెను. వెంటనే, అతడు ఒక మంత్రమును ఉచ్చరించెను. ఉచ్చరించినంతనే, నాగుపాము వానపాము వలె అయి అతని పాదముల కడ పడి ఉండెను. బ్రహ్మచారి దానితో "ఇదుగో, ఇటు చూడు, ఎందులకు నీవు ఒరులను హింసించుచు తిరుగాడెదవు ? ఇటు రమ్ము, నీకు ఒక పుణ్యమంత్రమును ఉపదేశింతును. దానిని జపింపుము. నీకు దైవభక్తి అలవడును. అందుచే, నీ ఘాతుక స్వభావము తొలగుటే కాదు, కడకు భగవత్సాక్షాత్కారమును చేకూరును" అని మంత్రోపదేశముచేసి ఆధ్యా-

త్మికజీవితములోనికి ప్రవేశము ఒసంగెను. పాము గురువునకు మ్రొక్కి— "ఆధ్యాత్మిక నియమానుష్ఠానము నాకు అలవడుట ఎట్లు" అని అడిగెను. "ఆ మంత్రమునే జపించుచుండుము. ఎవరిని గాని హింసింపకుము" అని చెప్పి ఆ బ్రహ్మచారి తాను పోవుటకు ముందు సర్పముతో "మరల వచ్చి నిన్ను జూతును" అని చెప్పి పోయెను.

కొన్నాళ్లు గడచినవి. పాము కఱచుట లేదు అని గొల్లపిల్లవాండ్రు గుర్తించిరి. వారు దాని మీద రాళ్లు రువ్విరి. కాని అది బుస్సు మన లేదు. వానపామువలెనే ఊర కుండినది. ఒకనాడు ఆ బాలురలో ఒకడు దానిని సమీపించి, తోకయొద్ద పట్టుకొని, చుట్టిచుట్టి, నేల మీద మోది, పాఱ వేసెను. పాము నెత్తురు గ్రక్కి స్మృతి కోల్పోయెను. అది కదలక పడి ఉన్నందున చచ్చినది అని తలంచి, పిల్లవాండ్రు తమ దారిని ఏగిరి.

సగము రాత్రి అప్పటికి, పామునకు చైతన్యము కలిగెను. మెల్లగను, ఎంతో కష్టముతోను, అది తన దేహమును ఈడ్చుకొనుచు పుట్టలోనికి ప్రాకినది. దాని ఎముకలు తునుకలు ఐనవి. కదలగల శక్తి ఐనను దానికి లేదు. పెక్కు దినములు గడచిపోయినవి. పాము, తోలు కప్పిన వట్టి ఎముకల గూడుగ రూపొందినది. అప్పుడప్పుడు, రాత్రులందు మాత్రము, అది ఆహారమునకై బయటికి వచ్చెడిది, పగటి వేళలలో ఆబాలురవలని వెఱపుచేత, పుట్ట వెడలి వచ్చుటే లేదు. గురువునొద్ద మంత్రోపదేశము పొంది నప్పటి నుండి, అది ఇతరులను హింసించుటను మానివేసెను. మట్టియు, చెట్లనుండి తమంతట రాలిన ఆకులును, పండ్లును — ఇవే దానికి ఆహారము.

ఇంచుమించు ఒకసంవత్సరమునకు పిమ్మట ఆ బ్రహ్మచారి ఆదారిని వచ్చి, పాము సంగతిని విచారించెను. అది చచ్చిపోయినది అని గొల్లపిల్లవాండ్రు చెప్పిరి. కాని అతడు నమ్మ లేక పోయెను. ఉపదిష్టము ఐన మంత్రఫలమును బడయక, పాము మరణింపదు అని అతనికి తెలియును. కావున అతడు అది ఉన్న చోటికి దాఱి కనుగొని

పోయి, ఇటు అటు వెదకి, దానికి తాను పెట్టి ఉండిన పేరుతో పిలిచెను. గురుని కంఠమును వినగనే, అది పుట్టనుండి బయటికివచ్చి, మహాదరముతో, అతని ముందు సాష్టాంగ నమస్కారించెను.

బ్రహ్మచారి — ఏమోయీ, ఎట్లు ఉన్నావు?

పాము—క్షేమముగనే ఉన్నాను స్వామీ.

బ్రహ్మచారి—మఱి ఎందులకు అంతగా కృశించి ఉన్నావు?

పాము—పూజ్యుడవు ఐన ఓ గురుదేవా, ఎవరినిగాని హింసింపకుము అని మీరు నాకు కట్టడ చేసితిరి కదా! కాబట్టి ఆకులపైని, పండ్లపైని, ఆధారపడి జీవితమును గడపుచున్నాను. అందుచేత కృశించి ఉందును.

పాము ధార్మికము ఐనదిగ మాఱెను. ఎవరిపైనిగాని, దానికి కోపము కలుగుటే లేదు. గొల్ల పిల్లవాండ్రు అల నాడు తన్ను కొన ఊపిరితో విడిచిపెట్టిన సంగతిని, అది పూర్తిగా మఱచిపోయెను.

బ్రహ్మచారి "తిండి లేక పోయినంత మాత్రముచేత నీవు ఇంతగా ఎండుకొని పోయి ఉండవు. వేఱు కారణము ఏదో ఉండ వలెను. జ్ఞప్తికి తెచ్చుకో" అనెను. పిల్లవాండ్రు తన్ను నేల మీద మోదిన సంగతి, అప్పుడు దాని జ్ఞప్తికి వచ్చెను. రాగా, ఇట్లు అనెను — "ఔను, స్వామీ, ఇప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నది. ఒక నాడు, పిల్లవాండ్రు నన్ను, నేలకు వేసి, చావ మోదిరి. పాపము, వారికి ఏమి తెలియును? నా మనస్సు ఎంతగా మార్పు చెంది ఉన్నదియు వారు గ్రహింపరైరి. నేను ఎవరిని గాని కఱవను అని, హింసింపను అని; వారు ఎట్లు తెలిసికో గలరు?" బ్రహ్మచారి "ఎంత సిగ్గు చేటు! అంత అవివేకివా నీవు? నిన్ను నీవు కాచుకొను దారి ఐనను తెలియదా నీకు? నీతో నేను 'కఱవకుము' అంటినే కాని 'బుసకొట్టకుము' అంటినా? బుస్సు మని వారిని నీవు ఏల బెదర గొట్టక పోయితివి?" అని అఱచెను.

కాబట్టి దుష్టుల వైపు కస్సు బుస్సు అనుచుండ వలెను, లేకున్న వారు నీకు హాని తెత్తురు. వారిని బెదరగొట్టవచ్చును గాని, వారిలోనికి నీ విషమును ఎక్కింప రాదు. ఎవరు గాని, ఎవరిని గాని హింసింప రాదు.

దైవసృష్టిలోని పదార్థములు—మానవులు మృగములు వృక్షములు మొలకలు మున్నగు రీతిగ — వివిధము లై ఉన్నవి. మృగములలో కొన్ని మంచివి; కొన్ని చెడ్డవి; వ్యాఘ్రమువంటి కొన్ని మృగములు భయంకరములు. వృక్షములలో కొన్నింటి ఫలములు అమృతమధురములై ఉండును. కొన్నిటి ఫలములు విషమయములుగ ఉండును. అట్లే మానవులందును సాధువులు ఉన్నారు, అసాధువులు ఉన్నారు, పవిత్రులు ఉన్నారు, అపవిత్రులు ఉన్నారు, దైవపరులు ఉన్నారు, ఐహికపరులును ఉన్నారు.

చేతనులను నాలుగు వర్గములవారినిగ విభాగింప వచ్చును — బద్ధులు, ముముక్షువులు, ముక్తులు, నిత్యముక్తులు.

నారదాదిమునులు నిత్యముక్తులు; ఇతర చేతనులకు ఆధ్యాత్మిక సత్యమును ఉపదేశించుటకును, వారికి శ్రేయము ఒనగూర్చుటకునే, వీరు తమ జీవితమును అంకితము ఒనర్చుకొన్నవారు.

ఐహిక విషయములందు మునిగి దేవునే మఱచిన వారుబద్ధులు. వారు పొరపడి ఐనను దేవుని స్మరింపరు.

లౌకిక సంగమునుండి విడుదల ఒంద గోరు వారు ముముక్షువులు. అందులకై యత్నించినప్పుడు అల్పసంఖ్యాకులు నెగ్గుదురు, అధికసంఖ్యాకులు నెగ్గరు.

సాధువులు మహాత్ములు మున్నగు వారు ముక్తాత్ములు. వారు కామినీకాంచనములందును ఇతరైహికములందును తగుల్కొనరు. వారి మనస్సులకు లౌకికబంధములు లేవు. అదియును గాక వారు సదా భగవచ్చరణారవిందధ్యానము చేయు ధన్యులు.

చేపలను పట్టుటకై, తటాకములో ఒక వలను వేసితిమి అనుకొనుము. కొన్ని చేపలు మిక్కిలి జాగరూకత కలవై, అందు తగుల్కొనకయే ఉండును. అవి నిత్యముక్తులను బోలినవి. కాని చేపలలో చాలవఱకు ఆ వలలో తప్పక తగుల్కొనును. తగుల్కొన్న చేపలలో కొన్ని విడుదల పొందుటకు ప్రయత్నించును. అవి ముముక్షువులను బోలినవి. ఆ ప్రయత్నములో కృతార్థత చేపలకు అన్నిటికిని చేకూఱదు, కొన్నింటికే. అవి తటాకజలము క్రిందుమీదై మిక్కిలి బురద అగునట్లు, వలనుండి వెలికి ఉఱుకును. అప్పుడు జాలరులు 'అదుగో, పెద్దది ఒకటి పోవుచున్నది' అని కేకలు వేయుదురు. కాని వలలో ఉన్న చేపలలో, నూటికి తొంబదితొమ్మిది పాళ్లు, తప్పించుకోలేవు, సరి కదా, తప్పించుకొనుటకు ప్రయత్నమును ఐనను చేయవు. అంతే కాదు, ఇక్కడ మనము క్షేమముగ ఉన్నాము, ఇక మనకు భయము లేదు'' అనుకొనుచు, వలను కఱచుకొని, బురదలోనికి చొచ్చుకొని పోయి. హాయిగ ఉండును, కాని వలతోబాటు తమ్ము కూడ జాలరి బయటికి లాగివేయును అని, పాపము అవి ఎఱుగవు. అవి ఈ లోకములోని బద్ధాత్ములను బోలినవి.

కామలోభములే బద్ధాత్ములను బంధించు సంకెలలు. అవి వారి చేతులు కాళ్లు ఆడనీయక కట్టి ఉంచును. కామినీకాంచనములవలననే తమకు సౌఖ్యభద్రతలు కలుగును అని వారి నమ్మకము. కాని, తమ సర్వవినాశమునకు దారితీయునవి ఆ కామినీకాంచనములే, అని వారు గ్రహింపరు. ఇట్టి బంధమందు ఉన్న జీవి మరణశయ్యపై ఉన్నప్పుడును, భార్య ''నీవు పోవుచున్నావే, నాకు ఏమి సంపాదించి పెట్టి ఉన్నావు?'' అని గద్దించును. అంతే కాదు, తాను ఒకవైపు మరణశయ్యపై ఉన్నను, అప్పుడు కూడ, ఈ జీవికి లౌకిక విషయములందు ఎంతటి తగులాటమో చూడుడు — దీపము పెద్దగ మండుచున్నచో నూనె వ్యయము అగును అని కేకలు వేయును.

బద్ధాత్ములు దేవుని ఎప్పుడును స్మరింపనే స్మరింపరు. వారి విరామకాలము అంతయును పనికిమాలిన మాటలలోనో, అవివేక

ప్రసంగములలోనో, లేక, నిరర్థక కార్య కలాపమందో, గడచిపోవు చుండును. వారిలో ఒకరిని అందులకు కారణమును అడిగితి మేని "నేను ఊరకుండ లేనండి, కాబట్టి వేయుచున్నాను ఈ కంచెను" అనును. వారికి ఇంచుక యేని ఉబుసు పోనప్పుడు, వారు చీట్లాటను ఐనను ఆరంభింతురు.

గది అంతటను గంభీర నిశ్శబ్దత నెలకొని ఉండెను.

ఒక భక్తుడు — మఱి అట్టి లౌకిక ప్రావణ్యము గల వానికి బాగుపడు దారియే లేదా ?

గురుదేవుడు — లే కేమి ? అతడు అప్పు డప్పుడు పుణ్యాత్ముల గోష్ఠిలో మెలగుచుండ వలయును. దైవధ్యానము చేయుటకై ఏకాంతమునకు ఏగుచుండ వలయును. అదియును గాక అతనికి సారాసారవివేకము అలవడ వలయును. భక్తివిశ్వాసములను ప్రసాదింపుము అని అతడు దేవుని వేడుకో వలయును.

[కేదారునితో] విశ్వాసమునకు ఎంత ప్రభావము కలదో, నీవు తప్పక విని ఉందువు. రాముడు దేవుడు కదా, రూపు దాల్చిన అనిర్వాచ్యబ్రహ్మమే కదా, కాని, సముద్రమును దాటి, సింహాళమునకు చేరుటకు, ఆయన ఒక వంతెనను కట్టుకో వలసి వచ్చెను. కాని రామభక్తుడు ఐన హనుమంతుడు, రామ నామ మందు విశ్వాసము కలిగి ఉన్నందున, ఒక్క గంతుతో, సముద్రమును పూర్తిగా దాటి, అవతలి తీరమును జేరెను. ఆయనకు వంతెన అక్కఱ లేక పోయినది. [అందఱును నవ్వుదురు].

ఒకానొకప్పుడు ఒక మనుష్యుడు సముద్రమును దాటుటకు ఉంకించుచుండెను. విభీషణుడు ఒక ఆకుమీాద రామనామమును వ్రాసి, దానిని ఆ మనుష్యుని కట్టుబట్టకొంగున ముడిచి, "ఓయీ, భయపడకుము, విశ్వాసము గలిగి ఉండుము, నీటి మీాద నడచి పొమ్ము. కాని, జాగ్రత్త! నీ నమ్మకము ఏ క్షణములో చెడునో, ఆ క్షణములోనే నీవు మునిగి పోదువు" అనెను. ఆ మనుష్యుడు నీటి

మీాద సుళువుగ నడచిపోవుచుండెను. తటాలున, తన వస్త్రపు కొసన ముడువబడి ఉండునది ఏమో చూతము అను కుతూహలము అతనికి తీవ్రముగ కలిగినది. ముడి విప్పి చూచు సరికి, ఆకు కానిపించెను. దానిమీాద రామనామము వ్రాయబడి ఉండెను. "ఏమి ఇది? రామనామమా? ఇంతేనా" అని అతడు తనలో అనుకొనెను. అతని మనస్సులో అవిశ్వాసము ప్రవేశించిన వెంటనే అతడు మున్నీట మునిగి పోయెను. మానవుడు గోహత్య బ్రహ్మహత్య స్త్రీహత్య మున్నగు మహాపాపములు చేసి ఉండినను, అతనికి దేవునందు విశ్వాసము ఉన్నచో, ఆ విశ్వాస ప్రభావము అతనిని తప్పక సంరక్షించియే తీఱును. "దేవా, ఇట్టి పాపములను ఇక ముందు చేయను" అని చెప్పిన జాలును. ఇక అతనికి ఎట్టి భయమును ఉండదు.

పై మాటలు ముగించి, వెంటనే గురుదేవుడు ఇట్లు పాడెను—

దుర్గ దుర్గ అటంచు ఓ భర్గ రాణి,<br>
నీదు నామము పాడుచుఁ బోదు నేని<br>
ఎన్నఁగా రాని పాపంబు లెన్ని ఉన్న,<br>
పరమపావని, గౌరి, నా పాలి తల్లి,<br>
దాసు నట్ద్రోసి పుచ్చ నీ తరమె చెపుమ?<br>
ఒక్క గ్రుక్కెడు కల్లుకై ఓపి నేను<br>
దొంగ నైతినె పో, నాకు బెంగ ఏల?<br>
కడుపులో ఉన్న బిడ్డను *కరఁచి చంపి<br>
నట్టి ఘోరపు పాతకి నౌదుఁ గాక,<br>
మగువలం జంపి, గోవుల మట్టువెట్టి,<br>
విప్రులం గూల్చి నట్టి, పాపి నని నన్ను<br>
నిజముగా నీవు దలఁచిన, నేమి భయము?<br>
దేవి, నీదు నామ ది వ్యామృతంబును<br>
జపము సేయ, దాని శక్తి వినుము :

* [కరఁచి = కరఁగించి].

నాదు పాపవితతి నాశ మొందుటె కాదు,
బ్రహ్మపదవి యైన, ప్రాప్య మగును.

నరేంద్రుని జూపి గురుదేవుడు ఇట్లు అనెను — "మీరు అందఱును ఈ కుఱ్ఱవానిని జూడుడు. ఇతని నడవడి ఇక్కడ ఈరీతిని ఉన్నది. మఱి ప్రాంగణములో ఆడుకొనుచు ఉన్నప్పుడు ఇతడు ఇతడు కాడు. కొంటెపిల్లవాడు తండ్రి ప్రక్కన ఉన్నంతసేపు సాధువుగ కన్పట్టును. నరేంద్రుడును అతనివంటివారును నిత్యముక్తుల వర్గమునకు జెందుదురు. వారికి సంసారబంధము ఏనాడును లేదు. ఒకంత వయసు వచ్చినంతనే వారిలో జ్ఞానము మేలుకాంచును. దానిని వారు గుర్తించి సూటిగా భగవంతుని జేరుకొందురు. వారు ఈలోకమునకు వచ్చుట ఇతరులకు ఉపదేశించుటకే. లౌకికవిషయములు వారికి లక్ష్యము లేదు, కామలోభముల గంధము ఐనను వారికి లేదు.

వేదములు హోమా అను ఒక పక్షిని గూర్చి చెప్పును. ఆ పక్షి ఎత్తుగా ఆకసమున వసించుచు అక్కడనే గ్రుడ్డు పెట్టునట. వెంటనే ఆ గ్రుడ్డు క్రిందికి పడ దొడంగు నట. కాని అది ఎంతో ఎత్తులో ఉండి పడుచున్నందున అట్లు పడుటకు ఎన్నో దినములు పట్టునట. నడిదారిలోనే ఆ గ్రుడ్డు పగులును. అం దుండి పక్షిపిల్ల వెలువడును. ఆ పిల్ల క్రిందికి పడుచున్నప్పుడే దాని కన్నులు తెఱచుకొనును. అప్పుడే దానికి ఱెక్కలును మొలచును. కన్నులు తెఱచినంతనే తాను పడుచున్నా ననియు నేలకు కొట్టుకొన్నంతనే తుత్తునియలు అగుదు ననియు అది గ్రహించును. తత్క్షణమే అది ఆకసమందు ఉన్న తన తల్లియొద్దకు ఎగిరి పోవును."

ఈ ఘట్టమున నరేంద్రుడు గది నుండి పోయెను. కేదారుడును, మహేంద్రుడును, ప్రాణకృష్ణుడును ఇంకను అనేకులును అక్కడనే ఉండిరి.

గురుదేవుడు — చూచితిరా, నరేంద్రుడు పాటలం దేమి వాద్యముల వాయించుటయం దేమి చదువునం దేమి,—అన్నింటి

యందును అప్రతిముడు, మొన్న కేదారునితో గలిగిన వాదములో కేదారుని యుక్తులను ఇం తింతగా ఖండించి వేసెను (అందఱును నవ్వుదురు).

(మహేంద్రునితో) ఆంగ్లములో తర్కవిషయిక మయిన గ్రంథము ఏదైన గలదా?

మ—స్వామీ, ఉన్నది. దానిని లాజిక్ అందురు.

గురుదేవుడు—అందులోని విషయముఏమో నాకు దెలుపుము.

కొంత కలవరపడి, మహేంద్రుడు ఇట్లు అనెను — అందు ఒక భాగము సామాన్యము (జెనరల్) నుండి విశేషము (పర్టిక్యులర్)ను ఊహించి కనుగొనుటను దెలుపును. ఉదాహరణము — మానవులకు అందఱికును మరణము ఉన్నది, పండితులును మానవులే, కావున పండితులకును మరణము ఉన్నది. మఱి యొక భాగము విశేషములనుండి సామాన్యమును ఊహించి కనుగొను పద్ధతిని దెలుపునది. అందులకు ఒక ఉదాహరణము — ఈ కాకి నల్లగ ఉన్నది, ఆ కాకి నల్లగ ఉన్నది, ఎక్కడ ఏ కాకి కంట బడినను నల్లగనే ఉన్నది. కాబట్టి కాకులు అన్నియు నలుపు. ఈ విధముగ జేసికొను తీర్మానములో మాత్రము ఎప్పుడైన ఒకప్పుడు తప్పు ఏర్పడ వచ్చును. ఏల యన వెదకి నప్పుడు ఎక్కడైన ఒక చోట తెల్ల కాకి కనబడ వచ్చును. మఱి యొక ఉదాహరణము—ఎప్పుడు వాన కురిసినను అప్పుడో అంతకు మునుపటినుండియో మేఘము ఉండును. కాబట్టి మేఘమునుండియే వాన గలుగుచున్నది. వేఱు ఒక ఉదాహరణము — ఈ మానవునకు ముప్పది రెండు దంతములు ఉన్నవి, ఆ మానవునకు ముప్పది రెండు దంతములు ఉన్నవి, అగపడిన మానవునకు ఒక్కొక్కనికిని ముప్పది రెండేసి దంతములు ఉన్నవి. కాబట్టి ప్రతిమానవునకును ఉండు దంతముల సంఖ్య ముప్పది రెండే. విశేషమునుండి సామాన్యమును, సామాన్యమునుండి విశేషమును ఊహించు నట్టి క్రమములను ఆంగ్లతర్కశాస్త్రము తెలుపును".

ఈ మాటలు శ్రీరామకృష్ణుని చెవిని బడనే లేదు. విన దొడంగిన క్షణ మందే ఆయనకు పరధ్యానము ఏర్పడినది. కావున సంవాదము ఆగిపోయినది.

సభ లేచెను. భక్తులు గుడితోటలో పచారు చేయుచుండిరి. మహేంద్రుడు పంచవటి వైపునకు పోయెను. అప్పటికి సాయంకాల మున ఐదుగంటలై ఉండును. కొంత సేపటికి అతడు గురుదేవుని గదికి మరలి వచ్చెను. అక్కడ ఉత్తరమున ఉన్న వసారలో అతడు అద్భుతదృశ్యమును ఒకదానిని జూచెను.

శ్రీరామకృష్ణుడు మౌనముగ నిలబడి ఉండెను. కొందఱు భక్తులు పరివేష్టించి ఉండిరి. నరేంద్రుడు పాడుచుండెను. అంతటి మధురమైన పాట, శ్రీరామకృష్ణుడు పాడినప్పుడే తప్ప, వేఱు ఎప్పుడును మహేంద్రుడు విని ఉండ లేదు. శ్రీరామకృష్ణుని వైపు చూచు సరికి, అచ్చెరువుచే మహేంద్రునకు దిమ్మనుపాటు గలిగెను. ఏలయన గురుదేవుడు ఎట్టి కదలికయు లేక నిలబడి ఉండెను. ఆయన కన్నులు గూడ నిశ్చలములుగ ఉండినవి. ఊపిరి ఆడుచున్న జాడ ఐనను కన్పట్టలేదు. గురుదేవుడు సమాధి దశలో ఉన్నాడు అని ఒక భక్తుడు మహేంద్రునకు దెలిపెను. అట్టి అనుభూతిని మహేంద్రుడు అంతవఱకును కన్నదియు లేదు, విన్నదియు లేదు. అబ్బురపాటుచే నోరు తెఱవక అతడు తనలో "భగవద్ధ్యానముచే బాహ్యజగత్తును ఇంతగా మఱచుట మానవమాత్రునకు శక్యమా? ఇట్టి దశ ఎవనికి గలుగునో అతని భక్తివిశ్వాసములు ఎంతదృఢములుగ ఉండవలెను" అని అనుకొనెను.

నరేంద్రుడు ఇట్లు పాడుచుండెను—

తలఁపుమా, మానసంబ, సదా తలంపు —
హరి, నిరంజను, చిద్ఘను, నిరుపమాన
దివ్య తేజ స్స్వరూపుని, దివిజవరదు;
సర్వ సత్త్వ మనోహర స్వచ్ఛ చారు

వయిన దాతని రూపము; పరమ భక్త
వరుల కెల్లను నాతఁడే ప్రాణపదము.
ఎపుడుఁ గ్రొత్తగఁ దోఁచెడు హెచ్చు ప్రేమ
క్షణము క్షణమునకును మించు సౌరు గలఁడు;
విద్యు దుజ్జ్వల మాతని వింత తేజు
హర్ష రోమాంచ కంచుకం బావహించు.

ఇందు కడపటి చరణమును పాడి నప్పుడు గురుదేవుని ఒడలు కంపించెను, పులకలు మొలచెను, చెక్కిళ్లమీద ఆనందబాష్పములు జాలువారెను. అప్పు డప్పుడు అతని చిఱునవ్వుచే పెదవులు విచ్చు చుండినవి. సాటి లేనిదియు, కోటిచంద్రులను మించినదియు అగు భగవత్సౌందర్యమును ప్రత్యక్షముగ గాంచుచున్నాఁడా? ఇది పరమాత్మ ఐన దేవదేవుని ప్రత్యక్ష దర్శనమా? అట్టి దర్శనము లభింప వలయును అనిన ఎంత తపస్సు, ఎంత నిష్ఠ, ఎంత శ్రద్ధ, ఎంత భక్తి కావలసి ఉండును?

పాట ఇంకను ఇట్లు సాగినది.

ప్రవిమలం బైన మతి తోడ, ప్రజ్వరిల్లు
నేత్రములతోడ, దివ్య మౌ నిండు ప్రేమ
తోడ, సాటి లేనట్టి దౌ దొడ్డతనము
గలిగి వెలిఁగెడి సుందరు కామజనకు
పాదముల, నీదు హృదయ మను పద్మమందు
నిల్పి, నిచ్చలు గొల్వుము నీరజాక్షు

మరల ఆశ్చర్యమును గలిగించునట్టి అదే నవ్వు! దేహము మునుపటివలె నిశ్చలముగ ఉండెను. లోలోన వింత దృశ్యమును దేనినో చూచుచున్నప్పటివలె కన్నులు సగము మూతవడి ఉండెను.

ఇంతలో నరేంద్రుని పాట ముగింపునకు వచ్చెను. అందు కడపటి పంక్తులు—

మహిత తత్ ప్రేమ మనెడి స న్మంత్ర మహిమ
బంధనం బంది ఓ నాడు మానసంబ
స చ్చి దానంద రూపి ఆ స్వామి యందు
మునుఁగుమా ఇంక నింకను మునుఁగు మునుఁగు.

ఆ సమాధియు, అప్పుడు ఎట్ట యెదుట కానిపించిన ఆ దివ్యా నందానుభూతియు, చూచుచున్న మహేంద్రుని మనసున తొలగింప రాక నాటుకొనెను. గాఢ మైన భావోద్వేగముతో అతడు ఇంటికి మరలెను.

సచ్చి దానంద రూపి ఆ స్వామి యందు
మునుఁగుమా ఇంక నింకను మునుఁగు మునుఁగు

అనెడి చరణముల ప్రతిధ్వనులు అతనికి తనలో విననగుచుండినవి.

మఱునాడును మహేంద్రునకు విరామదినమే. ఆయన దక్షిణేశ్వరమునకు చేరుకొనునప్పటికి మధ్యాహ్నము మూడు గంటలు అయ్యెను. శ్రీరామకృష్ణుడు తన గదియందు ఉండెను. నరేంద్రుడును భవనాథుడును మఱికొందఱు భక్తులును నేలపై పఱచి ఉన్న చాపపై కూర్చుండిరి. వారు అందఱును పందొమ్మిది ఇరువది సంవత్సరముల వయసువారే. చిన్న మంచము మీద కూర్చుండి శ్రీరామకృష్ణుడు చిఱునవ్వు నవ్వుచు వారితో సంభాషించు చుండెను.

మహేంద్రుడు గదిలో ప్రవేశించిన వెంటనే, గురుదేవుడు బిగ్గరగానవ్వి 'అడుగో మరల వచ్చినాడు' అని ఆ బాలురతో అనెను. వారును నవ్విరి. మహేంద్రుడు ఆయనకు సాగిలబడి మ్రొక్కి కూర్చుండెను. ఆంగ్లవిద్య చదివిన అందఱి వలె, మహేంద్రుడు ఇన్నాళ్లును కేల్మోడ్పు మాత్రముతో నమస్కరించెడివాడు. కాని సనాతన భారతీయాచారము ప్రకారము గురుపాదముల కడ సాగిల బడుటను అతడు అలవఱచుకొన్నది ఈ నాడే.

వెంటనే గురుదేవుడు తాను ఎందులకు నవ్వినదియు భక్తులకు వివరించెను. "ఒకడు ఒకనాడు మధ్యాహ్నమునకు తర్వాత నాలుగు

గంట లప్పుడు ఒక నెమలికి నల్లమందు మాత్రను తినబెట్టెను. మఱు నాడు సరిగా అదే సమయమునకు ఆ నెమలి వచ్చెను. ఆ మందు 'నిషా' అనుభవించినది, మరల ఒక మోతాదు తిందము అని సకాలమునకు వచ్చినది (అందఱును నవ్వుదురు).

ఇది తగిన నిదర్శనమే అని మహేంద్రుడు అనుకొనెను. ఇంట ఉన్నప్పుడు ఐనను సరే ఒక్క-క్షణముసేపు కూడ అతడు శ్రీరామకృష్ణుని స్మరణమును మానుకో లేక పోయెను. మనస్సు దక్షిణేశ్వరముపైనే ఉండెను. అక్కడికి తప్పక చేరుకొనువఱకు అతడు ప్రతినిమిషమును లెక్క పెట్టుకొను చుండెను.

ఇంతలో గురుదేవుడు బాలురను తనకు మిక్కిలి అంతరంగికులు అగు మిత్రులనుగా భావించి వారితో మిక్కిలి వేడుకగా ప్రొద్దుపుచ్చు చుండెను. వారు తెగ నవ్వుచుండిరి. ఆ ఘోష గదియంతయు నిండెను. ఆ గది ఆనంద విపణివలె ఉండెను. మహేంద్రునకు ఇది అంతయు క్రొంగ్రొత్త విషయములు తెలియవచ్చుటగా ఉండెను. "నా కంటియెదుట ఇతడు దైవోన్మత్తుడుగ ఉండినది నిన్ననే కదా. దివ్యప్రేమమహోదధిలో ఇతడు అప్పుడు ఈదులాడుచుండెను గదా! అంతకు ముందు నేను ఎన్నడును చూచి ఉండని దృశ్యము కదాఅది. అట్టి ఇతడే నేడు సర్వసామాన్యునివలె మెలగుచున్నాడు, నేను ఇక్కడికి వచ్చిన మొదటి దినము నన్ను చీవాట్లు పెట్టినవాడు ఇతడే కదా? 'నీవు జ్ఞానివా' అని నన్ను మందలించినవాడు ఇతడే కదా! నిరాకారదైవము ఎంత సత్యమో సాకారదైవమును అంత సత్యమే అని నాకు తెలిపినవాడు ఇతడే కదా! దేవుడు ఒక్కడే తథ్యము అనియు తక్కినది ఎల్ల మిథ్య అనియు ఇతడు నాకు తెలిపి ఉండ లేదా? ఒకసంపన్నుని యింట పరిచారిక ఎట్లు ఉండునో అట్లు ఈలోకమున నిస్సంగుడవై ఉండుము అని నాకు ఉపదేశించినవాడు ఇతడే కదా"—అని ఇట్లు అంతయు మహేంద్రుడు తలపోసెను.

యువభక్తులగోష్ఠి గురుదేవునకు వినోదకరముగ ఉండెను. ఆయన అప్పు డప్పుడు మహేంద్రునివైపు చూచుచు ఉండెను.

మహేంద్రుడు నిశ్శబ్దముగ కూర్చుండి ఉంటను ఆయన గుర్తించెను; గుర్తించి రామలాలుతో "చూచితివా, అతడు కొంత ప్రౌఢ వయస్సు గల వాడు ఐనందున కొంత గంభీరముగ ఉన్నాడు. కుఱ్ఱవాండ్రు అందఱును వినోదించుచుండ అతడు ఊరక కూర్చున్నాడు" అనెను. మహేంద్రునకు అప్పటికి వయస్సు ఇరువది యెనిమిది ఏండ్లు.

గురుదేవుడు మహేంద్రునితోను నరేంద్రునితోను ఇట్లు అనెను — "మీరు ఒక రొకరితో ఆంగ్లమున మాటాడుకొనుచు వాదములు సల్పు నప్పుడు విన వలయును అని ఉన్నది" — అని. వారు ఇరువురును నవ్వి మాతృభాషలోనే సంభాషణను సాగించు చుండిరి. గురుదేవుని ఎదుట వాదములు చేయుట ఇక మహేంద్రునకు అసాధ్యమే, ఆయన ఎంత చెప్పినను వారు ఆంగ్లమున మాటాడ రైరి.

సాయంకాలము ఐదు గంట లప్పటికి మహేంద్రనరేంద్రులు తప్ప తక్కిన భక్తులు ఎల్లరును గురుదేవుని వీడ్కొనిరి. మహేంద్రుడు గుడితోటలో సంచరించుచుండెను. తటాలున బాతుకొలనుగట్టున నరేంద్రశ్రీరామకృష్ణులు అతనికి అగపడిరి. వారు ఒండొరులతో సల్లాపించుచుండిరి. నరేంద్రునితో శ్రీరామకృష్ణుడు "ఇటు చూడుము, నీవు తఱచు వచ్చుచుండుము, నీవు క్రొత్తవాడవు. నూత్నవధూ వరులు ఒకరి యొద్దకు ఒకరు తఱచు వచ్చుచుందురు కదా, అట్లే మైత్రిప్రారంభదశయందు ఉండువారును ఒకరియొద్దకు ఒకరు తఱచు వచ్చుచుందురు. (నరేంద్రనాథమహేంద్రనాథులు నవ్వుదురు). కావున దయచేసి రమ్ము — రావా?" అనెను.

నరేంద్రుడు బ్రాహ్మసమాజసభ్యుడు, మాట తప్పడు, కావున చిఱునవ్వుతో 'సాధ్యమైనంతవఱకు వత్తును' అనెను.

వారు గురుదేవుని గదికి మరలి వచ్చుచుండినప్పుడు, మహేంద్రునితో శ్రీరామకృష్ణుడు ఇట్లు అనెను — పల్లెప్రజలు తమ నాగళ్లకు పూంచుటకై ఎడ్లను కొందురు. అందులకై వారు బజారుల కేగుదురు గదా! వారు తోకలను తాకిచూచియే ఎద్దులలో

మేలైనవానిని, కానివానిని గుర్తింపగలరట. తాకినవెంటనే కొన్ని ఎద్దులు ఎట్టి అడిచిపాటును లేక క్రింద పండుకొనునట. వెంటనే అవి సారహీనములు అని గుర్తించి పల్లెప్రజలు వానిని త్యజింతురు. తోకను తాకినప్పుడు ఉద్రేకించి దుముకులాడెడి ఎద్దులనే వారు కోరుకొందురట. అట్టి వృషభములను బోలినవాడు నరేంద్రుడు. అతనిలో ఉత్సాహము నిండి తొనకుచుండును.

ఇట్లు చెప్పుచు గురుదేవుడు నవ్వి "చురుకుదనము బొత్తుగ లేనివారు కొందఱు ఉన్నారు. వారు పాలలో నానిన అటుకుల వలె మెత్తగను జిగట గలిగియు ఉందురు. వారికి అంతస్సారము ఉండనే ఉండదు" అనెను.

అది మునిమాపు వేళ. భగవంతుని ధ్యానించుచున్న గురుదేవుడు 'పొమ్ము, పోయి నరేంద్రునితో మాటాడుము. ఆ వెనుక అతనిని గూర్చి నీ యభిప్రాయము ఏమో నాకు దెల్పుము' అని మహేంద్రుని బంపెను.

ఆలయములో సాయంపూజ ముగిసినది. నరేంద్రమహేంద్రులు ఒండొరులను గంగగట్టున గలసికొని ఒండొరులతో మాటాడ సాగిరి. తాను బ్రాహ్మసమాజసభ్యుడను అనియు, ప్రస్తుతము కళాశాలలో చదువుచున్నాడను అనియు — నరేంద్రుడు తెలిపెను.

అప్పటికే సాయంకాలము దాటినది. మహేంద్రుడు వెడలిపోవలసినకాలము అయ్యెను. కాని వెడలిపోవుటకు ఆయనకు ఇష్టము లేదు. వెడలిపోకుండుటే కాదు, శ్రీరామకృష్ణునే వెదకుచు బోయెను. గురుదేవుని పాట అతని మనసును దక్కగొన్నందున ఆ పాటనే ఇంకను ఇంకను విన వలయును అని ఆత్రపడుచుండెను. కడకు కాళి గుడికి ఎదుట నటమందిరములో పచారు చేయుచున్న గురుదేవుడు అతని కంట బడెను. గర్భాలయములో లోకమాతృమూర్తికి ఇరువైపులను దీపములు వెలుగుచు ఉండినవి. నటమందిరమున ఒకటే దీపము ఉండెను. దాని వెలుతురును చీకటియును గలసినందున

అద్భుతము ఐన ఒకరకపు సందెవెలుగు ఏర్పడినది. అందులో గురుదేవుని మూర్తి అస్పష్టముగ కనఁబడుచుండెను.

గురుదేవుని మధుర గానమును ఇంకను విన వలయును అనేడి వెఱ్ఱి, మహేంద్రునకు తీవ్రముగ ఉండెను. ఆ సాయంకాలము ఇంకను పాటలు ఏవైన ఉండునా అని అడుగుటకు కొంత జంకుచునే అడిగెను. శ్రీరామకృష్ణుడు ఆలోచించుకొని "ఈ రాత్రికి ఇక పాటలు లేవు" అనెను. ఇంతలో గురుదేవునకు ఒక సంగతి జ్ఞప్తికి రాగా మహేంద్రునితో "నేను కలకత్తాలో బలరామబోసునింటికి బోవుచున్నాను. అక్కడికి రమ్ము, నా పాటలను విన వచ్చును" అనెను. మహేంద్రుడు వత్తును అని అంగీకరించెను.

గురుదేవుడు — నీవు బలరామబోసును ఎఱుగుదువా?

మ — నేను ఎఱుగను, స్వామీ.

గురుదేవుడు — ఆయన బస బోస్పారాలో.

మ — సరే, నేను కనుగొందును లెండు.

ఆ చావడిలో మహేంద్రునితో పచారుచేయుచు శ్రీరామకృష్ణుడు ఇట్లు అనెను — "అనుమతింతు వేని నిన్ను ఒక సంగతి అడిగెదను — నన్ను గూర్చి నీ యభిప్రాయము ఏమి?"

మహేంద్రుడు ఊరకుండెను. మరల శ్రీరామకృష్ణుడు "నన్ను గూర్చి నీ యభిప్రాయము ఏమి? దేవుని గూర్చిన జ్ఞానము నాలో నూటికి ఎన్నవ పాలు ఉన్నది?" అని ప్రశ్నించెను.

మ — నూటికి ఎన్నవ పాలు అని అడుగుటలో మీ భావము ఏమో నాకు తెలియదు. నాకు గట్టిగ తెలిసినది ఇంతే, ఏమి అనగా, ఇట్టి జ్ఞానము, ఇట్టి భక్తిపరవశత, దేవునిలో ఇంతటి విశ్వాసము, ఇంతటి వైరాగ్యమును, ఇంతటి దృఢవైశాల్యమును ఇంతవఱకు వేఱు ఎచ్చటను నేను చూచి యుండ లేదు.

గురుదేవుడు నవ్వెను.

మహేంద్రుడు ప్రణమిల్లి వీడ్కొనెను. కాని ప్రధానద్వారము నొద్దకు పోవునప్పటికి అతనికి ఏదో సంగతి తటాలున జ్ఞప్తికి వచ్చెను. వెంటనే అతడు వెనుదిరిగి, అప్పటి కింకను నటమందిరము నొద్దనే ఉన్న శ్రీరామకృష్ణునొద్దకు వచ్చెను. అడవిలో అసహాయముగ వసించుచు సంచరించు సింహామువలె శ్రీరామకృష్ణుడు మసక మసకగా ఉన్న ఆ వెలుతురులో ఆత్మానుభవపరవశుడై చావడిలో పచారు చేయుచుండెను.

నోరు తెరవకే ఆశ్చర్యపడుచు మహేంద్రుడు ఆ మహాత్ముని తేటిపాఱ చూచెను.

గురుదేవుడు — (మహేంద్రునితో) ఎందులకు వెనుదిరిగి వచ్చితివి?

మ — మీరు నన్ను రమ్మన్న యింటి అతడు సంపన్నుడు కాబోలును. అచటివారు నన్ను లోనికి రానీయ రేమో! అచటికి రాకుండుటే మేలు అని నాకు తోచుచున్నది. మిమ్ము ఇచ్చట కలిసి కొనుటే నాకు ప్రియము.

గురుదేవుడు — కా దోయి, ఎందులకు ఆలాగు అనుకొందువు? నా పేరును జెప్పుము, చాలును. నన్ను జూడ వచ్చితిని అనుము. ఎవరో ఒకరు నిన్ను నాకడకు చేర్తురు.

మహేంద్రుడు సరే అని తల ఊపి గురుదేవునకు ప్రణమిల్లి వీడ్కొనెను.



రెండవ ప్రకరణము

# విద్యాసాగరుని దర్శించుట

శనివారము తే 5 ది ఆగస్టు 1882

ఈశ్వరచంద్రవిద్యాసాగరపండితుని జన్మగ్రామము ఐన జీర్సింగునకును, శ్రీరామకృష్ణుని జన్మగ్రామము ఐన కామార్పుకురునకును, చాల దూరము లేదు. విద్యాసాగరుడు గొప్పపండితుడు అనియు, రచయిత అనియు, పరోపకారపారీణుడు అనియు, ప్రఖ్యాతి గలదు. నవ్య వంగవాఙ్మయ నిర్మాతలలో, అతడు ఒకడు. అతడు సంస్కృతవ్యాకరణమును సాహిత్యమును క్షుణ్ణముగ చదివినవాడు. అతని వచ్చుబడిలో విశేషభాగము వితంతువులను, దిక్కు లేని బిడ్డలను, బీదవిద్యార్థులను, వేఱు రకముల అర్థులను ఉద్దేశించి — విరాళములు ఇచ్చుటకే వినియుక్తము అగుచుండెను. ఇట్టి త్యాగశీలముచే, అతనిపేరు, పల్లెప్రజలకు, ఇంటింటను సదా స్మరణీయము అయ్యెను. అతని కృప, కేవలము మానవుల పట్ల మాత్రమే కాదు. పాలు దూడలకు ఉండనీ అనుచు, ఆయన, పెక్కు ఏండ్ల పాటు, తాను పాలు త్రాగక ఉండెను. గుఱ్ఱములకు శ్రమ గలిగింప రాదు అనెడి తలంపుచేత, ఆయన గుఱ్ఱపుబండ్లలో సంచరించుట మానెను. అప్రకంప్యము ఐన మనోబలము ఆయనది. కావుననే, అధికారులకును తనకును భేదాభిప్రాయములు గలిగిన వెంటనే, ఆయన, తనకు ఎంతో ఆదాయకరమై ఉండిన కలకత్తా సంస్కృత కళాశాలాధ్యక్షపదవిని, వదలుకొనెను. విశేషించి అతని మాతృభక్తి అతిగాఢము ఐనది. సోదరుని పెండ్లికి అతడు తప్పక ఉండవలెను అని, అతని తల్లి కోరినది. పెండ్లి జరుగు చోటికి పోవు దారిలో, ఒకనది, ఉప్పొంగి, గట్లు ఒరసికొనుచు, ప్రవహించుచుండినది. దాటుటకు పడవ దొరకలేదు. అతడు ప్రాణములకు తెగించి, ఈదుకొని పోయి, ఆవలి గట్టును

చేరి, పెండ్లికి హాజరు అయ్యెను. అతని జీవితము అంతయు, కేవలము అకృత్రిమము ఐనది. అపారవైదుష్యమును జూచియే, విద్యాసాగరుడు అను బిరుదము అతనికి అర్పితము అయ్యెను.

ఈశ్వరచంద్రవిద్యాసాగరుని దర్శింపవలెను అను కోరిక, శ్రీరామకృష్ణునకు చిరకాలముగ ఉండెను. విద్యాసాగరుని పాఠశాలలోని ఉపాధ్యాయులలో తాను ఒకడను అని, మహేంద్రుడు విన్నవించెను. ఆ సంగతి తెలియవచ్చినవెంటనే, గురుదేవుడు విద్యాసాగరుని చూడవలెను అను తన ఆతురమును, మహేంద్రునకు దెలిపి, "నన్ను ఆయనయొద్దకు పిలుచుకొనిపోవుటకు నీకు వీలు అగునా" అని అతనిని అడిగెను. శ్రీరామకృష్ణుని కోరికను, మహేంద్రుడు ఈశ్వరచంద్రునకు ఎఱింగించెను. పండితుడో, సంతోషముతో సమ్మతించి, మహేంద్రునితో "గురుదేవుని, ఏదైన ఒక శనివారమునాడు, సాయంకాలము నాలుగు గంటలప్పుడు, తోడ్కొని రమ్ము" అనెను, గురుదేవుడు ఎట్టి పరమహంసయో తెలిసికొందము అను కుతూహలము మాత్రము ఉండుటచే, "ఆయన కాషాయ వస్త్రములు ధరించునా" అని అడిగెను. మహేంద్రుడు, 'కాషాయమును ధరింపడు, ఆయన ఒక అరుదైన వ్యక్తి. ఎఱ్ఱంచు వస్త్రమును, నిగనిగని కాలిజోళ్లను, ఆయన ధరించును. రాణి రాస్మణిగారి దేవాలయారామము నందలి ఒక గది, ఆయన బస. ఆ గదిలో ఒక మంచము, ఒక కంబళము, ఒక దోమతెరయు, ఉన్నవి. ఆయన పవిత్రతకు, బాహ్యసూచన ఏమియు లేదు. కాని దేవుని తప్ప, ఆయన మఱి దేనినిగాని, ఎఱుగడు. రాత్రింబగళ్లు, ఆయనకు దేవుని తలంపే కాని, వేఱుతలంపు లేదు' అని బదులు చెప్పెను.

ఆగస్టునెల తే 5 ది మధ్యాహ్నము, గురుదేవుడు, దక్షిణేశ్వరమునుండి, ఒక బాడిగబండిలో, బయలుదేఱెను. భవనాథుడును, మహేంద్రుడును, హాజ్రాయు, ఆయనతో ఉండిరి. దక్షిణేశ్వరమునకు ఆఱు మైళ్ల దూరాన, కలకత్తా నగర మధ్యమున, బాదుర్బాగనులో ఉన్నది విద్యాసాగరుని భవనము. దారిలో, శ్రీరామకృష్ణుడు,

తోడివారితో సంభాషించుచుండెను. కాని వారి బండి విద్యాసాగరుని గృహమును సమీపింపగనే, ఆయన చిత్తవృత్తి తటాలున మారెను. దివ్యానందపరవశత ఆయనను పైకొనుచుండెను. దానిని గుర్తింపక మహేంద్రుడు ఆయనకు రాజారామమోహనరాయి వసించుచుండిన ఆరామభవనమును జూపెను. గురుదేవునకు ఆ ప్రసంగము దుస్సహముగ ఉండుటచే, "ఆ సంగతులతో నాకు అక్కఱ లేదు" అనెను. ఆయన పరవశత గాఢము అగుచుండెను.

విద్యాసాగరుని యింటి ముంగిట బండి ఆగెను. మహేంద్రుని ప్రాపున గురుదేవుడు బండినుండి దిగెను. మహేంద్రుడే దారి చూపుచు, ముందుగ పోవుచుండెను. తోటలో పూలతీగలు అనేకములు ఉండినవి. గృహమును సమీపించుచు గురుదేవుడు ఒక బాలుని వలె తన చొక్కా గుండీలను జూపుచు "నేను నా చొక్కాకు గుండీలు వేసికో లేదు. దీనికి విద్యాసాగరుడు కోపించునా?" అని మహేంద్రుని అడిగెను. మహేంద్రుడు "ఎంతమాత్రమును కోపింపడు. ఆ దిగులే మీకు అక్కఱ లేదు. మీకు సంబంధించినది ఏదియు ఆయనకు కోపము కొలుపదు. మీ చొక్కాకు మీరు గుండీలు వేసికొన నక్కఱ లేదు" అనెను. ఆయన పసివానివలె ఆ అభయవాక్కును అంగీకరించెను.

విద్యాసాగరునకు వయస్సు సుమారు అఱువదిరెండు ఏండ్లు, అనగా గురుదేవుని కంటె పదునాలో పదునేడో సంవత్సరములు ఆయన పెద్ద. ఆయనయింటికి రెండు అంతస్తులు. అది ఆంగ్లపద్ధతిలో నిర్మితమై ఉండెను. దానిచుట్టును పచ్చికబయళ్లును ఎత్తైన గోడయు ఉండెను. మేడమెట్లు ఎక్కి శ్రీరామకృష్ణుడును, ఆయన భక్తులును రెండవ అంతస్తున ఒకగదిలో ప్రవేశించిరి. ఆ గది కొట్ట కొసన, వీరికి ఎదుట, విద్యాసాగరుడు ఆసీనుడై ఉండెను. అతనికి ఎదుట ఒక మేజా ఉండెను. దానికి కుడివైపు ఒక బల్ల ఉండెను. కొందఱు మిత్రులు తక్కిన యిరు వైపుల ఉన్న కుర్చీలలో కూర్చుండిరి.

విద్యాసాగరుడు గురుదేవుని ఎదుర్కొనుటకై లేచెను. శ్రీరామకృష్ణుడు మేజాపై ఒక చేతిని ఊనుకొని బల్లకు ఎదుట నిలబడెను; విద్యాసాగరుని వైపు పూర్వపరిచితునట్లు తేరిపాఱ జూచి, ఆమనఃపరవశతలోనే చిఱునవ్వు నవ్వెను. ఆ దశలో ఆయన కొన్ని నిమిషములు ఉండెను. అప్పు డప్పుడు బాహ్యస్మృతి మరల పొందుటకై ఆయన 'త్రాగుటకు మంచినీరు కావలెను' అనుచుండెను.

ఈలోగా ఆ యింటిలోని వయసువారును కొందఱు మిత్రులును విద్యాసాగరుని బంధువులును అక్కడ మూగిరి. శ్రీరామకృష్ణుడు ఇంకను పరవశుడుగనే, బల్లపై కూర్చుండెను. దానిపై పదునేడు పదునెనిమిది సంవత్సరముల పసివాడు ఒకడు ఆసీనుడై ఉండెను. తన చదువునకు విద్యాసాగరుని ధనసాహాయ్యమును అడుగుటకై అతడు అచ్చటికి వచ్చి యుండెను. ఆబాలునకు కొంతదూరమున తాను కూర్చుండి గురుదేవుడు పరాకుతోనే "జననీ, ఈబాలునకు ప్రాపంచిక విషయములలో గల సంగము అతిమాత్రము ఐనది. నీ యేలుబడి లోని అజ్ఞానప్రపంచమునకు చెందినవాడు ఇతడు" అని అనుచుండెను.

విద్యాసాగరుడు మంచినీరు తెమ్మని ఒకనిని పంపి, 'మధుర భక్ష్యములు ఏవైన గురుదేవుడు ఇష్టపడునా' అని మహేంద్రుని అడిగెను. మానముచే మహేంద్రుడు 'ఇష్టపడును' అని సూచింపగా, విద్యాసాగరుడు స్వయముగ ఆత్రముతో లోనికి ఏగి భక్ష్యములను దెచ్చి గురుదేవుని ఎదుట ఉంచెను. హాజ్రాభవనాథులును అందు పాల్గొనిరి. వారు మహేంద్రునకు కొన్ని భక్ష్యములను ఈయబూనగా విద్యాసాగరుడు "ఆయన మా కుటుంబములో ఒకడు. ఆయనను గూర్చిన చింత మీకు అక్కఱలేదు" అనెను. గురుదేవుడు ఒక యువభక్తుని జూపి ఇట్లు అనెను — "ఆ యువకుడు మంచివాడు. అతడు ఫల్గు నదిని బోలిన వాడు, పై పైన ఇసుక ఉండును. కొంచెము త్రవ్విన నీటిజల అడుగున కానంబడును."

కొన్ని భక్ష్యములను ఆరగించి గురుదేవుడు చిఱునవ్వుతో విద్యాసాగరునితో సంభాషింప మొదలిడెను. ఇంతలో గది ప్రజలతో నిండిపోయెను. కొందఱు నిలుచుండిరి, ఇతరులు కూర్చుండిరి.

గురుదేవుడు — భళీ! తుదకు ఈ నాటికి 'సాగరు'ని సమీపించితిని. ఇన్నాళ్లును నేను చూచినవి ఎల్ల కాలువలును పడియలునే, లేదా, నదిని జూచిన చూచి ఉందు నేమో! కాని నేను సముద్రునకు, సాగరునకు ఎట్టయెదుట ఉన్నాను. (అందఱును నవ్వుదురు).

విద్యాసాగరుడు — (చిఱునవ్వుతో) అటు లేని ఈ ఉప్పు నీటిని కొంచెము మీ యింటికి కొనిపొండి. (నవ్వు)

గురుదేవుడు — కాదు కాదు, ఉప్పు నీరు ఏల? నీవు అజ్ఞాన సముద్రుడవు కావు, విద్యాసాగరుడవు, జ్ఞానసముద్రుడవు. నీవు చిక్కనైన క్షీరసముద్రుడవు. (అందఱును నవ్వుదురు).

విద్యాసాగరుడు — మీరు అట్లు అన వచ్చును.

పండితుడు మౌనము వహించెను. శ్రీరామకృష్ణుడు ఇట్లు అనెను — "మీ పనులకు ఎల్ల, ప్రేరకము సత్త్వమే. వానికి రాజసత్త్వము ఉన్నను, వానిపై సత్త్వప్రభావము ఉన్నది. సత్త్వము నుండియే అనుకంప పుట్టును. పరుల మేలుకై పాటుపడుట రజోగుణమునకు సంబంధించినది ఐనను, ఆ రజోగుణమునకు సత్త్వగుణము ఆధారమై ఉన్నందున అది చెఱుపు చేయదు. శుకుడు మొదలైన మహర్షులు పరమకృపాళువులై లోకులకు ఆస్తిక్యమును కఱపి దేవుని గుఱించి బోధించిరి. నీవు అన్నదానములను విద్యాదానములను చేయుచున్నావు. అవియు మంచివే. నిస్స్వార్థబుద్ధితో ఈ పనులను చేసిన ఇవే భగవంతుని ప్రాపింప జేయును. కాని, ప్రాయికముగా లోకులు పుణ్యమునకు అనియు పేరునకు అనియునే పాటువడుదురు. వారి పనులు స్వార్థరహితములు కావు.

"వట్టి పండితులు చెడి, గట్టిపాఱి, పండనే పండని, కాయలను పోలిన వారు. అట్టి కాయకు, పచ్చని కాయకు ఉన్న క్రొత్తదనము కాని, పండినదానికి ఉన్న రుచికాని లేదు. గ్రద్దలు ఎంత పైకి ఎగిరి నను వాని కన్నులు నేల మీాది క్రుళ్లిన మాంసముపైనే లగ్నములై ఉండును. గ్రంథపాండిత్యము గల వారికి బుద్ధిమంతులు అను పేరు ఉండును గాని, కామినీకాంచనసక్తి వారిని వీడదు. క్రుళ్లిన మాంస మునకై వారును గ్రద్దలవలె వెదకుచుందురు. అజ్ఞానప్రపంచముపైనే వారి తగులాటము. అనుకంపయు, భగవద్భక్తియు, వైరాగ్యమునే పారమార్థిక జ్ఞానపు మహోజ్జ్వల లక్షణములు."

విద్యాసాగరుడు ఈ మాటలను మౌనముతోనే వినెను. ఇతరులును గురుదేవుని తెప్ప వ్రాల్పక చూచుచు అతని నోట వెలు వడిన ఒక్కొక్క మాటను ఆసాసగ వినుచుండిరి.

విద్యాసాగరుడు ఆస్తిక్యమును ఇతరులకు అంత ధారాళముగ గలుపు వాడు కాడు. ఆయన హిందూతత్త్వశాస్త్రమును చదివి యుండెను. "ఆ శాస్త్రమునుగూర్చి నీ యభిప్రాయము ఏమి" అని మహేంద్రుడు ఒకప్పుడు అడుగగా విద్యాసాగరుడు "మన తత్త్వ శాస్త్రకారులు వివరింప నెంచిన దానిని వివరింప లేక పోయిరి అని నా యభిప్రాయము" అని బదులు చెప్పి ఉండెను. కాని, ఆయన యజ్ఞోపవీతమును తీసివేయ లేదు. వర్ణాశ్రమ నిత్య కర్మానుష్ఠాన మును నిర్వర్తించుచునే ఉండెను. దేవుని గుఱించి ఆయన ఇట్లు ఒక పరి చెప్పి ఉండెను — "దేవుని ఎఱుంగుట నిజముగ అసాధ్యమే. అగుచో మనము చేయవలసినది ఏమి? మనము ఎట్లు నడచుకొన్న, ఇతరులు ఎల్ల మనల అనుకరించుటచే, భువి దివి అగునో — అట్లు మనము నడచుకోవలె అని నాకు తోచుచున్నది. ప్రతిజీవియు లోక కల్యాణమునకై ప్రయత్నింప వలయును."

శ్రీరామకృష్ణుని సంభాషణలో బ్రహ్మజ్ఞానమును గుఱించిన ప్రసక్తి వచ్చెను.

గురుదేవుడు — ''బ్రహ్మము విద్యకును అవిద్యకును జ్ఞానమునకును అజ్ఞానమునకును అతీతము ఐనది. భేదభ్రాంతికిని మాయకును అతీతము ఐనది.''

''జగత్తు జ్ఞా నాజ్ఞాన భేదభ్రాంతికరము. అందు భక్తిజ్ఞానములు కలవు. కామినీకాంచనసక్తియు కలదు. ధర్మాధర్మములును మేలు కీళ్లును గలవు. కాని బ్రహ్మమునకు ఇవి అంటవు. మేలు కీళ్లేమి, ధర్మాధర్మము లేమి, జీవునకు, ప్రత్యగాత్మకు గలవే కాని బ్రహ్మముపై వీనికి ప్రభావము లేనే లేదు.''

''ఒక దీపము నెదుట ఒకడు భాగవతమును పఠింప వచ్చును. ఆ దీపము నెదుటనే వేఱు ఒకడు దొంగపత్రములను తయారుచేయ వచ్చును. దీపమునకు ఎట్టి మార్పును లేదు. సూర్యుడు తన వెలుగును శిష్టులపై ఎట్లో, దుష్టులపైని అట్లే ప్రసరింపజేయుచునే ఉండును.

''దుఃఖములకును, పాపములకును, కష్టములకును నీ సమాధానము ఏమి అని అడుగుదు రేమో! ఇదే నా సమాధానము. అవి జీవునకు మాత్రమే వర్తించును. వానివలన బ్రహ్మమునకు ఎట్టి పరిణామమును లేదు. పాములో విషము ఉన్నది. పాముకాటునకు గుఱి ఐన వారు అందఱును ఆ విషముచే చత్తురు. కాని, పామును ఆ విషము ఏమియును చేయదు.

బ్రహ్మము ఇట్టిది అని నిర్వచించుట సాధ్యము కాదు, వేదములు, పురాణములు, తంత్రములు, షడ్దర్శనములు (మొదలుగా) లోకములోనివి అన్నియు ఎంగిలి కూటివలె మైలపడినవి. ఇంతవఱకు అట్లు మైలపడనిది ఒక్కటే, అదే బ్రహ్మము, బ్రహ్మము ఇట్టిది అని చెప్పగలవారు ఎవ్వరును ఇంతవఱకును లేరు.''

విద్యాసాగరుడు — (తన మిత్రులతో) — అహా! అద్భుతమైన సూక్తి. కొంత క్రొత్త సంగతినే నేడు నేను నేర్చుకొంటిని.

గురుదేవుడు — ఒకానొకనికి ఇద్దఱు కొడుకులు ఉండిరి. 'బ్రహ్మజ్ఞానమును అలవఱచుకొనుడు' అని తండ్రి, కొడుకులను ఒక గురువునొద్దకు అంపెను. కొన్ని సంవత్సరములు గడచిన పిమ్మట వారు గురుగృహమునుండి మరలి వచ్చి తండ్రికి ప్రణమిల్లిరి. ఎవరి బ్రహ్మజ్ఞానము ఎంతో తెలిసికో గోరి తండ్రి మొదట పెద్దకుమారునితో "అబ్బాయీ, అన్ని వేదాలను చదివి వచ్చితివి. బ్రహ్మము అన ఎట్టిదో ఇప్పుడు నాకు చెప్పుము" అనెను. బ్రహ్మమును వివరించుటకై బాలుడు వివిధ శ్రుతివాక్యాలను ఏకరువు పెట్ట సాగెను. తండ్రి ఏమియు పలుక లేదు. పెద్దవానిని అడిగిన ప్రశ్న నే, తరువాత పిన్న కొడుకును అడిగెను. ఆ బాలుడు నోరు తెరవక క్రీజూపులతో మౌనము వహించి ఉండెను. పెదవులనుండి ఒక్క మాట ఐనను వెలువడ లేదు. తండ్రి పరమసంతోషముతో "నాయనా, బ్రహ్మమును ఇంచించుక తెలిసికొన్నవాడవు నీవే. బ్రహ్మస్వరూపము మాటలకు అందునది కాదు" అని అభినందించెను.

బ్రహ్మమును సమగ్రముగ దెలిసికొంటిమి అని కొందఱు తఱచు తలచుచుందురు. ఒకప్పుడు ఒక చీమ ఒక చక్కెరకొండ యొద్దకు పోయిన దట. చక్కెరలోని ఒక్కరవతో దాని కడుపు నిండెను. మఱి యొక్కరవను నోట కఱచుకొని అది ఇంటికి బయలుదేరినది. దారిలో వచ్చుచున్నప్పుడు "ఈ తూరి ఆ కొండనే ఇంటికి చేర్చుకొందును" అనుకొన్న దట. సంకుచిత చిత్తుల తలంపులు అట్లు ఉండును. బ్రహ్మము, మాటలకును మనస్సులకును అందనిది అని వారు ఎఱుంగరు. మానవుడు ఎంత గొప్పవాడు ఐనను అగును గాక, బ్రహ్మమునుగూర్చి అతడు గ్రహింప గలిగినది ఎంత? శ్రీశుకదేవుడును ఆయనవంటి మహర్షులును చీమలలో పెద్ద చీమలు కా వచ్చును. వారు ఐనను ఎనిమిది పది రవల కంటె ఎక్కువ చక్కెరను మోయ లేరు.

వేదములును పురాణములును గావించు ప్రతిపాదనలు ఎట్టివో నీవు ఎఱుగుదువా? ఒకడు సముద్రమును జూచెను అనుకొనుము.

'ఎట్లు ఉన్నది సముద్రము' అని ఎవ రైన అడిగిన, చూచిన యాతడు నోటిని ఎంత తెఱవ గలడో అంత తెఱచి "ఆహా! ఏమి దృశ్యము! ఏమి భయంకరము లైన అలలు! ఏమి ఘోష!" అనును. వేదముల లోని బ్రహ్మప్రతిపాదనము అట్లు ఉండును. బ్రహ్మము ఆనందమయము అని, సచ్చిదానందము అని వేదములు చెప్పుచున్నవి.

శుకాది మహర్షులు బ్రహ్మము అనెడి సముద్రమునకు తీరమున నిలిచి ఆ జలమును జూచినవారును, స్పృశించినవారును. ఆ సముద్ర ములో వారు ఎన్నడును మునుగనే లేదు అని కొందఱు అందురు. మునిగినవారు ఈలోకమునకు మరలి రాలేరు.

బ్రహ్మజ్ఞానప్రాప్తియు బ్రహ్మసాక్షాత్కారమును సమాధి దశలో కలుగును. ఆ దశలో తర్కము పూర్తిగ ఆగి పోవును, మానవుని మౌనము ఆవహించును, బ్రహ్మస్వరూపమును వర్ణించు శక్తి అతనికి లేదు.

ఒకప్పుడు ఉప్పుబొమ్మ ఒకటి సముద్రపు లోతును కొలువ బోయె నట. (అందఱును నవ్వుదురు). సముద్రము ఎంత లోతో ఇతరులకు తెలుప వలెను అను కోరిక దానికి ఉండెను, కాని, పాపము, ఎప్పటికిని తెలుప లేకయే పోయెను. ఏల యన, నీట జొచ్చిన వెంటనే అది కరగి పోయెను. ఇక లోతును తెలుపుటకు ఎవరు ఉన్నారు?

ఒక భక్తుడు — సమాధిదశలో ఒకనికి బ్రహ్మజ్ఞానప్రాప్తి కలిగినది అనుకొందము. ఇక అతడు మాటాడనే లేడా?

గురుదేవుడు — శంకరాచార్యులవారు లోకులకు ఉపదేశము చేయుటకై జ్ఞానాహంకారమును నిలుపుకొనిరి. బ్రహ్మను సాక్షాత్క రించుకొన్న వెంటనే మానవుడు మౌని అగును. అతని తర్కములు ఎల్ల సాక్షాత్కారసిద్ధి కలుగక ఉండునంత వఱకే. పెనముపై వెన్నను ఉంచి ప్రొయిమీాద పెట్టిన అందులో ఉన్న నీరు ఇగురు వఱకు కుతకుత ధ్వని వినబడుచుండును. నీరు పూర్తిగా ఇగిరిపోయిన

పిమ్మట వెన్నలో చప్పుడే ఉండదు. ఆ వెన్నలో పచ్చి పిండిముద్దను వేయుదు వేని మరల కుతకుత ధ్వని గలుగును. ఆపిండివంటకము పక్వము ఐన పిదప మరల నిశ్శబ్దత కలుగును. అట్లే సమాధిదశయందు ఉన్న మానవుడు, లోకులకు ఉపదేశించుటకై ద్వంద్వరంగమునకు అవతరించి, దేవుని గురించి ప్రసంగింప దొరకొనును.

పుష్పముమీద కూర్చుండుటకు ముందు తుమ్మెద ఝుంకరించు చుండును, తేనెను గ్రోల ఆరంభింపగనే, నిశ్శబ్దము అగును. కాని, ఒక్కొక్కప్పుడు తేనె మత్తు ఎక్కి, మరలఝుంకరించును. ఖాళీబుంగను నీట ముంచిన బుడ బుడ చప్పుడు అగును. దానిలో నీరు నిండగనే చప్పుడు ఉడుగును. [అందఱును నవ్వుదురు]. నీటిని, ఆబుంగనుండి వేఱు ఒక ఖాళీ బుంగలోనికి పోయునపుడు, మరల చప్పుడు వినవగును.

ప్రాచీనమహర్షులు బ్రహ్మజ్ఞానము గడించిరి. ఐహికపరత జాడగానైన ఉన్నంతవఱకును, బ్రహ్మజ్ఞానము కలుగదు. ఋషులు ఎంత తపస్సు చేసెడివారు! వేకువనే ఆశ్రమములనుండి దూరముగ పోయి, దినము అంతయును ఏకాంతమున బ్రహ్మమునుగూర్చి ధ్యానిం చుచు గడపెడి వారు. రాత్రులందు, పర్ణశాలలకు మరలి వచ్చి, ఫలములను మూలములను ఆరగించెడివారు. త్వక్ చక్షు శ్రోత్రా దులకు విషయములు ఐన వానినుండియును, తక్కిన ప్రాపంచిక వస్తు వులనుండియును, వారు తమ మనస్సులను దూరముగ పెట్టి ఉండిరి. బ్రహ్మమును వారు తమలోనే ఈలాగుననే సాక్షాత్కరించుకొనిరి.

కలియుగమున మానవునకు తిండియే ప్రాణాధారము. కావున, అతడు దేహాత్మభ్రాంతిని పూర్తిగ దులుపుకో లేడు. ఇట్టిపరిస్థితిలో, 'సోఽహం' 'నేను అతడను' అని చెప్పుట అతనికి ఉచితముకాదు. అన్ని రకముల లౌకికవ్యాపారములను చేయుచున్నంతవఱకును 'నేను బ్రహ్మమనే' అని మానవుడు చెప్ప గూడదు. ఐహిక విషయ సంగ మును విడువలేనివారును, అహంకారమును దొలగించుకొనుటకు దారియే లేని వారును, "మేము భగవద్దాసులము, మేము భగవ

ద్భక్తులము" అని చెప్పుకొనుట మేలు. భక్తిమార్గమునగూడ భగవంతుని ప్రాపించుట శక్యమే.

'ఇది కాదు' 'ఇది కాదు' అని వివేచించు జ్ఞాని ఐహికవిషయములతోడి తాదాత్మ్యమును వదలుకొనును. అప్పుడే అతనికి బ్రహ్మమును ప్రాపింప సాధ్యము అగును. ఒక్కొక్క మెట్టుగా నిచ్చెనను ఎక్కి, ఇంటి పైకప్పు మీందికి చేరుకొనుట వంటిది అది. విజ్ఞానికి, బ్రహ్మపరిచయము ఇంకను గాఢము. అతనికి గలుగు సాక్షాత్కారము ఇంకను హెచ్చు. ఇంటి పైకప్పును, దాని మీదికి జేర్చు మెట్లును ఏకపదార్థముతో రూపొందినవే — అని అతడు గుర్తించును. అక్కడివియు ఇక్కడివియు ఐన యిటికలు, సున్నము, మట్టి, అభిన్నములే. 'ఇది కాదు' 'ఇది కాదు' అని త్రోసివేయుచు, హృదయ ప్రబోధముచేత తుదకు దేనిని బ్రహ్మము అని తెలిసికొనెనో, ఆ బ్రహ్మమే జగత్తుగను, అందలి ప్రాణులుగను, — పరిణమించినట్లు వెనువెంటనే అతడు తెలిసికొనును. నిర్గుణము ఐన తత్త్వమే సగుణముగను ఉండును అనుట విజ్ఞానికి స్పష్టపడును.

ఇంటి పైకప్పుపై, మానవుడు చాలసేపు ఉండ లేడు; మరల దిగి వచ్చును. సమాధిలో బ్రహ్మమును సాక్షాత్కరించుకొన్నవాడు, సమాధినుండి దిగిన పిమ్మట కూడ, బ్రహ్మమే జగత్తుగను, అందలిప్రాణులుగను పరిణమించినట్లు గుర్తించును. సంగీతమానమున 'సరిగమపధని' అను స్వరములు కలవు. ఎవడును 'ని' స్వరముపై తన కంఠమును దీర్ఘకాలము నిలుప లేడు. అహంకారము పూర్తిగ మాసి పోదు. సమాధినుండి మగుడగా అతనికి బ్రహ్మమే అహంకారముగను జగత్తుగను రూపొందెను అనుట ప్రత్యక్షము అగును. దానినే విజ్ఞానము అందురు.

జ్ఞానమార్గము పరమార్థమునకు జేర్చును. జ్ఞానమును భక్తియును గలిసిన మార్గము కూడ, అట్లే చేర్చును. భక్తిమార్గమును, ఆ గంతవ్యమునే చేర్చును. జ్ఞానమార్గము ఎంత మంచిదో,

భక్తిమార్గమును అంత మంచిదే. అన్ని మార్గాలును తుదకు ఒక్క-పరమార్థమునొద్దకే చేర్చును. అయినను, దేవుడు మనలో అహంకారమును ఉంచి యున్నంతవఱకును, భక్తిమార్గమును అనుసరించుట ఎక్కువ సులువు.

బ్రహ్మము సుమేరుపర్వతమువలె అప్రకంప్యముగను నిశ్చేష్టముగను విజ్ఞానిదృష్టికి అగపడును. ఈ జగత్తు త్రిగుణాత్మకము. సత్త్వరజస్తమములే ఆ మూడు గుణములు. అవి బ్రహ్మమందు ఉన్నవి, కాని బ్రహ్మమునకు సంగము లేదు.

బ్రహ్మము భగవంతుడు అనియు, రూపముగలవాడు అనియు కూడ విజ్ఞాని గుర్తించును. షడ్గుణైశ్వర్యయుతుడు అగు భగవంతుడే త్రిగుణాతీతుడు. జీవులు, జగత్తు, మనస్సు, బుద్ధి, భక్తి, త్యాగము, జ్ఞానము ఇవి అన్నియు భగవచ్ఛక్తియొక్క ఆవిష్కరణములే. [నవ్వుతో] ఒకదొరకు ఇల్లును ఆస్తియు లేకున్నప్పుడు గాని, వానిని అతడు అమ్ముకోవలసి వచ్చి అమ్ముకొన్న పిదప గాని, అతనిని 'దొర' అని ఎవరును పేర్కొనరు [అందఱును నవ్వుదురు]. దేవునకు అప్రాకృతశక్తులు అఱు ఉన్నవి. అవి ఆయనకు లేకున్న, ఆయనకు ఎవరు విధేయులుగ ఉందురు? [అందఱును నవ్వుదురు].

ఈ జగత్తు ఎంతరమ్యముగ ఉన్నదో చూడుము. ఎన్ని వస్తువులు ఉన్నవి! సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, ఎన్ని రకముల జీవులు! పెద్దవి, చిన్నవి, మంచివి, చెడ్డవి, బలము గలవి, బలము లేనివి, ఎక్కువశక్తి గలవి, తక్కువశక్తి గలవి —!

విద్యాసాగరుడు — కొందఱకు ఎక్కువ శక్తిని, కొందఱకు తక్కువ శక్తిని దేవుడే ఇచ్చి ఉన్నాడా?

గురుదేవుడు — దేవుడు సర్వాంతర్యామి, విశ్వవ్యాపి ఐన ఆత్మ. కావున చీమలో కూడ ఉన్నాడు. కాని భగవచ్ఛక్తి ఒక్కొక్కరీతిగా ప్రకటము అగుచు భేదిల్లుచు ఉండును. లేకున్నచో, ఒకడు పదుగురను తఱుమగొట్ట గలుగుటయు, వేఱు ఒక్కడు

ఒక్కనినే ఎదిరింప లేకుండుటయు, ఎట్లు శక్యము అగును? ప్రజలు అందఱును నిన్ను గౌరవింతురే, ఎందులకు? నీ కేమి రెండు కొమ్ములు మొలచినవా? [అందఱును నవ్వుదురు]. నీకు దయ ఎక్కువ, పాండిత్యము హెచ్చు, అందువలన ప్రజలు నిన్ను గౌరవింతురు. నీయొద్దకు వచ్చి మర్యాదలు చెల్లింతురు, కాదు అందువా?

విద్యాసాగరుడు చిఱునవ్వు నవ్వెను.

గురుదేవుడు ఇంకను ఇట్లు అనెను — వట్టి పాండిత్యములో ఏమియు లేదు. బ్రహ్మజ్ఞానమునకును బ్రహ్మసాక్షాత్కారమునకును ఉపాయమును కనుగొనుటే చదువునకు లక్ష్యము. ఒకానొక యోగి ఒక పుస్తకమును చాల జాగ్రత్తగ కాపాడుకొనుచుండెను. అందులో ఏమి ఉన్నది అని అడుగగా, ఆయన దానిని తెఱచి చూపెను. అన్ని పుటలయందును 'ఓం రామ' అను పదములే వ్రాయబడి ఉండెను. వేఱు ఏమియును లేదు.

గీతకు గల ప్రాముఖ్యము ఏమి? ఆ పదమును పదిసార్లు ఆవృత్తి చేసిన నీవు ఏమి కందువో, అదే దాని ప్రాముఖ్యము. అప్పుడు వర్ణములు విపర్యస్తములై 'తాగీ' అగును. 'తాగీ' అనగా, దేవునకై తక్కిన వానిని ఎల్ల త్యజించిన వాడు అని అర్థము. 'ఓ మానవుడా, అన్నింటిని విసర్జింపుము. దేవుని ఒక్కనినే ఆశ్రయింపుము'' — అనుటయే గీత చేసిన ఉపదేశము. సన్న్యాసి గాని గృహస్థుడు గాని మనస్సునుండి సర్వసంగములను దులిపి వేసికొన వలసినదే.

చైతన్యదేవుడు దక్షిణభారతదేశయాత్రకు బయలుదేఱెను. ఒకనాడు ఆయన గీతాపారాయణము చేయు చున్న ఒకనిని జూచెను. వేఱుఒకడు ఆపాఠకునకు కొంతదూరమున గూర్చుండి వినుచు ఏడ్చుచు ఉండెను. అతని కన్నులు బాష్పముల దేలుచు ఉండెను. ''నీకు ఇది అంతయు అర్థము అగుచున్నదా?'' అని చైతన్యదేవుడు అతనిని అడిగెను. ''స్వామీ, గ్రంథములోని పదము ఒక్కటి ఐనను నాకు అర్థము కాలేదు'' అని అతడు చెప్పెను. ''మఱి, నీవు ఎందులకు

ఏడ్చు చున్నావు?'' అని చైతన్యుడు అడిగెను. "గ్రంథమును నేను వినుచు ఉన్నప్పుడు అర్జునుని రథము నాకు ఎట్ట యెదుట కానిపించును. అర్జునుడును శ్రీకృష్ణభగవానుడును అందు ఆసీనులై మాటాడుచుండుటయు నాకు అగపడును. వానిని అంతయును జూచుటచేత నేను ఏడ్తును'' అని అతడు బదులు చెప్పెను.

దేవునియెడల విజ్ఞాని భక్తి గలిగి ఉండును. ఏల? ఏల యన, తాను అనెడి తలంపు ఇంకను ఉన్నది. ఆ యహంకారము సమాధి దశలో మాయము అగును అనుట నిజమే. కాని మరల వచ్చును. సామాన్యులకు అహంకారము ఎప్పుడును పోదు. అశ్వత్థవృక్షమును నీవు నేలమట్టము చేసినను, మరు దినమే క్రొత్త మొలకలు మొలచును. [అందఱును నవ్వుదురు].

జ్ఞానప్రాప్తి కలిగిన పిదప కూడ ఈ అహంకారము పైకి వచ్చును. ఎక్కడినుండి వచ్చునో ఎవ్వరును ఎఱుగరు. కలలో నీవు పెద్దపులిని చూతువు. వెంటనే మేలుకొందువు. కాని, నీ గుండె తటతట కొట్టుకొనుచునే ఉండును. మనము అనుభవించు కష్టములకు అన్నిటికిని కారణము ఈ అహంకారమే.

ఒకప్పుడు రాముడు హనుమంతుని "నన్ను నీవు ఏమని భావింతువు?'' అని అడిగె నట. హనుమంతుడు, "రామా, నేను అనెడి తలంపు ఉన్నంతవఱకును, నీవు అంగివి అని, నేను ఒక అంగమను అని భావింతును. నీవు స్వామివి, నేను దాసుడను అని భావింతును. కాని, రామా, పారమార్థిక జ్ఞానము గలిగిన పిదప నీవే నేను అని, నేనే నీవు అని గ్రహింతును'' అని బదులు చెప్పె నట.

ఈ స్వామికింకరసంబంధము ఉచితము ఐనదే. "నేను'' ఉండనే వలయు నేని, ఆ పోకిరి భగవత్కింకరుడుగ ఉండును గాక.

అహంకార మమకారములే అజ్ఞానము. నా యిల్లు, నా సొత్తు, నా చదువు, నా వస్తువులు అని ఇట్లు అంతయును చెప్పించునది అజ్ఞానమే. ఇందులకు విరుద్ధముగ జ్ఞాని వైఖరి ఎట్లు ఉండును అనగా,

"ఓ దేవా, నీవు స్వామివి. ఈ వస్తువులు అన్నియును నీవే. ఇల్లు కుటుంబము, పిల్లలు, పరిచారకులు, అందఱును నీ సొమ్మే.

ప్రతిప్రాణియును మరణమును సదా జ్ఞప్తియందు ఉంచుకొలయును. మరణానంతరము ఏదియు నిలువదు. పల్లెప్రజలు కలకత్తా నగరమునకు పనులు పాట్లు చూచుకొనుటకై వచ్చు నట్లు, మనము కొన్ని విధులను నిర్వర్తించుటకై ఈ లోకములో పుట్టినాము. ఒక సంపన్నుని తోటలోనికి చూడను వచ్చిన వానితో వనపాలకుడు "ఇది మా తోట, ఇది మా సరస్సు" అని ఇట్లు చెప్పుచుండును. ఏది ఐన ఒక అపరాధము కారణముగా ఆ వనపాలకునికి నౌకరి పోవు నేని, అతడు పనికి మాలిన తన మామిడికొయ్య పెట్టెను ఐనను తనతో గొనిపో లేడు. దానిని వాకిలి కాపరిచేత రహస్యముగ ఇచ్చి పంపును. [అందఱును నవ్వుదురు].

తర్కమును ఆధారపఱచుకొని, దేవుని ఎవ డైనను తెలిసికొగలడా? దేవునకు దాసుడవుగ ఉండుము. దేవునకు నిన్ను అర్పించుకొనుము. ఆ పిమ్మట దేవుని ప్రార్థింపుము.

[చిఱునవ్వుతో విద్యాసాగరుని వైపు తిరిగి] సరి, నీ అభిప్రాయము ఏమి?

విద్యాసాగరుడు — [చిఱునవ్వుతో] ఎన్నడో ఒకనాడు ఆ రహస్యమును నీకు తెల్పెదను లెమ్ము. [అందఱును నవ్వుదురు].

గురుదేవుడు — [నవ్వుచు] పాండిత్యతర్కములచే దేవుని తెలిసికొనుట సాధ్యము కాదు.

దివ్యభక్తిపరవశుడై గురుదేవుడు ఇట్లు పాడెను.

కాళిమాతను దెలియఁగఁ గలఁ డెవండు?
జనని కల రూపు నాఱు దర్శనము లయినఁ
జూపఁగా లేవు సుం తైన; శుచిత గలుగు
నాత్మయందునె యెల్ల యానంద మొందు

పరమ యోగివరుల కైన భవ్య హృదయ
ములను దేవి వెలయు నని తెలుపు శ్రుతులు;
తనదు సంకల్పమునె యూని, తల్లి సర్వ
జీవరాసుల లోపలఁ జెలఁగు చుండు.

ఇంకను ప్రసంగించుచు గురుదేవుడు ఇట్లు అనెను— "వింటిరా ఆ పాదమును? 'జనని కల రూపు నాఱు దర్శనము లయినఁ జూపఁగా లేవు సుంతైన'. వట్టి పాండిత్యముచేత దేవిని గనుగొన లేము. విశ్వాసమును భక్తియు అత్యావశ్యకములు. దేవునియందు విశ్వాసము ఉన్నచో, ఎంతటి ఘోర పాపము చేసి ఉండినను భయపడ నక్కఱ లేదు.

భక్తిమార్గమున దేవుని బొందుట సులభము. భక్తిపరవశ దశలో దేవుని అర్థము చేసికొన వీలు అగును." ఇట్లు పలికి గురుదేవుడు మరల పాడెను—

స్వామి నెఱుఁగంగ నో నాదు స్వాంతమ, మఱి
నీవు సల్పెడి యత్నముం దెల్ప వోయి;
చీకటింటను బంధనం జెంది నీవు
వెఱ్ఱిదానవు బోలెను వెదకు చుంటి.
పరమభక్తియె మార్గము పరము నెఱుఁగ;
భక్తి లే కున్నచో దేవు బాగుగాను
గొలువఁగా నేరి కైనను గొలఁది యగునె?
వేద మేటికి? తంత్రముల్ వేయు నేల?
ఆఱు దర్శనముల్ గూడ నగును వృథయె;
లేఁడు లేఁ డన్న వారికి లేఁడు లేఁడు;
కలఁడు కలఁ డన్న వారికే కల్గఁడు స్వామి;
పరము నలరించు నమృతంబు భక్తి యొకటె,
శాశ్వతానందమును జెందు చతఁడు మనదు
దేహముల గూఢముగ నుంట దెలియు, మనస,

యుగయుగంబుల యోగులు యోగ సాధ
నంబు సల్పుదు రా భక్తి నాత్మఁ గోరి;
భక్తి గల్గిన వెంటనే భక్తవరదుఁ
డట్టి జీవులఁ దన వంక కదుముకొనును,
ఇనుము సూదంటురాయి తా నీడ్చు నటుల;
గుట్టు నంతయు నే నిప్డు రట్టు వఱుప
వలయునే? కొంత సూచన వరలఁ జేసి
తి; నిదిగో నాశ్రయింపుము దీని, మనస,
దేవు కల రూపు నూహింపు దీనిఁ బట్టి
అట్టి దేవుని 'నా తల్లి యంచు నేను
చేరఁ బోవుదు' నంచుఁ దాఁ జెప్పెఁ గాదె
సాధుశీలుఁడు రామప్రసాదబాబు!

పాట పాడుచు గురుదేవుడు సమాధిమగ్నుడు అయ్యెను. ఆయన పశ్చిమాభిముఖుడై, ఘటితాంజలియై బల్లపై కూర్చుండి ఉండెను. ఆయన శరీరము, కదలిక లేక, నిగుడుకొని ఉండెను. ప్రతివాడును ఆయనను కుతూహలముతో జూచుచుండెను. విద్యాసాగరుడు నోట మాట వెలువడక తన చూపులను గురుదేవునుండి మరల్చుకొన లేకుండెను.

కొంతసేపటికి శ్రీరామకృష్ణునకు మామూలు స్పృహ మరల కలుగు చున్న జాడలు పొడకట్టెను. ఆయన దీర్ఘముగ ఉచ్ఛ్వసించి చిఱునవ్వుతో ఇట్లు అనెను — శ్రద్ధయు భక్తిపరవశతయునే భగవత్సాక్షాత్కారమునకు ఉపాయములు. అనగా, దేవుని తప్పక ప్రేమింపవలెను అనుట. బ్రహ్మమును తల్లీ అని సంబోధించుటను గుర్తించితిరా? —

అట్టి దేవుని 'నా తల్లి యంచు నేను
చేరఁ బోవుదు' నంచుఁ దాఁ జెప్పెఁ గాదె
సాధుశీలుడు రామప్రసాదబాబు.

దేవుని స్వభావమును ఊహింపుము అని రామప్రసాదు తన మనసునే కోరుచున్నాడు. వేదములు పేరుకొన్న బ్రహ్మమునే తాను 'తల్లీ' అని సంబోధించితిని అని అతడు తన మనసునకు దెలుపుకొనుచున్నాడు. ఎవడు నిర్గుణుడో సగుణుడును అతడే. ఏది బ్రహ్మమో, శక్తియు అదియే. దైవమును చేష్టాశూన్యముగా భావించినప్పుడు అది బ్రహ్మ మనంబడును. దాని సృష్టి స్థితి సంహార కర్తృత్వమును భావించి నప్పుడు, ఆ దైవమే ఆదిశక్తి కాళి అనబడును.

అగ్నియును దాని దాహశక్తియును అభిన్నములు ఐనట్లు బ్రహ్మమును శక్తియు అభిన్నులు. నిప్పు అన్నప్పుడు దాహశక్తియును మనకు వివక్షితమే. దాహశక్తి అన్నప్పుడు నిప్పునకును స్ఫూర్తి కలదు. ఏ యొక్క-దానిని నీవు అంగీకరించినను రెండవదానిని కూడ అంగీకరింపక తప్పదు. తల్లీ అను సంబోధనము బ్రహ్మమునకే. ఏల అన, తల్లి ఆత్యంతిక ప్రేమకు లక్ష్యము. ప్రేమమార్గమున భగవత్సాక్షాత్కారము సాధ్యము అగును. భావోద్రేకము, శ్రద్ధ, భక్తి, విశ్వాసము — ఇవి ఉపాయములు. ఈ పాటను వినుడు —

ధ్యాన మది యెంతో, భక్తి దా నంతె గలుగు,
భక్తి యది యెంతొ ప్రాప్తియుఁ బరఁగు నంతె,
సర్వమూలము చూవె విశ్వాస మిలను,
అమ్మ కాళి పాదము లను నమృతసరసి
నోలలాడుచు నా హృది యొప్పు నేని,
పూజ యేల? నివేదనల్ పుణ్య క్రతువు
లన్నియును నేల నా కింక నరసి చూడ?

దేవుని గాఢముగ ప్రేమింప వలెను. దేవునిలో నిమగ్నులము కావలెను. అదియే కావలసినది. అమృతసరసి అమృతసరసియే. అందు మునుగు ప్రాణి, చావడు, చావు లేని వాడు అగును.

(విద్యాసాగరునితో) నీవు పూనుకొని నడపు చుండు పనులు అన్నియును మంచివే. అహంకారమును వదలి, 'కర్తను నేను' అనెడి

తలంపును విడిచి, ఈ పనులను నిస్స్వార్థబుద్ధితో చేయ గల వేని, చాల మంచిది. అట్టి కర్మానుష్ఠానమువలన ప్రేమయు, భగవద్భక్తియు వర్ధిల్లును. కడకు భగవత్ప్రాప్తియును చేకుఱును.

భగవంతునిపై ప్రేమ వర్ధిల్లు కొలదియు కర్మప్రవణత తగ్గును. కోడలు గర్భిణి ఐన, అత్తగారు ఆమెకు పనులు తగ్గించును. నానాటికిని కోడలు చేయ వలసిన పనులు తగ్గుచుండును. కానుపు వేళ సమీపింపగనే అత్తగారు ఆమెను ఏ పనిని చేయ నీయదు. ఏల అన, శిశువునకు నలుగుడు కలుగక ఉండుటకును కానుపు సమయమున ఎట్టి చిక్కులును రాకుండుటకును.

ఈ ధర్మకార్యములచేత నిజముగ నీవు నీకే మేలు చేసికొనుచున్నావు. వానిని నీవు నిష్కామముగ చేయ గల వేని, నీకు చిత్తశుద్ధి గలిగి, భగవద్భక్తి పెంపొందును. భగవద్భక్తి కలుగుటయే తడవుగ భగవత్ప్రాప్తియు సిద్ధించును.

నిజములో మానవుడు లోకమునకు ఏ మేలును చేయ లేడు, లోకమునకు మేలు చేయు వాడు భగవంతుడు ఒక్కడే. సూర్యుని చంద్రుని సృష్టించిన వాడును, నిసుగుల పైని ప్రేమను తల్లిదండ్రుల హృదయములలో సృష్టించిన వాడును, మహాత్ములకు కృపాగుణమును కలిగించువాడును, యోగులకును భక్తులకును దివ్యప్రేమను అనుగ్రహించువాడును, ఆ భగవంతుడే. స్వలాభాపేక్ష లేక పరులకై పాటువడు మానవుడు నిజముగ ఆత్మశ్రేయమునే చేకూర్చుకొనును.

నిధి నీ హృదయములో పూడి ఉన్నది. కాని, ఇంకను దానిని నీవు ఎఱుగవు. దానిని ఒక సన్నని మట్టి పొర కప్పి ఉన్నది. ఆ నిధి నీ యెఱుకకు వచ్చినంతనే, నీవు చేయుచున్న పనులు అన్నియును తగ్గి పోవును. బిడ్డ పుట్టిన వెంటనే ఇంటి కోడలికి ఆ బిడ్డపనితోనే సరిపోవును. ఏ పని చేసినను, ఆమె, బిడ్డకుగానే చేయును. అత్తగారు ఆమెను ఇంటి పనులను, దేనిని గాని, చేయ నీయదు.

నిస్స్వార్థకర్మానుష్ఠానముచేత హృదయములో భగవద్భక్తి పెరుగును. పిమ్మట భగవదనుగ్రహముచేత కాలక్రమమున భగవత్ప్రాప్తియు లభించును. దేవుని ప్రత్యక్షముగ చూడను వీలు అగును. నీతో నేను మాటాడుచున్నట్లే, దేవునితోను మాటాడ శక్యము అగును.''

అందఱును గురుదేవుని మాటలను వినుచు, అచ్చెరువుచే నోరు ఎత్తక కూర్చుండిరి. సరస్వతియే శ్రీరామకృష్ణుని నాలుకపై నెలకొని, మాటాడుచు ఉన్నట్లును, ఆ వాక్కులు విద్యాసాగరునకు మాత్రమే కాక సర్వమానవతతికిని వారి శ్రేయమునకై ఉద్దిష్టములు ఐనట్లును, అచటి వారికి ఎల్లరకును తోచినది.

అప్పటికి రాత్రి సుమారు తొమ్మిది గంటలు ఐనవి. గురుదేవుడు బయలుదేఱ నుండెను.

గురుదేవుడు — [చిఱునవ్వు నవ్వుచు విద్యాసాగరునితో]— నేను చెప్పిన యీ మాటలను చెప్ప వలసిన ఆవశ్యకత నిజముగా లేదు. అవి అన్నియు నీకు తెలిసినవే. తెలిసినవే అన్న సంగతి, నీ జ్ఞప్తిలో లేదు. వరుణుని బొక్కసమున లెక్కకు మిక్కిలి ఐన రత్నములు ఉన్నవి. ఉన్నవి అనుటను వరుణుడు తాను ఎఱుగడు.

విద్యాసాగరుడు — (చిఱునవ్వుతో) – మీకు తోచినట్లెల్ల మీరు చెప్ప వచ్చును.

గురుదేవుడు — [చిఱునవ్వు నవ్వుచు] ఔను, తమ నౌకరుల అందఱ పేళ్లను ఎఱుగని వారును, తమ యిండ్లలో ఉన్న విలువగల వస్తువులను పెక్కింటిని ఎఱుంగని వారును సంపన్నులలో అనేకులు గలరు. (అందఱును నవ్వుదురు).

గురుదేవుని సంభాషణను విని అందఱును ప్రీతులు ఐరి. ఆయన మరల చిఱునవ్వుతో విద్యాసాగరునివైపు మరలి ''ఎప్పుడైనను దయచేసి గుడితోటకు విచ్చేయుము. గుడితోట అనగా రాస్మణిగారి తోట. అది రమణీయముగ నుండును.

విద్యాసాగరుడు — సరే, తప్పక వత్తును. ఇంత దయతో మీరు నన్ను కటాక్షింప వచ్చి నప్పుడు, బదులుగా నైన నేను రావలెను గదా!

గురుదేవుడు—నన్ను జూచుటకా? ఆ లాగు నీవు ఎప్పుడును అనుకో గూడదు.

విద్యాసాగరుడు—ఏల? ఎందులకు అట్లు అనుచున్నారు? దయ చేసి వివరించి చెప్పుడు.

గురుదేవుడు — (చిఱు నవ్వుతో) చేపలను పట్టుకొనుటకు ఉపయోగించు చిట్టిపడవలవంటివారము మేము. (అందఱును చిఱు నవ్వు నవ్వుదురు). మేము పిల్ల కాలువలలోను, లోతు లేని నీళ్ల లోను, పెద్ద నదులలోను, తిరుగాడ గలము. మఱి నీవో, ఓడవు, దారిలో నీకు అడుగు నేల అడ్డు దగుల వచ్చును. [అందఱును నవ్వుదురు].

విద్యాసాగరుడు మౌనముగ ఉండెను. శ్రీరామకృష్ణుడు నవ్వుచు — ఈ ఋతువులో ఓడ ఐనను అక్కడికి పోగలదు లెండు.

విద్యాసాగరుడు — (చిఱునవ్వు నవ్వుచు) ఔను, ఇది వాన కాలము కదా (అందఱు నవ్వుదురు).

మహేంద్రుడు తనలో ఇట్లు అనుకొనెను—"ఔను, క్రొత్తగ మేల్కొలుపబడిన ప్రేమకు ఇది నిజముగ వానకాలమే. ఇట్టి సమయమున మర్యాద, ఆచారము, అను వాని పట్ల అంతశ్రద్ధ ఉండదు."

శ్రీరామకృష్ణుడు విద్యాసాగరుని వీడ్కొనెను. విద్యాసాగరుడు చేత దీపమును పట్టుకొని దారి జూపుచు తానును తన మిత్రులును గురుదేవుని ప్రధానద్వారమువఱకును సాగ నంపెను. గదిని వీడుటకు ముందు గురుదేవుడు విద్యాసాగరుని కుటుంబక్షేమమునకై దేవుని ప్రార్థించెను. ప్రార్థించుచున్నప్పుడే ఆయనకు భావపారవశ్యము కలిగెను.

గురుదేవుడు — ఎవనికిగాని తనలో ఏమి ఉన్నదో కనుగొన వలెను అనిన, కొంత జ్ఞానసాధన తప్పక కావలెను.

మ — బ్రతికి నన్నాళ్లు సాగుచునే ఉండవలెనా సాధన?

గురుదేవుడు — అక్కఱ లేదు. కాని ప్రారంభదశలో మాత్రము ప్రతియొక్కనికిని మెలకువయును చుఱుకుదనమును ఉండ వలెను. ఆ దశ దాటిన పిమ్మట అంత శ్రమపడ అక్కఱ లేదు. పడవ అలలపోటు - తుపాను - పెనుగాలి - నదుల వంపులు అను వాని గుండ పోవుచు ఉన్నంత వఱకును చుక్కాణివాడు చుక్కాణిని గట్టిగ పట్టుకొని యుండును. వానిని దాటిన వెంటనే అతడు తన పట్టును సడలించును. నదుల తిరుగుళ్లు దాటి, కొంత అనుకూల వాయువు వీవ దొడగినంతనే, అతడు హాయిగ కూర్చుండును, చేతిని మాత్రము చుక్కాణిపై ఉంచి యుండును. తర్వాత తెరచాపను విప్పి బూనుకొనును, పొగ త్రాగుటకును సిద్ధపడును, అట్లే సాధకుడును కామినీకాంచనములు అనెడి కల్లోలములను తుపానులను అతిక్రమించినంతనే, నెమ్మదిని శాంతిని అనుభవించును.

కొందఱకు పుట్టినప్పటినుండియే యోగుల లక్షణములు ఉండును. కాని వారును మెలకువతోనే ఉండ వలెను. కామినీకాంచనములే అడ్డంకులు, మానవుని యోగమార్గమునుండి తప్పించి సంసార కూపమునకు ఈడ్చునవి అవే. వారికి భోగేచ్ఛ కొంత ఉండిన ఉండ వచ్చును. ఆ కోరిక తీఱినంతనే వారు తమ మనసులను మరల భగవదున్ముఖములుగా చేసికొని, అవి యోగాభ్యాసమునకు అర్హములుగా ఉండిన మునుపటి దశకు వానిని తెచ్చుకొందురు.

మనస్సు నిశ్చలము కానిదే యోగము శక్యము కాదు. మనస్సు వత్తిదీపమును బోలినది. దానిని ఐహికపరత అనెడి గాలి సదా అల్లాడించుచుండును. ఆ దీప జ్వాలకు స్తిమితత కలిగె నేని, మనసునకు నిలుకడ కుదిరె నేని, యోగము సిద్ధించినట్లే.

వైరాగ్యమును అలవఱచుకొనుటకై నేను ఒక్కొక్కప్పుడు

రాజసచివృత్తిని వహించుచుందును. ఒకసారి నేను బంగారు అంచు గల అంగీని తొడుగుకొనవలెను అనియు, వ్రేలికి ఉంగరమును పెట్టుకొనవలెను అనియు, పొడవైన హుక్కా-గొట్టమున పొగ పీల్వవలెను అనియు ఆశపడితిని. మథుర్ బాబు ఆ వస్తువులను అన్నిటిని నాకు సరఫరా చేసెను. ఆ బంగారు అంచు అంగీని తొడుగుకొని కొంతసేపటికి నేను నాతోనే ఇట్లు అనుకొంటిని — 'ఓ మనసా, బంగారు అంచు అంగి అందురే, అది ఇదే' అట్లు అని వెంటనే నేను దానిని తీసి పాఱవేసితిని. ఆ అంగీని ఇకను ఒక్క క్షణము ఐనను భరింప లేనైతిని. మరల నాలో ఇట్లు అనుకొంటిని — 'మనసా, దీనికి శాలువ అని పేరు, ఇది ఉంగరము, ఇది పొడవైన హుక్కా-గొట్టము.' ఈ మాటలు అనుకొన్న వెంటనే ఆ వస్తువులను గూడ, ఇకను ఎప్పటికిని అక్కఱ లేదు అని పాఱవేసితిని. వానిని అనుభవింతము అను కోరిక నా మనస్సులో మరల ఎప్పుడును కలుగ లేదు.

అప్పుడు దాదాపు మునిమాపు వేళ. గురుదేవుడును మహేంద్రుడును ఆగ్నేయమూలలో ఉన్న వసారా వాకిటియొద్ద ఏకాంతముగ నిలబడి యుండిరి.

గురుదేవుడు (మహేంద్రునితో) — యోగి మనస్సు ఎల్లప్పుడును భగవంతునిపై ఏకాగ్రమై ఉండును, ఆత్మయందే నిమగ్నమై ఉండును. చూచిన మాత్రముచేతనే నీవు అట్టి యోగిని గుర్తింప గలుగుదువు. అతని కన్నులు బాగుగ తెరచుకొనియే ఉన్నను, గ్రుడ్లను పొదుగుచున్న తల్లిపక్షిచూపులకుం బోలె యోగిచూపులకు ఒక బాహ్య లక్ష్యము ఉండదు. తల్లిపక్షి మనస్సు గ్రుడ్లపై నెలకొని ఉన్నందున కనుచూపులకు దేనిమీదను గుఱి కుదురదు. అట్టి పటమును నీవు నాకు చూపగలవా ?

రాత్రి తొలిజాము రాగనే, గుడిదీపములు వెలిగినవి. శ్రీరామకృష్ణుడు లోకజననిని ధ్యానించుచు తన చిన్న మంచముపై గూర్చుండెను. ధ్యానము ముగియుడు, ఆయన భగవన్నామములను

జపించెను. ధూపార్పణము ఐనది. గదిలో నూనె దీప మొకటి వెలుగుచున్నది. కాళికాలయమున సాయంపూజ ప్రారంభమై, శంఖధ్వానములును తాళధ్వనులును గాలికి పర్వి విన నగు చుండినవి. వెన్నెల నలుకెలంకులను వెల్లిగొనెను. గురుదేవుడు మహేంద్రునితో సల్లాపమును మరల ఆరంభించెను.

గురుదేవుడు — నిస్వార్థబుద్ధితో నీ విధులను నిర్వర్తింపుము. విద్యాసాగరుడు చేయుచున్న ధర్మకార్యములు మహోత్కృష్టము లైనవి. ఎప్పుడు కాని, ఫలాపేక్ష లేక, నీ విధులను నెఱవేర్ప ప్రయత్నింపుము.

మ — చిత్తము. స్వామీ, మఱి తనకు విహితములైన కర్మలను ఆచరించుచునే ఒకడు భగవత్సాక్షాత్కారము ఒంద గలడా ?

గురుదేవుడు — అందఱును పనులను చేయుచునే ఉందురు. చేయని వారు లేరు. భగవన్నామములను పాడినను, భగవన్మహిమలను కీర్తించినను, అదియును ఒక కర్మమే. "సోఽహమస్మి" అని అద్వైతి చేయు ధ్యానమును కర్మమే. సకల వ్యాపారములను పూర్తిగ వర్జించుటకు వీలే లేదు. కాబట్టి నీ విధిని నీవు నిర్వర్తింపుము. కర్మఫలమును మాత్రము భగవదర్పణము కావింపుము.

మ — స్వామీ, ధనము ఎక్కువగా గడించుటకు పాటుపడ వచ్చునా ?

గురుదేవుడు — ధర్మబద్ధమైన కుటుంబమును భరించుటకై ఎక్కువ ధనము గడించుట శాస్త్రసమ్మతమే. కాని వరుమానమును హెచ్చించు కొనుటకు నీవు ఋజువైన మార్గముననే ప్రయత్నింప వలెను. జీవితలక్ష్యము భగవత్సేవయే కాని, ధనార్జనము కాదు, అర్థము భగవత్సేవకే వినియుక్తము అగు నేని దానివలన ఎట్టి అనర్థములును గలుగవు.

మ — ఆలుబిడ్డలకొఱకైన తన కర్తవ్యాలను నిర్వహింప వలసిన బాధ్యతకు మానవుడు ఎంత కాలము తల యొగ్గ వలెను ?

గురుదేవుడు— వారికి అన్న వస్త్రాల పేదఱికము తీఱువఱకును తనకు ఆ బాధ్యత ఉండును. కొడుకు తన్ను తాను పోషించుకొనగలవాడైన పిమ్మట ఆ కొడుకును పోషించు బాధ్యతను తండ్రి వహింప అక్కఱ లేదు. సొంతముగ ఆహారమును సంపాదించుకొన గలిగిన పక్షిపిల్లను, తల్లిపక్షి తన యాహారములో పాల్గొననీక పొడిచి తఱిమివేయును.

మ — ఒక్కొక్కడును తన విహితకర్మలను ఎంత కాలము నిర్వర్తించుచుండవలెను?

గురుదేవుడు — పూప పొడచూపగనే పువ్వు రాలి పోవును. భగవత్ప్రాప్తి కలిగిన మీాగట, ఎవడును కర్మలను ఆచరింప అక్కఱ లేదు. ఆచరింతము అను బుద్ధియు అతనికి పుట్టదు.

త్రాగుబోతు మిక్కుటముగ త్రాగు నేని, స్మృతిని నిలుపుకో లేడు. ఒకటి రెండు గ్లాసులు మాత్రమే త్రాగు నేని, తన పనులను తాను చూచుకొనుచుండ గలడు. భగవంతునకు నీవు సన్నిహితుడవు అగు కొలదియును, నీ కర్మభారమును కొంచెము కొంచెముగ ఆయనయే తగ్గించును. భయపడకుము.

శేషించి ఉన్న ఈ కొన్ని కర్తవ్యములను పూర్తి చేయుము. నీకు శాంతి గలుగును. వంట మొదలయిన యింటిపనులను ముగించుకొని స్నానము చేయబోయిన యిల్లాలు నీవు ఎన్ని కేకలు వేసినను రాదు.

మ — స్వామీా, భగవత్ప్రాప్తి అనగా ఏమి? భగవత్సాక్షాత్కారము అనిన అర్థము ఏమి? దానిని ఎట్లు పొంద నగును?

గురుదేవుడు — వైష్ణవులు సాధకులను సిద్ధులను వివిధవర్గముల వారినిగా విభజించి ఉన్నారు — ప్రవర్తకులు, సాధకులు, సిద్ధులు, సిద్ధసిద్ధులు. సాధనలో అప్పుడే అడుగు పెట్టిన వాడు ప్రవర్తకుడు. పూజా జప ధ్యానములు భగవన్నామ మహిమల సంకీర్తనము మొదలయిన జ్ఞానసాధనలను కొంతకాలముగా చేయుచుండువాడు

సాధకుడు. భగవంతుని ఉనికిని తన అంతరనుభవముచే తెలిసికొన్న వాడు సిద్ధుడు. ఈ సిద్ధిని వివరించుటకై వేదాంతశాస్త్రమున ఒసగిన ఉదాహరణము ఒకటి కలదు. ఒక యింటి యజమానుడు చీకటి గదిలో నిద్రించుచున్నాడు. అతనిని కనుగొనుటకై ఒకడు అంధకారమున దేవులాడుచున్నాడు, చేతికి మంచము తగిలినచో 'ఇది ఆయన కాదు' అనును. కిటికీని పట్టి చూచును. 'ఇదియు ఆయన కాదు' అనును. తలుపును తాకి చూచి 'ఇదియు ఆయన కాదు' అనును. దీనికి వేదాంతశాస్త్రమున నేతినేతిమార్గము [=ఇది కాదు ఇది కాదు అనుచు, కానివాని నెల్ల విడుచు పద్ధతి] అని వ్యవహారము. తుదకు యజమానుని శరీరము చేతికి తగులగనే అతడు 'ఇదుగో ఇక్కడ ఉన్నాడు' అని అఱచును, అనగా యజమానుని కనుగొన్నాడు, యజమానుని ఉనికి తెలిసినది, కాని యజమానునితో సన్నిహిత పరిచయము ఇంకను లేదు.

సిద్ధసిద్ధులు అను ఒక వర్గమువారు ఉన్నారు. స్వామికి ఆంతరంగికుడై ఆయనతో మాటాడుటయు, భక్తిప్రేమలద్వారా దేవుని తోడ అత్యంతము ఆంతరంగికమైన పరిచయము గనుటయు, అది ప్రత్యేకము గదా. సిద్ధునకు భగవత్ప్రాప్తి కలుగుట నిస్సందేహము. కాని సిద్ధసిద్ధునకు భగవంతునితో అత్యంతాంతరంగికమైన పరిచయము ఉండును.

మ — దేవుని జూచు వాడు ఈ కన్నులతోనే చూచునా?

గురుదేవుడు — ఈ భౌతిక నేత్రాలతో దేవుని జూడ లేము, ఆధ్యాత్మిక సాధన సాగిన కొలదియును సాధకునకు ప్రేమశరీరము కలుగును. ఆ ప్రేమశరీరమునకు ప్రేమనేత్రములు ప్రేమశ్రోత్రములు మొదలయిన అవయవములు ఉండును. దేవుని రూపు ఆ ప్రేమ నేత్రాలకు కాన నగును. దేవుని వాక్కు ఆ ప్రేమ శ్రోత్రాలకు విన నగును.

దేవునిపై గాఢప్రేమ లేనిదే, ఇవి సిద్ధింపవు. దేవుని అతి

గాఢముగ ప్రేమించినవానికి దేవుడే సర్వత్ర కానిపించుచుండును. కామాల గల వానికి సమస్తమును పసుపువన్నె గలిగి కానంబడును గదా. అట్లే. అప్పుడు అట్టి భగవత్ప్రేమగలవానికి ''సోఽహమస్మి'' ''నేను నిక్కముగ అతడనే'' అను అనుభూతి గలుగును.

రేయింబగళ్లు దేవునే తలంచుచుండువానికి దేవుడే సర్వత్ర కనబడుచుండును. ఎట్లు అనగా ఒక చోట అగ్నిజ్వాలలను తెప్ప వ్రాల్పక కొంతసేపు చూచుచుండినవానికి అన్ని వైపులను అట్టి జ్వాలలే అగపడుచున్నట్లు ఉండును గదా.

''అన్నివైపులను అతనికి అగపడెడి అగ్నిజ్వాలలు వాస్తవములు కావు గదా'' అను తలంపు మహేంద్రుని మనసున గలిగెను.

ఎవని మనసున ఎంత అడుగున మఱుగువడి ఉండు భావమునైనను సరే గ్రహింప గల వాడైన శ్రీరామకృష్ణుడు మహేంద్రుని సందేహమును గుర్తించి ఇట్లు అనెను — ''ఆత్మమయుడును చిన్మయుడును ఐన ఈశ్వరుని తలంచు వానికి స్మృతినాశము గలుగదు. దేవునే మితి మీఱి తలంచుచున్నచో చిత్తభ్రాంతి కలుగును అని శివనాథుడు ఒక సారి చెప్పినాడు. అప్పుడు నేను 'జ్ఞానస్వరూపునే ధ్యానించు వానికి జ్ఞానహాని ఎట్లు గల్గును' అని అడిగితిని.

మ — ఔను, స్వామి, అది నాకు అర్థమైనది. మిథ్య ఐన దానిని ధ్యానించుటను బోనిది కాదు అది. ఎవడు సహజముగనే శాశ్వత జ్ఞాన స్వరూపుడో అతనిపై మనస్సును ఏకాగ్ర మొనర్చిన వానికి జ్ఞానహాని ఎట్లు కలుగును ?

గురుదేవుడు — [సంతోషముతో] దేవుని అనుగ్రహముచే నీకు అది అర్థమైనది. ఆయన కృప లేకున్న, మదిలోని సంశయములు తొలగి పోవు. ఆత్మసాక్షాత్కారము లేనిదే సందేహములు తీఱవు.

దేవుని కృపను పొందిన వాడు ఇక దేనికిని భయపడ అక్కఱ లేదు. తండ్రి చేతిని బిడ్డ తాను పట్టుకొను నేని, అప్పుడు ఆ బిడ్డ

మునకు చాల దూర మైనది కాదు. మేము ఆయనను దర్శింప ఎంచితిమి. హాలధారిని 'నేనును కృష్ణకిశోరుడును ఒకసన్న్యాసిని దర్శింపబోవు చున్నాము. నీవును మాతో వత్తువా?'' అని అడిగితిని. హాలధారి ''ఒక మానవుని దేహమును దర్శించినందున లాభ మేమి? మానవదేహము ఒక బంకమట్టిగూడు. అంత కన్న ఏ మేలిమియును లేదే.'' అనెను. హాలధారి భగవద్గీతలను వేదాంతశాస్త్రమును శ్రద్ధతో జదువుచుండును. కావున సన్న్యాసిమేనును బంకమట్టిగూడు అనెను. హాలధారి చెప్పిన మాటను నేను కృష్ణకిశోరునకు చెప్పితిని. అతడు మండిపడి ''అట్లు అనుటకు హాలధారికి సిగ్గు లేదా? సదా దేవుని ధ్యానించుచు, రాముని దలచుచు, సర్వేశ్వరునకై తక్కిన సర్వస్వమును త్యజించిన మహనీయుని దేహమును 'మట్టిగూడు' అనుట ఎట్లు పొసగును? ఆయన రూపము చిన్మయము అని హాలధారి యెఱుగడా'' అనెను. హాలధారిమాట తన్ను చాల కలవరపఱచుటచే గుడితోటలో అతడు ఎదురు ఐనప్పుడు ఎల్ల కృష్ణకిశోరుడు పెడమొగము పెట్టుచుండెను, అతనితో మాటాడుటను మాని వేసెను.

''జందెమును ఏల తీసివేసితిరి?'' అని ఒకప్పుడు కృష్ణకిశోరుడు నన్ను అడిగెను. ఈశ్వరసాక్షాత్కారము సిద్ధించిన ఆ దినాలలో, ఒక పెనుతుపానులో ఉన్నట్లు నాకు అనిపించెడిది. అన్నియు నా యొద్ద నుండి కొట్టుకొని ఎగిరిపోయినవి. మునుపటి జాడ ఒక్కటియు నా యొద్ద లేదు. బాహ్య లోక స్మృతి పూర్తిగ పోయినది. మొలలో వస్త్రము నైనను నేను నిలుపుకో లేక ఉండగా, జందెము మాట ఏమి? ఆహా! నేను ఉన్నంతటి దైవోన్మత్తదశలో నీవు ఉండిననే, నీకు అది అర్థము అగును.'' అని నేను కృష్ణకిశోరునితో అంటిని.

నేను అన్నట్లే అతనికి దైవోన్మాదము కలిగినది. అప్పుడు అతడు ఒంటరిగ గదిలో చేరుకొని, తలుపులు బిగించుకొని, ఎడతెంపు లేక ప్రణవమును ఉచ్చరించుచుండెను. అతనికి వెఱ్ఱి పట్టినది అనుకొని బంధువులు వైద్యుని బిలిపించిరి. కృష్ణకిశోరుడు ఆ వైద్యునితో ''అయ్యా, అన్ని ఉపాయములను చేసి, నా వ్యాధిని మాన్పుము

కాని, ఓంకారమును మాత్రము ఉండనిమ్ము'' అనెను. [అందఱును నవ్వుదురు].

ఒకనాడు నేను ఆయనయొద్దకు బోయి చూడగా, ఆయన ఏదో చింతలో ఉండినాడు. కారణమును విచారించితిని. ''పన్నులను వసూలు చేయువాడు వచ్చి యుండినాడు. నేను పన్ను చెల్లింపకే ఉన్నయెడల, నా యిత్తడి తపెలలను, నా గిన్నెలను, నాయొద్ద కొంచెముగ ఉన్న పరికరములను జప్తి చేయుదును అని నన్ను అతడు బెదరించినాడు. అందులకు సంబంధించిన మనోవ్యధయే నన్ను ఇప్పుడు బాధించుచున్నది'' అన్నాడు ఆయన. నేను ''నీ తపెలలను నీ పెనములను అతడు కొనిపోవును గాక. నీ దేహమును అతడు నిర్బంధించినను నిర్బంధింప నిమ్ము. అందువలన నీకు ఎట్టి చెడుగును లేదు. అందులకై నీవు మనసులో వ్యధ జెంద నేల? నీవు ఖస్వరూపుడవు కదా'' అని అంటిని. [నరేంద్రాదులు నవ్వుదురు]. తాను ఆత్మ అనియు, ఖస్వరూపుడు అనియు, ఆకాశమువలె సర్వవ్యాపి అనియు ఆయన నాతో చెప్పుచుండెడి వాడు. ఆయనకు ఆ భావము అధ్యాత్మరామాయణమునుండి వచ్చినది. నేను అతనిని 'ఓహోయి, ఖా' అని పిలుచుచు సతాయించుచుండెడివాడను. కాబట్టి 'నీవు ఖరూపివి, ఐనందున పన్నులకు నీవు తొణక గూడదు' అని ఆ నాడు నేను అతనితో అంటిని.

అట్లు దైవోన్మత్తదశలో ఉన్నప్పుడు మనస్సులో ఉన్న విషయములను దాచుకొనక చెప్పుచుండెడివాడను. వ్యక్తులు అనిన నాకు లక్ష్యము లేదు. గొప్పపదవులలో ఉన్నవారితో ఐనను సరే, నిజమును నిర్భయముగ జెప్పుచుంటిని.

ఒకనాడు అట్టి దివ్యోన్మాదములో నేను బరానగర గంగాతీర స్నానఘట్టమునకు పోయితిని. పోయి చూడగా అచట జయముఖర్జి భగవన్నామమును జపించుచుండెను. కాని అతని మనస్సు మాత్రము వేఱు దేనిమీదనో లగ్నమై ఉండెను. నేను అతనిని సమీపించి రెండు లెంపకాయలు వేసితిని.

ఒకప్పుడు రాణిరాస్మణి గుడితోటలో కొన్నాళ్లు ఉండినది. నేను కాళిమాతను ఆరాధించునప్పుడు ఆమె తఱచు గుడిలోనికి వచ్చుచుండును. ఒకనాడు అట్లు వచ్చి నన్ను పాట పాడు మన్నది. నేను పాడుచున్నప్పుడు ఆమె ఏదో పరాకుగా ఉండినది. ఆమె పరాకు నాకు కంటబడినంతనే నేను ఆమె చెంపమీద ఒక చిన్న చఱపు చఱచితిని. ఆమె చాల అనుతాపము జెంది, చేతులు జోడించుకొని అట కూర్చుండి ఉండెను.

నా మనఃపరిస్థితిని జూచుకొని నేనే దిగులు జెంది "చూడు, నా ప్రకృతిని, ఎట్లు నేను దీనినుండి విడివడుదును" అని నా పినతండ్రి కుమారు డగు హాలధారితో అంటిని. మహోత్కంఠతో జగజ్జనని ప్రార్థించి, ఆ అలవాటును పోగొట్టుకో గలిగితిని.

ఆ మనఃపరిస్థితిలో ఉండు వానికి భగవద్విషయము ఒక్కటి తప్ప తక్కిన సంభాషణలు ఎల్ల, మిక్కిలి దుర్భరములుగ ఉండును. లోకుల లౌకిక విషయచర్చలు నా చెవిని బడినప్పుడు, నేను విలపించెడి వాడను. మథుర్‌బాబుతో యాత్రకు బోయినప్పుడు మేము కొన్నాళ్లు కాశిలో రాజబాబు నింట ఉంటిమి. ఒకనాడు నేను మొగసాలలో కూర్చుంటిని. మథుర్‌బాబును రాజబాబును ఇంకను ఇతరులును అచ్చటనే ఉండిరి. తమకు వ్యాపారములో వచ్చిన నష్టములు మొదలయిన నానా లౌకిక విషయములను గూర్చి వారు మాటాడుకొనుచుండిరి. ఆ మాటలు నా చెవిని బడినప్పుడు, నేను బిట్టుగ వాపోయి లోకజననితో "అమ్మా, నన్ను ఏ చోటికి తెచ్చి వదలితి వమ్మా! దక్షిణేశ్వరమున గుడితోటలో ఉన్నప్పుడు నేను ఇంతకంటెను హాయిగా ఉండినానే. ఇక్కడ సదా కామినీకాంచనముల ప్రశంస వినక నాకు తప్పుట లేదు. దక్షిణేశ్వరమున ఐనచో ఈ బాధను నేను తొలగించుకో గలిగి ఉందును" అని మొఱపెట్టుకొంటిని.

గురుదేవుడు భక్తులను, అందును ముఖ్యముగ నరేంద్రుని, కొంతసేపు విశ్రమింప గోరెను. తానును చిన్నమంచముపై పవ్వళించెను.

అపరాహ్ణమున చాలసేపు దాటిన పిదప నరేంద్రుడు పాట పాడెను. రాఖాలును లాటును హాజ్రాయు ఉండిరి. నరేంద్రుని బ్రాహ్మసమాజ సఖుడైన ప్రియుడును ఉండెను. పాటకు మృదంగము ఉండినది —

ఉజ్జ్వలంబుగ నీదు మోమెప్పు డుండ
మధుర మా దేవు నామంబు మానక కెపుడు
పాడు చుండుము; యమృతప్రవాహ మొకటి
నీదు డెందమునం బొంగు; నీవు దాని
నందఱం గూర్చికొని క్రోలి యనుభవింపు.
ఇహ జగతి వాంఛ లనియెడి యేర్పు నిప్పు
మంటలన్ నీదు హృదయంబు మాడు నేని,
దేవు నామము జపియించి తేని, నీదు
హృదిని దివ్యమౌ ప్రేమ తా నెసక మెసఁగి,
చల్లఁబఱచును మనసును సౌఖ్యపఱచు.
మఱవ కో మానసంబ, నమ్మకము విడకు,
పరమపురుషుని నామంబె పాడు మెపుడు,
నాపదలు నీకు నెదురైన, నాశ్రయింపు
పరము నీ తండ్రి; నతఁడు కృపాసముద్రుఁ,
డతని నామ మను పిడుగు నందుకొనుము
పాప శృంఖలలం ద్రెంచి పాఱ వైవ;
రమ్ము, నిర్మల ప్రేమ పరవశుల మయి,
స్వామితో నైక్య మొంది రసానుభూతి,
శాశ్వ తానందమును గ్రోలి చతురముగను —
కోర్కె లన్నియుఁ దీఱఁగఁ గొలుద మిఁక.

పాట ముగిసిన వెంటనే శ్రీరామకృష్ణుడు రెండు చేతుల తోను నరేంద్రుని చేరదీసికొని, కౌగిలిని చాల సేపు విడువక, 'ఎంత

హాయి గొలిపితి వోయీ మాకు నేడు' అని మెచ్చుకొనెను. ఆరాత్రి గురుదేవుని హృదయమునకు తూమును పూర్తిగా తెఱచినట్లు అయ్యెను. ఉప్పొంగుచున్న ఆనంద పరివాహమును అణచుకొనుటకు సాధ్యపడ లేదు. అప్పుడు రాత్రి ఎనిమిది గంటలు. దివ్య ప్రేమోన్మత్తుడై ఆయన తనగదికి ఉత్తరపు వసారలో పచారు చేసెను. అప్పు డప్పుడు లోకజననితో ఆయన ఆడుచుండిన మాటలు సైతము విన నగుచుండినవి.

నరేంద్రుడును మహేంద్రుడును ప్రియుడును ఆ రాత్రిని దేవాలయవనభవనములోనే గడప బూనుకొన్నారు. అందులకును, ముఖ్యముగ నరేంద్రుని పొందు లభించినందులకును గురుదేవుడు మిక్కిలి ప్రీతుడు అయ్యెను. (శ్రీ 'మా'*) శ్రీమాతృదేవి ఆ దినాలలో నహబతులో వసించుచుండెను. రాత్రి భోజనమును ఆమెయే సిద్ధపఱచెను. గురుదేవునకు అగు ఖర్చులలో విశేషభాగమును సురేంద్రుడు† భరించుచుండెను. భోజనమునకు తట్టలను గురుదేవుని గదికి ఆగ్నేయముగ ఉండు వసారలో అమర్చిరి.

భక్తులు ఆనందముగ విందు భుజించుచు ఉన్నప్పుడు, శ్రీరామకృష్ణుడు ప్రక్కనే నిలిచి మహాప్రీతితో జూచుచుండెను. ఆ రాత్రి ఆయన పరమానందము అనుభవించెను.

భోజనమునకు తర్వాత, గురుదేవుని గదిలో నేలపై పఱువబడిన చాపపై భక్తులు విశ్రమించిరి. వారు ఆయనతో సంభాషింపదొడగిరి. ఆ సంభాషణము నిజముగ ఆనందమయమైన ఒక విందే. ''జ్ఞానము అనెడి ఆకసమున చల్లనగుచు దోచె ప్రేమ చంద్రుడు అదే'' అను గీటుతో ప్రారంభమగు పాటను పాడుము అని గురుదేవుడు నరేంద్రుని కోరెను.

---

* శ్రీరామకృష్ణుని పత్నియైన శారదను భక్తులం ఈ పేర వ్యవహరింతురు.

† తన గృహస్థ శిష్యులలో అత్యంత ప్రీతిపాత్రుడైన సురేశమిత్రుని గురుదేవుడు సురేంద్రుడు అని పేర్కొనెడి వాడు.

నరేంద్రుఁడు పాడెను. ఇతరభక్తులు తాళములను మృదంగములను వాయించిరి —

జ్ఞాన మనెడి యాకసమునం జల్ల నగుచుఁ
దోఁచెఁ బ్రేమచంద్రుం డదే; లేచెఁ బ్రేమ
వెల్లి యల లవే పొంగుచుఁ వేగముగను
పాఱు నెల్లెడఁ జూడ నపారముగ, ము
కుంద, నీ రూప దెంత యానందమయము
జయము నీకు సామి జయము జయము జయము.
సోమునిం జుట్టి యున్నట్టి చుక్కలనఁగఁ
బరఁగ నన్ని వైపుల భక్తవార మమరు.
వారి చెలికాఁడు స్వామి కృపామయుండు
క్రీడ లాడును వారితోఁ బ్రీతితోడ
స్వర్గలోక కవాటంబు బాగుగాను
దెఱవఁబడి యున్న దీనాఁడు తేటి చూడు :
స్పర్శ సుఖవంత మైన దీ చైత్ర వాయు;
విదియు నూత్న దినంబు; నేఁ డిందుఁ గనుము
హర్ష వీచులు క్రొంగ్రొత్త లగుచుఁ బొడమెఁ;
బరము ననురాగ పరిమళవాహి యగుచు
వీచు నీ గాలి మెల్లఁగాఁ బృథివి మీఁద
యోగు లెల్లరు నానంద యుక్తిసుడియ.
ఈ జగము దా నొక కడలి; యిందుఁ గ్రొత్త
దిన మను కమలము విరిసె; దాని పైని
శివ నానందమయి మాతృదేవి వెలసె;
నమృతమునఁ జొక్కి నచ్చటి యళులఁ గనుము
ఎంత మత్తిల్లి యున్నవో వింతగాను!
జనని వదన మల్లదె వెల్గు సాంద్ర కాంతి;
ప్రేక్షకుల మదిని నది హరియించు; విశ్వ
మంతటిని దనదు వశమునందు నిల్పు;

నామె పాదపద్మయుగళి యంతికమున
హర్ష వివశులై యల్లదె యాడు చున్న
వారు పరమయోగివరులు వారె కనుము.
దేవి సాటకు జగతిని దీటు లేదు;
వచ్చి యగపడ్డఁ బరమ నిర్వృతి యొసంగు;
ప్రేమదాసుండు గోరెడిఁ బ్రీతితోడ —
"అన్నలార, వేఁడెదను మి మ్మడఁకువగను
అంబ మహిమలఁ గీర్తింపుఁ డయ్య" యనుచు.

శ్రీరామకృష్ణుడు పాడెను, ఆడెను. భక్తులు ఆయనను పరివేష్టించి నర్తించిరి.

అర్ధరాత్రమునకు కొంచెము ముందుగా, గురుదేవుని గదినేలపై పఱువబడిఉన్న శయ్యపై భక్తులు పరుండిరి.

వేగుజామున భక్తులలో కొందఱు లేచిరి. లేచి చూచు సరికి గురుదేవుడు శిశువువలె వివస్త్రుడై గదిలో ఇటు అటు పచారుచేయుచు వివిధదేవతలయు దేవేరులయు పేళ్లను జపించుచుండెను. ఆయన కంఠము అమృతమధురముగ ఉండెను. ఆయన నడుమనడుమ గంగ వైపు చూచుచు, గోడలకు వ్రేలుచున్న పటములకు ఎదుట నిల బడుచు, మ్రొక్కుచు, మధురకంఠమున పవిత్రనామములను పాడుచు ఉండెను. అప్పు డప్పుడు — "అమ్మా, నిజముగ నీవే బ్రహ్మమవు, నిజముగ నీవే శక్తివి, నీవే పురుషుడవు, నీవే ప్రకృతివి, నీవే విరాట్స్వరూపిణివి, ద్వంద్వాతీతతత్త్వమవును నీవే, ద్వంద్వముల రూపున ఉన్నదియును నీవే, నిజమునకు చతుర్వింశతితత్త్వములును నీవే" అనుచుండెను.

ఇంతలో కాళిగుడిలోను రాధాకాంతాలయమందును ప్రథమ సంధ్యారాధనము ప్రారంభమ్ము అయ్యెను. శంఖములయు తాళము లయు ధ్వని గాలిలో వ్యాపించుచు విననగుచుండినది. భక్తులు గది నుండి బయటికి వచ్చిరి. పూజారులును పరిచారకులును గుడిలో

పూజకై తోటలో పూవులను సేకరించుచు అగపడిరి. నౌబత్తునుంచి ప్రాతః కాలోచిత వాద్య సంగీతము ఇంపుగ వినబడుచుండెను.

నరేంద్రాదిభక్తులు కాల్యకృత్యములను నెఱవేర్చుకొని గురుదేవు నొద్దకు వచ్చిరి. మోవిపై తియ్యని చిఱునవ్వు తొలకాడు చుండ, శ్రీరామకృష్ణుడు తనగదికి చేరువగ ఈశాన్యపు వసారలో నిలుచుండెను.

నరేంద్రుడు — నానక్ సంప్రదాయమునకు చెందిన సన్న్యాసులు చాలమంది పంచవటిలో ఉన్నారే. మేము చూచితిమి.

గురుదేవుడు — అవును. వారు నిన్ననే వచ్చిరి. [నరేంద్రుని వైపు తిరిగి] మీరు అందఱును కలిసి ఆ చాపపై కూర్చుండుడు. అందఱును అట్లు ఒకచోట కూడి ఉండగా చూచుచుండ వలయును అని నా కోరిక.

అందఱును కూర్చుండిరి. గురుదేవుడు వారివైపు చూచుచుండెను. ఆయన మనఃప్రీతి స్పష్టముగ కానవచ్చుచుండెను. ఆయన వారితో సంభాషింప ఆరంభించెను. నరేంద్రుడు ఆధ్యాత్మిక సాధనను గూర్చి అడిగెను.

గురుదేవుడు — ఆధ్యాత్మిక సాధనలు అన్నిటిలోను ఉండు సారము భక్తి, భగవత్ప్రేమ. భక్తి ఉన్నచో వివేకవైరాగ్యములును సహజముగనే గలుగును.

నానక్ సంప్రదాయమునకు జెందిన సన్న్యాసులు అప్పుడే గదిలో ప్రవేశించిరి. 'నమో నారాయణాయ'* అనుచు గురుదేవుడు వారికి మ్రొక్కి ఆసీనుల గావించెను.

గురుదేవుడు — దేవునకు అసాధ్యము ఏదియు లేదు. ఆయన స్వరూపమును, మాటలచే ఎవడును వర్ణింప లేడు. ఆయనకు ప్రతిదియు సాధ్యమే. ఒకప్పుడు ఒకచోట ఇరువురు యోగులు

* సన్న్యాసులు ఒండొరులకు మ్రొక్కుకొనునప్పుడు అను మాట.

ఆధ్యాత్మిక సాధనల జేయు చుండిరి. ఒకనాడు నారదమహర్షి ఆ దారిని బోవు చుండెను. ఆయనను గుర్తుపట్టి ఆ యోగులలో ఒకడు, "స్వామీ, తాము దేవునొద్దనుండియే వచ్చుచున్నారు కదా. ఆయన ఇప్పుడు ఏమి చేయుచున్నాడు" అని అడిగె నట. "ఆయన, నేను చూచుచుండగా, ఒంటెలను ఏనుగులను ఒక సూది రంధ్రములో ఒకవైపు దూర్చి వేరొక వైపు వెలువరించుచుండినాడు" అని నారదుడు చెప్పె నట. విని, ఆ యోగి "అందులో వింత ఏమి ఉన్నది? దేవునకు ఏది ఐనను సాధ్యమే కదా" అనెను. కాని రెండవ యోగి "ఏమి! ఏనుగులను సూదిరంధ్రములో దూర్చుటయా? అది సాధ్యమేనా? నీవు నిజముగ దేవుడు ఉండు చోటికి పోయియే ఉండవు" అనెను.

నరేంద్రుడును అతని మిత్రులును గంగలో స్నానము చేసిరి. స్నానము ముగియగనే, గురుదేవుడు వారిని "పంచవటికి పోయి అక్కడ మఱ్ఱిచెట్టుక్రింద కూర్చుండి ధ్యానింపుడు. కూర్చుండుటకు పీటలను నేను ఇత్తునా?" అని అడిగెను.

పదియు నర గంట లప్పుడు నరేంద్రుడును అతని బ్రాహ్మ సమాజమిత్రులును పంచవటిలో ధ్యానము చేయుచుండిరి. కొంత సేపటికి, శ్రీరామకృష్ణుడు వారియొద్దకు వచ్చెను. మహేంద్రుడును అచ్చట నుండెను.

బ్రాహ్మసమాజభక్తులతో గురుదేవుడు ఇట్లు అనెను — "ధ్యానించు నప్పుడు దేవునిలో నిమగ్నుల మైపోవలెను. సముద్రమున పైపైని తేలుచు ఉందు వేని అడుగున ఉన్నట్టి రత్నములు నీకు అందునా?"

వెంటనే గురుదేవుడు ఇట్లు పాడెను—

కాళి పేరును బాడు చగాధ మైన
యాత్మ లోతుల డిగి చను; మచట, మనస,
పూడి యున్నది నవ రత్న పుంజ వితతి.

మొదటి జతనంబునను నీకు నెదియుఁ గాన
రాని యంతనె కడలిగర్భమున రత్న
నివహము లెవియు లే వని నిశ్చయింపఁ
బోకు; లక్ష్యమును విడఁగఁ బోకు మోయి,
యాత్మ నిగ్రహము విడక యంబ కాళి
రాజ్య మధ్యమునకును సరాసరి జను ;
దివ్య మగు జ్ఞానవార్ధిని దిగితి వేని
అద్భుతంబులు శాంతిమయంబులు మణు
లు గలవు, మనస, నీవె వానిఁ గని, గొనఁగఁ
జాలుదువు కాని, యందుకు శాస్త్ర సరణి
మీఱ కనుసరింపఁగ వలె; మిగుల స్వచ్ఛ
మైన ప్రేమయు వలయును ; మఱియు నొకటి —
యా కడలియందె యున్నవి యీఱు మకర
ము – లవి కామము, క్రోధము, మోహ లోభ
ములును మదము మచ్చరమును; బూని యవ్వి
యీఁదులాడుచును నెరను వెదకు చుండు ;
పసుపు నొడలికి బాగుగాఁ బూసికొనుము ;
పసుపు పసు పనఁగ వివేక మెసఁగు చుండు.
దాని వాసన గాచు నిక్ వాని బారి
నుండి ; కడలి గర్భమున నున్నవి నలుఁ
గెలఁకులఁ జెదరి రత్న రాసులును ముత్తె
ములును, దుమికి బావుకొనుము పొ మ్మనియెను
సాధుశీలుఁడు రామప్రసాద బాబు.

పంచవటిలో ఎత్తైన వేదిక మీాద పీటలపైని కూర్చుండి ఉండిన నరేంద్రుడును అతని మిత్రులును లేచి, వేదికనుండి దిగి వచ్చి గురుదేవుని ప్రక్క నిలుచుండిరి. ఆయన వారిని వెంట నిడుకొని తన గదికి మరలి వచ్చెను. మునుపు తాను చెప్పుచుండిన విషయమును

గూర్చియే గురుదేవుడు ఇంకను ఇట్లు అనెను — "నీవు సముద్ర జలములోనికి దుమికి నప్పుడు, మొసళ్లు నిన్ను మార్కొన వచ్చును. కాని నీ ఒడలికి పసుపు పూత ఉండు నేని అవి నిన్ను తాకవు. నీ లోపల అగాధ మైన నీయాత్మయొక్క లోతున కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనెడి మకరములు అటు ఉన్నవి అనుట యథార్థము. వివేక వైరాగ్యాత్మక మైన పసుపును పూసికొని నిన్ను కాచుకొమ్ము, అప్పుడు అవి నిన్ను తాకవు.

వివేకమును వైరాగ్యమును లేక వట్టి పాండిత్యముచేతను ఉపన్యాసములచేతను నీవు ఏమి సాధింప గలవు ? దేవుడు ఒక్కడే సత్యము, తక్కినవి ఎల్ల మిథ్య; భగవంతుడు ఒక్కడే సత్తు, తక్కినది ఎల్ల అసత్తు. దీనిని ఎఱుగుటే వివేకము.

మొట్టమొదట నీ హృదయము అనెడి ఆలయమున దేవుని ప్రతిష్ఠించుకొనుము. అటు పిమ్మట నీకు నచ్చి నన్ని ఉపన్యాసములు చేయ వచ్చును. నీకు వివేకవైరాగ్యములు అలవడక ఉన్నచో, వట్టి బ్రహ్మానుసంధానము వలన ఏమి లాభము బడయ గలవు ? అది వట్టి శంఖధ్వనియే.

ఒకానొక పల్లెలో పద్మలోచనుడు అను యువకుడు ఒకడు ఉండెను. జనులు అతనిపేరును పోడో(పద్దయ్య)అనిసంగ్రహపఱచి వ్యవహరించుచుండిరి. ఆ పల్లెలోనే జీర్ణమై పాడువడిన గుడి యొకటిఉండెను. దానిలో విగ్రహము ఏదియు లేదు. పడిపోయిన గోడలమీద అశ్వత్థాది వృక్షములు పెరిగి ఉండినవి. గబ్బిలములు లోపల కాపురము ఉంSinavi. అవి పడవేసిన పెంటయు దుమ్మును నేలను కప్పి ఉండినవి. పల్లెప్రజలు ఆ గుడిలో అడుగు పెట్టుట మానుకొనిరి. ఒకనాడు మునిమాపు వేళ దాటిన పిమ్మట, ఆగుడినుండి శంఖధ్వని వెలువడుచు పల్లెప్రజలకు విన నైనది. ఎవ రైనను విగ్రహమును ప్రతిష్ఠించి సాయంకాలారాధనను చేయు చున్నా రేమో అని వారు అనుకొనిరి. వారిలో ఒకడు మెల్లగ తలుపు తెరచెను, చూచు సరికి

మూలలో శంఖము ఊదుచు పద్మలోచనుడు నిలబడి యుండెను. విగ్రహము ఏదియును లేదు. గుడిలో పెంట ఊడ్చుట కాని నేలను కడుగుట కాని జరిగి ఉండ లేదు. మురికియును పెంటయును సర్వత్ర నిండి యుండినవి. అప్పుడు అతడు పోటోను ఇట్లు కసరెను ___

విగ్రహంబును నుంపకే వెట్టి వెడఁగ
ఊఁదుచుంటివి శంఖంబు నూర కిచట
గబ్బిలంబులు పదియు నొక్కండు రాత్రు
లందుఁ బగళులందును గుడియందుఁ గూయు
చున్న గోలను హెచ్చించు చుంటి, వంతె.

నీవు భగవత్సాక్షాత్కారమును గోరుదు వేనియు, దేవుని నీ హృదయపీఠమున నెలకొల్పుకో గోరుదు వేనియు, వట్టి రొద చేయుటచే ఎట్టి యుపయోగమును ఉండదు. మొదట నీ మనస్సును శుభ్ర పఱచుకొనుము. పరిశుద్ధ మైన హృదయమున భగవంతుడు నెల కొనును. గుడిలో గబ్బిలములు పడవేసిన పెంట నల్గడల ఉండు నేని, పవిత్ర మైన దేవుని మూర్తిని నీవు అచ్చటికి కొని రా లేవు. పదు నొక్కండు గబ్బిలములు ఏవి అనగా పదునొక్కండు ఇంద్రియము లే. ఐదు జ్ఞానేంద్రియములును ఐదు కర్మేంద్రియములును మనసును పదు నొక్కండు ఇంద్రియములు అన బరగును.

మొదట దేవుని ప్రతిష్ఠించుకొని, తర్వాత నీ హృదయమునకు సంతృప్తి గలుగు నంత వఱకును ఉపన్యాసములు చేయు చుండుము. మొదట లోతునకు దిగుము. అడుగునకు ఏగి అచ్చట ఉన్న మణులను సేకరించుకొనుము. తర్వాత తక్కిన పనులను చేయ వచ్చును. ఐనను లోతునకు దూకుట ఎవరికిని ఇష్టము కాదు. ప్రజలలో జ్ఞాన సాధన లేదు, ప్రార్థన లేదు, వైరాగ్యము లేదు, త్యాగము లేదు. ఒకటి రెండు మాటలు నేర్చుకొన్నారో లేదో వెంటనే ఉపన్యాసములు చేయ దొడంగుదురు. ఇతరులకు బోధించుట కష్ట మైన పని.

భగవత్సాక్షాత్కారము లభింప వలెను, భగవన్నియోగము పొంద వలెను, అటు తర్వాతనే ఉపదేశించు అర్హత కలుగును.

ఇట్లు ప్రసంగించుచు గురుదేవుడు వసార పడమటికొరకు వచ్చెను. మహేంద్రుడు అతని ప్రక్కనే ఉండెను. వివేకవైరాగ్యములు లేకున్న భగవత్సాక్షాత్కారము గలుగదు అని గురుదేవుడు పలుమార్లు చెప్పి ఉండెను. దానిని విని మహేంద్రుడు మనసులో వ్యధ జెందుచుండెను. అతనికి పెండ్లి ఐనది. అతడు ఇరువది యెనిమిదేండ్ల వయస్సు గల యువకుడు, పాశ్చాత్యపద్ధతిలో కళాశాలలో చదువుకొన్నవాడు, విధికి కట్టువడు స్వభావము గల వాడు. "వివేక వైరాగ్యములు అనగా కామినీకాంచనపరిత్యాగమేనా" అని ఆయన తనలో ప్రశ్నించుకొనెను. నిక్కముగ అతనికి ఏమి చేయుటకును పాలు పోలేదు.

మ — (గురుదేవునితో) "నన్ను ఉపేక్షించుచున్నావు, నేను ఆత్మహత్య చేసికొందు" నని యొకని భార్య చెప్పెనేని అప్పుడు అతడు ఏమి చేయ వలెను?

గురుదేవుడు — [తీవ్రమైన కంఠధ్వనితో] ఆధ్యాత్మికజీవితమునకు పత్ని అడ్డు దగులు నేని, ఆమెను త్యజింపుము, ఆమెను ఆత్మహత్య చేసికొననిమ్ము, వేఱు ఏమి కావలసినను చేసికో నిమ్ము. పతి జ్ఞానసాధనలను చెడగొట్టు పత్ని పాపిని.

మహేంద్రుడు గోడకు ఆనుకొని, గంభీరము ఐన ఆలోచనలో మునిగెను. నరేంద్రాది భక్తులు కొన్ని నిమిషముల కాలము నిశ్శబ్దముగ ఉండిరి. వారితో పెక్కు మాటలాడి, గురుదేవుడు తటాలున మహేంద్రుని వైపు తిరిగి చెవిలో — "ఐనను, ఒకనికి యథార్థమైన దైవభక్తి కుదురు నేని, రాజేమి, దుర్జను లేమి, భార్య ఏమి — అందఱును అతనికి వశపడుదురు. భర్తలో ఉన్న యథార్థ దైవభక్తి, కాలక్రమమున భార్యకు గూడ ఆధ్యాత్మిక జీవితమును గడుపుటకు

తోడ్పడ వచ్చును. భర్త ధర్మపరుడు ఐనచో, దైవానుగ్రహమున భార్యయు అతనిని అనుసరింప వచ్చును.''

ఈ మాటలు మహేంద్రుని వ్యధిత మనస్సుకు మిక్కిలి ఊరట గూర్చినవి. ''ఆమె ఆత్మహత్య చేసికొనిన చేసికోనీ, దానికి నేను ఏమి చేయ గలను'' అనియే అతడు ఇంతసేపును అనుకొనుచుండెను.

మహేంద్రుడు — [గురుదేవునితో] ఈ లోకము నిజముగ భయంకర మైన చోటే.

గురుదేవుడు — [భక్తులతో] కాబట్టియే చైతన్యుడు, తన సహచరు డైన నిత్యానందునితో ''సోదరా, విన వోయి, ఐహిక పరులకు మోక్షము కలుగు ఆసపాటే లేదు'' అనెను.

మఱి యొకప్పుడు గురుదేవుడు మహేంద్రునితో ఏకాంతమున ఇట్లు చెప్పి ఉండెను — ''హృదయపూర్వక మైన భగవద్భక్తి లేని ఐహికపరునకు గతిలేదు అనుట వాస్తవము. భగవత్సాక్షాత్కారము పొందినవాడు, పొందిన పిమ్మట ఈలోకముననే ఉన్నను దేనికిని భయపడ అక్కఱ లేదు. హృదయపూర్వక మైన భక్తిని అలవఱచుకోగోరు వాడు అప్పు డప్పుడు ఏకాంతమునకు ఏగి ఆధ్యాత్మిక సాధనలు చేయు చుండ వలెను. అట్టి భక్తి అలవడిన పిమ్మట ఇక ఎట్టిభయమునకును ప్రసక్తియే ఉండదు. చైతన్యుని భక్తులలో గృహస్థులు అనేకులు ఉండిరి. వారు పేరునకు గృహస్థులే కాని, ఐహికసంగము గల వారు వారిలో ఒక్కరును లేరు.

అప్పటికి మధ్యాహ్న మైనది. గుడిలో ఆరాధనయు నైవేద్యమును ఐనవి, భోగముద్ర ఐనది, శ్రీరామకృష్ణుడు భుజింప గూర్చుండెను. నరేంద్రాది భక్తులు గుమి గూడి ప్రసాదమును ఆరగించిరి.

1882 వ సంవత్సరము అక్టోబరు తే 22 ది ఆదివారము.

నాడు విజయదశమి, దుర్గాపూజోత్సవమున తుది దినము, మట్టి విగ్రహమును నదీజలములందో తటాకజలములందో ముంచు దినము.

ఉదయము తొమ్మిది గంట లప్పుడు దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణుడు తనగదిలో చిన్నమంచముపై మేను వాల్చి యుండెను. ఆయనకు ఒకప్రక్క మహేంద్రుడు నేలపై కూర్చుండెను. రాఖాలు కూడ ఆ దినాలలో గురుదేవునితోడనే ఉండెను. నరేంద్ర — భవనాథులు తఱచు వచ్చి చూచి పోవుచుండిరి. బాబురాము గురుదేవుని ఒకటి రెండు పర్యాయములు మాత్రమే దర్శించి యుండెను.

గురుదేవుడు — [మహేంద్రునితో] నీ ధ్యానము ఇప్పుడు ఎట్లు సాగుచున్నది? దేవుని సాకార నిరాకార వైఖరులలో నీకు నచ్చినది ఏది?

మ — స్వామీ, సాకారదైవముపై నా మనస్సును నేను ఇప్పుడు ఏకాగ్ర మొనర్చుకోలేకున్నాను. నిరాకారదైవముమీద కూడ నా మనస్సును నిశ్చలముగ నిలుపుకోలేకున్నాను.

గురుదేవుడు — మనస్సును తటాలున నిరాకారదైవముపై నిలుపుట శక్యము కాదు అని నీకు ఇప్పుడు తెలిసినది. కావున ప్రారంభదశలో దైవమును సాకారముగ భావించుటే యుక్తము.

మ — బంకమట్టి బొమ్మలను ధ్యానింపు మందురా?

గురుదేవుడు — బంకమట్టి బొమ్మలు ఎందు కని? అవి చిత్స్వరూపములే.

మ — అటులైనను, కర చరణాది శరీరావయవములను భావింప వలయును గదా. ప్రారంభదశలో దైవమును సాకారముగ ధ్యానింప కున్న మనస్సునకు ఏకాగ్రత కుదురనే కుదురదు అనుట నాకు స్పష్టపడుచున్నది. ఆ విషయమును మీరు నాకు దెలిపియుంటిరి. సరియే. వివిధరూపములను దాల్చుట దేవునకు సులభమే కదా. ఎవ డైనను సరే, తన తల్లి రూపముననే దేవుని ధ్యానింప వచ్చునా?

గురుదేవుడు — ఔను, తల్లిని ఆరాధింప వలసినదే, నిజముగ ఆమె ప్రత్యక్షబ్రహ్మస్వరూపమే.

మహేంద్రుడు మౌనముగ కూర్చుండెను. కొన్ని నిమిషముల పిదప అతడు గురుదేవుని "పరమాత్మను నిరాకారముగ ధ్యానించువానికి ఎట్లు ఉండును? ఎట్లు ఉండునో మాటలలో వర్ణింప శక్యము కాదా?" అని అడిగెను. గురుదేవుడు కొంత ఆలోచించి "అది ఎట్లు ఉండునో నీకు తెలియునా?" అనెను. కొంతసేపు ఊరకుండి ఆయన దేవుని సాకారతా నిరాకారతలను సాక్షాత్కరించుకొన్న వాని అనుభవములను గూర్చి కొన్ని మాటలను మహేంద్రునితో చెప్పెను.

గురుదేవుడు — దీనిని సరిగ అర్థముచేసికొనవలె అన్న ఆధ్యాత్మిక సాధన చేయవలెను. తెలిసినదా? ఒక గదిలో ధనరాసి ఉన్నది అనుకొనుము. నీవు దానిని చూడగోరుదువేని, దానిని గైకొనగోరుదువేని, అందులకు నీవు శ్రమపడి తాళపు చెవిని సాధించి, బీగమును తెఱవవలెను. తరువాత నీవు ధనమును బయటికి తెచ్చుకొనవలెను. అట్లు కాక, గది బీగము వేయబడియే ఉన్నది అనుకొనుము. నీవు ఆ గదికి ప్రక్కన వాకిలియొద్దనే, నీలో నీవే, తలుపును తెఱచినట్లును, ఇనుపపెట్టె తాళము తెఱచినట్లును, సొమ్మును బయటికి తీసినట్లును తలపోసికొనుచుందువేని, ఆ వట్టి తలపోతలవలన నీవు ఏమియు సాధింపలేవు.

నీవు తప్పక సాధన చేయవలెను.

జ్ఞానులు పరమాత్మను నిరాకారముగ భావింతురు. భగవదవతారాలను వారు అంగీకరింపరు. శ్రీకృష్ణుని గొనియాడుచు, అర్జునుడు "నీవు నిర్గుణ బ్రహ్మమవు" అనెనట. శ్రీకృష్ణుడు అతనితో "నాతో రమ్ము, నేను నిర్గుణబ్రహ్మమను ఐనదియు కానిదియు నీవు తెలిసికొందువు" అని అతనిని ఒక చోటికి పిలుచుకొని పోయి "ఇక్కడ నీకు ఏమి అగపడుచున్నది?" అని అడిగెనట. అర్జునుడు "ఒక చెట్టు అగపడుచున్నది, అందుండి గుత్తులు గుత్తులుగా వ్రేలుచున్న నల్లనికాయలు వాకపండ్ల[బ్లాక్బెర్రీస్]ను బోలినవి అగపడుచున్నవి" అనెనట. అప్పుడు శ్రీకృష్ణుడు "మఱి కొంత దగ్గఱకు

బోయి చూడుము. చెట్లనుండి వ్రేలుచున్నవి నల్లని కాయలగుత్తులు కావు అనియు, లెక్క లేనన్ని నావంటి కృష్ణుల గుంపులు అనియు గుర్తింతువు'' అని చెప్పె నట. అనగా నిర్గుణబ్రహ్మము అనెడి వృక్షములో లెక్కకు మిక్కిలిగ దివ్యావతారాలు అగపడుచును మఱుగువడుచును ఉండు నని అర్థము.

సాకారబ్రహ్మమును లక్ష్యముగ ఉంచుకొనువారి గోష్ఠిలో నేను ఉన్నప్పుడు సాకారబ్రహ్మమును అంగీకరింతును. బ్రహ్మము నిరాకారము అని విశ్వసించువారితోను నేను ఏకీభవింతును.

మ — [చిఱునవ్వుతో] — మనము సర్వేశ్వరుని గుఱించి ప్రసంగించుకొనుచుంటిమి. ఆయన ఎంతటి అపరిచ్ఛిన్నుడో మీరును అంతటి అపరిచ్ఛిన్నులరే. మీ లోతును ఎవరును ఇంత అని నిర్ణయింప లేరు.

గురుదేవుడు — [చిఱునవ్వుతో] — ఆహా! నీకు ఆవిషయము తెలిసిపోయినది అని నేను గ్రహించితిని. ఒక్క సంగతి చెప్పెదను. ఒక్కొక్కడును వివిధమార్గములను అనుసరింప వలెను. ప్రతి మతమును కొంతకాలము అనుష్ఠింప వలెను.

రెండు తెఱగుల యోగులు ఉన్నారు. వివిధ క్షేత్రములకును యాత్రలు చేయుచు ఇంకను మనశ్శాంతి వడయని వారు కొందఱు. అన్ని క్షేత్రములను దర్శించి మనశ్శాంతి బొందిన వారు కొందఱు. శాంత ప్రసన్న చిత్తులై వారు ఒకచోట కుదుటవడుదురు, తర్వాత ఎక్కడికిని కదలరు. ఆ చోటనే వారు సుఖముగ ఉందురు. వేఱు ఒక పుణ్యక్షేత్రమునకు పోవుదము అను తలంపు వారికి కలుగనే కలుగదు. వారిలో ఎవడైన ఒకడు ఏ దేని వేఱు క్షేత్రమునకు పోయి వచ్చినను, అది క్రొత్త జ్ఞానావేశమును అనుభవించుటకే.

పుణ్యక్షేత్రమున జ్ఞానావేశముపుట్టును అనుట నిస్సందేహము. నేను మథుర్‌బాబుతో బృందావనమునకు బోయి ఉంటిని. మాతో హృదయుడును ఉండెను, మథురునింటి మహిళలును ఉండిరి. కాళియ

దమనఘట్టమును చూచినంతనే నాలో దివ్యావేశము ఒకటి ఉప్పొంగెను. నేను పూర్తిగా స్వాధీనము తప్పితిని. చిన్నబిడ్డకు చేయించినట్లుగా హృదయుడు నాకు స్నానము చేయించెడివాడు.

సందెకాలములలో, పచ్చికబయళ్లనుండి యమునాతీరమున గోవులు మరలి వచ్చుచున్నప్పుడు ఆ గోపరాగవేళలలో, నేను అచ్చట పచారు చేయుచుందును. గోవులను జూచినంతనే నా మనమున గోపాలుని భావన రగుల్కొనును. వెఱ్ఱివానివలె నేను "కృష్ణుడు ఏడి; నా కృష్ణుడు ఏడీ" అని కేకలు ఇడుచు పరువు లెత్తుచుందును.

శ్యామకుండమునకును రాధాకుండమునకును* నేను పల్లకిలో పోయితిని. పుణ్యగోవర్ధనమును దర్శించుటకై పల్లకీనుండి దిగితిని. ఆ కొండను జూచినంతనే నేను ఉద్రిక్త దివ్యభావ పరవశుడనై దాని శిఖరమునకు పరుగిడితిని. నాకు బాహ్యలోకజ్ఞానము పూర్తిగ పోయెను. అక్కడ ఉన్నవారు. తోడ్పడి నన్ను క్రిందికి జేర్చిరి. శ్యామకుండ రాధాకుండములకు బోవు దారిలో పచ్చికబయళ్లను, చెట్లను. పొదలను. పక్షులను, జింకలను జూచినప్పుడు కూడ ఆనంద పరవశుడను ఐతిని. నా ఉడుపులు అన్నియును బాష్పములచే తడిసి పోయినవి. "కృష్ణా, ఇక్కడ ఆ పురాణకాలములో ఉండినవి అన్నియు అట్లే ఉన్నవి. నీవు ఒక్కడవు మాత్రమే లేవు." అని నేను అంటిని. పల్లకిలో కూర్చున్నప్పుడు నాకు నోట మాట రాకుండెను. హృదయుడు పల్లకి వెంబడినే వచ్చుచుండెను. నన్ను మెలకువతో జూచుకొండు అని అతడు పల్లకీమోపరులను ఎచ్చరించి ఉండెను.

బృందావనమున గంగామాయికి నాపైని మిక్కుటము ఐన మక్కువ ఏర్పడినది. ఆమె ఒక వృద్ధురాలు, నిధువన సమీపమున

---

* రాధాకృష్ణుల విహార ప్రసిద్ధములైన తావులు, మథురకు సమీపమున.

ఒక కుటీరమున ఆమె ఒంటరిగ కాపురము ఉండెను. నా ఆనందపార వశ్యమును ఆధ్యాత్మికదశను గుఱించి చెప్పుచు "ఈ రూపున ఉన్న రాధయే ఇతడు" అని ఆమె చెప్పినది. నన్ను ఆమె "దులాలి" "ముద్దబ్బాయి" అని పిలుచుచుండెడిది. ఆమెతో ఉన్నప్పుడు, నేను అన్నపానములను స్నానమును గూడ మఱచిపోవుచుంటిని. ఇంటికి పోవుటయను తలంపే లేకుండెడిది. కొన్ని దినములు హృదయుడు అన్నమును ఇంటినుండి తెచ్చి నాకు పెట్టు చుండెను. గంగామా యియు తాను స్వయముగ వండిన అన్నమును నాకు పెట్టెడిది.

గంగామాయికి భావసమాధి అప్పుడప్పుడు గల్గుచుండెడిది. అప్పుడు ఆమెను జూచుటకు ప్రజలు తండతండములుగ వత్తురు. ఒకనాడు ఆనందపరవశదశలో ఆమెహృదయుని భుజములపై ఎక్కెను.

ఆమెను విడిచి కలకత్తాకు వచ్చుటకు నాకు ఇష్టము లేకుండెను. నేను ఆమెతో గూడనే ఉండుటకు కావలసిన ఏర్పాట్లు అన్నియు జరిగినవి. పునఃపాకము చేసిన అన్నమును నేను తినవలయును అనియు, కుటీరమునకు ఒకవైపు ఆమె పాన్పును వేఱు ఒక వైపు నాపాన్పును వేయ వలయును అనియు — ఇంకను ఇట్టి ఏర్పాట్లు అన్నియు ఐనవి. అప్పుడు హృదయుడు "నీకు జీర్ణశక్తి చాల తక్కువ. నిన్ను ఎవరు విచారించుకొందురు" అని నన్ను అడిగెను. "ఎవరో ఏల? నేనే ఆయనను విచారించుకొందును, నేనే ఉపచరింతును." అని గంగా మాయి చెప్పెను. నన్ను ఒక చేయి పట్టుకొని హృదయుడు ఒకవైపు లాగుచుండెను. వేఱు ఒక చేయి పట్టుకొని గంగామాయి వేఱు ఒక వంకకు లాగుచుండెను. అప్పుడు గుడితోట నహబత్తులో ఒంటరిగ ఉన్న మా అమ్మ నా తలంపునకు వచ్చినది. ఆమెను విడిచి ఉండుట నాకు అసాధ్యము అని తోచెను. కావున గంగామాయితో "నేను పోక తప్పదు" అంటిని. బృందావనవాతావరణము నాకు చాల ఇంపుగ ఉండెను."

సుమారు 11 గంట లప్పుడు గురుదేవుడు కాళిగుడి ప్రసాద మును ఆరగించెను. మాధ్యాహ్నిక విశ్రాంతి ముగియగానే, ఆయన భక్తులతో తన సల్లాపమును మరల ఆరంభించెను. మాటిమాటికిని ఓంకారమునో గుడిలో వెలసి ఉన్న వేల్పుల పుణ్యనామములనో ఉచ్చరించుచుండెను.

ప్రొద్దు గ్రుంకిన మీదట గుడిలో సాయంకాలారాధనము ఐనది. ఆ దినము విజయదశమి గనుక భక్తులు ఎల్లరును మొదట లోకజననికి మ్రొక్కి పిమ్మట గురుదేవుని పాదధూళిని శిరములపై ఇడుకొనిరి.*



* ఇది ఒకపద్ధతి నమస్కారము, పూజ్యుని చరణములను భక్తుడు తన నొసటితో అంటుట.

నాలుగవ ప్రకరణము

# గురుదేవుడును కేశవుడును

1882వ సంవత్సరము అక్టోబరు తే 27 ది.

అది శుక్రవారము, లక్ష్మీపూజాదినము. గంగానదియందు శ్రీరామకృష్ణుడు పడవలో వాహ్యాళి పోవుటకు చేయ వలసిన యేర్పాట్లను, కేశవచంద్రసేను చేసి ఉండెను.

మధ్యాహ్నము దాటిన తర్వాత నాలుగు గంట లప్పుడు పొగఓడ దక్షిణేశ్వరమున కాళిగుడికి ప్రక్కగా గంగలో లంగరు వేసి ఆగెను. ఆ ఓడలో కేశవుడును అతని బ్రాహ్మసమాజానుచరులును ఉండిరి. ఆ ప్రయాణికులకు ఎదుట స్నానఘట్టమును దిగుడు మెట్లును గాన నగు చుండినవి. వారికి ఎడమ వైపుగా, గుడి ప్రాకారమున ఆఱు శివాలయాలు ఉన్నవి. కుడి వైపుగ మఱి ఒక ఆఱు శివాలయాలు గుమిగా ఉన్నవి. కాళిగుడి గోపురపు తెలి శిఖరములకును పంచవటిలోని వృక్షముల కొసలకును దేవదారువృక్షములకును శరన్నీలాకాశముచే పరభాగ శోభ చేకూరి ఉండెను. రెండు నహబత్తులకును నడుమ ఉన్న తోటలు ఘుమఘుమ పరిమళించు పూలతో నిండి ఉండినవి. గంగగట్టు పొడవునను పూల తీవెలు వరుసలు తీఱి ఉండినవి. గంగానది పరమపవిత్ర మైనది, అత్యంత ప్రాచీన మైన భారతీయుల సంస్కృతితో సంబంధపడినది. దాని నీరు గౌరవర్ణము గలది. ఆ నీట వినీలాకాశము ప్రతిఫలించుచుండెను. శాంతి మార్దవ భరిత మైన బాహ్యలోకమును జూచినప్పుడు బ్రాహ్మసమాజ భక్తుల డెందములందును శాంతి నిండుకొన్నది.

శ్రీరామకృష్ణుడు తన గదిలో విజయునితోను హరలాలుతోను మాటాడుచుండెను. కేశవుని శిష్యులు అనేకులు గదిలో ప్రవేశించిరి.

గురుదేవునకు ప్రణమిల్లి వారు "స్వామీ, నావ వచ్చి ఉన్నది. మిమ్ము తోడ్కొని రండని కేశవబాబుగారు మమ్ము అంపినారు" — అనిరి. గురుదేవుడు ఒక చిన్న పడవలో ఎక్కి ఓడయొద్దకు పోవలసి ఉండెను. పడవలో ఎక్కెనో లేదో, ఆయన సమాధినిమగ్నుడై బాహ్యస్మృతిని గోల్పోయెను. ఆయనతో విజయుడు ఉండెను.

ప్రయాణికులలో మహేంద్రుడును ఉండెను. పడవ వచ్చి ఓడ ప్రక్క నిలువగానే, శ్రీరామకృష్ణుని జూచు ఉబలాటముతో అందరును గ్రాదివైపునకు పరుగిడిరి. ఆయనను భద్రముగ ఓడమీదికి ఎక్కించుకో వలె అని కేశవుడు వ్యాకులపడుచుండెను. చాల శ్రమ పడి గురుదేవునకు బాహ్యలోకస్మృతిని మరల గలిగించి, ఆయనను నావలో ఒకగదికి చేర్చిరి. కాని ఆయన మనస్సు ఇంకను ఉన్ముఖము గనే ఉండెను. ఆయన ఒకభక్తునిమీదికి ఒఱిగి, ఒక బొమ్మ రీతిగా నడచెను. కేశవుడును ఇతరులును ఆయనకు ప్రణమిల్లిరి, కాని వారిని ఆయన గుర్తింప లేదు. ఆ గదిలో కొన్నికుర్చీలును ఒకబల్లయు ఉండినవి. గురుదేవుని ఒకకుర్చీపై కూర్చుండబెట్టి, కేశవుడును విజయుడును చెఱి ఒక కుర్చిపై కూర్చుండిరి. భక్తులలో కొందఱు మాత్రము కూర్చుండిరి, వారిలోను నేలపై కూర్చున్న వారి సంఖ్యయే ఎక్కువ. తక్కిన అధికసంఖ్యాకులు బయటనే నిలబడి ఉండ వలసి ఉండెను. వారు ఆత్రముతో కిటికీలగుండను వాకిలిగుండను తొంగి తొంగి చూచుచుండిరి. శ్రీరామకృష్ణుడు మరల గాఢసమాధిలో మునిగెను, బాహ్యలోకస్మృతి బొత్తుగా లేక పోయెను.

గదిలో గుంపు నిండినందున గాలి ఆడ లేదు. కేశవుడు కిటికీలు తెఱచెను. విజయునితో సమాగమము అతనిని కలవరపఱచెను. ఏల యన బ్రాహ్మసమాజసూత్రములను కొన్నిటిని గూర్చి ఇరువురకును భిన్నాభిప్రాయములు గలిగి ఉండెను. విజయుడు కేశవుని వర్గము నుండి చీలిపోయి వేఱు ఒకవర్గమును జేరుకొని ఉండెను.

బ్రాహ్మసమాజభక్తులు గురుదేవుని ఆసాసగ చూచుచుండిరి.

క్రమక్రమముగ ఆయనకు బాహ్యలోకస్మృతి కలిగినది. కాని దివ్యోన్మాదము అట్లే ఉండెను. "అమ్మా, నన్ను ఇచ్చటికి ఏల కొని వచ్చితివి? వీరు అందఱును బద్ధాత్ములే కాని ముక్తాత్ములు గారు. వీరికి బంధవిముక్తి కలిగింప నా తరమా?" అని ఆయన తనలో గొణుగుకొనెను. అక్కడ సమావేశమై ఉన్నవారు అందఱును సంసారకారాగారమున బద్ధులై ఉన్నట్లు గురుదేవుడు కనుగొనెనా? వారికి వేఱు శరణము లేనందుచేత, గురుదేవుడు జననితో ఇట్లు అనెనా?

శ్రీరామకృష్ణునకు బాహ్యలోకస్మృతి క్రమక్రమముగ గలుగుచుండెను. ఘాజీపూరువాడు అగు నీలమాధవుడును బ్రాహ్మసమాజ భక్తులలో ఒకడును పవ్హారీబాబాను గుఱించి మాటాడుకొనుచుండిరి. బ్రాహ్మభక్తులలో మఱియొకడు గురుదేవునితో — "స్వామీ, వీరు పవ్హారీబాబాను దర్శించి వచ్చినవారు. పవ్హారిబాబా ఘాజీపూరులో వసించును, ఆయనయు తమవంటి ఒక యోగి" అనెను. గురుదేవునకు ఇంకను నోట మాట వెలువడుట లేదు. ఆయన చిఱునవ్వు నవ్వెను. అంతే. "స్వామీ, పవ్హారీబాబా తనగదిలో మీపటమును ఒకదానిని ఉంచుకొని ఉన్నాడు" అని కూడ ఆభక్తుడు తెలిపెను. గురుదేవుడు తన ఒడలిని జూపి చిఱునవ్వుతో "ఇది దిండు గొసెనయే" అనెను.

గురుదేవుడు ఇంకను ఇట్లు అనెను — కాని భక్తుని డెందము భగవంతునకు నెలవు అనుటను మీరు జ్ఞప్తియందు ఉంచుకోవలెను. సకలప్రాణులందును దేవుడు ఉన్నాడు అనుటకు సందేహము లేదు కాని దేవుడు భక్తునిహృదయమున తన్ను విశిష్టరీతిని చూపుకొనును. ఒకభూస్వామి తన భూమిలో ప్రతిభాగమునకును ఎప్పుడో ఒకప్పుడు వచ్చుచు ఉండును గాని, ఆయనకు కొలువుకూటము ఒకటి ఉండును, అక్కడనే ఆయన సాధారణముగ ఉండును అని జనులు అందురు. భక్తునిహృదయము భగవంతుని కొలువుకూటము.

ఎవనిని జ్ఞానులు బ్రహ్మము అని పేర్కొందురో, అతనినే యోగులు ఆత్మ అనియును, భక్తులు భగవంతుడు అనియును వ్యవహరింతురు. ఒక్క బ్రాహ్మణునే గుడిలో పూజించుచున్నప్పుడు పూజారి అందుము, వంటింట వండుచున్నప్పుడు వంటవాడు అందుము. జ్ఞాని జ్ఞానమార్గమును అనుసరించుచు, తత్త్వమునుగూర్చి తర్కించుచు, "ఇది కాదు ఇది కాదు" అని తత్త్వముకానిదాని నెల్ల త్రోసివేయుచుండును. బ్రహ్మము ఇదియును గాదు, అదియును గాదు, జగత్తును బ్రహ్మము కాదు, అందలి ప్రాణికోటియు బ్రహ్మము కాదు. ఇట్లు తర్కింపగా తర్కింపగా మనస్సునకు నిశ్చలత కలుగును. కడకు మనస్సును మాయమై, సాధకుడు సమాధిలో మునుగును. అదే బ్రహ్మజ్ఞానము. బ్రహ్మము ఒక్కటే తథ్యము అనియు, జగత్తు మిథ్య అనియు, జ్ఞానికి ఉన్న నమ్మిక చాల దృఢ మైనది. ఈ నామ రూపములు అన్నియును కలలవలె మిథ్యలే. బ్రహ్మము అనిర్వాచ్య మైనది. బ్రహ్మము ఒక వ్యక్తి అని కూడ ఎవరును చెప్ప లేరు. ఇది వేదాంత శాస్త్రానుసారు లైన జ్ఞానుల అభిప్రాయము.

మఱి భక్తులు అన్ననో, మనోదశలను అన్నిటిని వాస్తవములు అని అంగీకరింతురు. మేలుకొని ఉండుదశ కూడ వాస్తవమే అని వారి అభిప్రాయము. వారికి ఈ జగత్తు స్వప్నమును బోలిన మిథ్య కాదు. భగవచ్ఛక్తికిని మహిమకును ప్రత్యక్షరూపమే ఈ విశ్వము అని వారు అందురు. ఆకాశము, నక్షత్రములు, చంద్రసూర్యులు, కొండలు, సముద్రములు, మానవులు, జంతువులు — ఈ సమస్తమునకును దేవుడు సృష్టికర్త. ఇవి ఎల్ల ఆయన విభూతి. ఆయన మనలో ఉన్నాడు. మన హృదయాలలో ఉన్నాడు, వెలుపటను ఆయన ఉన్నాడు, భక్తిసాధనలో మిక్కిలి ప్రౌఢిని గడించినవారు ఏమి అందురు అనగా — ఇరువదినాలుగు తత్త్వములుగను, విశ్వముగను, సకలప్రాణులుగను, భగవంతుడే రూపొందినాడు — అందురు. భగవద్భక్తులు చక్కెరను ఆరగింప గోరుదురే కాని, చక్కెరగా మాఱుదము అని కోరరు [అందఱును నవ్వుదురు].

భగవంతుని ప్రేమించు వాని అనుభవాలు ఎట్లు ఉండునో మీరు ఎఱుగుదురా? అతని వైఖరి ఇది — "ఓ దేవా, నీవు స్వామివి, నేను నీ దాసుడను; నీవు తల్లివి, నేను నీ బిడ్డను"— లేదా —"నీవే నా తండ్రివి, తల్లివి; నీవు అంగివి, నేను అంగమను". "నేనే బ్రహ్మమను" అని చెప్పుటమాత్రము అతనికి ఇష్టపడదు.

యోగి పరమాత్మను సాక్షాత్కరించుకొనుటకు ప్రయత్నించును. జీవాత్మ పరమాత్మలో ఐక్యము ఒందుట అతని లక్ష్యము. అతడు తన మనస్సును శబ్దాదివిషయములనుండి మరల్చుకొని దానిని పరమాత్మయందే ఏకాగ్రము ఒనర్ప ప్రయత్నించును. కావున సాధన ప్రారంభదశలో ఉన్నప్పుడు అతడు ఏకాంతమునకు పోయి కదలక కూర్చుండి ఏకాంతికశ్రద్ధతో ధ్యానమును అభ్యసించును.

కాని పరతత్త్వము ఏమో ఒక్కటే. భేదిల్లునది పేరే. ఎవడు బ్రహ్మమో నిక్కముగ ఆత్మయు, అతడే, భగవంతుడును అతడే. జ్ఞానమార్గానుసారులకు అతడు బ్రహ్మము, యోగులకు పరమాత్మ, భగవద్భక్తులకు భగవంతుడు.

నావ కలకత్తావైపునకు సాగిపోవుచుండెను. ప్రయాణికుల కన్నులు గురుదేవునందు లగ్నములై ఉండినవి. వారి వీనులు ఆయన వచనామృతమున సక్తములై ఉన్నవి. నావ కదలుచుండుటనే వారు మఱచి ఉండిరి. దేవాలయములతోను తోటలతోను గూడిన దక్షిణేశ్వరమును దాటి వారు చాలదూరము వచ్చిరి. పడవతెడ్లు గంగాజలమును చిలుకుచు పోవుచున్నప్పుడు మూలుగును బోలిన ధ్వని వెలువడు చుండెను. కాని భక్తులు వీనిని అన్నిటిని గమనింపకే ఉండిరి. మంత్రముగ్ధులువోలె వారు ఒక మహాయోగిని తిలకించు చుండిరి, ఆ యోగివదనమును ఒక దివ్యహాసము వెలుగొందించు చుండెను. అతని వదనము ప్రేమను వెదజల్లుచుండెను, అతని కన్నులు ఆనందమున మెఱయుచుండినవి. ఆయన దేవునకుగాను తక్కినసర్వస్వమును త్యజించినవాడు, వేఱు దేనిని ఎఱుంగక దేవుని మాత్రమే

ఎఱిగినవాడు. జ్ఞానసూక్తులు ఆయన పెదవులనుండి ఎడతెంపులేక వెలువడుచుండెను.

గురుదేవుడు— సృష్టి స్థితి సంహారములు, ఈ జగత్తు, ఇందలి ప్రాణులు ఇవి అన్నియును, శక్తి* దాల్చు రూపములే అని అద్వైత వేదాంతమును అనుసరించు జ్ఞానులు చెప్పుదురు. నీవు తర్కించి చూతువేని ఇవి అన్నియు స్వప్నములను బోలిన మిథ్యలే అని నీవు గుర్తింతువు. బ్రహ్మము ఒక్కటే సత్యము. తక్కినది ఎల్లను మిథ్యయే. ఈ శక్తి సైతము స్వప్నమువలె అయథార్థమే.

కాని నీవు బ్రతికినన్నాళ్లు తర్కము సాగించుచునే ఉన్నను, సమాధిలో నీకు నిశ్చలత కుదురువఱకును, నీవు శక్తియేలుబడిని దాటి పోలేవు. 'నేను ధ్యానము చేయుచున్నాను', 'నేను చింతన చేయుచున్నాను' అని చెప్పుచున్నప్పుడు కూడ నీవు ఇంకను శక్తి రాజ్యములో ఆమె యేలుబడిలో సంచరించుచున్నవాడవే.

ఆదిశక్తిలీల సదా సాగుచునే ఉండును. ఆమె క్రీడించుచున్నదియుం బోలె సృజించుచు, సంరక్షించుచు, సంహరించుచు, — ఉండును. ఆ శక్తికే కాళి అని పేరు. నిజముగ కాళి బ్రహ్మమే, బ్రహ్మమును నిజముగ కాళియే. అది ఒక్కతత్త్వమే, అభిన్నము. ఆ తత్త్వము నిర్వ్యాపారము [ = సృష్టిస్థితిసంహారవ్యాపారశూన్యము] అని మనము భావించునప్పుడు దానిని బ్రహ్మము అందుము. ఆ వ్యాపారములను అది నిర్వహించునప్పుడు ఆ తత్త్వమునే శక్తి అనియును కాళి అనియును పేర్కొందుము. నామరూపములలో మాత్రమే భేదము, వేఱు భేదము లేదు, తత్త్వము ఒక్కటే.

కల్పాంత మప్పుడు, జగత్సంహారము ఐన పిదప, అనంతర సృష్టికి కావలసిన విత్తనములను జగజ్జనని భద్రపఱచును. వృద్ధ గృహిణులు బానలు ఉంచుకొని అందు వివిధగృహోపకరణములను

---

* వేదాంతశాస్త్రమున ఈ శక్తి 'మాయ' అని ప్రసిద్ధము.

భద్రపఱచి ఉంచుకొందురు గదా! అట్లే జగజ్జననియు [అందఱును నవ్వుదురు].

ఔను. గృహిణులయొద్ద ఘనీభవించిన కడలినురుగును, నీల మాత్రలను, దోస – గుమ్మడి – పొట్ల మున్నగు విత్తనముల కట్టలను భద్రపఱచుటకు అట్టి బానలు ఉండును. కావలసినప్పుడు వారు వానిని బయటికి తీయుచుందురు. అట్లే బ్రహ్మము దాల్చిన ప్రత్యక్ష రూపమే ఐన జగజ్జననియును, జగత్సంహారానంతరము తర్వాతి సృష్టికి కావలసిన విత్తనములను సేకరించును. ఆమె ఈ వ్యావహారిక జగమును సృష్టించి, ఇందు అంతటను తాను వ్యాపించి ఉండును. వేదములలో సృష్టికి, సాలీని నేత ఉపమానముగ చెప్పబడి ఉన్నది. సాలెపురుగు తననుండి సాలెగూటిను వెలువఱించుకొని తాను అందు వసించును. ఈ విశ్వమునకు, భగవంతుడు తానే ఆధారమును ఆధేయమును ఐ ఉన్నాడు.

నా జగజ్జనని కాళి మేని వన్నె నలుపా? మనము దూరము నుండి చూచుచున్నందున ఆమె నల్లగ కనిపించుచున్నది. సమీపించి చూతు మేని ఆమె నలుపు కాదు. దూరమునుండి చూచినచో ఆకాశము నీలవర్ణము గలదిగ అగపడును. సమీపించి చూతు వేని, ఆకాశమునకు రంగు లేనే లేదు అని నీవు కనుగొందువు. సముద్ర జలము దూరమునకు నీలముగ అగపడును. దరిసి ఆ నీటిని చేతిలోనికి తీసికొని చూచినప్పుడు, దానికి ఏరంగును లేదు అని నీవు గ్రహింతువు.

బంధించుటయు బంధమునుండి విడిపించుటయు రెండును లోక జనని వ్యాపారములే. ఆమె మాయచేతనే లౌకిక చేతనులు కామినీ కాంచనములందు తగుల్కొందురు, మరల ఆమె కృపచేతనే వారు బంధవిముక్తి ఒందుదురు. ఆమెకు తారిణి అనియు భవబంధవిమోచని అనియు పేళ్లు.

జగన్మాతకు సదా ఆటలందును వినోదములందును ప్రీతి. ఈ జగత్తు ఆమె లీలయే. ఆమె పట్టుదల గలది, తన యిచ్చ చొప్పుననే

తాను నడవ వలెను. ఆమె ఆనందమయి. లక్షకు ఒక్కరికి ఆమె మోక్షము ఇచ్చుచుండును.

ఒక బ్రాహ్మభక్తుడు — స్వామీ, ఆమెకు నచ్చినచో ఆమె మోక్షమును అందఱికిని ఇయ్య వచ్చును గదా! మఱి ఎందులకు ఆమె మనలను ఈ సంసారమున బంధించి ఉంచుట?

గురుదేవుడు — అది ఆమె సంకల్పము. తాను సృజించిన ప్రాణులతోడి తన ఆట సాగుచునే ఉండవలయును అని ఆమె కోరిక. దాగుడుమూత ఆటలో మొదటనే అందఱును 'తల్లి'ని తాకుచు రేని, పరుగెత్తుటయు తఱుముటయు వెంటనే ఆగిపోవును. ఇక ఆట ఎట్లు సాగును? సాగ కున్న అమ్మకు అప్రీతి కలుగును. ఆట సాగుచుండుటె ఆమెకు వినోదము.

బ్రాహ్మభక్తుడు — స్వామీ, సర్వసంగపరిత్యాగము లేకున్న దైవసాక్షాత్కారము కలుగదా?

గురుదేవుడు — [నవ్వుతో] నీకు కలుగును. నీవు ఏల అన్నిటిని విడువ వలయును? నీవు మధ్యమార్గమును అనుసరించుచున్నావు. నీమట్టుకు నీకు అది సరియే.

నీతో నిజము చెప్పుచున్నాను. నీవు ఈ లోకమున ఉండుటలో ఎట్టిదోషమును లేదు. కాని నీ మనస్సును నీవు దైవోన్ముఖము చేసికొన వలెను. చేసికొన కున్న, నీవు నెగ్గవు. ఒకచేత నీ ఐహికకర్తవ్యములను నిర్వహింపుము, వేఱు ఒకచేత దేవుని అవలంబింపుము. ఐహికకర్తవ్యములు ముగిసినంతనే నీవు రెండుచేతులతోను దేవునొక్కనినే అవలంబింప గల్గుదువు.

ఇది అంతయును మనస్సునకు సంబంధించినది. బంధమును మోక్షమును మనస్సునకే. మనస్సునకు నీవు వేయు రంగు అంటుకొనును. అది, చాకలి అప్పుడే తెచ్చిన తెల్ల చలవ ఉడుపులను బోలినది. వానిని నీవు ఎఱుపు రంగులో ముంచిన, అవి ఎఱ్ఱనివి అగును. నీలవర్ణములోనో ఆకుపచ్చవర్ణములోనో ముంచిన, అవి

నీలవర్ణముగలవో ఆకుపచ్చవర్ణముగలవో అగును. నీవు వానిని ముంచు రంగు ఏదైనను కావచ్చును, ఆ రంగే వానికి ఎక్కును. ఒకటి రెండు ఇంగ్లీషు ముక్కలు చదువగనే, వెంటనే మీరు ఇంగ్లీషు మాటలాడ ఆరంభింతురే. మీరు చూడ లేదా? వెంటనే మీరు బూట్లను తొడుగుకొందురు, ఈల పాటలను ఆరంభింతురు, ఇంకను అట్టి పనులను చేయుదురు. అది ఉండు నేని, దాని తోబాటు ఇవియు ఉండును. అట్లే సంస్కృతమును చదివిన పండితుడు సంస్కృతశ్లోకాలు పాడి గింగురు మనిపించును. నీ సంగడీండ్రు దుష్టులు ఐనచో, నీ మాటలును తలంపులును వారి మాటలను తలంపులను పోలి ఉండును. నీ సహచరులు భక్తులు ఐన యెడల నీకును భగవచ్చింతయు భగవత్ప్రసంగమును దప్ప వేఱు ఉండదు.

మనస్సే ప్రధానము. ఒకడు ఒకవైపు భార్యను వేఱు ఒకవైపు పుత్త్రికను కూర్చుండ బెట్టుకొనును. అతని మనస్సు ఒక్కటే కాని, భార్యపైని చూపు ప్రేమ వేఱు విధము, పుత్త్రికపైని చూపు ప్రేమ వేఱువిధము.

బంధము మనస్సునకే; బంధవిముక్తియు మనస్సునకే. 'నేను ముక్తాత్మను, లోకమున ఉన్న ఏమి? అడవిలో ఉన్న ఏమి? నాకు ఎట్లు బంధము గలుగును? నేను దేవుని బిడ్డను. దేవుడో, సర్వేశ్వరేశ్వరుడు. నన్ను ఎవరు బంధింప గలరు?' అని సదా స్మరించుచు ఉండు చేతనుడు ముక్తుడే. తనలో విషము లేదు అని దృఢముగ భావించుటచే మానవుడు, పాము కఱచినప్పుడు కూడ, విషవిముక్తుడు కా వచ్చును. అట్లే ఎవడు ఐనను ''నేను ముక్తుడను, స్వతంత్త్రుడను'' అని నిశ్చయముతోను పట్టుదలతోను సదా అనుసంధించుచుండు నేని, తాను నిజముగ ముక్తుడు అగును, స్వేచ్ఛను ఒందును.

ఎవరో ఒ కాయన ఒకనాడు క్రైస్తవుల గ్రంథమును నాకు ఇచ్చెను. నేను అతనిని 'దానిని చదివి వినిపింపుము' అంటిని. ఆ గ్రంథములో పాపప్రస్తావము తప్ప వేఱు ఏదియును లేదు.

[కేశవునితో] బ్రాహ్మసమాజమునగూడ పాపమును గూర్చిన ప్రసంగము ఒక్కటే విన నగుచుండును. 'నేను బంధములో ఉన్నాను, నేను బంధములో ఉన్నాను' అని సదా అనుకొనుచుండు దౌర్భాగ్యునకు కడకు బంధనమే అనివార్యముగ గలుగును. "నేను పాపిని, నేను పాపిని" అని అహర్నిశము చెప్పుచుండు వాడు నిక్కముగ పాపియే ఐ తీఱును.

దేవునియందు ఎట్టి భక్తి ఉండ వలెను అనగా — "ఏమి! దేవుని నామమును జపించిన నాకు పాపము ఇంకను అంటుకొని యుండ గలదా? పాపము పోయిన పిదప కూడ నేను ఎట్లు పాపిగ ఉందును? ఎట్లు బంధమున చిక్కి ఉందును?" అని చెప్పించునంత ఉజ్జ్వల మైన భక్తి ఉండ వలెను.

దేవుని నామమును జపించినచో, మానవుని మనశ్శరీరాదికము అంతయు పవిత్రము అగును. మఱి పాపమును నరకమును అట్టి ఇతర విషయములను గూర్చిన ప్రసంగమునే ఏల చేయుచుండవలెను? "ఓ దేవా, నేను పాపములను ఇంతకు మునుపు చేసితిని అనుటకు సందేహము లేదు. కాని ఇక మీఁద ఎప్పుడును చేయను" అని ఒక్కసారి చెప్పిన చాలును. చెప్పి, దేవునందు విశ్వాసము గలిగి ఉండ వలెను.

నాకు పవిత్రప్రేమను ఒసంగుము అనియే నేను నా లోక మాతను ప్రార్థించితిని. ఆమెపాదకమలములను కుసుమములతో పూజించి ఇట్లు ప్రార్థించితిని — "అమ్మా, ఇదిగో నీ సౌశీల్యము, ఇదిగో నీ దుశ్శీలత, ఈ రెంటిని గైకొని నాకు నీపైని పవిత్రప్రేమను మాత్రమే ప్రసాదింపుము. ఇదిగో నీ జ్ఞానము, ఇదిగో నీ యజ్ఞానము, ఈ రెంటిని గైకొని నాకు నీపైని పవిత్రప్రేమను మాత్రమే ప్రసాదింపుము. ఇదిగో నీ పవిత్రత, ఇదిగో నీ యపవిత్రత; ఈ రెంటిని గైకొనుము, తల్లీ, నాకు నీపైని పవిత్రప్రేమను మాత్రము ప్రసాదింపుము. ఇదిగో నీ ధర్మము, ఇదిగో నీ యధర్మము, ఈ రెంటిని గైకొని, అమ్మా, నాకు నీపైని పవిత్రప్రేమను మాత్రము ప్రసాదింపుము."

ఈ లోకములోనే దైవసాక్షాత్కారము నొందుట మానవునకు ఏల దుస్సాధ్యము కావలెను? అతడు లోకమున జీవించుచున్నను, అప్పు డప్పుడు ఏకాంతమునకు ఏగుచుండవలయును. సంసారమునుండి తొలగి, మూడు దినముల కాల మైనను ఒంటరిగ దేవునకై ఒక మానవుడు విలపించు నేని, అది అతనికి ఎంతో తోడ్పడును. విరామము గలిగి నప్పుడు ఒక్క దిన మైనను ఏకాంతమున దైవచింతనతో గడపిన, అది సైతము శ్రేయ మొనగూర్చును.

ఐహికపరత అను వ్యాధి టైఫాయిడుజ్వరము వంటిది. టైఫాయిడుజ్వరగ్రస్తుడు ఉన్న గదిలో ఒక పెద్ద బాన నిండుగ నీరును వేరొక కుండ నిండుగ రుచి గల ఊరుగాయలును ఉన్నవి అనుకొనుడు. అతనికి ఆ వ్యాధిని నయము చేయ గోరినవారు, అతనిని మొదట ఆగదినుండి దూరమునకు చేర్ప వలయును. ఐహికపరు డైన చేతనుడు టైఫాయిడుజ్వరగ్రస్తునివంటివాడు. శబ్దాదివిషయములు బానలోని నీళ్లను బోలినవి, భోగేచ్ఛ దప్పిని బోలినది, ఊరుగాయలను దగ్గఱకు తే నక్కఱ లేదు, వానిని తలంచుకొన్నంతమాత్రము చేతనే నోట నీరు ఊరును. అట్టి ఊరుగాయలు అతని చుట్టును ఉన్నవి. కామినులపొందు ఊరుగాయను బోలినది. కాబట్టి ఏకాంతమున వైద్యము చేయుట ఆవశ్యకము. వివేకవైరాగ్యములు అలవడిన పిమ్మట మానవుడు లోకములో ప్రవేశింప వచ్చును.

క్రమముగ గంగానదిలోని పొంగు తగ్గెను. నావ కలకత్తా వైపునకు వేగముగ పోవుచుండెను. అది హౌరావంతెనకు క్రిందుగ దాటి పోయెను. ఓషధీవనము (బొటానికల్ గార్డను) చూపుమేర లోనికి వచ్చెను. నది ప్రవహించుచున్న వైపున ఇంక కొంత దూరము ఓడను పోని మ్మని అందు ఉన్న వారు ఓడనాయకుని గోరిరి. గురుదేవుని మాటలు వినుచున్న ప్రయాణికులు మంత్రముగ్ధులవలె ఐరి. వారిలో అనేకులకు, అప్పటికి ఎంత ప్రొద్దు ఐనదియు, తాము ఎంత దూరము వచ్చినదియు గూడ తెలియదు.

కేశవుడు ఎల్లరకును బొరుగులను కొబ్బరి తురుమును తిన బెట్టెను. అతిథులు అందఱును తాము ధరించి ఉన్న బట్ట మడతలోనే ఆ వస్తువులను పెట్టించుకొని వెంటనే తిన నారంభించిరి. అందఱును ఆనందభరితులై ఉండిరి. కాని కేశవుడును విజయుడును మాత్రము ఒకరినుండి ఒకరు దూరముగ ఉండిరి. ఆ సంగతిని గురుదేవుడు గుర్తించి, ఇద్దఱకును సమాధానము గూర్చ వలె నని అభిప్రాయపడెను.

గురుదేవుడు — [కేశవునితో] ఇటు చూడుము. విజయుడు ఇక్కడె ఉన్నాడు. శివునకును రామునకును జరిగిన కలహమువలె ఉన్నది మీ కలహము. శివుడు రామునిగురువు. ఒకరు ఒకరితో పోరాడుకొన్నప్పటికిని వారు త్వరలోనే సమాధానపడిరి. కాని శివానుచరులైన భూతాల వెక్కిరింపులును, రామానుచరులైన కోతుల కూతలును, — ముగియనే లేదు. [బిగ్గఱగా నవ్వు]. సొంతబంధువుల నడుమ గూడ అట్టి జగడములు జరుగుచుండును. రామానుజుడు విశిష్టాద్వైతి. మఱి ఆయనగురువో, శుద్ధాద్వైతి. వారికి అభిప్రాయభేదములును వాగ్వాదములును గలిగినవి. అట్టివి సదా జరుగుచునే ఉండును. ఐనను గురువునకు శిష్యుడు తనవాడే.

గురుదేవునితోడి గోష్ఠికిని సల్లాపమునకును అందఱును అలరిరి.

గురుదేవుడు (కేశవునితో) — నీవు జనుల స్వభావమును పరిశీలింపకయే వారిని శిష్యులుగ చేసికొందువు, కావున తర్వాత వారు నీ యొద్దనుండి వెడలిపోవుచుందురు.

మానవులు అందఱును చూచుటకు ఒక్కరీతిగనే ఉందురు, కాని వారి స్వభావములు భిన్నములుగ ఉండును అనుట నిజము. కొందఱిలో సత్త్వగుణము ఎక్కువగ ఉండును, కొందఱిలో రజోగుణము ఎక్కువగ ఉండును, మఱి కొందఱిలో తమోగుణము ఎక్కువగ ఉండును. కజ్జెకాయలను మీరు తప్పక చూచి ఉందురు. అవి అన్నియు ఆకారమున ఒకవిధముగనే ఉండును. కాని ఒక్కొక్క దానిలోను చేరి ఉండు వస్తువులు వేర్వేఱు: కొన్నింటిలో (కోవా=)

చిక్కనగ ఇగురబెట్టబడిన పాలు ఉండును, కొన్నింటిలో కొబ్బరి గుంజు ఉండును, కొన్నింటిలో మినప పూర్ణము ఉండును. (అందఱును నవ్వుదురు).

నా వైఖరి మీకు దెలియునా? నా మట్టుకు నేను భుజించి, పానము చేసి, హాయిగా ఉందును. మిగిలినది లోకజనని ఎఱుగును. నిజముగ నా దేహమునకు చురుక్కు మనిపించు మాటలు మూడు ఉన్నవి — 'గురువు', 'స్వామి', 'తండ్రి'.

ఉన్న గురువు ఒక్కడే, ఆయన సచ్చిదానందమయుడు ఐన పరమపురుషుడే. ఆయన ఒక్కడే గురువు. తల్లియందు బిడ్డకు ఉన్నట్టి భావమే నాకు దేవునందును గలదు. మానవ గురువులు వలసి ఉన్న లక్షల కొలదిగ లభింతురు. గురువులుగ ఉందము అనియే అందఱును ఆశపడుదురు. శిష్యుడుగ ఉందము అను అక్కఱ ఎవరికి గలదు?

ఒకరికి బోధించుట చాల కష్టమైన పని. ఎవనికి దేవుడు ప్రత్యక్షము అగునో, ఎవనికి దేవుడు ఉత్తరువు ఇచ్చునో, అతడు ఒక్కడే బోధింప గల సమర్థుడు. దేవుని నియమనము లేకున్న, నీ మాటలు ఎవరు విందురు?

కలకత్తా ప్రజలకు భావోద్వేగము ఎంత సులభముగ గలుగుచు ఉండునో మీరు ఎఱుగరా? క్రింద నిప్పు మండుచు ఉన్నంత సేపును గిన్నెలోని పాలు ఉడుకుచుండును, ఉప్పొంగుచుండును. మండు చున్న కట్టెలను దూరముగ తొలగింపుము, వెంటనే సద్దు అంతయు అణగి పోవును. ఏవి ఏవి ఉద్రేకము పుట్టించునో వానిపై కలకత్తా ప్రజలకు మోజు. ఒకనాడు మీరు చూచుచుండగనే ఒకచోట బావి త్రవ్వు చుందురు, "నీరు కావలె" అనుచుందురు. ఒక్కరాయి అడ్డు తగిలి నను, ఆచోటును విడిచి పెట్టి వేఱు ఒకచోట త్రవ్వ ఆరంభింతురు. అక్కడ ఇసుక అగపడె నేని, ఆ రెండవచోటును గూడ విడిచిపెట్టి వేఱు ఒక మూడవ చోట త్రవ్వ ఆరంభింతురు. ఇట్లే సాగుచుండును. దేవుని నియమనము తనకు ఉన్నట్లుగా ఒకడు భావించుచున్నంత మాత్రమున ఏమియు ఉపయోగము ఉండదు.

దేవుడు మానవునకు ప్రత్యక్షము అగును, అతనితో మాటాడును. దేవుని నియమనము అతనికి అందుట అప్పుడే సుసంభవమగును. దేవుని నియమనము పొందిన గురుని వాక్కు ఎంత శక్తివంతముగ ఉండును! అది చలింపనివానిని చలింప జేయ గలదు. మఱి వట్టి ఉపన్యాసములో? వానిని ప్రజలు కొన్నాళ్లు విందురు, తర్వాత మఱచిపోవుదురు. రిత్త బోధనల వారు ఎప్పుడును అనుసరింపరు.

కామార్పుకురులో హాల్దార్పుకుర్ అను చిన్న సరస్సు ఒకటి ఉన్నది. దాని తీరములను కొందఱు జనులు అశుద్ధము చేయుచుండిరి. అక్కడ స్నానము చేయుటకు వచ్చు వారు అశుద్ధపఱచువారిని బిగ్గఱగ తిట్టుచుండెడి వారు. కాని మఱునాటి వేకువను ఆ తప్పుపని జరుగుచునే ఉండెను, ఆగిపో లేదు. (అందఱును నవ్వుదురు). తుదకు పల్లెప్రజలు అధికారులకు తెలుపుకొనిరి. అధికారులు ఒక పోలీసు వానిని బంపిరి. అతడు 'అశుద్ధము చేయరాదు' అని ఒకపలకపై వ్రాసి సరస్తీరమున ఉంచెను. అంతటితో అశుద్ధముచేయువారు అచ్చటకి వచ్చుటను మానుకొనిరి. (అందఱును నవ్వుదురు).

ఒరులకు బోధించువానికి అధికారపట్టము ఉండ వలెను, లేకున్న అతని ఉపదేశములు వెక్కిరింతలు అగును. గ్రుడ్డివాడు గ్రుడ్డివారికి దారి చూపు నట్లు, జ్ఞానము తనకు లేకుండగా, తాను ఇతరులకు బోధింప దొరకొనును ఒకమానవుడు. అట్టి ఉపదేశాల వలన మేలు కలుగుటకు బదులు కీడు కలుగును. దైవసాక్షాత్కారము గలిగిన వెంటనే లోచూపు చేకూరును. ఆ చూపు గల వాడె ఎదుటివాని ఆధ్యాత్మికవ్యాధిని గుర్తించి ఉపదేశము చేయ గలిగి ఉండును.

దేవుని నియమనము లేనిచో మానవుడు గర్వి అగును. "లోకులకు ఉపదేశించువాడను నేను" అని అతడు తనలో అనుకొనును. ఆ గర్వమునకు కారణము అజ్ఞానమే. తాను కర్త అనుకొను వాడు అజ్ఞానియే కదా. "అన్నిటికిని కర్త సర్వేశ్వరుడే,

ఆయనయే అన్నిటిని చేయుచున్నాడు. నేను చేయుచున్నది ఏమియు లేదు'' అని అనుకొను వాడు నిజముగ జీవన్ముక్తుడు. తానే కర్త అని సదా అనుకొనుటవలననే మానవునకు కష్టములును దుఃఖములును గలుగుచున్నవి.

లోకమునకు మేలుచేయుటను గూర్చి మీరు ఉపన్యాసాలు చేయుచుందురు గదా. లోకము, అంత చిన్నదా? అదియును గాక లోకమునకు మేలు చేయుటకు మీరు ఎవరో దయచేసి చెప్పుడు. మొదట దేవుని సాక్షాత్కరించుకొనుడు, ఆధ్యాత్మిక సాధనల మూలమున భగవంతుని ప్రత్యక్షముగ గనుడు. శక్తిని ఆయన మీకు ప్రసాదించునేని, అప్పుడు మీరు ఇతరులకు మేలు చేయగలరు, ప్రసాదింప కున్న మీరు ఏమియును చేయ లేరు.

ఒక బ్రాహ్మభక్తుడు — మఱి, స్వామీ, భగవత్సాక్షాత్కారము గలుగువఱకును, మనము మనపనులను వదలుకో వలసినదేనా?

గురుదేవుడు — అక్కఱ లేదు. ఎందులకు వదలుకో వలయును? దైవధ్యానము దైవసంకీర్తనము మున్నగు నిత్యసేవలను మీరు ఆసక్తితో నెఱపుచుండ వలెను.

బ్రాహ్మభక్తుడు — ధనార్జనము మొదలైన సాంసారిక విధులను గూర్చి ఏ మందురు?

గురుదేవుడు — ఔను, మీ జీవికకు కావలసినంత వఱకును, మీరు ఆ విధులను నిర్వర్తించుచునే ఉండ వలెను. అదే సమయమున మీరు కన్నీరు కార్చుచు ''ఆ విధులను నిస్స్వార్థబుద్ధితో నిర్వర్తించు సామర్థ్యమును ప్రసాదింపు'' మని ఏకాంతమున దేవుని ప్రార్థింప వలెను. ''దేవా, నా సంసారకృత్యముల సంఖ్యను నానాటికిని తగ్గింపుము. తగ్గింప కున్నచో పెక్కుపనులలో తగుల్కొని నేను నిన్ను విస్మరింతును అని తోచుచున్నది. నిస్స్వార్థముగ పాటుపడు చున్నాను అని నేను అనుకొన్నను, అది స్వార్థముగనే పరిణమించును'' అని నీవు దేవునితో మొర పెట్టుకొన వలయును. బిచ్చము

పెట్టువారు గాని అన్నదానములు చేయువారు గాని తమతమ హద్దులు మీరితే నప్పుడు కీర్తిప్రతిష్ఠలు కావలె అనెడి లోభమునకు లో నౌదురు.

శంభుమల్లిక్ ఒకసారి "వైద్యశాలలను నెలకొల్ప వలెను, ఔషధశాలలను స్థాపింప వలెను, పాఠశాలలను ఏర్పఱుప వలెను, రాచబాటలను వేయ వలెను, ప్రజల ఉపయోగమునకై చెరువులు త్రవ్వ వలెను" అని ఇట్టి ధోరణిలో నాతో మాటాడినాడు. "ఇట్టి పనుల జోలి పెట్టుకొని నీ దారిని విడువకుము. మిక్కిలి జరూరు ఐన పనులను నీ అందుబాటులోనికి వచ్చు పనులను పూనుకొనుము. వానిని నిస్స్వార్థబుద్ధితో నెఱవేర్పుము" అని నేను అంటిని. పెక్కు పనులలో తగుల్కొనుట మంచిది కాదు. అట్టి తగులాటము భగవంతుని మరపించును. కొందఱు కాళిఘాట్ దేవాలయమునకు వచ్చి, తాము ఇచ్చట ఉన్నంత సేపును పేదలకు బిచ్చము పెట్టుటలోనే గడపి వేయుదురు. గుడిలోపల వేంచేసి ఉన్న అమ్మవారిని దర్శించుటకు వారికి వ్యవధి ఉండదు! (అందఱును నవ్వుదురు). గుంపులో దారి చేసికొని ఐనను శ్రమపడి ముందునకు పోయి ఎట్లో ఒకట్లు మొదట అమ్మవారి దివ్య మంగళ విగ్రహమును దర్శింపుము. తర్వాత నీకు ఇష్టము ఉన్న భిక్షాదానము చేయ వచ్చును, చేయక పో వచ్చును. చేయగోరుదు వేని, నీతృప్తికొలది నీవు బీదలకు దానములు చేయ వచ్చును. దానధర్మాదులు అన్నియు భగవత్సాక్షాత్కారమునకు సాధనములు మాత్రమే. "దేవా, నాకు నీచరణకమలముల ప్రాపు అనుగ్రహింపుము, నన్ను నీయొద్దనే ఉంచుకొమ్ము, నీ యందలి ప్రేమను, విశుద్ధ మైన ప్రేమను, నిష్కపట మైన ప్రేమను నాకు ప్రసాదింపుము" అని భగవద్భక్తుడు ప్రార్థించుచుండును.

కర్మయోగము నిజముగ దుష్కర మైనదే. వేదవిహితకర్మకలాపమును నిర్వర్తించుట ఈ కలియుగమున మీదు మిక్కిలి కష్టసాధ్యము. ఈ దినములలో ఉదరపోషణము ఒక్కటే మానవుని జీవితసారము. పెక్కులుగ ఉన్నట్టి వైదిక క్రియలను అతడు ఒనర్ప

లేదు. ఒకానొకడు జ్వరగ్రస్తుడై మంచముపట్టి ఉన్నాడు అనుకొనుము, నీవు ప్రాత పద్ధతిని దేశీ యౌషధములు ఇచ్చి వ్యాధిని మెల్లగా కుదుర్తము అని అనుకొంటి వేని, ఈ లోగా రోగికి ప్రాణములు పోయినను పో వచ్చును. అతని శరీర పరిస్థితి అధిక విలంబమును ఓర్వదు. డి. గుప్తా గారి చురుకైన మందే ఈ దినాలలో సరి ఐనది. భగవత్ప్రార్థనము భగవత్సంకీర్తనము మున్నగువానితో కూడిన భక్తిమార్గమే, భక్తియోగమే కలియుగమున ఉత్త మోత్తమమైనది. "మతము" "మతము" అనగా భక్తిమార్గమే ఈ కాలమునకు మతము. [(బ్రాహ్మభక్తులతో] మీ మార్గమును భక్తిమార్గమే. మీరు హరినామములను జపింతురు, లోకజనని మహిమలను కీర్తింతురు, నిక్కముగ మీరు ధన్యులరు. మీ వైఖరి నాకు నచ్చినది. అద్వైతులు ఈ జగము ఒక స్వప్నము అందురు. మీరు అట్లు అనరు. వారివలె మీరు బ్రహ్మజ్ఞానులు కారు, మీరు భక్తులు, దేవునందు మీకు ప్రేమ. దైవమును ఒకవ్యక్తినిగా పేర్కొనుటయు మంచిదే. మీరు భక్తులరు, శ్రద్ధతోను ఆస్థతోను ఆశ్రయింతు రేని, దేవుని తప్పక సాక్షాత్కరించుకో గలరు.

కయలాఘాట్ నొద్ద పడవ ఆగినది. అందు ఉన్న వారు దిగుటకు సిద్ధపడిరి. వారు వెలుపలికి వచ్చి చూచు సరికి నిండు చంద్రుడు మింటి నడిమికి ఎగ బ్రాకి యుండెను. తరువులును భవనములును గంగలోని పడవలును తెలి వెన్నెలలో మునిగి ఉండినవి. గురుదేవునకై ఒక బండిని దెచ్చిరి. గురుదేవుని తోబాటు మహేంద్రాది భక్తులు కొందఱు కూడ ఆ బండి ఎక్కి కూర్చుండిరి. గురుదేవుడు 'కేశవబాబు ఏడీ' అని అడిగెను. ఇంతలో కేశవుడును అరుదెంచెను, గురుదేవుడు దక్షిణేశ్వరమునకు మరలిపోవుటకు వలసిన ఏర్పాట్లు అన్నియు ఐనవి కదా అని విచారించుకొనెను, శ్రీరామకృష్ణునకు ప్రణమిల్లి వీడ్కొనెను.

నగరమున పాశ్చాత్యులు ఉండు వాడలో బండి పోవుచుండెను. వీధి దీపములు బాగుగ వెలుగుచుండినవి, ఆ ప్రకాశమున వీధికి ఇరు

వైపుల ఉన్న సుందరభవనములు కన్నుల పండువు సేయు చుండెను. ఆనందముతో చూచుచు ఏగుచున్న గురుదేవుడు తటాలున ''నాకు దాహముగ ఉన్నదే. ఏమి చేయుదము'' అనెను. కేశవుని మేనల్లుడు నందలాల్ బండిని హిందూసంఘభవనము [ఇండియాక్లబ్] వాకిట ఆపించి, మంచినీరు తెచ్చుటకై మిద్దెమీదికి పోయెను. ఇది బాగుగ కడిగిన లోటాయేనా అని అడిగి ఔ నని అతడు చెప్పిన మీదట గురుదేవుడు నీరు ద్రావెను.

బండి పోవు చుండగా వెన్నెల వెల్లిగొన్న వీథులను, అందలి జనులను, వాహనాలను గుఱ్ఱాలను — బండికిటికీగుండ తొంగి చూచుచు, గురుదేవుడు పసిపిల్లవానివలె వేడ్క అనుభవించెను. పియానో వాద్యముతో ఐరోపియ మహిళలు పాడుచున్న పాటలు అప్పు డప్పుడు ఆయనకు విన నగు చుండెను. ఆయన చాల ఆనంద దశలో ఉండెను.

1882 వ సంవత్సరము అక్టోబరు తే 28 ది.

అది శనివారము. బ్రాహ్మసమాజమువారు శరదృతువు నందును వసంతఋతువునందును షాణ్మాసి కోత్సవములను జరుపు కొందురు. అట్టి శరత్కాలోత్సవము సింధి అను గ్రామమున వేణీమాధవపాల్ సుంద రారామ భవనమున జరుగుచుండెను. కలకత్తాకును, ఉత్తరమున ఉన్న సింధి గ్రామమునకును దూరము ఇంచుమించు మూడు మైళ్లు. ఆ భవనము ధ్యానమునకు అనుకూల ముగ ఏకాంతముగ ఉండెను. కుసుమసంభృతము లైన తరువులును, కృత్రిమ తటాకములును, పచ్చికనిండినట్టి వాని తీరములును, పచ్చని పొదరిండ్లును — ఆతోట సొంపును వర్ధిల్ల జేసినవి. క్రుంకుచున్న సూర్యుని వెలుగు సోకి, ఉన్నిరాసులను బోలిన మేఘజాలము బంగారు చాయ ఎనయు చుండిన సాయంవేళలలో గురుదేవుడు అరుదెంచెను.

పెక్కండ్రు భక్తులు పూర్వాహ్ణ పూజ యప్పటికే వచ్చి ఉండిరి. కలకత్తా నుండియు చేరువ గ్రామాల నుండియు బయలు

దేశీన ప్రజలు అపరాహ్ణ మప్పటికి వచ్చి చేరిరి. ఆ గొప్ప సమావేశ మున కూడి ఉన్న బ్రాహ్మభక్తులు గురుదేవుని రాకకై ఉవ్విళు లూరు చుండిరి. వారిలో శివనాథుడు ప్రముఖుడు. గురుదేవునకును అతనిపై ప్రేమ మెండు.

గురుదేవుడును కొందఱు భక్తులును ఒకబండిలో వచ్చిరి. ఆ బండి వనమందిరమును సమీపించినంతనే, అట కూడి ఉన్న వారు అందఱును మహాదరముతో గురుదేవునకు ఎదు రేగుటకై లేచిరి. నాటకశాలలో తెర యెత్తు గంట కొట్టగనే ఎట్టి నిశ్శబ్దత కలుగునో, గురుదేవుడు వచ్చిన తత్క్షణమే అచట అట్టి నిశ్శబ్దత కలిగినది. అంతకు ముందు తమలో తాము మాటాడుకొను చుండిన వారు, తమ ప్రసంగాలను చాలించి, తమ చూపులను గురుదేవుని ప్రసన్న వదనమున నిల్పిరి; ఆయన నోట వెలువడు నట్టి మాటలలో ఒక్క-దాని నైనను తాము పోగొట్టుకో గూడ దని వారి ఉబలాటము.

శివనాథుని జూడగనే గురుదేవుడు సంతోషముతో 'శివనాథుడు ఇక్కడ ఉన్నాడు' అని అఱచి "ఇదిగో చూడు, నీవు భగవద్భక్తు డవు, నీ దర్శనమే చాలును, అదే నాకు హృదయానందకరము. గంజాయి పొగ ద్రాగు వానికి తన యట్టి యింకొకనిని జూచిన మహానందము. ఆనందము పట్ట లేక వారు తఱచు ఒండొరులను కౌగిలించుకొందురు" అనెను.

భక్తులు పక్కున నవ్విరి.

గురుదేవుడు — దక్షిణేశ్వరమున గుడితోటయొద్దకు ఎందఱో వచ్చుచుందురు. దేవునందు శ్రద్ధ లేని వారిని గాంచినప్పుడు 'మీరు ఆ వైపు కూర్చుండిన బాగుండును' అని నేను చెప్పుచుందును. లేదా — ఒక్కొక్కప్పుడు "పొండు, పోయి సుందరభవనరాజము లను తిలకింపుడు" అనుచుందును. (అందఱును నవ్వుదురు).

వచ్చిన భక్తుల నడుమ ఒక్కొక్కప్పుడు పనికి మాలిన వ్యక్తులును ఉందురు. ఆ వ్యక్తులు గాఢ సంసారమున మునిగిన వారు.

ఆధ్యాత్మిక ప్రసంగము వారికి రుచింపనే రుచింపదు. భక్తులు దేవుని గుఱించి నాతో చాల సేపు మాటాడుచుందురు. అప్పుడు వారి సహచరులు తహతహ లాడుచుందురు. అక్కడ, ఇక క్షణము ఐనను ఉండ లేక, భక్తుల చెవిలో "ఇంకను ఎంత సేపు మీరు ఇచ్చట ఉందురు? మనము పోవుట ఎప్పుడు?" అని గుసగుస మందురు. "కొంచెము సేపు ఉండుడు, తర్వాత పోవుదము" అని ఆ భక్తులు అందురు. అప్పుడు ఆ లౌకికులు విసుగు గొంతుతో "సరి, మీరు మాటాడుకో వచ్చు, మేము పడవయొద్ద మీ రాకకై వేచి ఉందుము" అని చెప్పుదురు. (అందఱును నవ్వుదురు). సర్వమును పరిత్యజించి, అనన్యహృదయముతో దేవుని గొలువుడు అందు రేని, సంసారాసక్తులు మీ మాటను వినిపించుకొననే వినిపించుకొనరు. సత్త్వ రజ స్తమో గుణములు లౌకికులందు ఉన్నవి గదా, భక్తియందు గూడ ఆ మూడు గుణాలును ఉన్నవి.

లౌకికులలో సత్త్వగుణవంతుడు ఎట్లు ఉండునో మీరు ఎఱుగుదురా? వాని యిల్లు అచ్చ టచ్చట శిథిలముగ ఉండనీ, దానిని బాగుపఱచుకొను శ్రద్ధను వాడు వహింపడు. పూజాగృహము అంతటను పావురాలు పడవేసిన పెంట నిండి ఉండనీ, ముంగిలి నిండుగ పాచి క్రమ్ముకొని ఉండనీ, అతడు ఆ విషయాలను లక్ష్యపెట్టనే పెట్టడు. కుర్చీలు బల్లలు మున్నగునవి ప్రాతవడి ఉండనీ, అతడు వానికి రంగు వేయింపడు, చూచుటకు నీటుగ ఉండునట్లు చేయడు. తన ఉడుపుల పట్లను అతనికి శ్రద్ధ లేనే లేదు. ఉడుపు, ఎట్టి దైనను, అతనికి చాలును. కాని అతని వ్యక్తిలో మాత్రము శాంతమును, నెమ్మదియు దయయు వినయమును ఉండును. అతడు ఎవరికిని అపకారము చేయడు.

లోకప్రజలలో రజోగుణవంతులు కూడ ఉన్నారు. వారిలో ఒక్కొక్కనికిని గడియారము ఉండును, గడియారపు గొలుసు ఉండును, చేతి వ్రేళ్లకు ఒకటి రెండు ఉంగరాలు ఉండును, ఇంటిలోని కుర్చీలు సోఫాలు బల్లలు మున్నగునవి నిగనిగ లాడుచుండును,

మహారాణి, రాజుగారి జ్యేష్ఠపుత్రుడు (వేల్సుయువరాజు) మున్నగు ప్రముఖుల పటములు గోడలపై వ్రేలుచుండును, భవనము అంతయు క్రొత్తగ సున్నము కొట్టబడి ఒక్క మచ్చ ఐనను లేక పరిశుభ్రముగ ఉండును. అతని దుస్తుల గదిలో రకరకాల ఉడుపులు సమృద్ధము లుగ ఉండును. అతని సేవకుల యొద్ద కూడ, ఏర్పాటుగా అతడు ఇచ్చు ఉడుపులు (లివరి) మున్నగునవి ఉండును.

ఇకను లౌకికులలో తమోగుణవంతులు ఉన్నారు. నిద్ర, కామము, క్రోధము, అహంకారము — ఇవియు ఇట్టివియు వారి లక్షణాలు.

అదే రీతిగా భక్తికి కూడ సత్త్వగుణము ఉండును. సాత్త్విక భక్తి గలవాడు భగవద్ధ్యానమును చాల రహస్యముగ చేయును, తన దోమతెరలో చేయునేమో! అతడు నిద్రపోవుచున్నాడు అని ఇతరులు తలంతురు. నిద్రనుండి అతడు ఆలస్యముగ లేచు నప్పటికి అతనికి రాత్రియంతయు నిద్ర సరిగా పట్ట లేదు కాబోలును అని చూచిన వారు ఎంతురు. అతని దేహాభిమానము ఎంతవఱకు అనగా— ఆకలి బాధ తీర్చుకొను వఱకే. ఆకలి తీర్చుకొనుట కైనను అతడు అన్నమును, మామూలు కూరలునే భుజించును. భోజనమునకు అని విపులము ఐన క్రమము ఏమియు ఉండదు, గృహపరికరములలోను వట్టి బయటి తళుకులు ఉండవు, అదియునుగాక, అట్టి భక్తుడు ధనము ఆసించి ఎవరిని గాని ముఖస్తుతి చేయడు.

రాజసభక్తి గల సాధకుడు నెత్తిని తిలకము పెట్టుకొనును, నడుమ నడుమ బంగారు పూసలు అమర్చిన పవిత్ర రుద్రాక్షమాలను మెడలో ధరించి ఉండును. (అందఱును నవ్వుదురు). పూజాకాల మున పట్టు వస్త్రమును కట్టుకొనును. బయటి తళుకులందు మాత్రమే అతని ప్రీతి.

తామసిక భక్తి గల వానికి ఉత్కటము ఐన విశ్వాసము ఉండును. మానవుని పైబడి అతని సంపదను దోచుకొను దోపిడి

గానిం బోలె, తామసిక భక్తుడు భగవంతుని బలాత్కరించి వరములు ఇప్పించుకొనును. 'కట్టు' 'కొట్టు' 'చంపు' — ఇదే వాని మార్గము, ఇదే దారిదోపిడిగాండ్ర మార్గమును.

ఇట్లు చెప్పి గురుదేవుడు, ఊర్ధ్వము అవలోకించుచు పాడ దొడగెను, ఆయనకు ప్రేమ ఉద్రిక్తదశ యందు ఉండెను, కంఠము మధురముగ ఉండెను —

దేవినామముఁ బలుకుచు దివికిఁ జనఁగఁ
గందు నేనియు, నా కేల కాశియాత్ర?
గంగకును, గయకు, మఱియుఁ గంచి కైనఁ,
బతిత పావన ప్రథిత ప్రభాసమునకు
నేని బోవఁగా నేల నా కింకఁ? జెపుమ —
మూఁడు సందెలను మిగులఁ బూన్కితోడ
మాతృ నామ జపంబును మాన కున్న
మానవున కేల నిఁకఁ గర్మలను నొనర్ప?
భక్తిసాధనలఁ మాన వచ్చుఁ గూడఁ;
గర్మ లొండొండ వెన్నంటఁ గలవె కాని
యతని మీఱంగ వానికి నైతి కాదు.
దాన ధర్మంబులును వ్రతతతియుఁ దాము
మదికి నింపును గూర్పవు *మదనునకును.
దేవి ఆనందమయి గౌరి దివ్య పాద
పద్మమే అతఁ డాసించు వరము; మఱియు
దానిఁ గోరియె చేయును త్యాగములను.
దేవదేవుఁడు మృడుఁడుఁ దా దీక్షతోడ
దేవిమహిమల నుతియందె దేల్చుఁ దనదు

* మూల గేయ రచయిత పేరు.

వదనములను నైదింటఁ దత్పరత ననఁగ,
అంబ నామశక్తి అది ఇంత అనుచుఁ దెలి
యఁగ ఎవరికిఁ దర మగునొ అరయు మోయి.

జగజ్జనని మీఁది ప్రేమచే పరవశుడై గురుదేవుడు ఇట్లు అనెను — మానవుడు పూన వలసిన వైఖరి ఇది – 'ఏమి? నేను అమ్మపేరును జపించితిని, జపించిన తర్వాతకూడ నేను పాపినిగా ఉండ వీలు ఉన్నదా? నేను ఆమెబిడ్డను. ఆమె శక్తులకును వైభవముల కును వారసను.'

మీ తమోగుణమును ఆధ్యాత్మికపరముగ మీరు త్రిప్పుకొో గల రేని, అది మీకు భగవత్సాక్షాత్కార సాధనములగును. 'మా కోరికల దీర్పుము' అని మీరు దేవుని బలాత్కరింప వచ్చును. ఆయన మీకు పరాయివాడు కానే కాడు, నిక్కముగ ఆయన మీ వాడే, మీకు సొంతమే.

ఇం కొక సంగతిని గుర్తింపుడు—తమోగుణమును అన్యుల శ్రేయమునకై కూడ వినియోగింప వచ్చును. ఉత్తములు మధ్యములు అధములు అని వైద్యులలో మూడు వర్గాల వారు ఉన్నారు. రోగి నాడిని పరీక్షించి, 'మందును సక్రమముగ తీసికో' అని చెప్పుటతో మిన్నకుండు వైద్యుడు అధముడు. రోగి ఆ రీతిగా మందు తీసి కొన్నాడా లేదా అని విచారించుకొొను పాటి అక్కఱ ఆ వైద్యునకు లేదు. 'ఓయి మంచివాడా, మందు తీసికోకున్న నీకు వ్యాధి ఎట్లు మానును? మందును తీసికో. దానిని నేను నీకొఱకే తయారు చేసితిని' అని తియ్యగ పలికి మందును పుచ్చుకొమ్మని రోగిని నానా రీతుల ప్రోత్సహించు వైద్యుడు మధ్యముడు. 'మందు తీసికొనను' అని మొండిపట్టు గల రోగిని పడ వేసి, ఱొమ్ముపై మోకాలు ఉంచి అదిమి పట్టి మందును బలాత్కారముగ అతని గొంతులో పోసి మ్రింగించు వైద్యుడు ఉత్తముడు. ఇది ఆ వైద్యునిలోని తమోగు

ణావిష్కారము. ఆ తమోగుణము రోగికి హానిచేయకుండుటే కాక మేలు చేయుచున్నది.

వైద్యులలో ఉన్నట్లే ఆచార్యులలోను మూడు వర్గాల వారు ఉన్నారు. అధము డైన గురువు తాను చేయవలసిన బోధను చేయునే కాని, శిష్యుని పురోభివృద్ధి ఎట్లు ఉన్నదో విచారించుకొనడు. శిష్యుని మేలు గోరి, పాఠమును అతని తలకు ఎక్కించుటకు మాటిమాటికిని పాటుపడుచు, విషయమును జీర్ణించుకొ మ్మని బ్రతిమాలుచు, ఇంకను పెక్కు రీతుల ప్రేమను జూపు గురువు మధ్యముడు. శిష్యుడు మొండి పట్టుతో వశపడక ఉన్నట్లు కనిపించి నప్పుడు వానిని బలాత్కరించు నంత సాహసమునకు పూనుకొను రకపు గురువును కలడు. అట్టి గురువును నేను ఉత్తముడు అందును.

ఒక బ్రాహ్మ భక్తుడు — స్వామీ, దేవునకు రూపములు ఉన్నవా? రూపము లేనే లేదా?

గురుదేవుడు — దేవుడు ఇట్లు ఉండునే కాని మఱి యొకట్లు ఉండడు అని ఖండితముగ ఎవరును జెప్ప లేరు. దేవుడు నిరాకారుడును అగును, సాకారుడును అగును. భక్తునికై ఆయన రూపములు దాల్చును. జ్ఞాని దృష్టిలో, అనగా జగత్తు మిథ్య అని భావించువాని దృష్టిలో, దేవుడు నిరాకారుడు. ఈశ్వరుడును జగత్తును వేఱు వేఱు తత్త్వములు అని భక్తుడు తలంచును. కావున దేవుడు అతనికి తాను ఒక వ్యక్తిగా పొడ చూపును. మఱి జ్ఞాని – వేదాంతి – 'నేతి' 'నేతి' 'ఇది కాదు, ఇది కాదు' అన్న క్రమాన సదా వివేచించుచునే పోవును; అట్లు వివేచించుచు పోయి పోయి అహంకారమును జగత్తును రెండును కలలను బోలిన కల్లలే అని తన అంతర్దృష్టిచే తెలిసి కొనును. అనంతరము జ్ఞానికి 'జీవుడు బ్రహ్మమే' అనెడి అనుభూతి కలుగును. బ్రహ్మము ఇట్టిది అని అతడు నిర్వచింప లేడు.

నేను చెప్ప నెంచినది మీకు తెలిసినదా? ద్వంద్వాతీత మై సచ్చిదానందమయ మగు బ్రహ్మము అపార మైన ఒక సముద్రము

అని అనుకొనుడు. భక్తుని ప్రేమ శీతలత చేతనా అన దగ్గట్లు అందలి నీరు అట నట మంచుగా పేరుకొని గడ్డ కట్టుకొనును. అనగా దేవుడు తన భక్తులకై అప్పు డప్పుడు వివిధ రూపములను దాల్చి తన్ను ఒకవ్యక్తినిగా అగపఱచుకొనును. కాని జ్ఞానసూర్యుడు ఉదయింపగనే మంచుగడ్డలు కరగి పోవును. అప్పుడు దేవుడు ఒక వ్యక్తి అను భావము నమసి పోవును, దేవుని రూపములు కాన రావు. దేవుడు ఇట్టివాడు అని వర్ణించుట శక్యము కాదు. వర్ణించుటకు ఎవరు ఉన్నారు? అహంకారమూ, పూర్తిగ అంతరించును, వర్ణింపగోరువాడే అంతర్ధానము అగును.

ఎవడు ఐనను తన్ను విభజించి చూచుకొన్నచో 'నేను' అను పదార్థము అతనికి గోచరింపనే గోచరింపదు. ఒక ఉల్లిగడ్డను దీసికొనుడు, పైని ఉన్న ఎఱ్ఱ పొరను మొదట ఒలిచి వేయుడు, లోపల గట్టి తెల్ల పొరలు కానిపించును. ఒక్కొక్కదానినిగా ఆ పొరలను గూడ ఒలిచి వేయుడు. లోపల వేఱు ఏమియు ఉండదు.

ఆ దశలో మానవునకు తన అహంకారపు ఉనికి పూర్తిగ అదృశ్యము అగును. దానిని వెదకుటకు ఎవరు మిగిలి ఉన్నారు? శుద్ధ చైతన్యముగ వెలుగొందెడి ఆ దశలో అతనికి అనుభూతము అగు బ్రహ్మస్వరూపము ఇట్టిది అని ఎవరు వర్ణింప గలరు?

పరిపూర్ణజ్ఞానమునకు ఒక గుర్తు ఉన్నది. అట్టి జ్ఞానము కలుగగనే మానవుని మౌనము ఆవహించును. అప్పుడు ఉప్పు బొమ్మను బోలిన అహంకారము కరగి సచ్చిదానందబ్రహ్మసాగరమున గలిసి పోవును. తనకును బ్రహ్మమునకును భేదము గుర్తు ఐనను లేకుండ అంతరించును.

తన్ను తాను విభజించి చూచుకొనుట పూర్తి అగువఱకును మానవుడు మిక్కిలి పటాటోపముతో వాదములు చేయుచుండును. అది పూర్తి కాగానే నోరు మూసికొనును. చెరువులో ముంచిన బుంగలో, నీరు నిండగానే, నిండి తటాకజలముతో ఏకము కాగానే,

చప్పుడు అడగి పోవును. ఆ బుంగ పూర్తిగ నిండువఱకు బుడబుడ చప్పుడు కలుగుచుండును.

అహంకారము అంతరింపగనే అన్ని పీడలును బాధలును తుద ముట్టును. కాని నీవు వేయి తర్కములు చేసి నప్పటికిని, అహంకారము అణగదు. కావున నీ వంటి వానికిని నావంటివానికిని 'నేను భగవద్భక్తుడను' అను భావము అలవడుట శ్రేయము.

భక్తులకొఱకే సగుణబ్రహ్మము. అనగా ఈశ్వరుడు సగుణుడు అనియు, రూపములను దాల్చి మానవులకు తాను ఒక వ్యక్తిగా దర్శనము ఒసగును అనియు భక్తుడు విశ్వసించును. మన ప్రార్థనలను విను వాడు సర్వేశ్వరుడే, నీవు చేయు ప్రార్థనలకు లక్ష్యము ఆయనయే. నీవు దైవమును సాకారముగ గొల్చినను నిరాకారముగ గొల్చినను ఒక్కటే. ఈశ్వరుడు విశ్వ సృష్టి స్థితి సంహార కర్త అనియు అనంత శక్తి అనియు మన ప్రార్థనలను ఆలించు వ్యక్తి అనియు భావించిన జాలును.

భక్తిమార్గమున దేవుని ప్రాపించుట సులభతరము.

బ్రాహ్మభక్తుడు — స్వామీ, దేవుని జూచుట ఎవని కేని సాధ్యమగునా? అగు నేని మనము అందఱమును ఆయనను ఏల చూడలేకున్నాము?

గురుదేవుడు — ఔను, దేవుని జూచుట తప్పక సాధ్యము అగును. ఈశ్వరుని సాకారతను నిరాకారతను గూడ సాక్షాత్కరించుకొన సాధ్యము అగును. దానిని వివరించి మీకు చెప్పుటకు నాకు ఎట్లు శక్యము అగును?

బ్రాహ్మభక్తుడు — ఏ సాధనలు చేసిన భగవంతుని దర్శింప వీలు అగును?

గురుదేవుడు — డెందమున మిక్కుటంపు ఉత్కంఠతో నీవు దేవునకై ఏడువ గలవా? ధనమునకై, దారాపుత్రాదులకై మాన

వులు కడవలు కడవలుగా కన్నీరు కార్తురు. దేవునకై విలపించు వారు ఎవరు? బిడ్డ, బొమ్మలతో ఆడుకొనుచు ఆ ఆటలో మునిగి ఉన్నంతసేపును, తల్లి వంటపనిని తక్కుంగల యింటి పనులను జూచు కొనుచుండును. విసుగు పుట్టి నప్పుడు బొమ్మలను పాఱ వేసి, బిడ్డ 'అమ్మా' అని ఏడ్చును. అప్పుడు తల్లి ప్రొయ్యిమీాద ఉడుకుచున్న అన్నపు తపెలను దింపి, పరుగునవచ్చి బిడ్డను ఎత్తుకొనును.

బ్రాహ్మభక్తుడు — స్వామీా, దేవుని స్వరూపమును గూర్చి ఇన్ని భిన్నాభిప్రాయములు ఉండ నేల? కొందఱు 'ఆయన సాకారుడు' అందురు, కొందఱు 'నిరాకారుడు' అందురు. 'సాకారుడు' అను వారు 'వివిధ రూపములు ఉన్నవి' అనుచున్నారు. ఎందులకు ఈ యభిప్రా యములు అన్నియు?

గురుదేవుడు — దేవుడు భక్తునకు ఏ రీతిని అగపడునో, ఆ రీతినే ఆయనను అతడు స్మరించును. నిజముగ దేవునిగూర్చి ఎట్టి అస్పష్టతయును లేదు. భక్తునకు ఎట్లో ఒకట్లు ఈశ్వరసాక్షాత్కా రము గలిగెనా, స్వామియే అతనికి సమస్తమును స్పష్టము ఒనర్చును. నీవు ఇంకను ఆ వైపు అడుగు పెట్టనే లేదు. 'దేవుని గూర్చి సకల విషయములును మనకు తెలిసి ఉండ రాదా' అని నీవు ఎట్లు అను కొందువు?

ఒక కథను వినుము — ఒకప్పుడు ఒకానొకడు ఒక అడవికి పోయినా డట; పోయి, ఒకచెట్టుమీాద ఉన్న చిన్న జంతువును ఒక దానిని జూచినాడు. అడవినుండి మరలినవెంటనే అతడు ఇంకొకనితో "ఒకచెట్టుమీాద చిన్న జంతువును ఒకదానిని జూచితిని, అది సొగసైన యెఱుపు వన్నె గలిగి ఉండెను" అన్నాడు. ఆ యింకొకడు "అడవికి పోయి నప్పుడు, నేనుకూడ ఆజంతువును జూచి ఉన్నాను, మఱి దాని వన్నె ఎఱుపు అనుచున్నా వేల? దానివన్నె ఆకుపచ్చ" అని బదులు చెప్పినాడు. ఆ యిరువురి ప్రక్కనే మూాడవవాడు ఒకడు ఉండెను. అతడు వా రిరువురిని కా దని, "ఆజంతువు వన్నె పసుపు" అని

నొక్కి చెప్పినాడు. మఱికొందఱు గూడ ఆచోటికి చేరబాఱినారు. వారిలో ఒకరు 'ఆజంతువు రంగు తెలుపు' అన్నారు, మఱియొకరు 'ఊదా' అన్నారు, వేఱు ఒకరు 'నీలము' అన్నారు. ఈ విధముగ ఒక్కొక్కరును ఒక్కొక్క రంగును చెప్పినారు. తుదకు వారు తమలో తాము కలహించుకొన జొచ్చిరి. వాగ్వాదమును పరిష్కరించు కొందము అని అందఱును చెట్టునొద్దకే పోయిరి; పోయిచూడగా ఎవడో ఒకడు ఆచెట్టుక్రింద కూర్చుండి యుండెను, వానిని అడిగిరి. ఆతడు ఇట్లు చెప్పెను — "ఔను, నేను ఈచెట్టునీడలోనే వసించు చున్నాను, ఆజంతువును బాగుగ ఎఱుగుదును, మీ అందఱి వర్ణన లును నిజమే. ఆ జంతువు ఒకప్పుడు ఎఱుపు వన్నె గలిగి అగపడును, ఒకప్పుడు పసుపుగా అగపడును, ఒకప్పుడు ఊదాగా, మఱి ఒకప్పుడు తెల్లగా, వేఱు ఒకప్పుడు నీలముగా కనిపించును. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క రంగు కనబడుచుండును. అది ఊసరవెల్లి. ఒక్కొక్క ప్పుడు దానికి ఎట్టి రంగును ఉండదు. ఒకక్షణములో ఒకరంగు కన బడును, మఱు క్షణములోనే ఏ రంగును ఉండదు."

అదే విధముగ, సదా దేవుని స్మరించువానికి పరమాత్మ స్వరూపము యథాతథముగ ఎఱుంగ వీలు అగును. పరమాత్మాన్వే షకులకు పరమాత్మ వివిధ రూపములలోను వైఖరులలోను ప్రత్యక్షము అగుచుండును అన్న సంగతి భగవద్ధ్యానశీలునకు ఒక్కనికి మాత్రమే తెలియును. దేవునకు గుణములు కలిగియు ఉండును, లేకయు ఉండును. చెట్టుమీది ఊసరవెల్లి వివిధ వర్ణములు గలిగి అగపడును అను విషయము, ఆ చెట్టుక్రిందనే వసించువానికి తెలియును. దానికి ఒక్కొక్కప్పుడు ఎట్టి రంగును ఉండదు అను విశేషమునుగూడ అతడు ఎఱుగును. వ్యర్థవాగ్వాదాలకును మనోవ్యథలకును పాల్పడు వారు ఇతరులు.

'సాకారబ్రహ్మము నాకు తల్లి, నిరాకారబ్రహ్మము నాకు తండ్రి' అని కబీరు చెప్పుచుండెడివాడు. ఏ రూపము ఏ భక్తునకు మిక్కిలి ప్రియమైనదో ఆ రూపమును దాల్చి దేవుడు ఆ భక్తునకు

ప్రత్యక్షము అగుచుండును. భక్తుల పట్ల భగవంతునకు ఉన్న ప్రేమ ఉత్కటకోటికము.

మా మార్గము భక్తిమార్గము. అది చాల మంచి మార్గము, సులభ మైన మార్గము కూడ. అపరిచ్ఛిన్ను డైన దేవుని సమగ్ర ముగ ఎవ్వరు ఎఱుంగ గలరు? అపరిచ్ఛిన్నుని సమగ్రముగ తెలిసికో వలసిన ఆవశ్యకత ఏమి ఉన్నది? దుర్లభ మైన మానవ జన్మము పడయ గాంచిన నాకు, భగవ చ్చరణారవిందము లందు ప్రేమను పెంపొంద జేసికొనుటే అన్నిటికం టె ఆవశ్యకము.

నా దప్పిని దీర్చుకొనుటకు చెంబెడు నీరు చాలి ఉండగా, తటాకములో మొత్తము ఎంత నీరు ఉన్నదో నేను ఎందులకు కొలువ వలయును? ఒకనికి వలసిన కైపును గలిగించుటకు సగము సీసా సారాయి చాలి ఉండగా, గిడ్డంగిలో మొత్తము మద్యము ఎంత ఉన్నదో, ఆ కొలత అతనికి ఎందులకు? అపరిచ్ఛిన్నుని దెలిసికో వలసిన జరూరు ఏమి ఉన్నది?

బ్రహ్మజ్ఞానికి గలుగు వివిధ మానసిక దశలను వేదములు వర్ణించుచున్నవి. జ్ఞానమార్గము కరము దుష్కరము. ఎవనికి కామినీ కాంచన సక్తియు ఐహికపరతయు అణు మాత్ర మైనను ఉండునో, అతడు జ్ఞానమును పొంద లేడు. జ్ఞానమార్గము కలియుగమునకు తగినది కానే కాదు.

మనస్సు నెలకొను భూములను ఏడింటిని వేదములు పేర్కొను చున్నవి. మనస్సు సంసార నిమగ్నమై ఉండు నప్పుడు, అది నాభి, జననేంద్రియము, మూలము—అనెడి వాని యందు నెలకొని ఉండును. ఆ మూడును నిమ్న భూములు [లోయెర్ ప్లేన్స్]. ఆ దశలో మనస్సునకు కామినీకాంచనధ్యానము తప్ప, అంత కన్న ఉదాత్త మైన చూపు లేదు. మనస్సు నెలకొను నాలవ భూమి హృదయము. మనస్సు ఆ భూమిలో ఉన్నప్పుడే ఎవని కైనను జ్ఞానజ్యోతి మొదటి సారి తళుక్కు మని గోచరించును. తన చుట్టును అతనికి వెలుతురు

కానిపించును. అట్టి వాడు ఆ దివ్య జ్యోతిని చూచి నంతనే, ఆశ్చర్య స్తబ్ధుడై 'ఆహా! ఏ మిది? ఏ మిది?' అనుకొనును. అతని మనస్సు ఆ మెట్టునుండి, క్రింది లౌకిక వస్తువుల వైపునకు దిగదు.

మనస్సు నెలకొను భూములలో ఐదవది కంఠము. మనస్సు ఆ మెట్టునకు ఎక్కినప్పుడు, సాధకుడు అన్ని భ్రాంతులనుండియు అజ్ఞానము నుండియు విడు పొందును. భగవద్విషయము తప్ప, తక్కిన విషయములను వినుట కాని, చర్చించుట కాని అతనికి నచ్చదు. ప్రజలు లౌకిక విషయాలను చర్చించుచుందు రేని, అతడు ఆ చోటినుండి వెంటనే తొలగి పోవును.

ఆఱవ భూమి లలాటము. మనస్సు అట నెలకొన్నప్పుడు సాధకునకు రాత్రింబవళ్లు అవిచ్ఛిన్నముగ భగవంతుని దివ్య మంగళ రూప దర్శనము గలుగు చుండును. కాని అప్పటికిని అహంకారపు జాడ సూక్ష్మముగ నిలిచి ఉండును. స్వామి నెమ్మని నిరుపమాన సౌందర్యమును జూచినంతనే అతడు ఉన్మత్తుడై ఆ రూపమును తాక వలె అనియు కౌగిలించుకో వలె అనియు, ముందునకు దూకును. కాని అది అతని తాకునకును కౌగిలికిని అందదు. అది లాంతరులోని జ్వాల వంటిది, తాకుదము అనిపించును గాని అద్దము అడ్డు ఉండుట చేత అందదు.

ఏడవ భూమి తల పైభాగమున, మూర్ధమునందు ఉన్నది. మనస్సు ఆ మెట్టునకు ఎక్కినప్పుడు సాధకుడు సమాధి నిమగ్నుడు అగును. అప్పుడు బ్రహ్మజ్ఞానికి బ్రహ్మసాక్షాత్కారము గలుగును. కాని ఆ దశ వచ్చిన తర్వాత, అతని శరీరము పెక్కు దినాలు నిల్చి ఉండదు. అతనికి బాహ్య లోక స్మృతి ఉండదు. అతని నోట పాలు పోసిన, అది వెలికి కాఱును. అతడు ఆ జ్ఞానదశలో ఇరువదియొక్క దినాలు ఉండి, తన శరీరమును త్యజించును. అది బ్రహ్మజ్ఞాని స్థితి. మఱి మీదో, భక్తిమార్గము, అది చాల మంచిమార్గము, సులభ మార్గము.

ఒకప్పుడు ఒక మనుష్యుడు ‘‘అయ్యా, మీరు ‘సమాధి’, ‘సమాధి’ అని అనుచుందురే, దానిని నాకు శీఘ్రముగ బోధింప గలరా?’’ అని నన్ను అడిగినాడు. [అందఱును నవ్వుదురు].

సాధకుడు సమాధిదశను అందినంతనే, అతని పనులు అన్నియును ఆగి పోవును. లౌకికకార్యములే కాక, పూజ జపము మొదలైన భక్తికార్యములు కూడ ఆగిపోవును. ప్రారంభదశలో పనుల పటాటోపము మెండుగ ఉండును. కాని చేతనునకు దైవసామీప్యము హెచ్చు కొలదియును, పనుల వెలి పటాటోపము తగ్గును. ఎంత తగ్గును అనుకొంటిరి? భగవన్నామ సంకీర్తనమును భగవన్మహిమల ప్రశంస సైతము అతడు చేయ లేడు. [శివనాథునితో] నీవు ఈ సభకు రాక ముందు, జనులు నిన్ను గుఱించియు నీ గుణాలను గుఱించియు ఎక్కువగ ప్రశంసించు చుండిరి. కాని నీవు వచ్చిన తత్క్షణమే ఆ మాటలు ఆగి పోయినవి. ఇప్పుడు నిన్ను చూచుచుండిన చాలును, ప్రతి ఒక్కనికిని ఆనందమే. ప్రజలు ‘‘ఓహో శివనాథ బాబు ఇచ్చట ఉన్నాడు’’ అని మాత్రము అందురు. నిన్ను గూర్చిన తక్కిన సంభాషణలు ఆగి పోయినవి.

కావుననే సాధన ప్రారంభములో ఎక్కువ ఆడంబరము ఉండును, కాని మనస్సు దేవునిలో గాఢముగ నిమగ్నము అగు కొలదియు, కర్మాసక్తి తగ్గును. కట్ట కడపట కర్మసన్న్యాసమును దాని వెంబడినే సమాధియును గలుగును.

సమాధి దశను పొందిన పిమ్మట శరీరము సజీవమై ఉండకుండుట సామాన్య క్రమము. కాని నారదాది మునుల చరితమున మాత్రము ఈ సామాన్య క్రమము కాక విశేష క్రమము కానిపించును. వారు ఇతరులకు జ్ఞానజ్యోతిని గలిగించుటకై జీవించి ఉందురు. శ్రీచైతన్యుడు మున్నగు అవతారపురుషులు కూడ అట్లే. బావిని త్రవ్వకొన్న పిదప, పాఱను తట్టను పాఱవేయుట సామాన్యులకు మామూలు. కొందఱు వానిని ఉంచుకొందురు, ఎందుకనగా, పొరుగు వారికి సాయపడుటకు. సమాధికి పిమ్మట సైతము శరీరమును నిల్పు

కొను మహాత్ములకు, కష్టములు పడుచున్న లోకులపై అనుకంప ఉండును. జ్ఞానజ్యోతి తమకు లభించుటతో తృప్తిపడు నంతటి స్వార్థ పరులు కారు వారు.

[శివనాథుడు మున్నగు బ్రాహ్మసమాజభక్తులతో] మీరు దేవుని మహిమలను శక్తులను అంత ఎక్కువగా వర్ణింతురే, ఎందు లకో చెప్పుడు. ఈవిషయమునే నేను కేశవసేనును అడిగితిని. ఒక నాడు కేశవుడును అతని వర్గము వారును దక్షిణేశ్వరమున గుడి తోటకు అరుదెంచిరి. వారి ఉపన్యాసాలు ఎట్లు ఉండునో విందమని నేను ముచ్చట పడితిని. గంగ స్నానఘట్టమునకు మీదుగ ఉన్న గచ్చు నేల గల ముంగిట సభ ఏర్పాటు చేయబడెను. అచ్చట కేశవుడు ఉపన్యసించెను. ఉపన్యాసము చాల బాగుండినది. నేను సమాధి నిమగ్నుడను ఐతిని. ఉపన్యాసానంతరము 'ఓ దేవా, ఏమి సొంపైన పూలను నీవు సృష్టించితివి! స్వామీ, నీవు దేవలోకము లను సృష్టించితివి, నక్షత్రాలను సృష్టించితివి, సముద్రమును సృష్టిం చితివి' అను ఇట్టి మాటలను మీరు తఱచు పలుకుచుందురే ఎందు లకు?'' అని నేను కేశవుని అడిగితిని. సొంతమునకు మహిమలు ఉండ వలె అను మోజు ఎవరికో, దేవుని మహిమలను వర్ణించుటలో ప్రీతియు వారికే.

ఒకనాడు ఒక దొంగ రాధాకాంతాలయమున విగ్రహాలకు సమర్పించి ఉండిన నగలను దొంగిలించెను. మథుర్‌బాబు గుడిలో ప్రవేశించి రాధాకాంతమూర్తిని జూచి ''దేవా, ఎంత సిగ్గుచేటు! నీ నగలనే నీవు కాపాడుకో లేక పోయితివా?'' అని అడిగినాడు. నేను అంటిని___'బలే! సర్వేశ్వరునకు సాక్షాల్లక్ష్మి, చేటియు పరి చారకురాలునుగ ఉండగా, ఆయన విభూతికి కొఱత ఎప్పుడైన గలుగునా? ఈ నగలు నీకు అమూల్యాలు కావచ్చు, మఱి స్వామికి ఇవి బంకమట్టిముద్దలకంటె మేలైనవి కావు. సిగ్గు! సిగ్గు! నీవు ఇంత నీచముగ మాటాడి ఉండ గూడదు. ఈశ్వరుని వైభవము పెంపు ఒందునట్లుగా, ఏమి సంపదలు నీవు ఈయ గలవు?'

కాబట్టి నేను చెప్పుచున్నాను — ఎవని దర్శనము ఆనంద ప్రదమో వానిదర్శనము లభించిన చాలును అని మానవుడు అన్వేషించును. ఆ ప్రియ దర్శనుని నివాస స్థలము ఎచ్చట? అతనికి ఇండ్లు ఎన్ని ఉన్నవి? తోటలు ఎన్ని ఉన్నవి? చుట్టాలు ఎందఱు? ఆ స్తి ఎంత? — అను ప్రశ్నలతో పని లేదు. నరేంద్రుని చూడగనే నేను సమస్తమును విస్మరింతును.

బ్రహ్మానందమాధుర్యమున లోతునకు బొందు. ఆ దేవుని అనంత సృష్టితోగాని, నిరవధిక మహిమతోగాని మనకుఅక్కఱ లేదు.

గురుదేవుడు ఇట్లు పాడెను —

దేవు సౌందర్య వారిధి దిగుము వేగ,
మునుఁగు మో మానసంబ, లోఁతునకు మునుఁగు,
ప్రీతిఁ జూతువు నీ వటఁ బ్రేమ మణిని;
పొమ్ము, వెదకుము నీలోనె పూని మనస,
అలరు బృందావనం బను నడవి; యచట
బాలకృష్ణుఁడు తన ప్రియభక్తకోటిఁ
గూడి నిరతంబుఁ గ్రీడించుఁ గోర్కె లెసఁగ;
శుద్ధ మగు జ్ఞానదీపంబు నిద్ధముగను
నిలుపు కొను మోయి చిత్తంబ నీదు లోన
వెల్గుఁ గా కది నిత్యప్రవృద్ధ మగుచు

గురుదేవుడు—(శివనాథునితో) నిన్ను జూడవలయును అని నాకు ఆశ. పవిత్రాత్ము లయిన భక్తులను జూడక నేను ఎట్లు జీవింతును? వారిని జూచి నప్పుడు వారు నాకు పూర్వ జన్మ మిత్రులు అని తోచును.

ఒక బ్రాహ్మ భక్తుడు — అయ్యా, ఆత్మకు దేహాంతరప్రాప్తి ఉన్నది అను నమ్మకము మీకు ఉన్నదా?

గురుదేవుడు — ఉన్నది. ఆత్మకు పునర్దేహప్రాప్తి ఉన్నది అని పెద్దలు చెప్పుదురు. మన మనసులా, పరిమితములు ఆయెను,

దేవుని మార్గాలను మనము ఎట్లు అర్థము చేసికో గలము ? జన్మ పౌనఃపున్యము ఉన్నది అని అనేకులు చెప్పి ఉన్నారు. కావున నేను దానిని సందేహింప లేను.

అప్పటికి సుమారు ఎనిమిదిన్నర గంటలు ఐనవి. ప్రార్థన మందిరమున సాయంపూజ ప్రారంభ మైనది. అనంతరము భక్తులు పాడ ఆరంభించిరి. మృదంగాలును చేతాళములును మ్రోగుచుండినవి. వానికి అనుగుణముగ దైవ ప్రే మోన్మత్తు డైన శ్రీరామకృష్ణుడు నర్తించుచుండెను. ఆయనను పరివేష్టించి బ్రాహ్మసమాజ భక్తులు కూడ నర్తించిరి. చూడగా, సమస్తమును మహానందదశయందు ఉండెను. ఆ చోట దేవుని పుణ్యనామము మ్రోగుచును మాఱు మ్రోగుచును ఉండెను.

అంతట వేణీమాధవుడు గురుదేవునకును భక్తులకును రాత్రి భోజనము పెట్టించెను. విందు అమృతమధురముగ ఉండెను. అంద ఱును ఆనందముగ ఆరగించిరి.

1882 వ సంవత్సరము, డిసంబరు.

అప్పటికి మధ్యాహ్నము దాటినది. దక్షిణేశ్వరమున గుడి తోటలో శ్రీరామకృష్ణుడు తన గదికి పడమట ఉన్న వసారలో ఆసీనుడై ఉండెను. అచ్చట ఉన్న వారిలో బాబురామును రామ దయాళును మహేంద్రుడునుగూడ ఉండిరి. ఈ మువ్వురును నాటి రాత్రిని గురుదేవుని సన్నిధిలో గడప నున్నారు. మహేంద్రుడు మఱు సటి దినముకూడ అచ్చటనే ఉందము అనుకొనెను. ఏల అనగా అతనికి క్రిస్మసు సెలవులు. బాబురాము గురుదేవు నొద్దకు రా నారం భించినది ఇటీవలనే.

గురుదేవుడు: —— [భక్తులతో] సమస్తమునకును ఈశ్వరుడే కర్త అని మానవుడు ఎప్పుడు తెలిసికొనునో అప్పుడే జీవన్ముక్తుడు అగును. ఒకనాడు శంభు మల్లిక్కును వెంట నిడుకొని కేశవుడు ఇచ్చటికి వచ్చెను. అప్పుడు "ఈశ్వర సంకల్పము లేక ఆ కైనను

కదలదు" అని నేను కేశవునితో అంటిని. మానవునకు స్వేచ్ఛ ఏదీ? అంతయు భగవత్సంకల్పాధీనమే. కాబట్టియే నేను "ఓ తల్లీ, నేను యంత్రమను, నీవు యంత్రచాలకురాలవు, నేను రథమను, నీవు రథచోదకురాలవు; నీవు త్రిప్పినట్లు ఎల్ల నేను తిరుగుచుందును" అని లోకజననితో పలుకుచుందును.

గురుదేవుని గదిలో భక్తులు కీర్తనను పాడిరి—

నాదు హృదయాంతరాళాన నలరు పికమ
పాడు, పాడుము, దేవుని ప్రథను బాడు;
బ్రహ్మ మను కల్పతరువందుఁ బరఁగు ఖగమ,
పాడు దేవుని శాశ్వత ప్రథను బాడు;
కల్ప పాదప మందును గలుగు ఫలము
లివియె గా — ధర్మకామంబు లించు నర్థ
మోక్షములు నను నాలుగు. పూని ఖగమ
వాని నారగించి రుచిని గాన వోయి.
"స్వామియే నా దయిన యాత్మసౌఖ్య" మనుచు
"నాదు హృదయంపు శాశ్వతానంద మతఁడె"
యనుచు అండజప్రముఖుఁడ, ఆలపింపు.
నాదు జీవిత ఖగరాజ, మీఁదు వింత
యైన వాఁడవు వో నిన్ను అరసి చూడ
వాన కోయిల దప్పిచే వారిదంపుఁ
జిన్కు ఆశించి కూయుఁ గాఁ జిత్త మలర,
అట్టులే నాదు డెందాన అలరు ఖగమ,
పాడు చుండు విరామంబు పాయఁ బెట్టి,
హెచ్చు చుండెడి స్థాయిలో ఎల్ల వేళ.

ఆలయాలలో సాయంపూజ ప్రారంభము ఐనది. గురుదేవుడు తనగదిలో చిన్న మంచముపై కూర్చుండి ధ్యానమున మునిగి ఉండెను, భావపరవశుడు అయ్యెను. కొంతసేపు ఐన తర్వాత

"అమ్మా, అతనిని నీవు చేరదీయుము, అతడు గర్వరహితుడు, వినయ శోభితుడు, నిన్ను దర్శించుటకు అతడు కొన్నాళ్లుగ వచ్చుచున్నాడు" అనెను. అనంతరకాలమున తన శిష్యాగ్రగణ్యులలో ఒక్కడుగ ఐన బాబురామును గుఱించినవా గురుదేవుని యీ మాటలు?

సమాధిలో ఉన్నట్టి భిన్న రీతులను గురుదేవుడు భక్తులకు వివరించి చెప్పెను. తర్వాత జీవితసుఖదుఃఖముల ప్రసంగము వచ్చినది. ఇంతటి యాతనను దేవుడు ఎందులకు సృష్టించినాడు?

మహేంద్రుడు:— ఒకనాడు విద్యాసాగరునకు కోపము వచ్చి ఇట్లు అన్నాడు. "దేవునితో మొఱపెట్టుకొన్న ఏమిలాభము? ఈ సంఘటనను యోచించి చూడుడు - ఒకప్పుడు చింగీస్ఖాను ఒక దేశమును కొల్లగొట్టి వేలకొలది ప్రజలను చెరలో ఉంచెను. చెర సాలలో ఉన్న వారి సంఖ్య ఒక లక్షకు పెరిగినది. అప్పుడు సేనాపతి 'ప్రభూ, వీరిని అందఱను ఎవరు మేపుదురు? వీరిని మనతో ఉంచు కొన్నను అపాయమే, విడిచిపెట్టినను అపాయమే. నేను ఏమి చేయు దును?' అని చింగీస్ఖానును అడిగెను. 'ఔను, నిజమే, ఏమి చేయ గలము? సరి, అందఱను చంపించి వేయుము' అని అతడు అనెను. వెంటనే సేనాపతి, 'వారిని చిత్రవధ చేయ వలసినది' అని ఆజ్ఞాపించెను. అప్పుడు దేవుడు ఆ చిత్రవధను చూచుచుండెను గదా! మఱి ఏ ఉపాయముచేత నైనను ఆయన దానిని ఏల ఆప లేదు? కావున దేవుడు ఉండనీ, లేక పోనీ, నాకు ఆయన అక్కఱ లేదు. ఆయన వలన నేను ఎట్టి మేలును గాని పొందుట లేదు."

గురుదేవుడు:— దేవుని చర్యలను గాని ఉద్దేశ్యములను గాని అర్థము చేసికొన సాధ్యము అగునా? ఆయన సృష్టించును, రక్షించును, సంహరించును. ఎందులకు సంహరించునో ఎన్నటి కైన మనము తెలిసికో గలమా? నేను లోకజననితో "అమ్మా, తెలిసికో వలసిన ఆవశ్యకత నాకు లేదు. దయచేసి, నీ చరణారవిందములందు నాకు ప్రేమను ప్రసాదింపుము" అని పలుకుచుందును. భక్తిని

పొందుటే మానవ జీవిత లక్ష్యము. తక్కిన సంగతులూ, అందఱు కన్న లోకజననికే బాగుగ తెలియును. నేను మామిడిపండ్లను తిందము అని తోటకు వచ్చితిని. చెట్ల లెక్క, వాని కొమ్మల లెక్క, అందలి ఆకుల లెక్క — ఈ వివరము నాకు ఎందులకు? నేను మామిడిపండ్లను తిందును. అంతే. చెట్లు ఎన్నో ఆకులు ఎన్నో తెలిసికోవలసిన అక్కఱ నాకు లేదు.

బాబురామును మహేంద్రుడును రామదయాళును నాటి రాత్రి గురుదేవుని గదిలో నేలపై నిద్రించిరి.

అప్పుడు సుమారు రెండు గంటలో మూడు గంటలో — వేగు జాము. గది చీకటిగ ఉండెను. శ్రీరామకృష్ణుడు తన పాన్పుపై కూర్చుండి, అప్పు డప్పుడు భక్తులతో సంభాషించు చుండెను.

గురుదేవుడు :— దయ వేఱు, మాయ వేఱు అన్న సంగతిని జ్ఞప్తియందు ఉంచుకొనుడు. మాయ అనగా, బంధువుల పట్ల మానవులకు ఉండు మమకారమే, తల్లిదండ్రులయందును అన్నదమ్ముల యందును అక్కచెల్లెండ్రయందును దారాపుత్రులందును అతనికి ఉండు ప్రేమయే. దయ అనగా విశ్వ మందలి సకల ప్రాణులందును మానవునకు గలుగు ప్రేమ. సమదృష్టివిశిష్ట మైనది ఆవైఖరి. విద్యాసాగరునిలో అగపడినట్లు ఎవరిలో ఐనను నీకు దయాగుణము అగపడిన యెడల దానికి దైవానుగ్రహమే కారణము అని తెలిసికొనుము. దయ ఉన్ననే మానవుడు సకలప్రాణిసేవ (లోకసేవ) చేయును. మాయ సైతము దేవునినుండి పుట్టునదే. మాయను పఱపియే దేవుడు మానవునిచే బంధుసేవను చేయించును. కాని ఒక్క విషయమును జ్ఞప్తి ఉంచుకో వలెను. మాయ అజ్ఞానమును సంసారబంధమును గలిగించును. దయ, హృదయవిశుద్ధిని గలిగించి క్రమక్రమముగ మనకు బంధవిముక్తి గలిగించును.

హృదయశుద్ధి లేకున్న బ్రహ్మసాక్షాత్కారము సాధ్యము కాదు. కామ క్రోధ లోభాదు లైన ఉద్రేకాలను ఎవడు అణంచు

కొనునో వానియందు ఈశ్వరానుగ్రహము గలుగును. కామమును అణచుకొనుటకు నేను ఎన్నో ప్రయత్నములు చేసితిని.

నేను పది పదునొకండు ఏండ్ల వాడనుగా కామార్పుకురున ఉన్నప్పుడు నాకు సమాధ్యనుభూతి తొలి సారి కలిగెను. భగవత్సం దర్శనమునకు కొన్ని లక్షణములు ఉన్నవి. వెలుతురు అగపడును, ఆనందము కలుగును, ఆకాశ బాణము ప్రేలినట్లు హృదయమున ఒక గొప్ప ప్రవాహము ఉప్పొంగును.

మఱునాడు బాబురామును రామదయాళును కలకత్తాకు తిరిగి వచ్చి వేసిరి. మహేంద్రుడు ఆ దినము అంతయు గురుదేవుని సన్ని ధిలో గడపెను.



ఐదవ ప్రకరణము

# గురుదేవుడును విజయగోస్వామియు

1882 వ సంవత్సరము డిసంబరు తే 14 ది గురువారము

అప్పటికి మధ్యాహ్నము దాటెను. ఇంచుక సేపు విశ్రమించి శ్రీరామకృష్ణుడు తన పాన్పుపైని కూర్చుండి యుండెను. విజయుడును బలరామును మహేంద్రుడును మఱికొందఱు భక్తులును గురుదేవునకు ఎదురుగ నేలపైని కూర్చుండిరి. ద్వారముగుండ చూచినప్పుడు, పవిత్రగంగ వారికి అగపడుచుండెను. అది చలికాలము కావున వెచ్చదనమునకై అందఱును దుస్తులపైని దుస్తులను కప్పుకొని ఉండిరి. విజయునకు కడుపు నొప్పి బాధ ఉన్నందున, అతడు కొంతమందును, తనతో తెచ్చుకొని యుండెను.

విజయుడు 'సాధారణబ్రాహ్మసమాజము'వాడు. సమాజము వారియొద్ద జీతము పుచ్చుకొని అతడు నీతి మత విషయికములు ఐన ఉపన్యాసములు చేయుచుండును. కాని సమాజాధికారులకును అతనికిని పెక్కు విషయములలో అభిప్రాయభేదములు ఏర్పడి యుండెను. అతడు పుట్టిన కుటుంబము వంగదేశములో చాల గొప్పకుటుంబాలలో ఒక్కటి. ఆవంశీయులభక్తియు ఆధ్యాత్మికగుణములును ప్రసిద్ధములు. శ్రీచైతన్యునకు అంతరంగసఖుడుగ ఉండిన అద్వైతగోస్వామి, విజయుని వంశపూర్వులలో ఒకడే. కావున గొప్పభగవద్భక్తుని రక్తము విజయునినాళములలో ప్రవహించుచున్నది అన్న మాట. బ్రాహ్మసమాజానుసారి యైనందులకు, అతడు నిరాకారబ్రహ్మమును ధ్యానించువాడే. ఐనను వంశపూర్వమహనీయులనుండి అతనిలోనికి సంక్రమించిన భగవత్ప్రేమ అతనిలో అంతర్గతమై ఉండెను. మధురాతిమధుర మైన ఆ భగవత్ప్రేమ వెలికి ఉబుకుటకు సరి ఐన సమయము

కొఱకే వేచి ఉండెను. శ్రీరామకృష్ణుని దైవోన్మాదము అనివార్యమై విజయుని ఆకర్షించుటకును, అతడు తఱచు ఆయన సన్నిధిని అభిలషించుటకును కారణము ఆభగవత్ప్రేమయే. గురుదేవుని సూక్తులను అతడు మహాదరముతో వినును. దివ్యప్రేమజనితము ఐన పరమానందమున ఉభయులును కలిసి నర్తించెడివారు.

అది, వారదినములలో ఒకటి. సాధారణముగ గురుదేవు నొద్దకు వచ్చు భక్తులగుంపులు ఆదివారములందు ఎక్కువగ ఉండును. కావున ఆయనతో ఏకాంతముగ మాటాడ గోరు వారు ఆయన యొద్దకు వారదినాలలో వచ్చుచుందురు.

ఆరియాదహాము అను చోట వసించుచుండిన విష్ణువు అను బాలుడు ఒకడు కొన్నాళ్ళ క్రిందనే మంగలికత్తితో తన మెడను కోసికొని ఆత్మహత్య చేసికొని ఉండెను. ఆ విషయము ప్రస్తావమునకు వచ్చెను.

గురుదేవుడు:— ఆపిల్లవాని మరణము విన్నప్పుడు నాకు ఎంతో అయ్యో అనిపించినది. అతడు ఒక బడిపిల్లవాడు. ఇచ్చటికి వచ్చుచు ఉండిన వాడే. లౌకిక జీవితమున తనకు సుఖము గలుగుట లేదు అని అతడు నాతో తఱచుగా చెప్పుచుండెను. పడమటి పరగణాలలో అతనికి బంధువులు ఎవరో ఉండిరి. వారితోనే ఆ బాలుడు ఒకప్పుడు వసించుచుండెను. అచ్చటి మైదానములకును కొండలకును అడవులకును బోయి ఏకాంతమున ధ్యానము చేయుచుండుట అతనికి ఆ దినాలలో వాడుకపడినది. పెక్కు దివ్య మూర్తుల సాక్షాత్కారము తనకు గలిగినది అని అతడు నాతో చెప్పి ఉన్నాడు.

ఒకవేళ అతనికి ఇదే తుది జన్మము ఏమో! అతడు తన కర్తవ్యాలను చాలవఱకు పూర్వజన్మములోనే తీర్చి వైచికొని ఉండును. ఏ కొంచెమో మిగిలి ఉండును. అది ఈ పుట్టుకలో పూర్తి చెందెను కాబోలు.

ఒకభక్తుడు:— ఆత్మహత్యను విన్నంతనే నేను గడగడ లాడి పోయితిని.

గురుదేవుడు:— ఆత్మహత్యా హేయము ఐన పాపమే, సందేహము లేదు. తన్ను దాను చంపుకొన్న మానవునకు మాటిమాటికిని ఈ లోకముననే పుట్టి ఇందలి ఆత్యంతిక బాధల అనుభవింపక తప్పదు.

కాని భగవత్సాక్షాత్కారము పొందిన పిమ్మట ఒకడు తన శరీరమును విడనాడు నేని, నేను దానిని ఆత్మహత్య అనను. ఆ విధముగ దేహత్యాగము చేసిన, ఎట్టి కీడును రాదు. జ్ఞాన సిద్ధి గలిగిన మీదట కొందఱు దేహత్యాగము చేయుచుందురు. బంకమట్టి అచ్చులో బంగారును కరగించి పోసి బొమ్మకు రూపు ఏర్పఱచిన పిదప, ఆ అచ్చును ఉంచుకో వచ్చును, విఱిచి వేయను వచ్చును.

పెక్కు ఏండ్లకు మునుపు, సుమారు ఇరువది సంవత్సరాల వయసువాడు ఒకడు బరానగరమునుండి ఈ గుడితోటకు వచ్చుచుండెను. నా సమ్ముఖమున ఉన్నప్పుడు అతనికి ఎంత ఉత్కటపరమానందము గల్గెడిది! ఆ పరవశతలో, నేలమీద పడి కాళ్లుచేతులు విఱుచుకొను నేమో, అని హృదయుడు అతనిని పట్టుకొని ఉండెడివాడు. ఒకనాడు అతడు నా చరణములు అంటి, "స్వామీ, మరల తమ దర్శనమునకు నేను రా గలిగి ఉండను, సెలవు ఒసంగుడు" అని వీడ్కొనెను. అటు పిమ్మట కొన్నాళ్లకే అతడు దేహత్యాగము చేసినాడు అన్న వార్త నాకు తెలిసినది.

శ్రీరామకృష్ణుడు ఐహికపరులైన వారిని వర్ణింప ఆరంభించెను.

గురుదేవుడు:— సంసారమున తగుల్కొని ఉన్న బద్ధజీవులకు తెలివి ఒకనాటికిని గలుగదు. ఎంతో దుఃఖమును ఎంతో బాధను వారు అనుభవించుచుందురు. ఎన్ని ఆపదలనో ఎదుర్కొనుచుందురు, కాని వారికి మెలకువ ఏమో కలుగనే కలుగదు.

ముండ్ల పొదలను మేయుట ఒంటెకు ప్రియము. ముండ్లను నమలుకొలదియు దాని నోటి నుండి నెత్తురు కాఱుచునే ఉండును. కాని ముండ్లతీగలను తినక దానికి తప్పదు, ఆ తిండిని అది మానదు.

అట్లే ఐహిక పరుడైన మానవుడు ఎంతో దుఃఖమును ఎంతో బాధను అనుభవించుచుండును, కాని కొన్నాళ్లలోనే వానిని మరచి పోయి యథాపూర్వము తన జీవితమును సాగించుచుండును. ఒకనికి భార్య మరణించినది అనుకొనుడు, లేదా, ఆమె అతనిని విడిచినది అనుకొనుడు, ఔరా, అప్పుడును అతడు మరల వేఱు ఒక పెండ్లినే కదా చేసికొనును!!

లేదా, ఒక తల్లి సంగతిని జూడుడు. ఆమె కొడుకు మరణించును, ఆమె దుర్భర పుత్త్ర శోకమును అనుభవించును. కాని, కొంత కాలమునకు ఆమె దానిని ఎల్ల మరచి పోవును. కొన్ని దినముల క్రిందనే అంతటి దుఃఖమున మునిగిన తల్లికి ఇప్పుడు సింగారించుకొనుటయందును నగలను దాల్చుటయందునే మనస్సు! కూతుండ్రకు వివాహాలు చేసి దివాలు ఎత్తిన తండ్రి ఇంకను ఏటేట బిడ్డలను కనుచునే ఉండును. వ్యాజ్యములచేత వినాశమును ప్రాపించుచున్నను, ప్రజలు ఇంకను ఇంకను న్యాయస్థానములకు పోవుచునే ఉందురు. కొందఱు ఇప్పటికి తమకు ఉన్న పిల్లలనే తాము పోషింప లేక, వారికి కట్టను బట్టను నిలువను మంచి నీడను ఒనగూర్ప లేకున్నను, ప్రతి సంవత్సరమును ఇంకను బిడ్డలను గనుచునే ఉందురు.

ఐహికపరుడు ఐన మానవుడు, అడవి యెలుకను మ్రింగ జూచు పామువంటి వాడు. పాము ఆ యెలుకను మ్రింగను లేదు, విడువను లేదు. జగత్తు అసారము అనియు ముట్టెయు తోలును తప్ప వేఱు ఏమియు లేని పుల్లమామిడిని పోలినది అనియు తెలిసినను బద్ధజీవుడు దానిని విడువ లేకున్నాడు, తన మనస్సును దేవునివైపు మరల్చుకో లేకున్నాడు.

ఒకప్పుడు నేను కేశవచంద్రసేనుని చుట్టమును ఒకనిని కలసి కొంటిని. ఏబదియేండ్లవాడు అయిన ఆయన చీట్లు ఆడుచుండెను, దేవుని తలచుకోవలసిన సమయము తనకు ఇంకను రానట్లు!

బద్ధజీవునకు మఱి ఒక లక్షణముకూడ కలదు. అతనిని ఐహిక

పరిసరములనుండి ఆధ్యాత్మిక పరిసరములకు చేర్తువేని, అతడు బెంగచే కృశించిపోవును. ముఱికిలో ఎదుగు కృమికి ముఱికిలో ఉండుటే సుఖము అనిపించును. ముఱికిలోనే అది వర్ధిల్లును. ఆ కృమిని బియ్యపు బానలో పడవేయుదు వేని అది చచ్చును.''

అందఱును నిశ్శబ్దముగ ఉండిరి.

విజయుడు:— విముక్తిని ఒంద వలయును అన్నచో బద్ధజీవుని మనఃపరిస్థితి ఎట్లు ఉండవలెను ?

గురుదేవుడు:— దైవకృపచే తీవ్రవైరాగ్యమును అలవఱచుకొను నేని, అతడు కామినీకాంచనసక్తినుండి విముక్తిని ఒందగలడు. తీవ్రవైరాగ్యము అన నేమి ? ''సరి, కాలక్రమమున అన్నియును కలుగును, ప్రకృతమునకు నేను 'కృష్ణా' 'రామా' 'గోవిందా' అని నామజపమును చేసికొనుచుందును గాక'' అని చెప్పువాని వైరాగ్యము, మందవైరాగ్యము. మఱి తీవ్రవైరాగ్యము కల వాడు అన్ననో, తల్లి తన బిడ్డకై తహతహపడునంతగా, భగవత్ప్రాప్తికై తహతహ పడును. దృఢవిరక్తుడు అనన్యభావముతో భగవంతునే అపేక్షించును. అతనికి ఇహలోకము అగాధము ఐన ఒక బావి, అందు తాను మునిగి పోవుచున్నట్లే అతనికి అనిపించును. బంధువులను విషసర్పములను జూచినట్టుగా చూచును, వారి బారినుండి తాను ఎడసి పోవలె అనుటే అతని కోరిక. అతడు అట్లే తప్పక పోవును గూడ. ''మొదట నన్ను నా ఆలుబిడ్డలకు ఏ వేని ఏర్పాట్లు చేయ నిండు, తర్వాత నేను భగవంతుని ధ్యానింతును'' అని అతడు తనలో తాను ఎప్పుడును అనుకోడు. అతని అంతఃస్థైర్యము గొప్పది.

తీవ్రవైరాగ్యమును గూర్చి ఒక కథను జెప్పెదను. ఒకానొకప్పుడు మన దేశమున ఒక ప్రాంతమున అనావృష్టి కలిగినది. రైతులు తమ పొలాలకు నీరు పాఱించుకొనుటకై పొడవైన కాలువలు త్రవ్వ సాగిరి. వారిలో సడలని పట్టుదల గల రైతు ఒకడు ఉండెను. తన కాలువ తన పొలమును ఏటిని కలుపునంతవఱకును

త్రవ్వటమును మానను అని అతడు ప్రతిజ్ఞ చేసెను. త్రవ్వను ఆరంభించెను. స్నానవేళ ఐనది. అతని భార్య తన కూతురిచేత అతనికి నూనె ఇచ్చి పంపినది. "నాయనా, ఇప్పటికే ఆలస్య మైనది, ఒడలికి నూనె రాచుకొని స్నానము చేయుము" అన్నది అమ్మాయి. "నాకు ఎంతో పని ఉన్నది, నీవు పో, పొమ్ము" అని కసరినాడు రైతు. మధ్యాహ్నము దాటినది. రైతు ఇంకను తన పొలములో పనిచేయుచునే ఉండెను. స్నానమును అతడు స్మరింప నైన స్మరింప లేదు. అంత అతని భార్య స్వయముగ వచ్చి "మీరు ఎందులకు స్నానము చేయ రైతిరి? అన్నము చల్లబడి పోవుచున్నదే. కొలువ పనిని రేపు పూర్తి చేసికో వచ్చును, లేదా - ఈ దినమే భోజనము ఐన తర్వాత చేసికో వచ్చును" అన్నది. అతడు ఉగ్రుడు అయ్యెను. ఆమెను చీవాట్లు పెట్టెను, పారను ఎత్తుకొని ఆమెమీదికి ఉరవడించెను. "ఏమీ? నీకు బుద్ధి లేదా? వాన లేదు, పైరు ఎండిపోవుచున్నది, పిల్లలు ఏమి తిందురు? మీరు అందఱును పస్తు చత్తురు. నేడు నా పొలమునకు నీరు పాఱించుకొనువఱకును మజ్జనభోజనములను తల పెట్టను. అది నా ప్రతిజ్ఞ" అని గర్జించెను. అతని కోపమును జూచి భార్య గడగడలాడి అక్కడినుండి పరుగెత్తెను. దినము అంతయు వెన్ను విఱుగునట్లు శ్రమపడి సాయంకాలమప్పటికి రైతు తనపొలమును ఏటిని కాలువచే కలుప గలిగినాడు. కలిపిన తర్వాత, కూర్చుండి, చర చర మను చప్పుడుతో పొలములోనికి పాఱు చున్న నీటిని జూచినాడు. అతని మనమున శాంతియు ఆనందమును నిండినవి, ఇంటికి పోయినాడు, భార్యను పిలిచినాడు. "ఇప్పుడు తేవే చమురును, హుక్కాను కూడ సిద్ధము చేయుము." అన్నాడు. ప్రశాంత మైన మనస్సుతో మజ్జనభోజనములను తీర్చుకొన్నాడు, పాన్పుపై పవ్వళించినాడు, తనివి తీఱ గుఱ్ఱు పెట్టి నిద్రించినాడు. అతనిలో కన నైన పట్టుదలయే తీవ్రవైరాగ్యమునకు ఉదాహరణము.

మఱి యొక రైతు ఉండినాడు. అతడును తన పొలమునకు నీరు పాఱించుకొనుటకై కాలువను త్రవ్వుచుండినాడు. అతని

భార్యయు పొలమునకు వచ్చి "చాల ప్రొద్దు పోయినది. ఇంటికి రండి, పని చేసి నప్పటికిని ఇట్లు మితియు మేరయు లేక చేయుట అనావశ్యకము." అన్నది. రైతు అంతగా అడ్డు పలుకక, పాఱను ఒక వైపు పడ వేసి, భార్యతో "సరియే, నీవు రమ్మనుచున్నావు గనుక ఇంటికే వత్తును, పద" అన్నాడు. [అందఱును నవ్వుదురు.] అతనికి తన పొలమునకు నీరు పాఱించుకొొన సాధ్యము కానే లేదు—ఇది మందవైరాగ్యమునకు ఉదాహరణము.

దృఢసంకల్పము లేనిదే, రైతు తన పొలమునకు నీరు పాఱించుకొొన లేనట్లు, తీవ్రమైన కోరిక లేకున్న, మానవుడు భగవత్సాక్షాత్కారమును ఒందలేడు. [విజయునితో] "నీవు ఇచ్చటికి మునుపు వచ్చుచున్నంత తఱచుగా ఇప్పుడు వచ్చుటలేదేమి?"

విజయుడు:— వచ్చుచు ఉండ వలయును అనియే నాకు ఎంతో ఆశ. కాని తీఱుబాటు లేదు. బ్రాహ్మసమాజములో పనికి ఒప్పుకొొన్నాను.

గురుదేవుడు:—మానవుని బంధించి అతని స్వేచ్ఛను హరించునవి 'కామినీకాంచనములే'. కాంచనమునకు ఆవశ్యకతను కల్పించునది కామిని. కామినికై ఒకమానవుడు ఇంకొొక మానవునకు బానిసయై స్వాతంత్ర్యమును గోల్పోవును. అప్పుడు అతడు తన యిచ్ఛవచ్చినట్లు నడచుకో లేడు.

జయపురమున గోవిందస్వామి గుడిలోని యర్చకులు మొదట బ్రహ్మచారులుగ, నుండిరి. అప్పుడు వారిది నిప్పువంటి స్వభావమై యుండెను. ఒకప్పుడు జయపురమహారాజు వారిని రమ్మని చెప్పి పంపెను. కాని వారు ఆ యాజ్ఞను పాటింప లేదు. "రాజుగారినే ఇచ్చటకు వచ్చి దర్శింపుమను"డని వార్తాహరునితో జెప్పి పంపిరి. రాజును, మంత్రులును కలియబలికికొొని ఆయర్చకులకు వివాహములు చేయించిరి. అప్పటినుండి వారిని తాను పిలిపింప వలసిన యావశ్యకత రాజునకు తీఱి పోయినది. వారు తమంతట తామే వచ్చి

"ప్రభూ, ఇదిగో వచ్చితిమి. నీకు మామంగళాశాసనములు. గుడినుండి మేము తెచ్చిన పవిత్రపుష్పము లివిగో, వీనిని దయతో స్వీకరింపు" మన సాగిరి. వారు అంతఃపురమునకు ఏల వచ్చి రనగా, తమకు ఇండ్లు కట్టుకొనుటకో, శిశువుల యన్నప్రాశనమునకో, అక్షరాభ్యాస మునకో, దేనికో ఒకదానికి ధనము సదా కావలసియే యుండెను.

(విజయునితో) ఒకరి !నౌకరి వైన తరువాత నీలో ఎంత తగ్గుబాటు కలిగినదో నీవే పరికింపుము. ఇట్లే విశ్వవిద్యాలయపట్టము లను పెక్కింటిని బడసి, అపా రాంగ్ల విద్యా విశారదు లైన వారు ఆంగ్లప్రభువుల క్రింద నౌకరు లగుచున్నారు. వారు వారిని తమ బూట్లక్రింద ద్రొక్కుచుండుటను గనుచున్నాము. దీని కంతటికిని ఏ కైక కారణము కామినియే. వారు వివాహములు చేసికొన్నారు, భార్యలతోను బిడ్డలతోను ఆడంబర జీవితముల గడపను ఆరంభించి నారు. ఇక వారు ఎంత ఆశించినను వివాహములకు మునుపటి పరి స్థితికి రాలేరు. కావుననే ఈ తిరస్కారములును అవమానములును, బానిసతనమువలని యీ యిక్కట్టులును.

గాఢవైరాగ్యము గలిగి, భగవత్సాక్షాత్కారము పొందిన వానికి, వెంటకే కామినీసక్తి ఉడుగును. గృహస్థజీవనమును గడప వలసియున్నను, అతనికి కామినీభయ ముండదు. కామినీసక్తియును ఉండదు. ఒకటి చిన్నదియును, ఒకటి పెద్దదియునుంగా రెండు సూదంటురాళ్ళు ఉన్న వనుకొనుము. ఆ రెండింట ఏది ఇనుమును ఆకర్షించును? పెద్ద సూదంటురాయియే ఆకర్షించును. దేవుడే పెద్ద సూదంటురాయి. దేవునిముందు కామిని అల్పురాలు, ఆమె ఏమి చేయ గలదు?

ఒక భక్తుడు:— మఱి, మనము స్త్రీని ద్వేషింపవలసిన దేనా?

గురుదేవుడు:— భగవత్సాక్షాత్కారము నొందినాతడు స్త్రీని కామదృక్కులతో వీక్షింపడు. కావున అతనికి ఆమెవలని భయము లేదు. స్త్రీలందఱును లోకజననిదాల్చు ప్రత్యక్షరూపము లే

అనుట నతడు స్పష్టముగ గుర్తించును. వారినందఱను, లోకమాతను ఆరాధించునట్లే, ఆరాధించును.)

(విజయునితో) అప్పు డప్పుడు ఇక్కడికి వచ్చుచుండుము. నిన్ను చూడవలె నని నాకు మిక్కిలి యాశ.

విజయుడు:— బ్రాహ్మసమాజమున నేను నిర్వర్తింప వలసిన పనులు పలువిధము లైనవి కలవు. కావుననే నాకు ఎల్లప్పుడును ఇక్కడికి వచ్చుచుండుటకు సాధ్యపడుట లేదు, కాని వీ లైనప్పు డెల్ల నేను వచ్చుచుందును.

గురుదేవుడు:— (విజయునితో) మతాచార్యకము నిక్కముగ కష్ట మైన పనియే. భగవంతు నొద్ద నుండి స్వయముగ ఆజ్ఞ నొందని వారికి చేతనులకు బోధింప శక్యము గాదు. అట్టి యధికారము లేక నీవు బోధింతు వేని నీబోధనలను ప్రజలు వినరు. అట్టి బోధనకు మఱుగున శక్తియే యుండదు. ఆధ్యాత్మిక సాధన చేతగాని, వేఱు మార్గమున గాని, భగవత్సాక్షాత్కారమును మొదట పొంద వలయును. ఇట్లు భగవ దనుజ్ఞ యనెడి ఆయుధము చేత నుండు నేని, ఉపన్యాసములు చేయ వీ లగును.

విజయుడు :— బ్రాహ్మసమాజబోధనల చేత మానవులకు మోక్షము గలుగదా?

గురుదేవుడు :— ఒక మానవుని సంసారబంధమునుండి విడిపించుటకు వే ఱొక మానవునకు ఎన్న డైన శక్య మగునా ? విశ్వమోహనమైన మాయను సృజించిన వాడు సర్వేశ్వరుడు. ఈ మాయ నుండి మానవులను కాపాడు పనియును, ఆ సర్వేశ్వరున కొక్కనికి మాత్రమే శక్య మగును. సచ్చిదానందస్వరూపి యైన యా మహా గురువు తప్ప వేఱు శరణము లేదు. భగవత్సాక్షాత్కార మొందని వారికిని, భగవ దాజ్ఞను సంపాదింపని వారికిని, దివ్యశక్తితో బలము చేకూర్చుకొనని వారికిని, ఇతరులను సంసార కారాగారమునుండి కాపాడు పని ఎన్న డైనను ఎట్లు సాధ్యపడును ?

ఒకనాడు ''పంచవటి''ని దాటి నేను దేవదారువనమునకు బోవుచున్నపుడు, ఒక గోదురు కప్ప కూత నా చెవిని బడినది. ఆ కప్ప పామునోట పట్టువడి యుండు నని నేను అనుకొంటిని. కొంత సేపు తర్వాత నేను నెను దిరిగి వచ్చు చుంటిని. భయభ్రాంత మైన కప్పకూత అప్పటికిని వినబడుచునే యుండెను. సంగతి ఏమో కనుగొందమని పోయి చూతును గదా, ఆ కప్ప నొక వానపాము పట్టుకొని యుండినది. ఆ పాము దానిని మ్రింగను లేదు విడువను లేదు. అది యొక నాగుబాము నోట బడియుండు నేని, మూడుసార్లు కంటె ఎక్కువగ బెక బెక మనక ''గప్ చిప్'' ఐ యుండు నని నాకు తోచినది. ఇప్పుడు పట్టుకొని యుండునది నీటిపామే కావున ఆ పామును కప్పయును గూడ తీఱని యాతన ననుభవింప వలసి వచ్చెను. సదాచార్యుని చేత బడు వానికి, అహంకారము ముమ్మాఱు మూలిగి అంతతో అంతరించినట్లు నశించును. ఆచార్యుడే ఇంకను పరిణతి నందని వాడైనచో, అతడును శిష్యుడును ఉభయులును తీఱని యాతన ననుభవింతురు. శిష్యునకు అహంకారమును తొలగదు. సంసారబంధమును వీడదు. అసమర్థుడైన యాచార్యుని బారిం బడ్డ శిష్యునకు మోక్షప్రాప్తి లేనే లేదు.

విజయుడు :— స్వామి, మనము ఇట్లు బద్ధులమై యుండుటకు కారణ మేమి? మనకు దేవుడు ఏల అగపడడు.

గురుదేవుడు :— మాయ యనగా వేఱు ఏమియు గాదు, దేహధారికున్న యహంకారమే మాయ. అది యొక తెర వలె సమస్తమును కప్పి యున్నది. అహంకారము సమసిన అన్ని ఇక్కట్టులును తుదముట్టును. తాను కర్తను కాను అనెడి ఎఱుక మానవునకు భగవత్కృపచే ఒక్క సారి కలిగిన జాలును. తత్క్షణమే అతడు జీవన్ముక్తుడు అగును. ఈ దేహమునసే ఉన్నప్పటికిని, అతడు ముక్తుడే. అతనికి ఇక భయము లేనే లేదు.

ఈ మాయ (=అహంకారము) మబ్బును బోలినది. పలుచని

మబ్బుతునుక అడ్డ ముండినను సూర్యుడు అగపడడు. మబ్బు తొలగిన సూర్యుడు అగపడును. ఆచార్యానుగ్రహమున ఒకనికి అహంకారము అంతరించునేని, తత్క్షణమే అతనికి భగవత్సాక్షాత్కారముకలుగును.

జీవుడు సచ్చిదానందస్వరూపియే గాని వేఱు కాడు. మాయ (=అహంకారము) కల్పించిన వివిధోపాధులచేత అతడు ఆత్మ యాథార్థ్యమును మఱచినాడు.

ఒక్కొక్క యుపాధియు మానవునిస్వభావమును మార్పొందించును. జబ్బుమనుష్యుడైనను సరే ఎత్తైన బూట్లు తొడుగునేని వెంటనే అతడు ఆంగ్లేయునివలె ఈల వేయును. ఒకమెట్టునుండి దాని పై మెట్టునకు ఎక్కుచో గంతులిడును. చేత కల మొకటి యుండెనా, అతడు చేతికి ఏ కాగిత మందినను దానిపై గిలుకుచుండును. అట్టిది కలము మహిమ!

ధనము గూడ ఒక గొప్ప యుపాధియే. ధనము అబ్బినంతనే మానవునిలో ఎంతమార్పు కల్గును? అతడు మునుపటివాడు కానే కాడు. ఒక బ్రాహ్మణుడు ఈగుడితోటకు తఱచు వచ్చుచుండెను. అతనిలో పైకి చాల వినయము కనుపట్టుచుండెను. ఒకనాడు నేనును హృదయుడును కోనగరుకు పోయితిమి. పడవ దిగితిమో లేదో, గంగ గట్టున ఆసీనుడై ఉన్న ఆ బ్రాహ్మణుని జూచితిమి. మంచి గాలి అనుభవించుచున్నాడని మేము అనుకొంటిమి. అతడు మావైపు జూచి "ఇటు చూడు, ఓ పూజారీ, క్షేమమా" అని నన్ను అడిగినాడు. నేను అతని కంఠధ్వనిని గుర్తించి "ఇతనికి కొంత ధనము లభించి ఉండును, కావుననే ఆలాగు మాటాడుచున్నా"డని హృదయునితో అంటిని హృదయుడు నవ్వినాడు.

(మానవునకు జ్ఞానము సిద్ధించిన పిమ్మట, అహంకారమును తొలగించుకొన వీలు అగును. జ్ఞానము సిద్ధించిన, సమాధి దశ గలుగును, అందు అహంకారము మాయ మగును. కాని అట్టి జ్ఞాన సిద్ధి దుర్లభము.)

ఐహికపరతను ఆపాదించి, కామినీకాంచనసక్తిని నించెడి యహంకారము దురహంకారము. తాను నడుమ జొచ్చుకొని, జీవబ్రహ్మాభేదభ్రాంతిని గలిగించుచున్నది ఈ దురహంకారమే. నీటిపై అడ్డముగ ఒక కొయ్య నుంపుము. నీరు ఇరుపాయ లైనట్లు కనిపించును. నిజముగ ఉన్న నీ రంతయు ఒక్కటే. ఆ కొయ్యవలన ఒకటి రెండైనట్లు అగపడును. అహంకారము ఆకొయ్యవంటిది. కొయ్యను తీసివేసినచో, మునుపటివలె ఒకటే నీరు ఉండును.

మఱి, ఈదురహంకారము ఎట్టిది? ఈదురహంకారము "ఏమీ! వారు నన్ను ఎఱుగరా? నాకు ఇంత సంపద ఉన్నదే, నాకన్న సంపన్నుడు ఎవరు?" అనిపించును. అట్టివాని యొద్ద ఒక దొంగ పది రూపాయలను దొంగిలించిన చాలును. ఆ సంపన్నుడు ఆదొంగనుండి ఆపైకమును లాగికొనుటే కాక, వానిని చావ దన్నును. కథ అంతతో ఆగదు. అతడు దొంగను పోలీసులకు అప్పగించును, చెఱలో వేయించును. అతని దురహంకారము అతనిచేత "ఏమీ! తాను ఎవరియొద్ద దోచుకొన్నదియును ఈధూర్తుడు ఎఱుగడా? నా పది రూపాయలనా దొంగిలించుట? ఎట్లు కలిగినది ఇతనికి ఇంతసాహసము!" అనిపించును.

విజయుడు :— అహంకారము నశింపనిదే ఐహికపరతను తొలంచుకొనుటకు సాధ్యముకాదు., కావున సమాధిదశ నొందలేడు— అటువంటప్పుడు మానవుడు సమాధి నందుటకు బ్రహ్మజ్ఞానమార్గమును అనుసరించుటే వివేక మగును. భక్తిమార్గమున అహంకారము నిలిచియే ఉండు నేని, జ్ఞానమార్గము అనుసరించుటే మేలు.

గురుదేవుడు:— సమాధి ద్వారా అహంకారమును తొలంచుకొనుట ఒక రిద్దఱికి సాధ్య మగు ననుట నిజమే కాని అట్టివారు మిక్కిలి అరుదు. నీవు ఎన్నియుక్తు లయినను జేయ వచ్చును, కాని అహంకారము మరల మరల వచ్చుచునే ఉండును. రావిచెట్టును నీవు నేడు వేఱుంట నఱకినను, రేపు ఒకమొలక మొలవనే మొలచును.

నీవు చూతువు. కాబట్టి "నేను" అనునది ఉండనే వలయు నేని, ఆ పోకిరిని "దాసుడనైన నేను" గా ఉండ నిమ్ము. బ్రతికి నన్నాళ్లును నీవు "ఓ స్వామీ, నీవు ప్రభుడవు, నేను నీ బంటను" అని అనుసంధించుచునే ఉండ వలయును. 'భగవద్దాసుడను' 'భగవద్భక్తుడను' అని అనుకొనుచుండు "నేను" ఎవరికిని బాధకము కాదు.

విజయుడు :—[గురుదేవునితో] స్వామీ, మమ్ము దురహంకారమును విడువు మనుచున్నారు. "నేను దాసుడను" అని అనుకొన్నచో ఏమియును చెఱుపు గలుగదా?

గురుదేవుడు:— 'నేను దాసుడ' అను భావము, అనగా "నేను భగవద్దాసుడను, భగవద్భక్తుడను" అను తలంపు ఎవనికిని బాధకము కాదు. కాకపోవుటే కాక, భగవత్ప్రాప్తికి సాధకమును అగును.

విజయుడు:— మఱి, స్వామీ, 'దాసుడను నే' నను నహంకారమును నిలుపుకొను వాని కామక్రోధాదులు ఏ మగును?

గురుదేవుడు:— తాను దాసుడ నను భావము ఒకనికి నిక్కముగ గలుగు నేని, అతనిలో కన నగు కామక్రోధాదులు ఆభాస మాత్రములే. భగవత్ప్రాప్తి కనంతరము, తన్ను భగవద్దాసునిగనో భగవద్భక్తునిగనో భావించు నాతడు, ఎవరికిని హాని చేయ లేడు. పరుసవేదిని తాకినంతనే కత్తి బంగారుగా మాఱును. కత్తిరూపము మాత్రము నిలిచి యుండును గాని, అది ఎవరిని గాని గాయపఱుప లేదు.!

టెంకాయచెట్టునుండి ఎండిన కొమ్మ నేలపై బడును కాని, "ఇచట ఒకప్పు డొక కొమ్మ యుండె" నని సూచించు గుర్తుమాత్రము చెట్టుబోదె మీద నిలిచి యుండును. అట్లే భగవత్ప్రాప్తి నందిన వానిలో అహంకారము ఆభాసమాత్రముగ నిలిచి యుండును. అతని కామక్రోధములును ఆభాసములే. అతడు శిశువు వంటివాడు అగును. శిశువునకు సత్త్వరజస్తమము లనెడి మూడు గుణములలోను సంగము ఉండదు. శిశువునకు ఏవస్తువునందు గాని, రక్తి ఎంత త్వరగ

గలుగునో విరక్తియును అంత త్వరగనే గలుగును. ఒక శిశువు ఐదు రూపాయల వెల గల వస్త్రమును పట్టుకొని "ఇది నాకు మా నాయన కొనిపెట్టినది, దీనిని నే నీయను" అని నిశ్చయముతో పలికినను, ఒక్క అణా వెల గల బొమ్మను జూపి, నీవు ఆబిడ్డమనస్సును మరల్ప గలిగి యుందువు. అంతే కాదు. శిశువు దృక్పథమున మానవు లందఱును సమానులే. ఎక్కువ తక్కువలు లేవు. కావున శిశువు వర్ణవిభేదమును పాటింపడు. అతనికి ద్వేషము లేదు. పవిత్రమైన దేదో, కాని దేదో, అత డెఱుగడు.

సమాధిని పొందిన పిమ్మట గూడ కొందఱు "నేను దాసుడను" "నేను భక్తుడను" అను భావమును నిలుపుకొందురు. ఈ 'నే' ననెడి భావమున భక్తుడు ఉండ వచ్చును. "ఓ దేవా, నీవు ఒడయడవు, నేను బంటను; నీవు స్వామివి, నేను భక్తుడను" అని అతడు అనుచుండును. భగవత్ప్రాప్తికి అనంతరముగూడ అతనికి ఆ భావము ఉండును. అతని యహంకారము పూర్తిగ మాసి పోదు. "నేను దాసుడ" నను తలంపును సదా అభ్యసించు వానికి, కడకు భగవత్ప్రాప్తి చేకుఱును. దీనికి భక్తియోగ మని పేరు.

భక్తిమార్గమున బ్రహ్మజ్ఞానప్రాప్తియును సాధ్యమే. భగవంతుడు సర్వశక్తుడు. ఆయనసంకల్పించినచో, భక్తునకు బ్రహ్మజ్ఞానమును సైతము నొసంగ వచ్చును. కాని భక్తుడు సాధారణముగ బ్రహ్మజ్ఞానమును కోరడు. 'భగవంతుడు స్వామి, నేను కింకరుడను, భగవంతుడు నాకు తల్లి, నేను బిడ్డను' అను భావమే అతని కెక్కువ ప్రియము.

విజయుడు:— మఱి వేదాంతశాస్త్రానుసారము నిత్యానిత్య వస్తువిచారము చేయు వారికిని కడపట భగవత్ప్రాప్తి గల్గును గదా.

గురుదేవుడు:— ఔను, నిత్యానిత్యవిచార మను మార్గమునను భగవత్ప్రాప్తి గలుగును. దానికి జ్ఞానయోగ మని పేరు. కాని

అది చాల కష్టమైన మార్గము. బ్రహ్మ మొక్కటే సత్యము, జగత్తు మిథ్య అను జ్ఞానము నొకడు దృఢముగ సంపాదించు నేని, అతని మనస్సు సమాధిలో నిమగ్న మగును కాని, నేను మునుపు చెప్పినట్లు, ఈ కలియుగమున మానవుడు అన్నగతప్రాణుడు. జగత్తు మిథ్య, బ్రహ్మ మొక్కటే సత్య మను నెఱుక అతనికి ఎట్లు గలుగును? "నేను దేహమను కాను, నేను మనస్సును కాను, నేను చతుర్వింశతి తత్త్వములు కాను, నేను ఖేద మోదములకు అతీతుడను, ముసలితనమునకును వ్యాధులకును దుఃఖములకును మరణమునకును అతీతుడను" అను భావము అలవడుట ఈ కలియుగములో కష్టము. నీ వెంతైనను వాదింప వచ్చును, యుక్తులు చూప వచ్చును గాని, దేహమే ఆత్మ అను భావము మాత్రము ఎట్లో ఒకట్లు ఎదురుచూడని యే మూల నుండియో గలుగుచునే యుండును. దేహమే ఆత్మ అను భావమును ఎవడును తొలగించుకో లేడు. కాబట్టి కలియుగ మానవులకు భక్తి మార్గమే శ్రేష్ఠము. సులభమార్గమును అదే.

అదియును గాక, నా కోరిక నేను చక్కెరను ఆరగింపవలె ననియే కాని, చక్కెరగానే మాఱిపోవలె నని కాదు. నేనే బ్రహ్మమను అని అంద మని నా కెప్పుడును తోచదు. "నీవు స్వామివి నేను కింకరుడ" ననియే నే ననుచుందును. దేవుని నామములను మహిమలను కీర్తింపవలె నని నేను ఆశపడుచుందును. భగవంతుని స్వామిగను తన్ను కింకరునిగను భావించుట చాల మంచిది. అదియును గాక "అలలు గంగానదికి సంబంధించినవి" అని యందురే కాని, "గంగానది, అలలకు సంబంధించినది" అని అనరు. తెలిసినదా? 'సోహ మస్మి' 'నే నతడ' నను భావము మంచిది కాదు. ఆ భావము గలిగి, తన దేహమునే ఆత్మ అనుకొనువాడు, ఎంతో యాత్మహాని చేసికొన్నవా డగును. ఆధ్యాత్మికజీవితమున అతడు పురోగమింప లేడు సరి కదా, అధఃపతనము గాంచును. అతడు ఇతరులను మోసగించుటే కాక తానును మోసపోవుచున్నాడు. అతడు తన మనఃపరిస్థితిని తానే అర్థముచేసికో లేడు.

ఏ భక్తి యైనను ఎట్టి భక్తి యైనను భగవత్ప్రాప్తికి సాధకము కాజాలదు. 'ప్రేమభక్తి' యొక్కటే భగవత్ప్రాప్తికి సాధకము. ప్రేమభక్తికే రాగభక్తి(=వేఱు దేనియందును లేక భగవంతునందు మాత్రమే యుండు ప్రేమ)యని నామాంతరము. ప్రేమయు, ఆర్తమును లేకున్న భగవత్ప్రాప్తి చేకుఱదు. భగవంతుని యందు ప్రేమ అలవడనిదే, భగవంతుని బొందలేము.

వేఱొక విధమైన భక్తికూడ కలదు. దానికి వైధి భక్తి అని పేరు. దాని ప్రకారము, భగవన్నామమును ఇన్ని తూర్లు జపింపవలె ననియు, ఉపవసింపవలె ననియు, యాత్రలు చేయవలె ననియు, విహిత నివేదనలతో దేవు నారాధింపవలె ననియు, ఇన్ని క్రతువులు చేయ వలె ననియు, ఇవియు ఇంకను ఇట్టివియు నియమములు గలవు. ఇట్టి సాధనలను సుదీర్ఘకాలము అవిచ్ఛిన్నముగ సాగించినవానికి, క్రమముగా రాగభక్తి అలవడును. రాగభక్తి కలుగనంతవఱకు భగవత్సాక్షాత్కారము సాధ్యము కాదు. భగవంతుని ప్రేమింప వలెను. భగవత్సాక్షాత్కారము కావలె నన్న వాడు సంసారవ్యామోహము నుండి పూర్తిగ విడువొంది మనస్సును పూర్తిగ భగవంతునందే ఏకాగ్ర మొనర్ప వలయును.

కాని, కొందఱకు మాత్రము మొదటనే రాగభక్తి అలవడును. అది వారిలో అంతర్లీనమై యున్నది. శైశవమునుండియే వారిలో ఆ భక్తి కలదు. ఆపసిప్రాయముననే వారు దేవునికై ఏడ్తురు. వైధి భక్తి గాలికై విసనకఱ్ఱతో వీచుకొనుట వంటిది. గాలికి విసనకఱ్ఱ అవసరమే. అట్లే భగవద్భక్తి గల్గుటకై జపతపములను ఉపవాసములను ఆచరింప వలెను. కాని దక్షిణపు గాలి తనంతట వీవ దొడగినంతనే, విసనకఱ్ఱను ఆవల పాఱవేయుదుము. ఈశ్వరునందు భక్తియు సక్తియు సహజముగ గలిగినంతనే, జపము తపము మున్నగునట్టివి ఆగిపోవును. నిజమునకు, భగవత్ప్రేమోన్మాదపరవశుడై యున్నప్పుడు, వేద విహిత కర్మలను ఎవడు ఆచరించును?

భగవద్భక్తి భగవత్ప్రేమగా రూపొందనంతవఱకును అది

యింకను 'పచ్చి'గా ఉన్న దనియే చెప్ప వచ్చును. ప్రేమగా రూపొంది నప్పుడు భక్తికి పరిపక్వత గలుగును.

ఆధ్యాత్మిక ప్రసంగములను ఉపదేశములను, అపరిపక్వ మయిన భక్తి గల వాడు జీర్ణించుకో లేడు, పరిపక్వమైన భక్తి గల వాడు జీర్ణించుకో గలడు. కాడికారము (సిల్వర్ నైట్రేట్) చేత కప్పబడిన 'ఫోటో' యద్దములో పడిన ప్రతిబింబము అట్లే నిలుచును. వట్టి యద్దపు తునుకయం దన్ననో వేలకొలది ప్రతిబింబములు జొచ్చి కొనును కాని ఒక్కటియు నిలువదు. ఎదుటి వస్తువు తొలగినంతనే అద్దము యథాపూర్వముగనే యగును. భగవత్ప్రేమ ముందుగనే వరిల్ల జేసికొని యుండ కున్న, ఎవడు గాని ఆధ్యాత్మిక బోధనను జీర్ణించుకో లేడు.

విజయుడు:— భగవత్ప్రాప్తికిని తత్సాక్షాత్కారమునకును భక్తి యొక్కటి ఉన్న చాలునా?

గురుదేవుడు:— చాలును. భగవత్సాక్షాత్కారమునకు భక్తి యొక్కటే సాధనము. ఆభక్తి పరిపక్వభక్తిగా, ప్రేమభక్తిగా, రాగభక్తిగా ఉండ వలెను. ఆ భక్తి ఎవనికి ఉన్నదో అతడు దేవుని ప్రేమించును. ఎట్లు ప్రేమించు ననగా, — తల్లి బిడ్డను, బిడ్డ తల్లిని, కాంత కాంతుని ఎట్లు ప్రేమింతురో—అట్లు ప్రేమించును.

అట్టి ప్రేమ భగవంతునియందు ఎవనికి ఉన్నదో, వానికి ఆలుబిడ్డలందుగాని బంధుమిత్రులందుగాని తగులాట ముండదు. వారి యందు అనుకంప మాత్రమే నిలిచి యుండును. అట్టివాడు తాను తన కర్తవ్యమును నిర్వర్తింప వలసిన యొక వింత చోటు అని మాత్రమే ఈలోకమునుగూర్చి అనుకొనును. అది ఎట్లుండుననగా పల్లెలో సొంత యిల్లు గలవాడు, ఏదో పనికై కలకత్తాకు వచ్చుటను బోలి యుండును. కలకత్తాలో పనిచేయుచున్నంతకాలము అతడు అద్దెయింట కాపుర ముండ వలెను. భగవత్ప్రేమ పెంపొంది నప్పుడు, ఐహికజ్ఞానమును ఐహికసక్తియును పూర్తిగా తొలగి పోవును.

సంసారవ్యామోహము రవంత ఉన్నప్పటికిని, మానవునకు భగవత్సాక్షాత్కారము గలుగదు. చెమ్మ దాకిన యగ్గిపుల్లలను వేయింటిని నీవు అగ్గిపెట్టెమీద రాచినను నిప్పు పుట్టదు. పుల్ల లన్నియు ఊరక వ్యర్థములై పోగువడును. సంసారవ్యామోహమున ఊరిన మనస్సు చెమ్మగిల్లిన యగ్గిపుల్లను బోలినది.

ఇట్టి భగవత్సక్తి, ఇంతటి ఉద్రిక్త ప్రేమ, ఇట్టి పరిణతభక్తియు ఆత్రమును భక్తునకు ఒక్క సారి యైనను గలుగు నేని, అతడు సాకార నిరాకారప్రకారములు రెండింటను దేవుని సాక్షాత్కరించుకొనును.

విజయుడు:— భగవంతుని సాక్షాత్కరించుకొనుట ఎట్లు?

గురుదేవుడు:— హృదయశుద్ధి లేకున్న భగవత్సాక్షాత్కారము గలుగదు. కామినీకాంచనసక్తిచేత చిత్తము కళంకిత మైనది, బురదలో మఱుగువడినదియుం బోలె నైనది. బురదలో మఱుగు వడిన సూదిని సూదంటురాయి ఆకర్షింప లేదు. బురదను కడిగివేసి నచో సూదంటురాయి సూది నాకర్షించును. అట్లే మనఃకాలుష్య మును కన్నీటిచే కడిగివేయ నగును. అనుతాపాశ్రువులను కార్చుచు "దేవా, చెడ్డపనిని ఇక నెప్పుడును చేయ" నని చెప్పుకొన్నచో ఈ కలుషము తొలగి పోవును. తర్వాత సూదిని సూదంటురాయి ఆకర్షించినట్లు భగవంతుడు భక్తుని మనస్సును ఆకర్షించును. భక్తునకు సమాధిదశలో భగవత్సాక్షాత్కారమును గలుగును.

నీవు వేయిసార్లు ప్రయత్నించినను, భగవత్కృప లేని యెడల దేనిని గాని సాధింప లేవు. భగవత్కృప లేకున్న భగవత్సాక్షా త్కారము గలుగదు. భగవత్కృపను ప్రాపించుట సులభ మైన పనియా? అహంకారమును పూర్తిగ విడిచిపెట్ట వలయును. 'కర్తను నేను' అను తలంపు, చేతనునకు ఉన్నంతవఱకును అతనికి భగవత్సా క్షాత్కారము గలుగదు.

తనకు తానే ఒడయడు అనుకొను వాని హృదయమున దేవుడు అంత సులభముగ సన్నిధి సేయడు. భగవ దనుగ్రహ

మెప్పుడు గల్గునో తత్‌క్షణమే భగవత్సాక్షాత్కారము గలుగును. ఆయన జ్ఞానప్రభాకరుడు. ఆ ప్రభాకరుని కిరణ మొక్కటి జ్ఞాన జ్యోతిని పఱపి జగమును వెలిగించినది. ఆ వెలుగుననే మన మొకరొకరిని చూచుకొన గలుగు చున్నాము, వివిధవిషయములను దెలిసికొనగలుగుచున్నాము. దేవుడు తన వెలుగును తన మొగము వైపునకు ద్రిప్పుకొన్ననే మనము ఆయనను దర్శింప గలము.

పోలీసు సార్జంటు రాత్రి చీకటిలో చేత నొక లాంతరు పట్టుకొని పహరా తిరుగును. [ఆ లాంతరుకు మూడు వైపుల నల్లద్దము లుండును]. అతని మొగము ఎవరికిని అగపడదు. ఆ లాంతరు వెలుతురులో అందఱి మొగములును ఆయనకు అగపడుచుండును, వారును తమలో తాము ఒకరి మొగముల నొకరు చూచుకొనగలిగి యుందురు. కాని, సార్జంటును చూడ గోరిన వాడు "అయ్యా, దయచేసి దీపపు వెలుతురును తమ మొగమువంకకు మరల్చుకొండు. నన్ను మిమ్ము చూడనిండు" అని సార్జంటును ప్రార్థింప వలెను. అదే విధముగ "ఓ దేవా, అనుగ్రహింపుము, జ్ఞానదీపమును నీవైపు మరల్చుకొమ్ము, నీవదనమండలమును నను దర్శింప నిమ్ము" అని దేవుని గూడ ప్రార్థింప వలెను. ఇంటిలో దీపము లేకుండుట దారిద్ర్యసూచకము, కావున హృదయమున జ్ఞానదీపమును వెలిగించుకొన వలయును.

విజయుడు మందు తెచ్చుకొని యున్నందున అందుకై గురుదేవుడు ఒకభక్తునిచేత కొంత నీరు తెప్పించెను. నిజముగ ఆయన, దయ సదా ఊరుచుండు చెలమ వంటి వాడు. విజయుడు మిక్కిలి పేదవాడు కావున అతడు ఈయ వలసిన పడవకేవును కూడ గురుదేవుడే ఇప్పించెను. విజయుడును, బలరామును, మహేంద్రుడును, తక్కిన భక్తులును ఒకపల్లెపడవ నెక్కి కలకత్తాకు బయలుదేఱిరి.

1883 వ సంవత్సరము మార్చి తే 9 ది, శుక్రవారము.

ఉదయము సుమారు తొమ్మిది గంటలప్పుడు, గురుదేవుడు తనగదిలో రాఖాలు మహేంద్రాది భక్తులు కొందఱితో కూర్చుండి

యుండెను. ఆ నాడు అమావాస్య. అట్టి దినములందు దేవీధ్యానమున తలచుచు సమాధిదశ నొందుచుండుట శ్రీరామకృష్ణునకు మామూలు.

లోకమున గృహస్థజీవితమును గురించి సంభాషణ సాగుచుండెను.

భక్తుడు:— స్వామీ, దేవుడు మనలను ఎందులకు ఈ లోకములో ఉంచియున్నాడు?

గురుదేవుడు:— ఈలోకము కర్మభూమి. కర్మము, జ్ఞానమునకు సాధనము. కొన్ని పనులను చేయుమనియు, కొన్నింటిని మానుమనియు, గురువు శిష్యునకు ఉపదేశించును. అంతే కాదు, ఫలసంగము లేక కర్మ ననుష్ఠింపు మనియు గురుడాదేశించును. విహిత కర్తవ్యము ననుష్ఠించిన యెడల హృదయమాలిన్యము నశించును. అది, వైద్యుడు చెప్పిన ప్రకారము మందు పుచ్చుకొని, వ్యాధిని వదలించుకొనుటను — బోలినది.

సంసారమునుండి దేవుడు మనలను విడిపింపమి యేల? వ్యాధి నిమ్మళించిన వెంటనే ఆయన మనకు విముక్తి నిచ్చును. మన కామినీ కాంచనానుభవములు తీరిన వెంటనే ఆయన మనలను విముక్తి నొందించును.

ఆ దినములలో శ్రీరామకృష్ణుని హృదయమున మాతృప్రేమ నిండి తొనకుచుండెను. కావున ఆయన రాఖాలును, సదా తనయొద్ద నుంచుకొని యుండెను. తల్లిపై బిడ్డప్రేమ ఎట్టిదో, గురుదేవునిపై రాఖాలు ప్రేమ అట్టిది. చన్ను గుడుచుచుండు నపుడు శిశువు తల్లిపై ఒరుగు నట్లు రాఖాలు గురుదేవు నొడి నూనుకొని కూర్చుండెడి వాడు.

గురుదేవుని పార్శ్వమున రాఖాలు ఆవిధముగ కూర్చుండి యుండ ఆగదిలోనికి ఒక వ్యక్తి ప్రవేశించి గంగానదిలో ప్రవాహము మిక్కిలి పోటెక్కియున్న దని చెప్పినాడు. గురుదేవుడును భక్తులును దానిని చూతమని పంచవటియొద్దకు పరుగిడిరి. ప్రవాహములో ఒక

పడవ ఇటు నటు కొట్టుకొనుచు నగపడెను. చూచి రామకృష్ణుడు "చూచితిరా! చూచితిరా! ఆ పడవకు ఎట్టి ముప్పును రాకున్న బాగుండు నని నా యాశ" అని అఱచెను.

వా రందఱును పంచవటిలో కూర్చుండిరి. అలలకు కారణ మేమో వివరింపు మని గురుదేవుడు మహేంద్రు నడిగెను. మహేంద్రుడు నేల మీద సూర్యుని చంద్రుని బొమ్మలను, భూగోళమును గీచి, ఆకర్షణశక్తిని పోటును, పాటును, అమావాస్యను పూర్ణిమను, గ్రహణములను ఇంకను నట్టి విషయములను వివరింప ప్రయత్నించెను.

గురుదేవుడు:— (మహేంద్రునితో) ఆపుము, ఆపుము. నీ మాటలు నా కర్థ మగుట లేదు, నన్ను కలవరపఱచుచున్నవి, తల నొప్పి ఎత్తుచున్నది. అంత దూరమున నున్న వానిని గుఱించి తెలిసి కొనుట ఎట్లు శక్య మగును?

ఇటు చూడుము — నా పసితనములో చిత్రలేఖనమున నాకు మంచి నేర్పు ఉండెను. కాని లెక్క లన్న నాకు తలనొప్పి. సరళ గణితము కూడ నేను నేర్చుకో లేక పోతిని.

మధ్యాహ్నభోజన మయిన వెనుక గురుదేవుడు కొంచెము సేపు హాయిగ నిద్రించెను. ఆధారుడు మొద లయిన భక్తులు ఒక రొకరుగ సమావేశ మైరి. ఆధారు డిచ్చటికి వచ్చుటకు ఇదే మొదలు. అతనికి వయస్సు సుమారు ముప్పదేం డ్లుండును. అత డొక డిప్యూటీ మాజిస్ట్రేటు.

గురుదేవుడు:— మితిమీఱి యుక్తివాదము చేయ కూడదు. లోకమాత పాదపద్మములపై ప్రేమయుండిన చాలును. మితిమీఱి యుక్తివాదము చేసిన, మనస్సు కలతపడి పోవును. మడుగులోని నీటిని పైపైని త్రాగుదు మేని స్వచ్ఛముగ నుండును. చేతిని అడుగునకు పోనిచ్చి కలియ బెట్టుదు వేని నీ రంతయు బురద అగును. కావున భక్తిని ప్రసాదింపు మని భగవంతుని ప్రార్థింపుడు..

భక్తుడు:—భగవంతుని ప్రత్యక్షముగ జూచుట సాధ్యమగునా?

గురుదేవుడు :— తప్పక సాధ్య మగును. సాకార నిరాకార ప్రకారముల రెండింటను భగవత్సాక్షాత్కార మొంద సాధ్య మగును. అంతే కాదు. ఎట్ట యెదుట నుండు మానవులలో సహితము భగవంతుని ప్రత్యక్షముగ జూడ వీ లగును. భగవ దవతార మూర్తిని దర్శించుటయు భగవంతునే దర్శించుటయు నొక్కటే. ప్రతి యుగమందును భగవంతుడు మానవరూపమున అవతరించుచుండును.

1883 వ సంవత్సరము మార్చి తే 11 ది భానువారము.

అది శ్రీరామకృష్ణుని జన్మదినము. శిష్యులును భక్తులును పెక్కురు ఆ యుత్సవమును దక్షిణేశ్వరమున ఆలయారామమున జరుప గోరిరి.

ప్రొద్దుననుండి భక్తులు ఒకొక్కరుగను గుంపులుగుంపులుగను రా సాగిరి. ప్రాత రారాధన మైన వెంటనే నహబత్తులో మధుర సంగీతము చెల్లెను. అది వసంతకాలము. తరువులు(చిన్నవియును పెద్దవియు)ను, లతలును, నూతన పత్రపుష్పములతో నిండి యుండినవి. అట నావరించి యున్న గాలిలో సైతము ఆనందము నిండి యుండెను. ఆ పవిత్రదినమున భక్తుల హృదయములు ఆనందభరితములై యుండినవి.

ఉదయమున మహేంద్రుడు వచ్చునప్పటికి గురుదేవుడు రాఖాలు — భవనాథ — కాళీకృష్ణులతో నవ్వుచు సంభాషించుచుండెను. మహేంద్రుడు గురుదేవునకు సాగిలబడి ప్రణమిల్లెను.

గురుదేవుడు :—(మహేంద్రునితో) — వచ్చితివా, సంతోషము.

(భక్తులతో) లజ్జ గాని, ద్వేషము గాని, భయము గాని, ఉన్నంతవఱకును ఎవరికిని ఆధ్యాత్మికపరత సిద్ధింపదు. ఈనాటి యానందము మిక్కుటముగా నుండును గాని, భగవన్నా మోన్మత్తులై ఆడుచుపాడుచునుండని మూర్ఖులకు భగవత్ప్రాప్తి యెన్నడును గలు

గదు. భగవన్నామసంకీర్తనము జరుగుచున్నపుడు ఎవనికి గాని లజ్జాభయము లెట్లు గలుగును? ఇప్పుడు, కానిండు, అందఱును పాడుడు.

భవనాథుడును అతనిమిత్రుడు కాళీకృష్ణుడును పాడిరి, పాట వినుచున్నంతసేపును శ్రీరామకృష్ణుడు ధ్యాననిమగ్నుడై యుండెను. కొంత సేపయిన పిదప కాళీకృష్ణుడు, భవనాథుని చెవిలో, ఏమో గుసగుస మనెను. వెంటనే కాళీకృష్ణుడు, గురుదేవునకు ప్రణమిల్లి, లేచెను. శ్రీరామకృష్ణు డాశ్చర్యపడి "ఎక్కడికి పోవుచున్నావు?" అని యడిగెను.

భవనాథుడు :— ఏదో చిన్నపనిమీద పోవుచున్నాడు.

గురుదేవుడు :— ఏ పని?

భవనాథుడు :— బరానగరకార్మికుల సంస్థ (బరానగర్ వర్కింగ్ మెన్స్ ఇన్స్టిట్యూట్) కు పోవుచున్నాడు.

గురుదేవుడు :— అతని దురదృష్టము. ఈ దిన మిచ్చట ఆనందపరీవాహము వెల్లివిరియును. అతడును అనుభవించి యుండ వచ్చును గదా. ఎంత దురదృష్టము!

శ్రీరామకృష్ణున కారోగ్యము బాగుగ లేదు. కావున ఆయన గంగాస్నానమును నాటికి మానుకొనెను. సుమారు తొమ్మిదిగంట లప్పుడు ఏటినుండి కొన్ని బిందెల నీరు తెప్పించుకొని గురుదేవుడు తన శిష్యుల తోడ్పాటుతో తనగదికి తూర్పున నున్న వసారలో స్నానము చేసెను, నూత్నవస్త్రముల ధరించెను. అంతసేపును భగవన్నామము జపించుచునే యుండెను. లోకమాతృ పవిత్రనామమును జపించుచునే ప్రాంగణము మీదుగ కాళిగుడికి పోయెను. ఒక రిద్దరు శిష్యులును వెంట జనిరి. గ్రుడ్లను పొదుగు చున్నపుడు పక్షి చూపెట్లుండునో, గురుదేవుని చూపు అప్పు డాలాగు అంతర్ముఖమై యుండెను.

గుడిలో ప్రవేశించినంతనే ఆయన లోకమాతయెదుట సాగిల

బడి ఆరాధించెను. కాని ఆరాధించు నపుడు ఎట్టి క్రమమును ఆయన పాటింప లేదు. గంధపుష్పముల నాయన ఒక పరి దేవి పాదముల కర్పించును. ఒక పరి వానిని తన తలపైనే పెట్టుకొనును. అట్లు తన ప్రత్యేకమార్గమున ఆరాధనను ముగించి, దేవి కర్పించుటకై కొన్ని పచ్చి టెంకాయలను భవనాథుని చేత తెప్పించెను. ఆయన విష్ణ్వాలయమునకు గూడ పోయి రాధాకృష్ణుల దర్శనము చేసికొనెను.

గురుదేవుడు గదికి వచ్చి చూచుకొనునప్పటికి, రామ – నిత్య గోపాల – కేదా రాది భక్తులును వచ్చి యుండిరి. అందఱును గురుదేవునకు ప్రణమిల్లిరి. ఆయన వారిని హృదయపూర్వకముగ నాదరించెను.

గురుదేవుడు :— (భక్తులతో) భగవ దవ తా ర ము ను సామాన్య జనులు గుర్తింప లేరు. దేవుని యవతరణము చాల గూఢమైనది. అంతరంగ శిష్యులు కొందఱు మాత్రమే అవతారమూర్తిని గుర్తింప గలిగి యుందురు. రాముడు సాక్షాత్పరబ్రహ్మ మనియు, పరిపూర్ణ భగవదవతార మనియు, ఋషులలో ఒకపండ్రెండుగురకు మాత్రమే తెలిసియుండిన దట. తక్కిన ఋషులు రామునితో "రామా నీవు దశరథుని కుమారుడవు, మాకు తెలిసినది అంతే" అని చెప్పెడి వా రట.

ఇంతలో కొన్నగరమునుండి కొందఱు భక్తులు తాళ మృదంగములతో సంకీర్తనము గావించుచు వచ్చిరి. గది ఈశాన్యపు వసార సమీపమునకు వారు వచ్చినంతనే శ్రీరామకృష్ణుడును దివ్యానందపరవశుడై నర్తించుచు ఆపాట నందుకొనెను. నడుమ నడుమ ఆయన సమాధిలో మునుగు చుండెను. అప్పు డాయన రాతిబొమ్మ వలె కదల కుండెడి వాడు. ఆయన అట్టి దివ్యోన్మాద దశలోనుండగా భక్తు లాయన కంఠమున మల్లెపూల దండలను దాల్చిరి. అప్పటి గురుదేవుని మూర్తి శ్రీచైతన్యుని తలంపించుచుండెను. శ్రీచైతన్యుడు మఱియొక యవతారమూర్తి. గురుదేవునకు మూడు దశలు

ఒకదాని వెంబడి యొకటి గా కలుగుచుండెను. మొదటిది పూర్తి సమాధి దశ. అప్పు డాయనకు బాహ్యలోకజ్ఞానము కొంచెముకూడ నుండదు. రెండవది అర్ధ సమాధి దశ. అప్పు డాయన ప్రేమోద్రేకముతో భక్తులతో కలిసి నర్తించును. మూడవది జాగ్రద్దశ. అప్పు డాయన బిగ్గరగ ప్రవర్తిల్లుచుండు సంకీర్తనలో పాల్గొనును. ప్రాలంబ సురభి మాలి కాలంకృత కంఠుడై, ప్రేమోజ్జ్వల ముఖుడై, నృత్యద్భక్త పరివేష్టితుడై, సమాధిలో నిశ్చలుడైన యా గురుదేవుని దర్శనము నిజముగ దేవతలకు సైతము స్పృహణీయమైనది.

మధ్యాహ్న భోజన వేళ యయినది. శ్రీరామకృష్ణుడు క్రొత్త పసుపు వస్త్రమును ధరించి చిన్న మంచముపై కూర్చుండెను. ఆయన మేని బంగారు చాయ, వలువ పసిమితో మిళితమై భక్తుల చూపులకు మరులు గొలుపు చుండెను.

భోజనానంతరము శ్రీరామకృష్ణుడు చిన్న మంచముపై కొంత సేపు విశ్రమించెను. గదికి లోపలను వెలుపలను భక్తులు క్రిక్కిరిసి యుండిరి. వారిలో కేదారుడు, సురేశుడు, రాము, మనోమోహనుడు, గిరీంద్రుడు, రాఖాలు, భవనాథుడు, మహేంద్రుడును ఉండిరి. రాఖాలుతండ్రిగారు కూడ ఉండిరి.

వైష్ణవ గోస్వామి యొకడు ఆగదిలో నాసీనుడై యుండెను. గురుదేవు డతనిని "సరి, నీ వే మందువు? ఏది దారి?"

గోస్వామి :—స్వామీ, భగవన్నామ కీర్తన చాలును, భగవన్నామము కలియుగమునకు ప్రత్యేకముగ విహితమని వేదములు నొక్కి చెప్పుచున్నవి.

గురుదేవుడు :—అవును, భగవన్నామ పవిత్రతను గుఱించి సందేహమే లేదు. కాని భక్తుని హృదయమున అత్యుత్కట ప్రేమ లేనిచో, వట్టి నామము ఏమైన చేయ గలదా? భగవంతుని చూడవలె ననిన, భక్తుడు మిక్కిలి తహతహ పడ వలెను. మన సేమో కామినీకాంచనము లందే నిమగ్నమై యుండగా, మానవుడు, వట్టి

యంత్రము వలె, భగవన్నామము జపించు ననుకొనుము. అత డేమైనను సాధింప గలడా? మానవుడు పవిత్ర భగవన్నామము జపించి పవిత్రు డగు ననుకొనుము. మఱుక్షణముననే అతడు అనేక పాపముల చేయు నేని అతనికి మనోబలము శూన్యమే. చేసిన పాపమును మఱల చేయ నని అతడు ప్రతిజ్ఞ చేయడు. గంగలో నొక్క సారి మునిగిన పాపము లన్నియును పోవు ననుట నిజమే కాని, అందు వలన నేమగును? ఆపాపము లన్నియు గంగగట్టున నున్న చెట్ల మీద వ్రాలి యుండు నట. పవిత్ర గంగాజలములో మునిగినాతడు అచ్చటనుండి వెలువడిన తక్షణమే, ఆ ప్రాత పాపములు చెట్లపై నుండి మఱల అతని భుజములమీదికి దుముకును. (అందఱును నవ్వుదురు) అతడు మఱల మునుపటి పాపముల చేతులలోనే పడును. నీటినుండి వెలువడిన వెంటనే అవి అతనిని పైకొనును.

కాబట్టి నేను చెప్పున దే మనగా — భగవన్నామమును జపింపుము. జపించుచునే "ఓ దేవా, నీయందు నాకు ప్రేమను ప్రసాదింపుము. జీవితసౌఖ్యములు, పేరుప్రతిష్ఠలు, సిరిసంపదలు మొదలైన క్షణికవిషయములందు నాకుగల సంగమును నానాటికిని తగ్గింపు" మని భగవంతునే ప్రార్థింపుము.

(గోస్వామితో) ఆర్జవమును అక్కఱయు ఉండిన యెడల ఏ మతమునను సరించినను భగవంతుని పొంద వచ్చును. భగవత్ప్రాప్తి వైష్ణవులకును కలుగును, శాక్తేయులకును కలుగును, వేదాంతులకును కలుగును, బ్రాహ్మసమాజమువారికిని గలుగును. క్రైస్తవులకును మహమ్మదీయులకునుగూడ గలుగును. భక్తిశ్రద్ధలు ఉండవలయునే కాని, భగవత్ప్రాప్తి అందఱకును కలుగుట నిక్కువము.

"మాకృష్ణు నారాధింప కున్నచో ఎవనికిని ఏదియు లభింపదు" అని కొంద ఱందురు. "లోకజననిని కాళికాదేవి నారాధింప కున్నచో ఏమియు లభింపదు" అని మఱి కొంద ఱందురు. "క్రైస్తవ మతము నవలంబింపని వారికి మోక్షము లేదు" అని కొంద ఱందురు.

ఇట్లనుచు వీరు కలహింతురు. ఇది వట్టి మతదురభిమానము. "నా మత మొక్కటే నిజము. ఇతరుల మతములు అసత్యములు" అని దురభిమాని గద్దించును, ఇట్టి వైఖరి చెడ్డది. వివిధమార్గములలో భగవత్ప్రాప్తి పొంద వచ్చును.

అంతే కాక దేవుడు నిరాకారుడు గా డనియు, సాకారుడే యనియు అనుచు కొందఱు కలహమునకు ప్రారంభింతురు. వైష్ణవులు వేదాంతులతో కలహింతురు.

దేవుని ప్రత్యక్షముగా చూచిన తరువాతనే, ఆయనను గుఱించి ఏమైన చెప్పుటకు సాధ్యపడును. ప్రత్యక్షముగ చూచినవానికి భగవంతుని సాకారతయు నిరాకారతయు రెండును సత్యములే యని తెలియ నగును. ఈరెండే కాక, వర్ణన కందని ప్రకారములు ఇతరములు కూడ భగవంతునకు కలవు.

ఒకప్పుడు కొంతమంది గ్రుడ్డివారు ఒక జంతువును సమీపించిరట. ఎవరో ఒకాయన "ఆ జంతువు ఏనుగు" అని తెలిపి, ఆ యేనుగు ఎట్లున్నదో వారిని వర్ణింపు డన్నా డట. ఆ గ్రుడ్డి వారు దానిని తాకి చూడ నారంభించిరి. దాని కాలిని మాత్రము తాకి చూచిన వాడు, "ఏనుగు స్తంభమువలె ఉన్నది" అన్నా డట. దాని చెవినిమాత్రము తాకి చూచిన వాడు, "ఏనుగు చేటవలె ఉన్నది" అన్నా డట. ఇట్లే పొట్టను తాకి చూచి యొకడును, తోకను తాకి చూచి యొకడును ఏనుగునుగూర్చి తల కొక రీతిగా బలికిరి. అట్లే ఒక్క ప్రకారముననే దేవుని జూచిన వారు, దేవునకు అదొక్కటే ప్రకారము అని తలంతురు, వేఱు ప్రకారములు ఉండుటకే వీలు లే దని కూడ నిశ్చయించుకొందురు.

(గోస్వామితో) దేవుడు సాకారుడు అనుట ఒక్కటే సత్యమని నీవు ఎట్లు అనగలవు? కృష్ణాది మానవరూపములలో ఆయన భువి నవతరించుచుండు ననుట నిజమే, సందేహము లేదు. నిజముగ వివిధరూపములలో ఆయన భక్తులకు దర్శన మొసంగుచుండును. కాని

దేవుడు రూపరహితుడు అనుటయు నిజమే. ఆయన అపరిచ్ఛేద్యుడు, సచ్చిదానందపరబ్రహ్మము. వేదములు ఆయనను సాకారు డనియు వర్ణించుచున్నవి, నిరాకారు డనియును వర్ణించుచున్నవి; సగుణు డనియు జెప్పుచున్నవి, నిర్గుణు డనియును జెప్పుచున్నవి.

కేదారుడు :—వ్యాసుడు తాను చేసిన మూడు వ్యత్క్రమములకు దేవుని క్షమాపణ వేడుకొన్నా డని భాగవతము చెప్పుచున్నది. "ఓ దేవా, నీవు నిరాకారుడవు, ఐనను నేను నాధ్యానములో నిన్ను సాకారునిగ భావించితిని. నీవు వాగతీతుడవు, ఐనను నేను నీ స్తోత్రములను పాడితిని. నీవు ఆత్మవుగ సర్వత్ర వ్యాపించి ఉన్నావు, ఐనను నేను కొన్ని క్షేత్రములకు యాత్ర చేసితిని. ప్రభూ, అనుగ్రహింపుము, నా యీ తప్పులను మన్నింపుము" అన్నా డట ఆయన.

గురుదేవుడు :—ఔను, దేవునకు సాకారతయు ఉన్నది, నిరాకారతయు ఉన్నది. అంతే కాదు, దేవుడు అటు సాకారతకును ఇటు నిరాకారతకును రెంటికిని అతీతుడు. దేవుని ఒక హద్దున ఎవరును నిలుప లేరు.

మధ్యాహ్నానంతరము భక్తులు పంచవటిలో సంకీర్తన చేసిరి, గురుదేవుడును వారితో కలసికొనెను. అందఱకును ఆదినము చాల ఆనందముగ గడచెను.

సాయంకాలము సుమారు ఆఱుగంట లప్పుడు గురుదేవుడు తన గదికి ఆగ్నేయమున ఉన్న వసారలో భక్తులతో కూర్చుండియుండెను.

గురుదేవుడు :— సర్వసంగపరిత్యాగము చేసిన సన్న్యాసి 'కృష్ణా' 'రామా' 'గోవిందా' అనుకొనుచుండుట పరిపాటి. అది ఆయనకు సహజమే. నిర్వర్తించుకో వలసిన విధులు ఆయనకు వేఱు ఏవియును లేవు. ఆయన భగవద్ధ్యానము సలుపు నేని, అది ఎవరికిని వింత కాదు. అట్లు కాక, ఆయన పావన భగవన్నామసంకీర్తనను

గాని ధ్యానమును గాని చేయకుండునేని, అప్పుడు ప్రజలు ఆయనను గర్హింతురు.

గృహస్థుడు భగవన్నామజపమును చేయు నేని, అది అతనికి చాల గొప్పతనమే. జనకమహారాజును స్మరింపుడు. ఆహా! ఆయనకు ఎంత ధైర్యము! 'జ్ఞానము' 'కర్మము' అను రెండు ఖడ్గములను పూని ఆయన సాము చేసెను. ఆయనకు బ్రహ్మజ్ఞానపరిపూర్తియు నిత్యనైమిత్తిక వర్ణాశ్రమాచారశ్రద్ధయు రెండును ఉండినవి. పరపురుషాసక్తయైన కామిని లోకములో తాను నిర్వర్తింప వలసిన చిన్న చిన్న పనులందు గూడ శ్రద్ధ చూపుచునే యుండును గాని ఆమె మనసుమాత్రము సదా తన విటునందే కుదురుకొని యుండును.

సాధు సమాగమము సదా ఆవశ్యకము. భగవంతునితో మనకు పరిచయమును ప్రసాదించువాడు సాధుపుంగవులే.

భక్తులు ఇండ్లకు మరలుటకు సిద్ధముగ నుండిరి. ఒక్కొక్కరుగ వారు గురుదేవునకు ప్రణమిల్లిరి. భవనాథుడు తనయెదుటికి వచ్చినప్పుడు మాత్రము గురుదేవుడు "నేడు నీవు ఇటనుండిపోకుము. నీ దర్శనమాత్రముచే నా కుత్సాహము గలుగుచుండును" అనెను. భవనాథుడు ఇంకను సంసారములో పడలేదు, అతడు ఇరువదేండ్ల యువకుడు. మనోహరమైన మేని చాయయు సౌందర్యమును గలవాడు. భగవన్నామము చెవిం బడినచో, అతడు ఆనందబాష్పముల గురియును. గురుదేవు డతనిని నారాయణస్వరూపి యని తలంచెడివాడు.



## ఆఱవ ప్రకరణము

# భక్తగోష్ఠి

1883వ సంవత్సరము, ఏప్రిలు తే 8 ది భానువారము.

అది భానువారము ఉదయము. గురుదేవుడు, పసి బాలుని వలె కనబడుచు తన గదియందు కూర్చుండి యుండెను. ఆయన ప్రక్కన మఱి యొక పసి వా డుండెను. ఎవరో కాదు, శిష్యులలో ఆయనకు మిక్కిలి ప్రీతిపాత్రు డగు రాఖాలు. మహేంద్రుడు గది లోనికి వచ్చి గురుదేవునకు ప్రణమిల్లెను. రామలాలుగూడ గదిలో ఉండెను. కిశోరి, మణిలాల్ మల్లిక్, మొదలైన యితర భక్తులును పెక్కండ్రు ఒక్కొక్కరుగ చేరబాఱిరి.

మణిలాల్ మల్లిక్ ఒక వ్యాపారి. ఆయనకు, కాశిలో, ఒక బంగళా ఉన్నది. ఇటీవలనే, ఆయన, కాశికి వెళ్లి వచ్చి యుండెను.

గురుదేవుడు :— కాశికి పోయి వచ్చితి వన్న మాట. అక్కడ మహాత్ములను ఎవరి నైన దర్శించితివా ?

మణిలాల్ :— దర్శించితినండి. త్రైలింగస్వామి, భాస్కరానందులు — మున్నగు వారిని దర్శనము చేసికొంటిని. త్రైలింగస్వామి దృఢ మౌనవ్రతమును పాటించు వారు. భాస్కరానందులు అట్లు కాక, ఎల్లరతోను కలిసి మెలిసి ఉందురు.

గురుదేవుడు :— భాస్కరానందులతో ఏమైన మాటాడితివా?

మణిలాల్ :— అవును, మాటాడితిని. చాల సేపు మాటాడితిని. మేము చర్చించుకొన్న పెక్కు విషయములలో పుణ్యపాపముల సమస్య ఒకటి.

"పాపమార్గమును ద్రొక్కకుము. పాపచింతల విడువుము. మనము అట్లు నడచుకొనవలయు ననియే దేవుని ఇష్టము. అనవద్య కర్మములను మాత్రమే ఆచరింపుము" అని భాస్కరానందులు నాకు ఆదేశించిరి.

గురుదేవుడు :— అవును. అదియును ఒక మార్గమే. కాని, ఐహికపరులకు మాత్రము ఉద్దిష్టమైన మార్గము. మఱి ఎవరిలో ఆధ్యాత్మికమైన జాగరూకత గలదో, బ్రహ్మమొక్కటే సత్య మనియు తక్కిన దెల్ల మిథ్య యనియును ఎవరు సాక్షాత్కరించు కొన్నారో — అట్టి వారికి నచ్చిన ఆదర్శము వేఱు. దేవుడే కర్త అనియు, తక్కిన ఎల్లరును దేవునికి ఉపకరణప్రాయు లనియు వారు ఎఱుంగుదురు.

ప్రబుద్ధాత్మజ్ఞానులు ఎప్పుడును తప్పటడుగు పెట్టరు. పాపమును బహిష్కరింప వలె ననిన, అందుకై యుక్తివాదము చేయ వలసిన అక్కఱ వారికి లేదు. హెచ్చు భగవత్ప్రేమ గల వారు ఏ పనిని తలపెట్టినను అది ధర్మకార్యముగనే ఉండును. తమ పనులకు కర్తలము తాము కాము అనియు తాము భగవద్దాస మాత్రులము అనియు వారు చక్కగ ఎఱుగుదురు.

సమగ్ర ప్రబోధము ఒందిన వారు ధర్మమునకును అధర్మమున కును అతీతులు. అన్ని పనులను చేయుచుండువాడు దేవుడే అని వారు ప్రత్యక్షముగ కందురు.

ఒక చోట ఒక మఠము ఉండెను. అచటి సన్న్యాసులు భిక్షార్థము ప్రతిదినమును బయటిచోట్లకు పోయి వచ్చు చుండిరి. ఒకనాడు ఒక సన్న్యాసి ఒకసంపన్నుని యింటికి భిక్షకై పోయెను. పోవు నప్పటికి ఆసంపన్నుడు ఎవనినో ఒకనిని నిర్దాక్షిణ్యముగ చావ దన్నుచుండెను. కృపాళువైన సన్న్యాసి వారి మధ్య ప్రవేశించి ఆసంపన్నుని 'ఆగుము' అనెను. ఆసంపన్నునకు క్రోధము తలమును కలుగ ఉండెను. ఆక్రోధమును అతడు నిరపరాధియైన సన్న్యాసి

మీాదికి మరల్చి ఒడలు తెలియక నేలమీాద పడిపోవునంత వఱకు ఆయనను తన్నినా డట. ఎవరో ఈ సంగతిని మఠమునకు అందించిరి. సన్న్యాసులు పరుగున పోయి చూచు నప్పటికి తమ సోదర సన్న్యాసి అచ్చట నేలపై బడి యుండెను. నలుగు రైదుగురు కలిసి ఆయనను మోసికొని వచ్చి మఠమున శయ్యపై జేర్చిరి. అప్పటికిని ఆయనకు స్మృతి కలుగ లేదు. తక్కిన సన్న్యాసులు విషణ్ణులై అతనిని పరివేష్టించి కూర్చుండిరి. కొందఱు ఆయనకు విసన కఱ్ఱతో వీచుచుండిరి. కడపటికి ఆయనకు కొంచెము పాలు త్రాగించిన బా గుండు నని ఒకరు సలహా చెప్పిరి. పాలను నోట పోయగనే ఆయనకు స్పృహ వచ్చినది. ఆయన కన్నులు తెఱచి చుట్టును చూచెను. స్పృహ పూర్తిగ గలిగినదో లేదో, తమ్ము గుర్తింప గలడో లేడో — చూత మని చెప్పి, వారిలో ఒకడు ఆ సన్న్యాసి చెవిలో "పూజ్యమహాశయా, తమకు పాలు ఇచ్చు చున్నది ఎవరు?" అని బిగ్గఱగ అడిగెను. ఆ సన్న్యాసి హీనస్వరమున "సోదరా, నన్ను కొట్టినాతడే పా లిచ్చు చున్నాడు" అనెను.

భగవత్సాక్షాత్కారము పొందనిదే, అట్టి చిత్తవృత్తి ఎవరికిని అలవడదు.

మణిలాల్ :—స్వామీా, తా మిప్పుడు సెలవిచ్చినది, ఆధ్యాత్మికదశాపరాకాష్ఠ నందుకొన్న వారికి అన్వయించును. అట్టి విషయములగూర్చి సామాన్యముగ నేను భాస్కరానందులతో సంభాషించితిని.

ఆలయములలో పూజ ముగిసినది. నైవేద్యమునకు గంటలు మ్రోగినవి. అది వేసవి మధ్యాహ్నము కావున ఎండ చాల తీక్ష్ణముగ ఉండినది. గంగలో పొంగు ప్రారంభ మయ్యెను. మలయమారుతము వీవ దొడంగెను. భోజనము ఐన పిమ్మట శ్రీరామకృష్ణుడు తన గదిలో విశ్రమించి ఉండెను.

అప్పుడు బ్రాహ్మ సమాజ సభ్యులలో వయోవృద్ధులు కొందఱు

అరుదెంచిరి. గదిలో భక్తులు నిండిపోయిరి. శ్రీరామకృష్ణుడు ఉత్తరాభిముఖముగ తన పాన్పుపై కూర్చుండి యుండెను, సంతోషముగ నుండెను, చిఱునవ్వు నవ్వుచునే యుండెను, బ్రాహ్మభక్తులతో సంభాషించుచుండెను.

గురుదేవుడు :— ప్రేమనుగూర్చి మీరు హాస్యాస్పదముగ మాటాడుచుందురు. ప్రేమ అనునది అంత సామాన్యమైనదా? ప్రేమ అనగా ఉత్కటమైన భగవదనురాగము. దానికి రెండు లక్షణములు గలవు. ప్రేమగలవానికి ఆప్రేమ బాహ్యలోకవిస్మృతిని గలిగించు ననుట మొదటి లక్షణము. బయటి వస్తువులను మఱపించునంత గాఢమైన దతని భగవత్ప్రేమ యన్నమాట. దేహము అందఱకును చాల ప్రియము గదా. భగవత్ప్రేమగలవానికి దేహమునందు మమకారము ఉండదు. అది ప్రేమలక్షణములలో రెండవది. దేహమే ఆత్మ యనెడి భ్రాంతి ప్రేమగలవానికి లేశమైన నుండదు.

భగవత్ప్రాప్తికి గూడ కొన్ని గుర్తులు గలవు. భగవత్తృష్ణ గలవానికి భగవత్ప్రాప్తి దుస్సాధ్యము గాదు. అట్టి తృష్ణకు బాహ్య సూచనలు ఏవి? వివేకము, వైరాగ్యము, జీవకారుణ్యము, సాధుసేవ, సత్సాంగత్యాభిరతి, భగవన్నామజప - గుణసంకీర్తన - పరత్వము, సత్యనిష్ఠ - ఇవియు ఇట్టివియునే బాహ్యసూచనలు. ఏసాధకునందు ఈలక్షణములు కాననగునో అతనికి భగవత్సాక్షాత్కారము సుప్రాప్యమే అని చెప్పవచ్చును. అట్లు చెప్పుట తప్పు కాదు.

ప్రభువు బంటు నింటికి రా నిశ్చయించి యుండె నేని, ఆవిషయమును ఆ బంటు తనయింటి నుంచియుండు తీరునుబట్టియే, స్పష్టముగ మనము తెలిసికొ వచ్చును. ఆ బంటు మొదట తన యింటిలోని పెంటను, చుట్టు నున్న పొదల జీబును తీయించి పాఱవేసి శుభ్రపఱచును. తర్వాత గదులలోని పొగ మసిని మురికిని తొలగించును. పిమ్మట ముంగిటిని, నేలను, తక్కిన చోట్లను, శుభ్రముగ కడిగిం

చును. కడకు కంబళమును, పొగ త్రాగుటకు హుక్కాను ఇంక నట్టి వానిని ప్రభువే స్వయముగ ఆ యింటికి అంపును. అవి అచ్చటికి వచ్చి చేరుచుండుటను చూచినప్పుడు, ప్రభువు అచిరకాలముననే రానున్నాడు అని నిశ్చయించుకో వచ్చును.

ఒక భక్తుడు :—స్వామీ, ఆత్మనిగ్రహమును సాధించుకో గోరిన వానికి, సారాసారవివేచనమును అభ్యసించుట ఆవశ్యకమా ?

గురుదేవుడు :—మార్గములలో అదియును ఒక మార్గము. దానికి విచారమార్గ మని పేరు. కాని భక్తిమార్గమునగూడ అంతరింద్రియ*నిగ్రహము సాధ్య మగును. సాధ్యమగు ననుటయే కాదు ఆమార్గముననే అది సులభతరము. భగవత్ప్రేమ వర్ధిల్లుకొలదియు ఇంద్రియసుఖములందలి రుచి తగ్గును.

భక్తుడు :—భగవత్ప్రేమను పెంపొందించుకొనుట ఎట్లు ?

గురుదేవుడు :—భగవన్నామమును జపింపుము, పాపములు మాయ మగును. కామక్రోధములు, జీవితసౌఖ్యాభిరతి, మొదలయిన వానిని రూపుమాపుటకు నీకు అదే మార్గము.

భక్తుడు :—భగవన్నామమును ఆనందసాధనముగ చేసికొనుట ఎట్లు ?

గురుదేవుడు :—"దేవా, నీ నామజపముచే నాకు ఆనందము కలుగ వలెను" అని ఆత్రముతో దేవుని ప్రార్థింపుము. ఆయన నీ హృదయవాంఛను తప్పక నెఱవేర్చును.

మానవునిలో ప్రేమ ఎంత ఉన్న అంత లాభము కలుగును. ఒకప్పుడు ఇద్దఱు మిత్రులు ఒక వీధి వెంబడి పోవుచుండిరి, భాగవతమును చదివించి వినుచున్నట్టి కొందఱిని చూచిరి. వారిలో ఒకడు "మిత్రమా, రమ్ము, ఆపవిత్రగ్రంథము విందము" అనుచు సదస్సులో జొరబడి కూర్చుండెను. రెండవవాడు లోనికి తొంగిచూచి తన

* మనో బుద్ధి చి త్తాహంకారములు అంతరింద్రియములు.

దారిని పోయెను. పోయినది ఎక్కడికి? వేశ్యయింటికి. కాని, పోయిన వెంటనే, అతనికి ఆ చోటు విసుగెత్తించెను. "నా మిత్రుడు పవిత్ర హరికథ వినుచున్నాడు. నన్ను చూడుడు, ఎచట ఉన్నానో ఛీ!" అని అతడు తనలో అనుకొనెను. భాగవతము వినుచున్న మిత్రున కను విసుగు పుట్టెను. "ఎంత మూర్ఖుడను నేను. వీని వెఱ్ఱివాక్యా లను వినుచు కూర్చుంటిని. నా మిత్రుడు అక్కడ మహానందాను భవములో ఉన్నాడు" అని అనుకొనెను. కొంతకాలమునకు ఇరు వురును మరణించిరి. భాగవతమును విన్నవానికై యమదూత వచ్చి అతనిని నరకమునకు లాగుకొని పోయెను. ఆ వేశ్యాలంపటునికై దేవదూత వచ్చి అతనిని స్వర్గమునకు గొంపోయెను.

కాబట్టి నిజముగ మానవుడు ఉండు చోటును బట్టి కాని, అతడు చేయు పనులను బట్టి కాని, చూడక — అతని హృదయమును బట్టియే దేవుడు గుణదోషనిర్ణయము చేయును.

జ్ఞానమును ఎవరైనను పడయ వచ్చును. జీవాత్మ, పర మాత్మ అని రెండు తత్త్వములు ఉన్నవి. ప్రార్థన ద్వారా అన్ని జీవాత్మలును పరమాత్మయందు కలిసిపోగలవు. దీపములకు కావల సిన ఆవిరిని భద్రపఱచి ఉంచుకొని సరఫరాచేయు సంఘము ఉన్నది. ఇంటింటికిని దానిని అందించు గొట్టములు ఉన్నవి. నీకు ఆవిరి కావలయునను అనిన ఆసంస్థకు తెలుపుకొన్న చాలును. తెలిపిన వెంటనే, నీ యింటికి దీపములు వచ్చును.

కొందఱిలో ఆధ్యాత్మిక జ్ఞానము ఇంతకు మునుపే మేలుకొంచి ఉండును. వారికి కొన్ని ప్రత్యేక లక్షణములు గలవు. భగవద్విష యము తప్ప, వేఱు విషయముల శ్రవణము గాని చర్చ గాని వారికి ప్రీతి గొలుపదు. వారిది చాతక వృత్తి. నీరు వెల్లివిరియుచున్న గంగాయమునాది నదులేమి, సప్తసాగరములేమి, ఉన్నను, చాత కము మేఘవారిని తప్ప మఱి యొక దానిని కోరదు. గొంతుక మాడి పోవుచున్నను వేఱు నీటిని త్రాగదు.

బద్ధాత్ములు, సంసారులు, పట్టుపురుగులను బోలిన వారు. పట్టుపురుగు తన కాయనుండి వెలువడ గోరిన వెలువడు సామర్థ్యము దానికి ఉన్నది. కాని ఆ కాయమీద దానికి వ్యామోహము అతి మాత్ర మైనందున విడిచి రా లేదు. అందే మరణించును.

ముక్తాత్ములు కామినీకాంచనముల వశమున లేరు. ఎంతో జాగ్రత్తతో తాము నిర్మించుకొన్న కాయలనుండి ఛేదించుకొని వెలువడు కొన్ని పట్టుపురుగులం బోలిన వారు వారు. కాని అట్టివారి సంఖ్య అత్యల్పము.

మాయయే, మనకు భ్రమ గొలుపునది. మాయచే వంచితులు కాక ఆధ్యాత్మిక ప్రబోధము నొందిన వారు చాల కొలది మందియే. వారు కామినీకాంచనముల వశమున తగుల్కొనరు.

సిద్ధాత్ములలో రెండు వర్గముల వారు ఉన్నారు. ఆధ్యాత్మిక సాధనలచే సిద్ధిపొందినవారు ఒకవర్గము. నిర్హేతుక భగవత్కృపచే సిద్ధిపొందినవారు ఒకవర్గము. కొందఱు సేద్యగాండ్రు ఎంతో కష్టపడి తమపొలములకు నీరు పాఱించుకొందురు. పాఱిననే గాని, వారు పంట పండించుకో లేరు. కాని పొలమునకు నీటి కాలువలు త్రవ్వుకొను శ్రమ పడ నక్కఱ లేని రైతులు కొందఱు కలరు. వారి పొలములకు వాన నీరే సమృద్ధిగ నుండును. నీరు పాఱించుకొనుట వారికి అనావశ్యకము. మాయావాగురనుండి తప్పుకొన వలయుననిన కష్టపడి ఆధ్యాత్మికసాధనలు చేయ వలయును. భగవన్నిర్హేతుక కృపచే విముక్తి నొందు వారికి మాత్రము శ్రమపడ నక్కఱ లేదు. కాని అట్టివారి సంఖ్య చాల తక్కువ.

నిత్యసిద్ధు లైన వారి వర్గము ఒకటి ఉన్నది. ఎప్పుడు అవతరించినను వారు ప్రబుద్ధాత్మజ్ఞాను లయ్యే అవతరించుచుందురు. ఒక నీటిబుగ్గకు గల నిర్గమనద్వారము మూయబడియున్నది అనుకొనుడు. తోటలో పెక్కువిషయములను సరిచూచుకొను చున్న సీసపుపని వాడు ఉద్దేశపూర్వకముగా కాకయే ఆయడ్డును తొలగించును అను

కొనుడు. నీరు తటాలున వెలికి చిమ్మును. నిత్యసిద్ధుని భగవత్ప్రేమ తొలిసారి ఆవిష్కృత మైనప్పుడు చూచి లోకులు ఆశ్చర్యపడుదురు. "ఈ భక్తియు, ఈప్రేమయు ఈత్యాగమును ఎక్కడ ఉండినవో!" అని అనుకొందురు.

సంభాషణలో భక్తుల ఆధ్యాత్మిక తృష్ణను గూర్చిన ప్రస్తావము వచ్చినది. బృందావన గోపికల తృష్ణయే అందులకు లక్ష్యము. రామలాలు ఇట్లు పాడెను :

దేవ, నా దగు సర్వస్వ మీవె ; నాదు
జీవజీవంబ వగు దీవ దేవదేవ;
యంత రాంతరముల నున్న యాత్మ వీవ ;
నాకు 'నా' యం చనంగ నొ నరులు లేరు
ముజ్జగంబుల నిను దక్క మొదలి వేల్ప ;
నా మనశ్శాన్తి, మోదంబు, నాదు కోర్కి,
నాదు ప్రాపును, సిరియును, నాదు కీర్తి,
నా వివేకంబు. బలమును —— నరయ నీవె.
నీవె నా దగు విశ్రాన్తి నిలయ మాదు ;
నాదు గేహంబు, చుట్టంబు, నాదు చెలివి,
నాదు భావి కాలంబవు, నాదు వర్త
మాన కాలంబవును నీవె; మఱియు, నాదు
స్వర్గమవు నీవె; ముక్తియు, శాస్త్రతతియు,
నిగమములు నీవె ; గురుడవు నీవె సదయ.
నా నిరవధిక మయిన యానంద ఖనివి
నీవె; మాధవా, కేశవా, నీరజాక్ష.
ప్రాపకుండ వీవె, మఱియు ప్రాప్యంబ వీవె ;
అర్హుడవు నీవె స్తోత్రాల కన్నిటికిని.

నాదు తల్లివి నీవె గా మృదుల హృదయ,
శాస్త్ర మైనట్టి తండ్రియు సర్వలోక
స్రష్టవును రక్షకుఁడవును సరవి నీవె;
భవజలధి దాఁటఁగను నాదు పడవ గడపు
నాయకుండవు నీవె పో నళిననాభ.

గురుదేవుడు :— [భక్తులతో] ఆహా! ఎంత చక్కని పాట "దేవ, నా దగు సర్వస్వ మీవె".

రామలాలు మరల ఒకసారి పాడెను, రెండవసారి పాడినప్పుడు తమ ప్రాణకాంతు డైన శ్రీకృష్ణుని ఎడబాసి నప్పటి గోపికల వలవంతను వర్ణించెను. గురుదేవుడు గాఢసమాధిలో మునింగెను. ఆయన శరీరము నిశ్చలముగ నుండెను. తన ఛాయాచిత్రము [ఫోటో]లో ఉన్నట్లే ఆయన చేతులు జోడించుకొని కూర్చుండెను. ఆయన కనుగొలుకులనుండి ఆనందబాష్పములు కాఱినవి. చాల సే పైన పిమ్మట ఆయనకు మరల మామూలు స్పృహ గలిగినది. ఆయన, ఏమో గొణిగెను. అందులో అప్పు డప్పుడు ఒక్కొక్క మాట మాత్రమే గదియం దున్న భక్తులకు చెవిని బడినది.

గురుదేవుడు ఇంకను ఇట్లు అనెను: "కామాల[జాండిసు]వ్యాధి గల వానికి లోక మెట్లు అగపడునో, అట్లే ప్రతిపదార్థమును నాకు కనబడుచున్నది. ఓకృష్ణా, గోవిందా, నిత్యుడ వైన యాత్మ నాయకా, దీనబంధూ, నిన్నే నేను సర్వత్ర గనుచున్నాను".

"నిత్యుడ వైన యాత్మనాయకా గోవిందా" అనుచు గురుదేవుడు మరల సమాధిలో మునింగెను. అపరిచ్ఛిన్న మనోదశలు గలిగిన దివ్యపురుషుడు ఆయన. గదిలో నిశ్శబ్దత పరిపూర్ణమై యుండెను. తనివి తీఱక ఆత్రముతో భక్తులెల్ల తమ కన్నులను ఆయన యందే కేంద్రీకరించి యుండిరి.

పెక్కు మిత్రులను వెంట నిడుకొని అధార్ సేను వచ్చెను.

గురుదేవునియొద్దకు అతని యీ రాక రెండవ తూరిది. అతనితో గూడ అతని మిత్రుడు శారదాచరణుడు ఉండెను. ఆ శారదాచరణుడు దుఃఖార్ణవమున మునిగి యుండెను. కారణము అతని జ్యేష్ఠపుత్రుని మరణము. శారదాచరణుడు స్కూళ్లకు డెప్యూటి ఇన్స్పెక్టరుగ నుండి విరామము నొందిన వాడు. ఇప్పుడు ప్రార్థనలతోను ధ్యానములతోను దుఃఖవినోదము చేసికొనుచుండెను. దుఃఖ పరిమ్లానమైన యతని చిత్తమునకు ఒకింత యూరట కలిగింత మని అతనిని ఆధారసేను గురుదేవునొద్దకు పిలుచుకొని వచ్చెను.

సమాధినుండి బాహ్యలోకస్మృతికి మరలంగానే గురుదేవుడు భక్తులవైపు చూచెను. వారి చూపులు తనయందే కేంద్రీకృతములై యున్నవి. పరధ్యానదశలోనే ఇంకను ఉండి, ఆయన తనలో తానే ఏమో గొణుగుకొనెను. తర్వాత భక్తులతో ఇట్లనెను — "సంసారుల యాత్మజ్ఞానము అరుదుగ ప్రకటమగుచుండును. అది యొక దీపజ్వాలను బోలినది. కాదు కాదు, గోడలోని యొక రంధ్రముగుండ అవతలకు ప్రసరించు సూర్యుని యేకైక కిరణమును బోలిన దన్నచో ఇంకను సరిగా ఉండును. సంసారులు భగవన్నామమును పాడుచుందురు కాని ఆ పాటకు మఱుగున ఎట్టి తృష్ణయు ఉండదు. అత్తలు జగడములాడుకొన్నప్పుడు 'దేవుడు' అను పదమును విని నేర్చుకొని పిల్లలు ఆ దేవునిపై ఒట్టుపెట్టుకొనుచుందురు కదా. ఇదియును అట్లే. సంసారులకు తెగువయు ఉండదు. పూనుకొన్న పనులలో దేనిలోనైన వారు నెగ్గిరా, సరే. నెగ్గకున్నను వారికి చింత లేనే లేదు.

శ్రీరామకృష్ణునికి ఆధారునితో పరిచయము ఈ పాటికి హెచ్చెను. ఆధారుడు తన మిత్రుని దుఃఖకారణమును గురుదేవునకు తెలిపెను. ఆయన ఇట్లనెను — "నీవు ఏమి చేయ గలవు? మృత్యుదేవత నెదుర్కొన తయారుగ ఉండ వలసినదే. ఇంట మృత్యువు చొచ్చుకొని యైనది. పవిత్రమైన భగవన్నామ మనెడి యాయుధమును బూని నీవు మృత్యువుతో బోరాడ వలయును.

దేవుడే కర్త. "ఓ దేవా, నేను చేయు పను లెల్ల నా ద్వారా నీవు చేయునవే, నేను ఆడు మాట లెల్ల నా ద్వారా నీవు ఆడు మాటలే" అని నే ననుచుందును. నీ యధికారపట్టమును నీవు దేవున కిమ్ము. తన బాధ్యతల నొక మంచి వాని కప్పగించిన వానికి ఎట్టి దుఃఖమును గలుగదు. దేవుని సంకల్పము జరుగనీ.

ఇల్లు, ఇల్లాలు, బిడ్డలు — సకలమును అస్థిరమే, క్షణికమే. తాటి చెట్టు మాత్రమే నిజము, పండ్లు ఒకటి రెండు రాలి పోయినవి. దుఃఖంప నేల?

సృష్టి స్థితి సంహారము లనెడి ముప్విధము లయిన వ్యాపారములును దేవునకు గలవు. మరణము తప్పదు. ప్రళయకాల మప్పుడు సమస్తము నశించును. ఏదియు మిగులదు. అప్పుడు లోకమాత అనంతర సృష్టికి కావలసిన బీజములను సేకరించి పెట్టుకొనును. పునస్సృష్టి కాలమున ఆమె వానిని ఉపయోగించుకొనును.

1883 వ సంవత్సరము ఏప్రిల్ తే 22 ది భానువారము.

బ్రాహ్మసమాజమువారి యర్ధవార్షికోత్సవసందర్భమున శ్రీరామకృష్ణుడు కలకత్తాసమీపమున సింథిలో నున్న వేణీమాధవపాలుగారి గృహారామమునకు విచ్చేసెను. సమాజభక్త లనేకులు వచ్చి యుండిరి, గురుదేవుని పరివేష్టించి కూర్చుండిరి, వారిలో కొందఱు అప్పు డప్పుడు ప్రశ్న లడుగుచుండిరి.

ఒక బ్రాహ్మభక్తుడు :— స్వామీ, ఉపాయము ఏది?

గురుదేవుడు :— భగవంతునందు సంగము కలిగి యుండుట, అనగా ప్రేమ కలిగి యుండుట మొదటిది. ప్రార్థన రెండవది.

బ్రాహ్మభక్తుడు :— 'ప్రేమ' 'ప్రార్థన' అను రెంటిలో నే మార్గము శ్రేష్ఠము?

గురుదేవుడు :— ప్రేమ, అగ్ర గణ్యము. ప్రార్థన, అనంతర గణ్యము.

గురుదేవుడు ప్రసంగమును ఇంకను ఇట్లు సాగించెను. "భగవన్నామములను మహిమలను సదా కీర్తించుచు భగవంతుని ప్రార్థింప వలయును. ప్రాత తలపులను ప్రతిదినమును తోముచుండ వలయును. ఒక్కసారి శుభ్రపఱచిన చాలునా? అంతే కాక వివేకమును త్యాగమును అభ్యసింపవలయును. జగన్మిథ్యాత్వమును సదా జ్ఞప్తియం దుంచుకో వలయును.

భక్తుడు :— ప్రపంచమును త్యజించుటయే మేలగునా?

గురుదేవుడు :— అది అందఱకును మేలు కాదు. కర్మానుభవము తీఱని వారు లోకమును త్యజింప కూడదు.

భక్తుడు :— కర్మానుభవము తీఱుట యనగా నేమి?

గురుదేవుడు :— కర్మానుభవ మనగా కామినీకాంచనముల యనుభవము. పేరుప్రతిష్ఠలు, సిరిసంపదలు, జీవితసౌఖ్యములు మున్నగువాని ననుభవింపనిదే, వాని యసారత మనసునకు రానిదే, కొందఱకు భగవత్తృష్ణ పుట్టదు.

భక్తుడు :— స్త్రీపురుషులలో నిజముగ చెడ్డవా రెవరు?

గురుదేవుడు :— మహిళలలో ఆధ్యాత్మికజ్ఞానము కలవారున్నట్లే జ్ఞానవిహీనలును ఉన్నారు. జ్ఞానసంపన్న అయిన మహిళ మానవుని భగవంతునొద్దకు చేర్చును. మాయాస్వరూపిణి యయిన మహిళ మానవుని భగవంతుని విస్మరింపజేసి సంసారసాగరమున ముంచును.

సర్వేశ్వరుని మహామాయయే ఈ విశ్వమును సృష్టించినది. అందులో విద్యామాయయు ఉన్నది, అవిద్యామాయయు ఉన్నది. సత్సంగాభిరతి, జ్ఞానము, భక్తి, ప్రేమ, త్యాగము మున్నగు సుగుణముల నలవఱచునది విద్యామాయ. పంచేంద్రియములును శబ్ద స్పర్శ రూప రస గంధములును అవిద్యామాయలోనివి. ఇవి భగవంతుని మఱపించును.

భక్తుడు :— అవిద్య, అజ్ఞానకారక మగు నేని, దేవుడు దాని నేల సృష్టించెను?

గురుదేవుడు :— అది అతని లీల. చీకటి యనునది లేకున్న వెలుతురు విలువ మనకు తెలియదు. దుఃఖ మనునది లేకున్న సుఖపు విలువయు తెలియదు. ఏది కీడో తెలిసిననే ఏది మేలో దానినికూడ తెలిసికొన వీ లగును.

మామిడికాయ వర్ధిల్లుటకును పండుటకును, దానిని కప్పి యున్న తోలే కారణము. బాగుగ పండిన తర్వాత దానిని తినబోవునప్పుడు నీవు దానితోలును ఒలిచి పాఱ వేయుదువు. అట్లే మానవుని మాయ యనెడి తోలు క్రమ్ముకొని యున్నందుననే, బ్రహ్మజ్ఞానలబ్ధి అతనికి క్రమక్రమముగ సాధ్యమగును. విద్యామాయయు అవిద్యామాయయు రెండును మామిడికాయతోలును బోలినవే. రెండును ఆవశ్యకములే.

బ్రాహ్మభక్తుడు :— వైరాగ్యమును అలవఱచుకొనుట ఎట్లు? అది ఎందులకు అందఱకును గలుగదు?

గురుదేవుడు :— అనుభవించి అనుభవించి వెగటు పుట్టకున్న, వైరాగ్యము సాధ్యము కాదు. ఒకశిశువును నీవు కలకండనో ఆట వస్తువులనో ఇచ్చి సులభముగా మోసపుచ్చ వచ్చును. కాని కలకండను తిని, ఆటవస్తువులతో ఆడుకొని — ఐన తర్వాత "అమ్మ దగ్గఱకు పోవలె" నని బిడ్డ ఏడ్చును. అమ్మదగ్గఱకు తీసికొని పోకున్నచో, శిశువు గొంతు చినుగునట్లు ఏడ్చుచు బొమ్మలను దూరముగా పాఱ వేయును.

వైదిక హిందు మతమున గురుసమాశ్రయణాచారము ఉన్నది కదా, బ్రాహ్మసమాజసభ్యులు ఆ యాచారమునకు ప్రతికూలురు. కావున ఒక బ్రాహ్మభక్తుడు అందుంగూర్చి గురుదేవుని అడిగెను.

బ్రాహ్మభక్తుడు :— గురువు లేకున్న యెడల, ఆధ్యాత్మిక జ్ఞానము సాధ్యము కాదా?

గురుదేవుడు :— సచ్చిదానంద మొక్కడే గురువు. ఎవ డైన మానవుడు నీకు గురువై, నీలోని యాత్మజ్ఞానమును ప్రబోధించు నేని, నిజముగ పరబ్రహ్మమే నీకై ఆ మానవరూపమును దాల్చినా డని నీవు దృఢముగ నెఱుంగ వచ్చును. గురువు నిన్ను చేయూత నొసంగి పిలుచుకొనిపోవు సయాత్రికుని వంటి వాడు. బ్రహ్మసాక్షాత్కారము ఒనగూడినంతనే గురుశిష్యభేదము అంతరించును. శిష్యునకు బ్రహ్మ సాక్షాత్కారము గలుగు నందనుక, గురుశిష్యుల సంబంధము ఉండును.''

మునిమాపువేళ దాటిన పిమ్మట బ్రాహ్మసమాజ పూజారి వేదికను అధిరోహించి ఆరాధనమును నిర్వర్తించెను. ఆరాధనకు నడుమ అప్పు డప్పుడు బ్రాహ్మగేయముల గానము ఉపనిషన్మంత్ర ముల యనుసంధానము జరుగుచుండెను.

ఆరాధ నానంతరము గురుదేవునకును పూజారికిని ఇట్లు సంభాషణ జరిగెను—

గురుదేవుడు:—సాకారబ్రహ్మమును నిరాకారబ్రహ్మమును రెండును సత్యములే అని నాకు దోచుచున్నది. మీరు ఏమందురు ?

పూజారి:—విద్యుత్ప్రవాహము కంటికి అగపడక యున్నను, స్పర్శకు తెలియ నగుచునే యుండును కదా! నిరాకారబ్రహ్మమునకు అది ఉపమాన మగు నని నా తలంపు.

గురుదేవుడు:—ఔను. రెండును సత్యములే. సాకారబ్రహ్మ మును సత్యమే. నిరాకారబ్రహ్మమును సత్యమే. బ్రహ్మము నిరా కార మని మాత్రమే చెప్పుట ఎట్లుండు ననగా, ఏడు రంధ్రములు గల పిల్లనగ్రోవిలో ఒకడు ఒక్కస్వరమును మాత్రమే సదా పలికించు చుండుటం బోలి యుండును. ఆ పిల్లనగ్రోవితోనే వేఱొకడు వివిధ రాగములను ఆలపించును. అట్లే, సాకారబ్రహ్మమును నమ్మిన వారికి, ఆహా! భగవదనుభవములు ఎన్ని విధముల గలుగుచుండును ! వారు పెక్కు భావనలతో భగవంతుని అనుభవింతురు — శాంత

భావన యొకటి, దాస్యభావన యొకటి, సఖ్యభావన యొకటి, వాత్సల్య భావన యొకటి, మధురభావన యొకటి!

బ్రహ్మస్వరూపము అనిర్వాచ్యము. అది మనకు మౌనమునే అవలంబింప జేయును. అపరిచ్ఛిన్నమగు దానిని మాటలలో వివరింప గల వాడు ఎవరు? పక్షి ఎంత పైకైనను ఎగుర వచ్చును గాని, దానికి అందని పైస్థాయిలు ఉండనే ఉన్నవి.

బ్రహ్మసాక్షాత్కారము కలుగగనే మానవునకు ఆనందపర వశత గలుగును. మౌనము అవలంబించును. ఇక మాటాడున దెవరు? వివరించున దెవరు?

పూజారి:—ఔను, స్వామీ, వేదాంతములు అట్లే వర్ణించు చున్నవి.

గురుదేవుడు:—భగవన్మాయచే మానవుడు స్వస్వరూపమును విస్మరించును. తనతండ్రిగారి యనంత మహిమలకు వారసు తా ననెడి విషయమును మఱచిపోవును. ఈ దివ్య మాయ త్రిగుణాత్మకము. మూడుగుణములును, దోచుకొను స్వభావము కలవే. అవి మానవుని సంపదల నెల్ల దోచుకొని స్వస్వరూపమునే అతనిచే మఱపించును. సత్త్వము, రజస్సు, తమస్సు అనునవే ఆ మూడు గుణములు. వీనిలో సత్త్వ మొక్కటే భగవత్ప్రాప్తికి మార్గము చూపును. చూపునే గాని, భగవంతు నొద్దకు కొనిపోవు సామర్థ్యము దానికి లేదు.

ఒక కథను వినుడు:—ఒకప్పు డొక సంపన్నుడు ఒకానొక యడవిగుండ పోవుచుండెను. ముగ్గురు దోపిడిగాండ్రు అతనిని ముట్ట డించి అతనిసర్వస్వము దోచుకొనిరి. వారిలో నొకడు "ఇతనిని ప్రాణముతో విడిచిపెట్టినందువలన ఏమి లాభము కలుగును? వీనిని చంపుదము" అని అతనిని వ్రేయ ఖడ్గము నెత్తెను. కాని రెండవ వాడు వారించి "వీనిని చంపినందువలన లాభము లేదు. చేతులు కాళ్లు కట్టి ఇతని నిచ్చట పడవేసి పోవుదము. పోలీసులతో వీ డేమియు

చెప్ప లేదు.'' అని చెప్పెను. ఇట్లే వారు అతనిని ఒక త్రాటం గట్టి తమ దారిని పోయిరి.

కొంత సేపయిన పిమ్మట దోపిడిగాండ్రలో మూడవవాడు ఆ సంపన్నునొద్దకు తిరిగి వచ్చి ''అయ్యో! చాల హింస పడితివి గదా! నిన్ను నేను విడిపించెదను రమ్ము'' అని అతనిని విడిపించి అడవి వెలుపటివఱకు తెచ్చి విడిచెను. రాజమార్గమును సమీపింపగనే ఆచోరుడు మార్గమును చూపి ''ఇటు పోయితి వేని హాయిగ నీ యిల్లు చేరుకొందువు'' అనెను. ఆసంపన్నుడు ''నీవు కూడ నాతో రావలయును. నీవు నాకు ఇంత యుపకారము చేసితివి! నీవు మా యింటికి విచ్చేయుదు వేని మే మందఱమును సంతోషింతుము'' అని చోరునితో అనెను. చోరుడు ''నే నచటికి రాలేను. వచ్చినచో పోలీసులు నన్ను పట్టి బంధింతురు'' అని చెప్పుచు సంపన్నునకు దారిని మాత్రము చూపి పోయెను.

''ఇతనిని ప్రాణములతో విడిచిన ఏమి మేలు కలుగును? ఇతనిని చంపుదము'' అని చెప్పిన మొదటి చోరుడు తమస్సు. తమోగుణము నాశకారకము. రెండవ చోరుడు రజస్సు. రజోగుణము మానవుని లోకమున కట్టువఱచి వివిధ వ్యాపారములలో తగుల్కొలుపును, దేవుని విస్మరింప జేయును. భగవత్ప్రాప్తి మార్గమును చూపునది సత్త్వ మొక్కటియే. అనుకంప, ధర్మనిష్ఠ, భక్తి – మున్నగు సుగుణములను పుట్టించునది సత్త్వమే. అది ఒక నిచ్చెనలో అన్ని మెట్లకంటె పై నుండు మెట్టును బోలినది. దానిని దాటిన పిమ్మట ఇంటి పైయంతస్తే. పరబ్రహ్మము మానవునకు స్వస్థానము. మూడు గుణములను అతిక్రమింపకున్నచో బ్రహ్మజ్ఞానము సిద్ధింపదు.

పూజారి:—స్వామీ తమ యుపన్యాసము చాల బాగున్నది.

గురుదేవుడు:—(చిఱునవ్వుతో) మీరు సిద్ధాంతప్రచారకులు, ఎందఱకో బోధించుచుందురు. మీ రొక పొగయోడ యైన, నే నొక చిట్టిపడవను. (అందఱును నవ్వుదురు.)

1883 వ సంవత్సరము జూన్ తే 4 ది సోమవారము.

ఉదయము సుమారు తొమ్మిదిగంట లప్పుడు భక్తులు గుడి తోటయొద్దకు రాసాగిరి. గంగకు అభిముఖముగ నున్న వాకిలి వసారలో శ్రీరామకృష్ణుడు కూర్చుండియుండెను. క్రిందటి రాత్రిని గురుదేవునితోనే గడపినట్టి మహేంద్రుడు ఆయన పజ్జనే కూర్చుండి యుండెను. బలరా మాదిభక్తు లనేకు లుండిరి. రాఖాలు గురుదేవుని యొడిపై తల నిడికొని నేలపై పరుండి యుండెను. గురుదేవుడు బలరాముని మధ్యాహ్నభోజనమున కుండు మనెను. ఆయన తా ననుభవించిన దైవోన్మాద దశను భక్తులకు వర్ణించి చెప్పెను.

గురుదేవుడు:—ఆహా! ఎటువంటి మనఃపరిస్థితుల నెల్ల నేను అనుభవించితిని. ఆ యనుభవము నాకు మొదటిసారి కలిగినప్పుడు సూర్యోదయాస్తమయములు గాని, నిశాగ మాపగమములు గాని నేను గుర్తింప లేకుంటిని. ప్రజలు నన్ను వెఱ్ఱివాడు అనిరి. వారు వేఱు ఏమి చెప్పగలరు? పెద్దలు నాకు పెండ్లి చేసిరి. అప్పుడు నేను దైవోన్మాదదశలో ఉంటిని. నా భార్యను గుఱించి నేను మొదట కొంచెము ఖేదపడితిని. తర్వాత నా మార్గమును అనుసరించియే ఆమెయు జీవితమును గడపు ననుకొంటిని. నేను మా మామగారి యింటికి బోయితిని. అచ్చట వారు సంకీర్తన కేర్పాటు చేసిరి. అది చాల గొప్ప పండుగ. భగవన్నామసంకీర్తనము విశేషముగా సాగినది. అప్పు డప్పుడు నా భవిష్యత్తు ఎట్లుండునో అని అనుకొనెడివాడను. లోకజననితో "దేశమున నున్న భూస్వాము లందఱును నన్ను ఆదరింతు రేని నా యాధ్యాత్మికానుభవములు నిజములే అని నేను అప్పుడు సమ్మతింతును" అని అనుచుందును. భూస్వాములును తమంతట తామే వచ్చి నాతో మాటాడుచుండెడివారు.

ఆహా! అది యెంతటి యుద్రిక్తదశ! అత్యంత సూక్ష్మమైన సూచన కలిగినను జ్ఞానదశ ప్రబోధ మొందుచుండినది. ఒక పదునాలు గేండ్ల కన్యను లోకజననిస్వరూపిణిగా ఆరాధించితిని. ఆమెలో నాకు లోకజనని ప్రత్యక్షముగ కానిపించినది.

ఆదినములలో నేను కన్యల నాహ్వానించి ఆరాధించుచుంటిని. వారు ప్రత్యక్షలోకమాతృరూపములుగ నాకు అగపడెడివారు.

ఒకనాడు మంచిగాలికై నేను కలకత్తాలో ఒక మైదానము నకు పోయి యుంటిని. అచట నొక యాకాశయానము మింటి కెగురు చుండుటను ప్రజలు గుంపులుగ క్రిక్కిరిసి చూచుచుండిరి. తటాలున నా చూపు ఒకచెట్టున కానుకొని నిలిచి యున్న యొక యాంగ్ల బాల కునిపై నిబడెను. అతడు నిలుచుండిన తీరులో ఒడలియందు మూడు వంపులు అగపడినవి. తళుక్కు మని కృష్ణుడే నాకు దర్శన మిచ్చిన ట్లుండెను. నేను సమాధిలో మునిగితిని.

అప్పుడు నాకు బాహ్యలోకస్మృతి ఇంచుమించు లేనే లేదు. మథుర్‌బాబు నన్ను కొన్నాళ్లు తన జాన్‌బాజారు భవనములో ఉంచు కొనెను. అచ్చట నున్న దినములలో నేను నన్ను లోకజనని పరి చారిక నని భావించెడివాడను. ఆయింట నున్న మహిళలకు నన్ను చూచి నపుడు లజ్జ కలుగుట లేదు. పసిపిల్లవానియెదుటనో పసిపిల్ల యెదుటనో ఉన్నంత స్వేచ్ఛగా వా రుండెడి వారు.

ఇప్పటికి గూడ ఎంత చిన్న సంఘటన యైనను జ్ఞానదశను నాలో మేల్కొలుపుచుండును. భగవన్నామములను ఇంచుక బిగ్గరగ పాడుట రాఖాలునకు మామూలు. అట్టి సమయములలో నేను స్వాధీ నము తప్పుచుందును. ఆ గానము నా జ్ఞానదశను మేలుకొలిపి నన్ను ముంచివేయుచుండును.

మధ్యాహ్న భోజ నానంతరము గురుదేవుడు ఇంచుకసేపు విశ్రమించెను. బ్రాహ్మసమాజ వృద్ధ సభ్యుడైన మణిలాల్ మల్లిక్ గదిలో ప్రవేశించెను, అప్పటి కింకను పాన్పుపై శయనించియున్న గురుదేవునకు ప్రణమిల్లి కూర్చుండెను. మణిలాల్ అప్పు డప్పుడు ప్రశ్న లడుగుచుండెను. ఇంకను నిద్రను పూర్తిగ వీడని గురుదేవుడు ఒకటి రెండు మాటలలో జవాబు చెప్పుచుండెను. తరువాత శ్రీ రామకృష్ణుడు లేచి కూర్చుండి భక్తులకు ధైర్యముగొలుపుచు మా టాడుచుండెను.

గురుదేవుడు:— (మహేంద్రమునితో) "నేను బద్ధాత్ముడను, భక్తిజ్ఞానములు నాకెప్పుడును కలుగవు" అని కొందఱు తలంతురు. కాని ఆచార్యానుగ్రహము లభించినచో ఎవనికిని ఎట్టిభయమును లేదు. ఒకప్పుడొక యాడు పులి మేకలమందపై పడెను. ఒక మేకపై దుముకుచుండగనే, నిండు చూలుతో నున్న యా పులి, బిడ్డను గని, మరణించెను. ఆ పులిపిల్ల మేకలనడుమ పెరిగెను. అవి మేసిన గడ్డినే ఇదియు మేయుచుండెను. అవి మేకయఱుపుల నఱచినపుడు ఇదియును అట్లే అఱచెడిది. కొన్నాళ్లకది ఎదిగి పెద్దపులి యయ్యెను. ఒకనాడు మఱియొక పులి ఆ మేకల మంద మీదనే పడెను. ఆ మంద నడుమ గడ్డిని మేయుచున్న పులిని జూచి అడవిపులి ఆశ్చర్యపడెను. దానిని తఱుముకొని పోయి, ఎట్టకేలకు పట్టుకొనెను. అప్పుడు ఆ పులి మేకయఱుపున్న అఱవను ఆరంభించెను. అడవిపులి దానిని తటాకము నొద్దకు ఈడ్చుకొని వచ్చి "నీటిలో నీమొగమును జూచుకొనుము. నీమొగము పూర్తిగా నా మొగమువలెనే ఉన్నది. నా యొద్ద మాంసము కొంచెము ఉన్నది. దానిని తినుము" అని ఆ మాంసమును దాని నోట గ్రుక్కెను. గడ్డితినెడి యా పులి, మాంసమును మ్రింగ నిచ్చగింపక మరల మేకవలె కూతలిడ సాగెను. కాని క్రమముగ దానికి రక్తమాంసములందు రుచి గలిగెను. అప్పుడు అడవిపులి "నీకును నాకును ఎట్టిభేదమును లేదని ఇప్పుడు తెలిసికొంటివి. ఇక నా వెంట రమ్ము, అడవి కేగుదము" అనెను.

కాబట్టి ఆచార్యానుగ్రహము నీపైని గలుగునేని, నీ కెట్టి భయమును ఉండ నేఱదు. నీవు ఎవరవైనదియు, నీయథార్థస్వరూపము ఏమైనదియు ఆచార్యుడే నీకు ఎఱింగించును.

శిష్యుడు ఆధ్యాత్మికసాధనలను ఒకింత చేయవలెను అంతే. గురువు అతనికి అన్ని విషయములను వివరించును. అప్పుడు ఏది మిథ్యయో ఏది తథ్యమో శిష్యుడు స్వయముగ దెలిసికొనగలడు.

ఒక శిష్యుడు తన మనస్సులో "జగత్తు మిథ్యయేనా ? అగు

సేని అందు వసించు వారి కే మగును? వారు దానిని త్యజింప వలసిన దేనా'' అని అనుకొనెను. ప్రాణుల యంతర్గతమును తెలిసికొనగల శ్రీరామకృష్ణుడు మిక్కిలి దయతో మృదువుగ ఇట్లనెను — ''ఒక కార్యాలయము [ఆఫీసు] లోని గుమాస్తాకు కారాగారవాస శిక్ష విధింపబడినది అనుకొనుము. అతడు కారాగారమున ఖైదిగా ఉండును. కాని కారాగారమునుండి విడుదల యైన తర్వాత, అతడు వీధులలో గంతులిడుచుండునా? ఎంతమాత్రమును అట్లు ఉండడు. మరల ఒక గుమాస్తాగిరిని సంపాదించుకొనును, మునుపటి వలెనే పాటుపడును. గుర్వనుగ్రహముచే జ్ఞానము సిద్ధించిన తర్వాత గూడ మానవుడు జీవన్ముక్తుడుగ లోకమున చాల హాయిగ ఉండవచ్చును.'' —ఇట్లు శ్రీరామకృష్ణుడు గృహస్థులకు ధైర్యము గొలిపెను.

1883-వ సంవత్సరము జూను నెలలో ఆ దినము ఎండబెట్ట తీవ్రముగ ఉండెను. శ్రీరామకృష్ణుడు గుడితోటలో శివాలయపు మెట్లపై గూర్చుండి యుండెను. మహేంద్రుడు వచ్చి గురుదేవునకు మ్రొక్కి ఆమెట్లపైనే కూర్చుండెను. అతని చేతిలో, గురుదేవునకు అర్పించుటకై తెచ్చిన మంచుగడ్డ మున్నగు వస్తువులు ఉండినవి.

గురుదేవుడు:— [మహేంద్రునితో] మణిలాల్ మల్లిక్కుగారి మనుమరాలి భర్త ఇక్కడికి వచ్చి యుండినాడు. అతడు చదివిన యొక గ్రంథములో* ''దేవుడు సర్వజ్ఞుడని గాని అధికప్రజ్ఞాశాలి యని గాని చెప్ప లేము; ఆయన సర్వజ్ఞుడుగను ప్రజ్ఞాశాలిగను ఉండియే యున్నచో లోకమున ఇంతదుఃఖము ఏల ఉండ వలయును? ఇక చావును గురించి చెప్ప వలయు నన్న, మానవుని యాతనల పాలు చేసి మెట్టుమెట్టుగ జంపుటకంటె ఒక్క వ్రేటుతో తుదముట్టించుట మేలు'' అని వ్రాయబడి యున్న దట. తానే సృష్టికర్తగ ఉండినచో ఇంత కన్న మేలైన పరిస్థితి గల లోకమునే సృష్టించి యుందు నని ఆగ్రంథకర్త వ్రాసియున్నాడట.

* జాన్ స్టూవర్టుమిల్లుగారి స్వీయచరిత్రము.

మహేంద్రుడు ఈమాటలు విని అబ్బురపడెను గాని, ఏమియు పలుక లేదు.

గురుదేవుడు:—[మహేంద్రునితో] దేవుని దారులను మానవుడు ఎప్పుడైనను అర్థము చేసికొనగలడా? నాకు గూడ దేవుని గూర్చి ఒకొక్కప్పుడు సదభిప్రాయములును ఒకొక్కప్పుడు దురభిప్రాయములును గలుగుచుండును. తన మహామాయచే ఆయన మనల వంచించుచున్నాడు. ఆయన మనల నొకొక్కప్పుడు మేల్కొలుపుచుండును, ఒకొక్కప్పుడు మనకు మైకమును ఆపాదించుచుండును. అజ్ఞానము క్షణకాలము అంతరించును, మఱుక్షణముననే మన మనముల ఆవరించును. పాచి కప్పి యున్న యొక చెరువులో ఒక యిటిక తునుకను వేయుము. పాచి తొలగి, అడుగున ఉన్న నీరు కానగును. కాని కొన్ని నిమిషములలో పాచి నర్తించుచు వెనుదిరిగి మరల నీటిని కప్పి వేయును.

దేహమే ఆత్మ అన్న భ్రాంతి ఉన్నంతవఱకును ఖేదమోదములు చావుపుట్టుకలు తెగులువగలు అనుభవమునకు వచ్చుచునే ఉండును. ఇవి అన్నియును దేహమునకు సంబంధించినవే కాని ఆత్మకు సంబంధించినవి కావు. దేహము నశించిన పిదప దేవుడు దేహధారిని మంచి స్థలాంతరమునకు జేర్చు నేమో! అది ప్రసవవేదన కనంతరము బిడ్డపుట్టుటం బోలి యున్నది. ఆత్మజ్ఞానము ప్రాపించిన వానికి ఈఖేదమోదములు జననమరణములు అన్నియును కలలే. మన జ్ఞానము ఎంత యల్పము! ఒక్క సేరు కుండలో పది సేర్ల పాలు ఎట్లు పట్టును?

మునిమాపువేళ వివిధాలయములలో సాయంపూజ ప్రారంభమయ్యెను. గురుదేవుడు తన గదిలోని చిన్న మంచముపై కూర్చుండి జగజ్జననీధ్యాననిమగ్నుడై యుండెను. పెక్కండ్రు భక్తులు అచట ఉండిరి. మహేంద్రుడు ఆ రాత్రి గురుదేవునొద్దనే ఉండ నెంచెను.

కొంతసేపు ఐన తర్వాత శ్రీరామకృష్ణుడు తనగదికి ఉత్తర

ముగ ఉన్న వసారలో ఒకభక్తునితో సంభాషింప నారంభించెను. తొలి మలి సంజలు రెండును భగవద్ధ్యానమునకు మంచి కాలము లనెను. సాకారనిరాకారప్రకారముల రెంటను భగవద్ధ్యానమును భక్తునకు గఱపెను.

అంతకు గొంత పిమ్మట, ఆయన, తన గదికి పడమట అర్ధ వలయాకారమున నున్న వసారలో గూర్చుండెను. అప్పటికి తొమ్మిది గంట లై యుండును.

గురుదేవుడు:—ఇక్కడికి వచ్చు వారికి నిజముగా అన్ని సందే హములును తీఱిపోవును. ఏమందువు?

మహేంద్రుడు:—తప్పక తీఱును.

ఒడ్డునకు చాల దవ్వున గంగలో ఒక పడవ కదలుచుండెను. పడవవాడు పాట పాడ నారంభించెను. అతని కంఠస్వరము ఏటి మీదుగ దేలుచు వచ్చి గురుదేవుని వీనులం బడెను. ఆయనకు భావావేశము గలిగినది, గగుర్పాటు గలిగినది, ఆయన మహేంద్రు నితో "నా దేహమును దాకి చూడు" మనెను. మహేంద్రుడు మిక్కిలి ఆశ్చర్యపడెను.

కొంత సేపు ఐన తర్వాత శ్రీరామకృష్ణుడు మరల సంభాషింప దొడంగెను.

గురుదేవుడు:—ఇచ్చటికి వచ్చు వారు మంచి పూర్వవాసన లతో జన్మించియుండవలెను. అది నిజమే కదా?

మహేంద్రుడు:—నిజమే నండి.

గురుదేవుడు:— దంభరహితునకు భగవత్సాక్షాత్కారము సులభము. రెండు మార్గములు ఉన్నవి. ఒకటి సన్మార్గము. రెండవది దుర్మార్గము. సన్మార్గమే ఎల్లరకును అనుసార్యము.

1883-వ సంవత్సరము జూలై తే 21 ది శనివారము.

అప్పుడు సాయంకాలము సుమారు నాలుగు గంటలు. రామలాలుతోను ఒక రిద్దఱు భక్తులతోను గూడి బండి యెక్కి శ్రీరామకృష్ణుడు దక్షిణేశ్వరమునుండి కలకత్తాకు బయలుదేఱెను. బండి కాళీగుడిద్వారమును దాటు నప్పటికి మహేంద్రుడు చేత మామిడిపండ్లనుంచుకొని ఎదు రయ్యెను. బండి ఆగెను. మహేంద్రుడు గురుదేవునకు ప్రణమిల్లెను.

గురుదేవుడు [చిఱునవ్వునవ్వుచు మహేంద్రునితో] :— మాతో రమ్ము. మేము ఆధారు నింటికి పోవుచున్నాము.

మహేంద్రుడు సంతోషముతో బండి నెక్కెను. ఆంగ్లవిద్యనభ్యసించినవాడు అగుటచే అతనికి వాసనలు పూర్వజన్మల నుండి అనువర్తించుచుండు నను నమ్మకము లేకుండెను. కాని ఆధారునందు గురుదేవుని పట్ల అంత గొప్ప భక్తి కన నగుచుండుటకు అతని పూర్వజన్మవాసనలే కారణము లని మహేంద్రుడు కొన్నాళ్ల క్రితమే అంగీకరించెను. తర్వాత ఆలోచించిన కొలదియు ఆవాసనలం గూర్చిన తన నమ్మకము ఇంకను దృఢపడ లే దని అతనికే అనిపించినది. ఆ విషయమును శ్రీరామకృష్ణునితో చర్చింత మనియే నాడు అతడు దక్షిణేశ్వరమునకు వచ్చెను.

గురుదేవుడు:—సరి, ఆధారునిగూర్చి నీ యభిప్రాయ మేమి?

మహేంద్రుడు:—అతనికి భగవత్తృష్ణ మిక్కుటము.

గురుదేవుడు :— నిన్నుగూర్చి ఆధారుడుకూడ మిక్కిలి ప్రశంసించుచునే మాటాడుచుండును.

మహేంద్రుడు కొంచెముసేపు ఊరకుండి, తర్వాత పూర్వవాసనలం గూర్చి మాటాడ నారంభించెను.

మహేంద్రుడు:— పునర్జన్మలందు గాని పూర్వవాసనలందు గాని నాకు ఎక్కువ నమ్మకము లేదు. వానియందలి యవిశ్వాసముచే, నా యీశ్వరభక్తికి ఏవిధముగ నైన చెడుగు కలుగునా?

గురుదేవుడు:—దైవసృష్టిలో సర్వమును సుసాధ్యమే అను నమ్మక మున్న చాలును. నీవు అనుకొనునవే సత్యములు, ఇతరులు అనుకొనునవి అసత్యములు అనెడు భావమునకు ఎప్పుడును చోటు ఒసంగకుము. అప్పుడు దేవుడే సర్వమును విశద మొనర్చును.

దైవచేష్టితములం గూర్చి మానవుడు ఏమి యర్థముచేసికొన గలడు? ఈశ్వరసృష్టి అనంతముఖము. దైవచేష్టితములను అర్థము చేసికొనుటకు నేను ప్రయత్నము చేయనే చేయను. దైవసృష్టిలో సర్వమును సుసాధ్యమే అని మాత్రము వినియున్నాను. దానిని నేను సదా జ్ఞప్తిలో నిలుపుకొనియున్నాను. కాబట్టి నేను దేవుని ధ్యానించు చుందునే గాని, లోకమునుగూర్చి యోచింపను.

దేవుని వ్యాపారమును ఒకడు ఆకళించుకోగలడా? ఇంతకును దేవుడు మనకు చాల సన్నిహితుడై ఉన్నాడు. ఉన్నప్పటికిని దేవుని నెఱుంగుట సాధ్యము కాకున్నది.

మహేంద్రుడు:—అది నిజమే.

గురుదేవుడు:—దేవుడు సమస్తమును తన మాయచే కప్పి యున్నాడు. ఆయన మనలను దేనినిగాని తెలిసికోనీయడు. మాయ యనగా 'కామిని'యు 'కాంచనము'నే. దేవునిజూచుటకై ఎవడు మాయను తొలగించుకొనునో, అతడు దేవుని జూడ గలడు. ఒకప్పుడు నేను ఎవనికో ఒకనికి దైవచేష్టితములను వివరించి చెప్పు చుంటిని. అప్పుడు దేవుడే తటాలున నాకు కామార్పుకురులో ఉన్న చెరువును జూపెను. అట నొక మనుజుడు పచ్చని పాచిని తొలగ ద్రోచి నీరు ద్రాగుచుండగా నేను జూచితిని. నీరు పటికమువలె తేటగ నుండెను. సచ్చిదానందమును మాయ యనెడి పాచి కమ్ముకొని యుండు నని దేవుడు నాకు ప్రత్యక్షముగ జూపినాడు. పాచిని తొలగబెట్టినవానికి నీరు పానార్హ మగును.

భగవంతుని చైతన్యముచేతనే విశ్వమునకు చైతన్యము గలుగు

చున్నది. ఒక్కొక్కప్పుడు ఈ చైతన్యము చిన్నచిన్న చేపలందు సైతము కదలుచున్నట్లు నేను జూచుచుందును.

బండి కలకత్తాలో శోభాబాజారునొద్ద వీధులుకలియుచోటికి చేరుకొనెను. ఇంకను గురుదేవుడు "వర్షాకాలమున భూమి వాన నీట నానునట్లు విశ్వము భగవచ్చైతన్యమున నానుచున్నట్లు నేను ఒక్కొక్కపరి గనుచుందును.

"సరి, నేను దివ్యదృశ్యములను ఎన్నింటినో చూచుచుందును. కాని వానివలన, నా కెట్టి యహంకారమును గల్గుట లేదు." అని చెప్పుచుండెను.

మహేంద్రుడు :—[చిఱునవ్వుతో] మీరు అహంకారమును పేర్కొనుటయా!

గురుదేవుడు :—ఒట్టు పెట్టి చెప్పుచున్నానుగా. నాకు అహంకారము ఇంచుకేని లేదు.

మహేంద్రుడు:—గ్రీసుదేశములో ఒకప్పుడు సాక్రటీసు అనువాడొకడు ఉండెను. మానవులలో కెల్ల అతడే జ్ఞాని అని ఆకాశవాణి పలికినది. ఆప్రకటనను విని సాక్రటీసు ఆశ్చర్యపడెను. ఏకాంతమున అందుంగూర్చి ధ్యానించి ధ్యానించి, సాక్రటీసు దానిలోని వ్యంగ్యమును గ్రహించెను. గ్రహించి మిత్రులతో ఇట్లనెను: "నా కేమియు తెలియ దని యెఱిగిన వాడను మానవులలో కెల్ల నేనే. ప్రతియొక్కడు తాను తెలిసినవాడ ననుకొనుచుండును. నిక్కమునకు అందఱును తెలియనివారే."

గురుదేవుడు :—"ఇందఱు మనుష్యులు నాయొద్దకు వచ్చుటకు నాకు ఏమి తెలియును నని?" అని నాలో నేను అప్పుడప్పుడనుకొనుచుందును. వైష్ణవచరణుడు గొప్ప పండితుడు, నాతో ఆయన "మీరు చెప్పు విషయము లన్నియు నాకు శాస్త్రగ్రంథములలో కానవచ్చుచున్నవి. మఱి మీ యొద్దకు నే నేల వచ్చుచుందునో మీకు తెలియునా? ఆ సంగతులను మీవాక్కునుండి విందమని" అని చెప్పుచుండెడివాడు.

మహేంద్రుడు:—అవును స్వామీ, తమ సూక్తులు శాస్త్ర వాక్యములతో సంవదించుచుండును.

గురుదేవుడు :—నన్ను బోలిన మఱి యొకనిని — పండితుని గాని సన్న్యాసిని గాని — నీవు చూచి యున్నావా ?

మహేంద్రుడు:—భగవంతుడు మిమ్ములను స్వహస్తములతో సృజించినాడు. తక్కినవారిని యంత్రముచేత నిర్మించినాడు; ఇతరుల నందఱను చట్టముప్రకారము సృష్టించినాడు.

గురుదేవుడు:— (రామలాలుతోను తక్కిన భక్తులతోను నవ్వుచు) ఆయన చెప్పిన మాట మీరు విన్నారా?

శ్రీరామకృష్ణుడు కొంత సేపు నవ్వి కడపట "నాకు గర్వము లేదు, లేనే లేదు, ఇంచుకేని లేదు, నిజము, ముమ్మాటికిని నిజము" అని చెప్పెను.

మహేంద్రుడు:—ఒక్క విధములో నైనను జ్ఞానము మనకు మేలు చేయుచున్నది — మన కేమియు తెలియ దనియు మన మెందులోను లెక్క లే మనియు అనుకొనునట్లు చేయును.

గురుదేవుడు:—చక్కగా చెప్పితివి. నేను ఏమియును కాను, ఎవరను కాను. నీకు ఆంగ్లజ్యోతిషమందు విశ్వాస మున్నదా ?

మహేంద్రుడు:—పాశ్చాత్య జ్యోతిష సూత్రములను అన్వయించితి మేని క్రొంగ్రొత్త విషయములను కనుగొన వీ లగును. *యూరేనస్ అనెడి గ్రహముయొక్క వక్రగతిని గుర్తించి జ్యోతిషకులు దూరదర్శనీయంత్రములగుండ చూచినప్పుడు ఆకాశమున ప్రకాశించుచున్న *నెప్ట్యూన్ అను గ్రహమును కనుగొనగల్గిరి. వారు సూర్యచంద్రగ్రహణములనుకూడ ముందుగ చెప్పగలరు.

గురుదేవుడు:—అవును, చెప్పగలరు.

---

* ఇవి పాశ్చాత్యులు కనుగొన్న గ్రహములు. వీనికి సమాంతరములు ప్రాచ్య జ్యోతిషమున లేనందున, దేశీయనామములు లేవు.

శకటము ముందునకు సాగెను. వారు అధారుని గృహమును సమీపించిరి. శ్రీరామకృష్ణుడు మహేంద్రునితో "సత్యమున స్థిరముగ నిలువుము. నీకు ఈశ్వరసాక్షాత్కారము తప్పక కలుగును" అనెను.

శ్రీరామకృష్ణుడు అధారునిగృహమునకు చేరుకొని కూటమున కూర్చుండెను. రామలాలు, అధారుడు, మహేంద్రుడు ఇంకను తక్కిన భక్తులును ఆయన సమీపమున కూర్చుండిరి. రాఖాలు కలకత్తాలో తండ్రియొద్ద నుండెను.

గురుదేవుడు:—(అధారునితో) నే నిచ్చటికి వత్తు నని ఏవ్వు చెప్ప లేదా?

అధారుడు:—చెప్ప కేమి? చెప్పిపంపితిని.

గురుదేవుడు రాఖాలునకై ఉవ్విళ్లూరుచుండుట గుర్తించి అధారుడు రాఖాలును తక్షణమే పిలుచుకొనివచ్చుటకు బండినంపెను. అధారుడు ఆ దినము గురుదేవుని దర్శింప వలె నని ఉబలాటపడు చుండెను గాని ఆయన వచ్చు నని అతనికి గట్టిగ తెలియదు.

అధారుడు:—చాల కాలమువఱకు తాము రాకైతిరి. తాము రావలె నని నేను ఈ దినము దేవుని ప్రార్థించితిని, కన్నీరు సైతము కార్చితిని.

గురుదేవుడు ప్రీతుడై చిఱునవ్వు నవ్వుచు "అవునా? అలాగా?" అనెను.

మునిమాపువేళ ఐనది, దీపములు వెలిగింపబడినవి. శ్రీరామకృష్ణుడు ముకుళితకరకమలుడై లోకమాతకు మ్రొక్కి ధ్యాననిమగ్నుడై నిశ్చలుడై కూర్చుండి యుండెను. తరువాత మధురకంఠముతో ఆయన "గోవిందా గోవిందా సచ్చిదానందా హరి, హరి" అని భగవన్నామముల కీర్తింపదొడంగెను. ఆయన నోట వెలువడిన ప్రతిమాటయును శ్రోతల వీనులందు అమృతమును వర్షించినది.

అధారుడు శ్రీరామకృష్ణునకు మధురభక్ష్యములను ఫలములను సమర్పించెను.

1883-వ సంవత్సరము జూలై తే 22 ది భానువారము.

ఆనాఁడు అన్ని కార్యాలయములకును విరామదినము. కావున గృహస్థభక్తు లనేకులు దక్షిణేశ్వర దేవాలయారామమునకు వచ్చి శ్రీరామకృష్ణుని ఆయనగదిలో దర్శించిరి. అధారుడును, రాఖాలును, మహేంద్రుఁడును ఒక బాడిగబండి నెక్కి కలకత్తానుండి వచ్చిరి.

మధ్యాహ్నభోజనానంతరము శ్రీరామకృష్ణుఁడు కొంచెము సేపు విశ్రమించెను. గది ఆవరణ మంతయు పరిశుద్ధముగను పవిత్రముగను నుండెను. దేవతలయు, దేవేరులయు పటములు కుడ్యముల నలంకరించియుండినవి. వానిలో మునిగిపోవుచున్న పీటరును క్రీస్తు కాపాడుచున్న పట మొకటికూడ నుండెను. గదికి వెలుపల సురభి కుసుమభరితములైన లత లుండినవి. దక్షిణముగ పారుచుండిన గంగ కానవచ్చుచుండెను. గురుదేవుఁడు ఉత్తరాభిముఖుఁడై చిన్న మంచముపై కూర్చుండియుండెను. భక్తులు నేలపై పఱచిన చాపలపైని తివాసులపైని కూర్చుండిరి. ఎల్లర చూపులును గురుదేవుని వైపే మఱలి యుండినవి.

ఒకభక్తుఁడు:—స్వామీ తాము పండిత విద్యాసాగరుని కలిసి కొంటిరి గదా ఆయనను గుఱించి తమ యభిప్రాయ మేమి?

గురుదేవుఁడు:—విద్యాసాగరునకు వైదుష్యమును ఉన్నది., అనుకంపయు నున్నది. కాని లోచూపు లేదు. భగవంతుఁ డతనిలో దాఁగియున్నాఁడు. ఆ విషయము నతఁడు కనుగొని యుండినచో ఆయన కార్యకలాపములు తగ్గి తుదకు పూర్తిగా అంతరించి యుండును. తన హృదయమున దేవుఁ డున్నాఁ డన్న సంగతి ఆయన యెఱిగి యుండెనేని ఆయన తన మనస్సును భగవచ్చింతనకును ధ్యానమునకును ఉన్ముఖముగ జేసియుండును. కొందఱకు వైరాగ్యము అలవడవలె నన్నను, మనసును ఆధ్యాత్మిక లక్ష్యమునకు ఉన్ముఖముగ చేయవలె నన్నను, దానికి ముందుగ చిరకాలము నిస్స్వార్థ కర్మానుష్ఠానము ఆవశ్యకము. కడపట వారు దేవునిలో లీన మవుదురు.

విద్యాసాగరుడు చేయుచున్న పనులు మంచివే. అనుకంప అనునది గొప్ప గుణమే. కాని దయకును మాయకును గల తారతమ్యా మతిమాత్ర మైనది. దయ మంచిదే కాని మాయ మంచిది గాదు. భార్య, బిడ్డ, తోబుట్టువు, తోబుట్టువుల పిల్లలు నాయన మొదలైన సొంత బంధువుల పట్ల మన కున్న ప్రేమ మాయ. ఆ ప్రేమనే సమస్త ప్రాణికోటియందును వహింతు మేని అదే దయ యనబడును.

మహేంద్రుడు:—దయ కూడ ఒక బంధమేనా?

గురుదేవుడు:—అవును అదియు ఒక బంధమే. కాని ఆ విషయము సామాన్యజనుల బుద్ధికి అందదు. సత్త్వమునుండియే దయ కలుగును. రజస్సు సృష్టికారకము. సత్త్వము స్థితికారకము. తమస్సు లయకారకము. మఱి బ్రహ్మము ఈ త్రిగుణములకును అతీతము, ప్రకృతికిని అతీతము. బ్రహ్మ మిట్టి దని వర్ణింప సాధ్యము కాదు. బ్రహ్మజ్ఞాని సైతము బ్రహ్మమును వర్ణింపలేడు.

ఒకప్పుడు నలువురు మిత్రులు వాహ్యాళి కేగిరి. ప్రాకార పరివేష్టిత మైన చోటొకటి వారి కగపడెను. ఆ ప్రహరీగోడ చాల ఎత్తుగ నుండెను. గోడ కావల ఏ మున్నదో చూడ వలె నను నుబలాటము నలుగురకును గలిగినది. అం దొకడు ఆ గోడపై కెక్కెను. లోనికి చూడగనే ఏమి అగపడినదో! ఆశ్చర్యముచేత అతని నోరు పడిపోయినది. ఆహా, ఓహో యనుచు అతడు లోనికి దుమికెను. తాను చూచిన దానిని గుఱించి ఇతరుల కతడు ఏమియు తెలుపలేక పోయెను. తక్కిన వారును అట్లే గోడ నెక్కి ఆహా, ఓహో యనుచు లోనికి దుమికిరి. ఇకను లోపల నున్న దానిని గుఱించి చెప్పుట కెవ రున్నారు?

భక్తుడు:—బ్రహ్మజ్ఞానప్రాప్తి కలిగిన పిమ్మట కూడ ఏ దైన సంస్థను కొనసాగించుట సాధ్య మగునా?

గురుదేవుడు:— ఒకనాడు నేను బ్రహ్మజ్ఞానమును గూర్చి కేశవసేనుతో ప్రసంగించితిని. దాని నింకను స్పష్టముగ వివరింపు మని

ఆయన నన్నడిగినాడు. "ఇంకను దానిని స్పష్టపఱచితి నేని, ఇక నీవు నీ సంస్థను కొనసాగింప లేవు, అనుచరులను నిలుపుకొన లేవు" అని నే నంటిని. "ఐనచో ఇంతటితోనే ఆపివేయుడు" అన్నాడు కేశవుడు. [అందఱును నవ్వుదురు]. ఐనను నేను కేశవునితో "అహంకార మమకారములే అజ్ఞానమునకు సూచనలు. అజ్ఞానము లేనిదే, "కర్తను నేను, ఈమె నా భార్య, వీరు నా బిడ్డలు, ఇది నా సొత్తు" అను తలంపు ఎవరికిని గలుగదు." అని అంటిని. అందులకు కేశవుడు, "అయ్యా 'నేను' అను తలంపును విడిచిపెట్టిన యెడల తర్వాత ఏమియు మిగులదే" అని అన్నాడు. "నేను" అనుతలంపును పూర్తిగ విడువు మని నేను కోరుట లేదు. అపక్వాహంకారమును మాత్రమే నీవు తప్పక విడువ వలయును. నేను కర్తను, ఈమె నా భార్య, వీరు నా పిల్లలు, అని తలంపించునది అపక్వాహంకారము. ఈ యపక్వాహంకారమును విసర్జించి పక్వాహంకారమును నిలుపుకొనుము. నేను భగవద్దాసుడను, భగవద్భక్తుడను, కర్త భగవంతుడే. నేను సాధనమాత్రుడను అని తలంపించునది పక్వాహంకారము.

నేను కేశవుని విడువు మన్నది అపక్వాహంకారమును. నేను భగవద్దాసుడను, భగవద్భక్తుడను అనుకొనెడి యహంకారము ఎవరికిని చెఱుపు చేయదు. "నీవు సదా నీ సంస్థను గుఱించియు అనుచరులనుగుఱించియు మాటాడుచుందువు గాని ప్రజలు నీ సంస్థను సైతము విడనాడిపోవుచుందురే" అని నేను కేశవు నడిగితిని. "ఔ నౌను. నా సంస్థలో సభ్యులుగ పెక్కు సంవత్సరములు ఉండి, తర్వాత దీనిని విడిచి వే ఱొక సంస్థలో చేరువారు ఉన్నారు. అంతకంటె అన్యాయ్యముగ గూడ వారు నడచుకొందురు. ఎట్లనగా, నన్ను వీడి పోయిన మఱుక్షణమునుండి నన్నే తెగదిట్టుచుందురు" అన్నాడు కేశవుడు. "వారి ప్రకృతిని నీవు ఎందులకు పరీక్షింపవు? వచ్చినవారి నెల్ల పరీక్షింపక చేర్చుకొన్న ఏ మైన లాభ మున్నదా?" అని నేనంటిని.

మూడు గుణములను అతిక్రమించుట చాల కష్టము. భగవత్సాక్షాత్కారము పొందని వానికి ఆదశ కలుగదు. మానవుడు

ఉండునది మాయ యేలుబడిలో. మాయ అతనిని దేవుని దర్శింప నీయదు, అతనిని అజ్ఞానమునకు గుఱి చేసి వైచినది.

ఒకనాడు హృదయుడు ఒక క్రొందెదూడను తెచ్చినాడు. అతడు దానిని ఒక పలుపుతో తోటలో కట్టివేసినాడు. అది అచట మేయనీ అని అతని తలంపు. నేను జూచితిని. "ఓయీ హృదయా, ప్రతి దినమును నీవు దూడ నిచ్చట ఏల కట్టి యుంతువు" అని అడిగితిని. అతడు "మామా, ఈ దూడను నేను మా పల్లెకు పంప నున్నాను. ఇది బాగుగ ఎదిగి పుష్టివంత మైన యెడల, దీనిని నాగలికి పూం తును." అని అన్నాడు. ఆ మాటలు వినంగానే నేను ఆశ్చర్య స్తబ్ధ డనై "దివ్యమాయ లీల, ఆహా! ఎంత దుర్ జ్ఞేయము! కామార్పు కురును సిహోరు*ను కలకత్తానుండి ఎంత దూరమున నున్నవి! పాపము ఈ దూడ అంత దూరము పోవలెను! తరువాత ఇది పెరిగి పెద్ద దగును, నాగలికి పూన్పబడును. నిజముగ లోకము అనగా ఇదే! మాయ అనగా ఇదే!" అని మనసులో అనుకొని స్మృతి తప్పి నేల పైకి ఒరిగితిని. మరల నాకు స్మృతిగలుగుటకు చాల సేపు పట్టినది.

1883-వ సంవత్సరము సెప్టెంబరు తే 26 ది, బుధవారము.

మహేంద్రుడు మధ్యాహ్నము దాటిన తర్వాత వచ్చెను, వచ్చి చూడగా గురుదేవుడు చిన్నమంచముపై గూర్చుండియుండెను.

గురుదేవుడు:— [మహేంద్రునితో] ఈ దినము నీవు ఇచ్చటికి ఎట్లు రాగల్గితివి? నీకు బడి (స్కూలు) లేదా?

మహేంద్రుడు:—మాబడిని ఈదినము ఒకటిన్నరగంటలప్ప టికే మూసివేసినారు.

గురుదేవుడు:—అంత పెందలకడనే ఏల మూసినారు?

మహేంద్రుడు:— విద్యాసాగరుడు పాఠశాలకు వచ్చినాడు. దానికి ఆయన సొంతదారు కావున ఆయన వచ్చినప్పు డెల్ల పిల్లలకు సగము దినము సెలవు లభించుచుండును.

---

* హృదయుని స్వగ్రామము.

గురుదేవుడు:—విద్యాసాగరుడు తన మాటను నిలబెట్టుకొనడే, ఎందుచేత? ఇక్కడికి వత్తు ననియు నన్ను చూతు ననియు అనాడు చెప్పినాడు. కాని తన మాటను నిలుపుకొన డాయె.

వట్టి పండితునకును సాధువునకును చాల భేదము కలదు. వట్టి పండితుని మనస్సు కామినియందును కాంచనమందును లగ్నమై యుండును. సాధువు మనస్సు హరిచరణారవిందములందు సక్తమై యుండును. పండితుడు చెప్పున దొకటి, చేయున దొకటి. సాధువు అట్టివాడు కానే కాడు. భగవ దర్పిత మనస్కు డైన వాని మాటలును చేతలును పూర్తిగ విలక్షణములుగ నుండును.

ఒకప్పు డొక వేదాంతి సన్న్యాసి ఇచ్చటికి విచ్చేసెను. మేఘమును చూచెనా, ఆయన నృత్యమాడెడివాడు. వానగాలిని కన్నను ఆయనకు ఆనందము ఉత్కటకోటిక మయ్యెడిది. ఆయన ధ్యానించుచున్నపుడు ఎవ రైనను ఆయనను సమీపించిన యెడల ఆయనకు మహాకోపము వచ్చెడిది. ఒకనా డాయన ధ్యానించుచున్నపుడు నేను చెంతకు పోయితిని; ఆయన మండిపడినాడు. బ్రహ్మ మొక్కటే సత్యము, జగత్తు మిథ్య — అని ఆయన సదా వివేచించుచునే యుండెడివాడు. అనేకత్వము భాసించుటకు హేతువు మాయయే కావున ఆయన ఒక కొమ్మల సెమ్మెనుండి చమునైన పక్కలు గల కడ్డిని సదా చేత బూని తిరుగుచుండెడివాడు. ఆ కడ్డీగుండ చూచినచో వివిధ వర్ణము లగపడును. నిజములో రంగు అనున దొకటి లేదు. అట్లే నిజమైన యస్తిత్వము బ్రహ్మమునకు తక్క దేనికిని లేదు. మఱి ఈ యనంత సచరాచర జగత్తును భాసింపజేయునది మాయయు అహంకారమును. మాయయు, సంగమును తన్ను వంచించు నేమో యనెడి వెఱపుచే ఆయన ఏవస్తువును గాని ఒక్కసారికంటె ఎక్కువ చూడడు. ఆయన ఇచ్చట మూడు దినము లుండెను. ఒకనాడు నదీతీర మమీపమున వేణునాదము ఆయన చెవిని పడినది. బ్రహ్మసాక్షాత్కార మొందినవాడు అట్టి నాదమును విన్నయెడల సమాధినిమగ్ను డౌ నని ఆయన చెప్పెను.

ఆ సన్న్యాసినిగురించి చెప్పుచున్నప్పుడు, పరమహంస శీతులును నడవడులును ఎట్లు ఉండునో గురుదేవుడు లేచి తన భక్తులకు అభినయించిచూపెను — శిశువు నడకను బోలిన నడక, నవ్వుతో వెలుగొందు మోము, ఆనందమున ఈదులాడు కన్నులు, అనాచ్ఛాదిత మైన యొడలు — వీని నభినయించి చూపి, గురుదేవుడు మరల ఆ చిన్న మంచముపైని గూర్చుండి శ్రోతృహృదయ వశీకరణసమర్థమైన వాగమృతము నొలికింపసాగెను.

గురుదేవుడు:— (మహేంద్రునితో) నాకు వేదాంతము నుపదేశించినవాడు నఙ్గుడు. బ్రహ్మ మొక్కటే సత్యము, జగత్తు మిథ్య. ఐంద్రజాలికుడు ఇంద్రజాలము చేయును. అతడు మామిడిచెట్టును సృష్టించును. ఆచెట్టు మామిడిపండ్లను సైతము ఈనును. కాని ఇదంతయు చేతి గారడి విద్యయే. ఐంద్రజాలికు డొక్కడే నిజము.

మహేంద్రుడు:—జీవిత మంతయు ఒక దీర్ఘ నిద్ర అని తోచుచున్నది. నాకు ఇంతవఱకును తెలియును — మనము విషయముల చక్కగా పరికించుట లేదు. మనము మన మనస్సుతో చూతుము. మన మనస్సు ఆకాశస్వరూపమునైనను అర్థము చేసికోలేదు. ఇకను మన చూచుటలు ఎట్లు సరిగా నుండును?

గురుదేవుడు:—సరిగా చూచు శక్తి మానవున కెక్కడిది? అతని మనస్సు సన్నిపాతజ్వరగ్రస్తుని మనస్సువలె జన్నికి లోనైనది.

గురుదేవుడు తన మధుర కంఠముతో ఇట్లు పాడెను.—

ఎంత జన్నియు జ్వరమును నేచుచున్న
వయ్యయో నన్ను; నా కిఁక అంబ, నీదు
కరుణ యొక్కటె మందు దాను.....

గురుదేవు డింకను ఇట్లనెను. నిజముగ అది యొక జన్ని దశయే. లౌకికులు తమలో ఎట్లు కలహించుకొందురో చూడుము. ఎందులకుగాను కలహించుచున్నారో ఎవరికిని తెలియదు. ఔరా ఎంతగా పోరాడుదురు! ఎంత బొబ్బరింతలు! ఎంత దూషణము!

గురుదేవుడును మహేంద్రుడును కాళిగుడివైపునకు పోయిరి.

గురుదేవుడు:—ఈజగ మొక మాయానిర్మాణమే కావచ్చును. కాని దానిని ఆనందనిలయ మనియు అందురు. ఈ జగమును ఆనంద నిలయముగ గూడ మార్పవీ లగును.

మహేంద్రుడు:— మఱి ఈ లోకమున అవిచ్ఛిన్న మైన యానందము ఎక్కడ ఉన్నది?

గురుదేవుడు:—అవును, ఎక్కడ ఉన్నది?

శ్రీరామకృష్ణుడు కాళికాలయమున కెదుట నిలబడి లోక జననికి సాగిలబడి మ్రొక్కెను. మహేంద్రుడును ఆయన ననుసరించెను. అంత గురుదేవుడు అమ్మవారిగుడిలో గర్భాలయమున కెదుట ఆ దివ్యానంద దాయక మగు విగ్రహమున కెదుట నేలపై కూర్చుండెను. ఆయన యొక యెఱ్ఱంచు దోవతిని కట్టుకొని అందు ఒకంతను వీపుమీదుగ భుజముపై వేసికొని యుండెను. మహేంద్రుడును ఆయనప్రక్కనే కూర్చుండియుండెను.

మహేంద్రుడు:— ఈ లోకమున అవిచ్ఛిన్న సౌఖ్యము లేనప్పుడు దేహధారణ మెందులకు? ప్రారబ్ధకర్మానుభవముకొఱకే ఈ దేహ మేర్పడిన దని నే నెఱుగుదును. మఱి యిది ప్రస్తుతము ఎట్టి కర్మను చేయుచున్నదో ఎవ రెఱుగుదురు? మనము నలిగిపోవుచున్నాము. అదే అందులోని దురదృష్టభాగము. ఎనిమిది బంధములున్నవి.

గురుదేవుడు:—ఆ యెనిమిదియును బంధములు కావు, ఎనిమిది సంకెళ్లు. అవి యున్ననేమి? భగవంతుని కటాక్షము ప్రసరించిన తక్షణమే ఆ సంకెళ్లు తొలగిపోవును. అది ఎట్టిదో నీకు తెలియునా? ఒక గదిని అంధకారమయముగ వేయేండ్లుగా నుంచియుంటి మనుకొనుము. ఎవ డేని ఆ గదిలోనికి ఒక దీపమును కొనివచ్చునేని చీకటి మాయ మగును, క్రమక్రమముగా కాదు, ఆక్షణమందే. ఐంద్రజాలికుడు చేసెడి యద్భుతము నీవు చూడ లేదా? పెక్క

ముడులు ఉన్న యొక దారమును కై కొని దాని కొసను దేనికో ఒక దానికి కట్టి రెండవ కొసను తనచేత నుంచుకొనును. ఆ దారము నతడు ఒకటిరెండుసార్లు ఆడించును. తక్షణమే అన్ని ముడులును వీడిపోవును. కాని వేఱొకడు ఎంత ప్రయత్నించినను ముడులను విప్ప లేడు. ఆచార్యానుగ్రహ మున్నచో అజ్ఞానగ్రంథు లన్నియు నిమిషములో వీడిపోవును.

చర్చలుపెట్టుకొనకుము. ఎప్పుడుగాని దేవు నెఱుగ గల వా రెవరు? ఈజగ మంతయు బ్రహ్మమునందు ఒకయంశముమాత్రమే అని నన్నుకడు చెప్పగా ఇక నెప్పుడును మఱపు రాని రీతిగా వింటిని.

లెక్కలను అమితముగా సరిచూచువాడు హాజ్రా. 'దేవునిలో ఇన్నవ పాలు జగముగా రూపొందినది, ఇంత మిగిలియున్నది' అని అతడు ఏర్పఱచి చెప్పుచుండును. అతని లెక్కలను జూచిన నాకు తలనొప్పి. నాకు ఏమియును తెలియదు అని నేను ఎఱుంగుదును. ఒక్కొక్కసారి దేవుడు మంచివా డనియు ఒక్కొక్కసారి దేవుడు చెడ్డవా డనియు నేను అనుకొనుచుందును. ఆయనను గుఱించి నేను ఏమి గ్రహింపగలను?

మహేంద్రుడు:—నిజమే. దేవుని ఎఱుంగుటకు ఎవరి కైనను సరే, ఎప్పు డైనను సరే, శక్య మగునా? ఒక్కొక్కడును తనకు ఉన్న కొంచెపాటి తెలివితోనే, భగవంతుని గుఱించిన సమస్తమును తెలిసికొన్నట్లు అనుకొనుచుండును.

గురుదేవుడు:— భగవంతుని ఎఱుంగుటకు ఎవరికి శక్య మగును? ఎప్పుడు శక్య మగును? ఎఱుంగుటకు నేను ప్రయత్నము నైనను చేయను. భగవంతుని "తల్లీ" అని పేర్కొందును. అంతే. తల్లి ఆమె యిచ్చ చొప్పున, ఏ మైనను చేయును గాక. తల్లి సంకల్పించినచో నాకు తల్లిని గుఱించిన యెఱుక గలుగును. ఆమె సంకల్పము అది కా దేని, ఆమెను గుఱించిన యెఱుక లేకయే ఉందును. అట్లుండుటే నాకు సంతోషము. శిశువునకు కావలసినది తల్లి

మాత్రమే. తల్లికి ఎంత సొత్తు ఉన్నదో శిశువునకు దెలియదు. తెలిసికొందమను కోర్కెయు శిశువునకు గలుగదు. శిశువు "నా కొక తల్లి ఉన్నది. నేను దుఃఖింప నేల?" అని మాత్రమే తలచును. తల్లి ఒకరింట పరిచారికగా ఉండినను ఉండును గాక, ఆమె బిడ్డయు తల్లిగలవాడే. అతడు ఇంటి యజమానుని కొడుకుతో కలహించునప్పుడు కూడ "నాకు అమ్మ ఉన్నది, నేను అమ్మతో చెప్పెదను" అనుచుండును. నా వైఖరియు శిశువైఖరియే.

శ్రీరామకృష్ణుడు తటాలున మహేంద్రుని దృష్టిని తన వైపు మరల్చుకొని తన రొమ్ముపై చేతి నుంచుకొని "మఱి ఇక్కడ ఏదో యొకటి యున్నది కదా" అనెను.

మహేంద్రుడు గురుదేవునివైపు సాశ్చర్యముగ చూచెను. తనలో ఇట్లనుకొనెను — "లోకజనని ఈయన హృదయమున స్వయముగ వసించుచున్నదా? మానవశ్రేయమునకై మానవ రూపమును దాల్చినది లోకజననియేనా?"

శ్రీరామకృష్ణుడు లోకమాతను ఈ విధముగ ప్రార్థించుచుండెను.—"తల్లీ, ఓంకారరూపిణీ, ప్రజలు నిన్నుగుఱించి ఎన్ని విషయములు చెప్పుదురమ్మా! కాని అందులో నొక్కటియును నాకర్థము గాదు. అమ్మా, నే నేమియు నెఱుగను. నీచరణములను శరణు బొందితిని. నీయొద్ద సంరక్షణమును కోరితిని, ప్రతిఫలాపేక్ష లేని శుద్ధ ప్రేమ నాకు నీ పాదపద్మములందు కలుగవలెను. అ దొక్కటే నేను కోరునది. అమ్మా, లోకమోహనమైన నీ మాయచేత నన్ను వంచింపకుము. నను బ్రోవుమని వేడుకొనుచున్నాను. నిన్ను శరణు బొందితిని".

ఆలయములలో సాయంపూజ ముగిసినది. శ్రీరామకృష్ణుడు మహేంద్రునితోబాటు మరల తన గదిలో కూర్చుండియుండెను.

గురుదేవుడు:—నీవు ఒక లక్ష్యమును అంగీకరించితివి. నిరాకారుడయిన యీశ్వరుడు నీ లక్ష్యము. అంతే కదా?

మహేంద్రుడు:—స్వామీ, అవును, అయినను ఈశ్వరునకు ఏదైనను సాధ్యమే యని తాము సెలవిచ్చితిరే, ఆమాటయందును నాకు నమ్మకము ఉన్నది. ఈశ్వరునకు సాకారుడై యుండుటయు సాధ్యమే.

గురుదేవుడు:—ఔను. ఈశ్వరుడు చిద్రూపియై చేతనాచేతన విశ్వ మంతటను వ్యాపించియున్నాడు అనుటను గూడ నీవు జ్ఞప్తియం దుంచుకొనుము. అనుమతింతు వేని నిన్నొకటి ప్రశ్నింతును. నీకు ధనాశ కలదా?

మహేంద్రుడు:—స్వామీ, లేదు. కాని నిశ్చింతగా దైవ ధ్యానము చేసికొన గలిగియుండుటకును ఎట్టి మనోవ్యథయు లేకుండు టకును ధనమును సంపాదింత మనుకొందును.

గురుదేవుడు:—ఓహో! అదియా, అది సహజమే.

మహేంద్రుడు:—అది లోభము అనిపించుకొనునా? అనిపించు కొనునని నాకు తోపదు.

గురుదేవుడు:—సరిగానే చెప్పితివి. లేకున్న నీబిడ్డలను ఎవరు విచారించుకొందురు? మనము కర్తలము కాము అని నీ వనుకొందు వేని, ఇక వారి గతి యేమి?

మహేంద్రుడు:— కర్మకర్తవ్యతాబుద్ధి యున్నంతవఱకు జ్ఞానము సిద్ధింప దని నేను విని యున్నాను. కర్మము దుస్సహ గ్రీష్మ తపమును బోలినది.

గురుదేవుడు:—ఇప్పటి నీ వైఖరిని ఇట్లే ఉండనిమ్ము. కర్మ కర్తవ్యతాబుద్ధి తనంతట తొలగిపోయి నపుడు నీ వైఖరి మార్పొందును.

1883–వ సంవత్సరము నవంబరు తే 28 ది బుధవారము.

మల్లీకుటీరము (లిల్లీ కాటెజ్) కేశవచంద్రసేనుని నివాసము. మధ్యాహ్నానంతరము రెండుగంట లప్పుడు మహేంద్రుడు మల్లీకుటీర మున కెదుటి వలయాకార వీథిలో పచారు చేయుచుండెను. అతడు

శ్రీరామకృష్ణుని రాకకై ఆతురముతో వేచియుండెను. కేశవుని వ్యాధి ముదిరెను. అది నయము మగు నవకాశము లేదు. గురుదేవునికి కేశవునిపై చాల ప్రేమ. కేశవుని చూచుటకై ఆయన దక్షిణేశ్వర మునుండి రావలసియున్నది.

దాదాపు ఐదుగంట లప్పుడు మల్లీకుటీరము వాకిట బండి ఆగినది. లాటుతో శ్రీరామకృష్ణుడు బండి దిగెను. రాఖాలు మొదలైన భక్తు లనేకులుగూడ దిగిరి. కేశవుని బంధువులు శ్రీరామ కృష్ణుని ఆదరించి, ఆయనను ఆభక్తులను మిద్దెమీది కూటమునకు దక్షిణమున నున్న వసారలోనికి పిలుచుకొని పోయిరి. గురుదేవుడు ఒక చిన్న మంచముపై కూర్చుండెను.

చాలసేపు వేచియుండెను. కేశవుని చూడ వలె నని తహ తహ పడెను. కేశవుడు విశ్రమించియున్నా డనియు త్వరలోనే వచ్చు ననియు కేశవశిష్యులు చెప్పిరి. ఓపిక తగ్గి శ్రీరామకృష్ణుడు ఇక వేచి యుండ లేక పోయెను. "ఇటుచూడుడు, ఆయన నాయొద్దకు ఏల రావలయును? నేను లోని కేగి ఏల ఆయనను చూడ రాదు?" అని శిష్యులతో అనెను.

ప్రసన్నుడు:—(వినయముతో) స్వామీ. ఆయన కొన్ని నిమిషములలో వచ్చును.

గురుదేవుడు:—పోపో. ఈయడావిడి చేయుచున్న దెల్ల నీవు. నన్ను లోనికి పోనిమ్ము.

గురుదేవుని ధోరణిని మరల్చుటకై ప్రసన్నుడు కేశవుని గుఱించి ప్రసంగింప నారంభించి "కేశవుడు ఇప్పుడు పూర్తిగ మాఱి పోయినాడు. మీవలెనే ఆయనయు లోకమాతతో మాటాడును. ఆమె వాక్కును వినును, నవ్వును, ఏడ్చును" అనెను.

కేశవుడు లోకమాతతో మాటాడు ననియు నవ్వు ననియు ఏడ్చు ననియు విన్నపుడు గురుదేవుడు భావోద్రేకమునకు లో నయ్యెను. వెంటనే సమాధియందు మునిగెను.

అది చలికాలము. గురుదేవుడు ఆకుపచ్చని ఫ్లానలుచొక్కాను తొడుగుకొని దానిమీదికొక శాలువను కప్పుకొని యుండెను. భావో ద్రేకమున, ఆయన చూపులు కదలిక దక్కి యుండినవి. ఆయనయు నిశ్చలముగ నిగుడుకొని కూర్చుండెను. ఈవిధముగ చాలసేపు గడచి పోయినది. మామూలు స్పృహకు ఆయన మరలునట్టి జాడయే కానిపింప లేదు.

క్రమక్రమముగా చీకటి వ్యాపించెను. కూటమున దీపములు వెలిగింపబడినవి. గురుదేవు డచటికి పోవలసి యుండెను. ఆయనను వారు ఎంతో కష్టముతో అచ్చటికి పిలుచుకొని పోవు నప్పటికి ఆయ నకు మెల్ల మెల్లగ మామూలు స్పృహ గలుగుచుండెను. ఆ కూట మున బల్లలును కుర్చీలును సమృద్ధిగ నుండినవి. వానిని చూచి గురు దేవుడు "వీని యావశ్యకత ఇంతకు పూర్వ ముండినది. ఇక నిప్పు డివి యెందులకు" అనుకొనెను.

గురుదేవుడు అప్పుడు గాఢ దివ్యోన్మాదదశయం దుండెను. దీపముల వెలుతురు నిండిన యా కూటమున బ్రాహ్మభక్తులు గురు దేవుని పరివేష్టించి కూర్చుండిరి. లాటు, రాఖాలు, మహేంద్రుడును సమీపముననే యుండిరి. ఇంకను దివ్యోన్మాద ప్రపూర్ణుడై ఆయన తనలో ఇట్లనుకొనుచుండెను: "దేహమును, ఆత్మయు! దేహము నకు పుట్టుక కలిగినది, చావును కలుగును. కాని ఆత్మకు మరణము లేదు, అది వక్కను పోలినది. వక్క పరిపక్వ మయినపుడు అది చిప్ప కంటుకొనదు, కాని అది యింకను పచ్చిగ నున్నపుడు దానిని చిప్పనుండి వేఱుపఱచుట కష్టము. భగవత్సాక్షాత్కారము గలిగిన పిమ్మట దేహమే ఆత్మ యని యెవడును అనుకొనడు. ఆత్మ వేఱు, దేహము వేఱు అని అత డెఱుంగును."

ఆ సమయమున కేశవుడు గదిలో ప్రవేశించెను. ఆయన తూర్పు వాకిలిగుండ వచ్చెను. బ్రాహ్మసమాజమందిరమందును పుర మందిరమందును ఆయన మతవిషయములను ఉపన్యసించుచుండగా

కనిన జ్ఞప్తి కలవారు ఇప్పుడు తోలు కప్పిన యెముకలగూడువలె నున్న యాయనను చూచి నివ్వెఱపడిరి. ఆయనగోడను పట్టుకొని నడచి వచ్చెను. ఎంతో శ్రమతో మంచమున కెదుట కూర్చుండెను. అంతకు కొంత ముందే శ్రీరామకృష్ణుడును మంచము దిగి నేలపై కూర్చుండి యుండెను. కేశవుడు గురుదేవుని చరణములు తన నుదురు సోక ప్రణమిల్లి చాలసేపు లేవకయే యుండెను. తరువాత లేచి కూర్చుండెను. శ్రీరామకృష్ణు డప్పటి కింకను ఉద్రిక్తదశయందే యుండెను. ఆయన తన లోనే గొణుగుకొనుచుండెను, లోకమాతతో మాటాడుచుండెను.

కేశవుడు గొంతెత్తి "స్వామీ, నేను ఇక్కడ ఉన్నాను, ఇక్కడ ఉన్నాను" అనుచు, శ్రీరామకృష్ణుని యెడమచేతి నందుకొని దానిమీద మెల్లగ తట్టెను. కాని గురుదేవుడు పూర్తిగ దివ్యప్రేమో న్మాదముచే గాఢసమాధియందు ఉండెను. ఆయన తనలో తాను మాటాడుకొనుచుండెను, ఆయన నోటినుండి వాక్కు ప్రవాహముగ వెలువడుచుండెను. భక్తులు మంత్రముగ్ధులం బోలి వినుచుండిరి.

గురుదేవుడు:—మానవుడు ఉపాధులతో సంబంధము గలిగి యున్నంతవఱకును అతనికి 'ఇతడు కేశవుడు', 'అతడు ప్రసన్నుడు', 'ఆయన అమృతుడు' అన్నరీతిగా అనేకత్వము పొడకట్టుచుండును. కాని పరిపూర్ణజ్ఞానము సిద్ధింపగనే, మానవుడు సర్వత్ర ఏకచైతన్య మునే గాంచును. ఆయేకచైతన్యమే జగత్తుగను, అందలి ప్రాణులు గను, చతుర్వింశతితత్త్వములుగను రూపొందిన దనికూడ ఆపూర్ణ జ్ఞానమే మానవునిచేగుర్తింపించుచున్నది. కాని ఆదివ్యశక్త్యావిష్కా రముమాత్రము వివిధప్రాణులలో వివిధముగ నుండును. సమస్తము గను రూపొందినది ఆసర్వేశ్వరుడే అనుటకు సందేహము లేదు, కాని కొన్నింట భగవదావిష్కరణము ఎక్కువ, మఱికొన్నింట తక్కువ.

ఏ యాత్మ్మమూలముగ భగవంతుడు తన లీలను నెఱపునో ఆ యాత్మలో భగవచ్ఛక్తి విశేషించి యుండును. ఒక భూస్వామి,

తన భూమిలో ఏభాగమునం దైనను ఉండ వచ్చును కాని, ఆయన తఱచు ఒకానొక కచేరిచావడిలోనే అగపడుచుండును. భక్తుడే భగవంతుని కచేరిచావడి. తన భక్తుని హృదయవీథిని విహరించుట అనిన భగవంతునకు ప్రియము. భగవంతుని అసాధారణ శక్తి ప్రకట మగునది ఆ చోటనే. అట్టి భక్తుని లక్షణ మేమి? నీ యెదుట ఎవడు ఘనకార్యముల చేయుచుండునో అతనిగుండ దేవుని విశిష్టశక్తి ప్రకట మగుచున్న దని నీవు గ్రహింప వచ్చును.

బ్రహ్మసాక్షాత్కారము పొందిన వానికి, సకలప్రాణులందును బ్రహ్మమే కానిపించుచుండును. కాని మానవునిలో ఎక్కువగా కానిపించును. మానవులలో సైతము కామినీకాంచనసక్తి లేని సాత్త్వికభక్తులలో దేవుడు మఱింత స్పష్టముగ తన్ను ప్రకటించుకొనును. సమాధి నొందిన వాడు, సమాధిదశనుండి మరలిన పిమ్మట తన మనసును ఎచ్చట నెలకొల్పును? అందుకే అతనికి కామినీకాంచనసక్తి లేని వారును, పవిత్రహృదయులును ఐన సాత్త్వికభక్తుల సాంగత్యమును ఆశ్రయించుట ఆవశ్యక మనిపించును. వ్యావహారికదశలో ఇట్లు కాక మఱి ఎట్లు అట్టి సాధకుడు ప్రొద్దుపుచ్చుకొనును?

నా తల్లి! ఎవరు నా తల్లి? అహో, ఆమె విశ్వమాత. జగమును సృజించునదియు, కాపాడునదియు, ఆమెయే; సదా తన బిడ్డలం బ్రోచుచు ధర్మార్థకామమోక్షములలో వారు ఏమి కోరినను ఇచ్చునదియు ఆ తల్లియే. మంచి కొడుకు, తనతల్లిని ఎడబాసి జీవింప లేడు. తల్లి సమస్తము నెఱుగును. బిడ్డ తినును, త్రాగును, ఆడుకొనును, అంతే. ప్రపంచవిషయములనుగూర్చిన వ్యథ అతనికి లేదు.

కేశవుడు:—ఔను, నిజమే, స్వామీ.

మాటాడుచున్నప్పుడు శ్రీరామకృష్ణునకు మామూలు లోకస్మృతి మరల గలిగినది. మందహాస వికసిత వదనుడై ఆయన కేశవునితో సంభాషించెను. ఆగదినిండియున్న జనులు వారిని ఆతురముతో చూచుచు వారిమాటలను వినుచుండిరి. కేశవుడు గాని గురు

దేవుడు గాని ఒక రొకరి యారోగ్యమునుగూర్చి ప్రశ్నించుకొనసే లేదు. భగవద్విషయమునే మాటాడుచుండిరి. దీనిని జూచి అందఱును ఆశ్చర్య చకితులైరి.

గురుదేవుడు:—(కేశవునితో) — బ్రాహ్మసమాజసభ్యులు భగవంతుని మహిమలనుగూర్చి అంతగా ప్రసంగింతురే, ఎందులకు ? "ఓ దేవా, నీవు చంద్రుని సృష్టించితివి, సూర్యుని సృష్టించితివి, నక్షత్రములను సృష్టించితివి" అను నిట్టి విషయములను మాటిమాటికిని చెప్ప వలసిన గొప్ప యావశ్యకత ఏమేని కలదా ? తోటను చూచి మెప్పు పట్టలేని వారి సంఖ్యయే ఎక్కువ. తోటసొంతదారును దర్శింప బూనుకొను వారి సంఖ్య అత్యల్పము. మఱి తోటగొప్పతనము ఎక్కువయా, తోటసొంతదారు గొప్పతనము ఎక్కువయా ?

ఉన్నమాట చెప్ప మందువా ? మానవునకు తన సిరిసంపదల మీద ప్రీతి యుండును కదా, కాబట్టి దేవునకు గూడ ఆయన విభూతి మీద ప్రీతి యుండు నని మానవుడు అనుకొనును. ఆయన విభూతిని పొగడిన ఆయన ప్రీతు డగు నని మానవుని తలంపు.

సంపదచేత భగవంతుని వశపఱచుకొనుట ఎవరికైనను ఎప్పుడైనను సాధ్యమా ? ప్రేమచేతమాత్రమే భగవంతుని వశపఱచుకొన వీ లగును. ఆయనకు ఏమి కావలెను ? సంపద అక్కఱ లేనే లేదనుట నిజము. భగవంతుడు భక్తులందు అపేక్షించునవి ఇవి—భక్తి, ప్రేమ, సానుభూతి, వివేకము, త్యాగము.

[చిఱునవ్వు నవ్వుచు కేశవునితో] నీ యారోగ్యము ఏల చెడినది. అందులకు కారణము ఉన్నది. నీ శరీరము ఆధ్యాత్మిక భావోద్రేకములకు పెక్కింటికి లోనైనది. కావున ఆరోగ్యము తప్పినది. భావోద్రేకము రేకెత్తినప్పుడు దానిని గుఱించి ఏమియునే తెలియదు. ఒడలికి దానివలన గలిగిన దెబ్బ చిరకాలమునకు పిమ్మటనే అనుభవమునకు వచ్చును. గంగమీద పెద్ద పెద్ద పొగయోడలు

పోవుచుండును. పోవుచున్నప్పుడు వానిని గుర్తింపము. కాని కొంత సేపైన పిమ్మట అలలు గట్టునకు వేసి కొట్టుకొను నప్పుడు ఎంత పెద్దధ్వని వినబడును! గట్టులో ఒకభాగము పూర్తిగా తెగి ఏటి నీటిలో పడినను పడును!

ఒకకుటీరమున జొచ్చిన యేనుగు లోలోపల ధ్వంసముచేసి తర్వాత దానిని పడద్రోయును. దివ్యభావోద్రేక మనెడి యేనుగు ఈ శరీర మనెడి కుటీరమున చొచ్చుకొను నేని, దానిని తుత్తునియలు చేసి వైచును.

వాస్తవముగ ఏమి సంభవించునో ఎఱుగుదువా? ఇంటికి నిప్పు అంటుకొన్నప్పుడు మొదట, లోపల ఉన్న కొన్నివస్తువులు కాలి పోవును. కాని తర్వాత, తర్వాత మహాసంక్షోభము గలుగును. అట్లే జ్ఞానాగ్నియు, మొట్టమొదట ఆధ్యాత్మికజీవితమునకు అడ్డుదగులునట్టి కామక్రోధాదిశత్రువులను విధ్వంస మొనర్చును. అట్లు ధ్వంస మగు వంతు క్రోధాదులకు పిమ్మట అహంకారమునకు వచ్చును. కట్టకడపట శరీరమునందే దారుణసంక్షోభము కాన నగును.

అన్నియు ముగింపునకు వచ్చుచున్న వని నీవు అనుకొన వచ్చును, కాని నీ తెగులు జాడ యైనను లేక పూర్తిగా అంతరించు వఱకును, దేవుడు నీకు విముక్తిని ప్రసాదింపడు. ఆసుపత్రిలో నీ పేరును వ్రాయించుకొందు వేని, నీవు ఊరక విడిచిపోవుటకు వీలు లేదు. నీవ్యాధి పూర్తిగ నిర్మూలింపనిదే, వెలి కేగుటకు నీకు వైద్యుడు అను మతిని ఒసంగడు. ఆసుపత్రిలో నీవు నీ పేరును ఏల వ్రాయించు కొంటివి? [అందఱును నవ్వుదురు].

గురుదేవుడు చెప్పిన యాసుపత్రి సాటువకు కేశవుడు మరల మరల నవ్వుచునే యుండెను. తర్వాత శ్రీ రామకృష్ణుడు తన వ్యాధినిగుఱించియే ప్రసంగించెను.

గురుదేవుడు:— (కేశవునితో) భగవద్విషయమున ఇంతటి యుత్సుకతను ఇట్టివ్యాధిని ఇంతవఱకు నేను చూడలేదు అని హృదయుడు చెప్పుచుండెడివాడు. అప్పుడు నేను చాల జబ్బుపడి యుంటిని.

అతిసారము ఆగక మొండికి వేసికొనియుండినది. కోట్లకొలది చీమలు నా తలను పట్టి పీకుచున్నట్లుండెను. కాని అప్పుడు కూడ ఆధ్యాత్మిక విషయక ప్రసంగములు అహర్నిశము సాగుచునే యుండెను. నాతాగోడ వాడైన రాము డనెడు వైద్యుని నను జూడ పిలుచుకొని వచ్చిరి. ఆయన వచ్చి ఆధ్యాత్మిక చర్చలలో ఆసక్తుడనై యున్న నన్ను జూచి "ఎంత వెఱ్ఱివాడు, ఎముకలు తప్ప దేహమున వే ఱేమియు లేదు. ఇప్పుడుకూడ ఇతడు ఇట్లు చర్చించుచున్నాడే" అనెను. మంచువలని పూర్తి లాభమును పొందుటకై తోటమాలి బ్రాహ్మజాచెట్టు అడుగున నున్న మట్టిని వేరులవఱకు తోడి ఎత్తును. ఆ చెమ్మ వలన ఆ లత మెఱుగుగా వర్ధిల్లును. అందువలననే శాబోలు నీయందు సైతము వేడులవఱకు సంక్షోభము గలుగుచున్నది. (కేశవుడును గురుదేవుడును నవ్వుదురు) నీవు మరల వచ్చి నపుడు అద్భుత కృత్యములు సాధించెడువాడవు కావచ్చును.

నీవ్యాధినిగుఱించి విన్నపు డెల్ల నేను అతిమాత్రముగ కలవర పడుచుందును. క్రిందటిసారి నీ వ్యాధిని నేను విన్నవెంటనే ప్రతిదినమును ప్రాతఃకాలమున లోకమాత యెదుటికి పోయి విలపించు చుంటిని. నీకు ఆరోగ్యము గలుగ వలయు నని ప్రార్థించుచు లోకమాతకు ఫలములను, మధురభక్ష్యములను అర్పించితిని.

శ్రీరామకృష్ణునకు కేశవునిపైని గల ప్రేమను ఆ బ్రాహ్మసమాజాధ్యక్షునికై ఆయన యనుభవించిన యాతురమును కని భక్తు లెల్లర హృదయములును గాఢముగ కదలిపోయినవి.

గురుదేవుడు:—ఈసారి నిజముగ నాకు అంతటి ఆందోళనము కలుగ లేదు. ఒకటి రెండు దినములు మాత్రము కొంత ఖిన్నుడనై యుంటిని.

ఇంతకు ముందు కేశవుడు ఏతూర్పు వాకిలి గుండ ఆగదిలో ప్రవేశించియుండెనో ఇప్పుడు ఆవాకిలిగుండనే పూజ్యురాలైన కేశవుని తల్లి వచ్చినది. "స్వామీ, అమ్మ మీకు మ్రొక్కుచున్నది" అని ఉమానాథుడు గురుదేవునితో బిగ్గరగా చెప్పెను.

శ్రీరామకృష్ణుడు చిఱునవ్వు నవ్వెను. ఉమానాథుడు మరల "కేశవుని వ్యాధి నిర్మూలించునట్లు దీవింపు డని మిమ్ము అమ్మ ప్రార్థించుచున్నది" అనెను.

గురుదేవుడు:—(కేశవుని తల్లితో) అమ్మా, లోకమాతయే సర్వసౌఖ్యప్రదాయిని. ఆమె మీ యిక్కట్టులను తొలగించును. కాబట్టి దయచేసి ఆమెను ప్రార్థింపుము.

[కేశవునితో] "ఇంటిలోపలిభాగమున చాలసేపు ఉండకుము. స్త్రీలనడుమ నుంటివేని నీ దేహపరిస్థితి నానాటికి తీసికట్టగును. భగవద్విషయప్రసంగములు మాత్రము వినుచుందు వేని నీ దేహపరిస్థితి మే లొందును."

గురుదేవుడు ఈ మాటలనుమాత్రము గంభీరకంఠమున బలికి తరువాత మరల బాలునివలె నవ్వ నొడంగెను. "ఏదీ, నీ చేతిని చూడ నిమ్ము" అని గురుదేవుడు కేశవుని చేతి నందుకొని ఆట బొమ్మలు ఆశపడి శిశువువలె ఆచేతి బరువును పరిశీలించెను. కడపట ఆయన "నీ చేయి చాల తేలికగా ఉన్నది. వంచకుల చేతులు బరువుగ నుండును" అనెను. (అందఱు నవ్వుదురు).

మరల వాకిలి వైపు నుండి ఉమానాథుడు "కేశవుని దీవింపు డని మిమ్ము అమ్మ కోరుచున్నది" అని గురుదేవునితో అనెను.

గురుదేవుడు:— (గంభీరముగా) నాచేత ఏమి ఔను? అంద ఱను దీవించువాడు దేవు డొక్కడే. "దేవా, నీ పనిని నీవే నిర్వహించుకొందువు. మానవులు ఊరక ఆపని తమది అందురు."

దేవుడు రెండుసందర్భములలో నవ్వెను. ఇద్దఱు సోదరులు భూమిని పంచుకొన్నపుడు దేవుడు నవ్వెను. వారు భూమికి నడుమ అడ్డముగ ఒకత్రాటిని గట్టి "ఈ వైపు నాది, ఆ వైపు నీది" అని ఒక రొకరితో చెప్పుకొందురు. అప్పుడు దేవుడు తనలో తాను "విశ్వమంతయు నాది; వీరు ఒక చిన్న మట్టి గడ్డ నాశ్రయించుకొని

దానిలో 'ఈ వైపు నాది, ఆ వైపు నీది' యనుచున్నారు'' అని అనుకొని నవ్వెను.

బ్రతుకననన్న మాసపాటే లేనంత వ్యాధి బిడ్డను పైకొన్నపుడు ఏడ్చుచున్న తల్లితో వైద్యుడు ''అమ్మా, భయపడకుము, నీబిడ్డ వ్యాధిని నేను నయము చేయుదును'' అనును. అప్పుడును దేవుడు నవ్వును. ఆయన నవ్వెడి రెండవ సందర్భ మది. బిడ్డ చావవలె నను దైవసంకల్ప మున్నచో ఆ బిడ్డను ఎవరును కాపాడ లే రను సంగతిని, పాపము, వైద్యు డెఱుగడు. (అందఱును మౌనముగ నుందురు.)

అప్పుడే ఒక తెరదగ్గు కేశవుని పైకొన్నది. ఆ తెరదగ్గు ఆగుటకు చాలసేపు పట్టినది. అతడు పడుచుండిన బాధ ప్రేక్షకుల కెల్ల అయ్యో యనిపించినది. ఆయన అలసిపోయినాడు, క్షణ మయిన నచట నుండలేక పోయెను. గురుదేవునకు ప్రణమిల్లి ఆయన మరల మునుపటివలెనే గోడను పట్టుకొని నడచుచు గదినుండి వెడలి పోయెను.

గురుదేవునకై చిఱుతిండివిందు ఏర్పాటై యుండెను. కేశవుని పెద్దకుమారుడు గురుదేవునకు సమీపమున కూర్చుండి యుండెను. అమృతుడు ఆ బాలుని గురుదేవునకు పరిచయపఱచి అతనిని దీవింపు మని కోరెను. ''ఎవరినికాని దీవింపగల యోగ్యత నా కెక్కడిది?'' అని గురుదేవుడు సుందరమందహాసముతో ఆ బాలుని తట్టెను.

అమృతుడు [చిఱునవ్వుతో] :— సరి, తమకు నచ్చినట్లే చేయుడు.

గురుదేవుడు :— [భక్తులతో] – ''నీ వ్యాధి నయ మగుగాక'' అను నిట్టి వాక్యములను నేను బలుక లేను. నయము చేయు శక్తి నిమ్మని యైనను నేను లోకమాతను ఎప్పుడును ప్రార్థింపను. విశుద్ధప్రేమను ప్రసాదింపు మని మాత్రమే నేను గోరునది.

విందు ముగియగానే గురుదేవుడు బయలుదేఱ సిద్ధపడెను. బండి వాకిట వీథిలో నిలబడియుండెను. వాకిటివఱకు బ్రాహ్మభక్తులు

గురుదేవుని అనుగమించిరి. మిద్దెమెట్లు దిగుచున్నప్పుడు క్రిందివైపు దీపమే లేకుండుటను గుర్తించి గురుదేవుడు అమృతునితోను కేశవుని యితరశిష్యులతోను "ఈ తావులలో మంచి వెలుతురు ఉండ వలయును, దీపము లేని యింటికి దారిద్ర్యము దాపురించును. దయ చేసి ఇక ఎప్పుడును ఈ రీతిగా పెట్టకుడు" అనెను.

అంత శ్రీరామకృష్ణుడు ఒక రిద్దఱు భక్తులతో కూడి దక్షిణేశ్వరమునకు బయలుదేఱెను.



## ఏడవ ప్రకరణము

# పండిత శశధరుడు

1884-వ సంవత్సరము, ఫెబ్రువరి తే 2 ది శనివారము.

అప్పటికి మధ్యాహ్నానంతరము మూడు గంటలు ఐనవి. రాఖాలు మహిమచరణ్ హాజ్రా మొదలయిన భక్తులతో శ్రీరామకృష్ణుడు సంభాషించుచుండెను. మహేంద్రుడు అప్పుడే గదిలో ప్రవేశించి గురుదేవునకు ప్రణమిల్లెను. గురుదేవుని గాయపడిన చేతికి కట్టు కట్టుటకై మహేంద్రుడు తనతో ఒక కొయ్యబద్దను చిన్న సన్న మొత్తను కొంత నారపీచును తెచ్చి ఉండెను.

కొన్నాళ్ల క్రింద శ్రీరామకృష్ణుడు దేవదారువనమునొద్దకు పోవుచుండి గ్రాదియొద్ద జారిపడెను. ఆయన యెడమచేతి యెముక కదలిపోయెను. ఆ సమయమున ఆయన పరవశ దశయందు ఉండెను. ఆయన వెంబడిని ఎవరును లేకుండిరి.

గురుదేవుడు:—(మహిమునితో) మరి నేను యంత్రమును, దేవుడు యంత్రచాలకుడును అగుదుమేని, నాకు ఇట్టి అనుభవము సంభవింప నేల?

పసిబాలునివలె ఏడ్చుచు గురుదేవుడు "ఓ బ్రహ్మమయీ, మాతా, ఏల నాకు ఇట్లు చేసితివి? నా చేతికి పెద్ద దెబ్బ తగిలినదే!" అని శోకమూర్తితో మొఱపెట్టుకొని భక్తులను "ఇది నయమగునా?" అని అడిగెను. "తప్పక నయము అగును, మీరు మునుపటివలె హాయిగ ఉందురు" అని వారు ఆయనను శిశువును ఓదార్చినట్లు ఓదార్చిరి.

గురుదేవుడు:—(రాఖాలుతో) నన్ను విచారించుకొనుట కనియే నీవు ఇచ్చట ఉన్నను, ఇది ఇట్లు జరిగినందులకు బాధ్యత నీది

కానే కాదు. ఏల యన నీవు నా వెంబడినే వచ్చి యున్నను గ్రాద్దివ
వఱకు వచ్చి యుండవు.

గురుదేవుడు మరల జ్ఞానదశలో మునిగి ఇట్లు అనెను—"ఓం ఓం ఓం జననీ, నేను చెప్పుచున్నదిఏమి? అమ్మా, నాకు బ్రహ్మజ్ఞానము ఒసంగి నన్ను స్మృతిరహితునిగ జేయకుము. నాకు బ్రహ్మజ్ఞానము ఈయకుము. నేను నీ బిడ్డనే కదా! నాకు మనోవ్యథలును భయము లును అల్పకారణాలకే కలుగుచుండును. నాకు కావలసినది అమ్మ. బ్రహ్మజ్ఞానమునకు ఒక కోటి నమస్కారాలు. ఓ ఆనందమయీ, దానిని కోరినవారికి ఇమ్ము."

'ఆనందమయీ' అని బిగ్గరగా ఉచ్చరించుచు ఆయన అశ్రు పూర్ణనయనుడై ఇట్లు అనెను:—

అమ్మ నీవు నాకు జనని వై వెలసితి,
నేను మెలఁకువ గలిగియే యిప్పు నుంటి,
నట్టు లయ్యును నా యింట నౌర! దొంగ
తనము జరిగినందులకె నా తాప మింత ॥

జగజ్జననితో ఆయన మరల ఇట్లు అనెను: 'అమ్మా, నేను ఏమి తప్పు చేసితిని? దేనికైనను సరే, కర్తను నేనా? అమ్మా, అన్నిటికిని కర్త్రివి నీవు. నేను యంత్రమను, యంత్రచాలకురాలవు నీవు.'

బాధపడుచున్నను ఒక్కొక్కప్పుడు దానిని మఱచి నవ్వుచు ఆడుకొనుచుండు శిశువువలె గురుదేవుడును మాటిమాటికిని మా టాడుచును నవ్వుచును ఉండెను.

గురుదేవుడు :—[భక్తులతో] సచ్చిదానందమును సాధించు కొనకున్నచో మీకు ఏమియు లాభము లేదు. త్యాగవైరాగ్యాలను పోలినది వేఱు ఏమియును లేదు. ఐహికపదుని భగవద్భక్తి ఎఱ్ఱగ కాలిన పెనముమీది నీటిచుక్కవలె క్షణికము. ఒక పుష్పమును

చూచినప్పుడు సైతము అతడు "ఆహా, ఎంత వింత యైన దైవ సృష్టి" అని అబ్బురపడు నేమో!

దేవునికొఱకై తహతహ పడ వలయును. దేవునికొఱకై మీరు తహతహపడిన మీ ప్రార్థనలకు ఆయన తప్పక చెవి యొగ్గును. ఆయన మనలను కన్న తండ్రి కావున ఆయనయొద్దనుండి మనకు సంక్రమింప వలసిన సొత్తు మీద మనకు హక్కు గలదు. మన సొంత తండ్రియు ఆయనయే, తల్లియు ఆయనయే. మన కోర్కెలను తీర్చు మని మనము ఆయనను నిర్బంధింప వచ్చును. "నాకు దర్శన మొసంగుము, ఒసంగ వేని కత్తితో నా తలను తెగగొట్టుకొందును" అని దేవునితో చెప్ప వచ్చును.

లోకమాతను ఆవాహన చేయు పద్ధతిని శ్రీరామకృష్ణుడు భక్తులకు బోధించెను.

గురుదేవుడు:—నేను అమ్మవారిని ఇట్లు ప్రార్థించెడి వాడను— "జననీ, ఆనందమయీ, దర్శనము ఒసంగుము. ఒసంగక తప్పదు" అని. "ఓ విశ్వేశ్వరీ, ఓ దీనజనప్రభ్వీణీ, నిజముగ నేను నీ యేలు బడిలో ఉన్న విశ్వమునకు వెలి యైన వాడను గాను. నాకు జ్ఞానము లేదు, భక్తి లేదు, ఎట్టి శిక్షణమును లేదు, నేను ఏమియు ఎఱుగను, నీవు కనికరించి దర్శనము ఒసంగ వలయును" అనియు ఆమెతో మొఱ ఇడు చుందును.

గురుదేవుడు ఈ విధముగ ప్రార్థనాపద్ధతులను భక్తులకు నేర్పెను. వారి హృదయములు కరగినవి. మహిమాచరణుని నేత్రములు అశ్రుపూర్ణములు అయ్యెను.

శివపురమునుండి భక్తులు అనేకులు అరుదెంచిరి. వారు చాల దూరమునుండి వచ్చిన వారు అగుటచేత గురుదేవుడు వారికి ఆశా భంగమును కూర్చ నేర డయ్యెను. ఆధ్యాత్మిక జీవి తావశ్యకము లలో కొన్నింటిని ఆయన వారికి బోధించెను.

సాయంకాలము ఐదుగంట లప్పటికి వైద్యుడు మధుసూదనుడు అరుదెంచెను. గురుదేవుని చేతికి కట్టు కట్టుటకు వైద్యుడు ఆయత్త పడెను. నేలపై పడక యొకటి పఱవ బడెను. గురుదేవుడు నవ్వుచు దానిపై పరుండెను. చేతికి కట్టుకట్టుట ముగిసిన వెంటనే గురుదేవుడు "కలకత్తావైద్యులందు నాకు ఎక్కువ నమ్మకము లేదు. శంభువునకు జన్ని వచ్చిన తర్వాత గూడ 'ఏమియు లేదు, ఇది మంచు మైకమే' అని అన్నాడు వైద్యుడు సర్వాధికారి. కొంతసేపు దాటగనే శంభు వేమో మరణింపనే మరణించినాడు" అనెను.

సాయంకాల మైనది. ఆలయములలో సాయంపూజ ముగి సినది. కొన్ని నిమిషములకు పిమ్మట గురుదేవుని దర్శించుటకై అధా రుడు కలకత్తానుండి అరుదెంచెను. మహిమచరణుడును రాఖాలును మహేంద్రుడును గూడ గదియందు ఉండిరి.

ఆధారుడు:—ఎట్లు ఉన్నారు ?

గురుదేవుడు:—[అనురాగముతో] చూడుము నాచేతికి ఎంత దెబ్బ తగిలినదో. [చిఱునవ్వునవ్వుచు] 'ఎట్లున్నారు' అని నన్ను మీరు అడుగుట అనవసరము.

ఆధారుడు భక్తులతో నేలమీద కూర్చుండెను. "ఇచ్చట మెల్లగ తట్టుము" అని గురుదేవుడు తన పాదములను చూపెను. ఆధారుడు మంచముకొసన కూర్చుండి శ్రీరామకృష్ణుని పాదములను ఆప్యాయముగ నిమురు చుండెను.

గురుదేవుడు మహిమచరణునితో సంభాషణ సాగించెను.

గురుదేవుడు:—దేవునందు నీవు నిస్స్వార్థప్రేమను అలవఱచు కొందు వేని అది చాల మంచిది. అట్టి ప్రేమ గల వాడు "దేవా, నాకు మోక్షము అక్కఱ లేదు, కీర్తి అక్కఱ లేదు, సిరిసంపదలు అక్కఱ లేదు, ఆరోగ్యము అక్కఱ లేదు. వీనిలో ఏదియు నాకు అక్కఱ లేదు, నాకు కావలసినది నీవే" — అని పల్కును. ఒక

సంపన్నునియొద్దకు ఏ వేవో కోరికలతో ప్రజలు అనేకులు వచ్చు చుందురు. కాని ఎవ డైన ఒకడు ఎట్టిప్రతిఫలమును అపేక్షింపక కేవలము ప్రేమచేతనే వచ్చు నేని అట్టివాడు సంపన్నుని డెందమును దక్కగొనును.

మహిమచరణుడు మౌనముగ కూర్చుండెను. గురుదేవుడు అతని వైపే తిరిగి యుండెను.

గురుదేవుడు:—ఇప్పటి నీ మనఃపరిస్థితికి అనుకూలముగ ఉండు ఒక విషయమును చెప్పుదునా ? ప్రతిజీవుడును ఆత్మస్వరూపయాథార్థ్యమును ఎఱుంగ వలయును అని వేదాంతము చెప్పుచున్నది. కాని అహంకారమును పరిత్యజింపనిదే, అట్టి జ్ఞానము సుప్రాప్యము కాదు. నీటిని రెండుగ విభజించుచున్నట్లు ఉన్న కట్టెను పోలినది అహంకారము. నీవు వేఱు, నేను వేఱు అనిపించునది ఆ యహంకారమే. సమాధిదశలో అహంకారము అంతరించు నపుడు సాధకుడు తన యందు ఉన్నట్టి చైతన్యమే బ్రహ్మము అని తెలిసికొనును.

కామినుల విషయమున అతిమాత్ర మైన జాగరూకత వహింపని వాడు బ్రహ్మజ్ఞానమును పొంద లేడు. కావున సంసారులకు బ్రహ్మజ్ఞానలబ్ధి దుష్కరము. పొగమసి నిండి ఉన్న గదిలో నీవు ఎంత మెలకువ గలిగి ఉన్నప్పటికిని, మసి నీ యొడలికి అంటుకొనక పోదు. యువతుల సంపర్కము విరక్తులచిత్తమునందు సైతము, కామమును రేచును.

సన్న్యాసి యైన వాడు కామినీకాంచనములు అనెడి ఉభయమును విడిచి పెట్ట వలయును. ఆడుదాని ప్రతికృతిని సైతము ఎట్లు చూడ రాదో అట్లే కాంచనమును అనగా ధనమును స్పృశింప నైన కూడదు. ధనమును తన సమీపమున ఉండ నిచ్చుట గూడ అతనికి చెఱుపే. ఏల అన ధనము ఎచ్చట ఉన్నదో అచ్చటికి లాభనష్టముల లెక్కలును, మనోవ్యథలును, గర్వమును, ఆగ్రహమును ఇంకను అట్టి దోషములు అన్నియు వచ్చి చేరును. ఇందులకు తార్కాణము

సూర్యుని విషయమున కలదు. సూర్యుడు మహోజ్జ్వలుడై ప్రకాశించుచుండును. తటాలున మేఘము ఒకటి వచ్చి అతనిని మఱుఁగు పఱచును.

సన్న్యాసికి ఈ కఠిన నియమాలు ఎందులకు? ఆత్మశ్రేయము నకును జగద్ధితమునకును. సన్న్యాసి తనవఱకు తాను సంగరహితుడై ఉండ వచ్చును. కామోద్రేకములను అణంచుకొని ఉండ వచ్చును. కాని లోకులకు ఒక ఆదర్శమును వెలయించుటకై అతడు కామినీ కాంచనములను పూర్తిగ విడువ వలయును.

సన్న్యాసులలో త్యాగశీలము నూటికి నూఱు వంతులు అగపడు నేని లౌకిక మానవునకును త్యాగమును అలవఱచుకొను ధైర్యము కలుగును. అప్పటికి గాని అతడు కామినీకాంచనముల విడువ ప్రయత్నింపడు. ఇందులకు ఆదర్శమును సన్న్యాసి కాన వాడు ఏర్పఱుప కున్న వేఱు ఎవరు ఏర్పఱుతురు?

అప్పుడు రాత్రి ఎనిమిదిగంటలు ఐనవి. శాస్త్రగ్రంథముల నుండి కొన్ని శ్లోకముల చదువు మని శ్రీరామకృష్ణుడు మహిమ చరణుని గోరెను. మహిమచరణుడు పరమాత్మస్వరూపమును నిర్వచించునట్టి ఉత్తరగీతలోని ప్రథమ శ్లోకమును జదివెను.

*ఏకమును నిష్కళంబు నై యెసఁగు చుండు
బ్రహ్మ మది వ్యోమమునకంటెఁ బరము, మఱియు
నప్రతర్క్య మవిజ్ఞేయ, మరయ జన్మ
మరణములు లేని యట్టిది, మాన్యచరిత ॥

కడపట అతడు మూడవ అధ్యాయములోని ఏడవ శ్లోకమును జదివెను.

---

* య దేకం నిష్కళం బ్రహ్మ
వ్యోమాతీతం నిరఞ్జనమ్
అప్రతర్క్య మవిజ్ఞేయం
వినాశోత్పత్తి వర్జితమ్॥

‡పితృషూర్ధ్వతుని రూపున విప్రవరులు
దేవుఁ బూజింత్రు, మానులు దీక్షతోడఁ
దమదమ హృదయంబులందునె తలఁచుచుంద్రు;
అల్ప మా మేధ గల వార లతని విగ్ర
హంబులం బూజ సల్పుదు; రవ్యయాత్ము
నెల్లెడలఁ గంద్రు సమదృష్టి నెసఁగు యతులు ॥

'సమదృష్టి నెసఁగు యతులు' అను మాటలు వినగనే గురుదేవుడు కట్టుకట్టబడియున్న చేతితోనే లేచి నిలంబడి సమాధినిమగ్నుడు అయ్యెను. స్వయముగ సమదృష్టిని సాధించిన యీ యోగిపుంగవుని వైపు భక్తులు నోరాడక తదేక దృష్టితో జూచుచుండిరి.

చాల సేపటికి గురుదేవుడు మరల బాహ్య లోక స్మృతిని బడసి కూర్చుండెను. మహిముడు యతిపంచకమునుండి యీ క్రింది వాక్యములను చదివెను :—

"నేను ఆమెనే, లోకమాతనే. చేత నాచేత నాత్మక మయిన యీ విశ్వము అనెడి మాయ ఇంద్రజాలమునందుం బోలె ఆమెయందు కన నగును. ఈ విశ్వము ఆమె మనఃక్రీడయే కావున ఆమెయందు వెలుగొందును. ఆమె చైతన్యస్వరూపిణి, జగదాత్మ, కేవల సచ్చిదానంద రూపిణి, ఆమెయే నేను!"

చైతన్యస్వరూపిణి అయిన ఆమెయే నేను అనెడి మాటలు వినగనే గురుదేవుడు చిఱునవ్వు నవ్వి సూక్ష్మప్రపంచమున ఏ మేమి గలదో మహాప్రపంచమున గూడ అది అంతయు ఉండనే ఉన్నది.

---

‡ అగ్ని ర్దేవో ద్విజాతీనాం,
మునీనాం హృది దైవతమ్,
ప్రతిమా స్వల్పబుద్ధీనాం
సర్వత్ర సమదర్శినామ్ ॥

మహిముడు ఓంకారవర్ణనమును చదివెను :—

*తైలధారను బోలి సంతత మయినది
నిడుద ఘంటా రవంబుఁ బోనిదియు నగును.

సమాధి లక్షణములను గూర్చి ఇట్లు చదివెను :— 'సమాధి దశయందు నెలకొన్న వానికి ఊర్ధ్వభాగము ఆత్మమయముగ కనబడును. అధోభాగము ఆత్మమయముగ కనబడును. మధ్యభాగమును ఆత్మమయముగనే కనబడును, సమస్తమును ఆత్మమయముగనే ఆతనికి కనబడును.'

ఆధారుడును మహిముడును గురుదేవునకు ప్రణమిల్లి వీడ్కొనిరి.

1884 వ సంవత్సరము ఫెబ్రువరి తే 24 ది భానువారము.

మధ్యాహ్న భోజనానంతరము శ్రీరామకృష్ణుడు తన గదిలో విశ్రమించి ఉండెను. మణిమల్లిక్ ఆయన ప్రక్కనే నేలపై కూర్చుండి ఉండెను. అప్పుడే మహేంద్రుడును అరుదెంచి గురుదేవునకు ప్రణమిల్లి మణి పార్శ్వమున గూర్చుండెను. గురుదేవుని గాయపడినచేతి కట్టు అట్లే ఉండెను.

గురుదేవుడు:— (మహేంద్రునితో) ఏవిధముగ వచ్చితివి?

మహేంద్రుడు:— ఆలంబాజారువఱకు బండిలో వచ్చితిని, అక్కడ నుండి నడచి వచ్చితిని.

మణిలాల్:—అబ్బా! చాల చెట్టపడి ఉన్నాడే.

గురుదేవుడు:—(చిఱునవ్వుతో) వీనిని అన్నిటిని బట్టి చూడగా ఇవి అన్నియు నాబుఱ్ఱలోని వెఱ్ఱిభ్రాంతులు కావు అని తెలియు

* తైలధారా మి వాచ్ఛిన్నం
దీర్ఘ ఘణ్టా నినాద వత్ ॥

చున్నది. లేకున్న ఈ యింగ్లీషువారు* ఇంత శ్రమపడి ఇచ్చటికి ఏల రా వలయును?

శ్రీరామకృష్ణుడు తన యారోగ్యమును గుఱించియు, చేతి గాయమును గుఱించియు వారితో ప్రసంగింప దొడంగెను.

గురుదేవుడు:—అప్పు డప్పుడు ఈ చేతి విషయములో నేను ఓర్పు లేని వాడ నగు చున్నాను. అగపడిన వాని కెల్ల ఈ చేతిని జూపి 'ఇది నయ మగునా' అని అడుగుచుందును. ఇందులకు రాఖాలు ఆగ్రహించుచుండును. నా మనఃపరిస్థితిని అతడు అర్థముచేసికొనడు. అతడు ఎక్కడి కైనను పోసీ అని నేనుకూడ నాలో అప్పు డప్పుడు అనుకొనుచుందును. కాని వెనువెంటనే లోకజననితో 'అమ్మా, అతడు ఎక్కడికి పోవును? ఈ లోకము అనెడి కాగుచున్న పెనము నందు అతడు ఏల మాడిపో వలెను' అనుచుందును.

శిశుసహజ మైన యీ తొందరపాటు నాకు క్రొత్త గాదు. నా నాడిని జూచి నాకు ఏ మైన వ్యాధి ఉన్నదా లేదా చెప్పు మని నేను మథుర్‌బాబును అడుగుచుండెడి వాడను. [మహేంద్రునితో] నాకు ఇంతటి తొందరపాటు ఏల? నీవు చెప్ప గలవా?

మహేంద్రుడు:—స్వామీ, తను మనస్సు సదా సమాధి యందు మునిగియుండును, మీ భక్తుల క్షేమమునకై మీ మనస్సులో ఒకభాగమును మాత్రము దేహముపై ఉంచి ఉన్నారు. మీరు అప్పు డప్పుడు మీ శరీర సుస్థితికై త్వరపడుటకు కారణము అది.

గురుదేవుడు:— నిజమే. నా మనస్సులో ఒక భాగము దేహమునందు సంగము గలిగి ఉన్నది. కావుననే భగవత్ప్రేమను భక్తులసంగమమును అనుభవింప వలె అని ఆశపడుచున్నది.

---

* పాశ్చాత్యులనే కాక తమ చిత్తవృత్తులచే పాశ్చాత్యీకృతు లైన భారతీయులనుగూడ శ్రీరామకృష్ణుడు ఈ పేర వ్యవహరించెడివాడు.

మణిమల్లిక్ కలకత్తాలో జరుగుచున్న వస్తుప్రదర్శనము [ఎక్సిబిషను]ను గుఱించి గురుదేవునకు దెలిపెను.

మణిలాల్:— మీకు అనారోగ్యము లేకుండిన మైదాన మందలి యీ వస్తుప్రదర్శనమును జూచి యుండ వచ్చును.

గురుదేవుడు:—[మహేంద్రాదులతో] నేను వచ్చినను అన్ని వస్తువులను జూడగలిగి యుండను. ఏదో ఒకవస్తువును జూచిన వెంటనే నాకు పరవశదశ గలుగ వచ్చును. అప్పుడు తక్కిన వస్తువులను నేను జూడ గలిగి ఉండను. ఒక సారి నన్ను జంతుశాస్త్రోద్యానము [జువలాజికల్ గార్డను] నకు పిలుచుకొని పోయిరి. సింహమును జూచిన తత్క్షణమే నేను సమాధిలో మునిగితిని. ఏల యన ఆ జగన్మాతృ వాహనము సాక్షాత్ జగన్మాతనే నా తలంపునకు దెచ్చెను. అట్టి దశలో తక్కిన మృగములను ఎవరు చూడ గలరు? సింహమును మాత్రము జూచితిని. వెంటనే నేను ఇంటికి మరల వలసిన వాడనైతిని. కావుననే యదుమల్లిక్ వారి తల్లి మొదట నన్ను ప్రదర్శనమునకు బొమ్మన్నను తర్వాత వలదు అనెను.

మణి మల్లిక్కునకు వయస్సు సుమారు అఱువదియైదు సంవత్సరములు ఉండును. అతడు పెక్కు ఏండ్లుగ బ్రాహ్మసమాజమున సభ్యుడుగ ఉన్నాడు. అతని మనఃప్రవణతలకు అనురూపములైన బోధనలనే అతనికి శ్రీరామకృష్ణుడు చేసెను.

గురుదేవుడు:— జయనారాయణ పండితుడు ఉదారాశయములు గలిగి ఉండెను. నేనొకసారి ఆయనను దర్శించితిని. ఆయన వైఖరి నాకు నచ్చినది. కాశికి పోయి అచ్చట వసించు ఉద్దేశ్యము తనకు ఉన్నది అని ఆయన నాతో చెప్పి ఉన్నాడు. ఆ యుద్దేశ్యమును ఆయన నెఱవేర్చుకొన్నాడు. తుది దినములలో ఆయన కాశిలోనే వసించినాడు. అచ్చటనే మరణించినాడు. జయనారాయణుని వలెనే అందఱును వృద్ధులైనప్పుడు తక్కిన పనులనుండి విరామము

నొంది, భగవచ్చింతనమందే కాలమును గడప వలెను. నీవు ఏమందువు?

మణిలాల్:—స్వామీ, నిజమే, ఈలోకములోని చిక్కులును వ్యథలును నాకు రుచింపనే రుచింపవు.

గురుదేవుడు:—[మణిలాలుతో] నీ చిన్న కథ ఒకటి ఉన్నది కదా? దయచేసి దానిని వీరికి వినిపింపుమా.

మణిలాల్:—[చిఱునవ్వుతో] — ఒకప్పుడు ఒకపడవ నెక్కి చాలమంది మనుష్యులు గంగను దాటుచుండిరి. వారిలో ఒక పండితుడు ఉండెను. వేదములను వేదాంతమును షడ్దర్శనములను ఇంకను వివిధగ్రంథములను తాను చదివితిని అని చెప్పుచు అతడు తన పాండిత్యమును అపరిమితముగ ప్రదర్శించుచుండెను. అతడు మఱియొక ప్రయాణికుని 'నీకు వేదాంతము తెలియునా?' అని అడిగెను. 'తెలియదు స్వామీ'. 'సాంఖ్యమును యోగమును తెలియునా?' 'తెలియవు స్వామీ'. 'నీవు ఏశాస్త్రమునే చదువ లేదా?' 'లేదు స్వామీ'. ఆ పండితుడు ఈలాగు డంబములు వాగుచునే ఉండెను. ప్రయాణికుడు మాత్రము మౌనముగనే కూర్చుండియుండెను. తటాలున ఒక పెను తుపాను వీవ ఆరంభించెను. పడవ మునిగిపోవుటకు సిద్ధముగ ఉండినది. అప్పుడు ఆ ప్రయాణికుడు పండితుని 'స్వామీ, తమకు ఈత వచ్చునా' అని అడిగెను. పండితుడు — 'ఈత నాకు రాదే' అనెను. ప్రయాణికుడు 'నాకు సాంఖ్యము గాని పాతంజలము గాని తెలియదు, ఈతమాత్రము నాకు చేత వచ్చును' అనెను.

గురుదేవుడు:—[చిఱునవ్వుతో]— అనేకశాస్త్రాలను తెలిసికొన్నంత మాత్రాన మానవునకు ఏమి లాభము? సంసారసింధువును ఎట్లు దాట వలెనో అది ఒక్కటే తప్పక తెలిసికోవలసిన విషయము. దేవుడు ఒక్కడే తథ్యము, తక్కిన దెల్ల మిథ్య.

అర్జునుడు పక్షికంటికి కేసి తన బాణమును గుఱి పెట్టుచున్నప్పుడు, 'నీకు ఏ మేమి అగపడుచున్నది? ఈ వస్తువులు అన్నియును

అగపడుచున్నవా?' అని ద్రోణుడు అతనిని అడిగినాడట. 'అగపడుటలే' దన్నాడు అర్జునుడు. 'నేను అగపడుచున్నానా?' 'లేదు', 'చెట్టు అగపడుచున్నదా?' 'లేదు'. 'చెట్టుమీది పిట్ట అగపడుచున్నదా?' 'లేదు'. 'మఱి నీకు అగపడుచుండునది ఏది?' 'ఆ పిట్ట కన్ను మాత్రమే.'

పిట్టకంటిని మాత్రము చూచు వాడే ఆ లక్ష్యమును భేదింప గలడు. దేవుడు మాత్రమే సత్యము అనియు, తక్కిన దెల్ల మాయ యనియు ఎవడు గుర్తించునో వాడు ఒక్కడే బుద్ధిమంతుడు. తక్కిన సంగతుల మెఱుక నాకు ఎందులకు?

[మహేంద్రునితో] నా చేతికి దెబ్బ తగిలినది మొదలు నాలో చాల మార్పులు గలిగినవి. ఇప్పుడు నాకు దేవుని 'నరలీల' (=నరుడుగ అవతరించుట) మాత్రమే నిర్వృతిని గలిగించును. పరమసత్యము నకు తెఱగులు రెండు. ఒకటి నిత్యము. మఱియొకటి లీల. నిత్యము (=బ్రహ్మము) అనగా అవిభాజ్య సచ్చిదానందమే. మఱి లీల అనగా ఆట. ఇందులో భగవంతుడుగా ఒక లీల, వేల్పులుగ ఒక లీల, మనుష్యుడుగ ఒక లీల, విశ్వముగా ఒక లీల — ఇవి అన్నియును చేరి ఉన్నవి.

మానవరూపమున భగవంతుడు నిర్వర్తించు లీలయందు విశ్వాసము గలిగిన వాని జ్ఞానమే పరిపూర్ణమైన దని వైష్ణవచరణుడు చెప్పుచుండెడి వాడు. ఆ దినాలలో నేను ఆ యభిప్రాయమును సరి అని ఆమోదించినవాడను గాను. కాని ఆయన సరిగానే చెప్పినాడని ఇప్పుడు తెలిసికొంటిని. మానవప్రతిమలలో కూడ, ఏవి ప్రేమానురాగ ములను బ్రకటించునో ఆ ప్రతిమలపైనే వైష్ణవచరణునకు మోజు.

[మణిలాల్‌తో] మానవరూపమున లీలలను గావించువాడు దేవుడే. మణిమల్లిక్కుగా అగపడుచుండు వాడును దేవుడే. 'నీవే సచ్చిదానందమవు' అనియే శిక్కులు బోధింతురు.

మానవునకు స్వస్వరూపము అప్పు డప్పుడు తళుక్కు మని

కానిపించును. అప్పుడు అతనికి ఆశ్చర్యముచే నోరు ఆడదు. అట్టి సమయములలో అతడు ఆనంద సాగరమున ఈదు లాడును. ప్రాణ బంధువును ఒకనిని తటాలున కలిసికొన్న ఎట్లు ఉండునో అట్లు ఉండును స్వస్వరూపసాక్షాత్కారము.

ప్రజలు కన్యలను పూజింతురే. ఎందులకు? మగువ లందఱును లోకమాతృ ప్రత్యక్ష రూపములే. ఐనను పవిత్రాత్మ లైన కన్య లందు ఆమె విశేషించి కాననగుచుండును.

[మహేంద్రునితో] అనారోగ్యము గలిగి నప్పు డంతయు నే నెందులకు ఆత్రపడుచుండును? ఏల యన లోకజనని నన్ను ఒక శిశు దశయందు ఉంచి యున్నది. శిశువు పూర్తిగా తల్లిపైనే గదా ఆధార పడి యుండును.

నన్ను ఫొటో తీయుటకై రాధాబాజారునకు పిలుచుకొని పోయిరి. ఆ నాడు నేను రాజేంద్రమిత్రుని యింటికి పోవలసినట్లు ఏర్పాటు ఐ యుండెను. కేశవుడు అచ్చట ఉండు నని వింటిని. కొన్ని విషయములను వారికి చెప్ప వలయు నని నేను సిద్ధపఱచుకొని ఉంటిని. కాని రాధాబాజారునకు చేరుకొన్న వెంటనే వాని నన్నిటిని మఱచి పోయితిని. 'ఓ జననీ, నీవే మాటాడుము. చెప్పుటకు నా కే మున్నది?' అంటిని.

జ్ఞానిస్వభావము నాకు లేదు. జ్ఞాని యైన వాడు తాను గొప్ప అనుకొనును. 'ఏమి! వ్యాధి నాకు ఎట్లు వచ్చును?' అని అత డనును.

''ఇంకను మీకు మీ శరీరమును గుఱించిన చింత పో లేదే'' యని ఒకసారి కోర్సింగు నాతో అన్నాడు. కాని తల్లికి సమస్తమును తెలియు నని నమ్ముట నా స్వభావము. రాజేంద్రమిత్రు నింట మా టాడ బోవునది ఆమెయే. అమోఘవాక్కు అనగా ఆమెవాక్కే. వివేకమునకు అధిదేవత ఆమెయే, ఆమెగారి కాంతికిరణము ఒక్కటి చాలును, వేలకొలది పండితులను ఆశ్చర్య స్తబ్ధులనుగా చేయుటకు.

లోకజనని నన్ను ఒక భక్తుని దశలో, విజ్ఞాని దశలో ఉంచి యున్నది. నేను రాఖాలుతోను, ఇతరులతోను తమాషలు చేయు టకు కారణ మదే. నేను జ్ఞానిదశలో ఉండియున్నచో అలాగు చేసి యుండ లేను.

ఈ దశలో, లోకజననియే ఈ సమస్తముగను రూపొందిన దనుట నాకు ప్రత్యక్ష మగు చున్నది. సర్వత్ర నాకు ఆమెయే అగపడుచున్నది. కాళికాలయములో ఆ లోకజననియే సమస్తముగను రూపొందినట్లు నేను కనుగొంటిని. దుర్జనుల రూపమున నున్నది కూడ ఆమెయే.

ఒకనాడు నేను రామలాలుతల్లిని తిట్ట బోయి, నన్ను నేనే నివారించుకోవలసి వచ్చినది. ఆమె నాకు లోకమాతృ ప్రత్యక్ష స్వరూపముగ అగపడినది. నేను కన్యలను ఆరాధించుటకు కూడ కారణ మదే. వారి రూపములలో నాకు లోకజననియే కానిపించును.

1884 వ సంవత్సరము మార్చి తే 2 ది భానువారము.

శ్రీరామకృష్ణుడు తన గదిలోని చిన్నమంచముపై కూర్చుండి బ్రాహ్మసమాజ సభ్యుడైన త్రైలోక్య సన్యాలు పాడుచున్న భక్తిగీత ములను ఆలకించుచుండెను. ఆయన చేతి కింకను కొయ్యబద్ద ప్రాపు ఉండెను. చేతి గాయపు బాధనుండి ఆయన ఇంకను తేఱుకోన లేదు. నరేంద్ర – సురేంద్ర – మహేంద్రాది భక్తులు నేలమీాద కూర్చుండి యుండిరి.

నరేంద్రుని తండ్రి, కలకత్తా హైకోర్టు న్యాయవాది. తటాలున మరణించెను. తన కుటుంబమునకు ఆయన ఎట్టి జీవనాధారమును ఏర్పఱుప లేక పోయెను. కాబట్టి ఆయనకుటుంబమువారు తీవ్ర మైన ఆర్థిక దుఃస్థితి పా లైరి. వారు ఒక్కొక్కప్పుడు పస్తులు సైతము ఉండవలసి వచ్చినది. కావున నరేంద్రునకు దినములు దారుణ మనో వ్యథతో గడచుచుండెను.

త్రైలోక్యుడు ఇట్లు పాడెను :

బ్రతుకుం దెరువున నొంటి నా బాటసారి
నిపుడు రక్షణ కే నెవ నేగఁ గలను ?
దేవ, నీ పాదయుగమునె తెలిసి శరణు.
గొంటి, వీడితి సిగ్గును గొంకుఁ గూడ ;
జాతి వర్ణముల వలన సంభవిల్లు
గర్వ మింకఁ దల యెత్త నీకయ యదెమితి.
నీకొఱకు నేను నరుల చే నింద పడుదు.
వారు నను దూఱుచుందురు పరుసముగను.
నిన్ను ప్రేమించినందుకె నన్ను వారు
ద్వేషమునకుఁ బాలుపఱచి తిట్టు చెల్ల;
నెయ్యుడును గ్రొత్తవారును నిఖిల జనులు
నెపుడు నపకారములె చేసి యేడిపింత్రు.
నా యశము నీదు చేతుల నలరుచుండు
* మంచెదో, స్వామి దానిని ద్రుంచి పైతో
నీదు చిత్తము; దాసుఁడ నేను ; నాదు
గౌరవము పైని నీ దైన గౌరవంబు
నిలిచియుండును ; నా యాత్మ నేత వీవ ;
'ప్రేమ వెల్గు'గ డెందాన వెలయు దీవ ;
నీకు నచ్చినయట్టుల నేలు నన్ను.

త్రైలోక్యునితో గురుదేవుడు "ఆహా! నీ పాటలు హృదయమును ఎంతగా కరగించుచున్నవి. అవి అకృత్రిమములు. సముద్రము నొద్దకు పోయినవారుమాత్రమేకదా ఆ నీటిని తే గలరు" అనెను.

త్రైలోక్యుడు మరల ఇట్లు పాడెను :

ఆట యాడు వాఁడవు నీవె; పాట పాడు
వాఁడవును నీవె; యా పాట పరఁగునప్డు

* మంచెదో = బ్రతికింతువో.

చేతులం దాళములు వేసి చెలఁగు దీవ;
కర్త 'తా' నని భ్రమియించుఁ గడఁగి నరుఁడు
ఇంతకును దాను ప్రేక్షకుఁ: డింత నిజము.
కీలుబొమ్మయె యైనను కేరి నరుఁడు
నీదు సాంగత్యమున నుండు నేని దేవుఁ
డ యగు; యంత్రచాలకుఁడ వీవ; రథము గడ
పునది నీవ; తా స్వాతంత్ర్య మున్న వాఁడ
నని తలంచుచు మానవుఁ డడలుచుండు
దుఃఖభారమునం బ్రుంగి, త్రోయ లేక.
అన్నిటికి మూలకందంబ వగుదు వీవె,
అట్టె మా యాత్మలకు నెల్ల నాత్మ వగుదు;
పరఁగ మా డెందముల నేలు ప్రభుఁడ నీవె;
నీదు నిరవధిక దయయె నెగడు నేని
పరమపాపియె యోగిరా ట్పదము గనును.

పాట ముగిసినది. గురుదేవుడు భక్తులతోడి సంభాషణమున ఆసక్తి వహించెను.

గురుదేవుడు:—భక్తులలో మూడు అంతస్తుల వా రున్నారు. మూడింటను క్రింది యంతస్తు వాడు "దేవుడు అదిగో అక్కడ పైన ఉన్నాడు" అనును. అనగా అతడు ఆకాశమువైపు చూపు నన్న మాట. నడిమియంతస్తు భక్తుడు "దేవుడు అంతర్నియంతయై హృదయమున వసించును" అని చెప్పును. పైయంతస్తు భక్తుడు "దేవుడొక్కడే ఈ సమస్తముగను రూపొందినాడు. మనము చూచునవెల్ల భగవంతుని ప్రత్యక్షరూపములే" అని చెప్పును. "ఔ నౌను. దేవుడు ఈ సమస్తముగను అయినాడు!! ఈకుండయు దేవుడే, ఆలోటాయు దేవుడే" అని చెప్పుచు నరేంద్రుడు నన్ను పరిహాసించెడివాడు. (అందఱును నవ్వుదురు.)

దేవుని సాక్షాత్కరించుకొన్న వానికి వెంటనే అన్ని సంశయములును అంతరించును. దేవుని గుఱించి వినుట వేఱు. ఆయనను చూచుట పూర్తిగ వేఱైన యనుభవము. విన్నంత మాత్రముచేత మానవునకు సమగ్రమైన ప్రత్యయము కుదుర జాలదు. దేవుని ప్రత్యక్షముగ చూచు నేని, మానవుఁడు సమగ్రప్రత్యయమును గాంచును.

భగవత్సాక్షాత్కారము సిద్ధించిన పిమ్మట, నియత పద్ధతిలో ఆరాధించుట ఆగి పోవును. గుడిలో నేను చేయుచుండిన యారాధనము ముగింపునకు వచ్చినది అట్లే. గుడిలో అమ్మవారిని నేను ఆరాధించుచుంటిని. సమస్తమును శుద్ధాత్మమయమే అను సత్యము నాకు తటాలున ప్రదర్శిత మయ్యెను. ఆరాధన పరికరములును, వేదికయు, ద్వారబంధమును అన్నియు శుద్ధాత్మమయములే. మానవులును, తిర్యగ్జంతువులును తక్కిన ప్రాణులును — అన్నియును శుద్ధాత్మమయములే. అంతట వెఱ్ఱివానిం బోలె నేను పువ్వులను నలువైపుల వెదజల్ల దొడంగితిని. అగపడిన దాని నెల్ల ఆరాధించితిని.

ఒకనాడు శివుని పూజించుచు బిల్వదళమును ఆ మూర్తి మకుటముపై సమర్పింప నుంటిని, అప్పుడు తటాలున ఈ విరాట్టు, ఈ విశ్వము శివుడే అను సత్యము నాకు ప్రత్యక్ష మయ్యెను. వెంటనే విగ్రహరూపమున నే జేయుచుండిన శివారాధనము ఆగి పోయెను. తరువాత ఒకనాడు పూవులు గోయుచున్నప్పుడు నాకు పూల తీగలన్నియు పూబంతులుగా (బూకేలుగా) పొడకట్టినవి.

త్రైలోక్యుడు:— ఆహా, భగవంతుని సృష్టి ఎంత సొంపైనది!

గురుదేవుడు:— ఓహో, అది కాదు కాదు. అది నాకు తళుక్కు మని ప్రదర్శితమైనది. అందుంగూర్చి నే నేమియు ఆలోచనలు చేసి యుండ లేదు. ప్రతి లతయు దేవదేవుని విశ్వరూపము నలంకరించి యున్న యొక పూబంతిగ అగపడినది. అంతటితో నేను

పూలంగోయుటను మాని వేసితిని. మానవుల పట్ల గూడ నా దృష్టి అట్లే యుండును. మానవుని జూచి నప్పుడు ఆ రూపున దేవుడే భువిపై సంచరించుచున్నట్లును, అలలపైని దేలుచున్న యొక దిండు వలె నతడు ముందు వెనుకలకు కదలుచున్నట్లును నాకు పొడకట్టు చుండును. అలల వెంబడి దిండును గదలు చుండును. పై కెక్కు-చుండును, క్రిందికి పడు చుండును.

నిజముగ దేహము క్షణభంగురము. దేవుడు మాత్రమే నిజము. దేహము ఈ క్షణములో ఉండును. మఱు క్షణములో ఉండదు. కొన్ని యేండ్లకు మునుపు నేను అజీర్ణవ్యాధితో చాల బాధపడుచుండి నప్పుడు హృదయుడు నన్ను 'వ్యాధిని పోగొట్టు మని లోకజననిని ప్రార్థింపు' మన్నాడు. నా వ్యాధిని ఆమెతో చెప్పుకొనుటకు నేను సిగ్గుపడితిని. జననితో నేను ఇట్లు అంటిని — "అమ్మా ఏషియాటిక్ సొసైటి మ్యూజియములో నేను ఒక అస్థిపంజరమును జూచితిని. దానిని తీగెలతో జుట్టి మానవునిరూపమువలె అగపడునట్లు చేసి యున్నారు. అమ్మా, అట్లే నా దేహమునుగూడ వీడి పోనీయక కొంత సేపు నిలిపితి వేని, నీ నామములను మహిమలను కీర్తించు నవకాశ ముండును."

ఆశలు లేక, దేహము జీవింప లేదు. [చిఱునవ్వు నవ్వుచు] నాకు ఒకటి రెండు కోరికలు ఉండినవి. "అమ్మా, కామినీకాంచనములను పరిత్యజించిన వారి సాంగత్యమును నాకు ప్రసాదింపు" మని జననిని ప్రార్థించితిని. అంతే కాదు, "నీ భక్తులతోను జ్ఞానులతోను కలిసి ఉండు ఆనందమును అనుభవింప వలె నని ఉన్నది. నేను ఇటు అటు సంచరించి అట్టి వారిని దర్శింప వలెను. అందుకై నాకు కొంత బలము నొసంగు" మనియు వేడుకొంటిని. కాని తిరుగాడుటకు వలసిన బలమును ఆమె నాకు ప్రసాదింప లేదు.

త్రైలోక్యుడు :— [చిఱునవ్వు నవ్వుచు] కోరిక లన్నియును తీఱినవా?

గురుదేవుడు :— [చిఱునవ్వు నవ్వుచునే] లేదు. ఇంకను కొన్ని కోరికలు మిగిలి యున్నవి.

దేహము నిజముగ అశాశ్వతము. నా చేయి విఱిగి నప్పుడు "అమ్మా, ఇది నాకు చాల నొప్పిని గలిగించుచున్న" దని నేను లోకజననితో చెప్పుకొంటిని. వెంటనే ఆమె నాకు ఒక బండిని, దానిని తోలు వానిని చూపినది. అట నట కొన్ని మరలు సడలి ఉండినవి. బండిని తోలువాడు త్రిప్పిన ట్లెల్ల బండి తిరుగు చుండెను. దానికి స్వశక్తి ఏమియు లేదు.

ఇక నాకు దేహము విషయమున ఇంత అక్కఱ ఎందులకు? భగవ దనుభవమున కే, భగవన్నామములను త న్మహిమలను కీర్తించు ట కే, భగవ ద్భక్తులను జ్ఞానులను దర్శింప నేగుట కే.

న రేంద్రుడు గురుదేవు నెదుట నేలపై కూర్చుండి ఉండెను.

గురుదేవుడు :— [త్రైలోక్యాది భక్తులతో] శారీరసుఖదుఃఖ ములు అనివార్యములు. ఈ న రేంద్రుని జూడుడు. ఇతని తండ్రి మరణించినాడు పాపము, ఇతని యింటి వా రందఱు తీవ్ర కష్టముల పా లయినారు. తప్పించుకొనుటకు ఇతనికి దారి లేదు. దేవుడు మానవుని ఒకప్పుడు సుఖానుభవములకును ఒకప్పుడు కష్టానుభవ ములకును పాల్పఱచు చుండును.

త్రైలోక్యుడు :— స్వామీ, న రేంద్రునకు దైవానుగ్రహము తప్పక కలుగును.

గురుదేవుడు :— [చిఱునవ్వుతో] కలుగును స రే, మఱి, ఎప్పుడు? ఒకప్పుడు హృదయుడు శంభుమల్లిక్కును కొంత పైకము అడిగెను. అట్టి విషయములలో శంభుని యభిప్రాయములు 'ఇంగ్లీషు వారి' కున్న యభిప్రాయము లే. అతడు హృదయునితో "నీకు నేను పైకము ఎందులకు ఈయ వలయును? పాటుపడి నీవు నీ జీవికను గడించుకొను శక్తి గల వాడవే. ఇప్పుడుకూడ నీవు కొంత సంపాదించు

చునే ఉన్నావు. నిజుపేద యైన వాని సంగతి వేఱు. ఏ గ్రుడ్డివానికో, కుంటివానికో చేసిన ధర్మ మయిననే అది సార్థక మగును" అని చెప్పినాడు. అందులకు హృదయుడు ఇట్లనెను : "అయ్యా, అట్లన కుము. మీ పైకము నాకక్కఱ లేదు. దేవుని ధర్మాన నేను గ్రుడ్డిగనో కుంటిగనో నిజుపేదగనో ఉంటె కుండును గాక. నీవు నాకు ఈయను అక్కఱ లేదు. నేను తీసికొనను అక్కఱ లేదు."

దేవుడు నరేంద్రుని విషయమున కనికరింప నందులకు వ్యథ చెంది గురుదేవుడు ఇట్లు మాటాడుచున్నాడు కాబోలును అనిపించెను. ఆయన అప్పుడప్పుడు తన ప్రియశిష్యునివైపు సానురాగము లైన వీక్షణములను పఱపుచుండెను.

నరేంద్రుడు :— నేనిప్పుడు నాస్తికుల యభిప్రాయములను పరిశీలించుచున్నాను.

గురుదేవుడు:— రెండు వాదము లున్నవి. ఒకటి ఆస్తిక వాదము, రెండవది నాస్తికవాదము. నీవు మొదటివాని నేల యంగీక రింపవు ?

సురేంద్రుడు:— దేవుడు ధర్మబద్ధుడే. తనభక్తులను కాపాడక ఆయనకు తప్పదు.

గురుదేవుడు:— పూర్వజన్మమున దానములు చేసిన వారికి ఈజన్మమున ధనము లభించు నని శాస్త్రములు చెప్పుచున్నవి. కాని నిజము చెప్ప వలెనన్నచో ఈ జగము దేవుని మాయ. ఈ మాయా రాజ్యమున కలవరపెట్టు విషయము లెన్నో యున్నవి. అవి ఎవరికిని అర్థము కావు.

వేదములలో శుద్ధాత్మ యని వర్ణింపబడిన పరమాత్మ సుమేరు పర్వతమువలె నిర్వికల్ప మనియు, సంగ రహిత మనియు ఖేదమోద ముల కతీత మైన దనియు — ఈ విషయమును నాకు దేవుడు ప్రత్య క్షముగ చూపినాడు. దేవుని మాయ యైన ఈ జగమున కలవరము

ఎంతో యున్నది. దేనికి తర్వాత ఏది వచ్చునో, దేనికి ఏది కారణమవో, నిర్ణయించి చెప్పుటకు ప్రమాణము లేదు.

1884 వ సంవత్సరము ఏప్రిలు తే 5 ది శనివారము.

ఉదయము ఎనిమిది గంట లప్పటికి మహేంద్రుడు గుడితోట యొద్దకు వచ్చి చేరెను. చేరి చూడగా శ్రీరామకృష్ణుడు తన గది లోని చిన్న మంచముపై కూర్చుండి ఉండెను. భక్తులు కొందఱు నేలపై కూర్చుండిరి. గురుదేవుడు వారితో సంభాషించుచుండెను. ప్రాణకృష్ణముఖర్జీకూడ అక్కడ నుండెను.

ప్రాణకృష్ణుడు ఒక సంపన్న కుటుంబమునకు చెందిన వాడు. ఉత్తరకలకత్తాలో అతని వాసము. ఆంగ్లేయుల వ్యాపారసంస్థ యొక దానిలో అతడు గొప్ప పదవిలో నుండెను. అతనికి శ్రీరామకృష్ణునం దుండిన భక్తి అతిమాత్ర మైనది. గృహస్థు డైనప్పటికిని అతనికి వేదాంతశాస్త్రశోధనలందు అత్యంతప్రీతి. అతడు గుడితోటకు తఱచు వచ్చుచుండెడివాడు. ఒకసారి అతడు గురుదేవుని కలకత్తాలోని తన యింటికి ఆహ్వానించి మహోత్సవము చేసెను. ప్రతిదినమును వేకువనే అతడు పవిత్ర గంగానదిలో స్నానము చేయును. వీలైనప్పు డెల్ల బాడిగ నిచ్చి పల్లెపడవలో దక్షిణేశ్వరమునకు వచ్చుచుండును.

ప్రాణకృష్ణుడు:—స్వామీ, తను త్యాగానంతరము జీవిత స్వరూప మెట్లుండును?

గురుదేవుడు:—ఇదే ప్రశ్నను కేశవసేను కూడ అడిగెను. మానవుడు జ్ఞానవిహీనుడుగా నున్నంతకాలము, అనగా అతనికి బ్రహ్మ సాక్షాత్కారము కలుగ నంత వఱకు, జన్మము అనివార్యమే. జ్ఞాన ప్రాప్తి అయిన వెంటనే ఇక నతనికి భువి నవతరింప నక్కఱ లేదు. వేఱులోకముల కేగ వలసిన యక్కఱకూడ లేదు.

భాండములు ఎండుటకై కుమ్మరివాడు వానిని ఎండలో పెట్టును. వానిలో కాల్పబడినవియు కలవు. కాల్పబడనివియు కలవు. నీవు

చూడ లేదా? ఏదైన ఒక మూవు వానిని ద్రొక్కుచు నడుచునేని వానిలో కొన్ని కుండలు తుత్తునియలుగా పగిలి పోవును. కాల్చబడిన కుండల పెంకులను కుమ్మరి పాఱ వేయును. ఏల యన అవి ఇక నతనికి ఉపయోగపడవు. కాల్చబడని కుండలు పగిలినచో వాని నతడు సేకరించును. వానిని మరల నొక మట్టి ముద్దగ ప్రోగుచేసి అం దుండి క్రొత్తకుండలను చేయును. అదే విధముగా భగవత్సాక్షాత్కారము నొందని మనుజుడు మరలమరల ఆ బ్రహ్మాండ భాండాగారుని చేతికి వచ్చుచుండును. అనగా అతనికి జన్మపరంపరలు సాగుచునే ఉండును.

ఉడికిన బియ్యపు గింజను పొలములో నాటిన ఏమి ప్రయోజనము! దానినుండి మొలక మొలవనే మొలవదు. అదే విధముగ మానవుడు జ్ఞానాగ్నియందు పచన మొందు నేని పునస్సృష్టి కతడు ఉపయోగించుకొనబడడు. అతడు ముక్తి గాంచిన వాడే.

భక్తుడును భగవంతుడును వేఱు వే అని పురాణములు చెప్పుచున్నవి. 'నే' నొకడను, 'నీవు' వే ఱొకడవు. ఈ దేహము ఒక తట్ట వంటిది. ఇందులో మనోబుద్ధ్యహంకారము లనెడి నీళ్లు ఉన్నవి. కావున భక్తునకు దివ్య స్వరూపము కాన నగును.

బ్రహ్మ మొక్కటే సత్య మనియు, తక్కిన దెల్ల మాయ యనియు, స్వప్న తుల్య మనియు, అసార మనియు వేదాంతము చెప్పుచున్నది. అహంకారము ఒక గడను పోలి సచ్చిదానందసాగరముపై నడ్డముగ పడి యున్నది. (మహేంద్రునితో) నేను చెప్పుచున్న దానిని వినుము. ఈ యహంకారము తొలగి నపుడు అఖండ సచ్చిదానంద సాగర మొక్కటే మిగులును. కాని అహంకారయష్టి యున్నంత సేపును రెండు భాగము లున్నట్లు అగపడుచుండును — ఒకభాగ మిటు వైపు, ఒకభాగ మటు వైపు. బ్రహ్మజ్ఞానమును ప్రాపించిన వాడు సమాధిలో నెలకొనును. అహంకార మంత రించును.

కాని శంకరాచార్యులవారు లోకోపదేశమును నిర్వహించుటకై *జ్ఞానాహంకారమును నిలుపుకొనిరి. (ప్రాణకృష్ణునితో) కాని జ్ఞానికి విశేష లక్షణములు కలవు. కొందఱు తమకు జ్ఞాన మున్నదను కొనుచుందురు. జ్ఞాన లక్షణము లేవి? జ్ఞాని యైన వాడు ఎవరినిగాని హింసింపడు. అతడు ఒక శిశువువంటి వాడగును.

కాలి పోయి నేలపై బడియున్న దారము, దూరమునుండి చూచు నీకు నిజమైన దారమువలె అగపడ వచ్చును. కాని నీవు సమీపించి ఊదినచో అది నిశ్శేషముగా ఎగిరి పోవును. జ్ఞానికిగల క్రోధాహంకారములు ఆభాసమాత్రములే, నిక్కములు కావు.

శిశువునకు సంగము అను నది యుండదు. అత డొక క్రీడాగృహమును నిర్మించును. ఎవరైనను దానిని తాకినచో లబ లబ కొట్టుకొని చిందులు త్రొక్కును, మఱు క్షణమున తానే దానిని విఱిచి వేయును. తన వస్త్రముపై అతనికి ఒకక్షణములో అతిమాత్ర మైన ఆస ఉండ వచ్చును. అప్పు డతడు "ఇది నాకు మా నాయన కొని పెట్టినది. దీనిని నే నీయను" అనును. మఱు క్షణముననే నీవు అతని కొక బొమ్మను చూపి ఆ వస్త్రమును మఱపింప గలిగి యుందువు. అతడు ఆ వస్త్రమును విడిచి పెట్టి నీ వెంట బడును.

---

* బ్రహ్మజ్ఞానముచే పూతమై వెలుగొందింపబడిన యహంకారము. జ్ఞాని వివేకమార్గము ననుసరించి సమాధిలో, తన యహంకారమును బ్రహ్మములో లీనమొనర్చుకొనును. తర్వాత నతడు వ్యావహారిక జగమున కవతరించి ప్రత్యేకవ్యక్తిగ కనబడుచున్నను ఆత్మపరమాత్మల యైక్యము అతని యెఱుకలో ఉండనే ఉండును. ఇటు పైకి మాత్రము కనబడు నహంకారమునకు జ్ఞానాహంకార మని పేరు. ప్రేమ మార్గానుసారి యైన భక్తునకు భగవంతునితోడి తన నిత్యసంబంధము ప్రత్యక్షమగును. అతడును వ్యావహారికరంగమున తన ప్రత్యేకవ్యక్తిత్వమును చూపుకొనుచుండును. ఇది లౌకికాహంకారము కన్న విలక్షణమై భక్తాహంకార మనంబరగును. ఇచ్చట వర్ణితము లైన యహంకారముల రెంటిచేత సూచిత మైన సిద్ధదశ ఒక్కటే.

జ్ఞాని లక్షణములు ఇవే. ఇంటియొద్ద అతనికి సాన్పులు, కుర్చీలు, చిత్తరువులు, సిబ్బంది మొదలైన పెక్కు భోగము లుండ వచ్చును. ఉన్నను అతడు ఏనాఁడో ఒక నాడు వీని నన్నిటిని త్యజించి కాశికి పో వచ్చును.

ప్రాణకృష్ణుడు గురుదేవుని వీడ్కొనెను. మహేంద్రుడు నదిలో స్నానము చేసినాడు, 'రాధాకాంత' 'కాళికాలయము'లకు పోయి విగ్రహముల ముందు సాగిలబడి మ్రొక్కినాడు. తనలో ఇట్లు అనుకొనెను—"ఈశ్వరుడు నిరాకారుడని నా కనిపించెడి. మఱి నేను విగ్రహముల ముందు ఏల సాగిలపడవలెను? సాకారుడైన వేల్పులందును దేవతలందును శ్రీరామకృష్ణునకు నమ్మక మున్నందుచేతనా? దేవుని గురించి నే నేమియు నెఱుగను, దేవుని నేను అర్థము చేసికొన లేదు, గురుదేవునకు విగ్రహములందు విశ్వాస మున్నది. నేను అల్పుడను. నేను కూడ ఆ విగ్రహములనే ఏల అంగీకరింప గూడదు?"

ఆలయములలో మధ్యాహ్న కారాధనమును నైవేద్యమును ఐనవి. ఆరతి గంటలును, జేగంటలును, తాళములును మ్రోగు చుండినవి. ఆల యారామ మంతయును సానంద క్రియాకలాపముతో నిండిపోయినది. బిచ్చగాండ్రును సాధువులును అతిథులును చేతులలో తట్టలనో ఆకులనో పట్టుకొని మధ్యాహ్న భోజనమునకై వంటచావడి [గెస్టుహౌసు] వైపునకు వేగముగ బోవుచుండిరి. కాళిగుడిలో మహేంద్రుడును కొంచెము ప్రసాదమును స్వీకరించెను.

భోజనానంతరము శ్రీరామకృష్ణుడు కొంచెముసేపు విశ్రమించి యుండెను. అప్పుడు రామ-గిరీంద్రాది భక్తులు వచ్చిరి. వారు గురుదేవునకు ప్రణమిల్లి కూర్చుండిరి.

గిరీంద్రుడు:—మీకు (ఆంగ్లములో) ఫాకల్టి ఆఫ్ ఆర్గనైజేషను (=పొందికలు చక్కగ అమర్చు ప్రజ్ఞ) లేదట, బ్రాహ్మ సమాజమువారు చెప్పుచున్నారు.

గురుదేవుడు:—అట్లనిన, అర్థ మేమి?

మహేంద్రుడు:—ఒక సంఘమునకు నాయకుడుగా ఉండను మీకు చేత రా దట. మీ మేధాశక్తి చాల మంద మట. ఇట్టి విషయ ములను వారు చెప్పుచుందురు. [అందఱును నవ్వుదురు.]

గురుదేవుడు:—[రామునితో] నాచేతికి ఏల దెబ్బ తగిలినదో చెప్పుము. లెమ్ము. అందుంగూర్చి ఉపన్యసింపుము. [అందఱును నవ్వుదురు.]

ఈశ్వరుడు నిరాకారు డని బ్రాహ్మసమాజమువారు నొక్కి చెప్పుచుందురు. చెప్పుదురు అనియే అనుకొనుము. హృదయపూర్వ కముగ భగవంతుని ఆశ్రయించిన జాలును. భక్తునొద్ద హృదయ పూర్వకత ఉండిన యెడల, సమస్తమునకును అంతర్నియంత యైన దేవుడు ఆ భక్తునకు తప్పక తన యథార్థస్వరూపమును కనబఱచును.

కాని దేవునింగూర్చి మన యభిప్రాయము మాత్రమే సత్య మనియు; ఇతరుల యభిప్రాయములు అసత్యము లనియు; ఈశ్వరుడు నిరాకారుం డని మన యభిప్రాయము కావున నిజముగ నతడు నిరా కారుడే అనియు, సాకారుడుగ నుండుట పొసగనే పొసగ దనియు; లేదా ఈశ్వరుడు సాకారు డని మన యభిప్రాయము కావున, అతడు నిజముగ సాకారుడే అనియు, నిరాకారుడుగ ఉండుట పొసగనే పొసగ దనియు—చెప్పుట సరి కాదు. ఈశ్వరతత్త్వమును గూర్చి మానవుడు నిజముగ అది ఇంతటిది అని నిర్ణయింప గలడా?

మతములను గుఱించి మాటాడు వారు, ఒకరితో ఒకరు సదా కలహించుచుండుటను నేను జూచుచున్నాను. హిందువులును ముస ల్మానులును బ్రాహ్మసమాజమువారును శాక్తేయులును వైష్ణవులును శైవులును—అందఱును ఒకరితో ఒకరు కలహింతురు. ఎవనికి కృష్ణుడని పేరో, అతడే శివుడు, ఆదిశక్తియు అతడే, జీససును అతడే, అల్లాయును అతడే—అని తెలిసికొను వివేకము వారికి లేదు. ఉన్నది రాము డొక్కడే. అతని పేర్లు వేయి. సత్యము ఏకమే, దాని నామ ములు అనేకములు. అందఱును అన్వేషించు సత్యము ఒక్కటే.

ఉన్న భేదములకు కారణములు క్షేత్రస్థితియు మనఃప్రకృతియు నామధేయమునే. అందఱును సర్వేశ్వరునివంకకే పోవుచున్నారు. ఆతురమును ఆస్థయు ఉన్నచో దైవసాక్షాత్కారము వారికి అందఱికిని గలుగును.

1884-వ సంవత్సరము మే 24 శనివారము.

అప్పటికి సాయంకాలము సుమారు ఐదు గంటలయి ఉండెను. శ్రీరామకృష్ణుడు తనగది ముందు మెట్ల మీద కూర్చుండి యుండెను. అధరుడు, డాక్టరు నిత్తాయి, మహేంద్రుడు — ఇంకను పెక్కండ్రు ఇతరభక్తులును ఆయనతో నుండిరి.

గురుదేవుడు:—(భక్తులతో) మీకు ఒక సంగతి చెప్ప వలసి యున్నది. నా ప్రకృతిలో ఒక మార్పు ఏర్పడుచున్నది.

గురుదేవుడు ఒక్క మెట్టు దిగి భక్తులకు చేరువగా కూర్చుండెను. ఆయన తన దివ్యానుభవములలో కొన్నింటిని వారికి చెప్ప నెంచినట్లుండెను.

గురుదేవుడు:—మీరు భక్తులు, ఈవిషయమును మీకు చెప్పుటకు నాకు ఎట్టి జంకును లేదు. ఇప్పుడు కొన్నాళ్లుగా భగవంతుని చిన్మయరూపము నాకు కాన వచ్చుట లేదు. మానవరూపముననే ఆయన నాకు అగపడుచున్నాడు. దేవునిరూపము దర్శించుట, చేతితో తాకుట, కౌగలించుకొనుట – నాకు సహజము లై పోయినవి. దేవుడు నాతో ''నీవు దేహమును ధరించియున్నావు కావున దేవుని మానవ రూపములో అనుభవింపుము'' అనుచున్నాడు.

దేవుడు సర్వత్ర ఉన్నాడనుటకు సందేహము లేదు. కాని తక్కిన ప్రాణులందు కంటె మానవునందు ఆయన తన్ను ఎక్కువగా చూపుకొనును. మానవుడు లెక్కలో లేని వాడా? మానవుడు పరమాత్మను భావింప గలడు. తక్కిన ప్రాణులు భావింప లేవు. జంతువులలోను వృక్షములందును సకలప్రాణులందును చరాచరములందన్నింటను దేవుడున్నాడు, కాని తక్కిన వానియందు తన్ను చూపు

కొన్నింతకంటె ఎక్కువగా మానవునిలో చూపుకొనును. అగ్ని అన్ని వస్తువులలోను అందఱు ప్రాణులందును ఉన్నది. కాని దాని సాన్నిధ్యము కొయ్యలో ఎక్కువగా కాన వచ్చును.

సామాన్యమానవులందు కంటె అవతారమూర్తియందు దేవుడు తన్ను ఎక్కువగా చూపుకొనును. లక్ష్మణునితో రాముడిట్లన్నాడు: "తమ్ముడా, ఏ యొకనిఐ ఎవ డేని ఉత్కటభగవత్ప్రేమయుక్తుడై. ఆదివ్యభావపారవశ్యమున. నవ్వుచు. ఏడ్చుచు. నర్తించుచు—నుండు నేని అతనియందు నేను వసించియున్నానని నీవు దృఢముగ గ్రహింప వచ్చును."

గురుదేవుడు మౌనముగ నుండెను. కొన్ని నిమిషములకు పిమ్మట సంభాషణను మరల ఆరంభించెను.

గురుదేవుడు:—కేశవసేను ఇచ్చటికి తఱచు వచ్చుచుండెను. అంతమాలమున అతనిలో గొప్ప మార్పు ఏర్పడినది. ఇటీవల నతడు అసుపేక్ష్యమైన వ్యక్తిగా నైనాడు. అతడు తనవర్గమువారిని వెంట నిడుకొని ఇచ్చటికి పెక్కుసార్లు వచ్చినాడు. తాను ఒంటరిగ రావలెననియు అతనికి ఆశ యుండెడిది. కేశవునకు అతని చిన్నతనములో సత్సంగమున మెలగు నవకాశము కలుగ లేదు.

ఒకసారి కొలుతోలావీధిలో నున్న యతని యింటికి నేను పోయితిని. హృదయుడును నా వెంబడి నుండెను. అచ్చటివారు మమ్ము కేశవుడు పనిచేయుచున్న గదిలోనికి పంపిరి. అత డేదో వ్రాయుచుండెను. చాలసే పైన తరువాత అతడు కలము నటుంచి కుర్చీనుండి లేచి నేలపై మాతోబాటు కూర్చుండెను. కాని ఆయన మాకు నమస్కరింపను లేదు. వే ఱొక పద్ధతిలో నైనను మర్యాద చేయ లేదు. కాని ఆయనయు ఆయనమిత్రుడును ఇచ్చటికి వచ్చినతఱి నామే వారు నమస్కరించుటకు ముందుగా నేనే వారికి నమస్కరించుచుందును. అట్లు క్రమక్రమముగ వారు సాధువులను చూచినపుడు నొసలు నేలం దాకు నట్లు నమస్కరింప నేర్చుకొనిరి.

ఒకనాడు కేశవుడు తన యనుచరులతో నిచటికి వచ్చెను. రాత్రి పది గంటల వఱకును వారు ఇచ్చటనే ఉండిరి. మే మందఱము పంచవటిలో కూర్చుంటిమి. ప్రతాపుడు మొదలైన వారు అనేకులు తమకు రాత్రి అక్కడనే గడుప వలె నను కోరిక యున్న దనిరి. కేశవుడు "నే నుండ లేను. నేను పోక తప్పదు. నాకు పని యున్నది" అనెను. నేను నవ్వి ఇట్లంటిని— "నీ చేపల బుట్ట కంపులేని దే నీవు నిద్రింప లేవా? ఒకనాడు చేప లమ్ము పడుచు ఒకతె ఒక పూల వాని యింటికి విం దైనది. ఆమె చేపల నమ్ముకొని వట్టి బుట్టతో అచ్చటికి వచ్చి యున్నది. వారు ఆమెను పూ లున్న గదిలో నిద్రింపు మనిరి. కాని పూల పరిమళముచేత ఆమెకు ఎంతసేపటికి నిద్ర పట్ట లేదట. ఇంటి యామె ఆ పడుచు పడు చున్న యవస్థను గుర్తించి 'ఏమి అమ్మాయీ. కునుకుపాటులేక యిటు నటు పొర్లింతలు పెట్టు చున్నావే' అని అడిగెను. ఆ పిల్ల 'నాకు తెలియ దమ్మా. ఒకవేళ ఈ పూల వాసనయే నా నిద్రను చెడగొట్టుచున్న దేమో! నా చేపల బుట్టను కొంత యిచ్చెదవా? అది నాకు నిద్రను రప్పించు నేమో' అని అన్నది. ఇంటి యామె బుట్టను తెచ్చి యిచ్చినది. ఆ చేపల పడుచు ఆ బుట్టమీద కొంత నీరు చల్లి దానిని తన ముక్కునొద్ద నుంచు కొనెను. వెంటనే ఆమెకు గాఢ మైన నిద్ర వచ్చినది. రాత్రి యంతయు గుఱ్ఱుపెట్టుచు నిద్రించుచునే యుండెను."

ఈ కథను విని కేశవుని యనుచరు లందఱును పక్కున నవ్విరి.

ఏటి స్నానఘట్టము నొద్ద నాటి సాయంకాలపు ప్రార్థనను కేశవుడు నడపెను. పూజ ముగియగనే నే నతనితో ని ట్లంటిని. శాస్త్రగ్రంథములుగా రూపుదాల్చిన వాడును దేవుడే కాబట్టి వేదములు పురాణములు తంత్రములు మొదలైన పవిత్ర గ్రంథములను పూజింప వలెను. అవి దేవున కొక విధ మైన రూపము. దేవుని వ్యక్తి యొక రూపము భక్తుడే. భక్తుని హృదయము దేవుని కొలువు కూటము. ఎవ డైనను తన ఏలినవానిని కొలువుకూటమున సులభ

ముగ దర్శింప వచ్చును. కావున భక్తుని ఆరాధించుమేని భగవం తుడే ఆరాధితు డౌను.

(భక్తులతో) ఇటు చూడుడు. ఈ కేశవుడు మహాపండితుడు. ఆంగ్లమున వక్త. ఇతనియందు ఎందఱికో గౌరవము కలదు. విక్టోరియా మహారాణి స్వయముగ నితనితో మాటాడెను. కాని యిచ్చటికి వచ్చినపుడు కేశవుడు చొక్కాయ తీసివేసి చేత ఫలములను పట్టుకొని వచ్చును. సాధువును దర్శించుటకు వచ్చినప్పుడు రావలసిన దట్లే కదా? ఇతనికి నిరహంకారత పూర్తిగా కుదురుకొన్నది.

1884–వ సంవత్సరము జూన్ తే 25 ది బుధవారము.

ఆ దినము హిందువుల రథయాత్రోత్సవ దినము. కలకత్తాలో ఈశాను డాహ్వానింపగా అత నింటికి అతిథిగా శ్రీరామకృష్ణు డేగెను. ఈశానుని ఇరుగుపొరుగువారిలో ఒకరింట పండిత శశధర తర్కచూడామణి నివసించి యుండెను. ఆయనను దర్శింపవలయు నను కోరిక కొన్నాళ్లుగ గురుదేవున కుండెను.

ఒకనాడు సాయంకాలము నాలుగు గంటలకు పండిత శశధరుడు ఉండు ఇంటికి గురుదేవుడు ఒకబండి నెక్కి పోయెను. బండి నెక్కిన వెంటనే గురుదేవుడు సమాధి నిమగ్ను డయ్యెను. దీర్ఘకాలము సాగిన ఆధ్యాత్మిక సాధనల ఫాకచేతను సదా భగవద్ధ్యాన నిమగ్నతచేతను గురుదేవుని శరీరశ్రమాసహిష్ణుత మిక్కిలి హెచ్చెను. ఎంత చిన్న బాధ కలిగినను ఆయనకు దుర్భరమే. ఐహికభావములు ఆయన పరిసరములలో పర్వినప్పటికిని ఓర్చుకో లేడు. శ్రీరామకృష్ణుడును, క్రైస్తును, శ్రీచైతన్యుడును, మానవులలో అతి సుకుమారవర్గమునకు చెందిన వా రనియు వారి నొక గాజుచట్టమున నుంచి లౌకిక గ్రామ్య స్పర్శ అంటనీయక కాపాడవలె ననియు కేశవచంద్ర సేను ఒకసారి చెప్పినాడు.

అది వానకాలము. చక్కని వాన కురిసి వీధులు తడిసి యుండినవి. ఆకసము మబ్బులు క్రమ్మి యుండెను. భక్తులు బండివెంబడి

పాదచారులై అనుసరించిరి. బండి యింటి ముందర ఆగగనే ఆ యింటివారును బంధువులును గురుదేవునకు స్వాగతోపచారము గావించి మిద్దె మీది కూటములోనికి పిలుచుకొని పోయిరి. అచ్చట గురుదేవుడు పండితునితో కలసికొనెను.

పండిత శశధరుని నెమ్మేను గౌరవర్ణశోభితము. యౌవనమును అతిక్రమించిన వయస్సు. కంఠము రుద్రాక్ష మాలాలంకృతము. ఆ కాలములో సుప్రసిద్ధ సంస్కృతపండితులలో అతడొకడు. వైదిక హిందూమతము పాశ్చాత్య క్రైస్తవ విజ్ఞానపుధాటకు పిమ్మట అప్పు డప్పుడే మరల తల యెత్తుచుండెను. దాని పునరుద్ధరణోద్యమమునకు పండిత శశధరుడు మూలస్తంభముం బోలి యుండెను. శాస్త్రగ్రంథములకు అతడు చేయు వ్యాఖ్యానముల స్పష్టతయు, దెసల ప్రతిధ్వనించు అతని ఆస్థయు, ఉత్సాహావివర్ధక మైన యతని వాగ్ధాటియు, వ్యుత్పన్న వంగదేశీయ హిందూ యువకులను అసంఖ్యాకులను మరల తమ తండ్రితాతల నాటి మతమునకు మరల్చినవి.

ఆ పండితుడు గురుదేవునకు మహాదరముతో ప్రణమిల్లెను. నరేంద్రుడును, రాఖాలును, రామును, హాజ్రాయును, మహేంద్రుడును గురుదేవునితో వచ్చి యుండిరి. గురుదేవుని నోట వెలువడు మాటలలో అక్షరము నైనను తప్పి పోనీయక విన వలె ననెడి యుబలాటముతో వారు ఆ గదిలో గురుదేవునకు సాధ్య మయినంత చేరువుగా కూర్చుండిరి.

పండితుని చూచిన తక్షణమే గురుదేవుడు మరల సమాధి నిమగ్ను డయ్యెను. కొంతసే పైన పిమ్మట సమాధిదశనుండి ఇంకను వెలువడకయే గురుదేవుడు పండితునివైపు చూచి చిఱునవ్వు నవ్వి ''బలే బలే'' అని అనెను. తరువాత ఆయన పండితుని మీ రెట్లు ఉపన్యసింతురో చెప్పుడు అని యడిగెను.

పండితుడు:—స్వామీ నేను హిందువుల శాస్త్రగ్రంథములలోని విధులను వివరింప ప్రయత్నించుచుందును.

గురుదేవుడు:—కలియుగమునకు నారద ప్రతిపాదితమైన భక్తిమార్గమే ఉత్తమోత్తమము. శాస్త్రనియమానుసారముగ కర్మల నాచరింప ప్రజల కిప్పుడు వ్యవధి ఏది? ఈ దినములలో జ్వర రోగులకు ఆయుర్వేద వైద్యుల కషాయములను ఈయ లేము. అవి నిదానముగ గుణము చూప ప్రారంభించు లోపలనే రోగి అస్తమించును. కాబట్టి ఈకాలమున పాశ్చాత్యవైద్యుల తీక్ష్ణ జ్వరౌషధమే శీఘ్రగుణప్రదము. శాస్త్రోక్తములైన క్రతుకలాపములను ప్రజలచే చేయింప వచ్చును గాని వాని తలతోకలను* తీసి వేయ వలయును.

నీవు వేయి ఉపన్యాసములు చేయ వచ్చును. చేసినను అవి సంసారుల చిత్తములకు కొంచెమైనను ఎక్కవు. రాతిగోడలో చీలను దింప సాధ్యమగునా? చీల దిగక పోవుట అటుండ దానికొన సైతము వంగును. మత్స్యమైన మొసలి వీపుపై ఖడ్గప్రహారము చేసి ఏమి లాభము? నీ యుపన్యాసముల వలన సంసారులకు విశేష లాభము లేదు. ఈ సంగతి నీకు క్రమక్రమముగా తెలియ నగును.

భగవత్పరునకును ఐహికపరునకును భేదము నీవు గుర్తింప లేవు. అది నీ తప్పు కాదు లెమ్ము. తుపాను మొదటితాకుడు చెట్లను ఊపినపుడు అందులో ఏ చెట్టు ఏదో, చింత చెట్టేదో మామిడి చెట్టేదో గుర్తింప శక్యము కాదు.

గురుదేవుడు తక్షణమే సమాధినిమగ్ను డయ్యెను. ఆయన వదనము దివ్యకాంతిని వెదజల్లుచుండెను. బాహ్య లోక స్మృతిలేదు. నోట ఒక్కమాటయు వెలువడుట లేదు. చూపు అంతర్ముఖమై ఆత్మ యందు నిమగ్నమై యుండెను. చాల సేపైన పిమ్మట గురుదేవునకు బాహ్యలోకము మరల అగపడ జొచ్చినది. ఆయన ఒక పసివాని వలె త్రాగుటకు నీళ్లడిగెను. సమాధి ముగిసిన పిమ్మట గురుదేవుడు

* తలతోక లనగా అసారాంశములు. ముఖ్యముగా చేపల నుపయోగించు వట్టు తలతోకల తీసివేయుదు రట.

త్రాగుటకు నీరు అడిగె నేని ఆయన క్రమక్రమముగ బాహ్యలోక స్మృతికి మరలుచున్నా డనుటకు భక్తుల కదే సూచన.

ఆ యుద్రిక్తదశను వీడకయే ఆయన లోకమాతతో నిట్లనెను: "అమ్మా, ఆ నాడు ఈశ్వరచంద్ర విద్యాసాగర పండితుని నాకు చూపితివి. మఱి యొకపండితుని చూడ వలయు నని నేను కోరినందులకు నీవు నన్ను ఇచ్చటికి తెచ్చితివి."

పండితునితో ఇట్లనెను : "అబ్బాయీ, నీ బలమును మఱి కొంత హెచ్చించుకొనుము. ఆధ్యాత్మిక సాధనలను మఱి కొన్నాళ్లు సాగింపుము. చెట్టుమీాద అడుగు పెట్టితివో లేదో, వెంటనే పండ్ల గుత్తిని అందుకొన ఆశించుచున్నావు. అయినను, నీవు చేయునట్టి వన్నియు ఇతరుల క్షేమమునకే లెమ్ము." ఈ మాట లనుచు పండితునకు నమస్కరించెను.

గురుదేవుడు ఇంకను ఇట్లనెను : "మొట్టమొదటిసారి నిన్ను గుఱించి విన్నప్పుడు నీవు వట్టి పండితుడవా వివేకవైరాగ్యములు కల వాడవా అన్న విషయమును నే నడిగితిని. సత్యాసత్యములను వివేచింప లేని పండితుడు పండితుడే కాడు."

లోకులకు ఉపదేశింపు మను భగవన్నియమమును పొందిన వాడు లోకుల కుపదేశించు నేని అందులో చెడు గేమియూ లేదు. భగవ దనుజ్ఞను పొందిన పిమ్మట ఉపదేశింప దొరంకొను వానిని ఎవరును కలవర పఱుప లేరు. సరస్వతీదేవినుండి తేజఃకిరణము నొక్కడానిని సంపాదించిన వాడైనను సరే అనంతశక్తిమంతు డగును. అతని ముందు పెద్ద పెద్ద పండితులు క్రిములవలె కన్పింతురు.

దీపమును వెలిగించిన వెంటనే ఇసుళ్లు గుంపులు, గుంపులుగా వచ్చును. వానిని ఆహ్వానింప వలసిన ఆవశ్యకత లేదు. అట్లే భగవ దనుజ్ఞను ప్రాపించిన ప్రవక్త తన బోధలను వినుటకు ప్రజలను ఆహ్వానింప వలసిన అక్కఱ లేదు. తాను ఈ ఈ సమయములలో

ఉపన్యసింతు నని అతడు ముందుగా ప్రకటించుకో నక్కఱ లేదు. ప్రజలు తమంతట తామే వత్తురు. అన్ని వర్గముల ప్రజలును రాజులును, భూస్వాములును అతనిని చుట్టవేసికొందురు. అతనియొద్ద ప్రతి ఘటించుటకు సాధ్యపడని యాకర్షణ శక్తి అంత ఉన్నది.

సూదంటురాయి ఇనుమును నా యొద్దకు ర మ్మని పిలుచునా ? పిలువ నక్కఱ లేదు. సూదంటురాయి యం దున్నట్టి యాకర్షణ శక్తిచేత ఇనుము తనంతట తానే దానిపై ప్రాలును.

అట్టి బోధకుడు పండితుడు కాకయు ఉండ వచ్చును. కాని అంతమాత్రముచేత అతడు వివేకములో కొఱవడినవా డని తలంప కుము. గ్రంథపాండిత్యముచేత నొకడు బుద్ధిమంతు డగునా? భగవ దనుజ్ఞ కలవానికి వివేకమున కెప్పుడును లో టుండదు. ఆ ప్రజ్ఞ సర్వేశ్వరునియొద్ద నుండియే వచ్చును. అది ఎన్నటికిని తఱుగదు. దానికి ముగియుకయే లేదు. ఏ బోధకునిపై లోకమాతృ కరుణా కటాక్షము ఒక్కటి ప్రసరించునో వానికి జ్ఞానము ఎప్పు డైనను కొఱ వడునా? కాబట్టియే ని న్నడుగుచున్నాను, భగవ దనుజ్ఞను పొంది తివా యని.

హాజ్రా:— భగవదనుజ్ఞ ఆయనకు తప్పక కలిగి యుండును, (పండితునితో) నిజమే కదండి?

పండితుడు:— అనుజ్ఞయా? అటువంటి దేదియు నేను పొంది యుండ లేదే.

ఇంటి యజమానుడు:— అనుజ్ఞను ఆయన పొందియుండక పో వచ్చును. కాని ఉపదేశించుట తన విధి అను తలంపుతో ఉపదే శించుచున్నాడు.

గురుదేవుడు:— భగవంతునొద్దనుండి యనుమతి పొంద కున్న వట్టి యుపన్యాసములచేత మానవు డేమి సాధింప గలడు? ఒకప్పుడు బ్రాహ్మసమాజమత బోధకు డొకడు తన ప్రసంగమధ్యమున "మిత్రులారా, నే నెంత త్రాగుబోతుగా నుంటిని!" అని ఏ మేమో

చెప్పెను. దానిని విని ప్రజలు తమలో "ఈ మూర్ఖుడు ఏ మన్నాడు? తాను త్రాగుబోతుగా నుండినా డట" అని గుసగుసలాడికొనిరి. అతని మాటలు శ్రోతలకు మిక్కిలి అప్రీతికరములుగ నుండినవి. ఉపదేశమును చేయువాడు సత్ప్రవర్తనకలవాడుగ నుండనిదే ఆ యుపదేశము సత్ఫలితముల నొసంగ జాల దనుటకు ఇది తార్కాణము.

కాబట్టి నేను చెప్పున దేమనగా పనికిమాలినవాడు తనకే బుద్ధి చలించునంతగా ప్రసంగించినను ఏమియు నుపయోగ ముండదు. అట్లుగాక అతనికి భగవదనుమతి యనెడి యధికారముద్ర యుండెనేని ప్రజ లతనిమాటలకు చెవి యొగ్గుదురు. మానవులకు బోధించువానికి ఎంతో శక్తి యుండ వలయును. కాబట్టి చెప్పుచున్నాను, సచ్చిదానందసాగరమున లోతునకు పొమ్ము, భగవత్ సాక్షాత్కారమును పొందితి వేని ఇక నేదియు నీకు వ్యధ కలిగింపదు. ప్రజల నుపదేశింప నధికారముద్రయు నీకు అప్పుడే లభించును.

పండితుడు:— పుణ్యతీర్థయాత్రలలో తాము ఎంతవఱకు పోయితిరి ?

గురుదేవుడు:— ఏవో కొన్ని క్షేత్రములను దర్శించితిని (చిఱునవ్వుతో). హాజ్రామాత్రము ఇంకను ఆవలికి పోయినాడు, ఇంకను పై కెక్కినాడు. అతడు హృషీకేశమును దర్శించినాడు. నే నంత దూరమును పో లేదు. అంత ఎత్తునకును ఎక్క లేదు.

రాబందులు, గ్రద్దలును ఆకసమున చాల ఎత్తుగా ఎగురుచుండును. మీరు చూచియే యుందురు. కాని వాని కన్నులు మాత్రము ఎప్పుడును పీనుగుల గుంటలపైనే నిమగ్నములై యుండును. పీనుగుల గుంట లనిన మీ కర్థము తెలియునా? కామినీకాంచనములు అని అర్థము.

మీరున్న చోటనే భగవత్ప్రేమను మీరు సంపాదింప గలిగి యుండగా యాత్రలు చేయుట ఎందులకు? నేను కాశికి పోయితిని.

ఇక్కడ ఉన్న చెట్లవంటి చెట్లనే యచ్చటను చూచితిని. చింతాకులు ఇక్కడ నున్నట్లే అక్కడను ఆకుపచ్చగనే యున్నవి.

భగవత్ ప్రేమను గడించుటకు సాధనముగా ఉపయోగపడని తీర్థయాత్ర వ్యర్థమే అగును. భగవత్ప్రేమ యొక్కటే ముఖ్యమును ఆవశ్యకమును. రాబందులు, గ్రద్దలు అనుటకు అర్థము తెలియునా? కొందఱు, తమగొప్పతనమును కొనియాడుకొనుచు శాస్త్రవిహితధర్మముల అన్నిటిని తాము నిర్వర్తించితి మని చెప్పుచుందురు. ఏమి నిర్వర్తించిన నేమి? వారి మనస్సులు ఐహికపరతలో మునిగి సిరి సంపదలు, పేరుప్రతిష్ఠలు, జీవితసౌఖ్యములు మున్నగువానియందు ఆసక్తములై యుండును.

గురుదేవుడు వీడ్కోన సిద్ధపడెను. పండితుడును అతని మిత్రులును ఆయనకు ప్రణమిల్లిరి.

అప్పటి కింకను చీకటి పడ లేదు. శ్రీరామకృష్ణుడు భక్తులను వెంట నిడుకొని ఈశాను నింటికి మరలెను. గురుదేవుడు కూటమున ఈశానునితోను అతనిపుత్రులతోను ఒకపండితునితోను మఱి కొందఱు భక్తులతోను కూర్చుండెను.

గురుదేవుడు:— (చిఱునవ్వునవ్వుచు ఈశానునితో) 'చెట్టుపై అడుగు పెట్టితివో లేదో, పండ్లగుత్తిని అందుకొన నుబలాటపడు చున్నా' వనియు 'ఒరులకు ఉపదేశించుటకు ముందు ఆధ్యాత్మికసాధనను కొంత చేయవలె' ననియు నేను శశధరపండితునితో చెప్పితిని.

ఈశానుడు:— ప్రతిమతబోధకుడును తా నితరులకు వెలుగు నిచ్చుచున్నా నని అనుకొనును. మిణుగురుపురుగు కూడ లోకమునకు వెలుతురు తనవలననే కలుగుచున్న దని తలంప వచ్చును. మిణుగురుపురుగునకు గల తలంపు ఇదే అని అనుకొనుచు ఎవరో ఒకరు దానితో "ఓ మిణుగురుపురుగా, నీవు లోకమునకు వెలుగును ఎట్లీయ గలవు? లోకమున నున్న చీకటి ఎంత గాఢ మైనదో నీవు చూపుదువు, అంతే" అని అన్నా రట.

గురుదేవుడు:—(చిఱునవ్వుతో) కాని శశధరుడు వట్టిపండితుఁడు కాడు, కొంత వివేక వైరాగ్యములు కల వాడే.

గురుదేవుడు దక్షిణేశ్వరమునకు బయలుదేఱ నుండెను. ఈశానుడును తక్కిన భక్తులును ఆయనను పరివేష్టించి యుండిరి. ఆయన ఈశానునితో కొన్ని హితోక్తులు పలుకుచుండెను.

గురుదేవుడు:— గృహస్థుడుగనే యుండి దేవు నాశ్రయింప గల భక్తుడు నిజముగ వీరుడే. దేవుడు ఇట్లనుకొనును: "నా కొఱకు ప్రపంచమును విడిచిన వాడు తప్పక నన్ను ప్రార్థించును. నా సేవ చేయక అతనికి తప్పదు. అందులో విశేష మేమియు లేదు. అత డట్లు చేయకున్న లోకుల ఎదుట నవ్వుల పాలగును. అట్లు కాక లౌకికధర్మము నడుమనే యుండి నన్ను ధ్యానించువాడు నిజముగా భాగ్యశాలియే. ఎంతో పెద్ద యడ్డంకులను దాటి, నెత్తిమీద నున్న యిరువదిరెండువేల నలువది రతుల బరువు గల పెద్ద బండను నెట్టి నట్లు ఆవలకు త్రోసి వేసి, అతడు నన్ను గాంచుటకు ప్రయత్నించు చున్నాడు. అట్టి వాడే నిజ మైన వీరుడు."

లోకములో చీమను బోలి జీవితమును గడపుము. ఈ లోక ములో సత్యాసత్యములును, చక్కెరయు, ఇసుకయును కలిసియున్నవి. చీమవలె నడచుకొనుము. చక్కెరను స్వీకరింపుము.

ఈ లోకమున ఇంద్రియసుఖానుభవములును భగవత్పరతయు క్షీరనీరన్యాయమున కలసిపోయి యున్నవి. నీవు హంసము వలె ప్రవర్తించి, క్షీరమును మాత్రము గ్రోలి, నీటిని విడిచిపెట్టవలయును.

శ్రీరామకృష్ణుడు బండి నెక్కి దక్షిణేశ్వరమునకు బయలు దేఱెను.

1884–వ సంవత్సరము జూన్ తే 30 ది సోమవారము.

శ్రీరామకృష్ణుడు తన గదిలో నేలపై పఱచిన యొక చాప మీద కూర్చుండి యుండెను. పండితశశధరుడును మఱి కొందఱు

భక్తులును ఆయనతో గూడ ఆ చాపపై కూర్చుండి యుండిరి. ఇతరులు వట్టి నేలపై కూర్చుండి యుండిరి. సురేంద్రుడు, బాబురాము, మహేంద్రుడు, హరీశుడు, లాటు, హాజ్రా ఇంకను కొందఱుకూడ నుండిరి. అప్పటికి సాయంకాలము నాల్గు గంటలై యుండును.

శ్రీరామకృష్ణుడు శశధరపండితుని కలకత్తాలో కలసికొని ఆఱుదినము లైనవి. ఇప్పుడతడు గురుదేవుని దర్శింప దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఆయన వేదములను ఇతరశాస్త్రగ్రంథములను చక్కగ చదివి యుండెను. వేదాంతచర్చలపై ఆయనకు ప్రీతి. గురుదేవుడు మంచముపై నుండి పండితునిపై కరుణాకటాక్షము ప్రసరింపచేసి కొన్ని నీతికథలమూలముగా హితోపదేశము చేసెను.

గురుదేవుడు:—(పండితునితో) వేదములవంటి శాస్త్రగ్రంథము లెన్నో యున్నవి కాని తపస్సును ఆధ్యాత్మికసాధనయు లేనిదే ఎవనికిని భగవత్సాక్షాత్కారము సాధ్యము కాదు. షడ్దర్శనములలోగాని వేదములందు గాని తంత్రములందు గాని దేవుని చూడ లేము.

శాస్త్రగ్రంథస్థ విషయములను నేర్చుకొని, వానిలోని నియమముల ననుసరించి, మానవుడు ప్రవర్తింప వలయును. ఒకడు ఒక జాబును పోగొట్టుకొన్నాడట. దానిని తాను ఎక్కడ పెట్టినదియు అతడు మఱచిపోయినాడు. చేత దీపము నుంచుకొని అతడు ఆజాబును వెదుక నారంభించెను. ఇద్దఱుముగ్గురు వెదకిన పిమ్మట ఆ జాబు కడపటికి దొరకినది. అందులో ఉన్న విషయము — "దయచేసి అయిదు శేర్ల సందేష్*ను, కట్టుకొనుటకు ఒకవస్త్రమును పంప వలసినది" అని యున్నది. అతడా జాబును చదివి పాఱవేసినాడు. దానితో ఇక పని లేదు. ఇక నతడు చేయవలసిన దెల్ల అయిదు శేర్ల సందేష్‌ను, ఒక వస్త్రమును కొనుట మాత్రమే.

చదువుటకన్న వినుట మేలు. వినుట కన్న చూచుట మేలు. గురుముఖముననో ఒకమహాత్మునివాక్కుననో శాస్త్రగ్రంథములను

* జున్నుతోను చక్కెరతోను వంగదేశీయులు చేసికొను భక్ష్యవిశేషము.

విన్నప్పుడు శ్రోతలకు స్పష్టతరముగ అర్థ మగును. వానిలో అసార మైన భాగమును గుఱించి ఆలోచింప వలసినది లేదు.

కాని వినుటకన్న చూచుట చాల మేలు. అప్పుడు సందేహము లన్నియు మాయ మగును. శాస్త్రగ్రంథములలో ఎన్నో విషయము లున్న వనుట నిజమే. కాని భగవత్ సాక్షాత్కారము లేనిదే, భగవచ్చరణారవిందములందు భక్తిలేనిదే, హృదయపవిత్రత లేనిదే — ఆ విషయము లెల్ల వ్యర్థములు. సంవత్సరమున కురియ నున్న వానను పంచాంగము ముందుగా తెలుపును. కాని పంచాంగమును నీ వెంత పిండినను ఒక్క చుక్క నీ రైనను రాదు. ఒక చుక్కయైనను రానే రాదు.

ఒకభక్తుడు:—భగవత్ సాక్షాత్కార మైన పిదప దేహము నిలుచునా?

గురుదేవుడు:—ప్రస్తుతదేహము దాని †యురవడి తగ్గునంత వఱకును సజీవముగనే యుండును. కాని ఇక ముందు జన్మములు గాంచుట శక్యము గాదు. ఒకచక్రము దానిని త్రిప్పిన వేగము సాగినంత వఱకు తిరుగుచుండును. తరువాత నది ఆగిపోవును. అట్టి మానవునికి కామక్రోధాది భావోద్రేకములు దగ్ధము లగును. ఏవో కొన్ని కర్మలను ఆచరించుటకై శరీరముమాత్రము నిలిచి యుండును.

గురుదేవుడు కొన్ని నిమిషముల కాలము మౌనముగ నుండి తరువాత శశధరపండితుని "పొగత్రాగు" డని ప్రార్థించెను. పండితుడు పొగత్రాగుటకై ఆగ్నేయదిక్కున నున్న వసారకు పోయెను. త్వరగనే వెనుదిరిగి వచ్చి గదిలో భక్తులతోపాటు నేలపై కూర్చుండెను. చిన్నమంచముపై కూర్చుండి గురుదేవుడు సంభాషణను సాగించెను.

గురుదేవుడు:—(పండితునితో) ఒకసంగతిని వినుము. మూడు విధము లైన యానందములు గలవు. లౌకికానందము, ఆరాధనా

† ప్రకృతిజన్మహేతుకము లైన పూర్వజన్మల లోని కర్మల యురవడి.

నందము, బ్రహ్మానందము. లౌకికానంద మనగా ప్రజలకు సదా ప్రియము లైన కామినీకాంచనములవలన కల్గెడి యానందము. ఆరాధనానంద మనగా భగవన్నామములను, భగవన్ మహిమలను కీర్తించునప్పుడు కల్గెడి యానందము. బ్రహ్మానంద మనగా భగవత్ సాక్షాత్కారమువలన కల్గెడి యానందము. భగవత్ సాక్షాత్కారానందమును అనుభవించిన పిమ్మట ప్రాచీనమహర్షులు నియమముల కన్నింటికిని, సంప్రదాయముల కన్నింటికిని అతిక్రాంతులైరి.

సమాధి యనగా నేమి? భగవ దనుభూతి యందలి మనోలయమే సమాధి. జ్ఞాని జడసమాధి ననుభవించును. ఆ దశలో అహంకారము జాడ యైనను నిలిచి యుండదు. భక్తిమార్గమున ప్రాపించిన సమాధి చేతనసమాధి యనంబరగును. ఈ సమాధిలో 'నే' ననెడి తలంపు నిలిచి యుండును. ఆ 'నే' ననెడి తలంపు స్వామి దాసభావముతోను, ప్రియప్రేయసీభావముతోను, 'అన్న'–'అన్నాద' భావముతోను కూడుకొన్నది. దేవుడు స్వామి. భక్తుడు దాసుడు. దేవుడు ప్రాణనాథుడు. భక్తుడు ప్రియురాలు. దేవుడు అన్నము. భక్తుడు అన్నాదుడు. నాకు చక్కెరగ నుండుట ఇష్టము లేదు. చక్కెరను తినుట నా కిష్టము.

దేవుడు భక్తునకు బ్రహ్మజ్ఞాన మొసంగిన పిమ్మటకూడ ఇంచుక యహంకారమును మిగిల్చి యుండును. అది భక్తాహంకారము, జ్ఞాన్యహంకారము. అనంత మైన భగవల్లీలను అనుభవింప వలె ననిన భక్తునకు ఆ యహంకారమే సాధనము.

ధ్యానమార్గమున మనస్సును అవిభాజ్య మైన బ్రహ్మమునందు లీన మొనర్చుట ఆనందమే. కాని ఆ మనసును ద్వంద్వాతీత మైన బ్రహ్మమునందు కరిగిపో నియ్యక వ్యావహారికరంగమున భగవల్లీలలపై నెలకొల్పుకొనుటయు ఆనందమే.

వట్టి జ్ఞాని విసుగు పుట్టించెడు మనుష్యుడు. అత డెప్పుడును "అది ఇది కాదు, ఇది కాదు. జగ మొక స్వప్నము వంటిది" అనియే చెప్పుచుండును.

ఒకభక్తుడు:— ఈ భక్తాహంకారము ఎప్పుడునే పోదా?

గురుదేవుడు:— పోవును, ఒక్కొక్కప్పుడు మాయ మగును. అప్పు డా భక్తుడు ప్రాప్తబ్రహ్మజ్ఞానుడై సమాధి నిమగ్నుడగును. ఆ భక్తాహంకారము నాయందుగూడ అప్పు డప్పుడు తొలగిపోవు చుండును. కాని శాశ్వతముగ తొలగిపోదు. నేను లోకజననిని "అమ్మా, నాకు బ్రహ్మజ్ఞానము నీయకుము" అని ప్రార్థించుచుందును. మొట్టమొదట నాయొద్దకు ఈశ్వరుడు సాకారుడే యను నమ్మకము గల వారు ఎక్కువగ వచ్చుచుండిరి. తరువాత *నవీనబ్రహ్మజ్ఞానులు రాజొడంగిరి. ఆ దినములలో ఎక్కువ కాలము నేను సమాధిలో మునిగి బాహ్యలోకస్మృతి లేకుండెడి వాడను. స్మృతి మరల కలిగి నప్పుడు లోకజననితో "అమ్మా, దయచేసి నాకు బ్రహ్మజ్ఞాన మీయకుము" అని మొఱపెట్టుకొనుచుంటిని.

పండితుడు:— దేవుడు మనప్రార్థనలను వినునా?

గురుదేవుడు:— దేవుడు కల్పవృక్షమే. ఆయనను నీ వేమి కోరినను తప్పక పడయ గలవు. కాని నీవు కల్పతరువునొద్ద నిలబడి ప్రార్థింప వలెను. అట్లు ప్రార్థించినప్పుడే నీ ప్రార్థన నెఱవేఱును. కాని నీవు మఱి యొక విషయమును జ్ఞప్తియం దుంచుకొన వలయును. దేవుడు మనహృదయములోని భావములను తెలిసికొనును. సాధనను సాగించుచున్నప్పుడే సాధకుని యీప్సితములు నెఱవేఱుచుండును. భావన యెట్లున్న ప్రాప్తియు అట్లే యుండును.

నేను ఏడ్చుచు లోకమాతను 'అమ్మా నాతర్కప్రవణతను నీవు నీవజ్రాయుధముచే ధ్వంసము చేయుము' అని ప్రార్థించెడివాడను.

పండితుడు:— తర్కప్రవణత మీకును ఉండినదా?

గురుదేవుడు:— ఉండినది, ఒకప్పుడు.

పండితుడు:— అప్పటికి ఆతర్కప్రవణత మీకును తొలగు

---

* బ్రహ్మము నిరాకార మనెడి నమ్మకము గల బ్రాహ్మసమాజసభ్యులు.

నని దయచేసి సెలవిమ్మా యిందు. మీతర్కప్రవణతను మీ రెట్లు తొలగించుకొంటిరి?

గురుదేవుడు:— ఎట్లో ఒకట్లు.

శ్రీరామకృష్ణుడు కొంతసేపు ఊరకుండెను. తర్వాత సంభాషణను సాగించెను.

గురుదేవుడు:— దేవుడు కల్పవృక్షము. సాధకుడు ఆ వృక్షము నొద్ద నిలబడి ప్రార్థింప వలెను. అప్పు డతడు ఏమి కోరినను పడయ గలడు.

దేవుడు ఎన్ని పదార్థములను సృష్టించినాడు! అతని విశ్వము అనంత మైనది. కాని దేవుని యనంతమహిమలనుగూర్చి నే నేల తెలిసికొన వలెను? నేను వానిని తెలిసికొననే వలయునేని, మొదట భగవత్ సాక్షాత్కారమును పొంద వలెను. అప్పుడు దేవుడు తానే వాని నన్నింటిని నాకు తెల్పును. యదుమల్లిక్కునకు ఎన్ని ఇండ్లు ఉన్నవో సర్కారుపత్రములు (సెక్యూరిటీలు) ఎన్ని ఉన్నవో తెలిసికొన వలసిన యావశ్యకత నా కేమి? నాకు కావలసిన దెల్ల యదుమల్లిక్కుతో సంభాషించుటే. ఒక కాలువను దాటియో, లేక యొక మనవిపత్రమును పంపుకొనియో, లేక అతని ద్వారపాలకునిచేత నెట్టి వేయబడిన పిమ్మటనో, నేను ఆయనను దర్శింప వచ్చును. ఆయనతో మాటాడు నవకాశము ఒక్కసారి కలిగిన, ఆయన యాస్తిపాస్తులను గుఱించి నే నడుగుదు నేని ఆయనయే సమస్తమును చెప్పును. అధికారితో పరిచయము సంపాదించుకొన్నవానిని ఆ యధికారి క్రింది యుద్యోగులు కూడ గౌరవింతురు. (అందఱును నవ్వుదురు).

పండితుని వినయమును చూచి గురుదేవుడు ప్రీతుడై అతనిని కొనియాడుచు తనభక్తులతో మాటాడెను.

గురుదేవుడు:— అంత చక్కని స్వభావము గల వా డాయన. మట్టిగోడలో చీలను దింపుట కష్టము కానే గాదు. కాని ఆ చీలనే

నీవు ఒకరాతిలో దింప ప్రయత్నించితు వేని, దాని మొన విఱిగి పోవును. అప్పటికిని అది దిగదు. దేవునిగుఱించి వేయిసార్లు విన్నను కొందఱిలో జ్ఞానము మేలుకొనసే మేలుకొనదు. వారు వీపుపై కత్తితో ఎంత కొట్టినను కత్తి తాకుడు నెఱుగని మొసలిని పోలిన వారు.

పండితుడు:— కాని మొసలికడుపున ఈటెతో పొడిచిన, అప్పుడు దానికి బాధ తప్పక కల్గును. (అందఱును నవ్వుదురు).

గురుదేవుడు (చిఱునవ్వుతో) :— శాస్త్రగ్రంథములను అన్నింటిని చదివినను లాభ మేమి? తర్కశాస్త్రపఠనమువలన లాభ మేమి? పారకాయలు నఱికినందువలన లాభ మేమి? బాణవిద్యను నేర్చుకొను సాధకుడు మొదట నొక మఱ్ఱిచెట్టును గుఱిపెట్ట వలెను. తరువాత నొకరెల్లును, తర్వాత నొకవత్తిని, కడపట ఎగురుచున్న పక్షిని గుఱిపెట్ట వలెను. సాధకుడు తన మనస్సును మొదట సాకార దైవమునందు ఏకాగ్ర మొనర్ప వలెను.

భగవత్ సాక్షాత్కారమునకు వివేకవైరాగ్యములును, దేవుని కొఱకు ఉబలాటపడుటయు మార్గములు. ఎట్టి ఉబలాటము? తన దూడకై తల్లియావు హృదయము ఎట్టి యుబలాటము పడునో దేవునికై యట్టి ఉబలాటమును పడ వలెను.

పండితుడు:— ఇదే విషయము వేదములందు చెప్పబడి యున్నది. "ఓ దేవా, దూడకై యఱచెడి యావువలె మేము నిన్ను పిల్చుచున్నాము."

గురుదేవుడు :— ఉబలాటపడుటే గాదు, కన్నీరు కార్ప వలెను. వివేకవైరాగ్యములచే నీవు సర్వసంగములను విడనాడ గల వేని, అప్పుడు నీవు భగవంతుని సాక్షాత్కరించుకొన గల్గి యుందువు. అట్లు ఉబలాటపడుదు వేని, నీవు జ్ఞానమార్గానుసారి వైనను, భక్తి మార్గానుసారి వైనను నీకు దైవోన్మాదము కల్గును.

గృహస్థుని జ్ఞానమునకును సర్వసంగపరిత్యాగి యైన సన్న్యాసి జ్ఞానమునకును గల తారతమ్యము అపారము. గృహస్థుని జ్ఞానము

గదిలోపలిని మాత్రము ప్రకాశపఱచు దీపపు వెలుగును పోలినది. అట్టి జ్ఞానముచేత నతడు తన శరీరమును తన కుటుంబమును తప్ప వేఱు దేనిని గాని చూడ లేడు. మఱి సర్వసంగపరిత్యాగి యైన యోగిపుంగవుని జ్ఞాన మన్ననో సూర్యుని వెలుగును బోలినది. ఆ వెలుతురు గది లోపలను, వెలుపలను గూడ ప్రకాశపఱచును. చైతన్యదేవుని జ్ఞానము సూర్యునివలె మహోజ్జ్వల మైనది — జ్ఞాన భాస్కరుడే. అంతియే గాదు, ఆయన భక్తి యనెడి యాప్యాయనకర మైన చంద్రుని వెలుగును గూడ వ్యాపింప జేసెను. ఆయనయందు బ్రహ్మజ్ఞానమును, ఉత్కటకోటిక మైన భగవత్ప్రేమయు రెండును ఉండినవి.

పండితుడును మణిమల్లిక్కును ఒక రొకరితో సంభాషణలోనికి దిగిరి. మణి బ్రాహ్మసమాజసభ్యుడు. ఆ సమాజ గుణదోషములను గూర్చి పండితుడు ఉగ్రముగ వాదాడినాడు.

చిఱునవ్వుతో శ్రీరామకృష్ణుడు పండితునితో ని ట్లనెను. మణిమల్లిక్కు బ్రాహ్మసమాజసిద్ధాంతములను చాలకాలముగా అనుసరించుచున్నాడు. అతనిని నీవు నీ మతములోనికి మార్చ లేవు. స్థిరపడిన యభిరుచులను తొలగించుట సులభ మైన పనియా ? పూర్వ మొకప్పుడు ఒక హిందూభక్తుడు సదా లోకజననినే ఆరాధించుచు ఆమె నామములను కీర్తించుచుండెను. మహమ్మదీయులు దేశమును జయించినప్పుడు వారు అతనిని మహమ్మదీయమతమును స్వీకరింపుమని బలాత్కరించిరి. వా రతనిని "నీ విప్పుడు మహమ్మదీయుడవు, అల్లా యని అనుము. ఇప్పటినుండి నీవు అల్లాపేరునుమాత్రమే జపింపవలెను" అని యాజ్ఞాపించిరి. ఎంతో కష్టపడి అతడు అల్లాపేరును జపించుచుండెను. కాని నడుమ నడుమ జగదంబానామము అతని నోటినుండి అతనిస్వాధీనము లేకయే వెలువడుచుండెను. అప్పుడా మహమ్మదీయులు అతనిని కొట్ట నుంకించిరి. కాని యతడు వారిని ఇట్లు ప్రార్థీయపడెను. "అయ్యా, మిమ్ము వేడుకొనుచున్నాను. దయచేసి నన్ను చంపకుడు. నాచేత నైనంతవఱకు అల్లాపేరునే చెప్పుటకు

ప్రయత్నించుచున్నాను. కాని నాలో నూజగదంబ మెడవఱకు నిండి యున్నది. ఆమె మీాయల్లాను బయటికి నెట్టివేయు చున్నది. (అందఱును నవ్వుదురు).

[పండితునితో] దయచేసి మణిమల్లిక్కుతో ఏమియు అన కుము. రుచులు వివిధములుగ ఉండు నని నీవు గుర్తింప వలెను. జీర్ణించుకొను శక్తులు కూడ వివిధములుగ ఉండును. వివిధసాధకులకు తగియుండు నట్లుగ సర్వేశ్వరుడు మతములను విశ్వాసములను కూడ వివిధములుగ ఏర్పఱచియున్నాడు. ఏ విధముచేతను బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి అందఱును అర్హులుగ ఉండరు; కాబట్టియే సాకారబ్రహ్మో పాసనముగూడ ఏర్పఱుపబడి యున్నది.

అందఱును మౌనముగ కూర్చుండిరి. శ్రీరామకృష్ణుడు పండితునితో "పోయి, దేవాలయములను దర్శింపుము, తోటలో కొంచెము పచారు చేయుము" అనెను. అప్పటికి సాయంకాలము ఐదున్నర గంట లై యుండినవి. పండితుడు తన మిత్రులతోను పెక్కండ్రు భక్తులతోను ఆగదినుండి వెడలి పోయెను.

కొంతసే పైన పిమ్మట గురుదేవుడు మహేంద్రుని వెంట నిడు కొని గంగలోని స్నానఘట్టమునొద్దకు పోయెను. గంగతీరమున ఆయన పండితుని కలసికొని "కాళిగుడికి రారా?" అని అడిగెను. "వచ్చుచున్నానండి, మనము కలసియే పోవుదము" అని పండితుడు అనెను. వారు గుడికి వచ్చిరి. గురుదేవుడు క్షోణితలము నెన్నుదురు సోకగ దేవికి ప్రణమిల్లెను.

దేవిచరణములు మందారపుష్పములచేతను బిల్వదళముల చేతను అలంకృతములై యుండినవి. ఆమె నేత్రములు మూడును తన భక్తులపై ప్రేమామృతమును వర్షించుచుండినవి. భక్తులకు అభయ మును వరములను ప్రసాదించుటకో యన దగి నట్లు దేవిహస్తములు రెండు పైకెత్తబడి యుండినవి. తక్కిన రెండు చేతులును మృత్యు చిహ్నములను దాల్చి యుండినవి. ఆమె కాశీపట్టుచీరను ధరించి

నగలతో అలంకృతమై యుండెను. ఆ విగ్రహమును జూచి ఆ సేవా ర్థులలో ఒకరు "ఈ విగ్రహమును నవీనుడు అను శిల్పి చేసినా డట. అట్లని నేను విని యున్నాను" అనెను. గురుదేవుడు "ఔను, నే నెఱుగుదును, కాని నాకుమాత్రము ఈ తల్లి చిత్స్వరూపిణియే" అనెను.

అది మునిమాపు వేళ. గురుదేవుడు తన గదికి పడమట అర్ధ వలయాకారముగ ఉన్న వసారలో గూర్చుండి యుండెను. బాబు రామును మహేంద్రుడును ఆయన సమీపముననే కూర్చుండియుండిరి. ఆయన అప్పుడు సగము భావోద్రిక్తదశయందు ఉండెను.

ఆ దినాలలో రాఖాలు శ్రీరామకృష్ణునియొద్ద ఉండ నందున, తనకు జరుగవలసిన యుపచారముల విషయమున ఆయన ఇబ్బందులు పడుచుండెను. ఎందఱో భక్తులు ఆయనతో నుండిరి గాని, జ్ఞానదశయం దున్నప్పుడు ఆయనకు ప్రతియొక్కని స్పర్శయు సుసహ ముగ ఉండదు. ఆయన బాబురాముతో "నీవు నాతో ఉందువా? ఉండిన బాగుండును. ఈ దశలో నన్ను ఇతరులు తాకుటకు నేను అనుమతింప లేను" అని, జాడగా చెప్పెను.

[అనురాగముతో మహేంద్రు నుద్దేశించి] మును పంతటి తఱచుగా నీ విచ్చటికి వచ్చుట లేదే, ఏల?

మహేంద్రుడు:—రాకుండుటకు ప్రత్యేక కారణము ఏమియును లేదు. ఇంటి పనులలో తీఱుబాటు లేకుండినది.

గురుదేవుడు:—బాబురాముని హృదయ మెట్టిదో నిన్ననే నేను తెలిసికొంటిని. అందు కనియే నాతో నుండు మని అతనిని ఒప్పించుటకు నేను ఇంతగా శ్రమపడుచున్నాను. తల్లి పక్షి సరి యైన కాలముననే గదా గ్రుడ్డును పొదుగును. బాబురామువంటి బాలుర హృదయములు పవిత్రములు. వారు ఇంకను కామినీకాంచనముల వలలో దగుల్కొన లేదు. అంతే కదా?"

మహేంద్రుడు:—నిజమే. వారు ఇప్పటికి ఇంకను నిష్కళంక హైయే యున్నారు.

గురుదేవుడు:—వారు క్రొత్తకుండలను బోలిన వారు. క్రొత్త కుండలో ఉంచిన పాలు పులిసి పోదు.

మహేంద్రుడు:—ఔను, స్వామీ.

గురుదేవుడు:—బాబురాము ఇక్కడ ఉండుట నాకు చాల అవసరము. నాకు కొన్ని యధ్యాత్మికదశలు కలిగినప్పుడు అతనివంటి వారి తోడ్పాటు కావలెను. ఇప్పటినుండియే తాను నాతో సదా ఉండ గూడ దనియు, అట్లుండిన చిక్కులు కలుగును అనియు అతడు అనుచున్నాడు. అతని బంధువులు ఇబ్బందులు పెట్టుదురు. నేను అతనిని ఇచ్చటికి 'శని' - 'భాను' వారములలో వచ్చుచుండు మనుచున్నాను.

పండితుడు తన మిత్రులను గూడి గదిలో ప్రవేశించెను.

గురుదేవుడు:—[పండితునితో] నీవు భగవద్గీతను తప్పక చదివి యుందువు సందేహము లేదు. అందఱ గౌరవాదరములను చూఱ గొనుచున్న వారిలో విశిష్టభగవచ్ఛక్తి ఉన్న దని అందు చెప్పబడి యున్నది.

పండితుడు భగవద్గీతలనుండి ఆ శ్లోకమును ఉదాహరించెను.

గురుదేవుడు:—నీలో నిజముగ దివ్యశక్తి ఉన్నది.

పండితుడు:—నేను పూనుకొన్న పని కొనసాగునట్లు పట్టు దలతో పాటువడు మందురా ?

ఆ ప్రశ్నకు ఔ ననుటకు శ్రీరామకృష్ణుడు ఎంతో కష్టపడెను. వెంటనే ప్రసంగమును వేఱువిషయమునకు మార్చివేసెను.

పండితుడును అతని మిత్రులును గురుదేవునకు ప్రణమిల్లిరి, వీడ్కొని బయలుదేఱుటకు సిద్ధముగ ఉండిరి. శ్రీరామకృష్ణుడు పండితునితో "మరల రమ్ము. గంజాయి త్రాగువారు తాము ఒక

రొకరిని కలసికొన్నప్పుడు ఆనందింతురు. ఒండొరులను ఆలింగనము కూడ చేసికొందురు. గంజాయి త్రాగని వారు కంటబడుదు రేని, వీరు చాటునకు పోయి దాగికొందురు. ఆవు తన దూడ దేహమును నాకును గాని క్రొత్తయావును జూచిన కొమ్ములతో గ్రుమ్మ నుంకించి బెదరించును'' అనెను. [అందఱును నవ్వుదురు].

పండితుడు గదినుండి వెడలి పోయెను. శ్రీరామకృష్ణుడు చిఱునవ్వు నవ్వి ''ఒక్క దినములోనే ఇతడు పలుచవాఱినాడు. ఇతనిలో ఎంత వినయము గలిగినదో గుర్తించితిరా? నేను చెప్పిన ప్రతి మాటను ఇతడు తల దాల్చినాడు.''

వెన్నెలవెలుగు అర్ధవలయాకారమున నున్న యా వసారలో నిండెను. శ్రీరామకృష్ణుడు ఇంకను అచ్చటనే ఆసీనుడై యుండెను. మహేంద్రుడు బయలుదేఱ సంసిద్ధుడై యుండెను.

గురుదేవుడు:—[ప్రేమతో] ఇక నీవు ఇప్పుడు పోవలసినదేనా?

మహేంద్రుడు:—ఔను, స్వామీ, నన్ను సెలవు తీసికొన నిండు.

గురుదేవుడు:— భక్తు లందఱ యిండ్లకును పోవలయునను తలంపు నాకు కొన్నాళ్లుగా గలిగి యున్నది. మీయింటికిని రావలె నని ఉన్నది. నీవు ఏమందువు?

మహేంద్రుడు:—వచ్చిన చాల బాగుండును.

1884—వ సంవత్సరము జూలై తే 3 ది గురువారము.

శ్రీరామకృష్ణుడు కలకత్తాలో బలరామబోసు [బలరామవసు] నింట గూర్చుండి యుండెను. రాము, బలరాము, బలరాముని తండ్రి, మహేంద్రుడు, మనోమోహనుడు — ఇంకను పలువురు యువభక్తులు ఆయనకు సమీపమున గూర్చుండి యుండిరి.

శ్రీరామకృష్ణుడు కొన్ని నిమిషముల కాలము వసారకు బోయి యుండి మరలి వచ్చెను. ఆయన వెలుపలికి బోవుచుండి

నప్పుడు విశ్వంభరుని కూతురు — ఆ ఏడేండ్ల పిల్ల — ఆయనకు నమస్కరించెను. గదికి మరలి వచ్చిన తర్వాత గురుదేవుడు ఆ యమ్మాయితోను అంతే వయసు గల యామె సఖులతోను మాటాడ నారంభించెను.

అమ్మాయి :— [గురుదేవునితో] నేను తమకు నమస్కారము చేసితిని. తాము నా నమస్కారమును గమనింపనైన లేదే.

గురుదేవుడు :— [చిఱునవ్వు నవ్వుచు] నాకు నమస్కరించి తివా? నిజముగ నేను చూడ లేదు.

అమ్మాయి :— ఉండుడు, మీకు మరల నమస్కరింపవలె నని యున్నది, రెండవ చరణమునకు గూడ.

శ్రీరామకృష్ణుడు నవ్వి కూర్చుండెను. ఆయన ఆమె ప్రణామ మును స్వీకరించి, బదులు తానును నుదురును నేలకు ఆనించి నమస్క రించెను. ఆయన ఆ బాలికను పాట పాడుమని కోరెను. "ఒట్టు, నేను పాడను" అని అన్నది ఆమె. గురుదేవుడు ఆమెను మరల మరల నిర్బంధము చేయగా ఆమె "ఒట్టుపెట్టుకొన్నతర్వాత మీరు నన్ను ఇట్లు బలవంతపెట్ట వచ్చునా" అనెను. ఆ పిల్లలగోష్ఠి గురుదేవునకు పరమాహ్లాదకరముగ నుండెను. ఆయనయే వారి వినోదమునకై చిన్న చిన్న తేలిక పాటలను పాడెను.

అందొక పాట —

నీ ప్రియుఁడు నిన్నుఁ జూచిన నిష్ఠురముల
నాడ కుండఁగ వలె నేని నరుగుదెమ్మ
జడగ నల్లుదు నీ కేశ సంచయమును.

పిల్లలును భక్తులును నవ్విరి.

గురుదేవుడు:— [భక్తులతో] పరమహంస ఐదేండ్ల శిశువును బోలిన వాడు. ఆయన కంటికి సమస్తమును చైతన్యమయముగ కాని పించును. ఒకప్పుడు నేను కామార్పుకురులో ఉన్నప్పుడు మా

శివరాముడు నాలు గై దేండ్ల వాడు. ఒకనా డతడు చెఱువునొద్ద మిడుతలను పట్టుకొనుటకు ప్రయత్నించు చుండెను. ఆకులు కదలు చుండినవి. వాని చప్పుడును మాన్ప గోరి ఆ బాలుడు "చప్పుడు చేయకుడు, చప్పుడు చేయకుడు. నేను మిడుతలను కనుపెట్టి యుండవలెను" అన్నాడు. మఱి యొక నాడు తుపాను వీచిన దినము, ప్రచండవర్షము కురిసినది. శివరాముడు నాతో గూడ ఇంటిలో నుండెను. నడుమ నడుమ మెఱుపుతీగలు తళుక్కు తళుక్కు మని మెఱయుచుండినవి. అతడు తలుపు తెఱచుకొని వెలుపలికి పో గోరెను. నేను అతనిని మందలించి ఆపితిని కాని అత డేమో నడుమ నడుమ తొంగి చూచుచునే యుండెను. మెఱపు దీగను చూడగనే ఆ పసివాడు "మామా, చూడు చూడుము, అగ్గిపుల్లలను మరల వెలిగించుచున్నారు" అని ఆశ్చర్యముతో అఱచెను.

పరమహంస శిశువును బోలిన వాడు. శిశుదృష్టిలో సొంత చుట్టమునకును పరాయిమనుష్యునకును భేదమే లేదు. లోకపు చుట్టఱిక ముల విషయమున గూడ శిశువునకు ఒక నిష్కర్ష లేదు. శివరాముడు ఒకనాడు నన్ను "మామా, నీవు మా నాయనకు సోదరుడవా, బావ మఱదివా" అని యడిగినాడు.

అట్టి శిశువువంటి వాడే పరమహంస. ఆయన తన చోటు మొద లయినవి ఇవి అని వాని కెట్టి ప్రత్యేకము లైన గుర్తులను ఉంచుకోడు. సర్వమును ఆయనకు బ్రహ్మముగనే గోచరించును. కావున తన సంచారముల పట్లం గూడ ఆయనకు శ్రద్ధ యుండదు. దుర్గాపూజను జూచుట కని శివరాముడు హృదయు నింటికి పోయి నాడు. కాని ఆ యింట నుండి కూడ వెలువడి ఎక్కడెక్కడికో పోయినాడు. ఒక బాటసారి ఆ నాలుగేండ్ల పిల్లవానిం జూచి "ఎక్కడినుండి వచ్చుచున్నా" వని అడిగెను. ఆ పిల్లవాడు ఎక్కువగ నేమియు చెప్ప లేక పోయెను. "గుడిసె" అను పదమును మాత్రము చెప్పెను. గుడిసె అనగా లోకమాతృవిగ్రహమును ప్రతిష్ఠించి ఆరాధించుచున్న యా పెద్ద పందిరి యని బాలుని హృదయము.

"అబ్బాయీ, నీవు ఎవరితో కూడ ఉన్నా" వని ఆ క్రొత్తవాడు అడిగినప్పుడు, అతడు "అన్న" అను నొక్కమాటను మాత్రమే పలికెను.

ఒక్కొక్కప్పుడు పరమహంస వెఱ్ఱివానివలె నడచుకొనును. దక్షిణేశ్వర దేవాలయ ప్రతిష్ఠ జరిగిన పిదప కొన్నాళ్ళకు అచ్చటికి నొక వెఱ్ఱివాడు వచ్చెను. అతడు నిజముగ బ్రహ్మజ్ఞానసంపన్నుడైన యోగిపుంగవుడు. అతనికి ఒకచేత నొక వెదురుకొమ్మయు మఱియొక చేత మామిడి మొలక గల యొక కుండయు ఉండెను. అతని చెప్పులు చిరిగి యుండెను. అతడు ఎట్టి సాంఘికాచారములను పాటించుట లేదు. గంగలో స్నానముచేసిన పిమ్మట అతడు ఎట్టి అనుష్ఠానమును చేయ లేదు. తన వస్త్రపు కొంగున మూటకట్టి తెచ్చుకొన్న పదార్థములను తినెను. తరువాత నతడు కాళిగుడిలో ప్రవేశించి అమ్మవారి మీద స్తోత్రములు పాడెను. ఆ దేవాలయము కదలుచున్నట్లు అగపడెను. హలధారి అప్పుడు గర్భాలయమున నుండెను. ఆ వెఱ్ఱివానిని ఎవ్వరును అతిథిగృహములో అన్నము తిన నీయ లేదు. కాని ఆ యవమానము నాతడు లక్ష్యపెట్ట లేదు. కుక్కలు ఎంగి లాకులలోని శేషములను తినుచుండిన పెంటగుట్టల యొద్ద ఏ దేని యాహారము దొరకు నేమో యని యతడు వెదకెను. అక్కడ ఉన్న యాహారము తాను తినుటకై అతడు సగము సగము కుక్కల నావలికి నెట్టుచుండెను. కాని అవియు అతనిని లక్ష్యపెట్ట లేదు. హలధారి అతనివెంబడినే పోయి "నీ వెవరవు? పరిపూర్ణ బ్రహ్మజ్ఞానివా?" అని యడిగెను. ఆ వెఱ్ఱివాడు "అరవకుము, అవును నేను పరిపూర్ణబ్రహ్మజ్ఞానినే" అని రహస్యముగా చెప్పెను. ఆ విషయమును హలధారి నాకు చెప్పినపుడు నాగుండె తటతట కొట్టుకొన్నది. నేను హృదయుని పట్టుకొని తొంగులాడితిని. నేను లోక జననితో "అమ్మా, నేనుగూడ అట్టి దశల అనుభవింప వలెనా?" అని అడిగితిని. మే మందఱము అతనిని చూచుటకు పోయితిమి. అతని మాటలు జ్ఞానసంభృతములుగ నుండినవి. ఇతరుల యెదుట అతని

ప్రవర్తన మాత్రము వెఱ్ఱివాని ప్రవర్తనవలె నుండినది. అతడు ఈ దేవాలయారామమునుండి పోయినపుడు హాలధారి చాలదూరము అతని వెనుకనే పోయెను. ద్వారమును దాటిన వెనుక అతడు హాలధారితో "నీతో నే నేమి చెప్పుదును? ఎప్పుడు నీకు ఈ పడియలోని నీటికిని గంగాజలమునకును ఎట్టి భేదమును తోపక ఉండునో అప్పుడు నీకు పరిపూర్ణ బ్రహ్మజ్ఞానము కలిగినట్లే" అనెను. ఈమాటలనుచు అతడు చరచర నడచి పోయెను.

శ్రీరామకృష్ణుడు మహేంద్రునితో సంభాషింప నారంభించెను. ఇతరభక్తులు కూడ నచట నుండిరి.

గురుదేవుడు :—(మహేంద్రునితో) శశధరునిగూర్చి నీ యభిప్రాయ మేమి?

మహేంద్రుడు :—ఆయన చాల మంచివాడు.

గురుదేవుడు :—చాల బుద్ధిమంతుడుకూడ కదూ?

మహేంద్రుడు :—అవును, చాల చదువుకొన్నవాడు.

గురుదేవుడు :— అనేకుల గౌరవాదరములను చూఱగొను వ్యక్తిలో ఒకవిధమైన భగవచ్ఛక్తి యున్నదని భగవద్గీత చెప్పుచున్నది. కాని శశధరుడు ఇంకను కొన్ని పనులను చేయ వలసిన బాకి యున్నది. వట్టి పాండిత్యముచేత అత డేమి సాధించును? కొంత తపస్సు చేయ వలయును. ఆధ్యాత్మికసాధనను కొంత సాగింప వలయును.

శ్రీరామకృష్ణుడు పూజావిగ్రహమును దర్శించుటకై ఇంటిలోపలికి పోయెను, కొన్ని పుష్పముల సమర్పించెను. వచ్చినట్టి యతనిని చూచి బలరాము నింటి మహిళలు ప్రీత లైరి.

గురుదేవుడు కూటమునకు మరలి వచ్చి ఇట్లనెను. ఐహికపరులు భక్తి నభ్యసింతురు. జపతపముల చేయుదురు. కాని క్రమమును పాటింపక తోచినపుడు చేయుదురు. మఱి దేవుని తప్ప ఒం

డెఱుగని వారికి ఉచ్ఛ్వాస నిశ్వాసముల తోపాటు భగవన్నామానుసంధానము సాగుచునే యుండును. కొందఱు ఓం రామ యని మనస్సులో అనుకొందురు. జ్ఞానమార్గానుసారులు సైతము సోహం అని మాటికిమాటికి చెప్పుచుందురు. తమ నాలుకలతో సదా భగవన్నామమును కీర్తించువా రితరు లున్నారు. ప్రతివాడును దేవుని సదా స్మరించుచు జ్ఞప్తియం దుంచుకో వలయును.

శశధరపండితుడు ఒక రిద్దఱు మిత్రులతో గదిలో ప్రవేశించి గురుదేవునకు ప్రణమిల్లెను.

గురుదేవుడు:—[చిఱునవ్వుతో] వరుని రాకకై వేచియున్న వధువుయొక్క చెలులవలె ఉన్నాము మేము.

పండితుడు నవ్వెను. గదిలో భక్తులు నిండి పోయిరి. వారిలో డాక్టరు ప్రతాపును, బలరామునితండ్రిగారును కూడ నుండిరి. గురుదేవుడు తన ప్రసంగమును సాగించెను.

గురుదేవుడు:—[శశధరునితో] జ్ఞానమునకు మొట్టమొదటి లక్షణము ప్రశాంత మైన ప్రకృతి. రెండవ లక్షణము నిరహంకారత. నీకు ఆ రెండును ఉన్నవి. జ్ఞానికి ఇతర లక్షణములు కూడ గలవు. సాధువులను గలసికొన్నప్పుడు జ్ఞానిలో గాఢవైరాగ్యము వెలుగొందును. ఉపన్యసించుట మున్నగు పనులను నిర్వహించుటలో జ్ఞాని యొక సింహముం బోలును. తన యిల్లాలి యెదుటనో, అతనిలో హాస్యనైపుణి నిండి తొనకుచుండును. [అందఱును నవ్వుదురు.]

మఱి విజ్ఞానిస్వభావము దీనికంటె పూర్తిగ వేఱైనది. అందులకు చైతన్యదేవుడు ఒకలక్ష్యము. విజ్ఞాని యైన వాడు ఒక శిశువువలెనో, వెఱ్ఱివానివలెనో, జడవస్తువువలెనో, దయ్యమువలెనో ఉండును. శిశువుంబోలి యున్నప్పుడు అతనిలో ఒక్కొక్కప్పుడు శిశుసహజ మైన అమాయికతయు, ఒక్కొక్కప్పుడు బాల్యానురూప మైన నిరర్థకవ్యాపారపరతయు, ఎప్పు డేని ఇతరులకు బోధించుచున్నప్పుడు తారుణ్యోచిత మైన శక్తియును ప్రకట మగును.

అందఱును మౌనముగ గూర్చుండిరి. మరల గురుదేవుడే పండితునితో ఇట్లనెను :

గురుదేవుడు :— ఇంతకు మునుపు గొప్పవారు ఎందఱో ఇచ్చటికి వచ్చుచుండిరి.

శశధరుడు :—గొప్పవారనగా ధనాఢ్యులా ?

గురుదేవుడు :—కాదు, గొప్ప పండితులు.

శశధరుడు :—[వినయముతో]— స్వామీ, ఎట్టి తహతహపాటు ఉన్న భగవత్సాక్షాత్కారము గలుగునో దయచేసి చెప్పుడు.

గురుదేవుడు :—ఒకప్పుడు ఒక గురువు తన శిష్యుని "నాతో రమ్ము. భగవత్సాక్షాత్కారము నొసంగ గల తహతహపాటు ఎట్టిదో నీకు చూపెదను" అని పిలుచుకొని పోయి, అతనిని ఒక చెఱువులో దింపి, అతని తలను నీటిలో ముంచి, దానిని ఎత్త నీయక అదిమి పట్టెను. కొన్ని నిమిషములకు పిదప పట్టు వదలించి, గురువు శిష్యుని "నీకు ఎట్లు ఉండినది?" అని అడిగెను. శిష్యుడు "నాకు ప్రాణములు పోవు ననిపించెను. ఊపిరికై నేను కొట్టుకులాడితిని" అని బదులు చెప్పెను.

శశధరుడు:—ఔ నౌను, సరి సరి, ఇప్పుడు నాకు అర్థమైనది.

గురుదేవుడు:—దేవుని ప్రేమింప వలయును. ఉన్న విషయము అంతయును అదే. భక్తియే సారతమాంశము. నారదుడు రాముని "నాకు సదా నీ చరణారవిందములందు పవిత్రప్రేమ నుండ నిమ్ము. విశ్వమోహన మైన నీ మాయచే నను వంచితుని కానీయకుము" అని వర మడిగెను. శ్రీరాముడు "వేఱు వరమును దేని నైనను కోరు" మనెను. నారదుడు "నేను కోరను. వే తేదియు నాకు వలదు. నీ చరణారవిందములందు ప్రేమను మాత్రమే నా కొసంగుము. ఇదే నా యేకైక ప్రార్థనము" అనెను.

శశధరపండితుడు సెలవు గైకొని బయలుదేఱ సంసిద్ధుడయ్యెను. అతనికై యొక బండిని దెమ్మని శ్రీరామకృష్ణుడు ఒక భక్తుని పంపెను.

అది మునిమాపు వేళ. శ్రీరామకృష్ణుడు లోకజనని నామములను కృష్ణుని, రాముని పేర్లను, హరినామమును కీర్తింప నారంభించెను. భక్తులు నిశ్శబ్దముగ గూర్చుండిరి. గురుదేవు డొనర్చిన యీ సంకీర్తనము ఎంత మధురముగ నుండెను! భక్తుల హృదయములు ఆమూలముగ కరగిపోయినవి.



ఎనిమిదవ ప్రకరణము

# దైవోన్మాద దశ

1884-వ సంవత్సరము సెప్టెంబరు తే 19 ది శుక్రవారము.

అది మహాలయామావాశ్య. హిందువులకు పుణ్యదినము. మధ్యాహ్నానంతరము రెండుగంట లప్పుడు శ్రీరామకృష్ణుడు తన గదియందు కూర్చుండి యుండెను. ఆయనతో గూడ మహేంద్ర ముఖర్జి, ప్రియముఖర్జి, మహేంద్రనాథుడు, బాబురాము, హరీశుడు, కిశోరి, లాటు అను వారును కూర్చుండి యుండిరి. కొందఱు నేలపై గూర్చుండిరి, కొందఱు నిలబడి యుండిరి, కొందఱు ఇటుఅటు పచారు చేయుచుండిరి. హాజ్రా, వాకిలివసారలో గూర్చుండి యుండెను. రాఖాలు బలరాముతో బృందావనమున ఉండెను.

గురుదేవుడు:—[మహేంద్రముఖర్జీ ప్రభృతులతో]—ఇచ్చటికి వచ్చుచుండుటవలన మీరు ఏమి లాభపడుచున్నారో తెలిపినచో నేను చాల సంతోషింతును. [మహేంద్రనాథునితో] నాకు చదువుటకు గాని, వ్రాయుటకు గాని, విశేషముగ దెలియదు. మఱి ప్రజలు నాయొద్దకు వచ్చుచుందురే, కారణ మేమి?

మహేంద్రుడు:—భగవచ్ఛక్తి మీలో ఉన్నది. మీకింతటి యాకర్షణశక్తి ఉండుటకు అదే కారణము. ఈలాగు ఆకర్షించునది దైవమే.

గురుదేవుడు:—దేవునివంకకు, అందఱును ఆకృష్టులు కానే లేరు. కొందఱు విశిష్టాత్ములు మాత్రమే ఆలాగు ఆకృష్టు లగుదురు. ఆజన్మము సత్ప్రవణతలు గల వారికి మాత్రమే భగవంతునందు ప్రేమ గలుగును. ఆలాగు కాకున్న, బాగ్బాజారునందు ఉన్నట్టి

యందఱిలోను నీవు ఒక్కడవు మాత్రము ఇచ్చటికి వచ్చు చుండుటకు కారణ మేమి? ఒక పెంటగుట్టవలన మేలు గలుగు నని నీవు అనుకో లేవు కదా.

[ముఖర్జీసోదరులతో] వీరాడు ఇప్పుడు సంపన్నులరై ఉన్నారు. క్రిందటిపుట్టుకలో ఎవరి యోగ సాధన అసమగ్రముగ ఆగిపోయెనో వారే మఱు జన్మమున శ్రీమంతుల యిండ్లలో జన్మించి, భగవత్సాక్షాత్కారమునకు వలసిన జ్ఞానసాధనలను మరల ప్రారంభింతురు.

మహేంద్రముఖర్జీ:—ఎవనికి గాని, యోగభ్రంశము ఏల కలుగును?

గురుదేవుడు:—సాధకునకు ఒక వైపు భగవంతుని ధ్యానము సాగుచుండగనే, వేఱొక వైపు ఐహికసుఖానుభవమందు కోరిక గలుగ వచ్చును. యోగసాధననుండి అతనికి భ్రంశమును గలిగించునది ఆ కోరికయే. ప్రకృత జన్మమున ఫలము నొందక ఆగిపోయిన ఆధ్యాత్మిక ప్రవణతలతోనే సాధకుడు మఱు జన్మమును గాంచును.

మహేంద్రముఖర్జీ:—మఱి, ఉపాయము ఏమి?

గురుదేవుడు:—ఆశ ఉన్నంతవఱకును, ఐహిక వస్తు వాంఛ లున్నంతవఱకును—మానవునకు ఎట్టి విముక్తియును లేదు.

ఆశలును ఆత్రమును ఉంచుకొనుట మంచిది కాదు. అందుకై నేను నా మనసులో గలిగిన యాశలు ఎట్టి వైనను వానిని తీర్చివేసికొనుచుంటిని. ఒకనాడు బుర్రాబాజారులో రంగుమిఠాయిని జూచి తినవలె నని ఆశపడితిని. వారు నాకు దెచ్చి యిచ్చినారు, నేనును యథేష్టముగ మెక్కితిని. అందుల ఫలితముగా నాకు రోగము వచ్చినది.

నా బాల్యములో ఒకనాడు గంగలో స్నానము చేయుచుండి నప్పుడు ఒక బాలుని జూచితిని. అతడు తన నడుమున కొక బంగారు

నగను ధరించి యుండెను. దైవోన్మత్తదశలో నేను ఉండి నప్పుడు అట్టి నగను నేనే ధరింపవలె నను కోరిక నాకు గలిగినది. అంతట ఆనగను నాకు ఇచ్చినారు. కాని దానిని నేను చిరకాలము ఉంచుకో లేక పోయితిని. దానిని ధరించి నప్పు డెల్ల నా శరీరమున నొక వాయుప్రవాహ ముప్పొంగి నాకు బాధ గలిగించుచుండెను. నా శరీరమునకు కాంచనస్పర్శ కలుగుటే ఆ బాధకు కారణము. ఆనగను కొన్ని నిమిషములు ధరించితిని. కాని దానిని వెంటనే దూరముగ పెట్ట వలసి వచ్చెను. పెట్టకున్న దానిని త్రెంపి వేయ వలసి యుండెడిది.

ఆ దినాలలో గుడితోటకు సాధువులు ఎక్కువగ వచ్చు చుండిరి. వారికి సామగ్రిని సరఫరా చేయుటకు ప్రత్యేకముగ ఒక కొట్టు ఉంచవలయు నను కోరిక నాకు పుట్టినది. మథుర్ బాబు అట్టి కొట్టు నొకదానిని పెట్టించెను. అం దుండి సాధువులకు ఆహారపదార్థ ములు వంటచెఱకు మొద లయిన వస్తువులు సరఫరా యగు చుండెను.

బంగా రంచు గలిగి మిక్కిలి వెల పొడు గైన యొక యంగీని తొడుగుకొనవలె ననియు, వెండి హుక్కా గొట్టమున పొగ త్రాగ వలె ననియు, నా కొక సారి ఆశ కలిగినది. మథుర్ బాబు నాకు అటువంటి యంగీని హుక్కాగొట్టమును పంపెను. నేను ఆ యంగీని తొడుగుకొంటిని. ఆ గొట్టముతో వివిధ వైఖరులలో పొగ త్రాగితిని. కొంతసేపు ఇటు ఆనుకొని, త్రాగితిని; కొంతసేపు అటు ఆనుకొని, త్రాగితిని; కొంతసేపు తలను పైకెత్తుకొని, త్రాగితిని; కొంతసేపు మొగమును క్రిందికి వంచుకొని, త్రాగితిని. తర్వాత నాలో నేనే "ఓ మనసా, వెండిహుక్కాగొట్టముతో పొగత్రాగుట యందు రే, అది యిదే" అని అనుకొని దానిని వెంటనే పాఱ వేసితిని. అంగీని మాత్రము మఱి కొన్ని నిమిషముల కాలము ఒడలిపై ఉండనిచ్చితిని. తర్వాత దానిని గూడ తీసివేసితిని. కాలి క్రింద వేసి త్రొక్క నారం భించితిని, దానిపై ఉమ్మివేసితిని. "ఇది యొక వెల పొడు గైన యంగీ.

కాని ఇది మానవుని రజోగుణమునే వర్ధిల్ల జేయును'' అని నాలో ననుకొంటిని.

రాఖాలు బలరామునితో బృందావనమున నుండెను. అతడు మొదట మొదట ఆ క్షేత్రమును గూర్చి చూచుచు ఉద్రిక్తభావభరితము లైన జాబులను వ్రాయుచుండినాడు. మహేంద్రనాథునకు "క్షేత్రము లన్నింటను ఇది ఉత్తమోత్తమము. దయచేసి ఇచటికి రమ్ము. ఇచట చుట్టును నెమిళ్లు నర్తించుచుండును. ఇట భక్తిగీతములు సదా విన నగుచుండును. భక్తితాండవములు సదా కననగుచుండును. అవి చ్ఛిన్న దివ్యానంద లహరి యొకటి ఇచట నున్నది''—అని వ్రాసినాడు. తర్వాత రాఖాలునకు జ్వరము వచ్చి మంచము పట్టించినది. అతని శరీరస్థితినిగూర్చి శ్రీరామకృష్ణుడు చాల మనోవ్యథను అనుభవించి అతని కారోగ్యము గలుగుటకై లోకమాతను ఆరాధింతు నని వ్రతము పూనెను. కావున ఆయన రాఖాలును గుఱించి మాటాడ నారంభించెను.

గురుదేవుడు:—ఇచట నాకు పాద శుశ్రూష చేయుచుండి నపుడే రాఖాలుకు దివ్యభావోద్రేకము ప్రథమపర్యాయము గలిగినది. భాగవతపండితుడు ఈ గదిలోనే కూర్చుండి ఆ పవిత్రపురాణగ్రంథ మును జదివి వివరించుచుండెను. ఆ మాటలను వినుచుండగనే రాఖాలు నఖము నఖము వణకుచుండెను. తర్వాత నతడు పూర్తిగా కొయ్యవారి పోయెను.

అట్టి భావోద్రేకము అతనికి రెండవ తూరి ఎప్పుడు కలిగిన దనగా, బలరామబోసు ఇంట నుండగా గలిగినది. ఆ దశలో అతడు సరిగా కూర్చుండ లేక, నేలపై సాగిల పడిపోయెను. రాఖాలు సాకారబ్రహ్మోపాసకులలో జేరినవాడు. నిరాకారబ్రహ్మమునుగూర్చి ఎవరైన నో రెత్తినచో, అతడు ఆ చోటు నుండి తొలగిపోవును.

అతని కారోగ్యము కలిగినచో, లోకమాతను ఆరాధింతు నని నేను మ్రొక్కుకొని యున్నాను. చూడుడు. పాపము, అతడు

తన యింటివారిని చుట్టములను త్యజించి తన్ను పూర్తిగా నాకు అర్పించుకొన్నాడు. అప్పుడప్పుడు భార్యను జూచి రమ్మని నేనే అతనిని పంపుచుంటిని. అతని కింకను కొంచెము భోగాశ యుండెను.

[మహేంద్రనాథుని జూపి] రాఖాలు బృందావనమునుండి ఇతనికి జాబు వ్రాసినాడు. ఆ చోటు చాల బాగున్నదని, నెమిళ్లు చుట్టును ఆడుచుండు నని వ్రాసినాడు. ఇప్పుడు ఆ నెమిళ్లే అతనిని జూచుకొనును గాక. అతడు నిజముగ నాకు ఏమి చేయుటకును పాలుపోనట్లు జేసినాడు.

యువకులపైని నాకు ఇంతటి మక్కువ ఏల? వారు ఇంకను కామినీకాంచనాల స్పృక్క లేక ఉన్నారు కాబట్టి. వారు నిత్యశుచుల కోవకు చెందిన వారని నాకు దోచును.

నరేంద్రుడు మొదటి సారి ఇచ్చటికి వచ్చినప్పుడు అతని యుడుపు లెల్ల మురికి నిండి యుండినవి కాని అతని నేత్రములును ముఖమును, లోపలి సరకును సూచించుచుండినవి. అప్పుడతనికి పెక్కు పాటలు రావు. ఒకటి రెండు పాటలనుమాత్రమే అతడు పాడినాడు. ఒకటి

"మరలుదమె మనస మన నెలవునకు?"

అను పాట. రెండవది

"దేవాధినాయక, దినములు నాకు
నేగనే వలయునే యిటుల రిత్తగను?"

అను పాట.

నరేంద్రుడు ఇచ్చటికి వచ్చినప్పుడంతయు, గదిలో జనులు నిండియుండినప్పటికిని, నేను అతనితో మాత్రమే మాటాడుచుంటిని. "దయచేసి వారితోను మాటాడుడు" అని అతడు నన్ను కోరిన మీదట నేను ఇతరులతో మాటాడుచుంటిని.

అతనిని జూడ వలెననెడి యాశ నాకు వెఱ్ఱి యెత్తించినది. అతనికై నేను యదుమల్లికు నింట పిలపించితిని. ఇక్కడ కూడ భోలనాథుని చేయి పట్టుకొని నేను ఏడ్చితిని. "ఒక్క కాయస్థబాలునకై మీరు ఇట్లు ప్రవర్తింపరా" దని నన్ను భోలనాథుడు ఎచ్చరించినాడు. ఒకనాడు మన లట్టుబొమ్మయ్య ( = ప్రాణకృష్ణుడు) చేతులు జోడించుకొని "చదువు సంధ్యలు లేని యా నరేంద్రునకై మీరు ఇంతగా తహతహపడ నేల" అని నాతో అన్నాడు.

'ఈ యువకు లందఱును మీరును నాయొద్దకు వచ్చుచుండుటకు కారణ మేమో మీరు చెప్ప గలరా? నాలో ఏదో యొకటి యుండ వలయును. లే కున్న మీరు ఇంతగా ఆకృష్టులు కా నేల ?

ఒకప్పుడు నేను సిహోరులోని హృదయునింటికి పోయితిని. అచ్చటినుండి నన్ను శ్యాంబాజారునకు పిలుచుకొని పోయిరి. ఏడు అహోరాత్రములు ప్రజలు ఒక పెద్ద గుంపుగ నన్ను పరివేష్టించి యుండిరి. అంతటి యాకర్షణ ముండెను! రేయింబవళ్లు సంకీర్తనలును భక్తితాండవములును తప్ప వే ఱేమియు జరుగ లేదు. ప్రజలు గోడలపై బారులు తీఱి నిలబడుటయే కాక చెట్లపైకి కూడ నెక్కిరి. "ఏడుపర్యాయములు మరణించి మరల బ్రతికి లేచిన యొక వ్యక్తి ఈ యూరికి వచ్చియున్నా" డన్న వదంతి సర్వత్ర వ్యాపించెను. నాకు ఉడుకు హెచ్చి అంగవికృతిరోగము (హీట్ అపాపలెప్సి) వచ్చు నేమో యను భయముచే హృదయుడు నన్ను ఆ గుంపుల నడిమినుండి దూరముగ వరిపొలములలోనికి లాగికొని పోయెడి వాడు. ప్రజల తండము చీమలబారును బోలి అచ్చటికిని మా వెంట పడుచునే యుండినది. హృదయుడు "ఎందుల కయ్యా, మమ్ము ఈ విధముగ పీడింతురు? మనము కీర్తనల నెప్పుడును విన్నవారము కామా?" అని వారిని చీవాట్లు పెట్టుచుండెను.

సుదూరగ్రామములనుండియు ప్రజలు గుంపులుగుంపులుగ వచ్చిరి. రాత్రిసైతము వారు అచ్చటే ఉండిపోయిరి. దివ్యాకర్షణము

అనగా నేమో నాకు శ్యాంబాజారునొద్ద తెలిసినది. దేవుడు భువి నవతరించి నపుడు ఆయన తన యోగమాయ యనెడి దివ్యశక్తిచేత ప్రజల నాకర్షించును. ప్రజలు మంత్రముగ్ధులుగ నవుదురు.

శ్రీరామకృష్ణుడు ముఖర్జీసోదరులతో సంభాషించెను. పెద్దవాడైన మహేంద్రముఖర్జీకి సొంత వ్యాపార మున్నది. చిన్న వాడైన ప్రియనాథుడు ఇంజనీరుగా నుండెను. కొంత ధనము సంపాదించుకొన్న పిమ్మట అత డా నౌకరిని వదలుకొనెను. మహేంద్రముఖర్జీకి ముప్పది యైదు, ముప్పదియాఱుసంవత్సరముల వయస్సు. ఆ సోదరులకు కలకత్తాలోను, గ్రామమునందును కూడ భవనములు కలవు.

గురుదేవుడు:— (చిఱునవ్వుతో) మీ జ్ఞానము రవంత మేలు కాంచినంతమాత్రమున మీరు సోమరులుగా నుండ వలదు. పురోగమింపుడు. గంధపుచెట్లతోపున కావల ఇంకను విలువ గల వేఱు వస్తువులు వెండిగనులు, బంగారుగనులు మున్నగునవి యున్నవి.

ప్రియనాథుడు:— (చిఱునవ్వుతో) స్వామీ మా పాదములు నిగళబద్ధములై యున్నవి. మేము ముందునకు కదలలేము.

గురుదేవుడు:— కాళ్లు కట్టువడియున్న నేమి? మనస్సు కదా ముఖ్యము. బంధనమును మనస్సునకే. స్వేచ్ఛయు మనస్సునకే.

ప్రియనాథుడు:— మఱి మనస్సు నా యధీనములో లేదే.

గురుదేవుడు:— ఏలాగు లేకుండును? అభ్యాసయోగ మనునదొకటి గలదు. అనగా అభ్యాసమూలముగా యోగసిద్ధి. అభ్యాసమును సాగించుచునే యుండుము. నీ మనస్సు నీవు త్రిప్పిన ట్లెల్ల తిరుగునంత విధేయ మగును.

అది మునిమాపు వేళ. దేవాలయములలో సాయంపూజా సమయమున మ్రోగు గంటల తాళముల, ఇతరవాద్యముల ధ్వనులు విన నైనవి. గురుదేవుడు బాబురాముని కాళిగుడికి తనతో రమ్మని పిలిచెను. వా రిరువురును గుడివైపునకు పోయిరి. వారివెంబడి

మహేంద్రనాథుడును ఉండెను. వసారలో కూర్చుండి యున్న హరీశుని చూచిన వెంటనే గురుదేవుడు "ఏమది? ఇతడు భావోద్రేక దశలో నున్నాడా?" అనెను.

గురుదేవుడును భక్తులును ప్రాంగణముగుండ పోవుచు రాధా కాంతాలయమున కెదుట ఒక నిమిష మాగి అచటి యారాధనను చూచిరి. తరువాత కాళిగుడికి పోయిరి. చేతులు జోడించుకొని గురుదేవుడు లోకజననిని "అమ్మా, లోకమాతా, బ్రహ్మమయీ!" అని కీర్తించెను.

గుడి కెదుట నున్న వేదికను సమీపించి ఆయన విగ్రహము నకు ప్రణమిల్లెను. హారతి జరుగుచుండెను. ఆయన లోపలికి పోయి అమ్మవారికి విసనకఱ్ఱతో గాలి వీచెను.

సాయంపూజ ముగిసినది. భక్తులు అమ్మవారికి మ్రొక్కిరి. అది అమావాస్యరాత్రి. గురుదేవుడప్పుడు జ్ఞానదశయందుండెను. క్రమక్రమముగ ఆదశ ముదిరి గాఢ భావోద్రేకముగ మారెను. ఆయన, కలు త్రాగినవానికిం బోలె తనకు తల తిరుగుచుండగా, బాబురాముని చేతిని పట్టుకొని గదికి మరలి వచ్చెను.

పడమటి వసారలో ఒకదీపము వెలిగింపబడెను. గురుదేవుడు హరిః ఓమ్, హరిః ఓమ్, హరిః ఓమ్, అనియు తంత్ర శాస్త్రోక్తము లైన ఇతరమంత్రముల ననుసంధించుచు కొన్ని నిమిషము లచట కూర్చుండెను. వెంటనే గదికి మరలి వచ్చి తూర్పుముఖముగ చిన్న మంచముపై కూర్చుండెను. ఇంకను ఆయన దివ్యభావోద్రేకములో పూర్తిగ మునిగియే యుండెను. లోకమాతతో నిట్లనెను: "అమ్మా, మొదట నేను మాటాడవలెను. పిమ్మట నీ వట్లు నడచుకోవలెను. అనుట అర్థము లేని క్రమము. మాటల కర్థ మే మున్నది? అవి పట్టి గుర్తులే కాని వేఱు కావు. ఒకడు 'నేను భుజింతు' ననును. మరల మఱియొకడు 'ఆ మాటనే నేను చెవిలో వేసికొనను' అనును. సరియే, అమ్మా, నేను భుజింప నంటి ననుకొనుము. ఆకలి యేమో

యుండును కదా ? ఒకడు బిగ్గఱగా మొఱపెట్టుకొన్నపుడు మాత్రము చెవి యొగ్గుటయు లోలోన ప్రార్థించినపుడు వినకుండుటయుసాధ్యమా? నీవు నీవే. ఇక నే నేల మాటాడుచున్నాను ? నా ప్రార్థన లేల ? నీవు చేయించిన ట్లెల్ల నేను చేయుచుందును. అబ్బా! ఏమి తికమక! నాచేత నీ వెందులకు వాదము చేయింతువు ?''

శ్రీరామకృష్ణు డీ విధముగ దైవముతో మాటాడుచుండగా భక్తులు ఆశ్చర్యస్తబ్ధులై ఆ వాక్కులను వినుచుండిరి. గురుదేవుని చూపులు వారిపై వ్రాలినవి.

గురుదేవుడు :—(భక్తులతో) భగవత్ప్రాప్తి కలుగ వలయు నన్న మంచి పూర్వ వాసన యుండ వలయును, ఈ జన్మములోను వే ఱొక జన్మములోను ఏదో యొక విధ మైన తపస్సును దేనినైనను చేసియుండ వలయును.

హాజ్రా గదిలోనికి వచ్చెను. 1880 లో సిహోరులో గురు దేవుని యల్లు డైన హృదయు నింట హాజ్రాకు గురుదేవునితో మొదటి సమాగమము గలిగెను. ఇప్పటికి రెం డేండ్లుగా అతడు దేవాలయా రామమున గురుదేవునితోనే యున్నాడు. హాజ్రా అను నతని స్వగ్రా మము సిహోరునకు సమీపముననే ఉన్నది. ఆ గ్రామములో అతనికి కొంత యాస్తి కలదు. భార్యయు పిల్లలును ఉన్నారు. కొంత అప్పు ఉన్నది. ఎలప్రాయమునుండియే, అతనికి వైరాగ్యము గలిగి యుండెను. అప్పటి నుండియే భక్తులయు సాధువులయు సాంగత్యము నతడు కోరుచుండెను. గురుదేవుడు అతనిని దక్షిణేశ్వరముననే ఉండు మని కోరి, అతని యక్కఱల నన్నిటిని సరఫరా చేయించుచుండెను. హాజ్రామనసు ఒక కలగూరగంపగా నుండెను. అందు చక్కగా జీర్ణము కానట్టి జ్ఞానదశలు సంకీర్ణములై యుండెను. అతడు తాను జ్ఞానమార్గానుసారి. శ్రీరామకృష్ణుని భక్తిమార్గమును, యువ భక్తులపట్ల శ్రీరామకృష్ణున కుండిన తీవ్రాశయు అతనికి అభిమత ములు గావు. గురుదేవుడు ఒక మహాత్ముడు అను తలంపు అతనికి

అప్పు డప్పుడు గలుగుచుండును; ఆయన సామాన్యమానవుడేయనెడి యలక్ష్యభావము నను వెనువెంటనే గలుగుచుండును. అతని కాలమున విశేష భాగము జపమాలను బూని జపించుచుండుటతో గడచుచుండును. జపమాలపట్ల రాఖాలు మున్నగు యువకుల కుండిన యలక్ష్యభావమును అతడు దూషించుచుండెను. మతాచారములును ప్రవర్తనవిధులును ఉండితీరవలె అను వాని వాదము. దానినే, అతడు తన కభిమతవాదముగ జేసికొనెను. అతని వయస్సు సుమారు ముప్పదియెనిమిది సంవత్సరములు.

హాజ్రా గదిలో ప్రవేశించి నప్పుడు గురుదేవుడు ఇంచుక పరధ్యానదశలో నిమగ్నుడగుచుండెను. ఆ దశలో ఉండియే ఆయన మాటాడ ఆరంభించెను —

గురుదేవుడు :—[హాజ్రాతో] నీవు చేయుచుండునది సిద్ధాంతము ప్రకారము సరియైనదే. కాని, సిద్ధాంతమును అమలుపఱచు విధము మాత్రము పూర్తిగా సరియైనది కాదు. ఎవరిలోనైనను సరే, తుదకు ఒక పురుగునందైనను, తప్పు లెన్నకుము. దేవుని 'భక్తి ని' మ్మని ప్రార్థించునప్పుడే 'ఇతరులలోని తప్పులను లెక్కించు ప్రవృత్తి అంతరింపచేయు' మనియును ప్రార్థింపుము.

హాజ్రా :—భక్తి నొసంగు మని మనము ప్రార్థించిన దేవుడు చెవియొగ్గునా?

గురుదేవుడు :—తప్పక విని తీఱును. అట్లని నేను నీకు ఒకటికి నూఱు పర్యాయములు హామీ ఈయ గలను. కాని నీ ప్రార్థన మాత్రము యథార్థమైనదిగను మనఃపూర్వకమైనదిగను ఉండవలయును. ఐహికపరులు పెండ్లాము బిడ్డలకై ఏడ్చునంతగా దేవునకై ఏడ్తురా? ఒకని భార్యకు వ్యాధి వచ్చినది. అది తిరుగు లేని వ్యాధిగా అతనికి పొడగట్టెను. వెంటనే అతడు గడగడలాడి మూర్ఛపోవు పరిస్థితికి వచ్చినాడు. దేవునకై అట్టి యవస్థల పాలగు వారు ఉన్నారా?

హజ్రా గురుదేవుని పాదధూళిని కైకొన జూచెను.

గురుదేవుడు:— [జంకుచు] ఇది ఏమి ?

హజ్రా :—ఇంత దయతో నాకు ఆశ్రయ మనుగ్రహించిన పూజ్యుని పాదధూళిని నే నేల కైకొన రాదు?

గురుదేవుడు :—దేవునకు సంతోషమును గూర్పుము. ఎల్లరును సంతోషింతురు. దేవునకు ప్రీతి కలిగిన విశ్వమున కెల్ల ప్రీతి కలుగును.

[హజ్రాతో] సిద్ధినొందిన వాడు సైతము, జ్ఞానము ప్రాపించిన తరువాతగూడ. భక్త్యుపాసనలను కర్మానుష్ఠానమును సాగించుచునే యుండును. ఎందుల కనగా, లోకులకు దారిని జూపుటకు. నేను కాళి గుడికి పోవుదును, గదిలో నున్న పూజ్యుల పటముల కన్నిటికిని మ్రొక్కుదును. నన్ను జూచి ఇతరులును అట్లే చేయుదురు. అంతే కాదు. అట్టి యనుష్ఠానములకు అలవడిన వాడు, అవి లే కున్న, తహతహ పడును.

ఒక్కదానిని గూర్చిన జ్ఞాన ముండు నేని పెక్కింటిని గూర్చిన జ్ఞానము కూడ ఉండును. వట్టి శాస్త్రగ్రంథపారాయణముచే నీ వేమి సాధింతువు? చక్కెరయు ఇసుకయు ఒకదానితో నొకటి కలిసిపోయిన ఎట్లుండునో అట్లుండును శాస్త్రగ్రంథములలోని విషయములు. చక్కెరను ఇసుకనుండి వేఱుపఱచుట చాల కష్టము. కాబట్టి ఒక గురువునొద్దనుండియో ఒక సాధుపుంగవునొద్దనుండియో శాస్త్ర గ్రంథముల సారమును తెలిసికో వలెను. అది తెలిసిన పిమ్మట, ఇక గ్రంథములు ఎందులకు ?

[భక్తులతో] తెలిసికో వలసిన విషయమును అంతటిని సేకరించుకొని తర్వాత అందులో మునుగుడు. ఒక చెఱువులో ఒకవైపు ఒక బిందె మునిగి పోయిన దనుకొనుడు. ఏ చోట మునిగినదో గుర్తించి, తర్వాత దిగ వలెను.

శాస్త్రగ్రంథసారాంశమును గురుముఖముగ మొదట తెలిసికొన వలెను. అటు పిమ్మటనే సాధనను ఆరంభింప వలయును. జ్ఞాన సాధనను సక్రమముగ సాధించినవాడు దైవసాక్షాత్కారము నొందును. పూర్తిగ మునిగి యున్నప్పుడే సాధన చక్కగ జరుగు చున్న దని చెప్పబడును. శాస్త్రగ్రంథములలోని పదములనుగూర్చి చర్చ సాగించినంతమాత్రమున ఏమి లాభము? ఎంతటి యవివేకులు! మార్గమునకు సంబంధించిన వివరములనుగూర్చి ఊపిరి పోవునంత వఱకును వాదించుకొందురే కాని మార్గములోనికి దిగరే! ఎంత శోచనీయ మైన విషయము!

దేవుడు నా చేత మొదట పురాణానుసారముగను అనంతరము తంత్రానుసారముగను వివిధ మార్గములలో సాధనలు చేయించినాడు. నేను వేద ప్రోక్త సాధనలను గూడ అనుసరించితిని. నా సాధనలను మొదట పంచవటిలో జేయుచుంటిని. నేను తులసిమొక్కల గుబురు నొకదానిని ఏర్పఱచుకొని దాని నడుమ గూర్చుండి ధ్యానించు చుంటిని. ఉబలాటపడు హృదయముతో "అమ్మా" "అమ్మా" అనియో "రామా" "రామా" అనియో అప్పు డప్పుడు అఱచు చుంటిని.

తంత్రసాధనలను నేను బిల్వవృక్షము క్రింద జేసితిని. ఆ దినాలలో నాకు పవిత్ర మైన తులసికిని తక్కిన మొలకలకును ఎట్టి భేదమును గోచరించుట లేదు. కొన్ని తూర్లు నేను ఒక కుక్క నెక్కి సంచరించుచు, దానికి తినబెట్టిన లూచీ(రొట్టె)లోని శేషమునే నేనును దినుచుంటిని. విశ్వమంతయును నాకు బ్రహ్మమయముగ బొడగట్టుచుండెను.

వేద ప్రోక్త సాధనల ననుష్ఠించి నప్పుడు నేను సన్న్యసి నైతిని. గంగయొద్దు మండపములో నేలపై బండుకొని హృదయునితో "నేను సన్న్యసిని, ఈ మండపములోనే నేను భుజింతు" నని చెప్పు చుంటిని.

భగవద్దర్శనము నాకు లభింప కున్న ఆత్మహత్య చేసికొందు నని లోకజననితో నేను శపథము చేసితిని. ఆ తల్లిని నేను "అమ్మా, నేను అవివేకిని, వేదములందును పురాణములందును తంత్రములందును తక్కిన శాస్త్రగ్రంథములందును ఉన్న విషయములను దయచేసి నాకు బోధింపుము" అని వేడుకొంటిని. ఆమె "బ్రహ్మ మొక్కటే సత్యము. జగత్తు మిథ్య — ఇదే వేదాంతసారము" అని సెల విచ్చెను. ఇక గీతాసార మే మనగా, "గీతా" అను మాటనే పదిమార్లు చెప్పిన నీ కేమి సిద్ధించునో అదే. అక్షరములు త్రిప్పువడి "తాగి" అగును. 'తాగి' అను పదము త్యాగమును సూచించును.

భగవత్సాక్షాత్కార మైన పిమ్మట చూతు మేని వేదములు ఉపనిషత్తులు పురాణములు తంత్రములు అను వాని స్థానము ఎంత క్రిందిమెట్టులో ఉండును! [హాజ్రాతో] సమాధిలో ఉన్నప్పుడు నేను ఓంకారమును ఉచ్చరింపలేను. ఏల? ఆ సమాధిదశనుండి నేను చాల క్రిందికి దిగనిదే 'ఓమ్' అన లేను.

భగవత్సాక్షాత్కారానంతరము నేను శాస్త్రగ్రంథములందున్న యనుభూతుల నన్నిటిని అనుభవించితిని. శిశువువలె నడచు కొంటిని, వెఱ్ఱివానివలె ప్రవర్తించితిని. దయ్యమువలె మెలగితిని, జడ పదార్థమువలెను ఉంటిని.

శాస్త్రగ్రంథములలో వర్ణితము లైన దర్శనములు అన్నియు నాకు అగపడినవి. లోకము ఒక్కొక్కప్పుడు అగ్నిస్ఫులింగములతో నిండి యున్నట్లు అగపడెడిది; ఒక్కొక్కప్పుడు లోక మెల్ల ఒక పాదరసపు సరస్సు ఐనట్లుగా, దెస లన్నియును దేదీప్యమానములై పొడకట్టెడివి. మరల నొకప్పుడు దిక్కు లన్నియు మత్తాబు పుల్లల వెలుగుం బోని వెలుగుతో నిండి యగపడెడివి. కావున నాకు గలిగిన యనుభవములు శాస్త్రగ్రంథములందు జెప్పబడిన యనుభవములతో సరిపోవు చున్నవి.

అంతే కాదు. బ్రహ్మమే ఈ విశ్వముగను, ఇందలి ప్రాణులు

గను చతుర్వింశతితత్త్వములుగను రూపొందెననువిషయము గూడ నాకు ప్రత్యక్షమైనది. అది ప్రసర్పణము (వెలినిడుట, ఎవొల్యూషన్) ఉపసంహరణము (లోగొనుట, ఇన్వొల్యూషన్) అను క్రమమును బోలినది.

ఆహా! అప్పుడు దేవుడు నన్ను ఎట్టి దశలో ఉంచినాడు! ఒక యనుభవము ముగిసియు ముగియక మున్నే వేఱొక యనుభవము నన్ను పైకొనుచుండెను.

ధ్యానించుచున్నప్పుడు, సమాధిదశలో దేవుడు నా కగపడు చుండెను. బాహ్య లోక స్మరణమునకు నేను మరలిన పిమ్మటగూడ ఆ దేవుడే నా కగపడుచుండెను. అద్దమునకు ఎదుట నిలబడి చూచి నప్పుడును నాకు దేవుడే అగపడుచుండెను. అద్దమునకు వెనుకవైపు చూచినప్పుడును నాకు ఆ దేవుడే అగపడుచుండెను.

భక్తులు ఈ మాటలను అతిమాత్రమైన యెచ్చరికతో ఆల కించుచుండిరి.

ముఖర్జీసోదరులు గురుదేవునకు ప్రణమిల్లిరి. వారి బండి గది కుత్తరమువైపు వసారకు సమీపమున సిద్ధముగ నుండెను. గురు దేవుడును ఉత్తరమువైపు దిరిగి నిలుచుండెను. ఆయనకు ఎడమవైపు గంగానది యుండెను. ఎదుట వాద్యమండపము[నహబత్తు]ను తోటయు, గుడి సొంతదారులయు వారి యతిథులయు విడిది [కుఠి]యు ఉండినవి. ఆయన కుడివైపు వాకిటికి పోవు నడవ యుండెను. రాత్రి, అంధకారబంధురముగ నుండెను. సేవార్థమై వచ్చిన వారికి దారి చూపుటకై ఒకభక్తుడు దీపమును దెచ్చెను. భక్తులు ఒక్కొక్క రుగా గురుదేవుని పాదధూళి తమ సిగలకు సోకునట్లుగా ప్రణమిల్లిరి. బండిలో చాలమంది ఎక్కిరి. బరువును గుఱ్ఱములు మోయ లేవేమో అనిపించెను. గురుదేవుడు "బండిలో చాలమంది ఉన్నారు కదా" అనెను.

శ్రీరామకృష్ణుడు నిలబడియే యుండెను. బండి దూరమునకు పోయిన పిమ్మట భక్తులు గురుదేవుని వైపు దిరిగి చూచిరి. ఆయన వదనము ప్రేమానుగ్రహములతో తళతళలాడు చుండెను.

1884-వ సంవత్సరము సెప్టెంబరు తే 26 ది శుక్రవారము.

శ్రీరామకృష్ణుడు కలకత్తాకు వచ్చి యుండెను, అది దుర్గా పూజకు మొదటి దినము. దుర్గాపూజ యనునది యొక పెద్దపండగ. నగర మందలి హిందువులు ఆ మహోత్సవమును జరుపుచుండిరి. గురుదేవుడు అధారునింట నున్న లోకమాతృవిగ్రహమును దర్శింప గోరెను, శివనాథుని చూడ వలె ననియు అభిలషించెను. శివనాథుడు బ్రాహ్మసమాజభక్తులలో ఒకడు.

అప్పటికి మధ్యాహ్న మయ్యెను. మహేంద్రుడు చేత నొక గొడుగును పట్టుకొని బ్రాహ్మసమాజమందిరము నెదుట పచారు చేయుచుండెను. రెండు గంటల సేపు గడచి పోయినది, కాని గురుదేవు డేమో ఇంకను అగపడ లేదు. మహేంద్రుడు నడుమ నడుమ డాక్టరు మహాల్నవీశుని యౌషధశాల మెట్లపై గూర్చుండి, పూజో త్సవమును జరుపు చున్న యువకులయు వృద్ధులయు సంతోషానంద ములను గమనించుచుండెను.

మూడు గంట లయిన కొన్ని నిమిషములకు గురుదేవుని బండి వచ్చెను. బండినుండి దిగిన వెంటనే శ్రీరామకృష్ణుడు ముకుళిత కరకమలుడై బ్రాహ్మసమాజప్రార్థనాలయమునకు నమస్కరించెను. హాజ్రాయు మఱి కొందఱు భక్తులును ఆయనతో నుండిరి. మహేం ద్రుడు గురుదేవుని పాదధూళి తన ఫాలము సోకునట్లు ప్రణమిల్లెను. తాను శివనాథునింటికి పోవుచున్నా నని గురుదేవుడు మహేంద్రునితో జెప్పెను. కొన్ని నిమిషములకు బ్రాహ్మసమాజభక్తులు అనేకులు అరుదెంచి ఆయనను శివనాథు నింటికి పిలుచుకొని పోయిరి. కాని శివనాథు డింట లేడు. తర్వాత విజయగోస్వామియు మహాల్నవీశు

డును బ్రాహ్మసమాజనాయకు లితరులు అనేకులును గురుదేవుని ఆదరించి బ్రాహ్మసమాజప్రార్థనమందిరములోనికి పిలుచుకొని పోయిరి.

శ్రీరామకృష్ణు డప్పుడు సంతోషముతో నుండెను. పూజా పీఠమునకు క్రిందనే యొక యాసనము ఆయనకు అర్పింపబడెను. అచ్చట బ్రాహ్మభక్తులు తమ భక్తిగీతముల పాడిరి. విజయుడును బ్రాహ్మభక్తులును గురుదేవుని యెదుట కూర్చుండిరి.

గురుదేవుడు :— (చిఱునవ్వు నవ్వుచు విజయునితో) అన్య మతములవారు ఇచ్చటికి రాగూడ దని నీవు ఇచ్చట ఒక పలకపై వ్రాసి యుంచితి వట. నరేంద్రుడు కూడ నాతో 'శివనాథునింటికి పోయిన పో వచ్చునే కాని బ్రాహ్మసమాజమునకు పోవల' దన్నాడు.

కాని నేను చెప్పున దే మనగా మన మందఱము ఆహ్వానించు దేవుడు ఒక్కడే. ఈర్ష్యయును పగయును నుండ రాదు. కొందఱు దేవుడు నిరాకారు డందురు, కొందఱు సాకారు డందురు. సాకార దైవమున నమ్మక మున్న వానిని ఆ దైవమునే ధ్యానింప నిమ్ము. సాకార దైవమున నమ్మకము లేని వానిని నిరాకార దైవమునే ధ్యానింప నిమ్ము. అది నేను చెప్పునది. పిడివాదము కూడ దనుట నా యభిప్రాయము. నా మత మొక్కటే నిజ మనియు, ఇతరుల మతములు నిజము కా వనియు అనుకొనుట తప్పు. నా మతము సరి యైనదే కాని తక్కిన వారి మతములు సరియో కావో సత్యములో అసత్యములో నే నెఱుగను అని అనుకొనుట సరి యైన వైఖరి. నేను ఇట్లు ఏల చెప్పుచున్నా ననగా భగవత్సాక్షాత్కారము నొందని వారు భగవంతుని యథార్థ స్వరూపమును తెలిసికొన లేరు. కబీరు ఈలాగు అనెడి వా డట "సాకార దైవము నాకు తల్లి. నిరాకార దైవము నాకు తండ్రి. వీరిలో నేను ఎవరిని దూషింతును? ఎవరిని కొనియాడుదును? త్రాసునకు ఇరుగడలును సమాన మైన బరువే గలిగి యున్నవి."

నిజ మేమో మీకు తెలియునా? వివిధ సాధకులకును, వివిధ దేశకాలములకును తగియుండుటకై దేవుడు వివిధ మతముల నేర్పఱచి నాడు. ఒక్కొక్క సిద్ధాంతమును ఒక దారి. దారియు దేవుడును ఒక్కటే అని చెప్పుటకు మాత్రము వీలు లేదు. హృదయ పూర్ణమైన శ్రద్ధతో ఏ దారి ననుసరించినను నిజముగా దేవుని బడయ గలము. ఒక డవలంబించిన మతములో తప్పు లున్న వనియే అనుకొందము గాక. అతనికి శ్రద్ధయు ఆస్థయు ఉండు నేని స్వయముగ దేవుడే ఆ తప్పులను సరిదిద్దును. పూరిజగన్నాథమును దర్శింప వలె ననెడి ఋజువాంఛతో ఒకడు బయలుదేఱి పొరపాటుచేత దక్షిణముగ పోవుటకు బదులు ఉత్తరముగ నేగె ననుకొనుము. అప్పుడు దారిలో అతనిని కలసికొను వారిలో ఎవ డైన నొకడు అతనికి "మహాశయా, ఇది కాదు దారి, దక్షిణముగ బొమ్ము" అని తప్పక చెప్పును. ఎప్పుడో ఒకప్పు డా యాత్రికుడు జగన్నాథమును చేరియే తీఱును.

ఇతరుల మతములలో తప్పు లుండిన, వాని జోలి మన కక్కఱ లేదు. ఈ విశ్వమునకు ప్రభువు భగవంతుడు. ఆ లోటుపాట్లను ఆయన సరిపెట్టుకొనును. మన కర్తవ్య మే మనగా ఎట్లో ఒకట్లు జగన్నాథమును దర్శించుట. (బ్రాహ్మసమాజభక్తులతో) మీ మతము నిజముగ సరిగానే యున్నది. దేవుడు నిరాకారు డని మీ రందురు. అది చక్కగనే యున్నది. చక్కెర జీరాలో పొదిగిన రొట్టెను నిలువుగను కొఱుక వచ్చును. అడ్డముగను కొఱుక వచ్చును. ఎట్లు కొఱికినను అది తియ్యగనే యుండును.

వేదములు దేవుని సగుణు డనియు వర్ణించు చున్నవి. నిర్గుణు డనియు వర్ణించుచున్నవి. మీరు దేవుని నిరాకారు డని మాత్రమే వర్ణించుచున్నారు. అది పాక్షికము. అయినను ఫరవా లేదు. దేవుని వైఖరులలో ఒక్కదానిని మీరు నిజముగ గ్రహించిన, తక్కిన వైఖరులను గూడ మీరు గ్రహింపగలిగి యుందురు. వానిని గుఱించిన సమస్తమును దేవుడే మీకు తెలియజేయును.

విజయుడు ఇంకను సాధారణ బ్రాహ్మ సమాజ సభ్యుడుగనే యున్నాడు. ఆ సంస్థవారు అతనికి జీత మిచ్చి మతబోధకునిగ నియమించుకొనిరి, కాని అతడు ఆ సంస్థ వారి నీతి నియమావళిని సమగ్రముగ పాటింప లేక పోయెను. అతడు సాకారదైవమందు నమ్మకమున్న వారితో కలిసి మెలిసి యుండ సాగెను. ఆ కారణముచేత అతనికిని బ్రాహ్మసంస్థాధిపతులకును స్పర్థ లేర్పడినవి. బ్రాహ్మసమాజీయు లనేకులు అతని నడవడిని ఖండించిరి. గురుదేవుడు తన చూపును తటాలున విజయునిపై పాఱించి అతనితో సంభాషింప దొడగెను.

గురుదేవుడు :—(చిఱునవ్వు నవ్వుచు విజయునితో) సాకార దైవమును విశ్వసించిన వారితో కలసికొనుచున్నందులకై నిన్ను వారు నిందించుచున్నా రని నాకు తెలిసినది. నిజమేనా? భగవద్భక్తునకు అప్రకంప్య మైన పరిజ్ఞానము కలిగి యుండ వలయును. అతడు కమ్మరి యంగడిలోని దాగలిని బోలి యుండ వలయును. దాగలిపై సుత్తెతో సదా కొట్టుచునే యున్నను అది కదలదు. దుర్జనులు నిన్ను ఎంత మైన తిట్ట వచ్చును. దుష్ప్రచారము చేయ వచ్చును. కాని నీవు ఋజువైన భగవద్భక్తుడ వైనచో వారు ఏమి చేసినను ఓర్చుకొనియే యుండ వలయును. దుర్జనుల మధ్య దేవుని ధ్యానింప సాధ్యము కాదా? ప్రాచీన మహర్షులను స్మరింపుము. వారు ఘోరారణ్యములలో వ్యాఘ్ర భల్లూ కాది ఘాతుక మృగముల మధ్య దైవ ధ్యానమును సాగించెడి వారు. దుర్జనుల స్వభావము వ్యాఘ్ర భల్లూకముల స్వభావమును బోలియే యుండును. నిన్ను హింసించుటకే వారు తఱుముకెల్ల.

ఈ క్రింది ప్రాణుల పట్ల మనము జాగరూకులమై యుండ వలెను. ధనాఢ్యుడై అనేకులను తన యధీనమునందుంచుకొని పలుకుబడి గల మనుష్యుడు ప్రథముడు. అతడు సంకల్పించినచో నీ కపకారము చేయ గలడు. అతనితో మాటాడు నపుడు నీవు జాగరూకుడవై యుండ వలయును. అతడు ఏమి చెప్పినను నీవు అవు ననుచుండ వలె నేమో? రెండవ ప్రాణి కుక్క. అది నిన్ను చూచి మొఱిగినను

నీ వెంట తఱిమినను నీవు కదలక నిలబడి నెమ్మదిగ మాటాడి దానిని సమాధానపఱుప వలయును. మూడవ ప్రాణి ఎద్దు. అది కొమ్ముల వంచుకొని నిన్ను తఱుమును. నీవు ప్రశాంత స్వరముతో దానిని శాంతపఱుప వలెను. నాలుగవ వ్యక్తి త్రాగుబోతు. అతనికి కోపము కలిగించితి వేని అతడు నిన్నును నీ వంశములో పదునాలుగు తరముల వారిని పేరువరుసన రోయ బాయ తిట్టును. నీ వతనితో "మామా క్షేమమా" అన వలెను. అప్పు డతడు మహాప్రీతుడై నీప్రక్కన కూర్చుండి పోగ త్రాగును.

దుష్టుని సన్నిధిలో ఉన్నప్పుడు నేను మెలకువ గలిగియుందును. కొందఱు నాగుపాముస్వభావమువంటి స్వభావము గలిగి, ఎట్టి హెచ్చరికను చేయకయే కఱతురు. ఆ కాటు తప్పించుకో వలె ననిన నీ వెంతో వివేకము వహింప వలెను. వహింప కున్న నీలోని భావాలు కూడ ఉద్రేకించును, హింసకు బదులు హింస చేయుద మను తలంపు నీకు గలుగును. అప్పు డప్పుడు సాధుసమాగమము అత్యావశ్యకమగుచుండును. సాధుసంగతి చేతనే తథ్యమిథ్యావివేకము కలుగును.

విజయుడు :—స్వామీ, నాకు వ్యవధియే లేదు, ఇక్కడి నా కర్తవ్యాలలో నేను తగుల్కొని యున్నాను.

గురుదేవుడు :—నీవు మతబోధకుడవు. విరామ దినాలు ఇతరులకు ఉండును గాని మతబోధకున కుండవు. జమీను కార్యనిర్వాహకుడు ఒక ప్రాంతములోని చిక్కులను సరిపఱచిన తత్క్షణమే, అతనిని భూస్వామి మఱొక ప్రాంతమునకు పంపుచుండును. అట్లే నీకును తీఱుబాటు లేదు. [అందఱును నవ్వుదురు].

విజయుడు :—[కేల్మోడ్పుతో] స్వామీ, నన్ను దీవింపుడు.

గురుదేవుడు :— ఏమియు ఎఱుగని వాని వలె మాటాడుచున్నావు. దీవించువాడు దేవు డొక్కడే.

విజయుడు:— పూజ్యమహాశయా, దయచేసి మాకే మైన బోధింపుడు.

గురుదేవుడు:—ఆస్థ ఉన్న చాలును, లౌకిక మానవునకైనను దైవసాక్షాత్కారము గల్గును. 'నేను' 'నాది' అనుకొనుటే అజ్ఞానము. 'ఓ దేవా, అంతయు నీవే, నీదే' అనుకొనుటే జ్ఞానము.

మానసికముగ వైరాగ్యము సలవఱచు కొండనియే నేను ప్రజలకు చెప్పుచుందును. లోకమును విడువు డని నే ననను. లౌకిక జీవితమున ఉన్నప్పటికిని నిస్సంగత్వము గలిగి ఆస్థతో భగవంతు నన్వేషించు నాతడు సిద్ధి పొంద గలడు.

(విజయునితో) ఒకప్పుడు నేనును దైవధ్యానమును *నిమీలిత నేత్రుడ నై యే చేయుచుంటిని. తర్వాత "దేవుడు, నేను కన్నులు మూసికొని ధ్యానించి నప్పుడు మాత్రము ఉండి, కన్నులు తెఱచి నలు వైపుల చూచి నప్పుడు లేకుండునా" అని నాలో నే నను కొంటిని. ఇప్పుడు కన్నులు విచ్చి అన్ని వైపుల చూచుచున్న నాకు సకల జీవులలోను దేవుడు కన నగు చున్నాడు. మానవులందును. మృగములందును, ఇతర ప్రాణులందును, వృక్షములందును, మొలక లందును, సూర్యచంద్రులందును, భువియందును, జలమందును అంత రాత్మగ నున్న వాడు దేవుడే.

శ్రీరామకృష్ణుడు బయలుదేఱ నుండెను. బ్రాహ్మభక్తులు ఆయనకు ప్రణమిల్లిరి, ఆయనయు వారికి బదులు మ్రొక్కెను. ఆధారు నింట నున్న లోకమాతృ విగ్రహమును దర్శింత మని, బండి యెక్కి తరలెను.

1884–వ సంవత్సరము అక్టోబరు తే 11 ది శనివారము.

శ్రీరామకృష్ణుడు దక్షిణేశ్వరాలయారామమున తన గదిలో చిన్నమంచముపై విశ్రమించి యుండెను. అప్పుడు మధ్యాహ్నా నంతరము సుమారు రెండు గంటలు. మహేంద్రుడును, ప్రియ ముఖర్జియు నేలపై కూర్చుండిరి. ఒంటిగంట యప్పుడు తన పాఠశాల

---

* ఇది బ్రాహ్మసమాజమువారి ధ్యాన పద్ధతి.

నుండి బయలుదేఱిన మహేంద్రుడు అప్పుడే దక్షిణేశ్వరమునకు వచ్చి యుండెను.

గురుదేవుడు కామలోభముల పట్ల మెలకువ గలిగి యుండు డని భక్తులను హెచ్చరించెను.

గురుదేవుడు :— ఎల్లప్రాయమునుండియే వైరాగ్యమును పొందించుకొను వారును, బాల్యమునుండియే భగవత్తృష్ణతో పర్యటించు వారును, ఐహిక జీవితమును ఇంచు కేని యొల్లని వారును, ప్రత్యేక వర్గమునకు చెందిన వారు. వారి దొక నిర్మలిన మైన యున్నత కోటి. తరుణవయస్సునుండియే త్యాగము నలవఱచుకొను వారు మిక్కిలి పై అంతస్తునకు చెందిన వారు. వారి భావము పరమ పవిత్ర మైనది. వారు నిష్కళంకులు.

''సింధి''నుండి వచ్చిన బ్రాహ్మణు డొకడు గదిలో ప్రవేశించి శ్రీరామకృష్ణునకు ప్రణమిల్లెను. అతడు కాశిలో వేదాంతమును అధ్యయనము చేసిన వాడు, పుష్టి గలిగి మందహాసాంచితవదనుడై యుండెను.

గురుదేవుడు :— ఓహో ! క్షేమమా ? చిర కాలముగ నీ విచట లేవే ! కారణ మేమి ?

పండితుడు :— (చిఱునవ్వుతో) స్వామీ, కారణములు, లౌకికవిధులే. నాకు విరామమే లే దనుట మీ రెఱిగిన విషయమే.

పండితుడు కూర్చుండెను. గురుదేవు డతనితో సంభాషింప నారంభించెను.

గురుదేవుడు :— నీవు కాశిలో చాలకాల ముంటివే. నీ వక్కడ ఏ మేమి చూచితివో మాకు చెప్పుము. దయానందుని గూర్చి కొంచెము చెప్పుము.

పండితుడు :— ఔను. దయానందుని నేను కలసికొంటిని. మీరును ఆయనను కలసికొంటిరి. కర్నల్ ఆల్కాట్టును కూడ నేను

చూచితిని. దివ్యజ్ఞానవాదుల(థియాసఫిస్టుల)కు మహాత్ము లున్నా
రను నమ్మకము కలదు. వారు చంద్రార్క-తారాపథములను గూర్చి
కూడ ప్రసంగించుచుందురు. దివ్యజ్ఞానవాది నక్షత్రశరీరియై ఆ రంగ
ముల కెల్ల అధిరోహింప గలడు. ఔర! అల్కాట్టు అట్టి సంగతులను
పెక్కింటిని చెప్పినాడు. మఱి, స్వామీ, దివ్యజ్ఞానవాదమును
(థియాసఫిని) గూర్చి తమ యభిప్రాయ మేమి?

గురుదేవుడు :— భక్తి, దేవు నందలి రాగభక్తి — అ
దొక్కటే సార మైన విషయము. దివ్యజ్ఞానవాదులు భక్తిని
కోరుదురా? కోరుదు రేని, వారి వాదము సరి యైనదే. భగవత్సాక్షా
త్కారమే పురుషార్థ మనుట దివ్యజ్ఞానవాద మగు నేని అది మంచిదే.
మహాత్ములతోను, చంద్రార్క-నక్షత్రరంగములతోను, తీఱుబాటు
లేనంతగా పనులు పెట్టుకొనువాడు భగవంతు నన్వేషింప లేడు.
మానవుడు ఆధ్యాత్మిక సాధన చేసి మహోత్కంఠతో దేవుని
"నీ చరణారవిందములందు భక్తిని నాకు ప్రసాదింపు" మని ప్రార్థింప
వలెను. అతడు తన మనస్సును వివిధ లౌకిక లక్ష్యములనుండి
ఉపసంహరించి దేవు నొక్కనివైపునకే మఱల్చుకో వలెను.

నీవు వేదచర్చలు, వేదాంతచర్చలు చేయ వచ్చును. కాని
వానిలో దేనియందును నీవు దేవుని చూడవు. దేవునికొఱకు నీ ఆత్మ
తహతహ పడనిదే దైవసాక్షాత్కారసిద్ధి నీ వెన్నడును పొంద లేవు.
గాఢాధ్యాత్మిక సాధన సాగింపక తప్పదు. ఎట్టి ప్రయత్నమును
లేకయే ఆపాతముగ నొకనికి భగవత్సాక్షాత్కారము కలుగునా?

దేవుడు నా కెందులకు కనబడుట లే దని ఒ కాయన నన్నడిగి
నాడు. అప్పుడు నా మనసున స్ఫురించిన భావమును నే నతని కిట్లు
చెప్పితిని. నీవు పెద్ద చేపను పట్ట గోరుచున్నావు. ముందుగ అందులకు
వలసిన ఏర్పాట్లు చేయుము. సువాసన గల "ఎర"ను నీటిలో
చల్లుము. ఒక త్రాటిని, కొయ్యను తెమ్ము. "ఎర" వాసన అంద
గనే లోతు నీళ్లనుండి చేప వచ్చును. నీటిలోని సంచలనమును
బట్టియే పెద్ద చేప యొకటి వచ్చిన దని నీవు గుర్తింతువు.

వెన్న నారగింప వలె నని నీ కోరిక. కాని పాలలో వెన్న యున్న దను వాక్యమును ఊరక అనుసంధించుటచేత నీ వేమి సాధింతువు? అందులకై నీవు కష్టపడి పని చేయ వలెను. చేసిననే పాల నుండి వెన్నను తీయ గలవు. "దేవు డున్నాడు, దేవు డున్నాడు" అని జపించుచున్నంత మాత్రమున నెవ డైనను దేవుని చూడ గలడా? ఆధ్యాత్మిక సాధనము తప్పక చేయ వలెను.

(పండితునితో) అప్పు డప్పుడు సాధుగోష్ఠిలో మెలగుట శ్రేయస్కరము. ఐహికపరత మానవునిలో దీర్ఘవ్యాధిగ నిలిచి పోయినది. పవిత్రాత్ముల గోష్ఠి ఒనగూడు నేని ఆ వ్యాధికి ఎంతేని ఉపశమనము గలుగును.

"నేను" - "నాది" — అనుకొనుట అజ్ఞానము. తత్త్వజ్ఞానము మానవునిచే "ఓ దేవా, సమస్తమును నీ వొక్కడవే. నా వాడవు నీ వొక్కడవే: ఇండ్లు, మేడలు, కుటుంబము, బంధుతతి, మిత్రులు ఈ యఖండ జగత్తు — ఇ వన్నియు నీవే." అని పలికించును. "అన్నిటిని నేనే చేయుచున్నాను. నేనే కర్తను. ఇండ్లు - మేడలు, కుటుంబము - పిల్లలు, మిత్రులు - ఆస్తి — ఇ వన్నియు నావి." అనిపించునది అజ్ఞానము.

ఒకప్పు డొక గురువు ఈ విషయము నంతను శిష్యున కొకనికి వివరించుచుండెను. "దేవు డొక్కడే నీకు సొంతము. వే రెవ్వరును కారు." అన్నాడు గురువు. శిష్యుడు "మఱి, పూజ్యమహాశయా, మా అమ్మ, నా ఇల్లాలు, తక్కిన నా బంధువులు — నాయందు ఎంతో అక్కఱ వహింతురే - నే నెదుట లే కున్న వారికి అంధకారము తప్ప వే ఱేమియు కనిపింపదే! నా యందు వారి కెంత ప్రేమ!" అనెను. గురువు "అదే నీ పొరపాటు. నీకు ఎవరును సొంతము కా రని నే నిప్పుడే రుజువు చేసెదను. ఈ మాత్రలను తీసికొని పొమ్ము. ఇంటికి పోయి, వీనిని మ్రింగి పాన్పుపై పరుండుము. జనులు నీవు మరణించితి వనుకొందురు. కాని వెలుపటి లోకమున జరుగున దంతయు నీకు తెలియుచునే యుండును. అన్నిటిని నీవు

స్మరించుచును వినుచునే యుండుము. అప్పుడు నేను మీ యింటికి వత్తును".

శిష్యుడు గురువు చెప్పినట్లే చేసెను. అతడు మాత్రలను మింగి చైతన్యరహితునివలె పాన్పుపై పడియుండెను. అతని తల్లియు, భార్యయు తక్కిన చుట్టములును ఏడ్వ నారంభించిరి. అప్పుడే గురువు ఒక వైద్యుని వేషమున అచ్చటికి వచ్చి "ఏల ఏడ్చుచున్నారు?" రని వారి నడిగెను. వారు సంగతి నంతయు చెప్పిరి. అప్పుడు వారితో వైద్యు డిట్లనెను. "ఇదిగో! ఇది అతనికి మందు. ఇది అతనిని మరల బ్రతికించును. కాని ఒక్క సంగతిని నేను మీకు తెలుప వలెను. ఈ మందును మొదట అతని బంధువులలో నొకరు పుచ్చుకొని తరువాత అతని కీయ వలెను. అట్లు ముందుగా దానిని పుచ్చుకొనువారు మరణింతురు. ఇచ్చట అతని అమ్మ యున్నది — భార్యయున్నది — ఇతరు లున్నారు. తప్పక మీలో నొక్కరు ఈ మందును పుచ్చుకొనుటకు స్వయముగనే పూనుకొందురు. అప్పు డీ యువకుడు మరల బ్రతుకును."

శిష్యుడు దీని నంతయు వినుచుండెను. ఏడ్చుచు దుఃఖముచే నేలపై పొర్లుచుండిన యతని తల్లినే వైద్యుడు మొదట పిలిచెను. ఆమెతో నతడు; "అమ్మా, ఇక నీవు ఏడ్వ వలసిన పనియే లేదు. ఈ మందును తీసికొనుము. నీ కుమారుడు బ్రతుకును కాని నీవు మరణింతువు". అనెను. అమ్మ ఆ మందును చేతి కందుకొని ఆలోచింప నారంభించెను. చాల ఆలోచించిన మీదట కన్నీరు కార్చుచు ఆమె వైద్యునితో నిట్లనెను. "అబ్బాయి, నాకు బిడ్డలు మఱికొంద ఱున్నారు. వారిని గూర్చి కూడ నే నాలోచింప వలెను గదా! నేను మరణింతు నేని వారి కేమి గతి? అని ఆలోచించుచున్నాను. వారికి అన్నము పెట్టున దెవరు? కాపాడున దెవరు?" అంతట వైద్యుడు, శిష్యుని భార్యను పిలిచి మందును ఆమె చేతి కిచ్చెను. ఆమెయు ఘోరముగ నేడ్చుచుండినదే. మందు చేతికి వచ్చుటతో ఆమెయు ఆలోచింప దొడగెను. ఆ మందును మ్రింగిన తనకు మృతి గల్గు నని

చెప్పగా విన్నది. తుదకు కన్నీటితో ఆమె "తనకు విహిత మైన గతిని ఆయన పొందినాడు. నేను మరణింతు నేని, నా పసిపిల్లల గతి యే మగును? వారి ప్రాణములను ఎవరు నిలుపుదురు? ఈ మందును నే నెట్లు మ్రింగుదును?" ఇంతలో శిష్యునకు అతడు మ్రింగిన మాత్రల గుణము తెలిసినది. నిజముగ నెవ్వరును తనకు సొంతము కా రను నమ్మిక మతనికి కలిగెను. ఒక్క దూకున పాన్పునుండి లేచి, అత డా చోటును విడిచి గురువు వెంట నేగెను. గురు వతనితో "నీ సొంత మని నీ వనుకొన దగిన వాడు ఒక్కడే, ఎవ రనగా దేవుడు" అని చెప్పెను.

కావున భగవచ్చరణారవిందములందు భక్తి గలుగు నట్లును సొంత బంధువునుగ దేవుని ప్రేమించు నట్లును మానవుడు ప్రవర్తింప వలెను. నీ చుట్టు నున్న లోకమును చూడుము. నీకు దాని ఉనికి రెన్నాళ్ల పాటే. దాని కేమియు లేదు.

పండితుడు :— [చిఱునవ్వునవ్వుచు] పూజ్యమహాశయా, ఇక్కడ ఉన్నప్పుడు, సమస్తమును పరిత్యజింత మను భావావేశము గలుగుచున్నది. లోకమును వీడి తొలగిపోద మనిపించుచున్నది.

గురుదేవుడు :— కూడదు, కూడదు. వీడిపోవుట ఎందులకు? మానసికముగ విడువుము. లోకమున నిస్సంగుడవై ఉండుము.

అప్పు డప్పుడు రాత్రివేళ నిట గడపుద మని సురేంద్రుడు ఆశపడుచుండెను, తన పాన్పును తెచ్చుకొనెను, ఒకటి రెండు దినములు ఇట ఉండనుకూడ నుండెను. అంత నతని భార్య "పగటివేళ నీవు ఎచటి కైనను పో వచ్చును గాని, రాత్రు లందు ఇల్లు విడిచి పో రా" దన్నది. పాపము ఇక సురేంద్రుడు ఏమి చేయ గలడు? ఇల్లు విడిచి రాత్రిని గడపుటకు అతనికి దారి లేనే లేదు.

సింధినుండి వచ్చిన పండితుడు వెడలి పోయెను. అది ముని మాపు వేళ. సంజవెలుగు పంచవటిపైని గోడలపైని ఏటిపైని నెలకొని యుండెను. వివిధ దేవాలయాలలో సాయంపూజ ప్రారంభ

మైనది. శ్రీరామకృష్ణుడు తన గదిలో నున్న వేల్పుల పటములకు ప్రణమిల్లెను, ధ్యాననిమగ్నుడై తన చిఱుమంచముపై గూర్చుండి యుండెను. కొందఱు భక్తులు నేలపైని గూర్చుండిరి. గది నిశ్శబ్దముగ ఉండెను.

ఒక గంట గడచినది. ఈశానుడును కిశోరియు గదిలోనికి వచ్చి శ్రీరామకృష్ణునికి మ్రొక్కి నేలపై గూర్చుండిరి. ఈశానుడు గొప్ప కర్మపరుడు, శాస్త్రవిహితము లైన వివిధ క్రియల ననుష్ఠించుట యందు శ్రద్ధ గల వాడు. గురుదేవుడు సంభాషణను ప్రారంభించెను.

గురుదేవుడు :— 'దేవు' డను మాటను మాటిమాటికి చెప్పుచున్నంత మాత్రాన నొకడు భగవద్జ్ఞానమును సంపాదింప గలడా? అట్టి జ్ఞానమునకు రెండు సూచనలు గలవు. మొదటిది ఉబలాటము, అనగా, దేవునందు ప్రేమ. నీవు యుక్తివాదము చేయ వచ్చును, చర్చలు సాగింప వచ్చును గాని, నీకు ప్రేమ గాని తహతహ కాని లే కున్న, అంతయు వ్యర్థమే. రెండవది కుండలినీ ప్రబోధము. కుండలినీ శక్తి నిద్రాణమై యున్నంత వఱకును, నీవు భగవద్జ్ఞాన ప్రాప్తి లేని వాడవే. నీవు గంటలకొలదిగ గ్రంథపారాయణము చేసినను శాస్త్రచర్చ సాగించినను, భగవంతునికై ఉబలాటము నీలో లేనంతవఱకును, భగవంతుని గూర్చిన జ్ఞానము నీకు ఉండదు.

కుండలిని ఎప్పుడు మేలుకొంచునో, అప్పుడు సాధకునిలో భావకదశయు, భక్తియు, భగవత్ప్రేమయు పెంపొందును. అదే భక్తియోగము.

కర్మయోగము* మిక్కిలి దుర్గమము. దానిచే సాధకునకు కొన్ని శక్తులు గలుగును, అనగా కొన్ని సిద్ధులు ఏర్పడును.

ఈశానుడు :— నేను పోయి హాజ్రాను చూచి వత్తును.

శ్రీరామకృష్ణుడు మౌనముతో గూర్చుండెను. కొంత సేపటికి

హాజ్రాను వెంట నిడుకొని ఈశానుడు గదికి మరలి వచ్చెను. గురుదేవుడు అప్పటికిని మౌనముగనే యుండెను. కొన్ని నిమిషములు గడచిన పిమ్మట హాజ్రా ఈశానుని చెవిలో "ధ్యానముచేసికొను చేనా. కావున ఆయనను ఏకాంతముగ ఉండనీ, మనము పోదము" అనెను. ఇరువురును గదినుండి వెడలి పోయిరి.

శ్రీరామకృష్ణుడు ఇంకను మౌనముగనే ఉండెను. కొంత సేపటికి ఆయన నిజముగ ధ్యాన నిమగ్ను డయ్యె నని భక్తులు గుర్తించిరి. పిమ్మట ఆయన జపము చేసెను. ఆయన తన కుడిచేతిని తలపై, నొసటిపై, కంఠముపై, హృదయముపై, కట్టకడపట నాభి పైని ఇడుకొనెను. దేహ మందలి ఆధారము లాఱింటను కుండలినిని ధ్యానించుటయా అది?

ఈశానుడును హాజ్రాయు కాళిగుడికి పోయిరి. శ్రీరామ కృష్ణుడు గాఢ ధ్యాన నిమగ్నుడై యుండెను. ఇంతలో ఆధారుడు వచ్చెను. అప్పటికి ఏడు నఱ గంట లైనవి.

కొంత సేపైన పిదప గురుదేవుడు కాళిగుడి కేగెను. అమ్మ వారి విగ్రహమును దర్శించి, ఆమె పాదముల కడ నున్న పవిత్రపుష్ప ములను కొన్నింటిని గైకొని తన తలపై నిడుకొనెను, జననికి సాష్టాంగముగ నమస్కరించి, ప్రదక్షిణము చేసెను, చామరము వీచెను. దైవావేశముచే భక్తిపరవశదశలో నున్నట్లు కనిపించెను. వెలుపలికి వచ్చి చూచు సరికి ఈశానుడు అగపడెను. ఈశానుడు క్రతుక్రియారూపారాధనను జేయుచుండెను.

గురుదేవుడు :— [ఈశానునితో] ఏమి? నీవు ఇంకను ఇక్కడనే ఉన్నావా? పూజ ముగియ లేదా? ఒక పాటను వినుము —

దేవి నామముఁ బలుకుచు దివికిఁ జనఁగఁ
గందు నేనియు, నా కేల కాశియాత్ర?
గంగకును, గయకు, మఱియుఁ గంచి కైనఁ

బళిత పావన ప్రథిత ప్రభాసమునకు
నేని పోవఁగా నేల నా కింక? చెపుమ —
మూఁడు సంధెలను మిగులఁ బూని క్రొత్తోడ
మాతృ నామ జపంబును మాన కున్న
మానవున కేల నికఁ గర్మలను నొనర్ప?
భక్తిసాధనలను మాన వచ్చుఁ గూడ;
కర్మలొం దొంప నెన్నంటఁ గలవె కాని
యతని మీఱంగ వానికి నైతి కాదు.
దానధర్మంబులును వ్రతతతియుఁ దాము
మదికి నింపును గూర్పవు మదనునకును
దేవి ఆనందమయి గౌరి దివ్య పాద
పద్మమే అతఁ డాశించు వరము; మఱియుఁ
దానిఁ గోరియె చేయును త్యాగములను.
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

యథావిధిపూజలను మానవుఁడు ఎంత కాలము సాగింపవలెను? అతనిలో భగవచ్చరణారవిందప్రేమ పెంపొందనంతవఱకు, భగవన్నామమును కేర్కొన్నంతనే అతనిలో అశ్రురోమాంచములు గలుగనంతవఱకును సాగింప వలెను.

పూప ఎదుగగనే, పువ్వు రాలి పోవును. సాధకునిలో భగవత్ప్రేమ పెంపొంది భగవత్సాక్షాత్కార మెప్పుడు గలుగునో, అప్పుడు అతడు కర్మానుష్ఠానమును విడిచి పెట్టును.

అంత మెల్లగ పురోగమింతు వేని, నీవు దేనిని గాని సాధింప లేవు. అప్రకంప్యమైన త్యాగము కావలెను. సంవత్సరమునకు పదునైదు నెలల చొప్పున గణింతు వేని, నీవు ఏమైనను సాధింప గలవా? నీలో బలము గాని చుఱుకు గాని అగపడుట లేదే! పాలలో నానిన అటుకులవలె మెత్తగ నున్నావు. లెమ్ము, పూనిక వహింపుము, నడుము కట్టుకొనుము.

ఈ పాట నాకు నచ్చదు —

సోదరా, ప్రీతితో, దేవు సూటగాను
నాశ్రయింపుము, అట్టుల యైన యెడల
నొక్క నాటికి దేవుని నొంద వచ్చు.

'అట్టుల యైన యెడల నొక్క నాటికి దేవుని నొంద వచ్చు' అను వాక్యమును నేను గణింపనే గణింపను. నీకు అప్రకంప్య మైన త్యాగము కావలెను. హజ్రాకును నా సలహా ఇదే.

దృఢ మైన త్యాగము నీకు ఏల అలవడ లేదు అని అడుగు దువు. అలవడకపోవుటకు కారణము ఉన్నది. నీలో నిగూఢప్రవణత లను కోరికలును గలవు. హజ్రాలోను అవి గలవు. మన పల్లెప్రాంతా లలో రైతులు తమ పంటపొలాలకు నీరు తెచ్చుచుందురు. నేను చూచి యున్నాను. నీటిని వెలికి పాఱి పోనీక అడ్డుటకు పొలాల చుట్టును పొట్టి గుట్టలు ఉన్నవి. కాని అవి మట్టిగుట్టలే. వానిలో అట నట రంధ్రము లుండుట తఱుచు. రైతులు తమ ఊపిరి పోవు నంతగా కష్టపడి నీరు తెత్తురు, కాని, ఆ నీరు గుట్టలలోని రంధ్రాల గుండ కాఱిపోవును. కోరికలే రంధ్రాలు. నీవు జప తప ఆదులను తప్పక చేయుచునే ఉందువు, కాని అవి నిలువక నీ కోరిక లనెడి రంధ్రాలగుండ వెలికి పోవుచున్నవి. కోరికలు లేకున్నచో, నీ మనసు సహజముగనే దైవోన్ముఖ మగును. ఆ సంగతి ఎట్టిదో నీకు తెలి యునా? అది త్రాసులోని ముండ్లను బోలినది. కామినీకాంచనాల బరువుచే ముండ్లు రెండును ఒండొక దాని నుండి ఎడసి పోవును. యోగమార్గమునుండి మానవుని తప్పించునవి కామినీకాంచనాలే. దీపజ్వాలను నీవు చూడ లేదా? పిల్లగాలి యైనను సరే, ఆ జ్వాలను అల్లలనాడించును *నివాత దీపకళికను బోలినది యోగదశ.

మనస్సు చెదరి ఉన్నది. అందులో కొంత ఢాకాకును, కొంత ఢిల్లీకిని, కొంత కూచ్బిహారునకును పోయి ఉన్నది. ఆ మనస్సు

* గాలి లేని చోట దీపజ్వాల.

నొక్కటిగ కూర్చుకో వలెను, ఒక్క లక్ష్యముపై కేంద్రీకరింప వలెను. నీకు పదునాఱణాల గుడ్డలు కావలసి ఉన్న, నీవు అంగడి వానికి పదునాఱణాలను పూర్తిగా ఇచ్చుకో వలెను. ఎంత చిన్న అడ్డంకి ఉన్నను యోగము సాధ్యము కాదు. తంతి రవంత తెగినను, వార్త నందింప సాధ్యము కాదు.

నీవు లోకమున ఉన్నా వనుట నిజమే. ఉన్న నేమి? కర్మ ఫలమును భగవదర్పణము చేయ వలెను. సొంతమున కెట్టి ఫలమును నీవు కోర రాదు. కాని ఒక్క విషయమును గుర్తింపుము. భక్తి కా వలయు నను కోరికను కోరిక అన లేము. నీవు భక్తిని కోర వచ్చును. అందులకై ప్రార్థన చేయ వచ్చును. భక్తితపస్సు నల వఱచుకొని, నీ కోరికను తప్పక తీర్చునట్లు లోకమాతను బలవంత పెట్టుము.

దైవము నీకు సొంతతల్లి; ఆపె సవతితల్లియా? ఆ చుట్టఱికము కృత్రిమ మైనదా? కోరిక దీర్పు మని నీవు సొంతతల్లిని నిర్బంధింప లేకున్న, వే ఱెవరిని నిర్బంధింప గలవు? ఆమెతో నీవు ఇట్లనుము—

అమ్మ, †ఎన్మిది మాసాల యర్భకుఁడనె
నీకు? నీ దయిన మెఱుపు నేత్రములు న
ను నడలఁగఁ జేయఁ జాలవు, నొక్కి యనెద.

దైవము నీకు సొంతతల్లి. కోరిక దీర్పు మని నీవు బలవంత పెట్టుము. ఏ వస్తువులో నీ వొక భాగమో, దాని యాకర్షణ నీకు దెలియుచునే ఉండును. లోకమాత్రంశము నాలో ఉన్నందున నే నామెచే ఆకృష్టుడ నగుచున్నాను.

లౌకిక కర్తవ్యాలను చూచుకో వలసిన జరూరు నీ కిప్పుడు లేదు. కొన్నాళ్లు దైవధ్యానములో గడపుము. లోకమున కేమియు లే దనుట నీకు తెలిసిన విషయమే.

---

† నవమాసాలు నిండక మును పే పుట్టిన బిడ్డకు బలహీనతయు భయమును కలిగి యుండుట మామూలు.

గురుదేవు డిట్లు పాడెను:—

మఱువ కో మానసంబ, సదా స్మరింపు,
నిజపుఁజుట్టము లేఁడు నీ కొక్కఁ డైన;
ఈ భువి నీ త్రిప్పు లెల్లను వృథయె;
మాయ జాలములో నిమగ్న మౌ నీవు
మఱువ కుండుము లోకమాతృనామమును.
భూమి లోని నరులు పూజింతురు నిను
స్వామి వంచుఁ, దమదు పాలకుఁడ వని;
మూఁడు నాళ్ల యగు నా ముచ్చట లెల్ల,
కాలదేవత నినుఁ గట్టి యీడ్చినను;
ఇప్డు గౌరవముల నింత గాంచెడిది
నీ మేను విడువక నీకుఁ దప్పదు నె?
బ్రతికి నన్నాళ్లు నీ భామకై నీవు
ఎంత గాసిలి యున్న నే మౌను తుదకు?
నీ వెంట రా దామె; నీ మేని నామె
ఎల్లరం బోలి తా నేవగించుకొని
విడిచి యేగును నిను వీడ్కోలు పొంది.

గురుదేవుడు ఇంకను ఇట్లనెను — మాధ్యస్థ్యాలు చేయుట, నాయకత్వము వహించుట మొదలయిన పనులను తీఱుబాటు లేక నిర్వహించుచుందువే, ఎందులకు అవి? ప్రజల తగాదాలను నీవు పరిష్కరింతువట. వారు నిన్ను మధ్యస్థునిగ జేసికొందురట. ఇట్టి పనులు నీవు చాల కాలముగ జేయుచున్నావు. ఇట్టి పనులలో అక్కఱ గల వారిని వీనిని చేయ నిమ్ము. ఇప్పుడు నీమనస్సును మాత్రము భగవచ్చరణారవింద సమాశ్రయణమునకే అలవఱుపుము.

శంభువుకూడ వైద్యశాలలను ఔషధశాలలను నిర్మింతు నను చుండెను. అతడు భగవద్భక్తుడే. "దేవుడు ప్రత్యక్షమైనప్పుడు

ఆసుపత్రులను మందుగిడ్డంగులను ప్రసాదింపు మని కోరుచువా’’ అని నే నడిగితిని.

‘‘దేవుడు నా కెందులకు అగపడఁ’’ డని కేశవసేను నన్నడిగెను. నేను ‘‘పేరు, ప్రతిష్ఠ, పాండిత్యము — మొదలైన విషయాలకే నీ కాల మంతయు వినియుక్త మగుచున్నందున. నీకు దేవుడు కనబడుట లేదు’’ అంటిని. బిడ్డ, గిలకను. ఎఱ్ఱగిలకను. నోట చప్పరించుచున్నంతవఱకును తల్లి రాదు. కొన్ని నిమిషములకు తర్వాత గిలకను పాఱ వేసి బిడ్డ ఏడ్చునప్పుడు, తల్లి కుంపటిపై ఉడుకు చున్న అన్నపుతపెలను దింపివేసి పరుగున వచ్చును.

నీవు వివాదపరిష్కారాలలో ఆసక్తుడవై యున్నావు. ‘‘నా బిడ్డ వివాదపరిష్కారకార్యములో వ్యగ్రుడై హాయిగా ఉన్నాడు. ఉండనీ’’ అని లోకమాత తనలో అనుకొనును.

ఇంతలో ఈశానుడు శ్రీరామకృష్ణుని చరణములను తన చేతులతో కొంతసేపు పట్టుకొని వినయముతో ‘‘నేను ఈ పనులను చేయవలె ననుట నా సంకల్పము కాదు’’ అనెను.

గురుదేవుడు:— ఆ సంగతి నే నెఱుగుదును. ఇది లోకజనని లీల. ఆమె విశ్వమోహిని. ఇందఱు ఐహికబంధమున తగుల్కొని యుండవలెననుట ఆమెసంకల్పము. దీనిస్వరూపము నీకు తెలిసినదా?

ఓ మనంబ, చెపుమ యీ మహి యనెడి
యబ్ధి దేలెడి నావ లవి యెన్ని కలవొ?
మున్గు నావల సంఖ్య మొత్త మ దెంతొ?

అంతె కాదు —

గాలిపటములు లక్ష యెగురుచుండఁ
ద్రాడు తెగి విడు పొందఁ గలవి యొకటొ
రెండొ; లోకజనని, రేఁగి చేతులను
దట్టి హాసింతువు దాని గాంచుచును.

లక్షకొక్కనికి మాత్రము ముక్తి గల్గును. ఇతరులు లోకజనని సంకల్పానుసారము బద్ధులైయే యుందురు.

దాగుడుమూతలాట నీవు చూడలేదా? ఆట సాగుచునే ఉండవలె నన్నది తల్లి సంకల్పము. అందఱును తల్లిని తాకి విడుదల పొందుదు రేని, ఆట ఆగి పోవును. కాబట్టి అందఱును తన్ను తాకవలె ననుట ఆమె సంకల్పము కాదు.

నేను లోకమాతను ఇట్లు ప్రార్థించితిని — "అమ్మా, నాకు పేరుప్రతిష్ఠలు అక్కఱ లేదు. అష్టసిద్ధులు నాకు అక్కఱ లేదు: నూఱు సిద్ధులైనను నాకు అక్కఱ లేదు. అమ్మా, నాకు జీవితభోగానుభవాపేక్ష లేదు. నీ పాదపద్మములందు నాకు స్వచ్ఛమైన భక్తిని ప్రసాదింపుము. తల్లీ, అదే నేను కోరు వరము".

భక్తులు మంత్రముగ్ధులు పోలె శ్రీరామకృష్ణుని మాటల నాలకించిరి. ఆయన ఉడుకుమాటలు వారి ఆత్మలలో చొచ్చుకొని వారిని వైరాగ్యమార్గమున త్వరగొల్పినవి.

అంతట ఆయన ఈశానునితో తీవ్రకంఠమున సంభాషించెను.

గురుదేవుడు :— ముఖస్తుతిపరుల పొగడ్త పల్కులను విని నిన్ను నీవు మఱువకుము. ముఖస్తుతిపాఠకులు లౌకికమానవుని చుట్టును మూగుదురు. గ్రద్దలు ఆవుపీనుగుచుట్టును మూగును.

లౌకికమానవులకు అంతస్సారము లేదు. స్తుతిపాఠకులు వారి దాపున జేరి 'అయ్యా, మీ యౌదార్యము అతిమాత్రము, మీ బుద్ధి అపారము, మీ భక్తి నిరతిశయము" అని పల్కుదురు. ఇవి వట్టి మాటలు గావు, మొనలు గలిగి వారిపై రువ్వబడిన వెదుళ్లు. రేయనక పగలనక లౌకిక బ్రాహ్మణ పండితతతిచే పరివేష్టితుడై వారి స్తుతివాక్యాలకు వీను లొగ్గుచుండుట ఎంత యవివేకము!

లౌకికమానవుల బానిసతనము మూడు తావుల స్పష్టము — వారు తమయిల్లాండ్రకు బానిసలు, తమ ధనమునకు తాము బానిసలు,

తమ ప్రభువులకు తాము బానిసలు. వారిలో అంతస్సారము ఇంచు కేని ఉండగలదా?

మాధ్యస్థ్యాలు, నాయకత్వాలు! ఇవి ఎంత అల్పములు! ఇక పరోపకారాది ధర్మకార్యాలా. ఇప్పటికి నీవు చేసినవి చాలును, ఇట్టి పనులలో ఆసక్తి వహింపవలసినవారి వర్గము వేఱు. నీ మట్టుకు నీవు నీ చిత్తమును భగవత్పాదపద్మములందు నెలకొల్పుకొనుటకు అర్హమైన కాలము వచ్చినది. దేవుని ప్రాపింతు వేని తక్కిన అన్నింటిని గూడ ప్రాపింతువు. భగవత్ప్రాప్తి మొదటిది. ధర్మకార్యాలు పరోపకారాలు జగద్ధితాలు ప్రజోద్ధరణాలు — ఇవి రెండవ తరగతివి. వీని చింత నీకు ఎందులకు?

అదే నీతో గూడిన చిక్కు. సర్వసంగములు విడిచిన సాధు పుంగవు డవ డైన నీకు కొంత జ్ఞానోపదేశము చేసిన చాల బా గుండును. లౌకికుల సలహాలు సరిగా ఉండవు. వారు బ్రాహ్మణ పండితులు గాని, వేదాంతులు కాని.

ఉన్మత్తుడవు కమ్ము, భగవత్ప్రేమోన్మత్తుడవు కమ్ము. "ఈశానునకు వెఱ్ఱెత్తినది, లౌకిక కార్యాలను ఇక నతడు నిర్వహింప లేడు" అని ప్రజలు తెలిసికొననీ. తెలిసికొన్న పిమ్మట మధ్యస్థునిగ జేసికొనుటకు గాని, నాయకునిగ జేసికొనుటకు గాని వారు నీ కడకు రారు. ఈ పూజాద్రవ్యాలను పాఱవేసి ఈశాను* డను నీ నామమును సార్థకపఱచుకొమ్ము.

ఈశానుడు ఈ క్రింది పద్యము చదివెను —

భక్తహృద్ధారిణి వరకృపానిలయ
జ్ఞానము నా కేల? చటుల వివేక
మైనను నా కేల? అమ్మ, నీ పైని
ప్రేమచే వెఱ్ఱిని చెంపు నాలోన

* ఇది త్యాగవైరాగ్యశాలి యైన శివుని పేరు.

గురుదేవుడు :— శెబ్బాసు! అదే కావలసినది. శివనాథు డొకసారి 'దేవునిగూర్చి మితి మీఱి ధ్యానించిన బుద్ధి చెడిపోవు' నన్నాడు. "ఏమి! చైతన్యస్మరణచే చైతన్యహాని పొసగునా? దేవుడు నిత్యుడు, పవిత్రుడు, చిత్స్వరూపి. భగవంతు నెఱిగిన వాడు సర్వము నెఱిగిన వాడు, భగవద్జ్ఞానముచే నిఖిలమును జ్ఞానమయముగ భాసించును" అని నే నంటిని.

ఈశానుడు శ్రీరామకృష్ణునికి పాదసేవ చేయుచు ఆయన మాటల నాలకించుచు కూర్చుండి యుండెను. అప్పు డప్పుడు అతడు గుడిలో అమ్మవారిశిలావిగ్రహముపై నొక చూపును బఱపుచుండెను. దీపపు వెలుగున కాళి నవ్వుచున్నట్లు కనిపించెను. దేవి సాక్షాత్తుగ ఆ విగ్రహరూపిణిగ అగపడి వేదవాక్యములవలె పవిత్రములైన గురుదేవుని వాక్యములను విని ఆనందించుచున్నట్లుండెను.

ఈశానుడు :— [విగ్రహమును జూపుచు] పవిత్రమైన మీ నోట వెలువడుచున్న యీ మాటలు నిజముగ అక్కడ ఉద్భవిల్లినవే.

గురుదేవుడు :— నేను యంత్రమను, ఆమె యంత్రచాలకురాలు. ఆమె ఎట్లు ఊపిన నే నట్లు ఊగుదును. నాగుండ ఆమె ఏ మాట లాడిన, ఆ మాటలనే నే నాడుచుందును. ఈ కలియుగమున శిశుముఖముననో ఉన్మత్తునిముఖముననో అట్టి వే ఱొకని ద్వారానో కాక, దైవవాక్కును విన లేమట.

గురుదేవుడు లేచెను, గుడి కెదుట నున్న వేదిక నెక్కి, శోణితలము నె న్నుదురు సోకునట్లు, అమ్మకు మ్రొక్కెను. భక్తులు వేగముగ చుట్టును మూగి, ఆయన పాదముల వ్రాలిరి, అనుగ్రహింప వేడిరి.

1884–వ సంవత్సరము అక్టోబరు తే 26 ది భానువారము.

అప్పటికి మధ్యాహ్నము దాటినది. గురుదేవుని గదిలో భక్తులు పెక్కండ్రు ఉండిరి. వారి నడుమ మనోమోహనుడును,

మహిమాచరణుడును, మహేంద్రుడునుగూడ నుండిరి. కొంత సేపటికి హరిజాయు ఈశానుడును గూడ వచ్చి చేరిరి.

ఒకభక్తుడు :— స్వామీ, మీరు దేవుని ప్రత్యక్షముగ జూచుకరటగా, నిజమేని, దయచేసి మాకును జూపుడు.

గురుదేవుడు :— అంతయు ఈశ్వరసంకల్పాధీనము. మానవు డేమి చేయ గలడు? భగవన్నామసంకీర్తన చేయునప్పుడు కన్నులు ఒక్కొక్కప్పుడు బాష్పములు కురియును. ఒకొక్కప్పుడు చెమ్మగిల నైన చెమ్మగిల్లవు. భగవద్ధ్యానము చేయునప్పుడు కొన్ని దినాలలో నాకు నాలో అంతఃప్రబోధ మతిమాత్రముగ తెలియ నగు చుండును, కొన్నిదినాలలో ఏ యనుభూతియు ఉండదు.

మానవుడు కర్మల ఆచరింప వలెను, ఆచరించిననే దేవుని సాక్షాత్కరించుకో గలడు. నా మనఃపరిస్థితి ఉచ్ఛస్థాయి యందున్న యొక నాడు నాకొక దృశ్యము కనిపించినది — హాల్దార్పుకురు సరస్సు — నిమ్నకులు డైన పల్లెవాడొకడు ఆకుపచ్చని మస్టును ఆవలికి నెట్టి వేసి నీటిని తోడుకొనుచున్నట్లు అగపడినది. నడుమ నడుమ ఆ పల్లెవాడు నీటిని తన అరచేత గొని పరిశీలించుచుండెను. ఆ దృశ్యముచే నాకు తెలుపబడిన విశేష మిది — కప్పి ఉన్న ఆకుపచ్చని మస్టును ఆవలికి నెట్టివేయకున్న నీరు అగపడదు, అనగా కర్మల నాచరింపకున్న ఎవనికిగాని భగవత్ప్రేమ పెం పొందదు, భగవత్సాక్షాత్కారము లభింపదు. కర్మలు అనగా ఏవి? ధ్యానము, జపము — ఇవియు ఇట్టివియునే. భగవన్నామములను భగవన్మహిమ లను కీర్తించుటయుం గూడ కర్మమే. ధర్మకార్యాలు, యజ్ఞాలు మున్నగువానిని గూడ నీవు కర్మ లను శీర్షిక క్రింద జేర్చుకో వచ్చును.

మహిమాచరణుడు :— నిజము, స్వామీ, కర్మలను తప్పక చేయవలసినదే, మిక్కిలి శ్రమపడ వలెను, పడిననే సిద్ధి గలుగును. చదువవలసినది ఎంత ఉన్నది! వేదశాస్త్రములు అనంతములు.

గురుదేవుడు:— (మహిమాచరణునితో) వేదశాస్త్రాలలో నీవు చదువగలది ఏపాటి? వట్టి యుక్తివాదము చేసి నీ వేమి సాధింతువు? అన్నిటికన్న ముందు దైవసాక్షాత్కార మొందుటకు ప్రయత్నింపుము. గురూపదేశములను నమ్మి పాటుపడుము. నీకు గురు వొకడు లేకున్న, మిక్కుటమైన హృదయోత్కంఠతో దేవునే ప్రార్థింపుము. దేవుడె స్వస్వరూపజ్ఞానమును నీకు గలిగించును.

గ్రంథాలనుండి దేవునిగూర్చి నీ వేమి తెలిసికొందువు? సంతకు నీవు దూరమున ఉన్నంతవరకు అస్పష్టమైన ఘోష మాత్రమే నీకు వినవచ్చు చుండును. సంతలోనే నీవు ఉన్నప్పుడు అట్లు కానే కాదు. సర్వమును నీకు స్పష్టముగ కనిపించుచుండును, స్పష్టముగనే వినిపించు చుండును: 'ఇదిగో, మీరు కోరిన ఉర్లగడ్డలు. తీసికొండి. పైక మిండి' అను మాటలు విననగుచుండును.

సముద్రమునకు నీవు దూరముగ ఉన్నప్పుడు ఉఱుముం బోని దాని ఘోష మాత్రమే నీకు విననగుచుండును. దానిని సమీపింపుము. పొర్లుచున్న కెరటాలను, పఱచుచున్న పక్షులను, పర్యటించుచున్న పడవలను లెక్కింటేని జూతువు.

గ్రంథపఠనమాత్రముచే ఎవడు గాని యథార్థ భగవదను భూతిని పొందలేడు. గ్రంథపాండిత్యమునకంటె ఎంతో విలక్షణ మైనది ఆ యనుభూతి. భగవత్సాక్షాత్కారము నొందిన వాని దృష్టికి గ్రంథాలు వేదాలు శాస్త్రము — ఇవి తృణప్రాయములుగను మలినపదార్థములుగను కనిపించును.

మహిమాచరణుడు:—ఎట్టి కర్మ నాచరించిన, భగవత్సాక్షాత్కారము గల్గును?

గురుదేవుడు:— భగవత్సాక్షాత్కారము ఇట్టి కర్మచే గలుగును, అట్టి కర్మచే కలుగ దనుట కాదు. భగవదనుగ్రహమే భగవత్సాక్షాత్కారమునకు మూలము. ఐనను మానవు డేవో

హృదయమున ఆర్తముతో, కొంత కర్మానుష్ఠానము చేయవలసినదే. ఆర్తి యున్నచో అతనికి భగవదనుగ్రహము లభించును.

భగవత్ప్రాప్తి నొందవలెనన్న అందులకు సాధుసాంగత్యము, సారాసారవివేకము, సదాచార్యానుగ్రహము అను నిట్టి అనుకూల పరిస్థితులు కొన్ని కావలెను. కుటుంబభారమును అన్నగారు తల దాల్చుట, సొంత ధర్మపత్ని పారమార్థికపరురాలుగను మిక్కిలి ధార్మికురాలుగను ఉండుట, లేదా, వివాహమే కాకుండ, సంసార బంధమున తగుల్కొనక ఉండుట — ఇట్టి పరిస్థితులు గల వానికి సిద్ధి చేకూరును.

నీవు సర్వసంగపరిత్యాగమును మానసికముగ జేయవలెను. నిస్సంగుడవై గృహస్థజీవనమును గడపుము. లోకమును విడిచి ఎట కేగెదవు? గాలి కెగురు ఎంగిలాకువలె లోకములోనే ఉండుము. గాలి, ఎంగిలాకును ఒకొక్కప్పుడు ఇంటిలోనికి విసరి పడ వేయును, ఒకొక్కప్పుడు పెంటగుట్టమీద పడ వేయును. గాలి వీచినచోటి కెల్ల అది పర్వు చుండును. ఒకప్పుడు మంచి చోట పడును, ఒకప్పుడు చెడ్డ చోట పడును. దేవుడు ప్రస్తుతము నిన్ను ఈ లోకములో ఉంచి యున్నాడు. మంచిదే. ఇచ్చటనే ఉండుము. మరల ఆయన నిన్ను ఇటనుండి లేపి ఇంతకన్న మేలైన చోటికి చేర్చు చోని, అప్పుడేమి చేయవలెనో ఆలోచించుకొనుటకు కావలసినంత వ్యవధి అప్పుడే లభించును.

దేవుడు ప్రస్తుతము నిన్ను ఈ లోకములో ఉంచి యున్నాడు. దానికి నీ వేమి చేయగలవు? సమస్తమును దేవునికే విడిచిపెట్టుము, ఆయనపాదమునే శరణ మొందుము. తర్వాత ఎట్టి కలవరమును ఉండదు. దేవుడే అన్నిటికిని కర్త అను విషయము నీకు స్పష్టమగును. అంతయు 'రాముని యిచ్ఛాధీనము'.

ఒకభక్తుడు :— రామునియిచ్ఛను గూర్చిన కథ చెప్పెదరా?

గురుదేవుడు :— ఒకపల్లెలో సాలెవా డొకడు ఉండెను.

అతడు మిక్కిలి దైవభక్తి గల వాడు. అతనియందు విశ్వాసమును అతనిపైని ప్రేమయు లేని వారు లేరు. సంతలో తన సరకును అమ్ము కొనుట అతనికి మామూలు. కొన వచ్చిన వాడు ఈ గుడ్డ వెల ఎంత అని అడుగును, సాలెవాడు "రాముని సంకల్పముచొప్పున నూలు వెల రూపాయ, నేతకూలి నాలుగు అణాలు, రాముని సంకల్పానుసారము లాభము రెండణాలు. కాబట్టి రాముని సంకల్పానుసారము ఈ గుడ్డ వెల రూపాయ ఆరు అణాలు" అని చెప్పును. జనుల కతనియందు ఎంత నమ్మకము! కొన వచ్చిన వాడు ఆ వెలను ఇచ్చి గుడ్డను తత్క్షణమే కొని పోవును. ఆ సాలెవాడు యథార్థ దైవభక్తుడు. రాత్రిభోజనము కాగానే అతడు భగవన్నామములను పాడుచు మహిమలను కీర్తించుచు ధ్యానించుచు పెక్కు గంటల కాలము పూజామందిరమున గడపెడివాడు. ఒకనాటిరాత్రి ఎంత సేపటికిని అతనికి నిద్ర రా లేదు, పూజామందిరమున కూర్చుండి అతడు నడుమ నడుమ పొగ త్రాగుచుండెను. అప్పు డొక జట్టు దొంగలు ఆ దారిని వచ్చిరి. తమ సరకులను మోయుటకు వారి కొక మను ష్యుడు కావలసి వచ్చెను. వారు సాలెవానిని తమతో ర మ్మన్నారు, చేయి పట్టుకొని పిలుచుకొని పోయినారు. వారు ఎవరింటనో దోపిడి చేసి వచ్చినారు, ఆ సరకు మూటను వారు సాలెవాని తలపై నుంచి మోసికొని ర మ్మన్నారు. తటాలున పోలీసువారు అటువైపువచ్చిరి. దొంగలు పాఱిపోయిరి. కాని సాలెవాడు తన తలపై నున్న మూటతో పట్టువడినాడు. పోలీసులు అతనిని ఆ రాత్రి జైలులో ఉంచి మఱు నాడు విచారణకై మాజిస్ట్రీటు నెదుటికి తెచ్చి నిలిపిరి. జరిగిన సంగతిని తెలిసికొని ఊరివారు అందఱును న్యాయస్థానము [కోర్టు]నకు వచ్చిరి. మాజిస్ట్రీటుతో వారు "న్యాయమూర్తిమహాశయా, ఇతడు దోపిడి చేసి యుండ లేదు" అని ఏకగ్రీవముగ జెప్పిరి. అంత మాజి స్ట్రీటు 'ఏ మందువు' అని సాలెవానినే అడిగెను.

సాలెవాడు ఇట్లు అనెను — "న్యాయమూర్తిమహాశయా, నిన్న రాత్రి రాముని సంకల్పానుసారము నేను భోజనము చేసి లేచి

తిని. తర్వాత రామునిసంకల్పానుసారము పూజామందిరమున కూర్చుంటిని. రామునిసంకల్పానుసారము నాటిరాత్రి చాల ప్రొద్దు పోయినది. రామునిసంకల్పానుసారము నేను భగవద్ధ్యానము చేసి కొనుచు భగవన్నామముల పాడుచు మహిమల కీర్తించుచు నుంటిని. అప్పుడు రామునిసంకల్పానుసారము ఒక జట్టు దొంగలు ఆ దారిని వచ్చిరి. రామునిసంకల్పానుసారము వారు నన్ను తమతో లాగుకొని పోయిరి. రామునిసంకల్పానుసారము వారు ఒకరింట దోపిడి చేసిరి. రామునిసంకల్పానుసారము వారు మూటను నా తల కెత్తిరి. సరిగా అదే సమయమునకు రామునిసంకల్పానుసారము పోలీసులు వచ్చిరి; రామునిసంకల్పానుసారము నన్ను బంధించిరి, రామునిసంకల్పాను సారము రాత్రియంతయు నన్ను వారు చెఱ యందుంచిరి. నేటి ప్రొద్దున, న్యాయమూర్తి మహాశయా, రామునిసంకల్పానుసారము పోలీసులు నన్ను దెచ్చి మీ యెదుట నిలిపిరి''. ఆ సాలెవాడు దైవ భక్తుడని మాజిస్ట్రీటు గ్రహించి అతనిని విడుదల చేయించెను. ఇంటికి మరలి వచ్చుచు సాలెవాడు తన మిత్రులతో "రాముని సంకల్పానుసారము నాకు విడుదల గలిగినది'' అనెను.

ఒక మానవుడు గృహస్థుడుగ నుండ వలెనో సన్న్యాసిగ నుండ వలెనో రామునిసంకల్పాధీనము. సమస్తమును దేవుని కర్పించి నీ లౌకికకృత్యములను నిర్వర్తించుచుండుము. వేఱేమి నీవు చేయ గలవు?

గృహస్థుడు జీవన్ముక్తుడగుచో, అతడు తన కిష్టపడిన యెడల ఇహలోకజీవితమును సులువుగ గడప వచ్చును. ప్రాప్తజ్ఞానుడైన వాడు "ఈ చోటు'', "ఆ చోటు'' అను భేదము పాటింపడు. ఏ చోటైనను అతని కొక్కటే. "ఆ చోటు'' పై వ్యామోహము గలవానికే "ఈ చోటు''పైని గూడ వ్యామోహ ముండును.

జయగోపాలుని వనమందిరమున నేను తొలిసారి కేశవుని కలసికొన్నపుడు "తనతోకను వీడిన వాడితడొక్కడే'' అని నే

నంటిని. విన్న వారు నవ్విరి. కేశవుడు వారితో "నవ్వకుడు ఆయన మాటలలో ఏదైన అర్థవిశేష ముండును. ఆయననే అడుగుదము" అనెను. అప్పుడు కేశవునితో నేనిట్లంటిని. "అప్పుడే గ్రుడ్డులో నుండి వెలువడిన కప్పపిల్లకు తోక యుండును. ఆ తోక దానికున్నంత వఱకును అది నీటనే యుండును. పొడినేలపై అది సంచరింప లేదు. కాని తోక పడగనే అది గట్టుమీదికి గంతు వేయును. అప్పటినుండియు అది నేలపైని నీటియందు గూడ జీవింప గలదు. మానవుని యజ్ఞానము ఆ తోక వంటిది. అది యున్నంతవఱకు నతడు ఇహలోక మనెడి నీటియందు మాత్రమే జీవింపగలడు. ఆ తోక నతడు వదలించుకొన్నపుడు, అనగా అతనికి భగవంతుని గూర్చిన జ్ఞానము కలిగినపుడు అత్మప్రతిబంధములు తొలగి స్వేచ్ఛగా సంచరింప గలడు. కావలె ననుకొన్నచో గృహస్థజీవనమును గూడ నడప గలడు.

మహిమాచరణుడు మున్నగు భక్తులు మంత్రముగ్ధులుం బోలె గురుదేవుని సూక్తుల నాలకించుచుండిరి.

గురుదేవుడు :— ఒకనాడు నేను దేవేంద్రనాథ ఠాకూరును చూడ నేగితిని. మథుర్బాబు నా వెంబడి నుండెను. "దేవేంద్ర ఠాకూరునకు భగవద్ధ్యానాసక్తి కల దని విని యున్నాను. ఆయనను దర్శింప వలెను" అని నేను మథురునితో నంటిని. "సరే, నేనే మిమ్ము ఆయనయొద్దకు పిలుచుకొనిపోవుదును. మే మిద్దఱమును హిందూకళాశాలవిద్యార్థులము. మాకు పరస్పరము ఎంతో మైత్రి" అన్నాడు మథురుడు. మేము దేవేంద్రునింటికి పోయితిమి. మథురుడును దేవేంద్రుడును ఒకరొకరిని చూచుకొని చాల కాల మైనది. దేవేంద్రుడు మథురునితో "నీలో కొంత మార్పున్నది. నీబొజ్జ కొంత లావెక్కినది" అన్నాడు. మథురుడు నన్ను చూపి "ఆయన మీ దర్శనార్థము వచ్చి యున్నారు. ఆయనకు దైవోన్మాదము ఎల్లపుడు ఉండును" అని చెప్పినాడు. నాకు దేవేంద్రుని దేహములోని కొన్ని లక్షణములను పరికింప వలె నను కుతూహలము

గలిగి "దయచేసి మీ మేనును చూడ నిండు" అంటిని. ఆయన తన చొక్కాను తీసి వేసెను. చూతును గదా ఆయన వన్నె ఇంచుక గౌరముగ మిక్కిలి మనోహరమై యుండెను. ఆయన శిరోజము లింకను తెల్లబడ లేదు.

దేవేంద్రునిలో ప్రప్రథమమున కొంత గర్వము నాకు కనిపించినది. అది సహజమే కదా, ఆయన సంపద యెంత! చదు వెంత! పేరుప్రతిష్ఠ లెంత! ఆ గర్వపుజాడను గుర్తించి నేను మథురునితో ని ట్లంటిని : "సరి, గర్వమునకు కారణము జ్ఞానమా, అజ్ఞానమా? 'నేను పండితుడను, జ్ఞానిని' అను నిట్టి భావములు బ్రహ్మజ్ఞానికి పొసగునా?"

దేవేంద్రునితో సంభాషించుచున్నపుడు, తటాలున నాలో ఒకస్థాయి కలిగినది. ఆ స్థాయిలో నే నున్నపుడు, ఎదుటివాని యథార్థస్వరూపమును స్పష్టముగా తెలిసికోగలను. లోలోన నాకు, నన్ను ఉక్కూత లూపునంతటి నవ్వు వచ్చినది. ఆ స్థాయిలో నున్న నాకు చదువరు లన్నను, గ్రంథపండితు లన్నను గడ్డిపఱకతో సమానము. వివేకవైరాగ్యములు లేని పండితుడు వ్యర్థ డనియు గడ్డిపఱకతో సమానుడనియు నా యభిప్రాయము. అట్టి పండితుడు, తా నెంత పై నెగురుచున్నను తన చూపుల నేమో క్రింది పీనుగుల గుంటలపై నిమగ్నమొనర్చు గ్రద్దను పోలిన వాడు.

దేవేంద్రుడు తన జీవితములో భోగయోగముల రెంటిని మేళవింప జేసికొన్నా డని నేను గుర్తించితిని. ఆయనకు పిల్లలు కొంద ఱున్నారు. అందఱును పసివారే. వారి గృహవైద్యు డక్కడనే ఉండెను. ఆయన జ్ఞానియైనను ఐహికజీవితమున తిరుబడి లేక యున్నాడు. నేను ఆయనతో "మీరు సంసారమునుండియే భగవద్ధ్యానమును చేయుచుందు రని విని మిమ్ము దర్శింప వచ్చితిని. దయచేసి దేవునిగూర్చిన విషయమును దేని నైనను చెప్పుడు" అని అంటిని.

ఆయన శ్రుతిప్రమాణములను కొన్నింటిని ఉదాహరించి 'ఈ జగ మెల్ల నొక దీపాలసెమ్మె; ప్రతిప్రాణియు అం దొక దీపము' అన్నాడు. పంచవటిలో ధ్యానించుచున్నపుడు నేనును అట్టి దృశ్యమునే ఒకసారి చూచియుంటిని. ఆయన చెప్పినది నేను చూచిన దానితో సరిపడినందున ఆయన చాల గొప్పవా డని అనుకొంటిని. 'నీవు చెప్పినదానిని కొంత వివరింపు' మని నే నాయన నడిగితిని. ఆయన ఇ ట్లన్నాడు: "దేవుని మహిమను ప్రతిఫలింపజేయవలసిన వాడు మానవుడు. అందులకే దేవుడు మానవుల సృష్టించెను. అట్లు గాకున్న ఈ జగమును ఎవరు ఆకళించుకొగలరు? సెమ్మెలో దీపములు లేకున్న అంతయు చీకటిలో మునుగదా? ఆ చీకటిలో సెమ్మెసైతము అగపడదు.

మా సంభాషణ చాలసేపు చెల్లినది. దేవేంద్రుడు ప్రీతుడై బ్రాహ్మసమాజోత్సవమునకు తప్పక ర మ్మని న న్నాహ్వానించినాడు. నా వచ్చుట భగవదిచ్ఛాధీనము. నా మనఃపరిస్థితులు ఎ ట్లుండునో చూచితివి కదా! కావున దేవుడు నన్ను ఎప్పు డే స్థితిలో నుంచునో తెలియరాదు— అని నే నంటిని. దేవేంద్రుడు "అట్లు కాదు, మీరు తప్పక రావలెను కాని వచ్చు నపుడు దోవతి కట్టుకొని శాలువ కప్పుకొని రండి. వేషము బాగుండకున్న ఎవ రైన మిమ్ము ఏ మేని అన రాని మాట అందురు. అది నన్ను నొప్పించును" అని నిర్బంధించి ప్రార్థించినాడు. 'వత్తునని, ఆలాగు వత్తునని, నేను వాగ్దానము చేయ జాలను. నేను ఒక బాబుగా నుండ లేను' అని నే నంటిని. దేవేంద్రుడును మథురుడును నవ్విరి.

మఱునాడే దేవేంద్రుడు మథురునకు జాబు వ్రాసినాడు. ఆ జాబులో నన్ను ఉత్సవమునకు రా వల దన్నాడు. ఒడలికి శాలువ కప్పుకొనకున్న పెద్దమనుష్యుల వైఖరిగా నుండ దని వ్రాసినాడు. (అందఱును నవ్వుదురు).

మఱి యొక వ్యపదిష్ట వ్యక్తి యున్నాడు, ఎవ రనగా కాప్టను*

* చూ. ఉపోద్ఘాతము పుట ౭౮.

అతడును లౌకికు డయినను గొప్పభగవద్భక్తుడు. (మహిమునితో) ఎప్పుడైన అతనిని కలిసి మాటాడుము. ఆయనకు వేదములును వేదాంతమును, భగవద్గీతయు ఇతరశాస్త్రగ్రంథములును, కంఠస్థములు. ఆయనతో మాటాడినపుడు నీ కా సంగతి తెలియును. అతని గూర్చి అతని భార్య నాతో "ఆయనకు ఐహికజీవితమున ఆనందము లేదు. కావుననే ఒకసారి సన్న్యసింతు నని కూడ అన్నారు" అని చెప్పినది. నిజమే, మాటిమాటికిని అత డా కోరికను తెలిపియున్నాడు.

కాప్టను ఒక భక్తకుటుంబములో జన్మించినాడు. అతని తండ్రి సైనికోద్యోగి. రణరంగమున ఆయన ఒఱనుండి తీసిన ఖడ్గము నొక చేత దాల్చి వే ఱొక చేత పరమశివారాధనము చేసెడి వా డట.

కాప్టను సనాతనాచారములను పట్టుదలతో పాటించుచుండును. నేను కేశవచంద్రసేనును చూచివచ్చితి నని కాప్టను మా యింటికి వచ్చుటను మానివేసి నెలదినము లుండెను. కేశవుడు సంఘాచారములను ఉల్లంఘించినా డనియు ఆంగ్లేయుల పంక్తిలో భుజించినా డనియు పుత్రికను వర్ణాంతరున కిచ్చి పెండ్లి చేసినా డనియు తన జాతిని చెఱచుకొన్నా డనియు — ఇ ట్లంతయు కాప్టను నాతో చెప్పినాడు. నేను "అట్టి విషయములు నా కొక లెక్క కాదు. కేశవుడు భగవన్నామములను పాడుచుండును. కావుననే భగవద్విషయములు విందమని నే నతనియొద్దకు బోవుచుందును. నేను పండును మాత్రమే తిందును. ముండ్లజోలి నా కేల" అంటిని. కాని కాప్టను తన మొండిపట్టు విడువ లేదు. "కేశవుని మీ రేల దర్శింతురు" అని అడుగుచునే యుండెను. నే నిట్లు బదులు చెప్పితిని. "అతనియొద్దకు పోవుచున్నా ననియే కాని, ధనముకొఱకు కాదు భగవన్నామసంకీర్తనమును వినుటకు పోవుచున్నాను. నీవు రాజప్రతినిధిగారింటికి పోవుచుందువే, అందుల కేమి సమాధానము? అతడు మ్లేచ్ఛుడు. అతని పొత్తు నీ కెట్లు సరిపడును?" ఈ చుఱుకైన జవాబు అతనిని కొంత నిరుత్తరుని జేసినది.

అయినను అతడు గొప్పభక్తుడే. పూజాసమయమున కర్పూర హారతిని మఱచిపోడు. స్తోత్రములను అనుసంధించునపుడు అతడు పూర్తిగ మాఱిపోవును. తదేక నిమగ్నుడగును.

(మహిమునితో) అకార – ఉకార – మకార పరముగ ఓంకారార్థమును వివరించెదవా?

మహిముడు :— అకార ఉకార మకారములకు సృష్టిస్థితి సంహారములే అర్థములు.

గురుదేవుడు:—మఱి నేనొసంగు ఉదాహరణ మేమనగా "టాం" అను ఘంటానాదము. లీల నిత్యములో నొందు లయమే అది. స్థూలము, సూక్ష్మము, కారణము అనెడి మూడును మహాకారణములో లీనమందును. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూడును తుర్యావస్థలో లయించును. గంటను మ్రోగించుట ఒక మహాసముద్రమున ఘనమైన బరువొకటి పడుటంబోనిది. కెరటాలు లేవ నారంభించును. నిత్యము నుండి లీల వెలువడును. స్థూల సూక్ష్మ కారణ శరీరములు మహాకారణమునుండి పుట్టువొందును. తుర్యావస్థనుండి సుషుప్తి, స్వప్న, జాగ్రదవస్థలు మూడును వెలువడును. ఈ కెరటాలు మహాసముద్రమునుండి ఎగసి మరల మహాసముద్రములోనే సమయును. నిత్యమునుండి లీలయు, లీలనుండి నిత్యమును. అందులకే నేను 'టాం' అను ఘంటానాదమును ఉదాహరించితిని. ఈ విషయముల నన్నిటిని నేను స్పష్టముగ సాక్షాత్కరించుకొని యున్నాను. అపారమైన చిత్సముద్ర మొకటి కలదని దివ్యదర్శనానుభూతిలో నాకు ప్రత్యక్షముగ చూపబడినది. వ్యావహారిక రంగమందలి సకల వస్తువులును ఆసముద్రమునుండియే ఉప్పతిల్లుచుండును. మరల అందే లయ మొందుచుండును.

మహిముడు:—దివ్యదర్శనానుభవములో ఇట్టి విషయములను స్పష్టముగ చూచినవారు స్వయముగ శాస్త్రగ్రంథముల వ్రాయ లేదు. వారు స్వానుభూతులలో మునిగి యుండిరి. వ్రాయుటకు

అవకాశము వారి కెక్కడిది? వ్రాయు వారికి లెక్కపక్కలు చూచుకొను చిత్తవృత్తి కావలెను. ఇతరులు విషయములను ద్రష్టలనుండి విని గ్రంథములు వ్రాసిపెట్టిరి.

1884-వ సంవత్సరము డిసంబరు తే 6 ది శనివారము.

ఆధారుని బస కలకత్తా ఉత్తరభాగములో శోభాబాజారులో. ఆఫీసులో కష్టపడి పని చేసి ముగించి, మధ్యాహ్నానంతరము ఇంటికి మరలిన పిమ్మట ప్రతిదినమును అతడు శ్రీరామకృష్ణు నొకసారి దర్శించెడి వాడు. కలకత్తాలోని తన గృహమునుండి దక్షిణేశ్వరమున కతడు బాడిగబండిలో పోవుచుండును. గురుదేవుని దర్శించుటే అతనికి ఏకైకానందము. కాని శ్రీరామకృష్ణుడు చెప్పుచుండు విషయాలలో ఏ కొంతయు ఆతడు విన్నది లేదు. ఏల యన గురుదేవునికి మ్రొక్కి దేవాలయాలకు పోయి మరలి వచ్చును, నేలపై పఱువబడియున్న చాపమీద గురుదేవుని కోర్కెపై పరుండును, వెంటనే నిద్రపోవును. తొమ్మిది పదిగంట లప్పుడు ఇంటికి మరలుటకు అతని నచ్చటివారు మేల్కొల్పుదురు. ఐనను దక్షిణేశ్వర దివ్యపురుషుని దర్శనమును పొంద గల్గినందులకే త న్నతడు ధన్యునిగా నెంచుకొనుచుండెను. ఆధారుడు ప్రార్థింపగా, అతనింటికి తఱచుగ శ్రీరామకృష్ణుడు పోవుచుండెను. ఆయన విచ్చేసినప్పు డెల్ల ఆధారునింటివారు ఆ సందర్భాలను మహోత్సవాలుగా కొనియాడెడివారు. భక్తులు అసంఖ్యాకులు సమావేశ మగుదురు. వారి కందఱకును ఆధారుడు సమృద్ధముగ విందు పెట్టుచుండును.

శ్రీరామకృష్ణుడు తన పరిజనముతో ఆధారునింటికి విచ్చేసెను. ప్రతివాడును పరమానందానుభవమున నుండెను. ఆధారుడు పెద్ద విందునకు ఏర్పాట్లు చేసెను. క్రొత్తవారు ఎందఱో హాజరైయుండిరి. ఆధారుడు తమ్ము ఆహ్వానించి యుండినందున ఇతర డిప్యూటి మాజిస్ట్రేట్లు అనేకులు వచ్చిరి. గురుదేవుని కనుపెట్టి చూచి ఆయన సాధుత్వ మేపాటిదో నిర్ణయింత మని వారి కోరిక. వారిలో

బంకిమ్‌చంద్ర ఛాటర్జీ యొకడు. పందొమ్మిదవ శతాబ్దపు ఉత్తరార్థమున బెంగాలులో వెలసిన విద్వద్వరేణ్యులలో ఆయన అద్వితీయుడు. నవ్య వంగ వాఙ్మయ స్రష్టలలో ఆయన యొకడు. ఆయన రచనలు మత సాంఘిక విషయికములు. భారతీ యాంగ్ల దేశాల సంసర్గయుగమున ఉప్పతిల్లిన వ్యక్తులలో ఆయన యొకడు. హిందూశాస్త్రముల నన్నిటిని ఆయన అపూర్వరీతి వ్యాఖ్యానించి, గాఢము లైన సంస్కారములను సంఘములో గావింప వలె ననుచుండెను.

శ్రీరామకృష్ణుడు భక్తులతో హాయిగా సంభాషించుచున్నప్పుడు ఆధారుడు తన సొంత మిత్రులను పెక్కండ్రను ఆయనకు పరిచయపఱచెను.

ఆధారుడు :—(బంకిమును పరిచయపఱచుచు) మహాశయా, ఈయన గొప్ప పండితుడు, పెక్కు గ్రంథములను రచించినవాడు, తమ దర్శనార్థము వచ్చినాడు. ఈయన పేరు బంకిమ్‌బాబు.

గురుదేవుడు:—(చిఱునవ్వుతో) బంకిమ్! బాగున్నది. మఱి నీ వంపునకు కారణ మేమి ?

బంకిమ్:—(చిఱునవ్వుతో) కారణమున కేమి? బూట్లే— కారణములు. తెల్లదొర లిచ్చు తాపులు నా శరీరమునకు నమ్రతను గూర్చినవి.

గురుదేవుడు :— కాదు, ప్రియమహాశయా, శ్రీకృష్ణునకును ఉండినది వంపు, కారణము ఉద్రిక్త మైన అతని ప్రేమయే. రాధ మీఁది ప్రేమచే ఆయన మేను మూఁడు తావుల వంపులు గలిగి యుండినది. శ్రీకృష్ణునిరూపు నట్లుంటను కొంద ఱాలాగు వ్యాఖ్యానింతురు. వన్నెలో ఆయన ఘనశ్యాముడై ఏల యుండెనో ఎఱుగుదువా? ఆయన యొడలిపొడుగును ఆయన చేతితోనే కొలిచి చూచిన మూఁడున్నఱ మూరలే. అది అంత తక్కువగ నుండుటకు కారణము తెలియునా ? చూచువార మగు మనకు చాల దూరమున నున్నంత వఱకు ఆయన అట్లే కనిపించుచుండును. దూరమునుండి చూచిన

సముద్రజలము నీలవర్ణముగ కనిపించును. కాని నీవు సముద్రమును నొద్దకు పోయి నీటిని చేతికి తీసికొని చూతువేని నీలవర్ణము అగపడదు. నీరు మిక్కిలి తేటగను ఈవలి వెలుగు నావలకి నిరాటంకముగ తనగుండ ప్రసరింపజేయునది (ట్రాన్స్పరెంట్) గను ఉండును. అట్లే సూర్యబింబము మనకు చిన్నదిగా కనబడుచున్నది. దానికి అత్యంత దూరమున మన ముండుటే అందులకు కారణము. సమీపించి చూతువేని అది చిన్నది కాదని తెలియ నగును. భగవంతుని యథార్థ స్వరూప మెఱిగిన వానికి ఆయన నల్లగను కనిపింపడు కుఱుచగను కనిపింపడు. కాని అట్టి సందర్శనము సమాధిదశలో మాత్రమే సుప్రాపము, తక్కినప్పుడు దుష్ప్రాపము. 'నేను' 'నీవు'లు ఉన్నంతవఱకును నామ రూప భేదములును ఉండును. సమస్తమును భగవల్లీల. మానవునకు 'నేను' 'నీవు' అనెడి భేదభావజ్ఞప్తి ఉన్నంత వఱకును, వివిధరూపాలలో నతడు భగవదావిష్కారము ననుభవించు చుండును.

బంకిమ్ :—మహాశయా, తాము మతాచార్యకము నేల చేయరు ?

గురుదేవుడు:—(చిఱునవ్వుతో), మతాచార్యకమా? అవినయము గల మానవునకే మతాచార్యకముపై మనస్సు పోవును. మానవుడు అకించనుడు. ఆచార్యకము దేవుని పని. చంద్రసూర్యులను లోకములోని వెలుగును సృజించిన దేవుడే ఆచార్యకము చేయును. మతాచార్యకము అంత చులకన అయిన పనియా? దేవుడు నీకు ప్రత్యక్షమై మతాచార్యకము నిర్వహింపు మని నిన్ను నియోగింపనిదే నీవు ఆ పనిని చేయ లేవు. మతాచార్యకమును చేయనీయక ఎవరును నిన్ను ఆప లేరనుటయు సరియే. భగవన్నియమనము నేమో ఇంకను నీవు పొంద లేదు. కాని గొంతు రాచుకొనునట్లు అఱచుచున్నావు. ప్రజలు రెన్నాళ్ల పాటు నీ మాటలను విందురు. తరువాత వాని నన్నిటిని మఱచిపోదురు. తాత్కాలికోద్రేకము

లన్నింటివంటిదే అదియు. నీవు మాటాడు చున్నంత సేపును ప్రజలు 'భళి, బాగున్నది' అనుచుందురు. నీ ప్రసంగము ఆగిన క్షణము ననే అంతయు మాయ మగును. దేవుడు నీ కగపడి ఆజ్ఞ నందజేయు నేని అప్పుడు నీవు ప్రజల కాచార్యుడవు కా వచ్చును. లేకున్న నీ మాటల నెవరు విందురు?

చూడ వచ్చిన వా రందఱును ఆస్థతో వినుచుండిరి.

గురుదేవుడు:—(బంకిమ్‌తో) నీవు గొప్ప పండితుడ వనియు పెక్కు గ్రంథములను రచించితి వనియు నాకు తెలియ వచ్చినది. దయచేసి నీ యభిప్రాయము ప్రకారము మానవునకు అవశ్య కర్తవ్యా లేవో చెప్పెదవా? మరణానంతరము మానవుని వెన్నంటునది ఏది? ఇతఃపరముల యెడ నీకు విశ్వాస మున్నది. అవునా?

బంకిమ్:—ఇతఃపరమా? అనగా నేమి?

గురుదేవుడు:—నిజమే, జ్ఞానము నధిగమించిన పిమ్మట మరణించు నాతడు ఎక్క వలసిన పై మెట్టు విశ్వమున లేదు. అతనికి పునర్జన్మము లేదు. కాని జ్ఞానము సిద్ధింప కున్నంత వఱకును భగవత్సాక్షాత్కారము కలుగనంత వఱకును మానవుడు ఇహలోక జీవనమునకు మరలుచునే యుండ వలయును. దాని నత డెన్నటికిని తప్పించుకొన లేడు. అట్టివానికి ఇతఃపరము (= దీనికి పై మెట్టు) ఉన్నది. జ్ఞానసిద్ధియు భగవత్సాక్షాత్కారమును కలిగిన తరువాతనే మానవుడు విముక్తి నొందును. అతనికి సంసార పునరావృత్తి లేదు. ఉడికిన వరి గింజను చల్లితి మేని అది మొలవదు. అట్లే మానవునకు జ్ఞానాగ్నిచే పరిపక్వత గలిగినప్పుడు ఇక నతడు సృష్టిలీలలో పాల్గొన లేడు. ఉడికిన వడ్లను చల్లి నీ వేమి లాభపడ గలవు?

(బంకిమ్‌తో చిఱునవ్వు నవ్వుచు) సరి, మానవుని కర్తవ్యముల గుఱించి నీ వే మందువు?

బంకిమ్ :— (చిఱునవ్వుతో) నన్నడుగుదు రేని తిండి, నిద్ర, ఇంద్రియసుఖానుభవము అను నవే మానవుని విధులు అని అందును.

గురుదేవుడు:—(చుఱుకుగా) అబ్బే! నీయందు అవినయము చాల ఎక్కువగా నున్నదే. రాత్రింబగళ్లు నీ వేమి చేయుచున్నావో అదే నీ నోట వచ్చుచున్నది. తిన్న వస్తువులో నున్న వాసనయే తేపులోను ఉండును. ముల్లంగి గడ్డ తిన్న వాని తేపులో ముల్లంగి గడ్డ వాసన వచ్చును. పచ్చి కొబ్బరి తిన్న వాని తేపులో పచ్చి కొబ్బరి వాసన వచ్చును. రాత్రింబగళ్లు నీవు కామినీకాంచనముల నడుమనే ఉందువు కావున అందుంగూర్చిన మాటలే నీ నోట వెలువడుచున్నవి. ఐహికవిషయ నిరంతర స్మరణచే మానవుడు లోభిగను వంచకుడుగను పరిణమించును. దైవమును స్మరించు నేని మానవుడు అమాయకుడుగా పరిణమించును. దేవుని చూచిన మానవుడు ఇప్పుడు నీవు చెప్పిన మాటల వంటి మాటలను ఎన్నడును చెప్పడు. దైవ స్మృతియు వివేక వైరాగ్యములును లేని పండితునకు తనపాండిత్యము వలన ఏమి లాభించును?

పండితుడు పెక్కు గ్రంథాలను శాస్త్రములను చదివినవాడనుట నిజమే. ఆ గ్రంథములలోని వాక్యములను చదివి అతడు గింగురు మనిపింప వచ్చును. అతడు బహుళ గ్రంథరచనను సైతము చేసి యుండ వచ్చును. కాని కామినీసంగమును, సిరియు కీర్తియు నే పురుషార్థము లనెడి తలంపును అతని కుండు నేని అతనిని పండితుడందువా? ఎవని మనస్సు దేవునిలో నెలకొనదో అత డెట్లు పండితుడనిపించుకొనును?

భక్తులనుగూర్చి కొంద ఱిట్లు చెప్ప వచ్చును. "వీరు రాత్రింబగళ్లు దేవుని గూర్చి ప్రసంగించుచుందురు. కాని వీరికి చిత్తస్థైర్యము లేదు. మతి పోయినది. మన మెంత కుశలులము! ధనము, కీర్తి, ఇంద్రియసుఖము మొదలైన యానందమును మన మెంతగా

అనుభవించుచున్నాము!'' కాకి కూడ పక్షులలో తాను మిక్కిలి తెలివి గల దని అనుకొనును. కాని వేకువను నిద్ర లేచినపుడు అది చేయు మొదటి పని యే మనగా ఇతరులు పారవేసిన వస్తువులతో తన కడుపును నింపుకొనుట. కాకి నడచు గర్వంపు నడకను నీవు చూడ లేదా? నిజముగ మిక్కిలి తెలివి గలదే!

పరిసర మంతయు పూర్తి నిశ్శబ్దముగా నుండినది.

శ్రీరామకృష్ణుడు ఇంకను ఇట్లనెను. భగవంతుని స్మరించుచు ఐహికసంగ విముక్తికై రాత్రింబగళ్లు ప్రార్థించుచు భగవచ్చరణారవింద మకరందముం దప్ప వేఱు దేనిని గాని అనుభవింప కుండు వారు హంసలను బోలిన వారు. ఐహిక సుఖములు వారికి చేదుగ నుండును. క్షీరనీరములను కలిపి ఒక హంస ముందఱ పెట్టుము. అది నీరమును విడిచి క్షీరమును మాత్రమే గ్రోలును. హంస నడక ఎట్లుండునో నీవు చూడ లేదా? ఎట్టి వంకరలును లేక ఒకవైపున ముందునకు పోవు నడక దానిది. యథార్థ భక్తుల నడవడి గూడ అట్లే యుండును. వారు సూటిగ దేవునొద్దకే పోవుదురు. వేఱు దేనిని గాని వారు కోరరు, అనుభవింపరు.

(బంకిమ్‌తో మృదువుగా) దయచేసి నా మాటలకు నీవు కోపింపకుము.

బంకిమ్:—స్వామీ, నే నిచ్చటికి వచ్చినది తియ్యని మాటల వినుటకు కాదే.

గురుదేవుడు:—(బంకిమ్‌తో) సంసార మనగా కామినీకాంచనములే. మాయ అన్నను అవే. నీకు భగవ ద్దర్శనము గాని భగవచ్చింత గాని కలుగ నీయక చేయునవియు అవే. ఒక రిద్దఱు బిడ్డలు పుట్టగనే ఆలుమగలు తోబుట్టువులవలె మెలగుచు భగవద్విషయిక సల్లాపములను చేయుచుండవలయును. అప్పుడు ఇరువురి మనస్సులును దేవునివంకకు ఆకృష్టము లగును. జ్ఞానమార్గమున మగనికి ఆలు సయాత్రికురా లగును. మృగభావములను త్యజింపని వా డెవ్వడును

దివ్యానందమును ఆస్వాదింప లేడు. అట్టి మృగభావముల నుండి విముక్తిని ప్రసాదింపు మని భక్తుడు భగవంతుని ప్రార్థింప వలెను. మనఃపూర్వకముగ ప్రార్థింప వలయును. దేవుడు మనకు అంతర్నియంత. నీ ప్రార్థన మనఃపూర్వక మైనచో ఆయన దానికి తప్పక చెవి యొగ్గును.

ఇక "కాంచనము". గంగయొడ్డున పంచవటికి క్రిందుగ కూర్చుండి నేను "రూపాయ బంకమట్టిపెళ్ల, బంకమట్టిపెళ్ల రూపాయ" అని చెప్పుచుంటిని. చెప్పి, రూపాయను బంకమట్టిపెళ్లను రెంటిని గంగలో పాఱవేసితిని.

బంకిమ్ :— నిజమా? ధనము బంకమట్టియా? స్వామీ, మీచేత నాలుగు రూక లుండిన పేదలకు మీరు తోడ్పడ గలిగి యుందురు. ధనము బంకమట్టి యా నేని మానవుడు దానధర్మముల చేయ లేడు గదా.

గురుదేవుడు :— (బంకిమ్‌తో) ధర్మము! పరోపకారము! ఇతరులకు మేలు చేయ గల నని చెప్ప ధైర్యము నీ కెట్లు గలిగినది? మానవుడు ఇంత విఱ్ఱవీగును కదా! నిద్రించుచున్నపుడు అతని నోట ఎవ డేని మూతికి నీటిని పోయు నేని అతని కది తెలియదు. నీ రేమో నోరు నిండి వెలికి కాఱుచుండును. అతని విఱ్ఱవీగుటలు, మదము గర్వము అప్పు డెచ్చట నుండునో!

గృహస్థునకు నిజ మైన భక్తి యున్నచో అతడు తన విధుల నన్నిటిని నిస్సంగుడై నిర్వర్తించును. లాభనష్ట సుఖదుఃఖ రూప మైన కర్మఫలము భగవదర్పణము కావించి తనకు కావలసినది భక్తి యొక్కటే యనియు వే ఱెద్దియు అక్కఱ లే దనియు రాత్రింబవళ్లు ప్రార్థించును. నిష్కామకర్మ మన్నను సంగరహితకర్మానుష్ఠాన మన్నను ఇదే. సన్న్యాసిగూడ తన పనులను అట్లు సంగ రహితముగనే చేయ వలయును. కాని గృహస్థునకు ఉన్న ట్లితనికి నిర్వర్తింప వలసిన లౌకిక విధు లుండవు.

గృహస్థు సంగరహితుడై అర్థులకు దానము చేయు నేని, అది అతడు తనకే చేసికొను ఉపకార మగునే కాని ఇతరులకు చేయు ఉపకారము కాదు. అతడు చేయు సేవల నందుకొనునది సకలప్రాణులలోను అంతర్యామిగ ఉన్న భగవంతుడే. భగవంతు నారాధించుటచే ఆరాధకుడు నిజముగ తనకే ఉపకరించుకొనుచున్నాడు గాని ఇతరులకు కాదు. మానవులకే కాక సకలప్రాణులకును సేవ చేయుట ద్వారా దేవుని సేవింప వలెను. పేరుప్రతిష్ఠలను గాని, దేహపాతానంతరము స్వర్గసౌఖ్యమును గాని అపేక్షింప రాదు. సేవచేయునాతడు సేవ నందుకొను వారి యొద్ద నుండి యెట్టి ప్రతిఫలమును కోరకూడదు. ఇట్టి చిత్తముతో చేయు సేవయే నిజముగ నిస్సంగకర్మానుష్ఠాన మనిపించుకొనును. దీనికే కర్మయోగ మని పేరు. భగవత్సాక్షాత్కారము నొందుటకు ఇదియును ఒక మార్గమే. కాని ఇది మిక్కిలి గహన మైనది, కలియుగమునకు తగనే తగదు.

కాబట్టియే దయ నలవఱచుకొనుట దానధర్మములు చేయుట మొదలగు పనులను సంగరహితుడై చేయు నాతడు సొంతమునకే లాభము పొందుచున్నా డంటిని. ఒరులకు తోడ్పడుట మేలు చేయుట —— అను పనులు దేవునివే కాని వే ఱెవరివియు కావు. మానవులకై చంద్రసూర్యులను తల్లిదండ్రులను ఫలపుష్పములను ధాన్యమును సృజించినవాడు దేవుడే కదా. తల్లిదండ్రులలో నీకు అగపడు ప్రేమ దేవునిదే. తనసృష్టిని రక్షించుకొనుటకై దేవుడే వారికి ఆ ప్రేమను ప్రసాదించినాడు. దయావంతులలో నీకు అగపడు దయ దేవునిదే. దీనసంరక్షణకై దేవుడే ఆ దయను వారి కొసంగినాడు. నీలో ఈవి ఉండనీ లేక పోనీ, దేవుడు తన పనిని ఎట్లో ఒకట్లు నిర్వర్తించు కొనును. ఆయన చేతికి అడ్డము లేదు.

కావున, ఇక మానవుడు ఏమి చేయవలెను? చేయుటకు వేఱు ఏ మున్నది? దేవుని శరణుచొర వలెను. సాక్షాత్కారము ప్రసాదింపు మని ఆర్తముతో దేవుని ప్రార్థింప వలెను.

(బంకిముతో): గ్రంథాలను శాస్త్రాలను చదువని వారికి భగవత్సాక్షాత్కారము సాధ్యము కాదని కొందఱ యభిప్రాయము. ఈ ప్రపంచమును ఇందలి జీవులను గూర్చిన జ్ఞానమును మొదట సంపాదింపవలె నట. విజ్ఞానము (సైన్సు)ను మొదట అధికరింపవలె నట. సృష్టిని ముందుగా ఆకళించుకోని వాడు సృష్టికర్తను సాక్షాత్కరించుకో లేడట. మొదటి దేది? విజ్ఞానమా దైవమా? నీ యభిప్రాయ మేమి?

బంకిమ్:—లోకములోని వివిధవిషయాలను మనము ముందుగా తెలిసికోవలె ననుటే నా అభిప్రాయము కూడ. లోకమునుగూర్చి కొంచె మేని తెలిసికొనక దేవునిగుఱించి ఎట్లు తెలిసికో గలము? కావున గ్రంథపాండిత్యము మనకు ప్రథమావశ్యకము.

గురుదేవుడు:—మీరు అందఱును పెట్టు గోల అదొక్కటే. కాని సృష్టికర్తృస్థానము మొదటిది, సృష్టిస్థానము తదనంతరముది. దేవు నెఱుంగుదు వేని సమస్తము నెఱింగినవాడ వగుదువు. కాని అప్పుడు క్షుద్రవిషయముల తెలిసికొందమను శ్రద్ధ నీకు ఉండదు. వేదములును ఈ విషయమునే చెప్పుచున్నవి. వ్యక్తి పరోక్షమున ఉన్నంతవఱకును అతని సద్గుణములనుగూర్చి నీవు ప్రసంగించుచుందువు. ఆ వ్యక్తి నీ యెదుట అగపడిన తక్షణమే గుణప్రశంస ఆగిపోవును. ఆ వ్యక్తితో కలిసిఉన్న చాలును, ఆ వ్యక్తితో మాటాడిన జాలును, నీవు ఆనందపరవశుడ వగుదువు, స్వాధీనము తప్పుదువు. తద్గుణప్రశస్తి నిక చేయవు.

మొదట భగవంతుని గనుము, పిదప సృష్ట్యాది విషయాలను యోచింతువు గాని. ఒకటిని ఎఱుంగుదు వేని, అన్నిటిని ఎఱుంగుదువు. ఒకటి అను అంకెకు తర్వాత ఏబది సున్నలు పెట్టుదు వేని, ఒక పెద్దమొత్త మగును. కాని ఆ అంకెను ఒక్కటిని, కొట్టివేసితి వేని ఏమియును మిగులదు. ఒక్కటే పెక్కింటిని కల్గించును. మొదట ఒకటి, పిదప పెక్కు. మొదట దేవుడు, దేవునిసృష్టియు లోకమును తరువాతివి.

హృదయములో తహతహపడుచు దేవుని ప్రార్థింపుము. నీ ప్రార్థన హృదయపూర్వకమే ఐనచో, దేవుడు తప్పక అనుగ్రహించును. సాధువులను జూపి వారితోడి సాంగత్యమును నీకు ప్రసాదించినను ప్రసాదించును. జ్ఞానమార్గయాత్రలో తోడ్పడునది సాధు సాంగత్యము. దేనిని చేసిన భగవత్ప్రాప్తి కలుగునో దాని నొక సాధువు నీకు ఉపదేశించినను ఉపదేశింప వచ్చును.

గురూపదేశములందు విశ్వాసము తప్పక ఉండ వలెను. గురువు అనగా ఎవరు? సచ్చిదానందస్వరూపియే. దేవుడే గురువు. శిశువువలె గురువాక్యముల నమ్మెడు వేని దైవసాక్షాత్కారము నొందుదువు. లాభనష్టాలను లెక్కచూచుకొనుచు వాదములు సలుపుచు వంచించు చిత్తవృత్తిగల వాడు భగవంతుని సాక్షాత్కరించుకో లేడు. ఆస్థయు విశ్వాసమును ఉండ వలెను. వంచన పనికి రాదు. దేవుడు ఋజుమతులకు దాపునను వంచకులకు కడు దవ్వునను ఉండును.

తనకు కావలసిన వస్తువుకై శిశువు ఎంత ఉబలాటపడునో దేవునకై సాధకుడు అంత ఉబలాటపడవలెను. అమ్మ ఎడబాయునేని, శిశువునకు తికమక తప్ప వే రేమి గలుగును? ఆ బిడ్డ చేతిలో ఒకతియ్యనిమిఠాయి నుంచి ఊరడింత మని నీవు ప్రయత్నింపవచ్చును గాని, బిడ్డ మోసపోడు, 'వలదు, నేను అమ్మయొద్దకే పోవలెను' అనియే చెప్పును. దేవునకై పడవలసిన ఉబలాటము అట్టిది. ఆహా! ఏమి ఉబలాటము. తల్లికై బిడ్డ ఎంత క్షోభిల్లును! బిడ్డచే తల్లిని మఱపించునది ఏదియు లేదు. ఐహికసుఖానుభవము రుచింపనివాడు, సిరి కీర్తి జీవితసౌఖ్యాలు ఇంద్రియసుఖాలు మున్నగు ఐహిక విషయాలలో దేనిచేతను ఆనంద మొందని వాడు, నిజముగ లోకమాతను సాక్షాత్కరించుకో వలె నను వ్యసనమునకు లోనగును. తన తక్కిన పనుల నన్నిటిని మాని లోకమాత అట్టి భక్తునొద్దకే పరుగున వచ్చును.

ఆ ఉబలాటము ఉండినచో, ఉండవలసిన దంతయు ఉన్నట్లే. నీవు అనుసరించు మార్గము ఏదైన నగును గాక, నీవు హిందువ వైనను ముసల్మాను వైనను క్రైస్తవుడ వైనను శాక్తుడ వైనను వైష్ణవుడ వైనను, బ్రాహ్మసమాజమువాడ వైనను — ముఖ్యావశ్యక మేమో ఆ ఉబలాటము. దేవుడు మనకు అంతర్నియామకుడు. నీవు తప్పు దారిని బోవు చున్నను, ఫరవా లేదు, దేవునకై తహతహ మాత్రము ఉండి తీఱ వలెను. దేవుడే నిన్ను సరి యైన దారి లోనికి చేర్చును.

బ్రాహ్మసమాజీయు డైన త్రైలోక్యుడు పాట పాడ దొడంగెను. తత్‌క్షణమే శ్రీరామకృష్ణుడు లేచి నిలబడెను, ఆయనకు బాహ్యా లోకస్మృతి తప్పినది, ఆయన పూర్తిగ అంతర్ముఖు డయ్యెను, సమాధి నిమగ్ను డయ్యెను. భక్తులు ఆయనను పరివేష్టించి వలయాకారముగ నిలిచిరి. గుంపును త్రోసికొనుచు బంకిమ్ గురుదేవునియొద్దకు వచ్చి ఆయన తీరును ఎచ్చరికతో జూచుచుండెను. సమాధిస్థుని ఎవనినిగాని ఆయన ఇందనుక చూచి యెఱుగడు.

కొన్ని నిమిషము లైన పిదప శ్రీరామకృష్ణునకు స్మృతి ఇంచుక గలిగినది, కాని ఉద్రిక్తదశ దాటకుండగనే ఆయన నర్తింప మొదలిడెను. అవిస్మరణీయ మైన దృశ్య మది. బంకిమును ఇంగ్లీషువారుగనే తమా రైన అతని మిత్రులును, ఆశ్చర్యస్తబ్ధులై కనుచుండిరి. దైవోన్మాదదశ అనునది ఇదేనా? భక్తులుగూడ గురుదేవుని అచ్చెరువు పడు దృక్కులతో జూచుచుండిరి.

ఆటపాటలు ముగియగానే, గురుదేవుడు ఆసీను డయ్యెను. అందఱును ఆయనను జుట్టి కూర్చుండిరి.

బంకిమ్:—(గురుదేవునితో) స్వామీ, దివ్యప్రేమను వర్ధిల్ల జేసికొనుటకు దారి ఏది?

గురుదేవుడు:— ఉబలాటమే దారి. ఎట్టి ఉబలాట మనగా, తల్లికై బిడ్డ చెందు నుబలాటము వంటిది. అమ్మ దగ్గఱ లేకున్న,

బిడ్డకు దిక్కు తోపదు. అమ్మకై తహతహపడుచు బిడ్డ ఏడ్చును. అదే రీతి దేవునకై విలపింప గల మానవునకు దేవుని ప్రత్యక్ష దర్శనము సైతము లభించును.

వేగు ప్రొద్దు సమీపింపగనే తూర్పు దిఙ్ముఖము ఎఱ్ఱ నగును. ఆ ఎఱ్ఱవెలుతురు, కలుగ నున్న సూర్యోదయమును దెలుపును. అట్లే మానవునిలో దేవునకై ఆత్రము అగపడు నేని, అచిర కాలము వనే అతనికి భగవద్దర్శనము గలుగు నని దృఢముగ విశ్వసింప వచ్చును.

(బంకిముతో) నీ కొక సంగతిని జెప్పుచున్నాను. పైపైని తేలుచుండుటచే నీవు ఏమి సంపాదించుకో గలవు? నీటిలో లోతునకు బొమ్ము. రత్నాలు లోతులో ఉండగా నీవు నీ కాలుసేతులను పైపైని త్రిప్పిన లాభ మే మున్నది? మంచిరత్నము బరువుగ నుండును. అది నీటిపై తేలదు, అడుగునకు దిగి పోవును. మంచి రత్నమును పొంద వలె నన్న నీవు లోతునకు దిగ వలెను.

బంకిము:—స్వామి, మేము ఏమి చేయ గలము? బండకు కట్టు వడి ఉన్నాము. ఆ కట్టు మమ్ము లోనికి దిగ నీయక అడ్డుచుండును. (అందఱును నవ్వుదురు).

గురుదేవుడు:—దేవుని స్మరించిన, అన్ని పాపములును మాయమగును. భగవన్నామము మృత్యు శృంఖలములను ద్రెంచును. నీవును లోనికి దిగవలసినదే. దిగ కున్న రత్నలాభము నొందలేవు.

బంకిము గురుదేవు నెదుట సాష్టాంగముగ ప్రణమిల్లెను, వీడ్కొనుటకు సంసిద్ధు డయ్యెను.

బంకిము:—నేను అవివేకిని అని మీరు అనుకోవచ్చును గాని నేను అంతటి అవివేకిని కాను. నా వేడికోలు ఒకటి ఉన్నది. దయచేసి తమ పాదరజమును సోకించి నా గేహమును వెలుగొందింపుడు.

గురుదేవుడు:—బాగున్నది మీ పిలుపు, దేవుడు సంకల్పించినచో నేను మీయింటికి వత్తును.

బంకిము వీడ్కొనెను గాని పరధ్యానమున నుండెను. తన శాలువను గదిలో పడవేసి మఱచి వాకిలివఱకు పోయెను. ఇంతలో జ్ఞప్తి గలిగెను. కాని తన కేమో పైచొక్కా లేనందున, మఱి యొకరు ఎవరో ఆ శాలువను తెచ్చి ఆయన కిచ్చినారు.

గురుదేవునకును భక్తులకును ఆధారుడు విందు చేసెను. సాయంకాలము చాల ప్రొద్దు పోయినది. అప్పటికి భక్తులు గృహములకు మరలిరి. ఉద్రిక్తజ్ఞానదశలో నున్న గురుదేవుని మూర్తి ఇంకను వారిహృదయములలో హత్తుకొని యుండ, వివేకసంభృతము లైన ఆయన సూక్తులను వారు స్మరించుచుండిరి.

శ్రీరామకృష్ణుని తన గృహమునకు రమ్మని బంకిము ప్రార్థించి యుండెను గదా. కొన్నాళ్ల పిదప గురుదేవుడు గిరీశమహేంద్రులను కలకత్తాలోని బంకిముగృహమున కంపెను. గురుదేవునిగూర్చి యిద్దఱు భక్తులతోను బంకిము చాల సేపు సంభాషించెను. మఱి యొక మారు శ్రీరామకృష్ణుని చూడ వలె నని ఉన్నది అన్నాడు కాని, ఆ కోరిక ఆయనకు నెఱవేఱ లేదు.



## తొమ్మిదవ ప్రకరణము

# అంతరంగ శిష్యులు కొందఱు

1885-వ సంవత్సరము మార్చి తే 11 ది బుధవారము.

నాటికి బడిగంట లయిపోయినవి. మహేంద్రుడు బలరాము నింటికి పోయెను. అచట కూటములో గురుదేవుడు కూర్చుండి యుండెను. భక్తులును శిష్యులును ఆయనను పరివేష్టించి యుండిరి. గురుదేవుని మోమున తీయని చిఱునవ్వు వెలుగొందుచుండెను. అదే చిఱునవ్వు గదిలో నున్న వారి వికసిత ముఖములందును ప్రతిఫలించు చుండెను. గురుదేవుని ప్రక్కనే మహేంద్రునకు ఆసన మిడిరి.

గురుదేవుడు:— (గిరీశునితో) ఈ విషయమును గూర్చిన నీ వాదమును నరేంద్రున కెఱిగించి అత డే మనునో చూడుము.

గిరీశుడు:— దేవుడు అపరిచ్ఛిన్నుడట. మనము చూచు చున్న వస్తువులు గాని వ్యక్తులు గాని భగవదంశము లని చెప్పుట సైతము పొసగదట. ఏది అపరిచ్ఛిన్నమో దానికి అవయవము లెట్లుండును? ఉండనేఱవు — ఇది నరేంద్రుని వాదము.

గురుదేవుడు:—దేవుడు అపరిచ్ఛిన్నుడే కావచ్చును. ఆయన మహిమ ఎంతటిదైన కావచ్చును. కాని ఆయన సంకల్పముచేతనే ఆయనలోని సారమైన యంశము మానవుని ద్వారా ఆవిష్కార మొందుటకు అవకాశ ముండుటే కాదు; అది ఆవిష్కృతమగుచునే ఉండును. మానవరూపమున భగవదవతారమును వివరింపవలెనన్న, ఉపమానమును జూపి వివరింప లేము. సాక్షాత్కారముఖముననే దాని సత్యమును తెలిసికోవలెను. అది అనుభవ సాక్షికమైన సత్యము. ఉపమానము తత్త్వమును కొంచెముగనే చూప

గలదు. ఆవుకొమ్ములను గాని, కాళ్ళను గాని, తోకను గాని తాకి నను మనము ఆవును తాకిన వారమే అగుదుము. కాని ఆవునకు సంబంధించిన వస్తువులలో దాని పొదుగునుండి స్రవించు పాలే మనకు సర్వప్రధానము. భగవదవతారము ఆవుపొదుగువంటిది. ప్రజలకు భక్తిని, దివ్యప్రేమను కఱపుటకై భగవంతుడు యుగయుగమునను మానవరూపమున అవతరించుచుండును.

గిరీశుడు:—'భగవంతుడు అపరిచ్ఛిన్నుడు కావున ఆయనను సమగ్రముగ నెఱుంగుట ఎన్నటికైనను సాధ్య మగునా?' అని నరేంద్రుని సవాలు.

గురుదేవుడు :—(గిరీశునితో) దేవుని గుఱించిన ప్రతివిషయ మును ఎవని కర్థ మగును? భగవంతుని వైఖరులలో చిన్నదానినిగాని పెద్దదానిని గాని మానవుడు ఆకళించుకో లేడు. దేవునిగూర్చిన ప్రతి విషయమును తెలిసికో వలసిన అక్కఱ ఏ మున్నది? ఆయనను సాక్షాత్కరించుకొన్న చాలును. అవతారమూర్తిని చూచిన, దేవుని చూచినట్లే. ఒకడు గంగానదియొద్దకు బోయి దాని నీటిని స్పృశించె ననుకొనుము. స్పృశించి, అతడు "ఔను, నేను గంగను చూచితిని, తాకితిని" అనును. గంగను తాకితి నని చెప్పువాడు హరిద్వారము నుండి గంగాసాగరమువఱకు నుండు నది పొడవునను దానిని తాక నక్కఱ లేదు. (నవ్వు).

నేను నీ పాదములను తాకితి నేని నిజముగ నిన్ను తాకినట్లే గద! (నవ్వు). మహాసముద్రమునొద్దకు బోయి దాని నీటిని ఇంచుక తాకిన వాడును, నిజముగ మహాసముద్రమును తాకిన వాడే. పంచ భూతములలో నొక టైన యగ్ని ప్రతిపదార్థములోను ఉన్నను కొయ్యలో దాని సాన్నిధ్యము విశేషము.

గిరీశుడు:—(చిఱునవ్వుతో) నాకు కావలసినది నిప్పు. అది దొరకు చోటికి పోవలె నని నా ఆశ. సహజమే గదా!

గురుదేవుడు:— (చిఱునవ్వుతో) ఔను. పంచ భూతములలో నొకటైన యగ్ని తక్కిన వస్తువులలో నున్నంత కంటె నెక్కువగా కొయ్యలో సన్నద్ధమై యుండును. దేవుని వెదకకోరుదు వేని మానవునిలో వెదకుము. తక్కిన రూపములలో చూపుకొన్నంతకంటె నెక్కువగా దేవుడు తన్ను మానవరూపములో చూపుకొనును. ఏ మానవునిలో ఉద్రిక్తమైన ప్రేమ, పొంగి పొరలు ప్రేమ, దైవోన్మాదము, పారవశ్యము నాపాదించు భగవత్ప్రేమ కలవో ఆ మానవుని రూపమున నిజముగ దేవుడే అవతరించె నని తెలిసికొనుము.

(మహేంద్రునితో) *అన్ని వస్తువులలోను దేవు డున్నా డనుటకు సందేహము లేదు. కాని ఆయన శక్తి వివిధవస్తువులలో వివిధ రీతుల ప్రకటమగుచుండును. అవతారరూపమున ప్రకట మైనంతగా వేఱు ఏ రూపమునను ప్రకటము గాదు. అంతే గాదు. కొన్ని యవతారములలో దేవునిశక్తి పరిపూర్ణముగ ప్రకట మగును.

గిరీశుడు:—దేవుడు మన మాటలకును మనసులకును అందడట, నరేంద్రుడు చెప్పుచుండును.

గురుదేవుడు:—అది పూర్తి సత్యము కాదు. సామాన్య చిత్తమునకు దేవు నెఱుంగుట అశక్యమే కాని, పవిత్రచిత్తమునకు దేవు నెఱుంగ గల శక్తి నిజముగ నున్నది. కామినీకాంచనసంగము తొలగిన తత్క్షణమే, మనసునకును బుద్ధికిని పవిత్రత కలుగును. పవిత్ర మైన మనస్సు, పవిత్ర మైన బుద్ధి — ఈ రెండు నొక్కటే. పవిత్రచిత్తమునకు, దేవు నెఱుంగ నగును. ప్రాచీనమహర్షులును, ద్రష్టలును దేవుని చూచి యుండ లేదా? వారు తమలోని చైతన్యమును సాధనముగ గొని విశ్వవ్యాప్త మైన చైతన్యమును సాక్షాత్కరించుకొనిరి.

---

* 'ఇందుఁ గలఁ డందు లేఁ డని సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు' భాగ VII.

గిరీశుడు:— (చిఱునవ్వుతో) వాదములో నేను నరేంద్రు నోడించితిని.

గురుదేవుడు:—అట్లు కాదు. నరేంద్రుడు నాతో ఏ మన్నా డనగా "మానవరూపమున దేవు డవతరించు ననుటలో గిరీశఘోషు నకు గల నమ్మకము అతిమాత్రము. అతనితో నే నే మన గలను? అంతటి విశ్వాసమును చెనకుట మంచిది కాదు".

నరేంద్రుడు అత్యున్నత మైన యొక తరగతికి చెందిన బాలుడు. గాత్రము (వోకల్ మ్యూసిక్) లో, వాద్యసంగీతములో, చదువులో, వే యేల, ఒక్కొ-క్క-దానిలోను నరేంద్రుడు దీటు లేని దిట్ట. ఇంద్రియములా, అతనికి పరమ విధేయములు. అతడు సత్య పరుడు, వివేకి, విరక్తుడు. ఒక్క-వ్యక్తిలో ఎన్ని గొప్ప గుణములు! (మహేంద్రునితో) ఏ మందువు? అతని మేలిమి అసాధారణ మైనదే గదా?

మహేంద్రుడు:—అవును స్వామీ, అసాధారణ మైనదే.

గురుదేవుడు:—(మహేంద్రుని చెవిలో) ఇతడు (=గిరీశుడు)ను అతిమాత్ర మైన శ్రద్ధావిశ్వాసములు కల వాడే.

మహేంద్రుడు గిరీశుని వైపు జూచి ఉత్క-ట కోటిక మైన యతని విశ్వాసమునకు అబ్బురపడెను. గిరీశుడు శ్రీరామకృష్ణు నొద్దకు వచ్చుట కారంభించి కొన్నాళ్ళే అయినవి. అయినను గురు దేవుని యాధ్యాత్మికశక్తిని అత డిప్పటికే గుర్తించినాడు. అతనితో తనకు దృఢ మైన ఆధ్యాత్మికబంధ మున్నట్లును, అతడు తనకు మిత్రు డనియు బంధువనియు మహేంద్రునకు అనిపించెను. శ్రీరామకృష్ణ భక్తరత్నమాలలో గిరీశు డొక నాయకరత్నము.

క్రమక్రమముగ మునిమాపు వేళ అయినది. సందెచీకటి కలకత్తా నావరించెను. నగరమందలి కలకలము అప్పటికి తగ్గెను. గంటలును, శంఖములును హిందూగేహములలో పెక్కింట జరుగు

చుండిన సాయంపూజను తెలుపుచుండినవి. భగవద్భక్తులు తమ లౌకిక కృత్యముల నటుంచి మనస్సులను ధ్యానమునకును ప్రార్థనకును ఉన్ముఖములుగ చేసికొనిరి. ఇట్టి సందెవేళలును, ఇట్టి దట్టి దనరాని సందెవెలుంగును వచ్చినప్పు డెల్ల గురుదేవునకు పరవశదశ కలుగుచునే యుండును.

శ్రీరామకృష్ణుడు లోకమాతృ మధురనామములను కీర్తింప దొడగగనే గదిలో కూర్చున్న భక్తు లెల్లరును ఆయననే చూచుచుండిరి. నామ సంకీర్తన కనంతరము ఆయన ప్రార్థన నారంభించెను. దేవునితో నిత్యయోగము నొంది యుండు నాత్మకు ప్రార్థన ఎందులకు? మాటిమాటికిని దారి తప్పు మానవులకు ప్రార్థించు పద్ధతిని బోధింపవలె నని కాబోలు ఆయనకోరిక! లోకమాతతో ఆయన ఇట్లనెను. "అమ్మా, నీకృపయే నా కాధారము. పవిత్ర మైన నీ చరణయుగమే నాకు శరణము. శరీరభోగములు నా కక్కఱ లేదు. పేరు ప్రతిష్ఠలు నా కక్కఱ లేదు. అష్టసిద్ధు లెనను నా కక్కఱ లేదు. అనుగ్రహింపుము. నీయెడ నాకు పవిత్రప్రేమను ప్రసాదింపుము, ఎట్టిప్రేమ యనగా లోభకళంకితము కాని ప్రేమ, స్వార్థదూషితము కాని ప్రేమ, ఏ ప్రయోజనముకొఱకును కాక, ప్రేమకొఱకే భక్తు డాశించు ప్రేమ. తల్లీ, విశ్వమోహన మైన నీ మాయచే నేను వంచితుడను కాకుండు నట్లును కామినీకాంచనసక్తి గాని, ఐహికసంగము గాని నాకు లేకుండునట్లును వర మిమ్ము. కామినీకాంచనాదు లెల్ల దుర్జ్ఞేయ మైన నీ మాయ కావించు కల్పనలే కద! అమ్మా, నీవు తప్ప "నా" యనుకొన దగిన వారు నాకు మఱెవ్వరును లేరు. అమ్మా, పూజాపద్ధతులు నే నెఱుగను, నియమనిష్ఠ నాకు లేదు. భక్తియును లేదు. జ్ఞానమును లేదు. దయ జూడుము తల్లీ, నిరవధిక మైన నీ దయ చేతనే నీ చరణారవింద భక్తిని నాకు ప్రసాదింపుము."

ఈ ప్రార్థనలోని యొక్కొక్క మాటయు అతని యాత్మ యడుగుననుండి పలుకబడినదే. ఒక్కొక్కమాటయు భక్తుల మన

స్సులను ఉజ్జ్వలత లూపెను. అతని మధురకంఠమును ముఖమున తెలియు నగు శిశుసహజసారళ్యమును భక్తుల హృదయములను కరగించెను.

గిరీశుడు గురుదేవుని తన యింటికి విచ్చేయు మనియు, నాటి రాత్రికే రా వలసిన దనియు ప్రార్థించెను.

గురుదేవుడు:—చాల ఆలస్య మగు నేమో!

గిరీశుడు:—కాదు. తమకు తోచినప్పుడు మరలి రావచ్చును. నేను రాత్రి సభామందిరమునకు బోవలసి యున్నది. అచ్చట నొక జగడమును పరిష్కరింప వలసి యున్నది.

అప్పటికి రాత్రి తొమ్మిది గంట లయినవి. గురుదేవుడు గిరీశు నింటికి బయలుదేఱుటకు సిద్ధపడెను. ఆయనకు రాత్రిభోజనమును బలరాముడు సిద్ధపఱచియుండెను. "దయచేసి నీవుసిద్ధపఱచిన భోజన మును గిరీశునింటికి పంపుము. హాయిగా నేను అక్కడ భుజింతును" అని శ్రీరామకృష్ణుడు బలరామునితో ననెను. బలరామునకు అసం తృప్తి కలిగించుట ఆయన కిష్టము లేదు.

బలరామునింట మేడ రెండవ యంతస్తునుండి దిగి వచ్చు చున్నప్పుడు గురుదేవునకు దివ్యభావావేశము పైకొనెను. ఆయన పానమత్తునివలె కన్పించెను. నారాయణుడును మహేంద్రుడును ఆయన ప్రక్క నుండిరి. వారికి కొంత వెనుక వైపుగ, రామును, చునియు, ఇతరభక్తులు నుండిరి. మేడ దిగి క్రిందికి వచ్చెనో లేదో గురుదేవుని భావావేశము ఉత్కటమయ్యెను. ఆయన కాలి పట్టు సడలి పడి పోవు నేమో అని దిగులుపడి పట్టుకొనుటకై నారాయ ణుడు ముందునకు వచ్చెను. అందులకు గురుదేవుడు విసుగును వెలి బుచ్చెను. కొన్ని నిమిషములకు పిదప ఆయన ప్రేమతో నారాయ ణునితో "నీవు నన్ను పట్టుకొంటి వేని నేను త్రాగియున్నా నని ప్రజ లనుకొందు రేమో! నా యంతట నేనే నడచి వచ్చెదను"— అనెను.

గిరీశునిల్లు చాలదూర మయినది కాదు. "బోస్ పార" సందు నొద్ద వీధుల కూడలిని దాటినంతనే గురుదేవుడు తటాలున అతివేగ ముగ నడువ నారంభించెను. భక్తులు వెనుక చిక్కిపోయిరి. అప్పుడు నరేంద్రుడు కనబడెను. అతడు చాలదూరమునుండి వచ్చుచుండెను. ఇతర సమయములలో నరేంద్రుని తలచుకొన్నను నరేంద్రుని పేరు విన్నను నిరవధి కానందము నొందు గురుదేవుడు ఆ ప్రియ శిష్యునితో ఇప్పుడు ఒక్క పలుకైనను పలుక లేదు. గిరీశునిల్లు ఉన్న సందులో భక్తులతో ప్రవేశించుచుండగనే గురుదేవునకు మాటాడు శక్తి వచ్చినది.

నరేంద్రుని జూచి 'నాయనా, క్షేమమా, ఇంతకు ముందు నీతో మాటాడలే కుంటిని' అనెను. గురుదేవుడు పలికిన యొక్కొక్కమాటలోను నిరవధికమైన దయ నిండి యుండెను.

గురుదేవునకు స్వాగతము చెప్పుటకై గిరీశుడు వాకిటియొద్ద నిలబడి యుండెను. శ్రీరామకృష్ణుడు ఇంట ప్రవేశించినంతనే, గిరీశుడు ఆయన పాదములపై వ్రాలి, కొయ్యవలె నేలపై పడియే యుండెను. లెమ్మని గురుదేవు డానతీయగనే, తన నొసటితో ఆయన పాదములను దాకి, గిరీశుడు లేచెను. కూటము, మేడ రెండవ యంతస్తున ఉన్నది. శ్రీరామకృష్ణుని అచటికి పిలుచుకొని పోయిరి. భక్తులును ఆయన వెంబడినే పోయి కూర్చుండిరి. ఆయనను దర్శింప వలె ననియు ఆయన పెదవులనుండి వెలువడు నొక్కొక్కమాటను విన వలె ననియు వారి యుబలాటము.

తనకై నిర్దిష్టమైన పీఠముపై కూర్చుండ బోవు గురుదేవునకు, దాని సమీపమున పడియుండు నొక వార్తాపత్రిక కంటబడినది. దానిని పాఱవేయు మని ఆయన అట నున్న యొకరికి సైగ చేసెను. వార్తాపత్రికలో లౌకికవిషయాలు రిత్తముచ్చటలు దూషణలు ఉండును గాన అది అపవిత్ర మని ఆయన తలంపు. ఆవార్తాపత్రికను అచటివారు పాఱవేసిన పిమ్మటనే ఆయన పీఠ మలంకరించెను.

ఆయనభక్తులలో నరేంద్రుడు, గిరీశుడు, రాము, హరిపాదుడు, చుని, బలరాము, మహేంద్రుడు మున్నగు పెక్కండ్రు గదిలో నుండిరి. దేవుడు మానవరూపమున అవతరించుట సుసంభవమే అను విశ్వాసము నరేంద్రునకు లేదు. కాని గిరీశుని యభిప్రాయము వేఱు. సర్వశక్తుడైన స్వామి మజ్ఞేయమైన తన శక్తిచేత, మానవరూపమును దాల్చి, ఏదే నొక దివ్యప్రయోజనసాధనకై, యుగయుగమునను భువి నవతరించుచుండు నను తీవ్రమైన నమ్మకము అతని కుండెను.

గురుదేవుడు గిరీశునితో 'నీవును నరేంద్రుడును ఆంగ్లమున వాదించుకొనుచుండ విన వలె నని నా యిష్టము' అనెను.

చర్చ ప్రారంభమైనది. కాని వారు బెంగాలిభాషలోనే మాటాడిరి. నరేంద్రుడు 'భగవంతుడు అంతము లేని వాడు. ఆయనను మనము ఎట్లు అర్థముచేసికొ గలము? ఆయన ప్రతిమానవునిలోను ఉన్నాడు. ఆయన తన్ను చూపుకొనునది ఏదే నొక్క వ్యక్తిమూలముగ మాత్రమే కాదు'' అనెను.

గురుదేవుడు:—(మృదువుగా) నేను నరేంద్రునితో పూర్తిగ ఏకీభవింతును. దేవుడు సర్వత్ర ఉన్నాడు. కాని పదార్థములు, వివిధములు, వానిగుండ దేవుని శక్తి ప్రకటమగుటలోను నానావిధములు ఉన్నవి. కొన్నిచోట్ల దేవుని అజ్ఞానశక్తి ఆవిష్కృత మగును, మఱికొన్నిచోట్ల ఆయన జ్ఞానశక్తి రూపుదాల్చును. సాధనములు వివిధములు. భగవచ్ఛక్తి వానిగుండ రూపొందుటలోను రకరకాల మెట్లు ఉన్నవి. పెద్దవి ఉన్నవి, చిన్నవి ఉన్నవి. కావుననే మానవులు అందఱును సమానులు కారు.

రాము:—ఈ వ్యర్థ వాదాల వలన లాభ మేమి?

గురుదేవుడు:—[చుఱుకుగా] కాదు. కాదు. ఈ యన్నింటిలోను అర్థ మున్నది.

గిరీశుడు:—[నరేంద్రునితో] దేవుడు మానవరూపమును గొనడని నీ కెట్లు తెలియును?

నరేంద్రుడు:—దేవుడు మాటలకును మనసులకును అందడు.

గురుదేవుడు:—కాదు. అది నిజము కాదు. పవిత్రబుద్ధికి దేవు నెఱుంగుట శక్యమే. పవిత్రబుద్ధి యనగా పవిత్రాత్మ. ప్రాచీన ద్రష్టలు తమ పవిత్రబుద్ధితో పవిత్రాత్మను సాక్షాత్కరించుకొనిరి.

గిరీశుడు:—[నరేంద్రునితో] ఆధ్యాత్మికరహస్యాలను మానవులకు మానవరూపియై దేవుడు బోధింప కున్న వేఱు ఎవరు బోధింతురు? మానవులకు దివ్యజ్ఞానమును దివ్యప్రేమను గలిగించుటకై దేవుడు మానవరూపము దాల్చును. లేకున్న వేఱు ఎవరు బోధింతురు.

నరేంద్రుడు:—మానవరూపధారణము ఎందులకు? దేవుడు మనహృదయాలలో ఉన్నాడు. హృదయాలలో నుండియే నిజముగ ఆయన మనకు బోధించును.

గురుదేవుడు:—(మృదువుగా) ఔ నౌను, మనకు అంతర్నియంతయై ఆయన బోధించును.

క్రమక్రమముగ గిరీశనరేంద్రులు తీవ్రవాదములోనికి దిగిరి. దేవుడు అపరిచ్ఛిన్నుడు. ఆయనలో భాగములు ఎట్లుండును? హామిల్టను ఏమి చెప్పి యున్నాడు? హెర్బర్టుస్పెన్సరు, టిండల్, హక్స్లి అను వారి యభిప్రాయము లేమి? ఇవియు ఇట్టివియు విషయములు ప్రస్తావితము లైనవి.

గురుదేవుడు:—(మహేంద్రునితో) ఈచర్చలలో నాకు ఆహ్లాదము లేదు. అసలు వాదింప వలసిన అక్కఱ నాకు ఏ మున్నది. సమస్తమును దేవుడే అనుట నాకు స్పష్టముగ అగపడుచున్నది. సమస్తముగా పరిణమించినవాడు దేవుడే. ఏ దేది ఉన్నదో అ దెల్ల దేవుడే అనియు, ఆయన అన్నిటికిని అతీతు డనియు నాకు ప్రత్యక్షముగ తెలిసినది. నామనోబుద్ధులు ఆ యవిభాజ్యతత్త్వములో లయించినవి. అది యిప్పటి నాదశ.

కాని తనలో ఉన్న చైతన్యమును మేలుకొలుపుకొనకయే, విశ్వవ్యాప్తమైన చైతన్యమును సాక్షాత్కరించుకొనుట ఎవరికిని సాధ్యము కాదు. మానవుని తర్కము ఎంత సేపు? దైవసాక్షాత్కారము కలుగకుండువఱకే. కాని వట్టి మాటలు పనికి రావు. ఈ సమస్తముగ రూపొందినవాడు దేవుడే అనుట నావఱకు నాకు స్పష్టముగ అగపడుచున్నది. భగవంతుని కృపచేత మనలోని చైతన్యమును ప్రబోధించుకొవలెను. ఆ ప్రబోధముచే మానవుడు సమాధి దశ నొందును. తన కొక దేహ మున్నదను విషయమును సైతము అతడు తలచు మఱచుచుండును. భగవద్విషయము తప్ప తక్కిన యే చర్చయును అతనికి ఇచ్చగింపదు. లౌకికవార్తలు అతనికి బాధ కలిగించును. తనలోని చైతన్యము ప్రబోధ మొందుటచే, సాధకుడు విశ్వవ్యాప్తమై యున్న చైతన్యమును సాక్షాత్కరించుకొనును.

చర్చ ముగిసినది. శ్రీ రామకృష్ణుడు మహేంద్రునితో ఇట్లనెను—తర్కముచే మానవునకు గలుగు భగవద్విషయజ్ఞానము ఒక రీతిది. ధ్యానముచే గలుగునది వేఱొక రీతిది. స్వయముగ దేవుడే తన్ను తన భక్తునకు చూపుకొన్నప్పుడు ఆ భక్తునకు గలుగు భగవద్విషయజ్ఞానము మూడవ రీతిది. దివ్యావతారస్వరూపమును, మానవరూపమున దేవుడు సలుపు లీలను, దేవుడే భక్తునకు ప్రకటించు నేని ఇక నా భక్తునకు ఇందుంగూర్చిన తర్క మక్కఱ లేదు. వివరణమక్కఱలేదు. అ దెట్టిదో నీ వెఱుగుదువా? ఒక మానవుడు చీకటిగదిలో నున్నాడనుకొనుము. అగ్గిపుల్లను అగ్గిపెట్టెపై రాయుచునే యుండగా తటాలున వెలుతురు వచ్చును. అట్లే దేవుడు దయతో దివ్యజ్యోతిని మనకు తళుక్కు మనిపించునేని మనసందేహము లన్నియు నశించును. వట్టి తర్కముచే నొకడు దేవు నెప్పుడైన నెఱుంగ గలడా?

శ్రీరామకృష్ణుడు నరేంద్రుని తన ప్రక్కన కూర్చుండుమనెను. దయతో అతని ఆరోగ్య మెట్లున్నదో అడిగి మిక్కుటమైన ప్రేమను చూపెను.

నరేంద్రుడు:—(గురుదేవునితో) మఱి నేను మూడు నాలుగు దినములు కాళిని ధ్యానించితిని. కాని ఏమియు ఫలింప లేదు.

గురుదేవుడు:— అంతయు ఫలించు కాలము వచ్చును, నాయనా. కాళి యనగా బ్రహ్మమే కాని వేఱు కాదు. ఏది బ్రహ్మ మన బరగుచున్నదో నిక్కముగ అదే కాళియు. ఆమె ఆదిశక్తి. ఆ శక్తి నిర్వ్యాపారముగ నున్నపుడు దానినే నేను బ్రహ్మ మని పేర్కొందును. సృష్టిస్థితిసంహారవ్యాపారములను నిర్వర్తించునపుడు దానినే శక్తి అని గాని కాళి యని గాని పేర్కొందును. దేనిని మీరు బ్రహ్మ మందురో దానినే నేను కాళి యందును.

అప్పటికి రాత్రి చాల ప్రొద్దు పోయినది. గిరీశుడు సభాభవనమునకు పోవలసియున్నందున హరిపాదుని ఒక బండిని పిలువుమనెను.

గిరీశుడు:— మి మ్మిచ్చట విడిచి నేను సభామందిరమునకు పోవలసివచ్చెనే!

గురుదేవుడు:—కాదు కాదు. నీవు దీనిని విడువను రాదు, దానిని వదలుకోను కూడదు.

గిరీశుడు:—సభామందిరమును వయసువారికి ఎవరి కైన అప్పగింత మని నే ననుకొనుచుంటిని.

గురుదేవుడు:—వలదు వలదు. అంతయు సరిగనే యున్నది. నీ వెందఱకో ఉపకారము చేయుచున్నావు.

నరేంద్రుడు:— "క్షణకాలమునకు మునుపు ఇతడు (=గిరీశుడు) ఆయనను (=శ్రీరామకృష్ణుని) దేవు డనియు అవతారమూర్తి యనియు అనుచుండెను. ఇతని మోజు ఇప్పుడు సభాభవనమువంకకు మరలినది" అని మహేంద్రునిచెవిలో గుసగుస మనెను.

నరేంద్రుడు గురుదేవుని ప్రక్కన కూర్చుండియుండెను. గురుదేవుడు త దేక దృష్టితో ఆ ప్రియశిష్యుని వంక చూచి తటాలున అతనిని మఱింతగా సమీపించెను. దేవుడు మానవరూపమును దాల్చు

నను విశ్వాసము నరేంద్రునకు లేదు. కాని దానివలన నేమి? శ్రీ రామకృష్ణున కేమో తనశిష్యునిపై ప్రేమ ఇంతింతగా పెరిగి హృదయమునిండి తొనకుచుండెను. ఆయన నరేంద్రునితో నిట్లనెను. "మానవుడు వాదించుచున్నంతసేపును భగవత్సాక్షాత్కారము అతనికి కలుగలే దనియే. మీ రిరువురును వాదించుకొనుచుంటిరి. నా కది ఇష్టపడలేదు.

దేవునకు నీవు చేరువ కొలదియు తర్కములును వాదములును సన్నగిల్లును. భగవత్ప్రాప్తి కల్గిన తత్ క్షణమే తర్కములు వాదములు కోలాహలము లన్నియు ముగిసి పోవును. నీకు సమాధిదశ కలుగును. మౌనమున దేవునితోడి యోగము సిద్ధించును.

గురుదేవుడు నరేంద్రుని దేహమును మెల్లగా నిమిరి, 'హరిః ఓమ్, హరిఃఓమ్, హరిఃఓమ్' అను మంత్రాక్షరములను మధురముగ అనుసంధించుచు, అతని గడ్డము పుడికెను. ఆయనకు బాహ్యలోక స్మృతి త్వరత్వరగా తొలగుచుండెను. ఆయన చేయి నరేంద్రుని పాదముపై నుండెను. ఆ దశలోనే ఉండి ఆయన నరేంద్రుని మేనిని మెల్లగ దడవుచుండెను. నిదానముగా ఆయన మనసు ఒకవిధముగ మాఱెను. చేతులు జోడించుకొని ఆయన 'దయచేసి ఒకపాట పాడుము, అప్పుడు నా దశ బాగౌను. లేకున్న నేను నాపాదములపై ఎట్లు నిలుచుండగలను?'' అని నరేంద్రునితో ననెను.

గురుదేవున కంత బాహ్యలోకవిస్మృతి పూర్తిగా గలిగెను. గదిలో ఉన్నట్టి యెవరిని గాని, తన ప్రక్కనే కూర్చున్న ప్రియ నరేంద్రుని సైతము, ఆయన చూచుట లేదు. తా నెక్కడ కూర్చున్నదియు గూడ ఆయన ఎఱుగడు, పూర్తిగా దేవునిలో నిమగ్నుడై యుండెను, తటాలున లేచి నిలువబడి "దివ్యప్రేమమద్యమును గ్రోలుటచే గలిగిన గాఢోన్మాదము'' అని అఱచెను. మరల కూర్చుండుచు "ఒక వెలుగు నా కగపడుచున్నది. అది ఎచ్చటినుండి వచ్చుచున్నదో నే నెఱుగను'' అని గొణిగెను.

అప్పుడు నరేంద్రుడు ఇట్లు పాడెను—

నీ మోము నిటు చూపి నా మనో వ్యథను
బూర్తిగాఁ బోకార్చి ప్రోచితి దేవ,
ఇంద్రజాలమొ నాఁగ నించు నీ సౌరు
మంత్రమై కాదె నా మదిని హరించె.
అంతమే లేని దుఃఖాబ్ధి నున్నట్టి
భువనంబు లేదు నీ బొడగాంచి వెతను
మఱచెడి ననఁగ, నే మఱచుట యరుదె ?
అగతికుఁడం జూవె, యల్పుఁడం జూవె ॥

పాటను వినుచున్న శ్రీరామకృష్ణునకు గాఢసమాధిదశ గలిగెను. ఆయన కన్నులు మూతవడినవి, మేను కుట్టిపెట్టినట్లు కదల కుండెను.

ఆ యుద్రిక్త దశ నుండి దిగుచు, ఆయన తన చుట్టుం జూచి "ఎవరు నన్ను గుడితోటకు చేర్తురు ?" అనెను, ఆయన అప్పుడు తన సైదోడు లేకపోగా తికమకపడు శిశువును బోలి యుండెను.

అప్పటికి సాయంకాలము చాల ప్రొద్దు పోయినది. నిశాంధకారము అలముకొని యుండినది. గురుదేవుని దక్షిణేశ్వరమునకు చేర్చుటకై తేబడిన బండికి ప్రక్కన భక్తులు నిలుచుండిరి. అప్పటికింకను గాఢోద్రిక్తదశలోనే యున్న గురుదేవుని, బండి నెక్కించుటకు వారు మెల్లగ తోడ్పడిరి. బండి వీధిలో కదలినది. వారు దాని వైపు ఆసాసగ చూచుచుండిరి.

వెంటనే భక్తులు ఇండ్లకు మరలిరి. మందమలయపవనము వారి మోములను ఆహ్లాదపఱచుచుండెను. కొందఱు—

నీ మోము నిటు చూపి నా మనోవ్యథను
బూర్తిగాఁ బోకార్చి ప్రోచితి దేవ

ఇంద్రజాలమొ నాఁగ నించు నీ సౌరు
మంత్రమై గాదె నా మదిని హరించె!

అనెడి పంక్తులను తమలో ఆలపించుచుండిరి.

1885-వ సంవత్సరము మే తే 9 ది శనివారము.

అప్పటికి మధ్యాహ్నము దాటినది. మూడుగంటల సమయము. శ్రీరామకృష్ణుడు బలరామునింటి కూటమున హాయిగ కూర్చుండి యుండెను. భక్తులు పెక్కండ్రు ఉండిరి. బలరాముడు మాత్రము లేడు. వాతావరణమున మార్పు కావలసి అతడు "మంఘీరు"నకు పోయియుండెను. అతని జ్యేష్ఠపుత్రి శ్రీరామకృష్ణుని, భక్తులను ఆహ్వానించి ఆయుత్సవమున నొక విందు చేసెను. భోజ నానంతరము శ్రీరామకృష్ణుడు విశ్రమించి యుండెను.

గురుదేవుడు "నేను ఉదారబుద్ధి కల వాడనేనా? చెప్పు"మని మహేంద్రుని మాటిమాటి కడుగుచుండెను.

భవనాథుడు:—(చిఱునవ్వుతో) అతని నెందుల కడిగెదరు? అతడు నోరెత్తడు.

ఒక భక్తుడు:—స్వామీ, ఎవనికైనను భగవదనుగ్రహము ఎట్లు కలుగును?

గురుదేవుడు:—దేవుడు శిశుస్వభావము గల వాడు. తన బట్ట కొసలో రత్నము లుంచుకొని ఒకశిశువు కూర్చున్నాడు. ఎందఱో అతని ప్రక్కనే వీధివెంబడిని పోవుచున్నారు. ఆ రత్నము లిమ్మని వారిలో పెక్కండ్రు ఆ శిశువును ప్రార్థింతురు. శిశువు రత్నములను తన చేతులతో కప్పిపెట్టి "ఏ రత్నమునుగాని నేనియ్యను" అనుచు పెడమొగము పెట్టును. తరువాత నొకడు ఆదారినే వచ్చును. రత్నముల నిమ్మని అతడు శిశువు నడుగడు గాని, శిశువే అతని వెంబడి పరతెంచి రత్నముల నిచ్చుచు కైకొమ్మని బ్రతిమాలును.

వైరాగ్యము లేకున్న భగవత్సాక్షాత్కారము సాధ్యము కాదు. నా మాటల నెవ రంగీకరింతురు? సానుభూతి గలిగి నా భావములను అర్థము చేసికొను సహచరునకై నేను వెదకుచుంటిని. ఏ గొప్ప భక్తుని చూచినను "మన లక్ష్యము నితడు సమ్మతించునేమో!" అని నే ననుకొందును కాని తరువాత చూచునప్పుడు అతని నడవడి వేఱు రీతి నుండును.

ఒకప్పుడు మధుర్ బాబు ఉద్రిక్తదశలో నుండెను. అతని నడవడి త్రాగుబోతునడవడివలె నుండెను. సొంత పనిని సైతము అతడు చూచుకో లేకుండెను. అప్పు డందఱును "ఈయన ఇట్లు నడచుకొను నేని జమీనును చూచుకొను వా రెవరు? నిజమునకు ఆ *పూజారియువకుడు ఏదో మంత్రము నితనిపై పాటించినాడు." అనిరి.

నరేంద్రుడు ఇచటికి రా నారంభించిన దినాలలో నొక నాడు నే నతని రొమ్మును తాకితిని. వెంటనే అతనికి స్మృతి తప్పిపోయినది. స్మృతి మరల కలుగగనే అతడు ఏడ్చుచు "అయ్యో! న న్నేందుల కట్లు చేసితిరి? నా కొక తండ్రి యున్నాడు. తల్లి యున్నది" అనెను. "నేను" – "నాది" అనెడి ఈ భావములకు అజ్ఞానమే ఆకరము.

నరేంద్రుడు:—దేవుడు మానవరూపమున నవతరించుచుండు ననుటకు ప్రమాణము లేనప్పుడు నే నెట్లు నమ్మ గలను?

గిరీశుడు:— నమ్మకమే చాలును. ఈ వస్తువులు ఇచ్చట నున్న వనుటకు ప్రమాణ మేమున్నది? నమ్మకమే ప్రమాణము.

ఒకభక్తుడు:—వెలుపటి ప్రపంచము మనకు వెలుపల నున్నదని తార్కికులు రుజువు చేయ గలిగిరా? కాని ఉన్న దనుటలో అనివార్యమైన నమ్మకము మన కున్న దని వా రందురు.

గిరీశుడు:—(నరేంద్రునితో) దేవుడే నీ ఎదుట అగపడినను నీవు నమ్మవు. "నేను దేవుడను. మానవరూపమున అవతరించితిని"

* శ్రీరామకృష్ణుడే.

అని దేవుడే చెప్పినను వంచకు డని అసత్యవాది అని దేవు నందు వేమో!

యోగిన్:—(చిఱునవ్వుతో) ఈయన (=గురుదేవుడు) నరేంద్రుని మాటలను ఇక నెప్పటికిని ఒప్పుకోడు.

గురుదేవుడు:—(చిఱునవ్వుతో) యదుమల్లిక్కు వనమందిరమున నరేంద్రుడు నాతో "మీరు చూచు భగవద్రూపములన్నియు మీ మనఃకల్పనలే" అన్నాడు. నేను ఆశ్చర్యపడి "ఆ మూర్తులు నాతో మాటాడుటకూడ కలదే" అంటిని, నరేంద్రుడు "అవు నవును. మీ రట్లే అనుకోవచ్చును" అన్నాడు. నేను గుడిలోనికి పోయి లోకజనని ఎదుట ఏడ్చితిని "అమ్మా, ఇదంతయు నేమి? అంతయు మిథ్యయేనా? నరేంద్రుడు ఏల ఆలాగు చెప్పగల్గినాడు?" అంటిని. తత్క్షణమే ఒక దివ్యదృశ్యమును చూచితిని. ఒక చైతన్యమును చూచితిని. ఆ చైతన్యము అవిభాజ్యము. ఆ చైతన్యము ఒకదివ్యవ్యక్తిగ రూపుగొనెను. ఆ వ్యక్తి నన్ను "నీ మాటలు అసత్యము లైనచో అనుభవములకు అవి ఎట్లు సరిపడును?" అని ప్రశ్నించెను. ఆ వెనుకనే నేను నరేంద్రునితో, "పోరా, మోసగాడా, నీవు నా మనస్సులో అవిశ్వాసమును గల్పించితివి. ఇక నెప్పుడును ఇచటికి రాకుము" అంటిని.

చర్చ సాగుచునే యుండెను. నరేంద్రుని వాదము ముగియలేదు. అప్పటి కతని వయస్సు ఇరువదిరెండు సంవత్సరములకంటె కొంచె మెక్కువ.

నరేంద్రుడు:—(గిరీశ – మహేంద్రాదులతో) శాస్త్ర వాక్యములను నే నెట్లు విశ్వసింతును? మహానిర్వాణతంత్రము "బ్రహ్మజ్ఞానమును సంపాదింపని నరునకు నరకప్రాప్తి కలుగు" నని యొకచోటను, "లోకమాతను పార్వతిని ఆరాధింప కున్న మోక్షము లేదు" అని యొకచోటను చెప్పుచున్నది. "మనుసంహిత"లో మనువు తన్ను గూర్చియే వ్రాసికొని యున్నాడు. "పెంటటూక్"లో

"మోసెస్సు" తన మరణమును వర్ణించుకొని యున్నాడు.

దేవు డున్నా డనుటకు రుజువు లేనందున దేవుడు లే డనియే సాంఖ్యశాస్త్రము చెప్పుచున్నది. అదే శాస్త్రము, వేదములు నిత్యము లనియు, ఎల్లరకు ప్రమాణము లనియు చెప్పుచున్నది.

ఇవి నిజములు కా వని నే ననను. అవి నా కర్థ మగుట లేదు. దయచేసి వానిని నాకు వివరించి చెప్పుడు. వ్యాఖ్యాతలు శాస్త్రములను ఇచ్ఛవచ్చినట్లు వ్యాఖ్యానించి యున్నారు. ఏ వ్యాఖ్యానమును మన మంగీకరింతము? తెల్లనివెలుగే ఎఱ్ఱవస్తువుగుండ ప్రసరించినప్పుడు ఎఱ్ఱగను, పచ్చవస్తువుగుండ ప్రసరించినప్పుడు పచ్చగను కనిపించును.

ఒక భక్తుడు:—స్వయముగ దేవుడే పలికిన పలుకులు భగవద్గీతలో నున్నవి.

గురుదేవుడు:—అవును. సర్వవేదముల సారమే భగవద్గీత. సన్న్యాసి తక్కిన గ్రంథములను తనయొద్ద నుంచుకొన్న నుంచుకో వచ్చును. లేకున్న మాన వచ్చును కాని చిన్నభగవద్గీత పుస్తకము మాత్రము సదా ఆయనయొద్ద నుండును.

ఒక భక్తుడు:—స్వయముగ కృష్ణుడే పలికిన పలుకులు భగవద్గీతలో నున్నవి.

నరేంద్రుడు:—సరే, కృష్ణుడే కానీ, మఱియొక ఎల్లన్న కానీ.

నరేంద్రుని మాటలు విని శ్రీరామకృష్ణుడు ఆశ్చర్యస్తబ్ధుడయ్యెను.

గురుదేవుడు:—ఈ చర్చ బాగున్నది. శాస్త్రములకు రెండు విధములైన వ్యాఖ్యానములు కలవు. ఒకటి శబ్దమును ప్రమాణీకరించునది. వేఱొకటి వాస్తవమును ప్రమాణీకరించునది. ఏది వాస్తవార్థమో ఏది దేవుని మాటలకు సరిపడునో, అదే అంగీకార్యము. జాబులోని మాటలకును జాబు వ్రాసిన వాడే స్వయముగ మాటాడినపుడు ఆ మాటలకును ఎంతో భేద మున్నది. శాస్త్ర

వాక్యములు జాబులలోని మాటలను బోలినవి. దేవుని మాటలు సమక్షమున చెప్పిన మాటలను బోలినవి. లోకమాత సమక్షమున చెప్పిన మాటలతో సంవదింపనిది ఏ దైనను సరే నే నంగీకరింపను.

సంభాషణలో దివ్యావతారముల ప్రసక్తి మరల వచ్చినది.

నరేంద్రుడు:— దేవునిలో నమ్మిక మున్న చాలును. ఆయన ఏమి చేయునో, దేనిని పట్టుకొని వ్రేలాడునో నా కక్కఱ లేదు. జగము అనంతము. అవతారములును అనంతములు.

"జగము అనంతము. అవతారములును అనంతములు" అను మాటలను విని శ్రీరామకృష్ణుడును చేతులు జోడించుకొని "ఆహా" అనెను.

మహేంద్రుడు భవనాథుని చెవిలో ఏమో గుసగుస మనెను.

భవనాథుడు:— ఏనుగును నేను చూచునంతవఱకు అది సూది రంధ్రములో పట్టునో పట్టదో నా కెట్లు తెలియును? దేవుని నే నెఱుగను. ఆయన మానవరూపమున అవతరించునో అవతరింపడో తర్క సాహాయ్యమున నే నెట్లు అర్థము చేసికొనగలను? — అనుచున్నాడు మహేంద్రుడు.

గురుదేవుడు:— దేవునకు సర్వమును సుసాధ్యమే. మంత్రశక్తి చేత వశపఱచుకొనువాడు ఆయనే. మంత్రవాది కత్తిని మ్రింగును. వెంటనే దానిని బయటికి తీయును. అతడు రాళ్ళను ఇటికలను గూడ మ్రింగును.

ఒకభక్తుడు:— ఐహికకర్తవ్యములను విడువ కూడదు. వానిని తప్పక నిర్వర్తింపవలె ననుట బ్రాహ్మసమాజమువారి మతము.

గిరీశుడు:— అవును. వారి పత్రిక యొకదానిలో అట్టి ప్రతిపాదనను నేను చదివి యున్నాను. దేవు నెఱుంగుటకు చేయవలసిన పనుల నన్నిటి నైనను మానవుడు చేసి ముగింప లేడు. లౌకికకర్తవ్యములను గూర్చి ప్రసంగించుచునే యున్నాడు.

శ్రీరామకృష్ణుం డించుక నవ్వి మహేంద్రుని చూచి గిరీశుడు చెప్పినది నిజమే యని కాబోలు సైగచే తెలిపినాడు.

కర్తవ్యమును నిర్వర్తించుట అనునది కరము దుష్కర మని మహేంద్రు డర్థము చేసికొనెను.

పూర్ణుడు వచ్చెను.

గురుదేవుడు:— మే మిక్కడ నున్నా మని నీ కెవరు చెప్పిరి?

పూర్ణుడు:— శారద.

గురుదేవుడు:— (భక్తమహిళలతో) "కొన్ని భక్ష్యములను అతని కిండు".

నరేంద్రుడు పాట పాడుటకు ఆయత్తపడుచుండెను. అతని పాటను విన వలె నని గురుదేవుడును భక్తులును ఆత్రపడుచుండిరి. నరేంద్రు డిట్లు పాడెను —

పచ్చిబయళ్ళ నంబరమును గిరుల
నిత్య జాగృతి నేలు నీ పిడ్గు చూవె!
శంకరా, ధర్మరక్షక, దేవదేవ,
కాలవిధ్వంసకా, ఖస్వరూప, భవ,
దురితంబు లెల్లను దొలఁగించి ముక్తి
యొసఁగి నన్ మనుపవే యో లోకనాథ!

నారాయణుడు ప్రార్థింపగా నరేంద్రుడు మరల నిట్లు పాడెను—

అమ్మ, రా, రావె, మా యమ్మ, వే రావె,
నా యాత్మ నేలెడి నా పైఁడి బొమ్మ,
నాహృదికి వికసనం బిడు తల్లి,
హృదయకమలపీఠి నిమ్ముగ నుండి
చూపవే నాకు నీ సుందర ముఖము.
నాతల్లి, నా పుట్టు నాటినుండియును

నా భరింపని యాతన లెవియు గలవె?
నీదర్శనంబెగా నిరవధి వ్యథల
నోర్పించె నాచేత నో యమ్మ చూవె!
అమ్మ, నాహృదయంపు టబ్జముం దెఱచి
అందులోనన్ గానవై ఏలు నన్ను.

శ్రీరామకృష్ణుడు సమాధిదశయం దుండెను, ఉత్తరాభిముఖుడై పాదములను ఊపుచు, గోడ కానుకొని యొక దిండుపై కూర్చుండి యుండెను. భక్తులు ఆయనను పరివేష్టించి కూర్చుండిరి. గురుదేవునకు క్రమక్రమముగ బాహ్యలోకస్మృతి గలిగినది.

అప్పటికి సాయంకాలము దాటి చాల ప్రొద్దు పోయినది. కూటములో దీపములు వెలుగుచుండినవి.

గురుదేవుడు:— (పరవశదశలో) ఇచట వే ఱు ఎవ్వరును లేనందున నీకు ఈ విషయమును చెప్పుచున్నాను. దేవుని దెలిసికొవలె నని మిక్కిలి హృదయపూర్వకముగ గోరు నతడు ఈశ్వర సాక్షాత్కారమును తప్పక కాంచును, కాంచి తీఱ వలెను. ఎవడు అనన్యభావముతో దేవుని గోరుచు దేవునకై ఉబలాటపడునో అతనికి భగవత్సాక్షాత్కారము తప్పదు.

1885 వ సంవత్సరము జూను తే 13 ది శనివారము.

మధ్యాహ్న భోజన మైనది. అనంతరము సుమారు మూడు గంట లప్పుడు శ్రీరామకృష్ణుడు తన గదిలో విశ్రమించి యుండెను. నేలపైని చాపమీద ఒక పండితుడు కూర్చుండి యుండెను. గది యుత్తరపు వాకిలి యొద్ద ఒక బ్రాహ్మణమహిళ నిలుచుకొని యుండెను. ఆమె కొక్కతే కూతురు. ఆ కూతురు ఇటీవలనే మరణించెను. కావున నామె దుఃఖనిమగ్నయై యుండెను. కిశోరి యును ఆ గదిలో నుండెను, మహేంద్రుడును వచ్చెను, గురుదేవునకు ప్రణమిల్లెను. మహేంద్రుని వెంబడి ద్విజుడు మున్నగు కొందఱు భక్తు లుండిరి.

శ్రీరామకృష్ణునకు ఆరోగ్యము బాగు లేదు. ఆయనకు గొంతులో మంట. దానిచే ఆయన బాధపడుచుండెను. అప్పుడు మండు టెండ కాలము. మహేంద్రునకును ఆరోగ్యము బాగు లేదు. ఇటీవల అతడు శ్రీరామకృష్ణు నొద్దకు తఱచుగ రా లే కుండెను.

గురుదేవుడు:— (మహేంద్రునితో) ఏలా గున్నది నీ ఆరోగ్యము? నిన్ను చూచిన నాకు సంతోషము. నీవు పంపిన మారేడు పండు చాల బా గున్నది.

మహేంద్రుడు:— స్వామీ, నా ఆరోగ్యము ఇప్పుడు రవంత మిన్నగా నున్నది.

గురుదేవుడు:— ఎండబెట్ట మిక్కుటముగ నున్నది, అప్పు డప్పుడు కొంచెముగ ఐసు(మంచుగడ్డ)ను పుచ్చుకొనుచుండుము. నాకును ఎండ దుస్సహముగనే ఉన్నది. కావున ఐసుక్రీము(మంచుగడ్డ హాల్వా)ను ఎక్కువగా తింటిని. అందుచేతనే గొంతులో నాకు ఈ మంట. చొంగనుండియు దుర్వాసన వెలువడుచున్నది.

నేను లోకమాతతో "అమ్మా, నాకు స్వస్థత కలిగింపుము. మంచుహాల్వాను ఇక మీద తినను" అని అంటిని. మంచుగడ్డను కూడ తిన నని పిమ్మట ఆమెతో చెప్పుకొంటిని. లోకమాతకు మాట ఇచ్చితిని కావున, నిజముగ నేను ఈ వస్తువులను ఇకమీద తినను. కాని ఒక్కొక్కసారి నాకు మఱపు గలుగుచుండును. ఆదివారము లందు చేపలను తిన నని యొకసారి మాట యిచ్చితిని కాని మఱచి పోయి ఒక యాదివారమునాడు చేపలను తింటిని. జ్ఞప్తి ఉన్నప్పుడు నేను మాట తప్పను.

"అమ్మసలహాను అడుగక దయ చేసి చేపలను తిన వలదు" అని మహేంద్రుడు వినయముతో ననెను. శ్రీరామకృష్ణుడు ఐసును తీసికొ లేదు. గురుదేవుడు దివ్యావతారాలను గూర్చి మాటాడ నారంభించెను.

గురుదేవుడు:—(మహేంద్రునితో) దేవుడు మానవరూపమున ఏల అవతరించునో నీకు తెలియునా? మానవరూపమున నున్ననే ఆయన మాటలు ఎవరికైనను విన నగును కావున, ఆ రూపముగుండ ఆయన క్రీడించును, మానవశరీరముగుండనే ఆయన దివ్యానందము నాస్వాదించును. తన తక్కిన భక్తులగుండ, దేవుడు తనలోని యొక చిన్నయంశమును మాత్రమే ప్రకటించును. ఎంతో పీల్చిన రవంత రసమును కార్చు నొక వస్తువు వంటి వాడు, ఎంతో పీల్చిన నొక చుక్క తేనెను చిందు పువ్వు వంటి వాడు — భక్తుడు. (మహేంద్రునితో) నేను చెప్పినది నీకు అర్థమైనదా?

మహేంద్రుడు:—స్వామీ, బాగుగ అర్థమైనది.

గురుదేవుడు:—సహజప్రవణతలు అనునవి కలవు. పూర్వ జన్మములలో పెక్కు సుకృతములు చేసిన మానవుడు తుదిజన్మలో అమాయికు డగును, ఇంచుమించు వెఱ్ఱివానివలె నడచుకొనును.

నిజము చెప్పుచున్నాను. సమస్తమును దేవుని సంకల్పాను సారమే ఘటిల్లును. ఆయన 'సరి' అను నేని, ఏదైనను నెఱవేఱును, ఆయన 'కూడదు' అను నేని, ఏదైనను ఆగి పోవును.

బ్రాహ్మణమహిళ ఇంకను ఉత్తరపువాకిలియొద్ద నిలబడియే యుండెను. ఆమె విధవ. ఆమె తన యేకైక పుత్త్రికను కలకత్తాలో భూస్వామి యొకని కిచ్చి వివాహము చేసెను. ఆ భూస్వామి 'రాజా' అను బిరుదు గలవాడు, గొప్ప జమీనుదారు; కూతురు తల్లిని జూడ వచ్చి నప్పు డెల్ల జమీనుబంట్లు తోడు వచ్చెడి వారు. వారు తమ దొర యిచ్చిన ఒకటే విధమైన యుడుపులను (=లివరి) ధరించి యుండెడి వారు. ఆ పరిభవము చూచి తల్లి డెందము గర్వముతో ఉప్పొంగెడిది. కొన్ని దినముల క్రిందనే ఆ కూతురు మరణించెను, తల్లి దుఃఖపరవశురాలై యుండెను. కొన్నాళ్లుగా ఆమె బాగ్బాజారులో ఉన్న తన యింటినుండి గురుదేవునొద్దకు వెఱ్ఱెత్తినదాని వలె, పరుగిడుచు వచ్చుచున్నది. తీఱని తన దుఃఖమునకు శ్రీరామ

కృష్ణుడు ఏ దైన ప్రతిక్రియను ఉపదేశించు నేమో అని ఆమె యుత్సుకత. శ్రీరామకృష్ణుడు మరల సంభాషింప నారంభించెను.

గురుదేవుడు:— (మహేంద్రునితో) దేవు డొక్కడే తథ్యమనుటయు, తక్కిన దెల్ల మిథ్య యనుటయు— ఇదే నిజము. మానవులు లోకము ఇల్లు బిడ్డలు — ఇ వన్నియు ఐంద్రజాలికుని యింద్రజాలము వంటివే. ఐంద్రజాలికుడు తన చేతి దండముతో తట్టి "రానీ మహామాయ, కలుగనీ సంక్షోభము" అనును. "కుండ మీది మూతను దీయుడు, మీ యెదుటనే అం దున్న పక్షులు మింటి కెగురును" అని ప్రేక్షకులతో చెప్పును. కాని ఐంద్రజాలికుడు మాత్రమే సత్యము. అతని యింద్రజాల మంతయు బూటకము. అది క్షణకాల ముండును, మఱుక్షణాన మాయ మగును.

దేవు డొక సముద్రమువంటివాడు, అందలి బుడగ లే ప్రాణులు. వారు అందే పొడమి, అందే అడగుదురు. ఒక పెద్దబుడగకు చుట్టు నున్న కొన్ని చిన్న బుడగల వంటి వారు బిడ్డలు.

దేవు డొక్కడే నిజము. దేవుని పైని ప్రేమను అలవఱచుకొన ప్రయత్నింపుము, దేవుని సాక్షాత్కరించుకొను నుపాయమును కనుగొనుము. ఏడ్చిన ఏమి లాభము?

అందఱును మౌనముగ గూర్చుండిరి. బ్రాహ్మణమహిళ "ఇంటికి పొమ్మందురా" అని అడిగెను. గురుదేవుడు దయతో "ఇప్పుడు పోవలెనా? ఎండ చాల ఎక్కువగ నున్నదే. ఇప్పుడు ఎందులకు? తర్వాత భక్తుల తోబాటు బండిలో పోవచ్చునే". అని ఆమెతో పలికెను.

తన బిడ్డలను వెంట నిడుకొని కాప్టను వచ్చెను.

ఆ బిడ్డలకు ఆలయములను చూపు మని శ్రీరామకృష్ణుడు కిశోరిని అంపెను. ఆయన కాప్టనుతో సంభాషింప నారంభించెను. శ్రీరామకృష్ణుడు ఉత్తరాభిముఖుడై చిన్న మంచముపై కూర్చుండి

యుండెను, ఆ మంచముపైనే తన కెదురుగ కాప్తనను కూర్చుండు మనెను.

ఒక భక్తుడు:—బంకిము శ్రీకృష్ణుని జీవితచరిత్రము నొక గ్రంథముగ వ్రాసినాడు.

గురుదేవుడు:—కామాదిమనోవికారములు తప్పక ఉండ వలె నని బంకిము చెప్పుచుండు నట.

ఒక భక్తుడు:—భౌతిక మానసి కాధ్యాత్మికము లగు మన వివిధ శక్తులను ప్రకటించుటే మతముల ప్రయోజన మని ఆయన తన పత్రికలో వ్రాసియున్నాడు.

కాప్తను:—అలాగా? కామాదు లేమో ఆవశ్యకములే అని ఆయన విశ్వాసము, మఱి మానవరూపమున అవతరించుట, బృందా వనములో రాధతోను గోపికలతోను విహరించుట, ఈ లీలల యానం దమును అనుభవించుట ఇవి శ్రీకృష్ణునకు సుసాధ్యములే అనుటను మాత్రము అతడు నమ్మ డట.

గురుదేవుడు:— ఈ విషయములు వార్తాపత్రికలలో లేవే, వీనిని అత డెట్లు నమ్మ గలడు?

'నిన్న నేను ఈ నగరాన ఒక వైపు పోవుచుంటిని. నాకంటి యెదుటనే ఒక యిల్లు పెళపెళమని పడి పోయినది' అని యొకడు తన మిత్రునితో చెప్పెను. ఆ మిత్రుడు "ఉండు ముందుము, ఆ సంగతి పత్రికలో ఉన్నదో లేదో జూడ నిమ్ము" అనెను. ఆ సంగతి పత్రి కలో లేదు. 'పత్రికలో లేదే' అని ఆ మిత్రుడు మొత్తుకొనెను. నాకంటితో నేను చూచితి నయ్యా అని ప్రథముడు చెప్పెను. చూచిన చూచియుందువు కాని, పత్రిక ఆ వార్తను ప్రకటింప నంత వఱకు నేను నమ్మలే నన్నాడు రెండవవాడు.

దేవుడు మానవరూపమున లీలలు చేయు నను నమ్మకము బంకిమున కెట్లు కలుగును? ఆయన నేర్చిన యింగ్లీషు చదువులో ఈ

విషయము లేదాయె. మానవరూపమున దేవుడు పరిపూర్ణముగ నవతరించు ననుటను వివరించి చెప్పుట చాల కష్టము కాదా? అనంత తత్త్వము మూడున్నరమూరల పొడవు గల మానవమూర్తిని గొనుట!

కాప్టను:—కృష్ణుడు సాక్షాద్భగవంతుడే. ఆయనను వర్ణించు నప్పుడు 'అంగి' 'అంగము' అను నిట్టి మాటలనే మనము వాడ వలెను.

గురుదేవుడు:—అంగియు అంగములును నిప్పును దాని కణములను బోలినవి. దేవు నవతారము భక్తులకొఱకే కాని జ్ఞానుల కొఱకు కాదు.

కాప్టనుతోను భక్తులతోను శ్రీరామకృష్ణు డిట్లు సంభాషించుచుండగా, బ్రాహ్మసమాజీయు లైన జయగోపాలసేనును త్రైలోక్యుడును వచ్చిరి, గురుదేవునకు ప్రణమిల్లి కూర్చుండిరి. శ్రీరామకృష్ణుడు త్రైలోక్యుని వైపు చిఱునవ్వు నవ్వుచు జూచి సంభాషణను సాగించెను.

గురుదేవుడు:—దేవుని దర్శనము నొకడు పడయ లేకపోవుట కతని యహంకారమే కారణము. దేవుని మేడకు ముందుగా అహంకార మనెడి బ్రోడు ఉన్నది. దానిని లంఘింపనిదే ఎవరును ఆ మేడలో అడుగిడలేరు.

భూతములను వశపఱచుకొను శక్తిని సంపాదించిన వాడొక డుండెను. అతడు ఆహ్వానింపగా నొకనాడు ఒక భూతము వచ్చి అగపడి, "నీకు నే నేమి చేయవలెనో చెప్పుము. ఏదో ఒక పనిని నీవు నాకు చెప్ప లేక పోదు వేని, తత్‌క్షణమే నీ మెడ విరిచెదను సుమా" అని పలికెను. నెఱవేర్ప వలసిన పనులు అతనికి ఎన్నో ఉండినవి. ఒక్కొక్కటిగా వాని నన్నిటిని అతడు ఆభూతముచే చేయించెను. కడపటికి ఆభూతముచేత చేయించుటకు అతనికి ఏ పనియు లేక పోయినది. అప్పుడు ఆ భూతము "ఇదిగో నీ మెడను విఱువ నున్నా" నని ఉరవడించెను. అతడు ఆ భూతముతో "ఒక్కనిమిష మాగుము నే నిప్పుడే మరలి వత్తు" నని చెప్పి, పరుగున తన గురువునొద్దకు

పోయి "పూజ్యమహాశయా, గొప్ప సంకటములో ఉన్నాను. ఇది నా చిక్కు" అని చెప్పెను. తన చిక్కును గురువునకు దెలిపి "ఇప్పుడు నే నేమి చేయుదు" నని యడిగెను. "ఇట్లు చేయుము. ఆభూతముతో ఈ వంపు వెంట్రుకకు వంపును పోగొట్టుమని చెప్పుము" అని గురువు బోధించెను. వెంట్రుక వంపును సరిచేయుటకు దయ్యము రాత్రిం బగళ్లు కష్టపడెను గాని వంపు వెంట్రుకకు వంపు నేలాగు పోగొట్ట గలదు? దానివంపు అట్లే యుండెను.

అట్లే అహంకారమును మాయ మైనట్లు అనిపించును గాని వెంటనే మరల కనిపించును. అహంకారము ఉడుగనిదే భగవదను గ్రహము ప్రాప్తింపదు.

ప్రౌఢ వయస్సు రాని వానికి (మైనరుకు) మాత్రమే విచారణ కర్తను నియమింతురు. బాలుడు తన యాస్తిని కాపాడుకో లేడు. కావున వానికై బాధ్యతను రాజు వహించును. మనము మన యహం కారమును విడువనిదే, దేవుడు మన బాధ్యతలను తాను వహింపడు.

ఒకనాడు వైకుంఠములో లక్ష్మీ నారాయణులు కూర్చుండి యుండిరి. అప్పుడు నారాయణుడు తటాలున లేచి నిలబడెను. లక్ష్మి ఆయనకు పాదము లొత్తు చుండెను. ఆమె "స్వామీ, ఎచ్చటికి బయలుదేఱితిరి?" అని అడిగెను. "నా భక్తులలో నొకడు మహా పదలో నున్నాడు. అతనిని నేను తప్పక కాపాడవలయును" అని చెప్పుచు నారాయణుడు వెడలి పోయెను. కాని ఆయన మఱు క్షణ ముననే వెను దిరిగి వచ్చెను. "ఇంత త్వరగా మరలి వచ్చితి రేమి నాథా" అని లక్ష్మి అడిగెను. నారాయణుడు చిఱునవ్వు నవ్వి "నా భక్తుడు నాపై పట్ట రానంత ప్రేమతో వీథి వెంబడిని పోవు చుండెను. కొందఱు చాకలివాండ్రు పచ్చిక నేలపై గుడ్డల నార వేయుచుండిరి. ఈ భక్తుడు ఆ గుడ్డలను త్రొక్కుచు నడచెను. అంత నా చాకలి వాండ్రు అతనిని తఱుముకొని పోయి కఱ్ఱలతో కొట్ట బోవుచుండిరి. కావున నతనిని కాపాడుటకై నేను పరుగున పోయి

తిని!'' అని చెప్పెను. ''మఱి ఏల వెను దిరిగి వచ్చితిరి?'' అని లక్ష్మి అడిగెను. నారాయణుడు నవ్వి ''పోయి చూతునుగదా, చాకళ్లపై దువ్వటకై నా భక్తుడు ఒక రాతి నందుకొనుచుండెను (అందఱును నవ్వుదురు) కావున నేను వెను దిరిగి వచ్చితిని'' అనెను.

త్రైలోక్యుడు:—అహంకారమును వదలించుకొనుట మిక్కిలి కష్టము. అహంకారమునుండి తాము విడుపొందితి మని ప్రజలు ఊరక భ్రమించు చుందురు.

గురుదేవుడు:—గౌరి పండితుడు తన్ను గూర్చి చెప్పుకొను నప్పుడు ''నేను'' అనడు, ఆ శబ్దమే అహంకార వర్ధక మని. నే ననుటకు బదులు ఆయన ''ఇది'' అనెడి వాడు. అతని పద్ధతినే నే ననుసరించితిని. ''నేను'' అనుటకు మాఱు ''ఇది'' అని నన్ను గూర్చి చెప్పుకొనుచుందును. ''నేను భుజించితిని'' అనుటకు బదులు ''ఇది భుజించినది'' అని అందును. దీనిని గుర్తించి మధురు డొకనాడు ''ఇదేమి పూజ్యమహాశయా, మీరు ఈలా గేల మాటాడవలెను? వా రట్లు మాటాడిన మాటాడుదురు గాక. వారి కహంకార మున్నది. మీకు లేదు. కావున వారివలె మీరు మాటాడ వలసిన ఆవశ్యకత లేదు.

సాధనదశలో సాధకుడు సకల గుణ పరిగణన పూర్వకముగ దేవుని వర్ణింప వలెను. ఒకనాడు హాజ్రా నరేంద్రునితో ''దేవుడు అపరిచ్ఛిన్నుడు. ఆయన మహిమ అనంతము. నీ వర్పించు తినుబండములకును అరటిపండ్లకును ఆయన చేయి చాచు ననుకొందువా? నీ పాట నాయన వినగోరు ననుకొందువా?'' అని అడిగెను. నరేంద్రుని యుత్సాహము వెంటనే అడుగంటెనది. అప్పుడు నేను హాజ్రాను ''ఓరి పాపీ, నీవు ఈ విధముగ ప్రసంగింతు వేని ఈ యువకు లేమగుదురు?'' అని మందలించితిని. భక్తిని వదలుకొన్నచో మానవుడు బ్రతుకగలడా? దేవునిమహిమ అనంత మనుటకు సందేహము లేదు గాని ఆయన భక్తపరతంత్రుడు. ఒక సంపన్ను నింటి ద్వారపాలకుడు

చావడిలోనికి వచ్చెను. అచ్చట అతని యజమానుడును, యజమానుని మిత్రులును కూర్చుండిరి. ద్వారపాలకుడు గదిలో నొకవైపు నిలబడి యుండెను, చేతిలో దేనినో పెట్టుకొని దానిపై గుడ్డను కప్పి యుంచెను. అతడు మిక్కిలి సంకోచపడుచుండెను. యజమానుడు అతనిని "మఱి ఓ ద్వారపాలకా, నీ చేతిలో ఏ మున్నది?" అని అడిగెను. సేవకుడు మిక్కిలి జంకుచు గుడ్డ మఱుగు తొలగించి ఒక సీతాఫలమును వెలికి దీసి తన స్వామి ఎదుట బెట్టి "దీనిని తాము ఆరగింప వలె నని నా కోరిక" అని విన్నవించెను. మహాప్రేమతో ఆయన ఫలము నందుకొని "బలే, ఈ సీతాఫలము చాల బాగున్నది. దీని నెక్కడ సంపాదించితివి? సంపాదించుటకు నీవు చాల శ్రమపడి యుందువు" అనెను.

ఐహికభోగములపై ఆశ యున్నంతవఱకు మానవుడు కర్మలను విడువ లేడు. భోగానుభవాపేక్ష యున్నంతవఱకును కర్మానుష్ఠానమును సాగించుచునే యుండును.

గంగలో లంగరు వేసి యున్న యొక నావ కంబముపై ఒక పక్షి పరధ్యానముతో కూర్చుండి యుండెను. నావ మెల్లగ బయలు దేఱి సముద్రములో ప్రవేశించెను. ఆ పక్షికి పరాకు తొలగిన వెంటనే ఎటు వైపు చూచినను గట్టు అగపడ లేదు. ఉత్తరముగ చాల దూరము ఎగిరి చూచెను, భూమి అందుబాటునకు వచ్చునేమో యని. చాలదూరము పోయిన పిమ్మట అది అలసి పోయినదే గాని గట్టు అగపడనే లేదు. ఏమి చేయ గలదు? ఓడలోనికే మరలి వచ్చి ఆ స్తంభముపైనే కూర్చుండెను. చాల సే పయిన పిమ్మట అది మరల నొకసారి ఎగిరి పోయెను. ఈ సారి తూర్పువైపు. ఆ దిక్కునను అది గట్టును కాంచ లేక పోయెను. ఎటు చూచినను అపార పారావారము తప్ప వే ఱొకటి కాన్పింపదు. మిక్కిలి విసుగు జెంది అది మరల ఓడలోనికి వచ్చి స్తంభముపై కూర్చుండెను. కొంత సేపు బడలిక తీర్చుకొని, ఒకసారి దక్షిణమునకును, తరువాత నొకసారి పడమటికిని

పోయెను. ఏ దిక్కునను దానికి భూమి జాడగానైన కనిపింప లేదు. అది వెను దిరిగి వచ్చి స్తంభముపై కుదురుగ కూర్చుండెను. అది ఇక నా స్తంభమును వెడలి పో లేదు. ఇక నెట్టి యుద్యమమునకును పూనుకొనక అచ్చట కూర్చుండి యుండెను. ఇక దానికి ఎట్టిచింతయు తహతహయు లేవు. చింత లేనందున ఇక నెట్టి ప్రయత్నము చేయ లేదు.

కాప్టను:—బలే, ఎంత చక్కని యుదాహరణము.

గురుదేవుడు:— ఐహికపరులు సుఖముల నన్వేషించుచు నేల నాలుగు చెఱగులకును పరువులు వాఱుచుందురు. ఎక్కడను వారికి సౌఖ్యము లభింపదు. బడలికయు విసుగును కలుగును. కామినీ కాంచన సంగముచే దుఃఖముల ననుభవించిన పిమ్మటనే వారికి త్యాగ వైరాగ్యప్రవణత కలుగును. మొదట కొంత యనుభవింపనిదే కామినీ కాంచనములను త్యజించుట పెక్కండ్రకు సాధ్యము కాదు.

లోకములో అనుభవించుట కే మున్నది? సంతోషము క్షణికము. అది ఈ క్షణమున నుండును. మఱు క్షణమున మాయ మగును.

మేఘచ్ఛన్నమై కుంభవర్షము కురియు నభమును బోలిన దీ జగము. సూర్యుడు అగపడుట అరుదు. లోకమున ఎక్కువగ నుండు నవి కష్టములే. కామినీకాంచనము లనెడి మేఘముల మరుగుచే సూర్యుడు కన్పించుట లేదు. కొందఱు "అయ్యో, దేవుడు ఇట్టి ప్రపంచము నెందులకు సృష్టించినాడు? దీని నుండి బయటపడు దారి మనకు లేనే లేదా?" అని నన్నడుగు చుందురు. "బయటపడు దారి ఎందులకు? దేవుని శరణు జొరుము. వాతావరణమును అను కూలముగ జేయు మని పరిస్థితులను అనుకూలపఱుపుమని ఆత్రముతో దేవుని ప్రార్థింపుము. ఆత్రముతో ఆహ్వానింతు వేని ఆయన తప్పక చెవి యొగ్గును" అని నేను వారితో చెప్పుచుందును.

సాయంకాల మైనది. శ్రీరామకృష్ణుని గదిలో దీపము పెట్టి

కర్పూరమును వెలిగించినారు. ఇత రాలయములలోను ఇండ్లలోను కూడ దీపములు వెలిగినవి. నహబత్తులో వాద్యములు మ్రోగు చున్నవి. ఆలయములలో సాయంపూజ త్వరలో ఆరంభము కా నుండెను.

శ్రీరామకృష్ణుఁడు చిన్నమంచముపై కూర్చుండెను. వివిధ మూర్తుల నామములను కీర్తించిన పిమ్మట ఆయన లోకమాతను ధ్యానించెను. సాయంపూజ ముగిసినది. శ్రీ రామకృష్ణుఁడు నడుమ నడుమ భక్తులతో సంభాషించుచు గదిలో ఇటు నటు పచారు చేయు చుండెను.

అప్పుడే నరేంద్రుడు వచ్చెను. శరచ్చంద్రుడును, ఒక రిద్దఱు యువభక్తులును అతనితో వచ్చిరి. వా రందఱును గురుదేవునకు ప్రణమిల్లిరి.

నరేంద్రుని దర్శింపగనే శ్రీరామకృష్ణుని ప్రేమ యుప్పొంగెను. శిశువుపై ప్రేమ జూపుటకు దాని గడ్డమును పుడికినట్లు ఆయన మృదువుగ నరేంద్రుని గడ్డమును పుడికెను. ప్రేమద్యోతకమైన కంఠ మున "ఆహా! నీవు వచ్చితివి" అనెను.

1885-వ సంవత్సరము జూలై తే 28 ది మంగళవారము.

నందబోసు (వసు) హిందూదేవతల పటములను తన యింట సేకరించి యుండెను. వానిని చూత మని శ్రీరామకృష్ణుఁడు ఆయన భవనమునకు పోయెను. అక్కడినుండి ఏకైక పుత్రికా మరణముచే దుఃఖార్ణవ నిమగ్న మైన యా బ్రాహ్మణమహిళ యింటికిని పోయెను. వారిది ప్రాత ఇల్లు. ఇటుక కట్టుబడి. దానిని ప్రవేశించుచుండగనే గురుదేవుడు తన కెడమ వైపున పశువుల కొట్టమును చూచెను. ఆయనయు భక్తులును మిద్దెమీదికి పోయి అట కూర్చుండిరి. జను లచ్చట బారులు తీరి నిలబడిరి. కొందఱు కూర్చుండిరి. ఒక్కసారి శ్రీరామకృష్ణుని దర్శన మబ్బిన చాలు నని వా రందఱును ఉబలాట పడుచుండిరి.

ఆ బ్రాహ్మణమహిళకు ఒక సోదరి కలదు. ఇరువురును వితం తువులే. వారి మగతోబుట్టువులును తమ తమ కుటుంబములతో ఆ భవనమందే యుండిరి. శ్రీరామకృష్ణుని సత్కరించుటకై ఏర్పాట్లు చేయుచున్న ఆ బ్రాహ్మణ మహిళకు తీరుబాటే లేకుండెను. గురు దేవుడు నందబోసు నింట నున్నప్పుడు ఆమె మిక్కిలి తహతహ పడు చుండెను. ఆయన వచ్చుచున్నాడేమో అని నిమిష నిమిషమున కును బయటికి పోయి చూచుచుండెను. నందుని భవనమునుండి ఆమె ఇంటికి వత్తు నని ఆయన వాగ్దానము చేసి యుండెను. ఆలస్య మగుచున్నందున 'ఆయన ఒక వేళ రాడేమో' అని ఆమె అను కొనెను.

శ్రీరామకృష్ణు డొక చాపపై కూర్చుండెను. మహేంద్రుడు, నారాయణుడు, యోగిన్, దేవేంద్రుడు, మున్నగు వా రొక చాపపై కూర్చుండిరి. కొన్ని నిమిషములకు పిమ్మట చినరేంద్రుడును మరి కొందఱు భక్తులును వచ్చిరి. ఆబ్రాహ్మణమహిళాసోదరి గురుదేవు నొద్దకు వచ్చి ప్రణమిల్లి, "సోదరి ఇప్పుడే నందబోసు నింటికి పోయి నది; మీరు వచ్చుటకు ఏల ఆలస్య మగుచున్నదో అడుగుదమనియే. ఆమె ఇప్పుడే వచ్చును" అనెను.

ఇంతలో క్రింద చప్పుడు వినవచ్చెను. "వచ్చినది" అని కేక వేసి ఆమె దిగి పోయెను. కాని ఆ వచ్చినది ఆమె సోదరి కాదు.

శ్రీరామకృష్ణుడు భక్తపరివేష్టితుడై చిఱునవ్వు నవ్వుచు కూర్చుండి యుండెను.

మహేంద్రుడు:— (దేవేంద్రునితో) ఎంత అద్భుతదృశ్యము! చిన్నవారు, పెద్దవారు, స్త్రీలు, పురుషులు,—ఈ ప్రజ లందఱును ఈయన నొక్క సారి చూడ వలె ననియు, ఈయన మాటలను విన వలె ననియు ఆతురముతో వరుసలు తీరి నిలబడి యున్నారు.

దేవేంద్రుడు:—(గురుదేవునితో) నందునింటికన్న ఈ చోటు

మేలుగా నున్న దని మహేంద్రు డనుచున్నాడు. ఇచటి వారి భక్తి ఆశ్చర్యకరముగ నున్నది.

శ్రీరామకృష్ణుడు నవ్వెను.

బ్రాహ్మణిసోదరి "అదుగో వచ్చినది నా సోదరి", అని కేక వేసెను.

ఆమె వచ్చి గురుదేవునకు నమస్కరించెను, ఆనందపరవశురాలయ్యెను. ఏమి చెప్పుటకును ఆమెకు తోప లేదు. గద్గదకంఠముతో ఇట్లనెను : ఈ యానందము నాకు అతిమాత్రముగ నున్నది. ఆనందము పట్ట లేక మరణింతు నేమో! అట్లు మరణింపకుండుటకై ఏమి చేయవచ్చునో మిత్రులారా, మీరు తెల్పుడు. తళతళని యుడుపులును, ఆయుధములును దాల్చిన జమీనుబంట్లు వీధి రెండు వైపులను వరుసలు తీరియుండగా నా కూతురు చండి మా యింటికి వచ్చుచుండి నప్పుడు గూడ నా కింతటి యుద్రిక్తానందము కలుగ లేదు. ఔరా! ఇప్పుడు ఆమె చనిపోయినందులకు కలిగిన దుఃఖము జాడ యైనను లేక మాయ మైనది. ఈయన ( = శ్రీరామకృష్ణుడు) రా డేమో అని నేను దిగులు పడితిని. రాకయే పోవు నేని ఈయన సత్కారమునకును వినోదమునకును నేను సిద్ధపఱచిన వస్తువుల నన్నిటిని గంగలో వేయుద మని నిశ్చయించుకొంటిని. ఇక మీద ఈయనతో మాటాడరా దనుకొంటిని. ఎచటి కైన ఈయన వచ్చిన యెడల నేను కూడ అచటికి పోవలసినది, దూరమునుండి ఒకసారి ఈయనను చూడవలసినది. వెనుకకు వచ్చివేయ వలసినది—అనుకొంటిని.

ఇప్పుడు నే నెంత సంతోషముగ నున్నానో ప్రతియొక్కరి యొద్దకును పోయి తెలుప నిండు. నా యదృష్టమును యోగీతో చెప్ప వలెను. అతనియొద్దకు నన్ను పోనిండు.

ఆనందముచే ఇంకను ఉక్కిరిబిక్కిరి యగుచు ఆమె ఇట్లనెను: "ఒక కూలివానికి లాటరీలో వేయి రూపాయలు వచ్చినవి. ఆ వార్త

విన్న తత్క్షణమే పట్టి ఆనందమును పట్టలేక అతడు చచ్చెను. అవును, నిజముగ, వాస్తవముగ చచ్చెను. నేనును అట్లగుదు నేమో అని నా భయము. సఖులారా, దయచేసి నన్ను దీవింపుడు. లేకున్న నాకు చావు తప్పదు''.

భక్తులను చూడగనే బ్రాహ్మణికి సంతోషము మిక్కుటమయ్యెను. ''ఈ చోట మిమ్మందఱను చూడ గలిగి నందులకు నా సంతోష మిం తంత గాదు. నేను చినన రేంద్రునిగూడ పిల్చుకొని వచ్చితిని. అతడు లేకున్న మనల నెవ్వరు నవ్వింతురు?'' అని ఆమె అనెను.

ఆమె ఇట్లు మాటాడుచుండగా, ఆమె సోదరి మిద్దెమీదికి వచ్చి, ''సోదరీ, క్రిందికి రమ్ము. నీ విచ్చట నుందు వేని అన్ని పనులను నే నెట్లు చూచుకో గలను? ఒంటిదానను అన్నిటిని నిర్వహింప గలనా?'' అనెను.

బ్రాహ్మణి కేమో సంతోషము పట్టరా కుండెను. ఆమె తన చూపును గురుదేవునినుండియు, భక్తులనుండియు మరల్చుకొన లేకుండెను.

కొంత సేపయిన తరువాత ఆమె శ్రీరామకృష్ణుని మహోదరముతో మఱియొక గదికి తీసికొనిపోయి తీయని మిఠాయిలను వేఱు తినుబండములను ఆయనకు నివేదించెను. భక్తులకు సమస్తోపచారములును మేడమీద జరిగినవి.

అప్పటికి రాత్రి సుమారు ఎనిమిది గంటలు. శ్రీరామకృష్ణుడు బయలుదేఱుటకు సిద్ధముగ నుండెను. ఆయన వాకిలి వద్దకు వచ్చినపుడు బ్రాహ్మణి తన సోదరునిభార్యను ఆయనకు మ్రొక్కుమనెను. తరువాత ఆమె సోదరులలో నొకడు గురుదేవుని పాదధూళినిగొనెను. ఆ సోదరుని గూర్చి ఆమె ''వీడు నా తోబుట్టువులలో నొకడు, కాని బుద్ధిమాలినవాడు'' అనెను. గురుదేవుడు ''కాదు కాదు. వారందఱును మంచివారే!'' అని ప్రశంసించెను.

ఒకరు దీపముతో దారి చూపిరి. దారిలో కొన్ని చోట్లు అంధకారమయములుగ నుండినవి. శ్రీరామకృష్ణుడు పశువులకొట్టమునకు ఎదురుగ నిలబడెను. భక్తులు ఆయనచుట్టును మూగిరి. ఆయన అప్పుడే "ఘను" తల్లిగారింటికి బయలుదేఱ నుండెను. మహేంద్రు డాయనకు ప్రణమిల్లెను.

"ఘను" తల్లి గారింటి కూటమున శ్రీరామకృష్ణుడు కూర్చుండియుండెను. అది క్రింది యంతస్తే. ఆ గది ఒక గాయకసమాజము వారి యుపయోగములో నుండెడిది. యువకులు పలువురు గురుదేవుని యానందమునకై తమ వాద్యములను అప్పుడప్పుడు వాయించుచుండిరి. అప్పటికి ఎనిమిదిన్నరగంట లయినవి. అది పున్నమకు మఱసటి దినము. వీధి యందును ఇండ్ల యందును ఆకసమందును వెన్నెల వెల్లిగొని యుండెను.

బ్రాహ్మణియు అచ్చటికి వచ్చి కూటమునకు లోపలిగదులకు వచ్చుచు పోవు చుండెను. కొన్ని నిమిషముల కొకసారి ఆమె కూటపు వాకిలి యొద్దకు వచ్చి గురుదేవుని చూచు చుండెడిది. ఆ ప్రాంతీయులైన మఱికొందఱు యువకులు గూడ గురుదేవుని వైపు కిటికీలగుండ చూచుచుండిరి. ఆ చుట్టుపట్ల ప్రజలు, పిన్నలును పెద్దలును ఈ యోగిని దర్శించుటకై తండతండములుగ వచ్చిరి.

వీధిలో బాలురు కిటికీలమీఁది కెక్కుచుండిరి. వారిని చూచి చిననరేంద్రుడు "మీరెందు కోయి ఇక్కడ? పొండు దూరముగ, ఇండ్లకు పొండు" అని అఱచెను. గురుదేవుడు దయతో, "వారిని ఉండ ని" మ్మనెను. మాటిమాటికిని ఆయన "హరిః ఓం - హరిః ఓం" అని కీర్తించుచుండెను. కొన్ని నిమిషములైన తరువాత బ్రాహ్మణి శ్రీరామకృష్ణునితో, "దయచేసి లోనికి విచ్చేయుడు" అనెను.

గురుదేవుడు :—ఎందులకు?

బ్రాహ్మణి:— అక్కడ భక్ష్యములను వడ్డించుచున్నారు. దయచేసి విచ్చేయుడు.

గురుదేవుడు:—భక్ష్యములను ఇచ్చుటకేల తేకూడదు?

బ్రాహ్మణి:—తమ పాద ధూళితో లోపలిగదిని పవిత్రీకరింప వలసినదని "ఘను" తల్లి వేడుకొనుచున్నది. అప్పుడు ఆ గది వారాణసిగ పరిణమించును. అక్కడ మరణించు వారికి సకల ప్రతి బంధములును తొలగి పోవును.

శ్రీరామకృష్ణుడు లోనికి పోయెను. బ్రాహ్మణియు ఆ యింటి యువతులును ఆయనతో కూడనే పోయిరి. భక్తులు వెలుపలి వెన్నె లలో పచారు చేయు చుండిరి. మహేంద్రుడును వినోదును ఇంటికి దక్షిణపు వైపున్న వీధిలో పచారు చేయుచు తమ ప్రియ గురు నాథుని జీవితములో వివిధ సంభవములను తలపోసికొనుచుండిరి.

శ్రీరామకృష్ణుడు బలరామునింటికి మరలి వచ్చెను, కూటము నకు పడమట నున్న చిన్నగదిలో విశ్రమించి యుండెను. అప్పటికి చాల ప్రొద్దు పోయినది. పావుగంట తక్కువగ పదునొకండు గంట లయినవి.

యోగీతో శ్రీరామకృష్ణుడు "దయచేసి నా పాదములను మెల్లగ నిమురుము" అనెను. మహేంద్రుడును దాపుననే కూర్చుం డెను. యోగీ ఆయన పాదములను నిమురుచున్నప్పుడు, గురు దేవుడు తటాలున "నాకు ఆకలిగ ఉన్నది ఏమైనను ఫలాహారము తినవలెను" అనెను.

గురుదేవునితోను, భక్తులతోను బ్రాహ్మణియు బలరాము నింటికి వచ్చియుండెను. ఆమె సోదరుడు మృదంగవిద్య నేర్చిన వాడు. "నరేంద్రుడుగాని మఱియొక గాయకుడు గాని పాడ నెంచినపుడు ఈమె సోదరుని పిలిపించిన మన కార్యక్రమము నెఱవేఱును" అని శ్రీరామకృష్ణుడు చెప్పి యుండెను.

శ్రీరామకృష్ణుడు కొంచెముగ ఫలాహారము చేసెను. యోగిన్ మున్నగు భక్తులు గదినుండి వెడలి పోయిరి. మహేంద్రుడు గురుదేవునికి పాదము లొత్తుచుండెను. వారు సంభాషించుకొను చుండిరి.

గురుదేవుడు :—(బ్రాహ్మణిని ఆమెబంధువులను గుఱించి) ఆహా, వా రెంత ఆనందముగ నున్నారు!

మహేంద్రుడు:—ఏమి ఆశ్చర్యము! జీససు కాలములోకూడ మహిళలకు ఇరువురికి ఇట్టి యానందానుభవమే కలిగెను. ఎవ రనగా మార్త, మేరీ. వా రిరువురును తోబుట్టువులే, క్రైస్తు భక్తలే.

గురుదేవుడు :—(ఆత్రముతో) వారి కథను చెప్పుము.

మహేంద్రుడు:—మీ౨వలెనే జీససు క్రైస్తును తన భక్తులతో వా రింటి కేగెను. క్రైస్తును చూచినంతనే ఆ తోబుట్టువులలో నొకతెకు ఉద్రిక్తానందదశ పైకొనినది. రెండవ యామె క్రైస్తునకు విందు చేయుటకై శ్రమ నంతయు తా నొక్కతెయే భరించుచుండెను. జీససుదేవునితో ఆమె, "దేవా, తప్పొప్పులను మీరే నిర్ణయింపుడు. నా సోదరి నడవడి ఎంత తప్పు! ఆమె తనగదిలో కూర్చున్నది. ఈ పనుల నన్నిటిని నే నొక్కతెనే నిర్వహించుచున్నాను" అని మొఱపెట్టుకొనెను. జీససు "అమ్మా, నీ సోదరి భాగ్యశాలిని. మానవ జీవితమునకు దైవభక్తియే ఏకైకావశ్యకము. దాని నామె పొందించుకొనినది.

గురుదేవుడు :—మఱి దీని నెల్ల చూచిన పిమ్మట నీ యభిప్రాయ మేమి?

మహేంద్రుడు:—క్రైస్తు, చైతన్యదేవుడు, తాము,—ముగ్గురును అభిన్నులే — ఒక్కరే. అని నా యభిప్రాయము. మూడు రూపములను దాల్చిన మహాపురుషు డొక్కడే.

గురుదేవుడు :—ఔ నౌను. ఒక్కడే! ఒక్కడే! తత్త్వ మొక్కటే. ఈ చోట ఇట్లు ఉన్న వాడు అతడే అని నీకు స్పష్టముగా లేదా?

ఈ వాక్యమును చెప్పుచు శ్రీరామకృష్ణుడు తన వ్రేలితో తన శరీరమునే చూపుకొనెను.

మహేంద్రుడు:—దేవుడు భూలోకమున అవతరించు ప్రకారములను నిన్న తాము స్పష్టముగ వివరించితిరి గదా!

గురుదేవుడు :—ఏమి వివరించితినో చెప్పుము.

మహేంద్రుడు:—మన చూపు మేర వఱకును ఇంకను ఆవలికిని గూడ వ్యాపించి యున్న ఒక పొలమును భావనలోనికి తెచ్చుకొమ్మంటిరి. హద్దే లేక ఆ పొలము విస్తరిల్లి యున్నది. కాని మన ఎదుట నొక గోడ యుండుటచే ఆ పొలము మన కగపడకున్నది. ఆ గోడలో గుండ్రని రంధ్ర మొకటి యున్నది. ఆ రంధ్రముగుండ చూతు మేని అంత రహితమయి ఆవల నున్న పొలములో ఒక్క భాగము మాత్రము కనిపించును.

గురుదేవుడు :—ఆ రంధ్ర మేదో చెప్పుము?

మహేంద్రుడు :—మీరే ఆ రంధ్రము. మీగుండ సమస్తమును చూడ నగును. అనంతమును, అపరిచ్ఛిన్నము నగు నా "మైదానము" కనిపించును.

శ్రీరామకృష్ణుడు మిక్కిలి ప్రీతు డయ్యెను. మహేంద్రుని వీపున తట్టుచు "ఆ విషయము నీకు స్పష్టముగ అర్థమైన దని నాకు తెలిసిపోయినది. బాగున్నది" అనెను.

మహేంద్రుడు :—దాని నర్థము చేసికొనుట నిజముగ కష్టమే. అఖండ బ్రహ్మస్వరూపము ఆ చిన్న శరీరములో ఎట్లు వసింపగలదో ఎవడును సరిగ గ్రహింపలేడు. జీససును గూర్చిగూడ మీరు మాకు చెప్పితిరి.

గురుదేవుడు :—ఏమి చెప్పితిని?

మహేంద్రుడు :—యదుమల్లిక్ వనమందిరమున జీససుక్రీస్తు పటమును చూచి నంతనే మీరు సమాధిలో మునిగితిరి. పటము

నుండి దిగి వచ్చి జీససు మీ మేనిలో లీనమైనట్లు మీకు కనిపించి నది. శ్రీరామకృష్ణుడు కొన్ని నిమిషములు మౌనముగ నుండి తరువాత మహేంద్రునితో (తన కంఠవ్రణమును నిర్దేశించుకొనుచు) నా గొంతునకు ఇట్టి అవస్థ కలుగుటలో కూడ అంతరార్థమేమైన నున్న దేమో! అందఱి ఎదుటను నేను నన్ను చులకన చేసికొన కుండుటకును విచక్షణ లేక అన్ని చోట్లకును పోయి ఆటపాటలు జరుపకుండుటకును, నా కీ బాధ కలిగినది.

శ్రీరామకృష్ణుడు దోమతెరలోపల పరుండి యుండెను. మహేంద్రుడు విసనకఱ్ఱతో ఆయనకు వీచుచుండెను. గురుదేవుడు అతనిపై పునకు పొరలి—మానవ శరీరమున దేవుడు ఎట్లు అవతరించునో విశదపఱచెను. తన పారమార్థిక లక్ష్యమును గూడ వివరించెను.

గురుదేవుడు :—మొదట మొదట దివ్యరూపముల దర్శనము కలుగదు. ప్రారంభమున నేనును అట్టి దశలను దాటిన వాడనే. ఇప్పటికి కూడ అట్టి దర్శనములు నాకు తఱచుగ కనబడవు.

మహేంద్రుడు :—దేవుడు తన లీల సాగించుకొనుటకై పెక్కు రూపములపై మోజుపడును. అన్నిటిలోను మానవరూపమున ఆయన సాగించు లీలయే నాకు మిక్కిలి ప్రియము.

గురుదేవుడు :—అది చాలునే. నన్ను చూచుచున్నావు గద.

1885 వ సంవత్సరము ఆగస్టు తే 9 ది భానువారము.

శ్రీరామకృష్ణుడు దక్షిణేశ్వరమున తనగదిలో కూర్చుండి యుండెను. అప్పటికి రాత్రి ఎనిమిదిగంటలు. గురుదేవుడు మహిమ చరణునితో సంభాషించుచుండెను. రాఖాలు, మహేంద్రుడు మహిమ చరణుని సఖు లొకరిద్దఱును గదిలో నుండిరి. మహిమచరణుడు ఆ రాత్రిని గుడితోటలోనే గడప నుండెను.

గురుదేవుడు :—ఇక్కడకు వచ్చు యువకులకు ఒక రెండు విషయములు మాత్రమే తెలిసినను చాలును. ఇవి తెలిసి యుండిన

వారు సాధనను గాని తపశ్చర్యను గాని ఎక్కువగ చేయ నక్కఱ లేదు. నే నెవర ననునది మొదటిది. వా రెవ రనునది రెండవది. ఈ యువకులలో పెక్కుండ్రు అంతరంగ వర్గములో చేరిన వారు.

అంతరంగ వర్గమునకు చెందిన వారికి మోక్షప్రాప్తి లేదు. వాయవ్యదిశలో నేను మరల నొక సారి మనుష్యజన్మ మెత్త వలసి యుండును.

మహిమచరణుడు శాస్త్రగ్రంథములనుండి కొన్ని శ్లోకములను చదివెను. తంత్రశాస్త్రమునుండి వివిధ జ్ఞానానుభవ క్రియలను వర్ణించెను.

గురుదేవుడు :—సరి, నా ఆత్మ సమాధిలో చొచ్చునప్పుడు అనంత వైశాల్యము గల మహాకాశములో పక్షిరూపమున పఱచు నని కొందఱు చెప్పుదురు.

ఒకప్పుడు హృషీకేశము నుండి ఒక సాధు విచ్చటికి వచ్చి నాడు. ''సమాధులలో ఐదు విధము లున్నవి. వాని నన్నిటిని నీ వనుభవించితి వని నాకు తెలిసినది. ఈసమాధులలో జ్ఞాన(కుండలిని) శక్తి సంచారము చీమ, చేప, కోతి, పక్షి, పాము—అనువాని సంచారమును పోలి యుండు నని సాధకునకు తెలియును.

ఒక్కొక్కప్పుడు జ్ఞానశక్తి ప్రవాహము చీమ ప్రాకినట్లు వెన్నెముకగుండ పైకి లేచును.

ఒక్కొక్కప్పుడు సమాధిలో ఆత్మ మత్స్యమువలె దివ్యానందోద్రేకసాగరమున ఆనందముతో ఈదు లాడును.

ఒక్కొక్కప్పుడు నేను ప్రక్కకు తిరిగి పరుండి యున్నప్పుడు కుండలినీశక్తి ఒక కోతి వలె నన్ను నెట్టుచు ఆనందముతో క్రీడించుచుండుటయు నాకు తెలియ నగు చుండును. నేను కదల కుందును. కుండలిని ఒకవానరమువలె తటాలున ఒక్క గంతులో సహస్రారము

నందుకొనును. అప్పు డప్పుడు మీ యెదుట నేను తటాలున గంతు లిడుటకు అదే కారణము.

ఒక్కొక్కసారి కుండలినీశక్తి శాఖనుండి శాఖ కెగురు పక్షి వలె లేచుటయు కలదు. తా నున్న చోటు దానికి నిప్పువంటిదిగా తోచును. అది ఒక యాధారమునుండి వే ఱొక యాధారమునకు ఎగిరి మెట్టు మెట్టుగ తల కెక్క వచ్చును.

ఒక్కొక్కప్పుడు కుండలినీశక్తి పామువలె సంచరించును. వక్రగతితో పైకి సాగి అది మూర్ధము నధిష్ఠించును. అప్పుడు నాకు సమాధిదశ కలుగును.

కుండలినీ శక్తి మేల్కొల్పబడని దే మానవునకు జ్ఞానబోధము కలుగదు.

కుండలిని మూలాధారమున నెలకొని యుండును. మేల్కొల్ప బడినప్పుడు అది సుషుమ్నానాడిగుండ సాగి స్వాధిష్ఠాన మణిపూ రాదు లైన యాధారములగుండ పోయి తుదకు మూర్ధమును చేరు కొనును. దీనినే మహావాయు (జ్ఞానశక్తి) సంచార మందురు. ఇది సమాధిలో పర్యవసించును.

ఎవనికిగాని వట్టి పుస్తకాల చదువుచే జ్ఞానప్రబోధము కలు గదు. సాధకుడు దైవప్రార్థనమును కూడ చేయవలయును. అతడు దేవునకై తహతహ పడు నేని కుండలినీశక్తి మేలుకొనును. వట్టి గ్రంథపాండిత్యముతోను, శ్రుతపాండిత్యముతోను జ్ఞానమును గూర్చి ప్రసంగించుటయా, అట్టి ప్రసంగమువలన లాభ మేమి ?

నా మనస్సుకు ఈ దశ కలుగుటకు ముందు కుండలినీశక్తి ఎట్లు మేల్కొల్పబడునో, వివి ధాధారము లందలి పద్మములు ఎట్లు వికసించునో, ఇన్నియును సమాధిలో ఎట్లు పర్యవసించునో — ఇ దంతయు నాకు ప్రత్యక్షము చేయబడినది. ఇది మిక్కిలి నిగూఢ మైన యనుభూతి. ఇరువదిరెండు, ఇరువదిమూడు సంవత్సరముల

వయస్సు గలిగి పూర్తిగ నన్నే పోలిన బాలు డొకడు సుషుమ్నా నాడిలో ప్రవేశించి పద్మములతోడి సంసర్గము పొంది వానిని తన జిహ్వతో స్పృశించుచున్నట్లు నా కగపడినది. అతడు గుదమునొద్ద నుండు నాధారమునుండి బయలుదేఱి లింగము నాభి మొదలైన వాని యొద్ద నున్న యాధారములగుండ సాగిపోయెను. ఆ యాధారము లలో నున్న వివిధ పద్మములు — నాలుగు దళములది, ఆరుదళము లది, పది దళములది, మొదలైనవి — వాడి వ్రేలుచుండినవి. అతడు వానిని స్పృశించినంతనే అవి సూటిగ నిగుడుకొన్నవి.

అతడు హృదయమును సమీపించి అచటి పద్మముతో సంసర్గ మొంది దానిని తన జిహ్వతో తాకినప్పుడు అచ్చట తలక్రిందులుగ వ్రేలుచుండిన ఆ ద్వాదశదళ పద్మము సూటిగ నిగుడుకొని తన దళములను విచ్చిన తీరు నాకు స్పష్టముగ జ్ఞప్తియం దున్నది. తరు వాత నతడు కంఠమునొద్ద నున్న షోడశదళపద్మమును, ఫాలమునొద్ద నున్న ద్విదళ పద్మమును చేరుకొనెను. కట్టకడపట మూర్ధమునం దున్న సహస్రారకమలము వికసించినది. అది మొదలు నే నీ దశలో నున్నాను.

శ్రీరామకృష్ణుడు నేల మీదికి దిగి మహిమచరణునికి సమీ పమున కూర్చుండెను. మహేంద్రాది భక్తులును కొందఱు ఆయన సమీపమున నుండిరి. రాఖాలుకూడ ఆ గదిలోనే యుండెను.

గురుదేవుడు :—(మహిమునితో) నా జ్ఞానానుభవములను నీకు తెలుప వలె నను కోరిక నా కెన్నాళ్ళనుండియో కలదు. కాని వీలు కా లేదు. ఆ విషయములను నీకు చెప్పవలె నను తలంపు నేడు కలుగుచున్నది.

వట్టి సాధన చేతనే ఎవనికిగాని నా మనోదశ వంటి మనోదశ కలుగు నని నీ వందువు. కాని అది అట్లు కాదు. (తన్ను చూపు కొనుచు) ఇచ్చట ప్రత్యేక మైన దేదో గలదు.

గురుదేవుడు చెప్పనున్న దానిని వినుటకై రాఖాలు మహేంద్రాదులు ఆత్రపడిరి.

గురుదేవుడు :— దేవుడు నాతో మాటాడినాడు. వట్టి దర్శనమాత్రము కాదు. కానే కాదు. నాతో మాటాడినాడు. మఱ్ఱిచెట్టు క్రింద నున్నప్పుడు ఆయన గంగానదినుండి వచ్చుచుండుట నాకగపడినది. అప్పుడు మేము ఎంతగనో నవ్వుకొంటిమి. నాతో క్రీడించుటగా ఆయన నా వ్రేళ్ల నెటికలు విఱిచెను. పిమ్మట ఆయన నాతో మాటాడినాడు. ఔను. మాటాడినాడు నాతో.

మూడు దినములు ఎడతెంపు లేక నే నేడ్చితిని అంతట స్వామి వేదములలోను, పురాణములలోను, తంత్రములలోను, ఇతర శాస్త్రములలోను గల విషయమును నాకు స్పష్టముగ తెలిపెను.

ఒకనా డాయన మహామాయయొక్క మాయను నాకు చూపెను. ఒక గదిలో నున్న చిన్న జ్యోతి క్రమక్రమముగ పెరిగి తుదకు అఖండవిశ్వమును తనలో నిముడ్చుకొనెను.

తరువాత ఆకు పచ్చని పాచి క్రమ్ముకొన్న పెద్ద తటాకమునొకదానిని ఆయన నాకు చూపెను. గాలి, పాచిని ఒకింత కదల్చెను. వెంటనే నీరగపడెను. కాని రెప్పపాటుకాలములో పాచి నలువైపుల నుండియు నర్తించుచు వచ్చి మరల నీటిని కప్పివేసెను. నీరు సచ్చిదానంద ప్రతిరూప మనియు, పాచి మాయ వంటి దనియు ఆయన నాకు స్పష్ట మొనర్చెను. సచ్చిదానందము కనబడకుండుటకు కారణము మాయయే. నడుమ నడుమ అది తళుక్కు మని అగపడినను, మాయ దానిని మరల మూసిపెట్టును.

భక్తులు నాయొద్దకు వచ్చుటకు ముందే వారి ప్రకృతి ఎట్టిదో దేవుడు నాకు ముందుగా ప్రత్యక్షపఱచి యుంచును. పంచవటి సమీపమున వటవృక్షమునకును వకుళవృక్షమునకును నడుమ చైతన్యానుగుల బృందమువారి ఆటపాటలను నేను ప్రత్యక్షముగ చూచి

తిని. అచట బలరాముని చూచితిని. అతడు లేకున్న కలకండ మున్నగు వస్తువులను నాకు సరఫరా చేయు వారెవరు? (మహేం ద్రుని చూపుచు) ఇతనిని కూడ చూచితిని.

కేశవుని నేను వాస్తవముగ కలిసికొనుటకు ముందే సమాధి దశలో అతనిని అతని బృందమువారిని చూచి యుంటిని. నా ఎదుట జనులు గదిలో క్రిక్కిరిసి కూర్చుండిరి. కేశవుడు పింఛమును విచ్చి కూర్చున్న నెమలివలె నగపడెను. పింఛము అతని అనుచరులకు సూచకము. కేశవుని మూర్ధమున నొక పద్మరాగమును చూచితిని. అది యతనిరాజసమునకు సూచకము. అతడు తనశిష్యులతో "ఆయన (=శ్రీరామకృష్ణుడు)ఏమిచెప్పుచున్నాడో దయచేసి వినుడు." అనెను. నేను లోకమాతతో అమ్మా, 'ఇంగ్లీషువారి' యభిప్రాయము లేవో వీరి కున్న అభిప్రాయములును అవే. వీరితో నేనేల మాటాడవలెను?" అని అంటిని. కలియుగములో పరిస్థితు లిట్లే యుండు నని అమ్మ నాకు తెలియజెప్పినది. కేశవుడును, అతని అనుచరులును హరినామమును లోకమాతృనామమును బడసినది ఇక్కడనుండి (అని తన్ను చూపు కొనును).

(తన్ను చూపుకొనుచు) ఇక్కడ విలక్షణ మైన దేదో, యొకటి యుండ వలెను. చాలకాలమునకు మునుపు గోపాలసేను అను నొక యువకుడు ఇచ్చటికి వచ్చుచుండెను. నాలో నున్న మహా పురుషుడు తన చరణమును గోపాలుని వక్షముపై నుంచెను. గోపా లుడు పరవశదశ నొంది "నీవు ఈ లోకములో చాల కాలము వేచి యుండ వలెను. నా వలకు నేను ఐహికపరులతో గూడి ఇక వసింప లేను" అనెను, వీడ్కొని పోయెను. అటు పిమ్మటనే అతడు మర ణించె నను వార్త విన్నాను. ఒకవేళ అతడే నిత్యగోపాలుడుగ పుట్టె నేమో!

అద్భుత దర్శనానుభవములు నాకు పెక్కులు కలిగినవి. అపరి చ్ఛేద్య మైన సచ్చిదానందమే నాకు ప్రత్యక్షముగ అగపడినది. ఆ

సచ్చిదానంద స్వరూపమునందు నాకు రెండు వర్గములు కనిపించినవి. రెండు వర్గములకును నడుమ నొక కంచె యుండినది. ఒక వైపు సాకారదైవమును విశ్వసించు చుని కేదా రాది భక్తు లుండిరి. రెండవ వైపు ప్రదేశ మెల్ల జాజ్వల్యమానముగ ఇటిక పొడి రాసి వలె ఎఱ్ఱగ నుండెను. దాని యందు సమాధి నిమగ్నుఁడైన నరేంద్రుఁడు కూర్చుండి యుండెను. ధ్యానవ్యాపృతుఁడైన అతనిని చూచి "ఓ నరేంద్రా" అని బిగ్గఱగ పిలిచితిని. అతఁడు తన కన్నులను కొంచెముగ తెఱచెను. అతఁడు వేఱొకరూపమున కాయస్థ కుటుంబమున *సిమ్లాలో పుట్టి యున్నాఁడని నాకు తెలియవచ్చినది. తత్క్షణమే నేను లోకమాతతో "అమ్మా, అతనిని మాయలో తగుల్కొల్పుము. లేకున్న సమాధిలో నతఁడు తనుత్యాగము చేయును" అంటిని. సాకారదైవమును విశ్వసించు కేదారుఁడు లోనికి తొంగి చూచి అదరిపడి పాఱిపోయెను.

కాబట్టి నాలో వసించుచు భక్తులతో క్రీడించు చుండినది నాతల్లి లోకజనని యనియే నా యభిప్రాయము. నా మనస్సునకు ఉచ్చస్థాయి మొదటి సారి కలిగి నపుడు నా యొడలు తేజస్సును నలు వైపుల వెదచల్లెను. నా వక్షము సదా వికసించియే యుండెను. అప్పుడు నేను లోకమాతతో "అమ్మా, నన్ను బహిరంగముగ చూపు కొనకుము, లోని కేగుము" అంటిని. నా మేని కాంతి మందగించుట కదే కారణము. నా మేనికి ఆ కాంతి ఇప్పటికిని యుండి యుండు నేని ప్రజలు నన్ను ఎంతగనో పీడించి యుందురు. మూక ఇచ్చట సదా మూగియే యుండెడిది. ఇప్పు డిచ్చట బాహ్యవిమ్కృతి లేనే లేదు. దాని అభావమే కలుపుమొక్కలను దూరమున నుంచు చున్నది. అచ్చపు భక్తి గల వారు మాత్రమే నా సమీపమున నుందురు. నాకు వచ్చియుండు నీ వ్యాధికి కారణ మేమో మీకు తెలియునా ? దాని యంతరార్థమును ఇదే. గూఢ స్వార్థపరతచే

* కలకత్తాలో నరేంద్రుడు అవతరించిన ప్రాంతము.

నాయందు భక్తి చూపు వారు నా వ్యాధిని చూచి తత్క్షణమే పరారి యగుదురు.

నా కొక కోరిక యుండెడిది. నేను లోకమాతతో, "అమ్మా, నేను భక్తులకు రాజ నగుదును" అని చెప్పితిని.

నామనస్సులో మఱి యొక తలంపు కూడ కలిగినది—దైవ ప్రార్థనలు సేయు నప్పుడు హృదయపూర్వకత ఎవ రెవరి కుండునో అట్టి వారు తప్పక ఇచ్చటికి వత్తురు, రాక తప్పరు—అని. నేను తలచినట్లుగనే ఇప్పుడు జరుగుచుండుటను మీరు చూచుచున్నారు గదా! అట్టివారే ఇచ్చటికి వత్తురు.

నా దేహమున ఎవ రున్నదియు నా తలిదండ్రులు తెలియుదురు. గయలో నుండగా మా నాయనగారికి ఒక కల వచ్చినది. రఘువీరుడు ఆ కలలో కనబడి "నీ కుమారుడనై జన్మింతును" అని మా నాయన గారితో చెప్పినాడు.

ఈ దేహమున నుండునది దేవుడే. ఎంతటి కామినీకాంచన వైరాగ్యము! నా యంతట నేను దీనిని సాధింప గలిగి యుందునా? కామినీ సంశ్లేషమును నేను కలలో నైనను అనుభవించినది లేదు.

వేదాంతమును నా కుపదేశించిన గురువు నగ్నుడు (తోతా పురి). మూడుదినములలో నాకు సమాధి దశ కలిగినది. గురు వింద లీగ క్రింద నాకు కలిగిన సమాధిని గుర్తించి ఆయన ఆశ్చర్య చకితుడై, "హారా! ఏమిది!" అని అఱచెను. తరువాత నా దేహములో నుండున దెవ రైనదియు ఆయనకు తెలిసిపోయినది. ఆయన నాతో "అనుమతింపుము. నేను పోయెదను" అనెను. తోతాపురి ఇట్లనగనే నా కొక పరవశదశ కలిగినది. అప్పుడు నేను "వేదాంత పరమార్థమును నేను సాక్షాత్కరించుకొనువఱకును మీ రిట నుండి పో లేరు" అంటిని.

రాత్రింబవళ్లు నేను ఆయనతో నుంటిని. వేదాంత ప్రసంగము తప్ప మాకు మ ఱొకటి లేదు. "వేదాంతోపదేశమును

వినకుము. అది నీ దైవభక్తిని చెడగొట్టును'' అని భైరవిబ్రాహ్మణి నాతో చెప్పుచుండెడిది.

నేను లోకమాతను ప్రార్థించితిని— ''అమ్మా, దయచేసి నాకు సంపన్ను నొకని అనుగ్రహింపుము. అనుగ్రహింప వేని ఈ దేహమును ఎవరు కాపాడ గలరు? నాయొద్ద నుండు భక్తులను, సాధువులను నే నెట్లు పోషింపగలను?'' అట్లు నేను ప్రార్థించినందు వలననే పదునాలు గేండ్లు పాటు నా యక్కఱలను తీర్చుటకు మధుర్ బాబు లభించినాడు.

నాలోపల వసించు వేల్పు, భక్తులలో ఏ యే వర్గీయులు నాయొద్దకు వత్తురో ముందుగనే నాకు తెలుపుచుండును. దివ్యదర్శనములో గౌరాంగు డగపడెనా, గౌరాంగ భక్తులు రానున్నా రనుటకు అదె సూచన. దివ్యదర్శనములో కాళి యగపడెనా, నా యొద్దకు శాక్తులు రానున్నా రనుటకు అదే సూచన.

సాయంపూజా వేళలలో మధుర్ బాబు వసించు మేడ పై యంతస్తున కెక్కి నేను ''ఓహోయ్! మీ రందఱును ఎచ్చట నున్నారు? రండు నా యొద్దకు'' అని ఆక్రందించెడివాడను. వా రందఱును ఒక్కొక్కరుగ ఇచ్చట సమావేశమై రనుట మీకు ప్రత్యక్షమే గదా!

జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము అనెడి సాధనాప్రకారముల నన్నింటిని నే నభ్యసించితిని. ఆయుర్వృద్ధికై హఠయోగాభ్యాసమును కూడ సాగించితిని. నా దేహములో మఱి యొక పురుషుడు వసించి యున్నాడు. లేకున్న సమాధిదశ నందిన పిమ్మట దైవప్రేమ ననుభవించుటకు గాని భక్తగోష్ఠిలో నుండుటకు గాని సాధ్యమై యుండెడిదా? ''సమాధిదశ నొంది వెను దిరిగిన సాధకుని నే నింతవఱ కెన్నడును చూచినది లేదు. మీరు సాక్షాత్ గురు నానక్ గారే'' అని కోర్సింగు నాతో చెప్పుచుండెడివాడు.

ఐహికుల మధ్యనే నేను జీవితము గడపుచున్నాను. నాకన్ని వైపులను కామినీకాంచనములే కనిపించుచుండును. అయినప్పటికిని నా మనోదశ యేమో ఇదే—అవిచ్ఛిన్న భావ దశ – సమాధిదశ. నా పరవశదశను చూచి ప్రతాప్‌చంద్ర మజుందారు, "ఔరా! ఇతని నొక దయ్యము పట్టిన ట్లున్నదే!" అని చెప్పినాడు. అందులకును కారణ మిదే. శ్రీరామకృష్ణుని యద్వితీ యానుభవ కథామృత మును గ్రోలుచున్న రాఖాలు మహేంద్రాదులు నోరాడని దశలో నుండిరి.

కాని ఈ మాటల యర్థము మహిమచరణునకు బోధపడినదా? ఈ మాటలను విన్న తరువాత గూడ అతడు "పూర్వజన్మసుకృతము చేతనే మీ కిట్టి యనుభవములు కలిగినవి" అని గురుదేవునితో అన్నాడు. శ్రీరామకృష్ణు డనగా నొక సాధువో, భగవద్భక్తుడో అనియే ఇప్పటికిని మహిముని యభిప్రాయము. శ్రీరామకృష్ణుడు మహిముని మాటలకు ఔ నని తల యూపి, "ఔను పూర్వకర్మ ఫలి తమే. దేవుడు పెక్కు భవనము లున్న సంపన్నుని వంటి వాడు, ఆయన కొలు వుండు కూటములలో (తన్ను చూపుకొనుచు) ఇది యొకటి. భక్తుడే భగవంతుని కొలువుకూటము.

నాడు కృష్ణచతుర్దశి. అప్పటికి నడు రేయి దాటి ఒంటి గంట అయినది. ఎటు చూచినను కటిక చీకటి ఆవరించి యుండెను. ఒక రిద్దఱు భక్తులు గంగ గట్టు గచ్చు నేలపై పచారు చేయుచుండిరి. శ్రీరామకృష్ణుడు మేలుకొనియే యుండెను. ఆయన బయటికి వచ్చి భక్తులతో "ఈ అర్ధరాత్రి వేళలో అనాహతశబ్దము విన నగు నని నాకు నబ్బుడు తెలిపి యుండెను" అనెను.

వేగుజా మప్పటికి గురుదేవుని గదిలో నేలపై మహేంద్ర మహిమచరణులు పరుండియే యుండిరి. రాఖాలు మడతమంచముపై నిద్రించెను. శ్రీరామకృష్ణుడు దిగంబరుడై ఐదేండ్ల శిశువువలె అప్పు డప్పుడు గదిలో ఇటు నటు పచారు చేయుచుండెను.

1885 వ సంవత్సరము ఆగస్టు తే 28 ది శుక్రవారము. తెల్ల వాఱినది. శ్రీరామకృష్ణుడు నిద్ర లేచి లోకమాతను ధ్యానించు చుండెను. ఆయన శరీరము అస్వస్థముగ నున్నందున ఆయన చేయు దేవీ నామ గానామృతమును విను భాగ్యము భక్తులకు లేకుండెను.

శ్రీరామకృష్ణుడు చిన్నిమంచముపై గూర్చుండెను. ఆయన మహేంద్రుని "సరి, నాకీ వ్యాధి వచ్చుటకు కారణ మేమి?" అని అడిగెను.

మహేంద్రుడు:—అన్ని విషయములలోను మీరు లోకులను పోలి యుండనిచో వారికి మిమ్ము సమీపించు ధైర్యమే యుండదు. అయినను ఇంత వ్యాధిదశలో కూడ దేవుని తప్ప వేఱొక విషయము నెఱుంగని మిమ్ము చూచి ప్రజ లబ్బురపడుచున్నారు.

గురుదేవుడు:— (చిఱు నవ్వుతో) "మీకు సైతము వ్యాధి వచ్చునేని, ఇక మాకు వచ్చినపుడు మే మాశ్చర్యపడ వలసినది లేదు" అని బలరాముడుకూడ చెప్పినాడు. బ్రహ్మము సైతము పంచభూతముల వలలో తగుల్కొని యేడ్చును.

మహేంద్రుడు:— తన భక్తుల కష్టములను చూచి జీససు క్రైస్తుకూడ మామూలు మానవునివలె ఏడ్చినాడు.

గురుదేవుడు:—ఆయన ఏలాగు విలపించినాడు?

మహేంద్రుడు:—మేరీ యనియు, మార్తా అనియు అక్కచెల్లెండ్రుండిరి. వారి సోదరుడు లాజరస్. ముగ్గురును జీససుభక్తులే. లాజరసు మరణించినాడు. వారియింటికి పోవుటకై జీససు బయలుదేఱినాడు. అక్కచెల్లెండ్రలో నొకతె, మేరీ, ఆయనను కలసికొనుటకై పరుగున పోయెను. ఆయన యడుగులపై వ్రాలి ఏడ్చుచు, "దేవా, తా మిచ్చట ఉండి యుండిన నా సోదరుడు మరణించి యుండడు" అనెను. ఆమె ఏడ్పును చూచి జీససును ఏడ్చినాడు.

వెంటనే జీసను, లాజరసు నుంచి యున్న సమాధియొద్దకు పోయి పేరు పెట్టి అతనిని పిలిచెను. తత్క్షణమే లాజరసు బ్రతికి సమాధినుండి వెలువడెను.

గురుదేవుడు:—అట్టి పనులను నేను చేయ లేనే.

మహేంద్రుడు:—చేయుదమని మీ రనుకో లేదు. కావున చేయ లేదు. ఇవి అద్భుతములు. ఇవి ప్రజల దృష్టిని దేహముల వంకకు మరల్చును. అచ్చపు భక్తి వారి తలంపులోనికి రాదు. కావున వానిలో మీ కభిరుచి లేదు. కావుననే మీ రట్టి అద్భుతములను చేయరు. చేయకపోయినను జీసస్క్రైస్తునకును మీకును పెక్కుపోలిక లున్నవి.

గురుదేవుడు:— (చిఱునవ్వు నవ్వుచు) ఇంకను ఏ మేమి పోలికలు ?

మహేంద్రుడు:—మీరు మీ భక్తులను ఉపవసింపు డని గాని ఇతర నియమనిష్ఠల నభ్యసింపు డని గాని కోరరు. ఆహారవిషయమున కూడ మీరు గట్టి కట్టుదిట్టములను చేయరు. క్రైస్తు శిష్యులు విరామ దినము (శాబత్) ను పాటింప రైరట. అందుకై వారిని ఫార్సీలు నిందించిరి. అందులకు జీసను "వారు నాడు ప స్తుండక మంచిపనియే చేసినారు. పెండ్లికొడుకుతో నున్నంతవఱకును వారు వినోదములలో తేలుచునే యుండవలెను.

గురుదేవుడు :—అనగా అర్థ మేమి ?

మహేంద్రుడు :—శిష్యులు భగవ దవతారమూర్తితో కలసి యున్నంత వఱకును వినోదములలో తేలుచుండవలె నని క్రైస్తు నభిప్రాయము. వారికి దుఃఖ మెందులకు? దేవుడు దివ్యధామమునకు మరలిన పిమ్మట అప్పుడు శిష్యులకు దుఃఖ కాలమును, కష్టకాలమును వచ్చును.

గురుదేవుడు :—(చిఱునవ్వుతో) నాకును క్రైస్తునకును వేఱే దైన పోలిక నీ కగపడినదా ?

మహేంద్రుడు :—స్వామీ, అగపడినది. శిశువులకు కామినీ కాంచన స్పర్శ యుండదు. పెద్దలు బోధించినది వారు జీర్ణించికొన గలిగి యుందురు. పాలకు క్రొత్తకుండవలె, ఉపదేశములుగొనుటకు బాల్యదశ. పెరుగంటిన కుండలో పాలు పోసితి మేని అది పులిసి పోవును.'' ఇవి మీ సూక్తులు, క్రైస్తును ఇట్లే మాటాడెడివాడు.

గురుదేవుడు :—ఆయ నేమి చెప్పినాడు ?

మహేంద్రుడు :—క్రొత్త సారాయిని ప్రాతబుడ్డిలో నుంచిన బుడ్డి విఱిగి పో వచ్చు నట. ప్రాతగుడ్డకు క్రొత్తగుడ్డను అతుకు వేసి కుట్టిన ప్రాతగుడ్డ చినిగి పోవు నట.

నేనును లోకజననియు నొక్కరమే. అని మీరు మాకు చెప్పుచుందురు. అలాగే క్రైస్తును 'నేనును, నా తండ్రియు నొక్కరమే (ఐ అండ్ మై ఫాదర్ ఆర్ వన్)' అని చెప్పియున్నాడు.

గురుదేవుడు :—(చిఱునవ్వుతో) ఇంకను చెప్పుము.

మహేంద్రుడు :—''ఆర్తతో భగవంతు నాహ్వానింతు వేని ఆయన నీ పిలుపును విని తీఱును''. అని మీరు మాకు చెప్పుచుందురు. (తలుపు) తట్టుము. అది నీకై తెఱవబడును. (నాక్ అండ్ ఇట్ షల్ బి ఓపెన్డ్ అంటు యు) — అని క్రైస్తు చెప్పియున్నాడు.

గురుదేవుడు :—మఱి దేవుడు మరల నవతరించె నేని అది అంశాంశావతారమా, అంశావతారమా, పరిపూర్ణావతారమా ? పరిపూర్ణావతార మని కొందఱు చెప్పుదురు.

మహేంద్రుడు :—స్వామీ, అంశాంశావతారము, అంశావతారము, పరిపూర్ణావతారము అను మాటల అర్థము నాకు పూర్తిగ తెలియదు. కాని గోడలోని రంధ్రమును నిదర్శనముగ చూపి మీరు కావించిన వివరణము నా కర్థ మైనది.

గురుదేవుడు :—ఏ మర్థ మైనదో చెప్పుము.

మహేంద్రుడు :—గోడలో గుండ్రని రంధ్ర మొకటియున్నది. చూచువానికి గోడ కావల నున్న మైదానములో నొక భాగము ఆ రంధ్రముగుండ అగపడును. అదే విధముగ భగవంతుని అపరిచ్ఛిన్న తత్వములో నొక భాగము మీగుండ కనిపించెను.

గురుదేవుడు :—ఔను. మైదానములో అయి దాటు మైళ్ల వఱకును నీవు ఒక్కసారి చూడ గలవు.

మహేంద్రుడు గురుదేవునకు ప్రణమిల్లి వీడ్కొనెను. శ్రీరామకృష్ణుడు ప్రేమతో "రేపు ప్రొద్దున పెందలకడనే రమ్ము. వానకాలములో ప్రొద్దెక్కిన మీదట ఎండ ఆరోగ్యమునకు చెఱుపు" అని అతనితో ననెను.

1885-వ సంవత్సరము సెప్టెంబరు తే 1 ది మంగళవారము.

శ్రీరామకృష్ణుడు స్నానము చేయ బోవు చుండెను. ఆయన గదికి దక్షిణమున ఉన్న వసారలో ఒక భక్తుడు ఆయన మేనికి నూనె పట్టించుచుండెను. మహేంద్రుడు గంగలో తన స్నానమును నిర్వర్తించి ఇచటికి వచ్చి గురుదేవునకు ప్రణమిల్లెను.

స్నానానంతరము శ్రీరామకృష్ణుడు ఒక తువాలాను చుట్టుకొని, కేలోడ్చి, గుడులలో వేంచేసియున్న వేల్పులకు దూరము నుండియే మ్రొక్కెను. అస్వస్థతచే ఆయన గుడులకు పోలేకుండెను.

అది పవిత్రమైన జన్మాష్టమి, శ్రీకృష్ణుని జయంతి. రాము మున్నగు భక్తులు శ్రీరామకృష్ణునకై క్రొత్తబట్టలను తెచ్చిరి. వానిని ధరించి ఆయన ప్రేక్షకుల మనముల ఆకర్షించుచుండెను. ఆయన వేల్పుల కెల్ల మరల నొకసారి నమస్కరించెను.

అప్పటికి ప్రొద్దున పదునొకండు గంట లైనవి. కలకత్తా నుండి భక్తులు క్రమక్రమమున చేరజాలుచుండిరి. బలరామును, నరేంద్రుడును, చిన నరేంద్రుడును, నవగోపాలును, కాటోవానుండి

యొక వైష్ణవుడును వచ్చిరి. రాఖాలును, లాటును శ్రీరామకృష్ణు నితో గూడనే ఉండిరి. కొన్నాళ్లుగా పంజాబి సాధు వొకడు పంచ వటిలో నుండెను. అతడు తోటలోని కాలిబాటలో నడచిపోవు చుండెను. శ్రీరామకృష్ణుడు అతనిని గూర్చి "అతనిది జ్ఞానివైఖరి. నా దృష్టికి అతడు ఎండుకట్టెను బోలిన వాడు. నాచేత అతడు ఆకృష్టుడు కాడు" అనెను.

గురుదేవుడును భక్తులును ఆయన గదికి మరల వచ్చిరి.

వైష్ణవుడు :—స్వామీ, మానవునకు పునర్జన్మము ఉన్నదా?

గురుదేవుడు :—మరణకాలమున మానవునిలో ఏ ప్రవణతలు ఉండునో వానితోనే అతడు పునర్జన్మము గాంచు నని భగవద్గీత చెప్పుచున్నది. భరతచక్రవర్తి మరణకాలమున హరిణమును స్మరించుచునుండి మఱుజన్మమున హరిణముగ బుట్టెను.

వైష్ణవుడు :—ప్రత్యక్షముగ జూచిన వాడు ఎవడేని చెప్పి ననే పునర్జన్మలను నేను నమ్మ గలిగి యుందును.

గురుదేవుడు :—అందుంగూర్చి నే నెఱుగను, మిత్రమా, నా వ్యాధినే నేను నయము చేసికోలే కుండగా, మరణానంతరము ఏమి సంభవించునో నన్ను చెప్ప మనుచున్నావే!

నీ ప్రసంగము నీవు అల్పమతివనియే తెలుపుచున్నది. భగవ త్ప్రేమను అలవఱచుకొన యత్నింపుము. దివ్యప్రేమను బడయుటకే నీకు ఈ మానవజన్మ. నీవు మామిడిపండ్లను తినుటకై తోటకు వచ్చితివి. తోటలో కొమ్మలు ఎన్ని వేలున్నవో, ఆకులు ఎన్ని లక్షలున్నవో, తెలిసికొనుట ఎందులకు? చచ్చిన పిమ్మట ఏ మౌనో అని వెత నొందుటయా? ఎంత అవివేకము!

గిరీశఘోషు ఒక రిద్దఱు మిత్రులతో బండిలో వచ్చి దిగెను. అతడు మద్యము త్రాగి కైపులో ఉండెను. గదికి వచ్చు చున్నప్పుడే అతడు ఏడ్చు చుండెను. శ్రీరామకృష్ణుని చరణ ములపై తన శిరము నుంచి నప్పుడు కూడ అత డేడ్చుచునే ఉండెను.

శ్రీరామకృష్ణుడు అనురాగముతో అతని వీపున తట్టి "ఇతనికి పాగ ద్రాగను కావలసినవానిని తెచ్చి యి"మ్మని యొక భక్తుని నియోగించెను.

గిరీశుడు మో మెత్తి ముకుళితహస్తుడై "నీవే అఖండ బ్రహ్మమవు: అట్లు కా దేని అన్నియు అసత్యములే.

అయ్యో, మీకు నేను ఎట్టి సేవను గాని చేయ లేకున్నానే. ఎంత శోచనీయ మైన విషయము" అనెను. ఈ మాట లన్నప్పటి యతని ప్రేమ ఎంత ఉత్కటముగ ఉండెను! ఆ ప్రేమ భక్తులకు పెక్కండ్రకు కన్నీరు కార్పించెను.

గిరీశుడు ఇంకను ఇట్లనెను — "దేవా, ఒక సంవత్సర కాలము నీకు నేను సేవ చేయుచుండునట్లు నాకు వర మిమ్ము. మోక్ష మెవరికి లక్ష్యము? అది ఎవని కైనను ఎక్కడ నైనను సులభమే. మోక్ష మన్న నేను ఉమ్మి వేయుదును. ఒక సంవత్సర కాలము నా సేవను అంగీకరింతు నని దయచేసి మాట యిండు.

గురుదేవుడు :—ఇచ్చట చుట్టు నున్న జనులు మంచివారు కారు. ఒక కొందఱు నిన్ను దూషించినను దూషింతురు.

గిరీశుడు :—దూషింపనిండు. అది నా కొక లెక్క కాదు. దయచేసి మాట యిండు.

గురుదేవుడు :—సరే, మీ యింటికి నేను వచ్చినప్పుడు నీవు నాకు పరిచర్య చేయ వచ్చును.

గిరీశుడు :—కాదు. అది కాదు. మీకు నేను సేవను ఇక్కడ చేయ వలె నని నా కోరిక.

గిరీశుడు మొండిపట్టు పట్టెను. గురుదేవుడు "సరే, అది భగవదిచ్ఛాధీనము" అనెను.

గురుదేవుని కంఠవ్రణము నుద్దేశించి, "అది నయ మగు గాక అని దయచేసి చెప్పుడు, సరే, నేనే దానిని దూరముగ తరిమి వేసెదను. కాళీ! కాళీ!" అని అఱచెను.

గురుదేవుడు:—నీవు నాకు బాధ గలిగింతువు.

గిరీశుడు:—ఓ కంఠమా, వ్యాధిరహితమవు కమ్ము (అనుచు మాంత్రికునివలె మెడపై ఊదును). ఇప్పుడు బాగైతిరి కదూ, ఇప్పటికి కాకున్నను, మీచరణములందు నాకు ఏ మాత్ర మైన భక్తి యుండు నేని, తప్పక బాగవుదురు. నయ మైన దని చెప్పుడు.

గురుదేవుడు:—[చులుకుగా] నన్ను విడువుము. ఆ మాటలను నేను అన లేను. నా వ్యాధిని నయ మొనర్పు మని లోకమాతను నేను ప్రార్థింప లేను.

సరి, దేవుడు సంకల్పించు నేని నా వ్యాధి నిర్మూలించును.

గిరీశుడు:— మీరు నన్ను మోసగింప జూచుచున్నారు. అంతయు ఆధారపడియుండునది మీ సంకల్పముపై నే.

గురుదేవుడు:—సిగ్గుచేటు! ఇక ఎప్పుడును అట్లు అనకుము. కృష్ణభక్తుడ నని నే ననుకొనుచుందు నే కాని కృష్ణుడ నే అని అనుకొనను. నీకు ఇచ్ఛవచ్చినట్లు నీవు భావింప వచ్చును. నీవు నీ గురువును దైవముగా భావింప వచ్చును కాని, ఇప్పుడు నీవు మాటాడు చున్న రీతిగా మాటాడుట తప్పు. ఇక ఎప్పుడును నీవు ఆలాగు మాటాడ కూడదు.

గిరీశుడు:— వ్యాధిని నయము చేసికొందు నని దయచేసి చెప్పుడు.

గురుదేవుడు:—చెప్పిన నీవు సంతసింతు వేని, ఆలాగే కానీ.

గిరీశునకు సారాయిమత్తు ఇంకను ఉండెను. నడుమ నడుమ నతడు శ్రీరామకృష్ణునితో—"సరి, స్వామీ, ఈ తూరి మీ దివ్య సౌందర్యముతో మీరు ఏల అవతరింప రైతిరి?" అను చుండెను.

కొన్ని నిమిషములకు పిదప అతడు "తెలిసినది, ఈ సారి మోక్షము వంగదేశమునకు" అనెను.

"వంగదేశమునకు మాత్రమే అన నేల? విశ్వమున కంతటికి నే మోక్షము" అని యొకభక్తుడు తనలో తాను అనుకొనెను.

భక్తులకు అభిముఖుడై గిరీశు డిట్లనెను: "ఈయన ఇచట ఏల అవతరించినాడో మీలో ఎవరికైనను తెలిసినదా? మానవులకు మోక్షము నిచ్చుటకే అవతరించియున్నాడు. వారి దుఃస్థితిని గాంచి మనసు కరగి ఈయన మానవరూపమును దాల్చినాడు".

బండివాడు గిరీశుని పిలుచుచుండెను. గిరీశుడు లేచి బండివాడున్న యెడకు బోదొడంగెను. గురుదేవుడు "అతనిపై కన్నుంపుము. ఎక్కడికి పోవుచున్నాడు? బండివానిని కొట్టుటకు కాదేని, ఫరవా లేదని నా తలంపు" అని మహేంద్రునితో చెప్పెను. మహేంద్రుడు గిరీశుని వెంబడి నేగెను.

తత్క్షణమే గిరీశుడు మరలి వచ్చెను. అతడు శ్రీరామకృష్ణుని ప్రార్థించి "దేవా, పాపచింత జాడగానైన లేకుండు నంతటి పవిత్రతను నాకు ప్రసాదింపుము" అనెను.

గురుదేవుడు:—నీలో పవిత్రత ఉండనే ఉన్నది. ఇంతటి భక్తివిశ్వాసములును నీకున్నవి. నీవు ఇప్పుడు ఉండునది ఆనంద దశలో; కాదా?

గిరీశుడు:—కాదు స్వామీ, నాస్థితి దుఃస్థితి అని నాకు అనిపించుచున్నది. నాకు మనోవ్యథ లున్నవి. నేను ఇంత మిక్కుటముగ మద్యమును త్రాగుటకు అదే కారణము.

కొన్ని నిమిషములకు తర్వాత గిరీశుడు "దేవా, పరిపూర్ణ బ్రహ్మస్వరూపుని పరిచరించు భాగ్యము నాకు, నాకు సైతము, కలుగుటను చూడగా ఆశ్చర్యము కలుగుచున్నది. దీనిని పడయగాంచుటకు నేను ఏమి తపస్సు చేసితినో?" అనెను.

శ్రీరామకృష్ణునకు మధ్యాహ్నభోజనము ఐనది. ఆరోగ్యము బాగు లేనందున ఆయన చాల తక్కువగ భుజించినాడు.

భగవ దనుభవ మనెడి యుచ్చస్థాయి నందుకొను ప్రావణ్యము శ్రీరామకృష్ణుని మనసునకు సహజమైనది. ఆ మనసును బలాత్కరించి దానికి ఆయన దేహస్మృతిని గలిగించుచుండును. కాని

శిశువువంటి వాడు కావున ఆయన తన మేనును స్వాయముగ చూచుకో లేకుండెను. శిశువువలెనే, ఆయన భక్తులతో "చాల కొంచెముగనే భుజించితిని, ఇక విశ్రమింతును, మీరు కొంచెము సేపు బయటికి పొండి" అని చెప్పెను. కొన్ని నిమిషముల పాటు శ్రీరామకృష్ణుడు విశ్రమించెను. పిమ్మట భక్తులు గదిలోనికి వచ్చిరి.

కాటోవానుండి వచ్చిన వైష్ణవుడు వాదించుచుండెను.

గురుదేవుడు :— (వైష్ణవునితో) ఈ కుత కుత చప్పుడును మానుము. నీరు కలసిన వెన్నను నిప్పుపై నుంచి కాచిన, ఇట్టి చప్పుడు వచ్చును. ఎవడు భగవదనుభవానందమును ఒక్కసారి రుచి చూచునో, అతనియొద్దనుండి 'వాదించుకుతూహలము' ఎగిరి పోవును. గ్రంథములను ఉదాహరించిన ఏమి లాభము? పండితులు శ్లోకాలను వల్లింతురే కాని, ఇక నేమియు చేయరు?

శ్రీ రామకృష్ణుని పరీక్షించుటకు డాక్టరు రాఖాలు వచ్చెను. శ్రీరామకృష్ణుడు ఆత్రముతో "లోనికి రండి, వచ్చి కూర్చుండుడు" అని ఆయనతో ననెను.

వైష్ణవునితోడి సంభాషణ జరుగుచునే యుండెను.

గురుదేవుడు:—ఉదాత్తతయు జాగరూకతయు మానవునకు తప్పక ఉండ వలెను. ఎవనిలో జ్ఞానప్రబోధము కలిగినదో, అతనికి ఈ ఉదాత్తతాజాగరూకత లుండును. అట్టి మానవుడే మానవుడు. జ్ఞానప్రబోధము లేకున్న మానవ జన్మము వ్యర్థమే.

పసివానివలె శ్రీరామకృష్ణుడు "అయ్యా, నా కంఠరోగమును దయచేసి బాగుపఱుపు" డని వైద్యుని ప్రార్థించెను.

డాక్టరు :— మీకు బాగు చేయు మని నన్ను అడుగు చున్నారా ?

గురుదేవుడు:—వైద్యుడు సాక్షాన్నారాయణుడే. అందఱి యెడను నాకు ఆదరమే.

డాక్టరు శ్రీరామకృష్ణుని కంఠమును పరీక్షింప బోవుచుండెను. అప్పుడు గురుదేవుడు "డాక్టరు మహేంద్రసర్కారు, ఆవు నాలుకను నొక్కినట్లుగా నా నాలుకను నొక్కినాడు" అనెను.

శ్రీరామకృష్ణుడు శిశువు వలె, వైద్యుని చొక్కా చేతులను పట్టుకొని మాటిమాటికిని లాగుచు "అయ్యా, ప్రియ మహాశయా, దయచేసి నా కంఠమును బాగుపఱుపుము" అని ప్రార్థించెను. లారింగోస్కోపును జూచి నవ్వుచు "తెలిసినది. ప్రతిబింబము నీకు దానిలో అగపడును" అనెను.

నరేంద్రుడు పాట పాడెను. కాని గురుదేవుని యస్వస్థతచే, ఎక్కువగ పాడ లేదు.



* కంఠములో మాటలు పుట్టెడు నాళమునకు లారింక్సు అనియు దానిని ప్రతిబింబించు అద్దమునకు లారింగోస్కోపు అనియు ఆంగ్లమున పేర్లు.

## పదియవ ప్రకరణము

# శ్యాంపుకూరులో శ్రీరామకృష్ణుడు

1885 వ సంవత్సరము అక్టోబరు తే 18 ది భానువారము.

వైద్యులు శ్రీరామకృష్ణుని వ్యాధిని మేహవ్రణము (కాన్సరు) అని స్పష్టముగ నిర్ణయించిరి. ఆయన వైద్యమునకు గాని ఉపచారమునకు గాని సరియైన ఏర్పాట్లను చేయుటకు దక్షిణేశ్వరమున సాధ్యపడదు. వైద్యుని అవేక్షణ సదా కావలసి యుండెను. దానిని సమకూర్చ గుడితోటలో శక్యముకాదు. అంతే కాక కలకత్తాలో వసించు భక్తులకు ప్రతిదినమును దక్షిణేశ్వరమునకు వచ్చి ఆయనకు పరిచర్య చేయుట కష్టముగ నుండెను. కావున భక్తులలో పెద్దవారు, కలకత్తా బాగ్‌బాజారులో రెండంతస్తుల చిన్న యింటి నొకదానిని అద్దెకు తీసికొని గురుదేవు నచ్చటికి చేర్చిరి. కాని శ్రీరామకృష్ణున కేమో ఆ చోటు ఇష్టపడనందున ఆయన బలరామునింటికి పోయెను. కొన్నాళ్ళలో కలకత్తా నగరోత్తర భాగమున శ్యాంపుకూరులో నొక క్రొత్త యింటిని ఏర్పాటు చేసికొని గురుదేవు నచ్చటికి చేర్చిరి. డాక్టరు మహేంద్రలాల్ సర్కారుగారి పర్యవేక్షణలో గురుదేవు నుంచిరి, ఈ నూతన భవనమున రెండవ యంతస్తున పెద్ద గదులు రెండును చిన్న గదులు రెండును ఉన్నవి. పెద్దగదులలో నొకటి చూడ వచ్చిన వారు సమావేశ మగుటకును, రెండవది గురుదేవు డుండుటకును ఉపయోగపడు చుండినవి. చిన్న-గదులలో నొకటి భక్తులు నిద్రించుగదిగా నుపయోగపడు చుండినది. రెండవ గది, మాతృశ్రీ అచ్చటికి వచ్చినప్పుడు ఆమె పడకగదిగ నుపయోగపడుచుండినది. మిద్దె వాకిలి యొద్ద మరుగుతోడి చదరమైన చోటొకటి యున్నది. మాతృశ్రీ పగటివేళలలో అచ్చట నుండి గురుదేవుని పథ్యాన్నమును అచ్చటనే వండెడిది.

మధ్యాహ్నము దాటినది. డాక్టర్ సర్కారు వచ్చెను. ఆయనతో ఆయన కుమారుడు అమృతుడును హేమును ఉండిరి. నరేంద్రాది భక్తులును అచ్చట నుండిరి.

శ్రీరామకృష్ణుడు అమృతునితో రహస్యముగ మాటాడు చుండెను. "ధ్యానము చేయు వాడుక నీకున్నదా?" అని ఆయన అతని నడిగెను. ఇంకను ఇట్లు చెప్పెను. ధ్యానసమయములో ధ్యానము చేయుచున్నవానికి ఎట్లుండునో నీ వెఱుగుదువా? చిత్తము అవిచ్ఛిన్నమైన తైలధారను బోలి యుండును. దానికి లక్ష్య మొక్కడే, ఎవ రనగా దేవుడే. వే ఱొకదాని తలంపు దానికి లేదు.

శ్రీరామకృష్ణుడు భక్తులతో సంభాషించుచుండెను.

గురుదేవుడు :— (డాక్టరుతో) భగవదవతారములందు నీ కుమారునకు నమ్మకము లేదు. అది సరే. అందులో అతనికి నమ్మకము లేక పోయినందువలన నష్టమేమియు లేదు.

నీ కుమారుడు మంచి పిల్లవాడు. మంచిపిల్లవాడుగ ఎందుల కుండ గూడదు? మేలైన బొంబాయిజాతి మామిడిచెట్టున పుల్లని పండ్లు పుట్టునా? దేవునందు అతని నమ్మకము ఔరా ఎంత దృఢమైనది! ఎవని మనస్సు దేవునందుండునో ఆ మానవుడే యథార్థ మానవుడు. ఎవనికి జ్ఞానప్రబోధము కలిగినదో, బ్రహ్మ మొక్కటే తథ్యము, తక్కిన దెల్ల మిథ్య—అను దృఢాధ్యవసాయము ఎవనికి కలదో, వా డొక్కడే మానవుడు. దేవు నవతారములందు నీ కుమారునకు నమ్మకము లేదు. లేకున్న నేమి? దేవు డున్నా డనియు సకల ప్రాణులతో కూడిన ఈ విశ్వ మంతయు భగవచ్ఛక్తియొక్క ఆవిష్కారమే అనియు నమ్మక ముండిన చాలును. ఒక సంపన్నుని పోలినవాడు దేవుడు. సంపన్నుని తోటవంటిది ఈ జగము.

దివ్యావతారముల సంఖ్య పది అని కొందఱందురు. ఇరువది నాలుగు అని కొందఱు చెప్పుదురు. అవతారములు అసంఖ్యాకము లని మఱి కొందఱు చెప్పుదురు. దైవశక్తి విలక్షణముగ రూపుదాల్చి

ఎచట నైన నీ కగపడు నేని అచ్చట దేవుడు స్వయముగ అవతరించి యున్నా డని నీవు తెలిసికో వచ్చును. ఇది నా అభిప్రాయము.

వే ఱొక మతము కూడ కలదు. దాని ప్రకారము మన కగ పడుచున్న దెల్ల దేవుడే. అపరిచ్ఛిన్న తత్త్వము (ఆబ్ సల్యూట్) నకు వ్యావహారిక (రిలేటివ్) రూపమును కలదు. వ్యావహారికమైన దానికి అపరిచ్ఛిన్న రూపమును కలదు. అపరిచ్ఛిన్న తత్త్వము నటుంచి వ్యావహారికమును మాత్రమే ప్రత్యేకించి నీవు అర్థము చేసికో లేవు. వ్యావహారికమనునది ఒకటి యున్నందుననే మెట్టు మెట్టుగ నీవు దాని నతిక్రమించి అపరిచ్ఛిన్నతత్త్వమును చేరగలుగుచున్నావు. ''నేను'' అనెడి తలంపు ఉన్నంత వఱకును మానవుడు వ్యావహారిక స్థాయిని దాటిపో లేడు.

డాక్టర్:—ఔను. ముమ్మాటికిని నిజము.

దేవుడు మానవుల సృజించె ననియు. ఒక్కొక్క ఆత్మయు అనంతముగ వృద్ధినొందునట్లు దేవుడే నిర్ణయించె ననియు, డాక్టరు సర్కారుగారి అభిప్రాయము. మానవులలో ఎక్కువతక్కువ లున్న వను నమ్మక మాయనకు లేదు. భగవదవతార సిద్ధాంతమున అతనికి నమ్మకము లేకపోవుటకును అదే కారణము.

డాక్టరు:—అనంత మైన వృద్ధిని పొంద వచ్చు ననుట నా నమ్మకము. అట్లు పొందరా కున్న లోకములో అయిదా ఱేండ్లు బ్రతికినంతమాత్రమున ఏమి లాభము? అంత కన్న నేను పగ్గముతో మెడకు ఉరి వేసి కొని చత్తును.

అవతార మట! అది యేమి? మలవిసర్జనము చేయు నొక వ్యక్తి ఎదుట ప్రణమిల్లుటయా! అది పొసగదు, భగవజ్జ్యోతికి ప్రతిబింబమే మానవుడు అని అందు చేని ఆ మాట నేను ఒప్పుకొందును.

గిరీశుడు:— (చిఱునవ్వుతో) నీవు భగవజ్జ్యోతిని చూచిన వాడవు కావే.

బదులు చెప్పుటకు డాక్టరు సర్కారు సంకోచించుచుండెను.

సమీపమున కూర్చున్న మిత్రు డొకడు అతని చెవిలో ఏమో గుస గుస మనెను.

డాక్టరు:—(గిరీశునితో) నీవును ప్రతిబింబమునే తప్ప వేఱు దేనినిగాని చూచిన వాడవు గావు.

గిరీశుడు:—నేను చూచుచున్నాను, జ్యోతిని కనుచున్నాను. శ్రీకృష్ణుడు దేవు నవతారమని నేను రుజువు చేసెదను. చేయ లేక పోయిన నా నాలుకను కోసి కొందును.

గురుదేవుడు:—ఈ ప్రసంగ మంతయు వ్యర్థము. జన్నిలో నున్న రోగి పలుకు ప్రలాపములను పోలినవి, జన్నిలో నున్న రోగి "చెఱువులో నున్న నీ రంతయు నేను త్రాగెదను. తపెలలో నున్న అన్నమును పూర్తిగ నేనే తిందును" అని ఈ రీతిగ మాటాడు చుండును. ఆ రోగితో వైద్యుడు "అలాగే, అలాగే, అవి యన్నియు నీకు ఉన్నవి. రోగము నిర్మూలించిన పిమ్మట నీవు కోరిన దాని నెల్ల మేము తెచ్చి పెట్టెదము" అని చెప్పి ఊరడించును. పరిపూర్ణజ్ఞానమునకు కొన్ని లక్షణములు గలవు. అం దొకటి తర్కము ఆగి పోవుట.

డాక్టరు :—మఱి పరిపూర్ణ జ్ఞానము ఒకనికి శాశ్వతముగ నిలుచునా? సర్వమును దేవుడే అని మీ రనుచున్నారు. మఱి మీరు ఈ పరమహంస వృత్తిని ఏల అవలంబించితిరి ? ఈ ప్రజ లందఱును మీ కేల పరిచర్యలు చేయుచున్నారు? మీ రేల మౌనముగ నుండరు ?

గురుదేవుడు:—(చిఱునవ్వునవ్వుచు) కదలినను కదలకున్నను, కెరటములు పోటెక్కినను నీరు నీరే.

శుద్ధచిత్తముగను, శుద్ధబుద్ధిగను, మనలో నుండునది దేవుడే, నేను యంత్రమను, యంత్రచాలకుడు ఆయన, నేను గృహామను, గృహాస్థు ఆయన.

డాక్టరు:—ఒక్క ప్రశ్న అడుగుదునా? మీ వ్యాధిని నన్ను బాగుచేయు మందురే, ఎందులకు?

గురుదేవుడు:—అహంకార మనెడి కుండ నా తలంపులో నున్నంత వఱకు నే నాలాగు మాటాడు చుందును. అన్ని వైపుల నీరు నిండిన ఒక మహాసముద్రమును తలంపునకు తెచ్చుకొనుము. ఒక కుండను అందులో ముంచిపెట్టితిని. అప్పుడు నీరు కుండకు వెలుపలను లోపలను కూడ నుండును. మఱి కుండ పగిలిననే గాని, లోపలను వెలుపలను ఉన్న నీరు ఒక్కటి గాదు. నాలో ఈ అహంకారఘటమును పెట్టి యున్న వాడు దేవుడు.

డాక్టరు:—అహంకార మను చున్నారు, ఇంకను ఏ మేమో చెప్పుచున్నారు. మీ మాటల కన్నిటికిని అర్థ మేమి? మీరు తప్పక వివరింప వలెను. దేవుడు మనతో తమాషలు చేయుచున్నా డందురా?

గిరీశుడు:—మహాశయా, దేవుడు తమాషలు చేయుట లే దని మీ కెట్లు తెలియును?

గురుదేవుడు:—మనలో ఈ అహంకారమును ఉంచి యున్న వాడు దేవుడు. ఇ దంతయు ఆయన లీల. ఒక రాజునకు నలువురు కుమారులు. నలువురును రాజపుత్రులే. కాని ఆడుకొనునప్పుడు ఒకడు మంత్రి యగును. వే ఱొకడు పోలీసుఆఫీస రగును. మఱి యొకడు మఱియొకటి యగును. రాజపుత్రుడుగ నుండియు అతడు పోలీసు ఆఫీసరుగ క్రీడించును.

(డాక్టరుతో) వినుము. ఆత్మసాక్షాత్కారము నీకు కలిగి నప్పుడు నా మాటల నిజము స్పష్టపడును. దేవుని ప్రత్యక్షముగ దర్శించిన పిమ్మట సందేహము లన్నియును మాయ మగును.

డాక్టరు:—సందేహములను పూర్తిగ తొలగించుకొనుట ఎన్నటి కేని సాధ్య మగునా?

గురుదేవుడు :—నేను చెప్పినంతవఱకు నా యొద్ద తెలిసికొనుము. ఇంకను తెలిసికొనవలె నను కోరిక నీ కున్నచో ఏకాంతమున దేవుని ప్రార్థింప వలెను. ఇట్టి నిర్ణయముల నేల చేసెనో ఆయన నడుగుము.

డాక్టరు మౌనముగ నుండెను.

గురుదేవుడు :—మఱి నీకు వాద మన్న ప్రీతి. ఈ వేదాంత వాదమును ఇంచుక వినుము. ఐంద్రజాలికు డొకడు తన విద్యను చూపుటకు రాజు నొద్దకు వచ్చెను. ఐంద్రజాలికుడు కొంత దూరము పోయిన పిమ్మట రాజునకు గుఱ్ఱముపై నెక్కి తనయొద్దకే వచ్చుచున్న రౌతు ఒకడు అగపడెను. అతని దుస్తులు ధగధగ మెఱయుచుండెను. అతని చేత వివిధాయుధము లుండినవి. రాజును సదస్యులును తమ కగపడుచున్న వానిలో తథ్యమేదో అని తర్కింపజొచ్చిరి. గుఱ్ఱము తథ్యము కా దనుట స్పష్టమే. దుస్తులును తథ్యములు కావు. వివిధాయుధములును తథ్యములు కావు. తుదకు వారు రౌ తొక్కడే తథ్యము అనుటను నిస్సందేహముగ కనుగొనిరి. ఇందుల గూఢార్థము ఏ మనగా బ్రహ్మ మొకటే తథ్యము. జగత్తు మిథ్య. వివేకించి చూతు వేని ఏదియు మిగులదు.

డాక్టరు :—ఇప్పుడు మీరు చెప్పిన విషయమునకు నాకు ఆక్షేపణ లేదు.

గురుదేవుడు :—మాయను తొలగించుకొనుట సులభ మైన పని గాదు. జ్ఞానము లభించిన పిమ్మట గూడ అది నిల్చి యుండును. ఒకడు కలలో పెద్దపులిని చూచెను. అతనికి మెలకువ వచ్చినంతనే కల మాయ మయ్యెను. కాని గుండెలోని తటతట ఆగ లేదు.

కొందఱు దొంగలు ఒక పొలములోనికి వచ్చిరి. అనుమతి లేక చొచ్చువారిని భయపెట్టుటకై మానవుని బోలిన ఒక గడ్డి బొమ్మ అచట నెలకొల్పబడియున్నది. ఆ బొమ్మను చూచి దొంగలు భయభ్రాంతు లైరి. పొలములో అడు గిడ సాహసింప లేక పోయిరి.

వారిలో నొకడు ఎట్లో దానిని సమీపించి అది గడ్డిబొమ్మయే అని కనుగొనెను. అతడు మరలి వచ్చి తన సఖులతో "మనము భయపడ వలసినది అచ్చట నేమియు లేదు" అని చెప్పెను. కాని వారు, "మేము రాము. మా గుండెలు తటతట కొట్టుకొనుచున్నవి" అన్నారు. అప్పుడు దొంగలలో ఆ ధైర్యశాలి ఆ బొమ్మను నేల పడ గొట్టి "ఏమియు లేదు" అనెను. దీనికే "నేతి నేతి" మార్గ మని పేరు.

డాక్టరు :—ఇప్పుడు మీరు చెప్పిన మాటలు చక్కనివి.

గురుదేవుడు :—(నవ్వుచు) ఎట్టి మాటలు ?

డాక్టరు :—చక్కని మాటలు.

గురుదేవుడు :—అయినచో ఒక "థాంక్ యు"ను ఇమ్ము. (గురుదేవుడు "థాంక్ యు" అను ఇంగ్లీషు మాటలనే చెప్పెను.)

డాక్టరు :—నా మనస్సులో నున్నది మీరు రెఱుగరా? ఇచటికి రా వలె నని మిమ్ము దర్శింప వలె నని నే నెంతో శ్రమపడు చుందును.

శ్రీరామకృష్ణుడు డాక్టరు సర్కారును ఫలాహారము ఆరగింపు మని కోరెను. భక్తులతనికి మధురభక్ష్యము లొసంగిరి.

డాక్టరు :—(తినుచు) ఈ మధురభక్ష్యములకు ఇప్పుడు చెప్పెదను "థాంక్ యు" అని. అంతే కాని మీ యుపదేశములకు కాదు. ఆ "థాంక్ యు"ను నేను మాటలరూపమున ఏల యీయ వలెను.

1885-వ సంవత్సరము. అక్టోబరు తే 22 ది.

అది గురువారము సాయంకాలము. దుర్గాపూజ ముగిసి కొన్నాళ్ళయినది శ్రీరామకృష్ణుడు రెండవ యంతస్తున తన గదిలో పాన్పుపై కూర్చుండి యుండెను. డాక్టరు సర్కారును

ఈశానుడు మున్నగు భక్తులును ఉండిరి. డాక్టరు సర్కారు తీరుబాటు లేని వైద్యుడే అయినను శ్రీరామకృష్ణుని గోష్ఠిలో ఎంతో కాలమును — ఒక్కొక్కప్పుడు ఆరేడుగంటల కాలమును—గడపుచుండెను. గురుదేవునందు అతని ప్రేమ మిక్కుటము. భక్తులను తన బంధువులుగనే చూచుకొనెడి వాడు. గదిలో నొక దీపము వెలుగుచుండెను. బాహ్యలోకమును సమస్తమును వెన్నెల ప్రకాశపఱచుచుండెను.

ఈశానుడు గృహస్థ భక్తులలో నొకడు. అతనితో గురుదేవుడిట్లనెను "భగవచ్చరణారవిందములందు ప్రేమ గలిగి అందులకు అవిరుద్ధముగ లౌకిక విధులను నిర్వర్తించు గృహస్థు భాగ్యశాలి. అతడు నిజముగ నొక వీరుడు. అతడు తన తలపై రెండు మణుగుల బరువును మోయుచునే పెండ్లి యూరేగింపును హెచ్చరికతో చూచు పాంథుని పోలిన వాడు. గొప్ప ఆధ్యాత్మికశక్తి లేకున్న అట్టి జీవితము నెవడును గడప లేడు. అడుసులోనే యుండి అడు సంటని బురదచేపను గూడ అట్టి వానికొక యుపమానముగ చెప్పవచ్చును. అట్టి గృహస్థునకు ఉపమానముగ నీటికోడిని గూడ చెప్పవచ్చును. అది సదా నీటిలో మునిగి యుండును. కాని రెక్కలను ఒక్క సారి విదిలించెనేని తడి జాడ యైనను లేక పోవును. గృహస్థజ్ఞానికి గలుగు సిద్ధికిని సన్న్యాసియగు జ్ఞానికి గలుగు సిద్ధికిని భేద మేమేని కలదా, అని నీ వడుగ వచ్చును. ఇరువురును ఒక్క వర్గమునకు చేరిన వారు అనుటయే నీ ప్రశ్నకు జవాబు. ఇద్దఱును జ్ఞానులే. ఇద్దఱి యనుభవములును సదృశములే. కాని గృహస్థజ్ఞానికి భయకారణము కలదు. కామినీకాంచనముల నడుమ నున్నంత వఱకును అతడు భయమును పూర్తిగా పోగొట్టుకో లేడు! పొగమసి నిండిన గదిలో నీవు సదా యుందు వేని నీకు మసి తప్పక అంటుకొనును. నీ వెంత మెలకువ గలిగి యున్నను ఉందువు గాక, కొంచెముగ నైనను నీకు మసి అంటుకొనియే తీఱును.

బియ్యపు బొరుగులను వేయించునపుడు మూకుడునుండి

కొన్ని బొరుగులు ఎగిరిపడును. వానిలో ఒక్కమరక యైనను లేక అవి మల్లెపూలవలె తెల్లగ నుండును. పెనములో నున్న బొరుగులు ఒక వేళ అప్పుడే వికసించిన మల్లె పూల వలె శుద్ధములుగ నుండక పోయినను, అవికూడ మంచివే. కొంచెము మాసి ఉండును. అట్లే సంసారమును త్యజించిన సన్న్యాసికి దివ్యజ్ఞానము ప్రాప్తించినచో అతడు తెల్లపువ్వువలె నిర్మలుడుగ గన నగును. జ్ఞానప్రాప్తి కనంతరముకూడ నొకడు లోక మనెడి పెనములోనే ఉండునేని అతనికి కొంత కళంకము అంటిన అంట వచ్చును. [అందఱును నవ్వుదురు].

సంసారమున నున్న జ్ఞాని కొకింత కళంకము గలిగినను, అది అతనికి హానికరము కాదు. చంద్రునిలో మచ్చ లున్నవి, ఐనను అవి అతని వెలుగునకు ఆటంకము లగుట లేదు.

డాక్టరు:—ఇంద్రియములను అణచిపెట్టుట చాల కష్టము. అవి మొండికి వేసి ఎదురు తిరుగు గుఱ్ఱముల వంటివి. వాని కన్నులకు గంతలు కట్ట వలెను. కొన్ని గుఱ్ఱాల చూపును పూర్తిగ అడ్డగింప వలసి యుండును.

గురుదేవుడు:—భగవ దనుగ్రహమును ఒక్కసారి పొందిన చాలును, భగవ ద్దర్శనము నొక్కమాఱు పడసిన జాలును, ఆత్మ జ్ఞానము నొకమాఱు ప్రాపించిన చాలును, మానవున కిక ఏ భయమును అక్కఱ లేదు. అరిషడ్వర్గ మతని కెట్టి కీడును జేయలేవు.

నారద ప్రహ్లాదాదులు నిత్యపరిపూర్ణులు. కన్నులకు గంతలను కట్టుకో వలసిన జరూరు వారికి లేక పోయినది. వరిపొలమున బాలుడు తాను తనతండ్రి చేతిని ఊతగా పట్టుకొని సన్నని దూలముపై నడచుచున్నప్పుడు, క్షణము మెలకువ తప్పినను ఆ పట్టు సడల వచ్చును. బాలుడు అగడ్తలో పడ వచ్చును. తండ్రియే కుమారుని చేతిని పట్టుకొను నేని, అప్పుడు అట్లు కానే కాదు. పిల్లవాడు అగడ్తలో పడనే పడడు.

డాక్టరు:—కాని కొడుకు చేతిని నాయన పట్టుకొనుట సమంజసము కాదే.

గురుదేవుడు :— సమంజసము కాదని పూర్తిగా అనలేము. గొప్ప గొప్ప ఋషుల ప్రకృతి శిశుప్రకృతిని బోలియుండును. దేవు నెదుట వారు సదా శిశువులుగనే ఉందురు. వారికి గర్వము లేదు. దేవుని బలమే, తమ తండ్రి బలమే, వారి బలము. తమది అనుకొనుటకు తమకు ఏమియును లేదు అనెడి అధ్యవసాయము వారికి దృఢముగ ఉన్నది.

డాక్టరు:—గుఱ్ఱము కన్నులకు గంతలు కట్టక దానిని ముందునకు నడిపింప సాధ్యమా! ముందుగ కామక్రోధాదుల అణంచుకొనని వాడు దేవుని సాక్షాత్కరించుకో గలడా ?

గురుదేవుడు:— వివేకమార్గము ననుసరించి నీవు చెప్పుచున్నావు. భగవత్ప్రాప్తికి అదియు ఒక మార్గమే. సాధకునకు హృదయవిశుద్ధి ప్రథమావశ్యక మని జ్ఞానులు చెప్పుదురు. ముందుగ నతడు జ్ఞానసాధనల చేయ వలెను, చేసిన పిమ్మట అతనికి జ్ఞానసిద్ధి గలుగును.

కాని భక్తిమార్గమున గూడ భగవంతుని ప్రాపింప వీలగును. భగవచ్చరణారవిందములందు ప్రేమయు భగవన్నామగుణకీర్తనలందు ఆనందమును పెంపొందించుకొన్న భక్తునకు ఇంద్రియనిగ్రహార్థము ప్రత్యేకముగ శ్రమ పడ వలసిన అక్కఱ లేదు. అట్టి భక్తునకు ఇంద్రియములు తమంతట వశపడును.

ఒకనికి కొడుకు ఇప్పుడే మరణించె ననుకొనుము. ఆ తండ్రి పుత్రశోకార్ణవమగ్నుడై యుండును. అట్టి దశలో ఆనాడే అతడు ఒరులతో కలహింప గలడా? మిత్రునింటి విందు భోజనమునకు పో గలడా? ఆ నాడే ఇతరుల యెదుట తన గర్వమును చూపుకొనుటకు గాని, ఇంద్రియసుఖముల ననుభవించుటకు గాని అతనికి సాధ్యపడునా ?

మిడతకు వెలుగు కంట బడు నేని, ఇక అది చీకటిలో నుండ గలదా ?

డాక్టరు:—[చిఱునవ్వుతో] నిజముగ ఉండ లేదు. మంటలో బడి నశింప నురవడించును.

గురుదేవుడు:—కాదు, కాదు, అట్లు కాదు. మిడత మంటలో బడి చచ్చినట్లు, భక్తుడు చావడు. ఏ కాంతి వంకకు అతడు పరుగిడునో, అది రత్న కాంతిం బోనిది, ఉజ్జ్వల మైన కాంతియే, సందేహము లేదు, ఐనను చలువ నిచ్చు గుణమును ఆహ్లాదపఱచు గుణమును ఆ కాంతికి గలవు. ఆ కాంతి అతనియొడలిని దహింపదు, ఆనందమును శాంతిని గలిగించును.

వివేకజ్ఞానమార్గము ననుసరించు వానికి దేవుని సాక్షాత్కారము గలుగును. కాని ఆ మార్గము మిక్కిలి గహన మైనది. "నేను దేహమును గాను, మనస్సును కాను, బుద్ధినిగాను, ఆధివ్యాధివ్యథలకును ఖేదమోదములకును అతీతుడను, ఇంద్రియాతీగుడను, సచ్చిదానందస్వరూపుడను" అను నిట్టి మాటలను చెప్పుట సులభమే కాని, ఆభావములను మదిలో స్థిరపఱచుకొని అనుష్ఠించుట ఎంతో కష్టము. నా చేతి కొక ముల్లు గ్రుచ్చుకొని రక్తము కాఱుచున్న దనుకొనుము. దానిని ప్రత్యక్షముగ జూచుచున్న నేను "నాచేతికి ముల్లు గ్రుచ్చుకో లేదే, నేను హాయిగా ఉన్నానే" అని చెప్పిన బాగుండదు. అట్లు చెప్పవలెనన్న నేను ముందుగా జ్ఞానాగ్నిలో ఆ ములుకును భస్మము చేయవలెను.

డాక్టరు:—[భక్తునితో] గ్రంథములను జదివి యున్నచో ఈయనకు (=శ్రీరామకృష్ణునకు) ఇంతటి జ్ఞానము గలిగి యుండదు. ఫారడే ప్రకృతితో స్వయముగ సల్లాపించెడి వాడు. అందుచేతనే వైజ్ఞానిక సత్యాలను పెక్కింటిని ఆయన కనుగొన గలిగినాడు. వట్టి పుస్తకాలచదువుచే ఆయనకు అంతటి జ్ఞానము గలిగి యుండదు. గణితసూత్రాలు మన బుద్ధిను కలవరపఱచి స్వతంత్రపరిశోధనను అరికట్టును.

గురుదేవుడు:—ఒకానొకప్పుడు పంచవటిలో నేలపై పరుండి లోకమాతను ఇట్లు ప్రార్థించుచుంటిని— "అమ్మా, కర్మానుష్ఠానముచే కర్మపరులును, యోగముచే యోగులును, వివేకముచే జ్ఞానులును దేనిని సాక్షాత్కరించుకొనిరో దానిని నాకు ప్రత్యక్షమొనర్పుము". లోకమాతతో ఎంతెంతగనో సంభాషణలను సాగించితిని! వాని నెల్ల ఎట్లు వర్ణింప గలను? ఎట్టి దశలను నేను దాటితిని! నిద్ర నన్ను పూర్తిగా విడిచినదే!

గురుదేవు డింకను చెప్పుచునే యుండెను — నేను గ్రంథాలను చదువ లేదు. లోకమాత పేరును పాడుచుందును, అందుకే ప్రజలు నన్ను గౌరవించుచున్నారు. శంభు మల్లిక్ నన్ను జూచి "చేత ఖడ్గము లేదు, డాలు లేదు; లేకున్నను ఈయన వీరాధివీరుడు" అన్నాడు [నవ్వు].

(డాక్టరుతో) దేవునకు ఏకకాలమున పరిచ్ఛిన్న మానవరూపమును విశ్వవ్యాప్తమైన ఆత్మరూపమును రెండును గలవను విషయమును అర్థము చేసికొనుట కష్టము. అఖండ రూప మొకటియు ఖండ రూప మొకటియునుగా ఆయనకు రెండు రూపములు గలవు. మన తెలివి అల్పము. దేవుడు మానవరూపము దాల్చ డని మన మెట్లు నొక్కి చెప్ప గలము? మన అల్ప మేధతో ఈ విషయముల నన్నిటిని మన మెన్నటికైన ఆకళించుకో గలమా?

కావున సాధువులును మహాత్ములును లబ్ధసాక్షాత్కారులు నగు వారి సూక్తులను విశ్వసింప వలెను. వకీలుకు సదా తన వ్యాజ్యాల స్మరణమే, వారికి సదా దేవుని స్మరణమే.

మానవుడు అమాయికుడుగ నుండనిదే అతనికి దైవభక్తి సులభముగ కలుగదు. సంసారమందు గాఢముగ నిమగ్నమై యుండు మనస్సునుండి దేవుడు కడు దూరము తొలగి యుండును. లౌకిక జ్ఞానమువలన ఎన్నో సందేహములు కలుగును. విద్యాగర్వము,

సంపద్గర్వము, ఇంకను అట్టి పెక్కు రకముల గర్వములు కలుగును. (డాక్టరును చూపుచు) మఱి, ఈయన మాత్రము అమాయికుడు.

భగవదన్వేషకులకు నిరంతరము సాధుజనసాంగత్యము ఆవశ్యకము. లౌకికులవ్యాధి దీర్ఘవ్యాధిగ పరిణమించిన ట్లున్నది. సాధుజనుల బోధనలను వారు అనుష్ఠింప వలెను. వారి యుపదేశములను విని ఊర కున్న ఏమి లాభము? ఇచ్చిన మందును పుచ్చుకొనుటయే గాక పథ్యనియమమును తప్పక పాటింప వలెను. పథ్యము చాల ముఖ్యము.

డాక్టరు:—ఔను. తక్కిన యన్నింటికన్నను పథ్యమే వ్యాధిని ఎక్కువగ నయము చేయును.

గిరీశుడు:—(చిఱునవ్వు నవ్వుచు డాక్టరుతో) మీరు ఇప్పటికే మూడు నాలుగు గంటల కాలము ఇక్కడ గడపితిరే, మీ రోగుల గతి ఏమి?

డాక్టరు:—ఆ, నా వృత్తియు నా రోగులును! మీ పరమహంసకై నేను సమస్తమును వదలుకొందును. (అందఱు నవ్వుదురు).

(గిరీశ మహేంద్రాది భక్తులతో) "మిత్రులారా, నన్ను మీలో నొకనిగ తలంపుడు. నే నొక వైద్యుడనై పలుకుచున్న మాటలు కావివి. మీ వానిగ నన్ననుకొందు రేని నేను మీ వాడనే.

(గురుదేవునితో) మీకు వచ్చియున్న వ్యాధితో బాధపడు రోగులు ఇతరులతో మాటాడ రాదు. కాని ఆ యితరులనుండి నేను ప్రత్యేకము. నే నిక్కడ నున్నంతవఱకు మీరు నాతో మాటాడ వచ్చును. (అందఱును నవ్వుదురు).

గురుదేవుడు:—దయచేసి నా వ్యాధిని నయము చేయుము. భగవన్నామములను మహిమలను పాడుకో లేని దశలో నున్నాను.

డాక్టరు:—ధ్యానమే చాలునే.

గురుదేవుడు:—అట్లనుటలో నీ తాత్పర్య మేమి? విసుగు బ్రతుకును నే నేల గడప వలెను? చేపలను కూరగా – వరుగుగా – ఊరగాయగా – ఇంకను రకరకములుగ తయారు చేసికొని యనుభ వింతును. ఒకప్పుడు నేను క్రతుక్రియల ననుష్ఠించి దేవు నారాధిం తును. మఱొకప్పుడు దేవుని నామమును అనుసంధించుచుందును. వేఱొకప్పుడు ఆయనను ధ్యానించుచుందును. కొన్ని వేళలలో భగవ న్నామమహిమలను కీర్తించుచుందును. మఱికొన్ని సమయములలో ఆయన పేరు పాడుచు నర్తించుచుందును.

డాక్టరు:—నేనును చేసిన దానినే చేసి విసుగు పుట్టించుట లేదు.

గురుదేవుడు:—మీ అబ్బాయి అమృతునకు దేవు నవతారము లందు నమ్మకము లేదు. లేకపోయిన ఏమియు ఫరవా లేదు. దేవుడు నిరాకారు డని నమ్మినవానికిని దైవసాక్షాత్కారము కలుగును. దేవుడు సాకారు డని నమ్మినవానికిని దైవసాక్షాత్కారము కలు గును. దైవసాక్షాత్కారసిద్ధికి తప్పక కావలసినవి రెండు. ఒకటి విశ్వాసము. రెండవది శరణాగతి. మానవుడు సహజముగనే అజ్ఞుడు. తప్పులు చేయుట అతనికి స్వాభావికము. నీవు అనుసరించుదారి యే దైనను అగు గాక, తహతహపడు డెందముతో దేవుని తప్పక ప్రార్థింప వలెను. లో నున్న యాత్మకు నియంత ఆయన. నీ ప్రార్థన హృదయపూర్వక మగుచో ఆయన తప్పక చెవి యొగ్గి తీఱును. నీవు సగుణమూర్తిని లక్ష్యముగ నుంచుకొని అనుసరించినను, నిర్గుణపర తత్త్వమును లక్ష్యముగ నుంచుకొని అనుసరించినను, దేవుని చూడ వలె నను తహతహ నీ కున్నచో దేవుడే నీ కగపడును.

మీ అబ్బాయి అమృతుడు చక్కని పిల్లవాడు—

డాక్టరు:—వాడు మీ శిష్యుడు.

గురుదేవుడు:—(చిఱునవ్వుతో) సూర్యునిక్రింది ఈలోకమున నాకు శిష్యు డైన వాడు ఒకడును లేడు. అంతే గాదు. ప్రతి యొక్క–

నికిని నేనే శిష్యుడను. అందఱును దేవుని బిడ్డలే. అందఱును దేవుని దాసులే, నేనును దేవుని బిడ్డనే. నేనును దేవున కొక దాసుడనే. చందమామ, పిల్లల కందఱికిని మామ.

1885 వ సంవత్సరము తే 24 ది శనివారము.

మధ్యాహ్నము దాటినది. సుమారు ఒంటిగంట అయినది. శ్యాంపుకూరులోని భవనమున రెండవ యంతస్తున శ్రీరామకృష్ణుడు కూర్చుండి యుండెను. డాక్టరు సర్కారు, నరేంద్రుడు మహిమచరణుడు మహేంద్రుడు మున్నగు భక్తులు గదిలో నుండిరి. హోమియోపాతిక్ వైద్య విధానమునుగూర్చి గురుదేవుడు డాక్టరుసర్కారుతో "మీ యీ వైద్యవిధానము చాల బాగున్నది" అనెను.

డాక్టరు:— హోమియోపతీ విధానానుసారము వైద్యుడు వ్యాధిలక్షణములను పరిశీలించునప్పుడు, అతనికి గ్రంథమే ప్రమాణము. అది పాశ్చాత్య సంగీతమువంటిది. పాటకుడు తన ముందున్న గంట్లలో పాటను స్వరపఱచి ఉంచుకొని దానినే అనుసరించును.

గిరీశఘోషు ఏడీ? అక్కఱ లేదు లే. అతనిని బాధింపవలదు. నిన్న రాత్రి అతనికి నిద్ర లేదు.

గురుదేవుడు:—సమాధిదశలో నున్నపుడు ఆసిద్ధి అనెడి పానముచే నేను ఒడలెఱుంగకుందును. అందుంగూర్చి నీ వే మందువు?

డాక్టరు:—(మహేంద్రునితో) ఆ దశలో నాడీకేంద్రములు తమ తమ పనులను మానును. అప్పుడు అవయవములకు ప్రమాన్పాటు కలుగును. తేజమంతయు మూర్ధాభిముఖముగ ఉరవడించుటచే పాదములు తడబడును. నాడులే గదా ప్రాణము. మెడ వెనుక భాగమున మజ్జామఖము (మెడుల్లా అబ్లాంగేటా) అను నొక నాడీకేంద్రమున్నది. దానికి దెబ్బ తగిలినప్పుడు మానవుడు మరణింప వచ్చును.

మహిమచక్రవర్తి కుండలినీ శక్తిని వర్ణింప నారంభించెను. ''సుషుమ్నానాడి వెన్నెముకగుండ సూక్ష్మముగ వ్యాపించి యుండును. అది ఎవరికిని అగపడదు''. అట్లని పరమశివుడు చెప్పియున్నాడు.

డాక్టరు:—మానవునకు పరిణతదశ కలిగిన తరువాతనే శివుడు అతనిని పరిశీలించెను. యూరపియనులు అంకురదశనుండి పరిణతదశ వఱకు అన్నిదశలలోను మానవుని పరిశీలించియున్నారు. వివిధదేశాల చరిత్రలను పోల్చి తెలిసికొనుట మంచిది. సాంతాళ్ వర్గమువారి చరిత్రను చదివిన కాళీమాత ఒక సాంతాళ్ మహిళ అని తెలియ నగును. ఆమె సాహసవతియైన యోధురాలు. (అందఱును నవ్వుదురు).

డాక్టరు:—దయచేసి నవ్వకుడు. వివిధప్రాణుల అంగవిన్యాసమును (=అనాటమిని) పోల్చి పరికించుటవలన మానవులకు కలిగిన గొప్పలాభమును చెప్పెదను వినుడు. మధురసము (పాంక్రియాటిక్ జ్యూస్) పిత్తము (బైల్) అను వాని పనులలో గల భేదము మొదట తెలియకుండెను. తరువాత క్లాడ్ బెర్నార్డు మహాశయుడు సీమకుందేలు దేహమందలి పొట్ట కారిజము (లివర్) మున్నగు భాగములను పరిశీలించి పిత్తరసముచేయుపనికిని మధురసము చేయుపనికిని గల భేదమును ప్రత్యక్షముగ చూపెను. కాబట్టి క్రిందితరగతి ప్రాణులనుకూడ మనము పరిశీలింప వలె ననుట సమంజసమే. మానవుని మాత్రము పరిశీలించిన చాలదు. అట్లే వివిధమతములను పోల్చి పరిశీలించుట ఎంతో లాభకరము.

ఈయన (శ్రీరామకృష్ణుని) మాటలు సూటిగ మన హృదయముల కెక్కుటకు కారణ మేమి? వివిధమతముల సత్యమును ఈయన స్వానుభవమున చూచినాడు. స్వయముగ హిందూ క్రైస్తవ మహామ్మదీయ శాక్త వైష్ణవ మతముల ననుసరించి సాధనలు చేసినాడు. తేనెటీగలు వివిధ కుసుమముల నుండి తేనెను కలిపి నప్పుడు చక్కని తేనెను తయారు చేయ గలవు.

శ్రీరామకృష్ణుడు నరేంద్రుని పాట పాడు మనెను. నరేంద్రు డిట్లు పాడెను.

రాజాధిరాజుల రాజ వౌ దేవ
దయఁ గానిపించి నన్ ధన్యు నొనర్పు;
పరమకృపావీచిపాళి నామీఁద
పాఱింపు: కడకంటఁ బాలింపు నన్ను.
ఐహిక తాపత్రయంబులన్ వేఁగి
నట్టి నా బ్రతుకును నర్పింతు నీదు
భక్తహృదయహారి పాదాబ్జములను;
దురితంపు టడుసులోఁ దోఁగె నా మనము;
మాయవాగురఁ జిక్కి మాసిపోయితినె!
భవ్యదయాసార్వభౌమ, లోకేశ,
ప్రాణప్రదంబయి రాజిల్లు నీదు
సత్కృపామృతవృష్టి చాలఁగఁ గురిసి
మనుపవే దేవ, నా మ్లాన మౌ నాత్మ.

గురుదేవుడు:— "సర్వమున్ నీవెగా సకలలోకేశ" అను పాటను పాడుము.

డాక్టరు:—ఆ!

నరేంద్రుడు ఆ పాటను పాడెను.

పాట ముగిసినది. డాక్టరు సర్కారు అచట మంత్రముగ్ధునివలె కూర్చుండెను. కొంతసే పయిన తరువాత చేతులు జోడించుకొని అత్యంతవినయముతో అతడు గురుదేవునితో "నేను సెలవు తీసికొందును. అనుమతింపుడు. మరల రేపు వత్తును" అని విన్నవించెను.

డాక్టరు సర్కారు వీడ్కొనెను. ప్రొద్దుక్రుంకెను. ఆ బహుళ పాడ్యమిరాత్రి శ్రీరామకృష్ణుడు సమాధి నిమగ్నుడై నిలబడి

యుండెను. నిత్యగోపాలుడు అత్యంతవినయముతో ఆయన ప్రక్క నిలుచుండెను.

శ్రీరామకృష్ణుడు కూర్చుండెను. నిత్యగోపాలుడు ఆయనకు పాదశుశ్రూష చేయుచుండెను. దేవేంద్ర కాళిపాద ప్రముఖ భక్తులనేకులు ఆయన ప్రక్క కూర్చుండిరి.

యువకులలో కొందఱు వంతు ప్రకారము గురుదేవునకు పరిచర్య చేయవలయు నని ఏర్పాటయి యుండెను. మహేంద్రుడుగూడ నాటిరాత్రిని అక్కడనే గడప నుండెను.

1885 వ సంవత్సరము అక్టోబరు తే 25 ది భానువారము.

ఉదయము సుమారు ఆరున్నరగంట లయినవి. మహేంద్రుడు శ్యాంపుకూరునకు వచ్చి ఆరోగ్య మెట్లున్న దని శ్రీరామకృష్ణు నడిగెను. గురుదేవుని శరీరస్థితిని డాక్టరు సర్కారునకు తెలుపుటకై అతడు పోవుచుండెను. గురుదేవుడు మహేంద్రునితో "ఉదయవేళలలో నాకు నోటినిండుగ నీరూరు చుండును. దగ్గు వచ్చును. ఆ వివరమును డాక్టరునకు చెప్పుము. నేను స్నానము చేయవచ్చునేమో ఆయనను అడుగుము" అని చెప్పి పంపెను.

ఏడుగంట లయిన తరువాత మహేంద్రుడు డాక్టరు సర్కారునింటికిపోయి గురుదేవుని శరీరస్థితిని గూర్చి తెలిపెను. వైద్యునకు గురువైన వృద్ధు డొకడును, ఒక రిద్దఱు మిత్రులును ఆ గదిలో నుండిరి. సర్కారు తనగురువుతో, మహాశయా, వేగుజామున మూడుగంటలనుండి నాకు పరమహంసను (=శ్రీరామకృష్ణుని) గుఱించిన తలంపులే, నాకు నిద్ర రానే లేదు. ఇప్పుడుకూడ నా మనస్సులో ఆయనే ఉన్నాడు.

వైద్యుని మిత్రులలో నొకడు వైద్యునితో, "ఆ పరమహంసదేవు నవతార మని కొందఱు చెప్పగా విన్నాను, నీవు ఆయనను

ప్రతిదినమును చూచుచున్నావే. నీ అభిప్రాయ మేమి?'' అని అడిగెను.

డాక్టరు:—ఆయనను మానవునిగనే భావించు నాకు ఆయన యెడ ఆదరము మాత్రము మిక్కుటము.

మహేంద్రుడు:— (వైద్యుని మిత్రునితో) ఎంతో దయ గల వారు కాబట్టి డాక్టరు సర్కారుగారు ఆయనకు వైద్యము చేయు చున్నారు.

డాక్టరు:—దయయా? నీ అభిప్రాయ మేమి?

మహేంద్రుడు:—దయ ఆయనపట్ల గాదు. మాపట్ల.

డాక్టరు :— చూచితిరా, పరమహంసను సేవించుటకై వృత్తిలో నే నెంత నష్టమున కోర్చుచున్నానో! రోగులను అందఱను చూడ లేక పోవుచున్నాను, ఒక రిద్దఱు మిగిలిపోవుచున్నారు. మఱు నాడు నా యంతట నేనే వారిండ్లకు పోవుదును. పిలుపులేకయే పోయి తిని గాన వారియొద్ద ఎట్టి రుసుమును తీసికొన లేను. నేనుగా పోయి చూచినందుకు ధన మెట్లడుగుదును?

వచ్చి శ్రీరామకృష్ణుని చూడ వలసిన దని వైద్యునిప్రార్థించి మహేంద్రు డింటికి మరలెను.

మధ్యాహ్నానంతరము మూడుగంట లప్పుడు వచ్చి మహేంద్రుడు తనకును డాక్టరు సర్కారునకును జరిగిన సంవాదమును గురు దేవునకు నివేదించెను.

మహేంద్రుడు:—డాక్టరు వేకువ మూడు గంటలకే నిద్ర లేచినా డట. అప్పటినుండియు ఆయనకు మిమ్ముగూర్చిన తలంపే అట: నేను ఆయనను చూచినప్పుడు ఎనిమిది గంటలు. ''పరమహంస ఇప్పుడుకూడ నా మనస్సులో నున్నాడు'' అన్నాడు.

గురుదేవుడు:—[నవ్వుచు] విషయ మిది. ఆయన ఇంగ్లీషు చదువు చదివిన వాడు. నన్ను ధ్యానింపు మని ఆతనితో నే నన లేను గాని ఆ ధ్యానమును ఆయన తనంతటనే చేయుచున్నాడు.

మహేంద్రుడు:—ఆయన మిమ్ము గూర్చి మఱి యొక సంగతిని గూడ చెప్పినాడు—మీయందు తనకు మానవభావనయే ఉన్నను, మీపై నున్నంత యాదరము వే ఱెవరిమీదను లే దట.

గురుదేవుడు:—వేఱు ప్రస్తావము లే వైన వచ్చినవా ?

మహేంద్రుడు:—ఈ దినము రోగికి మీ రిచ్చు సలహా ఏమి అని నే నడిగితిని. 'సలహానా? సలహా పోసీ. నేనే మరల ఆయన యొద్దకు రావలసి యున్నది. నే ఱేమి చెప్పుదును' అన్నా డు ఆయన. [శ్రీరామకృష్ణుడు నవ్వెను]. ఇంకను ఆయన ఏ మన్నా డనగా—ప్రతిదినము ఆయన ఎంత ధనము నష్టపడుచున్నదియు మనము ఎఱుగ మట. ప్రతిదినమును రెండుమూడుచోట్ల పిలుపులను తాను అందుకో లేక పోవుచున్నా డట.

గదిలో భక్తులు పెక్కం డ్రుండిరి. వారిలో నరేంద్రనాథు డును ఉండెను. విజయకృష్ణగోస్వామి వచ్చి అత్యంతాదరముతో గురు దేవుని పాదధూళిని తన తలపై నిడుకొనెను. ఆయన వెంబడి పెక్కురు బ్రాహ్మభక్తులు వచ్చిరి. విజయుడు బ్రాహ్మసమాజముతో సంబం ధమును త్రెంచుకొని, స్వతంత్రముగ ఆధ్యాత్మికసాధనను సాగించు చుండెను. అతని భక్తిశ్రద్ధలే కారణములుగా శ్రీరామకృష్ణునకు అతనిపై మహాప్రేమ. గురుదేవునకు తాను శిష్యుడు కా కున్నను ఆయన పట్ల విజయుని గౌరవము అతిమాత్రము. ఆతడు చిరకాలము ఢాకాలో వసించెను, ఇటీవల ఉత్తరభారతమున పెక్కు పుణ్యక్షేత్ర ములకు యాత్ర చేసెను.

మహిమాచక్రవర్తి:—(విజయునితో) మహాశయా, పుణ్య క్షేత్రాలను క్రొత్తదేశాలను పెక్కింటిని జూచితివి కదా, నీయను భవాలలో కొన్నింటిని దయచేసి మాకు చెప్పుము.

విజయుడు:—నేను ఏమి చెప్పుదును? మనము ఇప్పుడు ఉన్న ఈ చోటనే సమస్తమును ఉన్న దని అనుభవములో నాకు తెలియు చున్నది. ఈ పర్యటనలు వ్యర్థములే. ఈయనలో (=గురుదేవు

నిలో అనుట) ఏ యేబదవ పాలో, ఇరువదవ పాలో, పదవ పాలో, పాతిక పాలో మాత్రమే నాకు తక్కినచోట్లలో కనబడినది. మఱి ఈ చోట మాత్రమే, దేవునిపరిపూర్ణసాన్నిధ్యము నాకు గోచర మగుచున్నది.

మహిముడు:—మహాశయా, నీవు చెప్పినది సరి. అంతేకాదు. మనలను పలుతావుల త్రిప్పుట కానీ ఒక్కచోటనే ఉండ నిచ్చుట కానీ — అదియు ఈయన (=గురుదేవుడు) చేయుపనియే.

గురుదేవుడు:—(నరేంద్రునితో) విజయుని మనస్సు ఎట్లు మాఱిపోయినదో చూడుము. అతడు మునుపటి వ్యక్తి కానే కాడు, నీ రంతయు ఇగిరిపోయినపిదప చిక్కనగు పాలను బోలి ఉన్నాడు. మెడను నుదుటిని చూచినచాలును, పరమహంస ఎవరో నేను గుర్తింప గలను. ఔను, పరమహంసను నేను గుర్తింపగలను.

మహిముడు:—(విజయునితో) మహాశయా, మీ యాహార పుష్టి తగ్గిన ట్లున్నదే, తగ్గ లేదూ?

విజయుడు:—తగ్గినది కాబోలు. (గురుదేవునితో) మీవ్యాధిని విన్నాను, చూత మని వచ్చితిని. మఱి ఢాకాలో—

గురుదేవుడు:—ఢాకాలో, ఏమి?

విజయుడు జవాబు చెప్ప లేదు, కొన్ని నిమిషములు మౌన ముగ ఉండెను.

విజయుడు:—ఆయన (=గురుదేవుడు) తన్ను అగపఱచుకో కున్న, ఆయనను అర్థము చేసికొనుట కష్టము. దేవుని పరిపూర్ణ సన్నిధి ఉండునది ఈ చోటనే.

గురుదేవుడు:—క్రిందటి దినము కేదారుడు చెప్పి యుండ లేదా? తక్కిన చోట్లలో మనకు తిండికి ఏమియు దొరక దట, ఈ చోట కడుపునిండ లభించు నట.

మహిముడు:—కడుపునిండునంత మాత్రమేనా? కాదు, నిండి పొరలు నంత.

విజయుడు:—[కేలోడ్చి, గురుదేవుని] మీరు ఫలానా అని నాకు స్పష్టపడినది. మీరు తెలుప నక్కఱ లేదు.

గురుదేవుడు:— [ఉద్రిక్తభావదశలో] స్పష్టపడినచో, ఆ యెఱుక అట్లే ఉండనీ.

"ఔను, నాకు అర్థమైనది" అనుచు, విజయుఁడు గురుదేవు నెదుట సాగిలబడెను, గురుదేవుని చరణములను ఱొమ్ముపై నుంచుకొని వానిని గట్టిగ పట్టుకొనెను. గురుదేవుడు చిత్తరువువలె నిశ్చలుడై గాఢసమాధియందుండెను. ఆదర్శనానుభూతిలో భక్తులు మునిగి పోయిరి. కొందఱకు కన్నీరు ఉప్పొంగినది. కొందఱు భక్తి గీతమాలను పాడినారు. ఎల్లర చూపులును శ్రీరామకృష్ణునిపై నెలకొని ఉండినవి. ఒక్కొక్కరి కొక్కరీతిగ, వారి జ్ఞానపరిపాకమునకు అనురూపముగ, ఆయన వారికి కనిపించుచుండెను. కొందఱకు ఆయన గొప్పభక్తుడుగ తోచినాడు, కొందఱకు సాధుపుంగవుడుగ అగపడినాడు, కొందఱకు దేవుని ప్రత్యక్షరూపముగ పొడకట్టినాడు.

బాష్పపూర్ణనయనుడై మహిమాచరణుడు—

చూడుఁడీ చూడుఁడీ చొక్కమౌ మూర్తి
దీపించు నట్టి యీ దివ్య మౌ ప్రేమ—

అని పాడినాడు. బ్రహ్మమును ప్రత్యక్షముగ కన్న వాడుఁ బోలె అప్పుడప్పుడు ఇట్లు పాడినాడు—

పరమునకంటెఁ దాఁ బర మగు చుండు,
ఒక్కటియును గాదు, పెక్కులుం గాదు,
సచ్చిదానందమౌ సాక్షి బ్రహ్మంబు.

నవగోపాలుడు విలపించుచుండెను. భూపతి ఇట్లు పాడెను—

గాధము నంతముఁగా గాని లే నట్టి
దేవా, పరాత్పరా, దీనశరణ్యా,
అగుఁ గాత మంగళం బానందనిలయ,

వాగతీత బ్రహ్మ, వరసత్యదీప,
చిఱుత లౌ వానిలోఁ జిఱుత వౌ దీవ,
పెద్ద లౌ వానిలోఁ బెద్ద వౌ దీవ,
ప్రేమంపుగని వీవు, వేదాంతవేద్య,
సర్వత్ర నొలికెడి సౌందర్య గరిమ
భవ్య వైవిధ్య సంభరిత మౌ జగము
పరమ నిర్వృతికరం బౌ కావ్య మరయ.
దాని నీవినది నీ తఱుగని ప్రజ్ఞ,
ఆదికవివర, మహాకవిరాజ,
నీ భావ లయ లోనె నిత్యముఁ సాగు
చం ద్రార్కుల జని, య స్తమయంబు, కూడ;
నీల నభ మదియె నీల పత్త్రముగ,
నక్షత్రరత్నాలు నాణెంపు లిపిగ,
నీ గీతి లిఖిత మై నెగడుచు నుండు.
షడృతులతోఁ గూడి సంవత్సరంబు
ధన్య మౌ భువిఁ జేరి తాఁ బాడు చుండు,
కాలము గల యంత కాలముఁ దేవ
దేవాధిపా, నీదు దివ్య మహిమను.
పూల వన్నెలలోన పొందుగా నీదు
సొంపుపెంపుల నెల్లఁ జూడఁగా నగును.
సాగర గాంభీర్య శాంతతల్ దెలుపు
దేవ, నీ గంభీర దృఢశాంతగుణము.
అశని తెల్పు భయద మౌ నీదు నాజ్ఞ.
గంభీర దుర్జ్ఞేయ గరిమవంత మగు
నీ సార మరయఁగ నేర్చునే జ్ఞాన

రహితముల్ మా మతుల్ రహిఁ? నందువలనె
ధ్యానము వింతయుఁ దఱుగ వెన్నఁడును.
చంద్రులు కోటి నక్షత్రముల్ కోటి
రవు లోక కోటి యెరగుచును నీకు
నద్భుత రస వివశాత్ము లగుదురు.
నీ సృష్టి చూచుచు నెఱయ నెల్లరును
బాష్పముల్ గార్తురు పరమ నిర్వృతిని.
వేల్పు లెల్లరు నిను వేడ్కఁ గొల్చెదరు.
సర్వమంగళదాత, సర్వేశ, దేవ,
భక్తి నీయవె, యీవె పరమప్రశాంతి.
నిర్మలప్రేమను నింపి మమ్మేలి
పావన నీ పాద పద్మాశ్రయ మిడు.

చాల సేపటికి శ్రీరామకృష్ణునకు బాహ్యలోకస్మృతి మరల గలిగినది.

గురుదేవుడు:—(మహేంద్రునితో) ఆ యున్మత్త దశలోనే నున్నప్పుడు, నాకు ఏ మేమో కల్గుచుండును. ఇప్పుడు నాకు సిగ్గగుచున్నది. ఆ దశలో నన్నొక దయ్యము పూనియున్న ట్లనిపించును. నేను నేనుగా ఉండను. ఆస్థాయినుండి దిగుచున్నప్పుడు, నాకు సరిగా లెక్కపెట్టుశక్తియు ఉండదు. లెక్కపెట్ట ప్రయత్నించినను 'ఒకటి' 'ఏడు' 'ఎనిమిది' అను ఇట్టి వరుసన లెక్కింతును.

నరేంద్రుడు:—ఏల యన, సమస్తమును ఒక్కటే.

గురుదేవుడు:—కాదు. అది ఒకటికిని రెంటికిని అతీతము.

మహిముడు:—ఔను, మీరు చెప్పినది సరి, 'అది ఒక్కటియుం గాదు రెండునుం గాదు'.

గురుదేవుడు:—ఆ స్థాయిలో తర్కము ఎందుకొని పోవును.

భగవత్సాక్షాత్కారమునకు పాండిత్య మొక సాధనము కాదు. దేవుడు వేదాలకును, పురాణాలకును, తంత్రాలకును, (అన్ని) శాస్త్ర గ్రంథాలకును — అతీతుడు.

సంభాషణ ఈలాగు జరుగుచున్నప్పుడు, డాక్టరు సర్కారు గదిలోనికి వచ్చి కూర్చుండెను. అతడు గురుదేవునితో "వేకువన మూడుగంటలకు నిద్ర లేచితిని, మీకు పడిసెము పట్టె నేమో అని ఎంతో వ్యధ చెందితిని. మిమ్ముగూర్చి నాకు ఇంకను ఏ మేమో తలపోతలు గలిగినవి" అనెను.

గురుదేవుడు:—నాకు దగ్గు మాన లేదు. గొంతు రాచుకొని పోయి ఉన్నది. ప్రొద్దుటివేళలలో నా నోరు నిండుగ నీరూరు చుండును. దేహమంతయు నొప్పులే.

డాక్టరు:—ఔ నౌను, ఆ వైన మంతయు నేటి ప్రొద్దుననే విన్నానుగా.

మహిమాచరణుడు దేశవివిధభాగాలకు తానుగావించిన యాత్ర లనుగూర్చి చెప్పుచు, సింహాళీయులు ఎప్పుడును నవ్వనే నవ్వరు అనెను. డాక్టరు సర్కారు "మీ రన్నది నిజమే కా వచ్చు, కాని నిజమో కాదో పరిశోధింపక నాకు తప్పదు" అన్నాడు [అందఱును నవ్వుదురు].

సంభాషణలో వృత్తికర్తవ్యాల ప్రసంగము వచ్చినది.

గురుదేవుడు:—[డాక్టరుతో] వైద్యవృత్తి చాల ఉదాత్త మైన దని పెక్కండ్రు తలంతురు. రోగుల బాధలను జూచి, మనస్సు కరగి, కృపాళుడై, ఉచితముగ వైద్యము చేయు వైద్యుడు ఉదాత్తుడే అనుటకు సందేహము లేదు. అతని పని ఔన్నత్యావహము అని చెప్ప దగినదే. అట్లు కాక వైద్యుడు అర్థమునే పరమార్థముగ భావించి వృత్తిని సాగించునేని, అతడు క్రూరుడుగను కఠినుడుగను పరిణమించును.

డాక్టరు:—మీరు చెప్పినది సరి. అట్టి చిత్తవృత్తితో వైద్యుడు తన పనులను చేయుట తప్పే. సందేహము లేదు. కాని మీ యెదుట లేని పోని గొప్పతనాలను చెప్పుకొనుట నాకు ఇష్టము లేదు—".

గురుదేవుడు:— నిస్స్వార్థబుద్ధితో లోకక్షేమమునకై సేవ చేయు వైద్యుని వృత్తి యన్ననో మిక్కిలి ఉదాత్తమైనదే. ముమ్మాటికిని నిజము.

గృహస్థుని వృత్తి ఏదైన నగును గాక, అప్పుడప్పుడు సాధు గోష్ఠిలో ఉండుట అతనికి ఆవశ్యకము. దేవుని ప్రేమించు నాతడు తనంతటనే సాధుగోష్ఠికై ఉబలాటపడును.

ఆ నాడు ఎవరైన పాట పాడుదురా అని డాక్టరు సర్కారు అడిగెను.

గురుదేవుడు:—(నరేంద్రునితో) నీ వించుక ఏల పాడరాదు?

నరేంద్రుడు పాడెను—

భక్తహృద్ధారిణి, వరకృపానిలయ,
జ్ఞానము నాకేల? చటుల వివేక
మైనను నాకేల? యమ్మ, నీపైని
ప్రేమచే వెఱ్ఱిని బెంపవే నాకు.
ప్రేమ మద్యపుఁ గైపు పెంపును గనుత.
నీ ప్రేమ వార్ధిలో నీ దాసుని నను
మునుఁగఁజేయవె నీకు మ్రొక్కెద నమ్మ,
నీయేలుబడిలోన నెగడు నీ లోక
మున్మత్త నిలయమై యొప్పుచు నుండు.
నగువార లానంద నర్తకుల్ గొంద,
ఱంగలార్చెడి వారలై కొంద ఱుంద్రు.

గౌరాంగ జీససు గౌతమ బుద్ధ
మోససు లాదియౌ మొనగాండ్రు, నీదు
ప్రేమమద్యము గ్రోలి పేర్మిని గండ్రు,
ఆనందకర మైన యా ప్రేమగోష్ఠి
నెన్నడు చేరంగ నే గందు నమ్మ?

భక్తు లెల్ల ఒక వింత మార్పునకు లో నైరి. ఎల్లరకును దివ్య భావోద్రేకమున వెఱ్ఱెత్తిన ట్లుండెను. తన వైదుష్యమదమును మఱచి, పండితుడు లేచి నిలబడి

భక్తహృద్ధారిణి, వరకృపానిలయ,
జ్ఞానము నా కేల? చటుల వివేక
మైనను నా కేల యమ్మ, —

అని బిగ్గఱగ పాడెను.

దివ్యోన్మాదవివశులై లేచి నిలబడ్డ వారిలో విజయుడే ప్రథముడు. అంతటి ప్రాణాంతకమై తనకు దాపరించి బాధించుచున్న వ్యాధిని మఱచి శ్రీరామకృష్ణుడును లేచి నిలబడెను. ఆయన కెదుట కూర్చుండి యున్న డాక్టరును లేచి నిలబడెను. నరేంద్రుని గానముచే ముగ్ధులై రోగియు వైద్యుడును ఉభయులును తమ్ము మఱచిపోయిరి. చిననరేంద్రుడును లాటూను గాఢ సమాధి నిమగ్ను లైరి. గదిలోని వాతావరణము విద్యుత్వంత మయ్యెను. దేవుని సాన్నిధ్యము అందఱ కును అనుభవగోచర మయ్యెను. ప్రముఖ విజ్ఞాని యైన డాక్టరుసర్కారు, ఊపిరాట దక్క, ఈ వింతదృశ్యమును తిలకించు చుండెను. సమాధి నిమగ్ను లైన భక్తులకు బాహ్యలోకస్మృతి బొత్తుగ లేకుండుటను అతడు గుర్తించెను. చీలలతో బిగింపబడ్డట్లు అందఱును నిశ్చలులై ఉండిరి. కొంతసేపటికి వారు వ్యావహారికరంగమున కించుక దిగ జొచ్చిరి, అప్పుడు వారిలో కొందఱు నవ్విరి, కొందఱు ఏడ్చిరి.

వెలుపటివాడు ఎవడైన గదిలో ప్రవేశించి ఉన్నచో, వాడు అచట కూడి ఉన్న వారందఱును త్రాగుబోతు లనుకొని యుండును.

కొంత సేపటికి భక్తులు మరల తమ పీఠములపై ఆసీను లైరి. శ్రీరామకృష్ణుడు సంభాషణను మరల ఆరంభించెను. అప్పటికి రాత్రి ఎనిమిది గంట లైనవి.

గురుదేవుడు:—దివ్యభావోద్రేకము కల్గిన, ఏ మగునో ఇప్పుడే చూచితిరి. అందుం గూర్చి మీ విజ్ఞానము (సైన్సు) ఏ మనును? వట్టి బూటక మనియేనా మీ తలంపు?

డాక్టరు:—(గురుదేవునితో) ఇందఱు అనుభవించిన విషయమును, అకృత్రిమము అని నేను చెప్పక తప్పదు. అది బూటక మనుట పొసగదు. (నరేంద్రునితో) నీవు

భక్తహృద్ధారిణీ, వరకృపానిలయ,
జ్ఞానము నా కేల? చటుల వివేక
మైనను నా కేల? యమ్మ,—

అను పంక్తులను పాడినప్పుడు నేను పరవశుడను కాక ఉండలే నైతిని. ఒక్క ఎగురున నేను లేవ నుంటిని. కాని ఎంతో కష్టముతో భావోద్రేకమును అణచుకొంటిని. "నా అనుభవాలను నేను ప్రకటించుకో రాదు" అని నాలో అనుకొంటిని.

గురుదేవుడు:—(చిఱునవ్వు నవ్వుచు డాక్టరుతో) నీవు సుమేరుపర్వతమవు, కదలవు, నిను కదల్చుటయు శక్యము కాదు, అతిగంభీరుడవు. ఏనుగు ఒక చిన్న మడుగులో ప్రవేశించు నేని, నీరు అన్ని వైపులకును చెదరును. అదే ఏనుగు ఒక పెద్ద చెఱువులో ప్రవేశించినచో, అట్లు కాదు. ప్రవేశించినసంగతియే ఎవరికిని కంట బడదు.

డాక్టరు:—మాటలలో ఎవరును మిమ్ము మీర లేరు (నవ్వు).

సంభాషణలో వేఱు సంగతుల ప్రస్తావము వచ్చినది. దక్షిణేశ్వరమున తనకు గలిగిన భావోద్రేకాలను శ్రీరామకృష్ణుడు డాక్టరునకు వర్ణించి చెప్పెను. కామక్రోధాదిప్రకోపాలను అణచు రీతిని గూడ ఆయన అతనికి దెలిపెను.

డాక్టరు :— ఒకనాడు మీరు శరీరస్మృతి లేక సమాధిలో మునిగి నేలపై బడి ఉంటిరట, ఒక దుర్మార్గుడు మిమ్ము తన చెప్పు కాలితో తన్నినాడట. ఈ కథ నొకప్పుడు విని యున్నాను.

గురుదేవుడు :— ఆ కథను మహేంద్రుడు చెప్పగా వినియుందువు. ఆ తన్నిన వ్యక్తి ఎవరో కాదు, కాళిఘట్టమున కాళిగుడిలో పూజారిగ ఉన్న చంద్రహాలధరుడే. అతడు మథుర్బాబునింటికి తఱచు వచ్చుచుండును. ఒకనాడు నేను భావసమాధినిమగ్నుడనై నేలపై పరుండి యుంటిని. గది చీకటిగ నుండెను. అది అంతయు నా అభినయమనియు, మథురుని మెప్పొందుటకు చేయుచున్న జిత్తు అనియు చంద్రహాలధరుడు అనుకొనెను. అతడు గదిలోనికి వచ్చి తన చెప్పు కాలితో నన్ను పెక్కు మార్లు తన్నినాడు. నా దేహముపై నల్లని వాతలు కూడ పడినవి. చూచిన వారందఱును ఆ సంగతిని మథురునకు తెలుప గోరిరి, కాని నేనే వలదని వారించితిని.

డాక్టరు :— దీనికిని దైవసంకల్పమే కారణము. కోపమును అణచుకొని ఓర్పునలవఱచుకొనువిధమును మీరు ఈలాగు లోకులకు బోధించితిరి.

ఇంతలో విజయుడు ఇతరభక్తులతోడి సంభాషణలో దిగెను.

విజయుడు :— ఎవరో ఒకరు నాతో గూడనే సంచరించుచున్నట్లు నాకు దోచుచున్నది. ఆ వ్యక్తియే దూరసంభవాలను సైతము నాకు జూపుచున్నాడు.

నరేంద్రుడు :— ప్రక్కనే ఉండి కాపాడు వేల్పువలె.

విజయుడు :— ఢాకాలో ఉండగనే ఈయన (=గురుదేవుని)

దర్శనము నాకు కలిగినది. కలిగినప్పుడు ఈయన మేనును నేను తాకను కూడ తాకితిని.

గురుదేవుడు :— (చిఱునవ్వుతో) ఆ వ్యక్తి వేఱు ఎవరో ఐ యుండును.

నరేంద్రుడు :— ఆయనను నేను కూడ ఎన్నో సార్లు చూచి యున్నాను. [విజయునితో] నీ మాటలను నమ్మ నని నే నెట్లన గలను ?

1885 వ సంవత్సరము అక్టోబరు తే 27 ది మంగళవారము.

అప్పటికి సాయంకాలము ఐదునఱ గంటలు. డాక్టరుసర్కారు శ్యాంపుకూరులో గురుదేవుని గదిలోనికి వచ్చి, ఆయన నాడిని పరీక్షించి, ఈయవలసిన మందును నిర్ణయించెను. పెక్కండ్రు భక్తులు అట నుండిరి. వారిలో నరేంద్రుడును, గిరీశుడును, డాక్టరు దుకారియు, చిన నరేంద్రుడును, రాఖాలుఁను, మహేంద్రుడును, శరత్తును, శ్యాంబసును ఉండిరి.

గురుదేవుని వ్యాధిని గూర్చి ఇంచుక మాటాడి, డాక్టరు సర్కారు, ఆయన మందు మొదటి మోతాదు పుచ్చుకొనుచున్నప్పుడు ప్రక్కనే చూచు చుండెను. తర్వాత శ్రీరామకృష్ణుడు శ్యాంబసుతో సంభాషింప ఆరంభించెను. "మీరు శ్యాంబసుతో మాటాడుచున్నారు కావున ఇక నేను సెలవు తీసికొందు" నని డాక్టరు సర్కారు బయలు దేఱెను.

పాట లేవైన విన గోరుదువా అని గురుదేవుడును మఱొక భక్తుడును డాక్టరు నడిగిరి.

డాక్టరు సర్కారు :— [గురుదేవునితో] విన వలెనను కోరిక నాకు ఎంతో ఉన్నది, కాని, పాట చెవిని బడగనే మీరు మేకపిల్ల వలె త్రుళ్లి వివిధరీతుల దుముకులాడుదురు. మీ భావోద్రేకమును మీరు అణచుకో వలెను.

డాక్టరు సర్కారు మరల తన పీఠముపై గూర్చుండెను. నరేంద్రుడు మధురకంఠమున పాడ ఆరంభించెను. తంబురా శ్రుతియు మృదంగవాద్యమును గూడ నుండినవి —

చిమ్మ చీకటిలోనఁ జెలు వొందు, నమ్మ,
రూపరహితము నీ రూపాతిశయము,
కాననే యోగిపుంగవు లెల్ల రెపుడు
చీకటి గుహలలోఁ జేరి ధ్యానింత్రు.
అంతమే లే నట్టి యంధకారాన,
నలఘు నిర్వాణంపు టలలపై నెక్కి,
నిర్మ లావ్యయ శాంతి నిరతము పాఱు.
శూన్య రూపము దాల్చి, చుట్టు నున్నట్టి
కటికి చీకటి యను కప్పడమున స
మాధి యక్ష గుడి నసమాన వై వెల్గు
తల్లి, నీ వెవ్వరు? దయఁ దెల్ప వమ్మ.
అభయప్రదంబు నీ యడుగుఁ దమ్మి కవ
ప్రేమవిద్యుల్లతల్ వెల్వరించెడిని,
జ్ఞానభాసురము నీ చారు వదనము,
పరుష భీకర హాస వంత మై తనరు.

డాక్టరు సర్కారు "ఈ పాట విన్నచో గురుదేవునకు అపాయమే" అని మహేంద్రునితో ననెను. డాక్టరు ఏ మన్నా డని శ్రీరామకృష్ణుడు అడుగగా, "ఈ పాట విన్న మీ మనస్సు సమాధిలో పడి పోవు నని డాక్టరుగారి దిగులు" అని మహేంద్రుడు తెలిపెను.

ఇంతలో గురుదేవుడు బాహ్యలోకస్మృతిని కొంతవఱకు కోల్పోయెను. వైద్యుని జూచుచు మోడ్పుకేలుతో "అట్లు జరుగనే జరుగదు. నే నేల సమాధి నొంద వలెను" అని అనుచునే ఆయన

గాఢసమాధిలో మునిగెను, మేను నిశ్చలమయ్యెను, చూపులు కదల వాయెను, నోటి మాట ఆగి పోయెను. మలంపబడ్డ శిలాప్రతిమ వలె నిశ్చలుడై ఆయన కూర్చుండెను, బాహ్యలోకస్మృతి ఆయనకు బొత్తుగ లేనే లేదు. చిత్తమును అహంకారమును జ్ఞానేంద్రియము లును అన్నియు అంతర్ముఖము లైనవి. ఆయన పూర్తిగ మాఱిపోయి నట్లు కనిపించెను.

నరేంద్రుని పాట సాగుచునే ఉండెను. పాటలో అతడు తన డెందమును ఆత్మను పూర్తిగా లీన మొనర్చెను—

ఎంత సొం పెంత సొం! పే దాను సాటి ?
ఎంత మోహన మౌర, యీ ముద్దు మోము!
నా పేద గుడిసెలో నా యాత్మ భర్త
తాఁ జొచ్చె; నా ప్రేమ తా నన్ని దెసల
నూట లూరెడి; నా మనోనాథ, చెపుమ
ప్రాణకాంతుఁడ, నీదు పాదపద్మముల
నర్చింప నా కున్న యైశ్వర్య మేది ?
కొనుము నా ప్రాణము, కొనుము నా యాత్మ,
అంతకంటెను నేమి యర్పింపఁ గలను?
ఏ దేది యున్నదో యెన్న నా దగుచు,
కొనుము దాని దయతో, కొనుము పూర్తిగను.

పాట సాగుచుండగనే శ్రీరామకృష్ణునకు బాహ్యలోకస్మృతి గలిగినది. నరేంద్రుని పాట ముగిసిన పిమ్మట, గురుదేవుడు సంభాష ణను కొనసాగించెను. శ్రోత లెల్లరును మంత్రముగ్ధులుగ నుండిరి. అద్భుతావిష్టులై భక్తులు ఆయన మోమును తిలకించుచుండిరి. ఆయన మిక్కుటంపు వ్యాధిబాధ ననుభవించుచున్నను దాని జాడ ఇంచు కేని ఆయనమోమున కనిపింప లేదు. ఆ మోము దివ్యానందముతో వెలుగొందుచుండెను.

డాక్టరు నుద్దేశించి గురుదేవు డిట్లనెను — ఈ బూటకపు వినయమును విడువుము. భగవన్నామసంకీర్తనము చేయుటకు నీవు సిగ్గుపడ నేల? అవమాన ద్వేష భయములకు వశపడు వానికి దైవ సాక్షాత్కారము అలభ్య మను నానుడి యథార్థము. 'నేను ఇంత గొప్పవాడను, దేవుని పేరును బిగ్గఱగ జెప్పుచు నేను నర్తించుటయా? దీనిని విన్నచో తక్కిన గొప్పవారు నన్ను గూర్చి ఏ మనుకొందురు? వైద్యుడు పాపము కృష్ణా రామా గోవిందా అనుచు నాట్య మాడు చున్నా డని వారు నా విషయమున జాలి చెందుదురే'— అను ఇట్టి వెల్ల వెఱ్ఱి తలంపులు. వీనిని విడిచిపెట్టుము.

డాక్టరు:—లోకు లే మనుకొందురో అను చింత నాకు లేదు. వారి అభిప్రాయాలను నేను లక్ష్యపెట్టను.

గురుదేవుడు:—ఔ నౌను, నే నెఱుగుదును అందుంగూర్చిన నీ భావ ద్రఢిమను. [అందఱును నవ్వుదురు].

జ్ఞానమును అజ్ఞానమును దాటి పొమ్ము. పోయిననే, దైవ సాక్షాత్కారము కలుగును. పెక్కు విషయాల యెఱుకయు అజ్ఞానమే. వైదుష్యమదమును అజ్ఞానమే. చరాచరముల కన్నిటికిని అంతర్యామిగ దేవు డొక్కడే ఉన్నా డను దృఢవిశ్వాసమే జ్ఞానము. దేవునితో అత్యంతసన్నిహితపరిచయము విజ్ఞానము. జ్ఞానమున కంటె విజ్ఞానము విశిష్టము. జ్ఞానాజ్ఞానాలకు రెంటికిని అతీతుడు ఈశ్వరుడు.

శ్యాంబాబు:—జ్ఞానాజ్ఞానములను దాటి నాతనికి ఇక ఏమి మిగులును?

గురుదేవుడు:—నిత్యశుద్ధబోధరూపము మిగులును. దానిని నీకు నే నెట్లు స్పష్టపఱుప గలను? ఒక తరుణి తన సఖిని "చెలీ, నీ ప్రియుడు ఇచ్చటే ఉన్నాడు కదా, ఆయనతో గలిసి నీ వనుభవించు నానంద మెట్లుండు" నని అడిగిన దట. ఆ సఖి "చెలీ, నీ కొక భర్త లభించినప్పుడు నీ కది స్వయముగ అర్థ మగును. దానిని నీకు నే నెట్లు వివరింప గలను" అని బదులు చెప్పిన దట.

బ్రహ్మ మిట్టి దని మాటలచే వర్ణింప లేము. సచ్చిదానందుని తోడి లీలానందమును సంయోగానందమును వాగ్రూపమున నెవరును వర్ణింప లేరు. అది ఎవనికి సిద్ధించునో వానికి తెలియును.

డాక్టరు సర్కారుతో శ్రీరామకృష్ణుడు ఇంకను ఇట్లనెను— ఇటు చూడుము. అహంకారము నుండి విడుపొందనివానికి జ్ఞానము అలభ్యము.

నేను ముక్తిని గన నేర్చు టెన్నటికో ?
'నేను' సచ్చినఁ గల్గ నేర్చును ముక్తి.

అను ఆభాణక మొకటికలదు. 'నేను' 'నాది'అనుటే అజ్ఞానము. ''నీవు'' ''నీది'' అనుటే జ్ఞానము. ''దేవా, నీ వొక్కడవే కర్తవు, అన్నిటిని నిర్వహించువాడవు నీ వొక్కడవే. నేను సాధనమాత్రుడను. నీవు ఏమి చేయించిన నే నది చేయుచుందును. ధనము నీది, ఆస్తి నీది, వే యేల విశ్వ మంతయు నీదే. ఈ యిల్లు నీదే, నాది కాదు, ఈ చుట్టాలు నీవారే, నావారు కారు, నేను నీ దాసుడను, నాకు ఉన్న దెల్ల నీ యాజ్ఞానుసారము నీకు సేవ చేయు హక్కు మాత్రమే'' — అని పలుకుచుండును యథార్థభక్తుడు.

ఎవో కొన్ని గ్రంథాలను చదివిన వారు తలపొగరును వదిలించుకో లేరు. ఒకనాడు నాకును కాళికృష్ణఠాగోరునకును భగవద్విషయకసంభాషణ కొంత జరిగినది. అతడు క్షణ మేని వేవక, ''అందుంగూర్చిన సమస్తమును నే నెఱుగుదును'' అన్నాడు. నే నడిగితిని ''పెద్దమనుష్యుడైనవాడు తాను పెద్దమనుష్యుడ నని ప్రతి వ్యక్తితోను చెప్పుకొనుచు తిరుగుచుండునా ?''

శ్యామ్:—మఱి కాళికృష్ణఠాగోరునకు మీపై నెంతో గౌరవ మున్నదే ?

గురుదేవుడు:—ఔరా, గర్వము ఒకమానవుని బుద్ధిను ఎట్లెట్లు త్రిప్పును ! దక్షిణేశ్వరపు గుడితోటలో పాకీపనికత్తె ఒకతె

ఉండెను. ఔరా! ఆమె గర్వము! ఏవో కొన్ని నగలు ఉన్నవి ఆమెకు. అందుకే ఈ గర్వ మంతయు. ఒకనాడు వీధిలో కొందఱు ఆమెను దాటుకొని పోయిరి. అప్పుడు ఆమె వారిని "ఏమండోయి, మిమ్ములనే, పొండి, పొండి, నాదారినుండి" అని కసరినది. ఒక పాకి పనికత్తె ఇట్లు మాటాడ గలిగినచో ఇతరుల గర్వమును గూర్చి ఎవ రైనను చెప్పుట కేమి కలదు?

శ్యామ్:—స్వామీ, అన్నిటికిని కర్త దేవుడే అగు నేని, పాపములకై మానవులకు దండన ఏల ?

గురుదేవుడు:—కంసాలివానివలె మాటాడుచున్నావే.

నరేంద్రుడు:— అనగా వస్తువులను తన సూక్ష్మ తులలో తూచు కంసాలివలె శ్యాంబాబు లెక్క కచ్చితముగల వ్యక్తి అనుట.

గురుదేవుడు:— నేను చెప్పిన దిది — అబ్బాయీ, పిచ్చి వాడా, మామిడిపండ్లు తిని హాయిగా ఉండుము. తోటలో ఉన్న చెట్లు ఎన్ని వందలు, వాని శాఖలు ఎన్ని వేలు, ఆకు లెన్ని లక్షలు— ఈ లెక్కలను సరిచూచుకొనుట వలన ప్రయోజన మే మున్నది? మామిడిపండ్లను తింద మని నీవు తోటకు వచ్చితివి, తినుము, తృప్తి నొందుము.

[శ్యాముతో] భగవత్సేవకే నీకు ఈ లోకాన మానవజన్మము గల్గినది. కావున భగవత్పాదారవిందముల ప్రేమ నలవఱచుకొన ప్రయత్నింపుము. వేఱువిషయాలను నూఱింటిని తెలిసికొను శ్రమ నీ కెందులకు? శాస్త్రచర్చల వలన నీ కేమి లాభము? ఇటు చూడుము. నీకు కైపు కలిగించుటకు ఒక ఔన్సు మద్యము చాలునే. గిడ్డంగిలో ఎన్ని గాలన్ల కల్లు ఉన్నదో నీవు కనుగొను టెందులకు?

డాక్టరు:—మీరు చెప్పినది మిగుల సరి. విశేష మే మనగా, దేవుని గిడ్డంగిలోని మద్యమునకు ఇంత అను కొలత లేదు. దాని కొక హద్దు లేదు.

గురుదేవుడు:—[శ్యాముతో] నీ వేల రక్షణభారమును దేవుని కర్పింపవు? నీ బాధ్యతల నన్నిటిని ఆయనపై పెట్టుము. నీ బాధ్యతలను నీ వొక విశ్వాసార్హున కప్పగించితివేని, ఆ యధికారమును నీపట్ల అతడు దుర్వినియోగము చేయునా? నీ పాపాలకు నిన్ను శిక్షించుటో శిక్షింపక మానుటో తెలిసిన వాడు దేవు డొక్కడే.

డాక్టరు:—దేవుని మనస్సులో ఏ మున్నదో దేవునికే తెలియును. మానవుడు దాని నెట్లు ఊహింప గలడు? మన కొలతలకు వేనికిని అందనివాడు దేవుడు.

గురుదేవుడు:—[శ్యాముతో] కలకత్తావా రైన మీరు అందఱును ఉపన్యసించు విషయము ఒక్కటే. 'భగవంతుడు పక్షపాత కళంకితుడు. ఏల యన ఆయన ఒకనిని సుఖినిగను వే ఱొకనిని దుఃఖిగను చేయుచుండును'. ఇది మీ వక్కణము. ఈ తుంటరులకు తమలో ఏమి కనిపించుచున్నదో దేవునిలోను అదే కనిపించుచున్నది.

శ్యామ్:—సూక్ష్మదేహమునుగూర్చి ఎం తెంతో వినుచుందుమే. ఎవ రైనను దానిని మనకు చూప గలడా? మానవుడు మరణించునప్పుడు స్థూలదేహమును వీడి సూక్ష్మదేహమున ఏలాగు పోవునో ఎవ రైనను చూపఁ గలడా?

గురుదేవుడు:—ఈ విషయములను మీకు చూపు అక్కఱను యథార్థభక్తులు ఇంచు కేని వహింపరు. గొప్పపదవియం దున్న యొక మతిహీనుడు తమ్ము గౌరవించినను గౌరవింపకున్నను వారి కేమి లక్ష్యమా? గొప్పవానిని ఒకనిని తమ చేతి క్రింద నుంచుకొందమను కోరిక వారి మనసులలోనికి చొరనే చొరదు.

శ్యామ్:—స్థూలశరీరమునకును సూక్ష్మశరీరమునకును ఏమి భేదము?

గురుదేవుడు:—స్థూలభూతపంచకాత్మక మైన శరీరము స్థూలశరీరము అన బరగును. మనో బుద్ధి చిత్తాహంకార వికార మైనది

సూక్ష్మశరీరము. చేతనునకు కారణశరీర మొకటి ఉన్నది, భగవత్సంశ్లేష భగవదానందముల యనుభవమున కది సాధనము. వీని కన్నిటికిని పైది మహాకారణము. అది వాగగోచరము.

ఊరక సుద్దులను వినుచున్నంత మాత్రాన ఏమి ప్రయోజనము? ఏమైన చేయవలెను. వేఱు వేఱు నంబర్లు గల నూళ్లలో ఒకడు 'ఇది నలుబదవది ఇది నలువదొక్కటవది' అని గుర్తింప గలిగియుండ వలెనన్న అతడు నేతవృత్తిలో ఉండక తప్పదు. ఈ నూలు ఈ నెంబరుది అని గుర్తించుట నూలువ్యాపారుల కొక కష్టము కానే కాదు. కాబట్టియే కొంత ఆధ్యాత్మిక సాధనను చేయుమని చెప్పుచున్నారు. చేసితి వేని, స్థూలము, సూక్ష్మము, కారణము, మహాకారణము — ఇవన్నియు నీకు తెలియ నగును. దేవుని ప్రార్థించునప్పుడు ఆయన పాద పద్మములందు ప్రేమ నిమ్మనియే ప్రార్థింప వలెను.

లోకమాతను నేను ప్రార్థించినది ప్రేమ నిమ్మనియే. ఆమె పాదపద్మములకు పుష్పము లర్పించి చేతులు జోడించుకొని ఇట్లంటిని — "అమ్మా, ఇదో నీ అజ్ఞానము, ఇదో నీ జ్ఞానము, రెంటిని గొని, నీ యెడ పవిత్రమైన ప్రేమను మాత్రమే నాకు ప్రసాదింపుము. ఇదిగో నీ పవిత్రత, ఇదిగో నీ అపవిత్రత, రెంటిని గొని, నీ యెడ శుద్ధమైన ప్రేమను మాత్రమే నాకు అనుగ్రహింపుము. ఇదిగో నీపుణ్యము, ఇదిగో నీ పాపము, ఇదిగో నీ మంచి, ఇదిగో నీ చెడుగు, వీని నన్నింటిని గొని, నీయెడ పవిత్రమైన ప్రేమను మాత్రమే నా కొసంగుము. ఇదిగో నీ ధర్మము, ఇదిగో నీ అధర్మము, రెంటిని గొనుము, నీయెడ పవిత్రమైన ప్రేమను మాత్రమే నాకు దయచేయుము".

ధర్మము లనగా, దానము మొదలైన మంచి పనులు. ధర్మమును అంగీకరింతు వేని, అధర్మమునుకూడ అంగీకరింపక నీకు తప్పదు. పుణ్యమును అంగీకరింతు వేని, పాపమును కూడ అంగీక

రింపక నీకు తప్పదు. జ్ఞానమును అంగీకరింతు వేని, అజ్ఞానమునుకూడ అంగీకరింపక నీకు తప్పదు. పవిత్రతను అంగీకరింతు వేని, అపవిత్రతను కూడ అంగీకరింపక నీకు తప్పదు, వెలుతురు నెఱింగిన మానవుడు చీకటినికూడ ఎఱిగియే ఉండును గదా. ఇదియు అట్లే. ఒకటిని ఎఱింగిన మానవుడు పెక్కింటిని కూడ ఎఱిగిన వాడే. మేలు నెఱిగిన మానవుడు కీడును గూడ ఎఱిగిన వాడే.

తాను పందిమాంసమును దినుచున్నప్పటికిని భగవత్పాదారవిందప్రేమను నిలుపుకోగలవాడే ధన్యుడు. ఐహికసంగము గలవాడు, వరి అన్నమును కాయగూరలనే తినుచున్నప్పటికిని—

డాక్టరు:—అభాగ్యుడే. కాని మీ ప్రసంగము నడుమ, నన్నొక్క విషయమును చెప్పనిండు — బుద్ధుడొకసారి పందిమాంసము తినెనట, అందుల ఫలితముగా ఆయనకు కడుపునొప్పి గల్గినదట. ఆ నొప్పిని పోగొట్టుకొనుటకై ఆయన నల్లమందు తిని కైపులో ఉండెడివాడట. నిర్వాణము మొదలైన వాని అర్థము మీకు తెలియునా? నల్లమందు తిని బుద్ధుడు స్తబ్ధుడై యుండెడివాడు. బాహ్యలోకస్మృతి ఆయనకు ఉండనే ఉండదు. ఆ దశనే వారు నిర్వాణ మందురు.

నిర్వాణశబ్దమునకు ఈ క్రొత్త వివరణమును విని అందఱును నవ్విరి. సంభాషణ ఇంకను సాగినది.

శ్యామ్:— స్వామీ (దివ్యజ్ఞానవాదము = ) థియాసఫిని గుఱించి మీ యభిప్రాయ మేమి?

గురుదేవుడు:—దాని వివరమును దాని సంక్షేపమును గూడ చెప్పుచున్నాను. దేశాటనము చేయుచు శిష్యులను ప్రోగుచేసికొను వారు చాల క్రింది తరగతి వారు. గంగమీద నడచిపోవుటకో, దూరదేశమున నున్న వారి మాటలను ఇక్కడినుండియే వినుటకో, గూఢశక్తులు ఆశించువారు కూడ క్రిందితరగతివారే. భగవద్విషయమున శుద్ధప్రేమ అట్టి వారి కలవడుట చాల కష్టము.

శ్యామ్:—మఱి హిందుధర్మపునఃస్థాపనకు కదా థియాసఫిస్టులు పాటుపడుచున్నారు!

గురుదేవుడు:—వారినిగూర్చి నా కెక్కువగా తెలియదు.

శ్యామ్:—శరీరపతనానంతరము ఆత్మ చంద్రమండలమునకు పోవునో నక్షత్రమండలమునకు పోవునో వేఱు ఏ చోటికి పోవునో—థియాసఫీవలన మీరు తెలిసికో వచ్చును.

గురుదేవుడు:—తెలిసికో వచ్చును. కాని నా వైఖరిని చెప్పెదను వినుము. ఒకప్పు డొక మానవుడు హనుమంతుని "నేడు ఏమి తిథి" అని అడిగినాడట. "నేడు ఈ వారము, ఈ తిథి, ఈ నక్షత్రము అను నిట్టి విషయాలు నే నెఱుగనే ఎఱుగను. నా ధ్యానము రామునిమీదనే" అని హనుమంతుడు బదులు చెప్పినాడట. నా వైఖరియు అదే.

శ్యామ్:—మహాశయా. థియాసఫిస్టులకు మహాత్ము లన్న ఎంతో నమ్మక మట, మీ కున్నదా మహాత్ములలో నమ్మకము?

గురుదేవుడు:—నా మాటను నీవు నమ్ముదు వేని చెప్పుచున్నాను. మహాత్ములందు నాకు నమ్మక మున్నది. మఱి ప్రస్తుతమునకు ఆసంగతులు ఉండనీ. నాకు కొంచెము స్వస్థత కలిగిన పిమ్మట ఇచ్చటికి మరల రమ్ము. నాయందు నీకు విశ్వాస మున్న, నీ మన శ్శాంతికి ఏదో ఒక దారి అగపడును. ధనవిరాళాలకు కాని వస్త్ర బహూకృతులకు కాని నేను చేయి చాప నని నీవు గుర్తించియే యుందువు. ఇక్కడ ఎట్టి వసూలును లేదు. కావుననే ఇక్కడికి ఇందఱు వచ్చుచుందురు [నవ్వు].

[డాక్టరుతో] కోపింప కుందు వేని ఒక సంగతిని చెప్పెదను. ఏదో కాదు, ఇదే — ధనము గౌరవము ఉపన్యాసాలు చేయుట మొదలైనవి నీవు ఇప్పటికి అనుభవించినవి చాలును. ప్రస్తుతము

కొన్నాళ్ళపాటు నీ మనస్సును దేవునివంకకు మరల్చుకొమ్ము. అప్పు డప్పుడు ఇచ్చటికి వచ్చుచుండుము. భగవద్విషయిక ప్రసంగాలను వినుచున్నచో నీయాధ్యాత్మికపరత రగుల్కొనును.

కొంతసేపటికి డాక్టరు వీడ్కొనుటకై లేచెను. గిరీశచంద్ర ఘోషు అప్పుడే గదిలోనికి వచ్చి గురుదేవునికి ప్రణమిల్లెను. అతని జూచి ప్రీతుడై డాక్టరుసర్కారు మరల కూర్చుండెను.

డాక్టరు:—[గిరీశుని జూపుచు] నే నిచ్చట ఉన్నంతసేపును ఇతడు రాడు. నేనును తరలుద మని లేచితిని, ఇతడును గదిలో ప్రవేశించినాడు.

డాక్టరు సర్కారు స్థాపించిన (సైన్సు అసోసియేషను=) విజ్ఞానసమితినిగూర్చి ఆయనయు గిరీశుడును సంభాషింప దొడంగిరి.

గురుదేవుడు :— ఒక్కనాడు నన్ను అచ్చటికి పిలుచుకొని పోయెదవా ?

డాక్టరు :— అచ్చటికి వచ్చి, దేవుని వింత పనులను చూచిన తక్షణమే మీరు శరీరస్మృతిని పూర్తిగ కోల్పోవుదురు.

గురుదేవుడు :— కోల్పోవుదును, నిజమే.

డాక్టరు :— (గిరీశునితో) మీరు వేఱు ఏమైన చేయుదురు గాని దయచేసి ఈయనను దేవు డని ఆరాధింపకుడు. మీ చేతలచే పాపము ఈ సాధుమహాశయుని తల తిరిగిపోవుచున్నది.

గిరీశుడు :— మఱి నే నేమి చేయుదును? భవసాగరతారకు డును, మీదు మిక్కిలి సంశయార్ణవనిస్తారకుడు నైన వ్యక్తిని గూర్చి వే రెట్లు భావింతును? నేను పావన మని తలంపని అంశ, మొక్కటి యైన ఆయనలో లేదు.

డాక్టరు :— ఈయన పాదధూళిని నేను తల దాల్ప రాదా? ఇటు చూడుము.

డాక్టరు శ్రీరామకృష్ణునకు ప్రణమిల్లి తన ఫాలము ఆయన చరణములకు సోకించెను.

గిరీశుడు :— ఆహా! ఈ శుభవేళ ధన్య మగు గాక, ధన్య మగు గాక అని దేవతలు దీవించుచున్నారు.

డాక్టరు :— ఒకమానవునిపాదధూళిని గొంటి మేని అందు ఆశ్చర్యకర మే మున్నది? ఎవనిపాదధూళి నైనను నేను కొన గలను. మీ రందఱునే మీ పాదధూళిని నాకు ఇండు.

డాక్టరు భక్తు లందఱ పాదములను తాకెను.

నరేంద్రుడు :— [డాక్టరుతో] ఈయన (=శ్రీరామకృష్ణుడు) దేవునిబోలిన వ్యక్తి అని మా తలంపు. నీ కర్థ మైనదా మాతలంపు? సృష్టిలో స్థావరము లొక వర్గము, ప్రాణు లొకవర్గముకదా. ఒక కొన్ని పదార్థములను అవి ఆ వర్గమువో ఈ వర్గమువో నిర్ణయించుట చాల కష్టము. అట్లే నరలోకమునకును దేవలోకమునకును నడిమిదశ ఒకటి కలదు. ఆ దశలో నున్న వ్యక్తిని నరు డని కాని దేవు డని కాని నిర్ణయించుట చాల కష్టము.

డాక్టరు :— ఔను గాని, దివ్యవిషయాలకు సాటువలు సరి పోవు నాయనా.

నరేంద్రుడు :— ఈయన దేవు డని నే ననను. మఱి నేను చెప్పునది ఈయన దేవతుల్యుడైన మానవు డని.

డాక్టరు :— ఇట్టి విషయాలలో మన మనోభావాలను అణచుకో వలె. వానిని ప్రకటించుకొనుట మంచిది కాదు. నా మనోభావాలు ఎవరికిని అర్థము కావు. నా ప్రాణమిత్రుడు సైతము నన్ను గూర్చి క్రూరు డని కఠిను డనియే తలంచును. మీవంటివారుకూడ ఒకనాడు నన్ను చెప్పుతో కొట్టి తఱిమివేసెద రేమో!

గురుదేవుడు :— అట్టి మాట లనకుము. నీమీద వీరి కెంతో ప్రేమ. వధువును పడకగది కంపిన సఖులు వరునిరాకకు ఎంత ఆత్ర

ముతో వేచి యుందురో వీరు నీ రాకకై అంత ఆత్రముతో వేచి యుందురు.

గిరీశుడు :— ఒక్కొక్కనికిని నీ మీద అతిమాత్ర మైన ఆదరమే.

డాక్టరు :— నేను క్రూరహృదయుడ నని మా అబ్బాయి తలంచును. నా భార్యకు కూడ ఆ తలంపే. నేను నా మనోభావాలను చూపుకోను. అదే అ దొక్కటే నా అపరాధము.

గిరీశుడు :— అట్లగుచో, మిత్రులపైని కనికరముచేత నైనను నీ హృదయకవాటమును తెఱచుట వివేకము. తెఱవ కున్న, చూచితివా. నీ మిత్రులే నిన్ను అర్థముచేసికో లే కున్నారు.

డాక్టరు :— నా మనోభావాలు మీ మనోభావాలను సైతము మించి ఉప్పొంగుచుండును. చెప్పెదను నేని నా మాట నమ్మెదురా? (నరేంద్రునితో) ఒంటరిగ ఉన్నప్పుడు కన్నీరు కార్తును.

(శ్రీరామకృష్ణునితో) అనుమతింతు రేని ఒక్క సంగతిని చెప్పెదను — మీరు సమాధిదశలో ఉన్నప్పుడు మీ పాదమును ఇతరుల దేహములపై నుంతురు. అది మంచిపని కాదు.

గురుదేవుడు:—ఆసమయములో తెలిసియే అట్లు చేయుచున్నా ననియా నీతలంపు?

డాక్టరు:—చేసినపని సరి కా దని మీరును అభిప్రాయ పడితిరి; ఔనా?

గురుదేవుడు:—సమాధిదశలో నేను ఏమి అనుభవింతునో నీకు ఏలాగు వివరింప గలను? ఆదశనుండి దిగిన తర్వాత, ఒక్కొక్క సారి, నావ్యాధికి సమాధియే కారణ మేమో అనుకొందును. దేవుని తలచుకొన్న నాకు వెఱ్ఱి ఎత్తును. ఉన్న విషయము అది. ఆ దివ్యోన్మాదఫలితాలే ఇవి అన్నియు. దానికి నే నేమి చేయ గలను?

డాక్టరు:— నా అభిప్రాయమును ఈయన సరి అన్నాడు.

తాను చేసిన పనికి అనుతాపమును తెలుపుకొనుచున్నాడు. చేసిన పని తప్పే అని ఈయన ఎఱుగును.

గురుదేవుడు:— (నరేంద్రునితో) నీవు మంచి తెలివి గల వాడవే, ఏల బదులు చెప్ప కున్నావు? విషయమును డాక్టరుకు సమగ్రముగ వివరింపుము.

గిరీశుడు:—(డాక్టరుతో) అయ్యా, నీవు పొరపడితివి. తాను సమాధిలో ఉన్నప్పుడు తన పాదములు భక్తులకు తగిలినందులకు ఈయన అనుతాపమును ప్రకటించుట లేదు. ఈయన మేను పాప స్పర్శ లేనిది, పరమపావనము; ఇతరులను ఈయన ఈలాగు స్పృశించుట వారి మేలునకే. వారి పాపభరమును తాను గొనుటచే, తనకీ వ్యాధి వచ్చిన దేమో అని కూడ ఈయన ఒక్కొక్కప్పుడు అనుకొనుచుండును.

నీ సంగతినే స్మరింపుము. నీకు ఒకప్పుడు కడుపునొప్పివచ్చినది. రాత్రి చాలసేపు నడుము వ్రాల్చక కూర్చుండి చదువుచున్నందుననే ఆ నొప్పి వచ్చిన దని అప్పుడు నీవు చింతిల్ల లేదా? అంతమాత్రముచే రాత్రి చాలసేపు చదువుట తనంతనే ఒక కీడని రుజువైనదా? ఈయన (శ్రీరామకృష్ణున)కు కూడ వ్యాధి గల్గినదే అను చింత ఉండ వచ్చును. అంతమాత్రముచేత ఇతరులకు శ్రేయస్కరముగ వారిని స్పృశించుటే తప్పని ఈయన తలంపడు.

డాక్టరుసర్కారు చాల తికమకపడి గిరీశునితో "నీచేత నేను ఓటమి చెందితి నని ఒప్పుకొన్నాను. నీపాదధూళిని నాకు ప్రసాదింపు" మని అతనికి ప్రణమిల్లెను.

డాక్టరు:— [నరేంద్రునితో] ఇతనిని (=గిరీశుని) గూర్చి ఎవరు ఏమైన అన వచ్చును గాని, ఇతని మేధాశక్తిని కాదనజాల లేరు.

నరేంద్రుడు:—[డాక్టరుతో] మఱి యొక విధముగ కూడ నీవు పరికింప వచ్చును. ఆరోగ్యమును కాని సౌఖ్యమును గాని లక్ష్య

పెట్టక శాస్త్రపరిశోధనలకై నీ జీవితమునే నీవు అర్పింపగలవు కదా. మఱి శాస్త్రము లన్నిటిలోను భగవచ్ఛాస్త్రము మహిష్ఠ మైనది. భగవత్సాక్షాత్కారమునకై ఈయన ఆరోగ్యమును లక్ష్యపెట్టడు. అది సహజమే కదా.

డాక్టరు:—జీసను, చైతన్యుడు, బుద్ధుడు, మహమ్మదు మొదలైన మతసంస్కర్త లందఱునే కడకు అహంకారభరితు లైరి. ఒక్కొక్కరును 'నేనేమి చెప్పినను అదిమాత్రమే నిజము' అన్నారు. ఎంత విపరీతము!

గిరీశుడు:—(డాక్టరుతో) మహాశయా, ఇప్పుడు నీవును ఆ తప్పునే చేయుచున్నావు. వారి నందఱిని అహంకారభరితు లను చున్నావు, నిందించుచున్నావు. ఇదే కారణముగా, అహంకారము గలవాడ వని నిన్నుగూడ నిందింప వచ్చును.

డాక్టరుసర్కారు మౌనముగ ఉండెను.

నరేంద్రుడు :— (డాక్టరుతో) భగవదారాధనకల్పముగా మేము ఈయన నారాధింతుము.

ఈమాటలు విని గురుదేవు డొక శిశువు వలె నవ్వెను.

1885 వ సంవత్సరము అక్టోబరు తే 29 ది గురువారము.

అప్పటికి ఉదయము దాదాపు పదిగంటలు. శ్రీరామకృష్ణుని స్థితిని డాక్టరుసర్కారునకు దెలుపుటకై కలకత్తా సాంఖారిటోలాలో ఉన్న అత నింటికి మహేంద్రు డరుదెంచెను. వెంటనే వారు డాక్టరు గారి బండి నెక్కిరి. డాక్టరు పలువురు రోగుల యిండ్లకు పోయెను. పాదూరియాఘాటాలో టాగోరుకుటుంబమువారి యింట ప్రవేశించి నప్పుడు, ఆయింటిపెద్దవలన డాక్టరుకు కొంత ఆలస్యమైనది. మరలి బండిలోనికి వచ్చిన తర్వాత శ్రీరామకృష్ణుని వ్యాధిని గుఱించియు,

ఆయనపట్ల వహింపవలసిన మెలకువనుగుఱించియు, డాక్టరు మహేం ద్రునితో మాటాడ నారంభించెను.

డాక్టరు:—ఆయనను దక్షిణేశ్వరమునకు పంపివేయుద మను సంకల్ప మున్నదా మీకు?

మహేంద్రుడు:—లేదే. అట్లు చేసిన భక్తులకు ఎంతో ఇబ్బంది. ఆయన కలకత్తాలోనే ఉన్నచో భక్తులకు ఆయనదర్శనము సదా సులభము.

డాక్టరు:—మఱి ఇక్కడ వ్యయము చాల ఎక్కువ యగునే.

మహేంద్రుడు:—వ్యయమును భక్తులు లక్ష్యపెట్టరు. ఆయ నకు సేవచేయ వీలుండ వలె ననుట ఒక్కటే వారి కోరిక. వ్యయ మునా, భరింపక తప్పదు. ఆయన కలకత్తాలో ఉన్నను భరింప వలసినదే. దక్షిణేశ్వరములో ఉన్నను భరింపవలసినదే. కాని ఆయన మరల దక్షిణేశ్వరమునకు చేరుకొన్నచో, ఆయన నెల్లప్పుడును దర్శించు వసతి భక్తుల కుండదు. దర్శనము లభింపకున్న వారి మన స్సుల కెంతో బాధ.

డాక్టరు సర్కారును మహేంద్రుడును శ్యాంపుకూరునకు వచ్చిరి, వచ్చి చూచు సరికి గురుదేవుడు గదిలో భక్తగోష్ఠిలో కూర్చుండెను. డాక్టరు భాదురి కూడ అచ్చట నుండెను.

డాక్టరు సర్కారు గురుదేవుని నాడిని పరిశీలించి ఎట్లున్నా రని అడిగెను. జరిగిన సంభాషణలో దేవుని ప్రసంగము వచ్చినది.

డాక్టరుభాదురి:—నిజము చెప్పుదునా? ఇదంతయు మిథ్య, కలను పోలినది.

డాక్టరుసర్కారు:—అంతయు భ్రమయేనా? మఱి ఈ భ్రమ ఎవరికి? ఏల వారికి ఈ భ్రమ? భ్రమ యని అందఱికిని తెలిసిన, ఇక చర్చ ఎందులకు? దేవుడు సత్య మనియు ఆయనసృష్టి అసత్య మనియు నేను నమ్మ లేను.

గురుదేవుడు:— అది మంచి వైఖరియే. దేవుడు స్వామి అనియు తాను దాసుడనియు అనుకొనుట మంచిదే. తన మేను సత్యమను తలంపును 'నీవు' 'నే' నను భేదజ్ఞాపకమును మానవునకున్నంతవఱకును ఈస్వామికింకరసంబంధమును పెట్టుకొనుటే మంచిది, 'సోఽహమ్' 'అతడనే నేను' అను భావము నిష్టపడుట కానుండదు.

మఱి యొక సంగతిని చెప్పెదను వినుము. గదిని ఒక వైపునుండి చూడవచ్చును, దానినడుమనే ఉండియు చూడవచ్చును. అగపడు గది యేమో ఒక్కటే.

డాక్టరుభాదురి:—[డాక్టరుసర్కారుతో] ఇప్పుడు నేనుచెప్పిన విషయము వేదాంతములో నీకు కానవగును. శాస్త్రగ్రంథాలను నీవు తప్పక చదువవలయును. చదివినచో, విషయము తెలియును.

డాక్టరుసర్కారు:—అట్లేల? ఈయనకు ( = గురుదేవునికి) జ్ఞానము శాస్త్రగ్రంథపఠనమువలన గలిగినదేనా? ఈయన నాయభిప్రాయమునే బలపఱచుచున్నాడు. శాస్త్రగ్రంథాలను చదవక వివేకిగా నుండ రాదా ఏమి?

గురుదేవుడు:—మఱి, ఎన్ని శాస్త్రగ్రంథాలను నేను వినియున్నాను!

డాక్టరు సర్కారు:—వినుట తప్ప వేఱేమియు లేకున్న, అర్థము కాక పోవచ్చును. మీరు ఊరక విన్నవారు మాత్రమే కారే.

గురుదేవుడు:— [డాక్టరు సర్కారుతో] నన్ను వెఱ్ఱివాడు అంటివట కదూ? అందుకనియే (మహేంద్రాదులనుజూపుచు) వీరికి నీయొద్దకు వచ్చుట ఇష్టము లేదు.

డాక్టరు:—[మహేంద్రునివంకజూచుచు] మీకు [=గురుదేవునకు] వెఱ్ఱి అని నే నేల చెప్ప వలెను? మీ యహంకారమును మాత్రము నేను ప్రస్తావించితిని. ప్రజలను మీ పాదధూళి నేల తీసికో నిచ్చు చున్నారు?

మహేంద్రుడు:—తీసికొనియున్న వాడు ఏకర్త.

డాక్టరు:—అది వారి తప్పు. వారికి తెలియ చెప్ప వలెను.

మహేంద్రుడు:— ఈయన పాద ధూళిని వారు కైకొన్న, నీ వేల ఆక్షేపింప వలెను? దేవుడు సకలప్రాణులలోను లేడా?

డాక్టరు సర్కారు:— లేడని నే ననను. ఉన్నప్పుడు, నీవు అందరి పాదధూళిని గొన వలెను.

మహేంద్రుడు:—దేవుడు ఉన్నాడు కాని, కొందరిలో కంటె మఱికొందరిలో దేవునిమూర్తీభావము ఎక్కువగ నుండును. నీరు ఎల్లెడల ఉన్నది, కాని చెఱువులోనో నదిలోనో సముద్రములోనో నీరు నీకు ఎక్కువగ కనిపించుట లేదా? నీవు ఫారడేను గౌరవించి నంతగా శాస్త్రములో క్రొత్తగ పట్టభద్రుడైనవానిని గౌరవింతువా?

డాక్టరు సర్కారు:— నీ మాట నే నొప్పుకొందును కాని, మీరు ఆయనను దేవు డందురే, ఏల?

మహేంద్రుడు:—మన మొకరి కొకరము మ్రొక్కుకొందుమే, ఏల? ఏల యన ఒక్కొక్కనిహృదయమునను దేవు డున్నాడు. ఈ విషయమును నీవు ఎక్కువ యోచింప వైతివే.

గురుదేవుడు:—[డాక్టరు సర్కారుతో] ఒక కొందరిలో కంటె మఱికొందరిలో దేవుడు ఎక్కువగా అగపడు నని నే నింతకు మునుపే నీకు చెప్పితిని. సూర్యుని కిరణములను భూమి యొకవిధముగ ప్రతి ఫలింపజేయును, చెట్టు వే ఱొక విధముగ ప్రతిఫలింప జేయును, అద్దము అంతకంటె వే ఱైన రీతిలో ప్రతిఫలింప జేయును. ఇతరత్ర కనబడు ప్రతిబింబముకంటె అద్దములో గనబడు ప్రతిబింబము మేలుగ నుండును.

డాక్టరు సర్కారు జవాబు చెప్పలేదు. అందఱును మౌనముగ నుండిరి.

గురుదేవుడు:— [డాక్టరు సర్కారుతో తన మేనును జూపు కొనుచు] దీనిపై నీకు ప్రేమ కదూ? నాపై నీకు ప్రేమ ఉన్న దంటివే.

డాక్టరు సర్కారు:— ప్రకృతిమాతబిడ్డలలో మీ రొకరు. ఇదంతయు మీతో నేను చెప్పుటకు అదే కారణము. మీ పాదములను దాకుచు మీ కందఱును ప్రణమిల్లుచుండుట, నాకు చూడ దుర్భరముగ నున్నది. అయ్యో ఇంత మంచివానిని వారు చెడగొట్టు చున్నారే అని నాలో నే ననుకొనుచుందును. ఇదే విధముగ కేశవ చంద్రుని సైతము ఆయనభక్తులు చెఱచివేసినారు. నే చెప్పునది వినుడు —

గురుదేవుడు:— నీవు చెప్పునదా? నీవు, కాముివి, లోభివి, అహంకారపూర్ణుడవు.

డాక్టరు భాదూరి:— [డాక్టరు సర్కారుతో] అనగా దేహధారియైన జీవుని గుణములు నీ కున్న వన్న మాట. కామము, ధన లోభము, అహంకారము యశఃకీర్తిలాలస — ఇవి జీవిలక్షణాలు. దేహధారులకెల్ల ఉన్న లక్షణాలే ఇవి.

డాక్టరు సర్కారు:— [గురుదేవునితో] మీరు ఈలాగు మాటాడుదు రేని, నేను మీ కంఠపరీక్ష చేసి, నా దారిని బోదును. మీకు కావలసినది అంతే నేమో! అట్లు గాక చర్చింప గోరుదు రేని, నాకు సరి యని తోచిన దానిని నేను చెప్పుదును.

ఎవ్వరును నో రెత్త కుండిరి.

గురుదేవుడు:— (డాక్టరు సర్కారుతో) భగవద్గీతను జదువుము, భాగవతమును జదువుము, వేదాంతమును జదువుము. ఈ విషయ మంతయు నీకు అర్థ మగును. దేవునిసృష్టిలో దేవుడు లేడా?

డాక్టరు సర్కారు:— ఏదో ఒక్కవస్తువులో మాత్రమే కాదు దేవు డుండునది, ఆయన సర్వత్ర ఉన్నాడు. కావున ఆయనను వెదకి పట్ట వలసిన సందర్భము లేనే లేదు.

సంభాషణలో ఇతరవిషయాల ప్రస్తావము వచ్చినది. శ్రీరామకృష్ణునకు ఉద్రిక్తభావదశ సదా కలుగుచునే ఉన్నది. దానివలన

ఆయన వ్యాధి విషమించు నేమో అని డాక్టరు చెప్పినాడు. భావో ద్రేకమును మీరు అణచుకోక తప్పదు. నా భావాలు కూడ ఎంతో ఉద్రేకించి ఉన్నవి. మిమ్ము మించి నేను నర్తింప గల వాడనే.

చినన రేంద్రుడు:— (నవ్వుచు) మీ భావ తీవ్రత మఱికొంత హెచ్చిన మీ రేమి చేయుదురు ?

డాక్టరు సర్కారు:— నా నిగ్రహశక్తి కూడ హెచ్చును.

గురుదేవుడును, మహేంద్రుడును:— ఇప్పుడు చెప్ప వచ్చును నీవు అలాగు.

మహేంద్రుడు:— నీకు భావపరవశదశ కలిగినప్పుడు నీ వేమి చేయుదువో చెప్ప గలవా ?

ధనమును గూర్చిన చర్చ వచ్చినది.

గురుదేవుడు:— (డాక్టరు సర్కారుతో) ధనమును గూర్చిన తలంపు నాకు లేనే లేదు. లేదనుట నీకు బాగుగ తెలిసిన విషయమే కదా ? ఇది వట్టి అభినయము కాదు.

డాక్టరు సర్కారు:— ధనాశ నాకే లేకుండగా, ఇక మీ సంగతి చెప్ప నేల ? నా డబ్బుపెట్టెకు మూతే లేదు.

గురుదేవుడు:— యదుమల్లికుకూడ పరాకు గల వాడే. భుజించుచున్నప్పుడు ఒక్కొక్క సారి వంటకము బాగున్నదో లేదో అను సంగతి నైనను ఆయన గుర్తింపడు. అంతపరధ్యానముగ నుండును. "అదుగో ఆ వస్తువు బాగు లేదు, దానిని నోట వేసికోవ" ద్దని ఎవ డైన చెప్పు నేని యదు "ఔనా, అది పాసిపోయినదా? ఎందుకు పోయినదో" అనును.

ఐహిక విషయాల ధ్యానముచే పరాకు గలిగి ఉండుట వేఱు, సదా దేవుని స్మరణచే అన్యవిషయముల యెడ పరాకు గలిగి యుండుట వేఱు — అని సూచించుచున్నాడా గురుదేవుడు ?

డాక్టరు సర్కారును జూపి నవ్వుచు శ్రీరామకృష్ణుడు భక్తులతో ఇట్లనెను — "వస్తువు ఉడికిన మెత్తవడును. మొదట ఈయనది చాల కఠినపాకముగా నుండినది. ఇప్పుడు ఈయనలో మార్దవము, లోపల ప్రారంభమై వెలుపలికి వ్యాపించుచున్నది.

డాక్టరు సర్కారు:— వస్తువును ఉడికించినప్పుడు మెత్తందనము వెలుపలి నుండి లోపలికి కదా వ్యాపించును. నేను బ్రతికి యుండగా. నాకు అట్టి పరిణామము జరుగ దేమో అని నా దిగులు. (అందఱు నవ్వుదురు).

డాక్టరు సర్కారు వీడ్కోన సిద్ధముగ నుండెను. ఆయన శ్రీరామకృష్ణునితో సంభాషించుచుండెను.

డాక్టరు:—మ్రొక్కుటకై మీ పాదముల బడ వచ్చు వారిని మీరు వారింప లేరా?

గురుదేవుడు :—అఖండసచ్చిదానందమును అందఱును అర్థము చేసికో గలరా?

డాక్టరు సర్కారు:—మఱి ప్రజలకు ఏది మంచిదో మీరు చెప్ప వలెను కదా?

గురుదేవుడు:—లోకుల రుచులు భేదిల్లుచుండును. అంతే కాక ఆధ్యాత్మికజీవితమునకు సమానార్హత అందఱకు నుండదు.

డాక్టరు సర్కారు :—అ దెట్లు?

గురుదేవుడు:—రుచులలో ఉన్న భేదము నీకు తెలిసినదే కదా. కొందఱకు చేపలకూర ఇష్టము, కొందఱకు చేపలవరుగు ఇష్టము, కొందఱకు చేపల ఊరగాయ ఇష్టము, ఇంకను గొందఱకు సుసమృద్ధమైన చేపలపులావు ఇష్టము. యోగ్యతలో కూడ భేదమున్నది. బాణవిద్య నభ్యసించువారికి నేను చెప్పునది — మొదట అరటిచెట్టును గుఱి పెట్ట వలెను, తర్వాత దీపపువత్తిని, అటు పిమ్మట ఎగురుచున్న పక్షిని.

మునిమాపు వేళ. శ్రీరామకృష్ణుడు భగవద్ధ్యానమున మునిగెను. మునిగి యున్నంతసేపు తన్ను బాధించుచున్న వ్యాధిని ఆయన పూర్తిగా మఱచి పోయెను. అంతరంగశిష్యులు పెక్కండ్రు ఆయనకు సమీపమున కూర్చుండి ఎచ్చరికతో ఆయనవైపు చూచుచుండిరి. బాహ్యలోకస్మృతి ఆయనకు చాల సేపటికి గలిగినది. మహేంద్రుని చెవిలో ఆయన ఇట్లనెను — "చూచితివా, నా మనసు అఖండబ్రహ్మమున పూర్తిగ లీనమై యుండినది. అటు పిమ్మట ఎన్నో విషయాలు నాకు గోచరించినవి. డాక్టరునకు జ్ఞానప్రబోధము కలుగ నున్న దను సంగతి నా దృష్టికి తెలిసినది. కాని ఆప్రబోధము కలుగుటకు ఇంకను కొంత కాలము పట్టును. అతనికి నేను ఎక్కువగా బోధింప వలసి యుండదు. ఆ దశలో నేను ఉన్నప్పుడు, మఱియొక వ్యక్తి నాకు దృష్టికి కనిపించినాడు. అతనిని కూడ చేర దీయు మని నా అంతరాత్మ నాకు చెప్పినది. అతనినిగూర్చి నీకు తర్వాత చెప్పెదను".

1885 వ సంవత్సరము అక్టోబరు తే 30 ది భృగువారము.

సుమారు పదియు నఱ గంట లప్పటికి మహేంద్రుడు డాక్టరు సర్కారు నింటికి వచ్చి చేరెను. అతడు మేడ రెండవ అంతస్తున కెక్కి కచేరిగదికి ప్రక్క నుండు నడవలో ఒకకుర్చీలో కూర్చుండెను. డాక్టరుసర్కారున కెదుట ఒకగాజుపాత్రలో బంగారువన్నె చేప లుండినవి. డాక్టరు సర్కారు అప్పు డప్పుడు ఏలకాయలతొక్కలను ఆసీసాలో వేయు చుండెను. పిచ్చుకలకు పిండిఉండలను కూడ వేయు చుండెను. మహేంద్రుడు ఎచ్చరికతో చూచు చుండెను.

డాక్టరు :—[చిఱునవ్వు నవ్వుచు మహేంద్రునితో] చూచితివా, భక్తులు నివ్వెఱపడి భగవంతుని వైపు చూచుచుందురే, అట్లు చూచుచున్నవి ఈ చేపలు నా వైపు. నీటిలో పడునట్లు నేను చల్లిన ఆహారమును ఇవి గుర్తింప లేదు. కాబట్టి నేను అందును, వట్టిభక్తి వలన లాభ మేమి? జ్ఞానము కూడ కావలెను.

డాక్టరు సర్కారును మహేంద్రుడును కచేరిగదిలోనికి వచ్చిరి. అన్ని వైపులను అలైమారాలనిండుగ పుస్తకము లుండినవి. డాక్టరు ఇంచుక సేపు విశ్రమించెను. మహేంద్రుడు గ్రంథాలను జూచు చుండెను. కానన్ ఫర్రార్ వ్రాసిన 'జీససు జీవితచరిత్ర' గ్రంథమును అందుకొని కొన్నిపుటలు చదివెను. మొదటి హోమియోపాతిక్ వైద్యశాలను నెలకొల్పినప్పుడు, అందులకు ఎంత ప్రతిఘటన యుండెనో డాక్టరు సర్కారు మహేంద్రునకు చెప్పి, అందుంగూర్చి 1876 కల్కత్తా జర్నల్ ఆఫ్ మెడిసిన్ అను పత్రికలో ప్రకటితము లైన జాబులను జదువు మనెను. హోమియోపతివైద్యవిధానమందు డాక్టరు సర్కారునకు గల అభిమానము మిక్కుటము.

మహేంద్రుడు మఱియొకగ్రంథము నందుకొనెను. అందు కొనుటను డాక్టరు సర్కారు చూచెను. ఆగ్రంథము పేరు స్యూ ఱియాలజి. రచయిత మంగర్.

డాక్టరు:—మంగర్ తన సిద్ధాంతాలను చక్కని తర్కము మీదను యుక్తిమీదను ఆధారపఱచియున్నాడు. అది మీ నమ్మ కమువంటిది కాదు. చైతన్యుడో బుద్ధుడో జీసుక్రైస్తో చెప్పినా డన్నంత మాత్రాన మీరు దేని నైనను నమ్ముచుందురు కదా!

మహేంద్రుడు:—[చిఱునవ్వుతో] ఔను. చైతన్యుని గాని బుద్ధుని గాని మనము నమ్మ రాదు; మంగర్‌ను, నమ్మక తప్పదు.

డాక్టరు:—నీ వే మన్నను సరే.

మహేంద్రుడు:—ఎవరినో ఒకరిని మనము ప్రమాణముగా పేర్కొన వలెను కదా, మంగర్ ఆ ప్రమాణము! [డాక్టరు చిఱు నవ్వు నవ్వను].

డాక్టరు సర్కారు మహేంద్రుని వెంట నిడుకొని బండి నెక్కెను. బండి శ్యాంపుకూరువైపునకు పోవుచుండినది. అప్పుడు మధ్యాహ్నము. వారు ఒం డొరులతో మాటాడుకొనుచుండిరి.

సంభాషణలో డాక్టరు భాదూరి ప్రస్తావము వచ్చినది. ఆ డాక్టరు కూడ అప్పు డప్పుడు గురుదేవుని చూడ వచ్చు చుండెను.

మహేంద్రుడు:— (చిఱునవ్వు నవ్వుచు) నీవు రాయిగనో రప్పగనో పుట్టి జననపరంపరను మరల ప్రారంభింప వలె నట, డాక్టరు భాదురి చెప్పినాడు.

డాక్టరు సర్కారు:—అ దెట్లు?

మహేంద్రుడు:—మహాత్ములు లింగశరీరములు మొదలైన వానిలో నీకు నమ్మకము లే నందున. డాక్టరు భాదురి థియాసఫిస్టు (దివ్యజ్ఞానవాది) కాబోలు, అదియును గాక, దేవు నవతారములలో నీకు నమ్మకము లేదు. అందులకే అతడు విపరీతలక్షణగా 'ఈ సారి నీవు మరణించిన ఇక నీకు మానవ జన్మము నిక్కముగ లేనే లేదు" అనెను. మానవజన్మము అప్పుడే ఎక్కడ? నీకు జన్మము మృగరూపమునను లేదు. పక్షిరూపమునను లేదు. వృక్షాంకురాల రూపముననైనను లేదు. రాయిగనో రప్పగనో పుట్టి (జననపరంపరను) మరల ఆరంభింప వలెను. అసంఖ్యాకజన్మములకు తర్వాత మరల నీకు మానవజన్మము గలుగ వచ్చును.

డాక్టరు సర్కారు:—ఔరా కరుణ!

మహేంద్రుడు:—భాదురి ఇంకను ఏమి చెప్పినా డనగా — మీ భౌతిక శాస్త్ర జ్ఞానము మిథ్య యట, అట్టి జ్ఞానము క్షణభంగురమట. ఒక ఉదాహరణమును చెప్పినాడు — రెండు బావులు ఉన్నవి అనుకొనుము. అం దొక దానికి నీరు భూగర్భస్రోతమునుండివచ్చును. రెండవదానికి అట్టి ఊట లేదు. వాన కురిసినప్పుడే అందు నీరు నిండును. ఆ నీరు దీర్ఘకాల ముండదు, మీ భౌతికాది శాస్త్ర విజ్ఞానము వాననీటివంటిది, ఎండి పోవును.

డాక్టరు సర్కారు:—(చిఱునవ్వుతో) ఆలాగా?

బండి కారన్వాలిసువీధిలోనికి వచ్చెను. డాక్టరు సర్కారు

డాక్టరు ప్రతాప్మజుందారును బండిలోని కెక్కించుకొనెను. ప్రతాప్మజుందారు శ్రీరామకృష్ణుని ఆ ముందు దినము సందర్శించి యుండెను. వారు త్వరగనే శ్యాంపుకూరునకు చేరుకొనిరి.

శ్రీరామకృష్ణుడు రెండవయంతస్తులోని తన గదిలో పెక్కండ్రు భక్తులతో గూడి కూర్చుండి యుండెను.

డాక్టరు భాదురిగారి అల్లుడే ప్రతాప్. శ్రీరామకృష్ణుడు ప్రతాపునితో అతని మామగారిని గొనియాడుచు మాటాడుచుండెను.

గురుదేవుడు:—(ప్రతాపునితో) ఆహా ఆయన ఎంత ఉదారవ్యక్తిగ నైనాడు! ఆయన ధ్యానమా, దేవునిపైనే; నడవడిలోనా, పవిత్రతనే పాటించును. అంతే కాక దేవుని సగుణ నిర్గుణ ప్రకారములను రెంటిని అంగీకరించును.

(డాక్టరు సర్కారుతో) డాక్టరు భాదురి నిన్ను గూర్చి ఏమన్నాడో ఎఱుగుదువా? ఈ విషయాలలో నీకు నమ్మకము లేనందున మఱుజన్మమున నీవు రాయిగనో రప్పగనో పుట్టి జననపరంపరను మరల ఆరంభించుకో వలసి యుండు నట (అందఱును నవ్వుదురు).

డాక్టరు సర్కారు:—(నవ్వుచునే) రాయిగనో రప్పగనో పుట్టుదు ననియే అనుకొనుడు. జననపరంపర నారంభింతును, పెక్కు జన్మములకు తర్వాత మరల మానవుడనుగ జన్మింతును. కాని ఈచోటికి వచ్చిన తక్షణమే, మరల రాయిగనో రప్పగనో ప్రారంభింప వలసిన వాడ నగుదును (డాక్టరుతో సహా, అందఱును నవ్వుదురు).

వ్యాధి ఒక వైపున్నను, గురుదేవునికి భావోద్రేకదశలు కలుగుచునే ఉన్న వను ప్రసంగము వచ్చెను.

ప్రతాప్:—మీ భావపరవశదశను నిన్న నేను ప్రత్యక్షముగ జూచితిని.

గురుదేవుడు:—అది తనంతటనే కలిగిన దశ; అయినను, తీవ్ర మైనది కాదు.

డాక్టరు సర్కారు:—భావోద్రేకాలను లోనగుటయు ప్రసంగాలు చేయుటయు ప్రస్తుతము మీకు మంచివి కావు.

గురుదేవుడు:—[డాక్టరు సర్కారుతో] నిన్న నా సమాధిలో నీవు కనిపించితివి. నీవు ఒక జ్ఞానఖనివి అని నేను తెలిసికొంటిని. కాని అది శుష్క—జ్ఞానము. దివ్యానందరుచి కన్నవాడవు కావు నీవు. [డాక్టరు సర్కారునుగూర్చి ప్రతాపునితో] ఇతనికి దివ్యానుభూతి కలుగనే కలిగినచో, సకలవస్తువులు, పైవి కాని క్రిందివి గాని. ఆ యానందముతో నిండిన వనుట ప్రత్యక్షముగ అగపడును. అప్పుడు ఇతడు తాను చెప్పినదే సరి అనియు ఇతరులు చెప్పినది తప్పు అనియు అనడు. కటుకు చుఱుకు ఘాటు మాటలు ఈయన నోట రావు.

భక్తులు మౌనముగ నుండిరి.

ఉన్నట్లుండి శ్రీరామకృష్ణునకు జ్ఞానదశ గలిగినది. ఆయన డాక్టరు సర్కారుతో "మహీంద్రబాబూ, నీకు ఈ డబ్బుపిచ్చి ఏమి? అంతటి కాంతాసక్తి ఏల? పేరుప్రతిష్ఠలకై అంత ఉబలాట మెందులకు? ఇక వీని నన్నిటిని విడిచి, పరిపూర్ణభక్తితో నీ మనస్సును దేవునివంకకు మరల్పుము. భగవదానందమును అనుభవింపుము" అనెను.

డాక్టరు సర్కారు కదలక నోరెత్తక కూర్చుండెను, భక్తులును మౌనముగ నుండిరి.

గురుదేవుడు:—జ్ఞాని ధ్యాన మెట్లుండునో నఙ్కుడు నాకు చెప్పుచుండెను:— అంతయు జలమయము, పైని జలమే, క్రింద జలమే, అన్నిచోట్ల జలమే. జీవుడు చేపవలె ఆనందముగ నీట ఈదులాడును. నిజముగ ధ్యానించు నప్పుడు ఇవెల్ల నీకు వాస్తవముగ కనిపించును.

జ్ఞానిధ్యానము మఱియొకరీతిగ కూడ నుండును, ఎఱుగుదువా? అనంత మైన ఆకాశమును అందు తన రెక్కలను విచ్చుకొని ఆనంద ముతో నిండి ఎగురు చున్న పక్షిని తలంపునకు దెచ్చుకొనుము. చిదాకాశము ఉన్నది. ఆత్మయే పక్షి. ఆ పక్షి పంజరములో చిక్కి యుండలేదు; చిదాకాశమున ఎగురు చున్నది. దాని ఆనం దము నిరవధికము.

ధ్యానమునుగూర్చిన యీ మాటలను భక్తులు మిక్కిలి ఎచ్చ రికతో విన్నారు. కొంతసే పైన తర్వాత ప్రతాప్ సంభాషణను మరల ప్రారంభించెను.

ప్రతాప్:—(డాక్టరు సర్కారుతో) ఏకాగ్రతతో ఆలోచిం చిన, సమస్తమును కేవలము (అద్దమందలి) ప్రతిబింబమును పోలినదని నిస్సందేహముగ తెలియ నగును.

డాక్టరు సర్కారు:—ప్రతిబింబము అందు వేని, అందులకు మూడు వస్తువులు ఉండ వలెను—ఒకటి సూర్యుడు, రెండవది అసలు వస్తువు, మూడవది దాని నీడ. బింబము లేక ప్రతిబింబ మెట్లుండును? దేవుడు తథ్య మని సృష్టి మిథ్య యని నీ వందువు. సృష్టియు తథ్యమే అని నే నందును.

ప్రతాప్:—చాల బా గున్నది. అద్దములో ప్రతిబింబము కనిపించినట్లు నీ చిత్త మనెడి అద్దములో నీకు ఈ జగత్తు కనిపించు చున్నది.

డాక్టరుసర్కారు:—అసలు బింబమే లేనప్పుడు, ప్రతిబింబము ఎట్లుండును?

నరేంద్రుడు:—అసలు బింబము లే కేమి? దేవుడే అసలు బింబము.

డాక్టరు సర్కారు మౌనముగ నుండెను.

గురుదేవుడు:—(డాక్టరు సర్కారుతో) చాల మంచి సంగతి నొకదానిని నీవు చెప్పితివి. మనస్సు దేవునిలో లీనమైనప్పుడే సమాధి

సిద్ధించు నంటివి. ఇంతవఱకు ఎవ్వరును చెప్ప లేదు ఈ విషయమును. నీ వొక్కడవే చెప్పితివి.

దేవుని గుఱించి మితిమీఱి చింతించు వానికి బుద్ధి చెడిపోవు నన్నాడుశివనాథుడు. అనగా విశ్వవ్యాప్తుడై న జ్ఞానమూర్తిని ధ్యానించిన అజ్ఞానము ఆవహిల్లునట! ఆలోచింపుము! దేవుడు సాక్షాద్ జ్ఞాన స్వరూపి. ఆ జ్ఞానమే లోకమునకు జ్ఞానమును గలిగించును. అట్టి ఆయనను ధ్యానించిన వాడు జ్ఞానమును గోల్పోవుట!

ఇక మీ భౌతికాదిశాస్త్రము లే మనును? ఇదియు ఇదియు కలిసిన అది అగును. అదియు అదియు కూడిన ఇది అగును. ఈ లౌకికవస్తువుల జోలి ఎక్కువగ పెట్టుకొని, వీని ధ్యానములో పడ్డ వానికి మతి చెడుట ఎక్కువ సుసంభవము.

డాక్టరు సర్కారు:— ఆ వస్తువులలో దేవుని సాక్షాత్కరించుకో వచ్చునే.

మహేంద్రుడు:— దేవుని ఆ వస్తువులలో సాక్షాత్కరించుకొన పే లైనచో, మానవునిలో అంత కన్న స్పష్టముగ సాక్షాత్కరించుకో వచ్చు, ఒకమహాత్మునిలో ఇంక నింకను స్పష్టతరముగ సాక్షాత్కరించుకో వచ్చు. మహాత్మునిలో భగవన్మూర్తీభావము ఎక్కువ.

డాక్టరు సర్కారు:— ఔను, మానవునిలోనా, సందేహమే లేదు.

గురుదేవుడు:— ఏ దేవుని చైతన్యముచేత జడపదార్థములు సైతము చైతన్యవంతములుగ కనుపట్టునో, చేతులును కాళ్లును ఒడళ్లును కదలునో, ఆ దేవుని ధ్యానించిన బుద్ధి చెడిపోవుటయా! దేహము తనంతట కదలు నని లోకులు అందురు. కాని దేవుడే దానిని కదలించు నని వారు ఎఱుగరు. నీరు చేతిని కాల్చును అందురు. నీటిలోని వేడిమి, నీటిలోని నిప్పు చేతిని కాల్ప గలుగునే కాని నీరు స్వయముగ చేతిని కాల్ప గలది కానే కాదు. ఇంద్రియములు తమ

పనులను తామే చేయుదు అని మానవుడు అనును. కాని ఇంద్రియముల నడుగున చైతన్యస్వరూపి యగు దేవు డున్నా డని అత డెఱుగడు.

డాక్టరు సర్కారు లేచి నిలబడెను. సెలవు గైకొన సిద్ధముగ నుండెను. శ్రీరామకృష్ణుడును లేచి నిలబడెను.

డాక్టరుసర్కారు:—'ఓ దేవా, నీవు నీవు' అని ప్రజలుఅనుట, అందరి నట్టి వినోదమునకా? ఆపదలో పడ్డప్పుడు మాత్రమే వారు దేవు నాక్రందింతురు. మీ భగవద్విషయకప్రసంగాల కైనను, మీ కంఠస్వనమే కారణము.

గురుదేవుడు:— నాకు చెప్పుకో వలసినది ఏమియు లేదు.

డాక్టరు సర్కారు:— ఏల లేదు? దేవు నొడిలో మన మున్నాము. ఆయన యెడ మనకు చనవు. మనవ్యాధినిగూర్చి ఆయనతో గాక వే ఱెవరితో చెప్పుకొందుము?

గురుదేవుడు:— నీవు చెప్పినది సరి. దేవునితో మాటాడుటకు ఎప్పుడైన ప్రయత్నించుచుందును, గాని నెగ్గుట లేదు.

డాక్టరు సర్కారు వెడలి పోయెను. మహేంద్రుడు శ్రీరామ కృష్ణునకు దగ్గఱగ కూర్చుండి, డాక్టరు సర్కారు నింట జరిగిన సంభాషణను అట్లే వల్లించి వినిపించెను.

మహేంద్రుడు:—ఒక చైతన్యుడో ఒక బుద్ధుడో ఒక క్రైస్తో చెప్పినంతమాత్రాన నే నొకవిషయమును నమ్మ వలసినదేనా, అట్లు నమ్ముట సరి గాదు అన్నాడు డాక్టరు.

గురుదేవుడు:— (తన్ను చూపుకొనుచు) ఈ చోటును గూర్చిన ధ్యానములో అతడు ఉన్నాడు. అతని నమ్మకము పెరుగు చున్నది. అహంకారమును పూర్తిగ వదలించుకొనుట సాధ్యమా? అంత చదువు! అంత ప్రతిష్ఠ! అంత సంపన్నుడు! ఐనను నా మాటల పట్ల అతడు నిరాదరమును చూపుట లేదు.

1885 వ సంవత్సరము అక్టోబరు తే 31 ది శనివారము.

అప్పటికి పూర్వాహ్ణమున సుమారు పదునొకండు గంటలు. శ్రీరామకృష్ణుడు భక్తులతో గూడి తన గదియందు గూర్చుండి యుండెను. మిశ్రు డనెడి క్రైస్తవ భక్తునితో ఆయన సంభాషించు చుండెను. మిశ్రుడు వాయవ్యభారతమున ఒక క్రైస్తవ కుటుంబమున జన్మించినవాడు, క్వేకరుశాఖీయుడు. అతని వయస్సు ముప్పదియైదు సంవత్సరములు. యూరోపియ దుస్తులను ధరించి యున్నను వాని కడుగున సన్న్యాసోచిత కాషాయాంబరము ఉండెను. అతని కిరువురు సోదరు లుండిరి. అం దొకని వివాహము జరుగ వలసినట్లు నిర్ణీత మైన దినముననే ఆ యిరువురును మరణించిరి. ఆ నాడే మిశ్రుడు సన్న్యసించెను.

మిశ్రుడు:— చరాచరముల కన్నింటికిని అంతర్యామిగ ఉన్న వాడు రాముడే.

మిశ్రుడు వినుచుండగా, శ్రీరామకృష్ణుడు చిన నరేంద్రునితో ని ట్లనెను — "రాము డొక్కడే కాని, ఆయన సహస్రనాముడు. ఎవనిని క్రైస్తవులు 'గాడ్' అందురో వానినే హిందువులు 'రామ'-'కృష్ణ' - 'ఈశ్వ' రాది నామముల పేర్కొందురు.

మిశ్రుడు:— జీససు మేరీపుత్త్రుడు కాడు. ఆయన సాక్షాద్భగవంతుడే. (శ్రీరామకృష్ణుని జూపుచు భక్తులతో) ఇప్పుడు ఈయన మీ కీ రూపాన కనిపించుచున్నాడు కాని ఈయన సాక్షా ద్భగవంతుడే. ఈయనను మీరు గుర్తింప లేకున్నారు! ఈయనను ప్రత్యక్షముగ ఇప్పుడు జూచుచున్నాను, ఇంతకు మునుపు కూడ దివ్యదర్శనాలలో ఈయనను నేను చూచి యున్నాను.

గురుదేవుడు:— దివ్యదర్శనాలు కనిపించుచుండునా నీకు?

మిశ్రుడు:— మహాశయా, ఇంటియొద్ద నున్నప్పుడే, నాకు జ్యోతి కనిపించుచుండినది. జీససు దర్శనభాగ్యముగూడ నాకు కలిగి

యున్నది. ఆ సౌందర్యమును నే నెట్లు వర్ణింప గలను? ఆ సౌంద ర్యము నెదుట తుచ్ఛకామినీసౌందర్య మే పాటి?

కొంత సే పైన పిమ్మట మిశ్రుడు తన షరాయిని తీసివేసి అడుగున నున్న కావిగోచిని భక్తులకు జూపెను.

అప్పుడే శ్రీరామకృష్ణుడు నడవ గుండ వెలుపలికి పోయెను. గదికి మరలి వచ్చి భక్తులతో "ఇతడు (=మిశ్రుడు) వీరవైఖరిని నిలబడి యుండగా నేను జూచితిని" అనెను. అనుచుండగనే సమాధి నిమగ్నుడై పశ్చిమాభిముఖముగ నిలబడి యుండెను.

బాహ్యలోకస్మృతి ఇంచుక కలిగినది. చూపును మిశ్రునిపైనే నిలిపి ఆయన నవ్వ నారంభించెను. ఉద్రిక్తభావదశలోనే ఉన్న వాడై, మిశ్రునితో కరచాలనము చేసి, మరల నవ్వ దొడంగెను, అతని చేతులను పట్టుకొని "నీవు కోరుచున్న దానిని పొంద గలవు" అనెను.

మిశ్రుడు:— (మోడ్పు కేలుతో) నా చిత్తమును ఆత్మను శరీరమును ఆనాటినుండియే నీ పరము కావించితినే.

శ్రీరామకృష్ణుడు, ఇంకను భావావేశపారవశ్యమున నవ్వుచునే యుండెను.

డాక్టరు సర్కారు వచ్చినాడు. అతనిని జూచినంతనే శ్రీరామ కృష్ణుడు సమాధి నిమగ్నుడయ్యెను. ఉద్రేక మించుక తగ్గిన పిదప, "మొదట దైవోన్మాదానందము, పిమ్మట సచ్చిదానందము, కారణ మునకు కారణము" అనెను.

డాక్టరు:— ఔను.

గురుదేవుడు:— ఇప్పుడు నాకు బాహ్యలోకస్మృతి లేక పో లేదు.

గురుదేవుడు దివ్యానందోన్మత్తుడుగ నున్నాడని డాక్టరు గుర్తించెను. కావున "ఔను, బాగుగ బాహ్యలోకస్మృతి గలిగియే ఉన్నారు" అనెను.

శ్రీరామకృష్ణుడు చిఱునవ్వు నవ్వి ఇట్లనెను —

నాతల్లి యగు కాళి నామముం బాడి
శాశ్వతానంద రస మయ మౌ నట్టి
యరుదైన మద్యము నానుదు నేను;
సామాన్య మధు వనఁ జనదు పో దాని;
ఎంత పరవశ మౌ నెన్న నా మనము!
త్రాగుబో తని ప్రజ తలఁచు నన్ గూర్చి.

ఈ మాటలు వినుచున్న డాక్టరు సైతము ఉద్రిక్తభావదశకు ఇంచు మించు లో నయ్యెను. శ్రీరామకృష్ణుడు మరల గాఢజ్ఞానదశలో మునిఁగి, తన పాదమును డాక్టరు నొడిపై నుంచెను. కొన్ని నిమిషాలకు బాహ్యలోకస్మృతి కలుగగనే, అతనియొడినుండి తన పాదము వెనుకకు తీసికొనెను. డాక్టరుతో ఇట్లనెను — "ఆహా! నిన్న నీవు చెప్పిన మాట ఎంత దివ్యమైన మాట! 'మనము దేవు నొడిలో నున్నాము. ఆయనతో కాక మన వ్యాధిని వే ఱెవరితో మనము చెప్పుకొందుము' అన్నావు. నేను ప్రార్థింపనే వలయు నేని, దేవుని తప్పక ప్రార్థింతును". ఈ మాట లను చున్నప్పుడు శ్రీరామకృష్ణుని కన్నులు బాష్పపూర్ణము లయ్యెను. మరల పరవశదశ నంది, డాక్టరుతో — "నీవు మిక్కిలి పవిత్రుడవు. కావున్న, నా పాదమును నీ యొడిపై నుంచి యుండను" అనెను. ఇంకను ఇట్లనెను — "రామా (=బ్రహ్మ)నందమును చవి చూచిన వానికి మాత్రమే శాంతి గల్గును. ఈ ప్రపంచము ఏమిటిది? ఏ మున్నది దీనిలో? ధనములో, సంపదలో, గౌరవములో, జీవితభోగాలలో — ఏ మున్నది? ఓ మనసా, రాము నెఱుంగుమా! వే ఱెవరిని నీ వెఱుంగ వలెను?" —

1885 వ సంవత్సరము నవంబరు తే 6 ది శుక్రవారము.

అది కాళీపూజాదినము, శ్రీరామకృష్ణుని యిష్టదేవత యైన లోకమాత నారాధించు దినము. ఉదయము సుమారు తొమ్మిది గంటల వేళ. శ్రీరామకృష్ణుడు అప్పుడు శ్యాంపుకూరులో తాను వసించు చుండిన మేడ రెండవ యంతస్తున దక్షిణపు గదిలో నిలబడి యుండెను, నూతన వస్త్రమును ధరించి యుండెను. మధ్యకలకత్తాలో ఠాంఠానియాలో లోకజననిని పూలు టెంకాయ చక్కెర తక్కుం గల తియ్యని తినుబండములు అర్పించి ఆరాధింపు మని ఆయన మహేంద్రుని కోరి యుండెను. మహేంద్రుడు గంగలో స్నానము చేసి, దేవి నారాధించి, పాదచారియై శ్యాంపుకూరునకు వచ్చెను. ప్రసాదమును అతడు తనతో దెచ్చియుండెను. శ్రీరామకృష్ణుడు చెప్పులను వదలి, మహాదరముతో కొంత ప్రసాదమును ఆరగించి, కొంత ప్రసాదమును తలపై నిడుకొనెను.

శ్రీరామకృష్ణుడు మహేంద్రసహితుడై గదిలో ఇటు అటు పచారు చేయు చుండెను, కాలి జోడును తొడుగుకొని యుండెను, వ్యాధిబాధ ఎంత ఉన్నను, ఆయన నెమ్మోము ఆనందోజ్జ్వలముగ నుండెను.

గురుదేవుడు:—ఈ పాట కూడ చాల బాగున్నది—

'మాయనిర్మాణమేగా యీ భువనము'

మహేంద్రుడు:—చిత్తము మహాశయా.

ఉన్నట్లుండి శ్రీరామకృష్ణుడు లేచెను, కాలి జోడును అటు ఉంచి నిలబడెను, ఆయన గాఢసమాధిలో నుండెను. అది లోకమాతృపూజాదినము. ఆయన మాటిమాటికిని సమాధిలో మునుగు చుండుట కదే అగునా కారణము? చాల సేపైన పిమ్మట, ఆయన యొక నిట్టూర్పు విడిచి, ఎంతో కష్టముతోనుం బోలె, భావోద్రేకము నణంచుకొనెను.

దాదాపు పది గంట లైనవి. శ్రీరామకృష్ణు డొక తలగడపై నానుకొని తన పాన్పుపై కూర్చుండి యుండెను. భక్తులు చుట్టును కూర్చుండిరి. రాము, రాఖాలు, నిరంజనుడు, కాళిపాదుడు, మహేంద్రుడు మొదలుగా ఇంక నెందఱో ఉండిరి.

శ్రీరామకృష్ణుడు మహేంద్రునితో ఇట్లనెను — "నేడు కాళీ పూజాదినము. ఆరాధనకు కొంత ఏర్పాటు చేసిన బాగుండును, దయచేసి అందుంగూర్చి భక్తులతో మాటాడుము".

మహేంద్రుడు అందఱును కూర్చున్న గదికి పోయి, శ్రీరామ కృష్ణుడు చెప్పిన విషయమును భక్తులకు దెలిపెను. కాళిపాదుడు మున్నగువారు పూజకు ఏర్పాట్లు చేయ బూనుకొనిరి.

అది అమావాస్య చీకటిరాత్రి. రెండవ యంతస్తున శ్రీరామ కృష్ణుని గదిలో కాళిపూజ జరుగుటకు వలసిన యేర్పాట్లను భక్తులు ఏడుగంట లప్పుడు చేసిరి. పువ్వులు, గందము, బిల్వదళములు, శోణ మందారపుష్పములు, పరమాన్నము, పలు రకాల తియ్య తినుబండములు, ఇతరపూజాద్రవ్యములును గురుదేవు నెదుట పెట్టబడి యుండినవి. భక్తులు ఆయనను పరివేష్టించి కూర్చుండిరి. శరత్తు శశి రాము గిరీశుడు చునిలాలు మహేంద్రుడు రాఖాలు నిరంజనుడు చిన నరేంద్రుడు అను వారును ఇంక నితరులును ఉండిరి.

శ్రీరామకృష్ణు డొక భక్తునిచే ఇంచుక ధూపము తెప్పించు కొనెను. కొన్ని నిమిషములకు తర్వాత ఆయన ఆ పదార్థముల నన్నిటిని లోకమాత కర్పించెను. మహేంద్రుడు ఆయనకు దగ్గఱగా కూర్చుండి యుండెను, అతనిని జూచుచు ఆయన "ఇంచుక ధ్యానింపుడు" అని భక్తులతో ననెను. భక్తులు తమ కన్నులను మూసికొనిరి.

అప్పుడే గిరీశుడు శ్రీరామకృష్ణుని చరణముల కొక పూలమాల నర్పించెను. మహేంద్రుడు పూలను గంధమును అర్పించెను. రాఖాలును రామును ఇతరభక్తులును అటే చేసిరి.

నిరంజనుడు శ్రీరామకృష్ణుని యడుగుల కొక కుసుమమును అర్పించి, 'బ్రహ్మమయీ బ్రహ్మమయీ' అని అఱచుచు, గురుదేవుని పాదములు తన శిరము సోక సాగిలబడి నమస్కరించెను. భక్తులు ''మాతకు జయ్'' అని ఘోషించిరి.

రెప్పపాటు కాలములో శ్రీరామకృష్ణుడు గాఢసమాధినిమగ్నుడయ్యెను. భక్తులు చూచుచుండగనే గురుదేవునిలో అద్భుతపరిణామము గలిగినది. ఆయనవదనమున దివ్యజ్యోతి ప్రకాశించెను. ఆయన రెండుచేతులును పైకెత్తబడినవై అందొకటి అభయప్రదానముద్రను ఒకటి వరదానముద్రను ధరించినవి. అది లోకజనని విగ్రహాలలో మనము చూచు వైఖరియే. ఆయన శరీరమూ, నిశ్చలముగ నుండెను, బాహ్యలోకస్మృతి లేనే లేదు. ఉత్తరాభిముఖుడై ఆయన కూర్చుండెను. లోకమాతయే ఆయనలో రూపొందెనా? జగజ్జనని దాల్చిన ప్రత్యక్షరూపముగా ఆయన భక్తులకు కనిపించెను, వారు అద్భుతావేశపరవశులై నోరాడక, ఎచ్చరికతో ఆయనవంక చూచుచుండిరి.

భక్తులలో ఒకరు నాయకులుగను ఇతరులు గుంపుగా వారిని అనుసరించువారుగను గీతములను పాడ నారంభించిరి.

క్రమముగ శ్రీరామకృష్ణునకు మరల బాహ్యలోకస్మృతి గలిగినది. ఆయన

దివ్య మా నున్మాద దీవ్య త్తరంగ
మయ రూపిణిగ నున్న మా యమ్మ, శ్యామ

అను పాటను పాడు డని భక్తులను కోరెను. ఆ పాటను వారు పాడిరి.

ఆ పాట ముగిసిన వెంటనే భక్తులను శ్రీరామకృష్ణుడు—

పరమశివుని గూడి పరగ నాడెడిని
మా యమ్మ యిదె గనుమా యింపు మీఱ

అను పాటను పాడు డని కోరెను. వారు ఆ పాటనుకూడ పాడిరి.

భక్తుల ప్రీతికై శ్రీరామకృష్ణుడు పరమాన్నమును కొంచెము రుచి చూచెను గాని, తత్క్షణమే గాఢసమాధి నిమగ్నుడయ్యెను.

కొన్ని నిమిషము లైన తర్వాత, భక్తులు గురుదేవునకు సాష్టాంగముగ మ్రొక్కి, హాలునకు పోయి, ప్రసాదమును ప్రీతితో ఆరగించిరి.

రాత్రి తొమ్మిది గంట లైనవి. సురేంద్రునింటికి బోయి కాళీపూజలో పాల్గొను డని శ్రీరామకృష్ణుడు భక్తులకు చెప్పి పంపెను.

సురేంద్రు నిల్లు సిమ్లావీధిలో నున్నది. భక్తులు అచ్చటికి రాగానే. సురేంద్రుడు మిక్కిలి హృదయపూర్వకముగ వారి నాద రించి రెండవ యంతస్తులో నున్న హాలునకు పిలుచుకొని పోయెను. ఇల్లంతయు ఉత్సవవాతావరణము నిండెను. భక్తుల పాటలచేతను వాద్యములచేతను ఆప్రదేశము వాస్తవముగ నొక యానందవిపణిగ నయ్యెను. గురుదేవుని ప్రియశిష్యు డైన సురేంద్రుడు పెట్టిన సుస మృద్ధ మైన విందును ఆరగించి, వారు తమ యిండ్లకు చేరుకొను నప్పటికి రాత్రి చాల ప్రొద్దు పోయినది.



## పదునొకండవ ప్రకరణము

# కాశీపూరులో గురుదేవుడు

1885 వ సంవత్సరము డిసంబరు తే 23 ది బుధవారము.

కలకత్తా పరిసరపు పేటలలో ఒకటి, కాశీపూరు. అం దొక చక్కని యింటికి శ్రీరామకృష్ణుడు డిసంబరు తే 11 ది శుక్రవారము నాడు చేర్చబడెను. ఆ యింటిని చుట్టి ఐదు ఎకరముల తోట యుండెను. అందు ఫలవృక్షము లేమి పూలతీగ లేమి, సమృద్ధిగ ఉండినవి. కాశీపూరుగృహావాసమే గురుదేవుని జీవితనాటకమునకు భరత వాక్యము.

చిరకాలమునకు మునుపు దక్షిణేశ్వరము నొద్ద తాను ఉన్నప్పటినుండి తొడంగి చేయు చున్న జ్ఞానప్రదానకార్యమును పూర్తి చేయుటకు శ్రీరామకృష్ణుడు ఇనుమడించిన ఉత్సాహముతో పూనుకొనెను. తన భౌతికజీవితపరిసమాప్తి సమీపించు చున్న దని గుర్తించి, తనయొద్ద నున్న జ్ఞాననిధులను ఆయన అపరిమితముగ ఎల్లరకును ఒసంగెను. సంతలో అమ్ముకొనుటకు పండ్లను తెచ్చిన వ్యాపారులు వెలవిషయమున మొదట బేరము లాడుచుందురు గాని, ప్రొద్దు క్రుంకి సంతను ఎత్తివేయవలసివచ్చునప్పటికి వారు, ఎట్టి ఆలోచనయు లేక పండ్లను వచ్చిన వెలకే అమ్మివేయుచుందురు గదా. జ్ఞానవితరణమున గురుదేవుడును అట్లే నడచుకొనెను. ఆయన యాధ్యాత్మికశక్తుల కిక నెప్పుడును ఇక నెచ్చటను కలుగ నంతటి ప్రకటనము శిష్యులకు ప్రత్యక్షముగ ఇచ్చుట ఇప్పుడు గలిగినది. తన జీవితావసానమును గూర్చి ముందుగనే ఆయన కొన్ని సూక్తులు చెప్పియున్నాడు — ''నేను నిష్క్రమించుటకు ముందు, సమస్తమును బహిరంగ మొన ర్తును''. ''ఏ నాడు ప్రజలు గుంపులు గుంపులుగ గూడి ఈ మేని మహిమలను తా మెరిగి అందుంగూర్చి తమలో గుసగుసలాడు

కొందురో, ఆ నాడు లోకజనని ఈ మేనును వెనుకకు తీసికొనును''. ''కడపటికి భక్తులలో అంతరంగవర్గ మొకటియు బహిరంగవర్గ మొకటియునుంగా రెండువర్గము లేర్పడును''. ఇవియు ఇట్టివియు నైన గురుదేవుని సూక్తులు కాశీపూరులో అమలుజరుగుటను శిష్యులు ప్రత్యక్షముగ జూచిరి. కాలక్రమమున ఒక కొందఱు శిష్యులు నరేంద్రనాథుని నాయకునిగ జేసికొని ఐహికసర్వసంగాలను పరిత్యజించి భగవత్ప్రాప్తిసాధనకును మానవసేవకును తమ్ము అంకితము చేసి కొందు రని గురుదేవుడు చెప్పినది కాశీపూరులో ఉండగనే.

యువభక్తులు శ్రీరామకృష్ణునకు ఉపచారములు చేయుటకై ఆ వనమందిరములోనే బస లేర్పరచుకొనిరి. ఐనను వారిలో అనేకులు నడుమ నడుమ తమ యిండ్లకు తఱచు పోయి చూచి వచ్చుచుండిరి. గృహస్థశిష్యులు గురుదేవుని దర్శింప ఇంచుమించు ప్రతిదినము వచ్చు చుండిరి, వారిలో కొందఱు ఒక్కొక్కప్పుడు అటనే రాత్రులం గూడ గడపుచుండిరి.

డిసంబరు తే 23 ది నాటి ప్రొద్దున శ్రీరామకృష్ణుడు భక్తుల పట్ల తన ప్రేమను నిరర్గళముగ వర్షించెను. కాళీపాదుని వక్షమును దాకి ''నీ యాత్మ, ప్రబోధ మొందును గాక'' అనెను. ప్రేమతో కాళీపాదుని గడ్డము పుడుకుచు ''హృదయపూర్వకముగ దేవు నాహ్వానించుచు భక్తిసేవలను తప్పక ప్రతిదినము చేయుచుండువారు ఎవరైనను సరే, ఇక్కడికి వచ్చి తీఱుదురు'' అనెను. ఉదయము ఇరువురు మహిళలు ఆయనయొద్ద ప్రత్యే కాశీర్వాదమును ప్రాపించిరి. సమాధిగతుడై ఆయన తన చరణములను వారి వక్షములపై నిడెను. అం దొకతె విలపించుచు ''తమ దయ అంతటిది!'' అనెను. నిజముగ ఆయన ప్రేమ ఆనాడు అన్నిహద్దులను దాటినది. సింథిగోపాలుని దీవింప గోరి, అతనిని పిలుచుకొని ర మ్మని ఆయన ఒక భక్తు నంపెను.

సాయంకాల మైనది. శ్రీరామకృష్ణుడు జగజ్జననిని ధ్యానిం

చుచు ధ్యానములో నిమగ్నుడై యుండెను. ధ్యానానంతరము ఆయన కొందఱు భక్తులతో మృదుసంభాషణ నారంభించెను. కాళియు, చుని లాలును, మహేంద్రుడును, నవగోపాలుడును, శశియు, నిరంజనుడును మఱికొందఱును అచట నుండిరి.

గురుదేవుడు:—నాకు ఈ వ్యాధి ఎన్నాళ్లకు నిమ్మళించునో మీరు చెప్ప గలరా?

మహేంద్రుడు:—వ్యాధి ఇంచుక హెచ్చి యున్నది. కావున నిమ్మళించుటకు కొంతకాలము పట్టును.

గురుదేవుడు:—ఎంత కాలము?

మహేంద్రుడు:—సుమారు ఐదాఱు నెలలు.

ఈ మాట విని, శ్రీరామకృష్ణుడు ఒక శిశువు వలె ఓపిక వహింప లేని వాడై "అన్నాళ్లా? ఏమిటయ్యా నీవు చెప్ప నెంచినది!" అనెను.

మహేంద్రుడు:—మహాశయా, నేను చెప్పనెంచినది—పూర్తిగ నయ మగుటకు అంతకాలము పట్టు నని.

గురుదేవుడు:—ఓహో, పూర్తిగ నయ మగుటకా? నాదిగులు తీఱినది. ఒక ప్రశ్న అడిగెదను. సమాధానము చెప్ప గలరా? ఒక వంక ఇన్ని దివ్యదర్శనాలును ఇంత భావోద్రేకమును సమాధియు కలుగు చుండ, వేఱొక వంక నా కింతటి వ్యాధి రా నేల?

మహేంద్రుడు:—మీరు ఎక్కువ బాధనే పడుచున్నారు. సందేహము లేదు. కాని దానికి గంభీరమైన అర్థము ఉన్నది.

గురుదేవుడు:—ఏ మర్థము?

మహేంద్రుడు:—మీ మనసులో ఒకమార్పుగలుగుచున్నది. మనసునకు నిరాకారబ్రహ్మమే లక్ష్యముగ ఏర్పడుచున్నది. మీ 'జ్ఞానాహంకారము' సైతము మాయమై పోవుచున్నది.

గురుదేవుడు:—అది నిజమే. ఇతరులకు నేను బోధనలు చేయుట ముగిసిపోవుచున్నది. ఇక నేనేమియు బోధింప లేను. సమస్తమును బ్రహ్మమే అనుట నాకు ప్రత్యక్ష మగు చున్నది. ఒక్కొక్కప్పుడు నాలో నేనే "నేను ఎవరికి బోధింతును" అని ప్రశ్నించుకొనుచుందును. ఇది అద్దెయిల్లు. నే నిచట ఉన్నందున అన్ని రకాల భక్తులును ఇచ్చటికి వచ్చుచున్నారు. *శశధరునివలెనో కృష్ణప్రసన్న సేనువలెనో 'నా ఉపన్యాసాలు ఇచ్చట జరుగు' నని ప్రకటించుకో వలసిన జరూరు నాకు లేదని నా తలంపు. (గురుదేవుడును మహేంద్రుడును నవ్వుదురు).

మహేంద్రుడు:—ఈ వ్యాధి వలన మఱి యొక ప్రయోజనము కూడ నెఱవేఱినది. భక్తులలో వీరు వీరు మేల్బంతు లనుటకు ఇదే తుది నిర్ణయ మైనది. ఏండ్ల తపశ్చర్యచే తాము సాధింప లేని సిద్ధులను భక్తులు ఈ కొన్నాళ్లలోనే సాధించిరి. వారి ప్రేమయు భక్తియు అనంతముగ వర్ధిల్లు చున్నది.

గురుదేవుడు:—అది నిజమే కావచ్చును. కాని నిరంజనుడు ఇంటికి మరలి పోయెనే. (నిరంజనునితో) నీ అనుభవము ఏలాగున్నదో దయచేసి నాతో చెప్పుము.

నిరంజనుడు:—ఇంతకు మునుపును మీపై నాకు ప్రేమ యుండెను, సందేహము లేదు. కాని, ఇప్పుడో, మిమ్ము ఎడబాసి జీవింపనే లేను.

మహేంద్రుడు:—ఈ యువకులు ఎంతెంత గొప్ప వారో ఒకనాడు నేను తెలిసికొంటిని.

గురుదేవుడు:—ఎచ్చట?

మహేంద్రుడు:—ఒకనాడు శ్యాంపుకూరుభవనమున ఒక

---

* 'శశధర' 'కృష్ణప్రసన్న సేను'లు శ్రీరామకృష్ణుని సమకాలికులు, సుప్రసిద్ధులు, 'హిందూధర్మ' ప్రచారకులు.

మూలలో నిలబడి నేను ఈ భక్తులను పరికించితిని. ఎట్లు ఒక్కొక్కడును దాటరాని యిడుములను దాటి వచ్చెనో, మీసేవకు తన్ను అర్పించుకొనెనో నేను తేటతెల్లముగ కాంచితిని.

ఈమాటలను వినుచుండగనే శ్రీరామకృష్ణునకు పరధ్యానము గలుగుచుండెను, ఆయన కొన్ని నిమిషముల పాటు మౌనముగ ఉండి తత్‌క్షణమే సమాధి నిమగ్నుడయ్యెను.

బాహ్యలోకస్మృతి మరల గలుగగనే, ఆయన మహేంద్రునితో ఇట్లనెను — "సమస్తమునకును సరూపత్వము తొలగి రూపరహితత్వ మావహిల్లుచుండుట నాకు ప్రత్యక్షముగ కనిపించినది. నే జూచిన దాని నెల్ల నీకు చెప్ప వలె నను కోరిక ఉన్నది కాని, సాధ్యపడ కున్నది. రూపరహితముపట్ల నాకు గలుగుచున్న యీ యభిరుచి, నాజీవితపరిసమాప్తి దరియుచున్న దనుటకు సూచనయే కాని వేఱు కాదు. ఏ మందువు?"

మహేంద్రుడు:—(నివ్వెఱ పడుచు) కావచ్చును.

గురుదేవుడు:—రూపరహితమును అపరిచ్ఛేద్యము నగు సచ్చిదానందము ఇప్పుడు సైతము నాకు ఆలాగుననే గోచరించుచున్నది. కాని ఎంతో శ్రమపడి నా భావాలను నేను అణచుకొన్నాను.

శిష్యుల వర్గీకరణమును గూర్చి నీవు సరిగానే చెప్పితివి. శిష్యులలో అంతరంగికులు ఎవరో బహిరంగస్థులు ఎవరో, నా యీ వ్యాధియే తెలియపఱచుచున్నది. ఐహికసంగమును పరిత్యజించి ఇక్కడే వసించుచున్న వారు అంతరంగశాఖీయులు. అప్పు డప్పుడు వచ్చుచు "ఎలాగున్నారు, మహాశయా" అని అడుగుచుండువారు బహిరంగశాఖీయులు.

(మహేంద్రునితో) తనభక్తుల కొఱకే భగవంతుడు మానవ రూపమును దాల్చును. అప్పుడు, ఆ భక్తులును ఆయన వెంబడినే భువి నవతరింతురు. కొందఱు అంతరంగభక్తు లగుదురు, కొందఱు బహి

రంగభక్తు లగుదురు, కొందఱు ఆయనశరీరసుస్థితికి వలసిన వస్తువులను సరఫరా చేయు వారుగ నగుదురు.

నేను పది పదునొకండు సంవత్సరముల వయస్సువాడనుగ నున్నప్పుడు ఒకనాడు ఒక మైదానముగుండ అమ్మవారిగుడికి పోవు చుంటిని. అప్పుడు భావావేశపరవశదశ నాకు గలిగినది. అది నా తొట్టతొలి యనుభవాలలో ఒకటి. ఆహా ఏమి దృశ్యము! ఆ దశలో నాకు బాహ్యలోకస్మృతి లేనే లేదు.

కాళిగుడిలో అమ్మవారు ఒక సారి. "అక్షురుడవుగ ఉండ గోరుదువా" అని నన్నడిగినది. అప్పటికి నా వయస్సు ఇరువది రెండో ఇరువదిమూడో సంవత్సరాలు. ఆమాట నా కర్థము కాలేదు. హాలధారి నడిగితిని. "క్షురుడు అనగా జీవుడు, అక్షురుడు అనగా పరమాత్మ" అని అత డన్నాడు.

కాళిగుడిలో సాయంపూజాసమయములలో నేను కుథి పై కప్పు మీది కెక్కి "ఓ భక్తులారా, ఎక్కడ ఉన్నారు మీరు అందఱును? త్వరగా రండోయి, లౌకికుల గోష్ఠిలో ఉన్నచో నా ప్రాణమే పోవును" అని కేక లిడు చుంటిని. ఈ సంగతి నంతయు నేను *ఇంగ్లీషువారికి చెప్పితిని. ఇది అంతయు చిత్తవిభ్రాంతియే అన్నారు వారు. 'భ్రాంతియే కా వచ్చు' నని నేనును అనుకొని శాంతించితిని, కాని, అ దంతయు ఇప్పుడు నిజ మగు చున్నది. భక్తు లరుదెంచు చున్నారు.

నాకు కావలసినవానిని సరఫరా చేయు వారిని ఐదుగురను లోకమాత నా దివ్యదర్శనానుభవాలలో ఒకదానిలో చూపినది — మథుర్బాబు ప్రథముడు, శంభుమల్లిక్కు ద్వితీయుడు. ఇతనిని నేను అప్పటి కింకను కలిసికో లేదు. కాని ఒకదృశ్యములో నాకు తలకు టోపీ పెట్టుకొన్న గౌరవర్ణ వ్యక్తి యొకడు కనిపించెను. పెక్కు దిన

* ఆంగ్లవిద్యను అధికరించిన బ్రాహ్మసమాజీయులు కాబోలు.

ములకు పిమ్మట శంభుమల్లిక్కును మొదటి సారి కలిసికొంటిని, అప్పుడు నాకు ఆ దృశ్యము జ్ఞప్తికి వచ్చెను. ఆ భావావేశపరవశ దశలో నాకు కనిపించిన వ్యక్తి ఇతడే అని తెలిసికొంటిని. కావలసిన వస్తువులను నాకు సరఫరాచేయు వారిలో తక్కిన ముప్వురును ఎవరో, ఇంత వఱకును నేను గుర్తింపలేదు. కాని అందఱును గౌర వర్ణులే. సురేంద్రుడు వారిలో ఒకనిని పోలి యున్నాడు.

శశియు శరత్తును క్రైస్తుకాలమున ఆయనకు అనుచరులుగ ఉండిరి అను విషయము నా కొక దివ్యదర్శనమున కనిపించినది.

పంచవటిలోని మఱ్ఱిచెట్టుక్రింద నున్నప్పుడు ఒకదృశ్యములో శిశువు నొకనిని జూచితిని. "త్వరలోనే మీ కొక కొడుకు పుట్టును" అన్నాడు హృదయుఁడు. "ప్రతిస్త్రీని మాతృమూర్తిగ భావించు నాకు కొడుకు ఏలాగు పుట్టు నోయి" అని నే నంటిని. రాఖాలే ఆ శిసువు.

విజయు డొక దృశ్యములో ఈ రూపమును ( = నన్ను) చూచినా డట. అందులకు మీ సమాధాన మేమి? "ఇప్పుడు మిమ్ము తాకుచున్నట్లే (ఆ దృశ్యములో ఆ రూపును) తాకితిని" అన్నాడు విజయుడు.

జీవితపు తుది దినాలలో నాకు పాయసమే ఆహారము కా గల దని ఒక దృశ్యములో ప్రత్యక్షముగ జూచితిని. ఇప్పుడు ఈ రోగ దశలో నా భార్య ఒకనాడు నాచే పాయసమును త్రాగించుచుండినది. కన్నీ రుప్పొంగి, నే ని ట్లంటిని — "ఇది తుదిదినాల పాయ సాహారమా, ఎంత దుర్భరము?"

1886 వ సంవత్సరము జాన్యువరి తే 4 ది సోమవారము.

ఆ నాడు బహుళపక్ష చతుర్దశి. మధ్యాహ్నానంతరము నాలుగు గంట లప్పుడు శ్రీరామకృష్ణుడు తన గదిలో కూర్చుండెను. తన కారోగ్యము ఎట్లున్నదో విచారించుటకై దక్షిణేశ్వర కాళికా లయమునుండి రామ్చాటర్జీ వచ్చి యుండె నని ఆయన మహేంద్రు

నితో జెప్పి, అప్పుడు గుడితోటలో చలిమిక్కుటముగ ఉండునా అని యడిగెను.

నరేంద్రుడు వచ్చెను. గురుదేవుడు అప్పు డప్పుడు అతనివైపు చూచి చిఱునవ్వు నవ్వుచుండెను. గురుదేవునకు తన ప్రియతమశిష్యుని పైన ప్రేమ ఆ నాడు హద్దు మీఱి నట్లుగ మహేంద్రునకు అగపడినది. నరేంద్రుడు విలపించె నని గురుదేవుడు సైగ చేసి మహేంద్రునకు సూచించెను. కొంతసేపు ఊర కుండెను. మరల "ఇంటినుండి దారి పొడుగునను నరేంద్రుడు ఏడ్చుచునే వచ్చె" నని సూచించెను.

ఎవ్వరును పలుక రైరి. మాటలను నరేంద్రుడే తొడంగెను—

నరేంద్రుడు:—నేడు అక్కడికే పోద మని కొంతసేపుగ అనుకొనుచుంటిని.

గురుదేవుడు:—ఎక్కడికి?

నరేంద్రుడు:—దక్షిణేశ్వరమునకు. బిల్వవృక్షముక్రింద మంట రాజచేసి, ధ్యానించుచుంద మనుకొనుచున్నాను.

గురుదేవుడు:—జరుగదు. తుపాకిమందుకొట్టు నధికారులు అందులకు అనుమతింపరు. పంచవటి మంచి చోటే. ఎందఱో సాధువులు అచట ధ్యానజపములను చేసియున్నారు. కాని అక్కడ చలి అపరిమితము. చీకటి సరే ఉండనే ఉన్నది.

మరల కొన్ని నిమిషములసేపు అందఱును మౌనముగ ఉండిరి.

గురుదేవుడు:— [చిఱునవ్వు నవ్వుచు నరేంద్రునితో] నీవు చదువు నిక సాగింపవా?

నరేంద్రుడు:— [గురుదేవుని మహేంద్రుని జూచుచు] ఇంత వఱకు చదివిన చదువు నంతయు నాచే మఱపించు మం దొకటి లభించిన ఎంతో బరువు తగ్గినట్లు నే ననుకొందును.

ఆ గదిలోనే ఉండిన పెదగోపాలు "నేనును నరేంద్రునితో పోవుదు" ననెను.

శ్రీరామకృష్ణునికై కాళీపాదఘోషు ఒక పెట్టె నిండ ద్రాక్ష తెచ్చి యుండెను. ఆ పెట్టె గురుదేవుని ప్రక్కనే యుండెను. గురుదేవుడు కొన్ని ద్రాక్ష ఫలములను నరేంద్రుని చేత బెట్టి, పెట్టెను నేలపై గ్రుమ్మరించి, భక్తులను ఏరుకొం డనెను.

సాయంకాల మైనది. నరేంద్రుడు మేడ క్రింది గదిలో కూర్చుండెను. పొగ పీల్చుచు, తన ఆత్మ పడుచున్న ఉబలాటమును మహేంద్రునకు వర్ణించి చెప్పుచుండెను. అచ్చట వే రెవ్వరును లేరు.

నరేంద్రుడు:—క్రిందటి శనివారము నేను ఇచ్చట ధ్యానించుచుంటిని. అప్పుడు నా హృదయమున తటాలున ఒక వింత యనుభూతి గలిగినది.

మహేంద్రుడు:—అది కుండలినీప్రబోధమే.

నరేంద్రుడు:—కావచ్చును. 'ఇడా' నాడియు 'పింగళా' నాడియు నాకు స్పష్టముగ అగపడినవి. హాజ్రాతో నా గుండెను తాకి చూడు మంటిని. నిన్న ఆయనను (=గురుదేవుని) మేడపై జూచి నప్పుడు, ఈ విషయమును దెలిపితిని. "తక్కినవారు అందఱును సిద్ధుల నొందినారు, నాకును కొంత సిద్ధిని ప్రసాదింపుడు, అందఱును సిద్ధిగ్రే, నే నొక్కడను మాత్రము అసంతృప్తుడనై ఉండిపోదునా" అని ఆయనతో మొఱపెట్టుకొంటిని.

మహేంద్రుడు:—అందులకు ఆయన ఏ మన్నాడు?

నరేంద్రుడు:— ఆయన 'కుటుంబవ్యవహారాలను మొదట చక్కబెట్టుకొని, తర్వాతనే నీవు నాయొద్దకు రారాదా? నీకు సమస్తమును లభించును' అని చెప్పి 'నీకు ఏమి కావలెను' అని అడిగినాడు. "నడుమ నడుమ రవంత ఆహారమునకుగాను మాత్రము వ్యావహారిక రంగమునకు దిగుచు మూడు నాలుగు దినాల పాటు సమాధిలోనే మునిగి యుండవలెనని నా కోరిక" అని నే నంటిని. ఆయన ఇట్లన్నాడు— "నీవు మిగుల సంకుచితచిత్తుడవే, సమాధిదశకంటె కూడ పైదశ

యొకటి కలదు. 'సర్వముగ నీవె గా సకలలోకేశ' అను పాటను పాడువాడవు నీవే కదా''.

మహేంద్రుడు:—ఔను. ఆయన సదా చెప్పుచుండు విష యమే అది. సమాధిదశనుండి దిగుచున్నప్పుడు మానవునకు దేవుడే ఈ విశ్వముగను ఇందలి ప్రాణులుగను ఇం దున్న సకల వస్తువులు గను రూపొందినట్లు కనిపించును. ఆ దశ ఈశ్వరకోటికి జెందినవారికి మాత్రమే ప్రాప్యము. సామాన్య మానవుడు ఎంత సాధించినను సమాధిదశ నొందిన నొంద వచ్చును, అంతె. ఆ దశనుండి అవతరిల్లుట అతని కశక్యము.

నరేంద్రుడు:—కుటుంబవ్యవహారాలను ముందుగా చక్క బెట్టుకొని తర్వాత తన యొద్దకు రమ్మన్నా డాయన (=గురుదేవుడు). అప్పుడు సమాధికంటెను గూడ పైదశ నాకు కలుగు నట. నేటి ప్రొద్దున నేను మా యింటికి పోయితిని. మావా రందఱు ''తిరుగు బోతువలె ఏల ఊరక దిమ్మ తిరిగెదవు? మీ న్యాయశాస్త్ర పరీక్షలా, సమీపించుచున్నవి, చదువును నీవు గమనించుటే లేదే. ఊరక తిరుగుచున్నావు'' అని నన్ను చీవాట్లు పెట్టిరి.

మహేంద్రుడు:—మీ తల్లిగారు ఏమైన చెప్పినారా?

నరేంద్రుడు:—ఆమె ఏమియు అన లేదు. ఆమె ఆత్ర మెల్ల నాకు భోజనము పెట్టు విషయముననే. జింకమాంసమును పెట్టినది. మాంసమును తిను నుత్సాహము నాకు లేకుండెను, కొంచెముగ తింటిని.

మహేంద్రుడు:—తర్వాత.

నరేంద్రుడు:—మా అవ్వ యింటిలో చదువుకొన బోయితిని. చదువు అనున దొక భయంకర కార్య మైనట్లుగ, నేను చదువ ప్రయత్నించుకొద్దియు, పెనుభీతి నన్ను పైకొను చుండినది. నా గుండె తటతట కొట్టుకొన్నది. నాకు కన్నీరు ఉప్పొంగినది. నా జీవితములో

అంత ఎక్కువగ నే నెప్పుడును విలపించి యుండ లేదు. నేను పుస్తకాలను పారవేసి పరుగిడితిని. వీథులవెంబడి పరుగెత్తితిని, పాదముల నుండి చెప్పులు జారి పడి పోయినవి. ఎక్కడ పడిపోయినవో నే నెఱుగను. ఒక గడ్డివామి మీదుగ పరుగిడితిని; నా దేహమంతటను గడ్డి అంటుకొన్నది. కాశీపూరు వీథిలో నేను పరుగిడుచునే యుంటిని''.

నరేంద్రుడు కొన్ని నిమిషములు మౌనముగ నుండి మరల జెప్ప నారంభించెను.

నరేంద్రుడు:—వివేకచూడామణిని చదివినప్పటినుండి నాలో ఎక్కువ నిరుత్సాహము గలిగినది. అందులో శంకరాచార్యులవారు ఏమి చెప్పి ఉన్నారనగా — మానవజన్మము, మోక్షాభిలాష, మహాపురుషసంశ్రయము — అను మూడును లభింపవలె నన్న, గొప్ప తపస్సు అదృష్టము ఉండ వలయునట. నాలో నే నిట్లనుకొంటిని — నిజముగ ఆ మూడింటిని నేను సంపాదించితిని. మహాతపఃఫలముగ మానవజన్మ మెత్తితిని. మహాతపఃఫలముగనే మోక్షాభిలాష గలిగి యున్నాను, మహాతపఃఫలముగనే అంతటి మహాత్ముని సాహచర్యమును సంపాదించితిని.

మహేంద్రుడు:—ఆ!

నరేంద్రుడు:—ఇహలోకరుచి నాకిక లేనే లేదు. ఒకరిద్దఱు భక్తుల గోష్ఠియే కాని, లౌకికుల గోష్ఠి నాకు ఇష్టపడుట లేదు.

నరేంద్రుడు మరల మౌనముగ నుండెను. తీవ్రవైరాగ్య వహ్ని అతనిలో మండు చుండెను. భగవద్దర్శనమునకై అతని యాత్మ తహతహపడుచుండెను. సంభాషణను అతడు మరల నారంభించెను.

నరేంద్రుడు:—(మహేంద్రునితో) నీకు శాంతి చేకుఱినది. నా యాత్మ తహతహపడుచున్నది. నిజముగ నీవు అదృష్టవంతుడవు.

మహేంద్రుడు బదులు చెప్ప లేదు, మౌనముగ కూర్చుం డెను. "దేవుని కొఱకు ఆత్రపడ వలసినదే, కృశింప వలసినదే. అప్పటికే కాని దర్శనప్రాప్తి లభింపదు అని శ్రీరామకృష్ణుడు చెప్పి యున్నా" డని తనలో అనుకొనెను.

మునిమాపువేళ దాటగనే మహేంద్రుడు మేడ పైకి పోయి చూడగా శ్రీరామకృష్ణుడు నిద్రించుచుండెను.

రాత్రి తొమ్మిది గంట లైనవి. నిరంజనుడును శశియు గురు దేవుని సమీపమున కూర్చుండిరి. గురుదేవుడు మేలుకొనియే యుం డెను, మాటిమాటికి నరేంద్రుని గుఱించియే మాటాడు చుండెను.

గురుదేవుడు:—నరేంద్రుని మనఃపరిస్థితి ఎంత ఆశ్చర్యకర ముగ నున్నది! చూచితిరా? సాకారదైవమును నమ్మ కుండిన నరేంద్రు డితడే. ఇతని యాత్మ దేవునికై ఎంతగా కొట్టుకొను చున్నదో ఇప్పుడు చూచుచున్నారు కదా!

ఒకనియాత్మ, దేవునకై అంతగా కొట్టుకొనుచు ఉబలాట పడు నేని, భగవద్దర్శనమునకై అతడు ఇక చాల కాలము వేచి యుండ వలసి యుండ దని మీరు గుర్తింతురు. తొలిసంజకెంజాయ, త్వరలోనే సూర్యుడు ఉదయింప నున్నా డనుటకు సూచన.

నేడు శ్రీరామకృష్ణుని వ్యాధి ముదిరినది. ఎంతో బాధపడు చునే, నరేంద్రునిగూర్చి పెక్కు విషయములను తెలిపినాడు, చాల వఱకు సైగలమూలముగ దెలిపినాడు.

రాత్రి నరేంద్రుడు దక్షిణేశ్వరమునకు బయలుదేఱినాడు. అమావాస్యరాత్రి కావున, అంధకారము గాఢముగ నుండెను. ఒక రిద్దఱు భక్తులు అతని వెంబడి నుండిరి. మహేంద్రుడు ఆ రాత్రిని కాశీపురారామములోనే గడపెను, ఒక సన్న్యాసుల సదస్సులో తాను కూర్చుండి యున్నటుల కల గాంచెను.

1886 వ సంవత్సరము మార్చి తే 14 ది భానువారము.

మేడపైని పెద్దగదిలో శ్రీరామకృష్ణుడు ఉత్తరాభిముఖముగ కూర్చుండెను. ప్రొద్దు క్రుంకినది. వ్యాధియా చాల హెచ్చిపోయినది. నరేంద్రుడును రాఖాలును మృదువుగ ఆయనపాదముల నొత్తుచుండిరి. మహేంద్రుడు సమీపముననే కూర్చుండెను. అతనిని గూడ తన పాదములను తడవుచుండుమని గురుదేవుడు సైగ చేసి కోరెను. మహేంద్రుడు అట్లే చేసెను.

క్రిందటి యాదివారము నాడు భక్తులు పూజతోను ప్రార్థనతోను శ్రీరామకృష్ణుని జయంతిని పాటించిరి. క్రిందటి సంవత్సరము ఆయనజయంతి మహోత్సవము దక్షిణేశ్వరమున ఎంతో విభవముగ జరిగినది. కాని ఈ సంవత్సరము ఆయన వ్యాధివలన, భక్తులు చాల ఖిన్నులై యుండిరి. ఉత్సవమే లేదు.

మాతృశ్రీశారద జేయింబవళ్లు గురుదేవుని సేవ యందే వ్యాపృతురాలై ఉండెను. యువశిష్యులలో నరేంద్రుడు, రాఖాలు, నిరంజనుడు, శరత్తు, శశి, బాబురాము, జోగిన్, లాటు, కాళి అను వారు గురుదేవునితో ఆ వనమందిర మందే యుండిరి. శిష్యులలో ప్రౌఢవయస్కులు ప్రతిదినమును వచ్చి గురుదేవుని చూచి పోవు చుండిరి. వారిలో కొందఱు అప్పు డప్పుడు రాత్రులనుగూడ అక్కడనే గడపు చుండిరి.

ఆ నాడు శ్రీరామకృష్ణునికి వ్యాధిబాధ హెచ్చుగ నుండెను. సగమురాత్రివేళ. తోటయంతటను వెన్నెల వెల్లిగొనెను. కాని అది భక్తుల డెందములలో ఎట్టి భావమును గాని లేప జాలక పోయెను. వారు దుఃఖసముద్రమున మునిగి యుండిరి. శత్రుసేనలచే నలు వంకల ముట్టడింపబడియున్న యొక్క చక్కని నగరాన తాము వసించు చున్నట్లు వారికి తోచినది. పరిపూర్ణమైన నిశ్శబ్దత సర్వత్ర నెలకొని యుండినది. మలయ మారుత స్పర్శచే ఆకులలో మెల్లగా విన నగు మర్మధ్వని తప్ప, ప్రకృతి యంతయు నిశ్శబ్దముగనే యుండెను.

శ్రీరామకృష్ణుడు మేలుకొనియే పరుండి యుండెను, ఒక రిద్దఱు భక్తులు ఆయనపజ్జ మౌనముగ గూర్చుండిరి. ఆయన అప్పు డప్పుడు కునుకుపాట్లు పడు చున్న ట్లుండెను.

మహేంద్రుడు ఆయనప్రక్కనే కూర్చుండెను. సమీపమునకు ర మ్మని అతనికి శ్రీరామకృష్ణుడు సైగ చేసెను. ఆయన పడు చున్న బాధ చూచుటకే దుర్భరముగ నుండెను. మిక్కిలి మృదు వైన గొంతుతోను ఎంతో కష్టముతోను మహేంద్రునితో ఆయన ఇ ట్లనెను —

మి మ్మందఱను ఏడ్పింపను జంకి, ఇంతటి బాధను నేను అనుభవించుచు వచ్చితిని. 'అయ్యో, ఇంత బాధయే, ఈ దేహము పోయిన పోనీ' అని మీ రందఱును చెప్పుదు రేని, నేను ఈ మేనును విడువ వచ్చును.

ఈ మాటలు భక్తుల డెందములలో గ్రుచ్చుకొన్నవి. తమకు తండ్రియు తల్లియు రక్షకుడు నైన వ్యక్తియే ఆ మాటలను పలికి నాడు! వారు ఏమి అన గలరు? అందఱును మౌనముగ గూర్చుండిరి. "భక్తులకై శరీరార్పణము! ఇ దేమి మేనును మానుపై బెట్టి మేకులు దింపగా, చనిపోవుటయా మరల?" అని కొందఱు తలంచిరి.

అది అర్ధరాత్రివేళ. శ్రీరామకృష్ణుని వ్యాధియా, పెరిగి పోవు చున్నది, ఇప్పుడు చేయవలసినది ఏమి అని భక్తులు నివ్వెఱ పడు చుండిరి. అం దొకరు కలకత్తాకు బయలుదేఱి పోయిరి. ఆ రాత్రియే ఉపేంద్రుడు నవగోపాలుడు అను నిద్దఱు వైద్యులను పిలుచుకొని గిరీశుడు వనమందిరమునకు వచ్చెను.

భక్తులు గురుదేవునకు సమీపమున గూర్చుండిరి. బాధ రవంత తగ్గిన ట్లుండ, ఆయన వారితో ఇ ట్లనెను — "దేహమునకే వ్యాధి. అది ఉండవలసిన దట్లే. ఈ దేహము ఐదుభూతాలతో రూపుగాంచిన దని నాకు స్పష్టపడినది".

గిరీశునివైపు తిరిగి ఇట్లనెను — "దేవుని రూపములను పెక్కింటిని నేను జూచుచున్నాను. వానిలో (తన దేహమును జూపు కొనుచు) ఇదియు నొక్కటిగా కనిపించుచున్నది".

1886 వ సంవత్సరము మార్చి తే 15 ది సోమవారము.

ప్రొద్దున ఏడు గంట లప్పుడు శ్రీరామకృష్ణునకు వ్యాధిబాధ రవంత తగ్గిన ట్లనిపించెను. ఆయన భక్తులతో మాటాడుచుండెను. రవంత సేపు గుసగుసలు, రవంత సేపు సైగలు. నరేంద్రుడును, రాఖాలును, లాటును. మహేంద్రుడును. సింథిగోపాలును తక్కిన వారును గదిలో నుండిరి. క్రిందటి రాత్రి గురుదేవు డనుభవించిన బాధను తలంచుకొనుచు వారు మాటాడక కూర్చుండిరి. వారి మోములలో తీవ్రభావము నెలకొని యుండెను.

గురుదేవుడు:— (భక్తులతో) ఇప్పుడు నాకు ఏమి అగపడు చున్నదో ఎఱుగుదురా? దేవుడే ఈ సమస్తముగను రూపొందినట్లు నాకు అగపడుచున్నది. మానవు లేమి తక్కిన ప్రాణు లేమి అందఱును తోలుతిత్తులుగను, దేవుడే వానిలో వసించుచు చేతులను కాళ్లను తలలను కదల్చుచున్నట్లును నాకు అగపడుచున్నది. ఇట్టి దృశ్యమే ఇంతకు ముం దొకసారి నాకు కనిపించి యున్నది. అప్పుడు ఇండ్లు తోటలు వీథులు మానవులు పశువులు అన్నియు ఒక్కవస్తువు నుండియే తయారైన రూపాలుగనే చూపట్టినవి, అన్నియు మైనము నుండి తయారైనట్లు కనిపించినవి.

బలి యగు ప్రాణిగను బలి యిచ్చు వాడుగను బలిపీఠముగను దేవుడే రూపొందినట్లు నాకు అగపడుచున్నది.

ఉఱ్ఱూత లూపు నట్టి యనుభూతి ఇది. సమస్తమును ఏకమును అభిన్నములే అనుట ఈ యనుభూతిలో ఆయనకు స్పష్ట మయ్యెను. దానిని వర్ణించుచుండగనే ఆయన భావావేశవివశుడై 'ఔరా ఏమి దృశ్య' మని కేక వేసెను.

తత్క్షణమే శ్రీరామకృష్ణుడు సమాధినిమగ్నుడయ్యెను. తన దేహమును బాహ్యలోకమును పూర్తిగా మఱచి పోయెను. భక్తులు నివ్వెఱపడిరి. ఏమి చేయుటకును పాలు పోక, వారు కదలక కూర్చుండిరి.

అప్పుడే బాహ్యలోకస్మృతి ఇంచుక గలుగగా గురుదేవుడు "నాకిప్పుడు బాధ లేనే లేదు. యథాపూర్వముగనే ఉన్నాను" అనెను.

కష్టమునకును సుఖమునకును ఖేదమునకును మోదమునకును అతీతమైన గురుదేవుని యప్పటి దశను జూచి భక్తులు ఆశ్చర్యపడిరి.

తన చూపును లాటుపైని పఱపి ఆయన ఇట్లనెను — "ఇడుగో లాటు. తలను వంచుకొని దానిని అఱచేతిపై ఆనించుకొని యున్నాడు. దేవుడే ఆలాగు తలను వంచుకొని దానిని అఱచేత ఆనించుకొని యున్నట్లు నాకు అగపడుచున్నది.

శ్రీరామకృష్ణుడు భక్తులవైపు చూచెను. వారిపైని ఆయనకున్న ప్రేమ వేయి వెల్లువలుగ ఉప్పొంగెను. బిడ్డల యెడ గారాము చూపు తల్లివలె ఆయన రాఖాలు నరేంద్రుల వదనములను గడ్డములను స్పృశించెను.

కొన్ని నిమిషములకు పిమ్మట ఆయన మహేంద్రునితో "ఈ దేహము నిక కొన్ని దినాలు నిలుపుకొన్నచో, ఆధ్యాత్మిక ప్రబోధము ఎందఱికో లభించును" అనెను.

కొన్ని నిమిషములు ఊరకుండెను.

"కాని వారికి ఆ ప్రబోధప్రాప్తి లేదు. ఈ సారి ఈ మేను నిలుపుకోబడుట జరుగదు" అనెను.

గురుదేవుడు తర్వాత ఏమనునో అని భక్తులువ్విళులూరుచు నిరీక్షించుచుండిరి.

"ఈశ్వరసంకల్పము అది కాదు. నన్ను అమాయికు డని మతిహీను డని గుర్తించి లోకులు వేలుపుచ్చ కూడదు. అమాయికు డను మతిహీనుడను ఐన నేను అందఱకును అన్నిటిని ఇచ్చివేయ కూడదు. అందుకై ఈ దేహము నిలుపుకోబడుట ఈసారి జరుగదు. మీరు చూచుచునే ఉన్నారు కదా. ఈ కలియుగ మానవులకు ధ్యానజపము లనిన వెగటు.

రాఖాలు:— (ప్రేమతో) ఇక కొంత కాలము మీ మేనును ఉండ నిమ్మని దయచేసి దేవు నడుగుడు.

గురుదేవుడు:—అది ఈశ్వర సంక ల్పాధీనము.

నరేంద్రుడు:—తమసంకల్పమును ఈశ్వరసంకల్పమును ఒక్కటిగా కలిసి పోయినవి.

శ్రీరామకృష్ణుడు మాటాడకుండెను, దేనినో గూర్చి ఆలోచించుచున్నట్లుండెను.

గురుదేవుడు:— (నరేంద్రరాఖాలుప్రభృతులతో) దేవుని నే నడిగిన, ఏమియు జరుగదు. నాకును లోకజననికిని ఐక్య మేర్పడి నట్లు నా కిప్పుడు తెలియుచున్నది.

భక్తులు గదిలో నిశ్శబ్దముగ గూర్చుండిరి. శ్రీరామకృష్ణుడు వారివైపు ప్రేమతో జూచెను. పిమ్మట తన రొమ్ముపై చేయి నుంచుకొని ఏమో చెప్ప నుంకించెను.

గురుదేవుడు:— (నరేంద్రాదులతో) ఇందులో ఇరువురు వ్యక్తులు ఉన్నారు. ఒకతె లోకజనని —

ఆయన ఆపెను. తర్వాత ఏ మనునో విందమను నుబలాటముతో భక్తు లాయనవంక జూచుచుండిరి.

గురుదేవుడు:—ఔను. ఒకతె ఆమె. రెండవ వ్యక్తి ఆమె భక్తుడు. చేయి విఱుచుకొన్నదియు ఆ భక్తుడే, వ్యాధిగ్రస్తుడుగ నున్నదియు ఆ భక్తుడే. తెలిసినదా?

భక్తులు నోరెత్తక కూర్చుండిరి.

గురుదేవుడు.— అయ్యో! దీని నంతయు నేను ఎవరితో చెప్పుదును? నా మాటలను ఎవరు అర్థము చేసికొందురు?

కొన్ని నిమిషములు ఊరకుండి, పిదప ఆయన ఇట్లనెను —

దేవుడు మానవుడగును, అవతారమూర్తి అగును, తన భక్తులతో తాను భువి కరుదెంచును. ఈ లోకమును ఆయన విడిచి యేగు నప్పుడు ఆయనతో గూడనే భక్తులును ఏగుదురు.

రాఖాలు:—కాబట్టియే మమ్ము విడిచి పోకుందురు గావుత మని ప్రార్థించుచున్నాము.

శ్రీరామకృష్ణుడు చిఱునవ్వు నవ్వి "గాయకనర్తకబృంద మొకటి ఆకస్మికముగ కనిపించును, ఆడును, పాడును, ఆకస్మికముగనే కనుచాటగును. వారు వత్తురు, వెనుదిరిగి పోవుదురు, వారిని ఫలానా అని ఒక్కరును గుర్తింపరు" అనెను.

గురుదేవుడును భక్తులును చిఱునవ్వు నవ్విరి.

కొన్ని నిమిషముల పిదప ఆయన ఇట్లనెను — మానవదేహ ధారికి కష్టానుభవము అనివార్యము. ఈ భూలోకమున మఱియొక జన్మము నాకు లేకుండును గావుత మని నాలో నేనే మాటిమాటికిని అనుకొనుచుందును. కానీ వేఱొకటి ఉన్నది. వెలుపల సర్వవస్తు సంపన్నము లగు విందు లారగించిన వానికి ఇంటి చౌక వంటకాలు రుచింపవు.

అంతే కాదు. ఈ మానవదేహధారణము కూడ భక్తుల కొఱకే.

శ్రీరామకృష్ణుడు నరేంద్రునివైపు ప్రేమామృతమును వర్షించు చూపులను బఱపెను.

గురుదేవుడు:— [నరేంద్రునితో] పంచము డొకడు మాంస భారమును మోచికొని పోవుచుండెను. గంగలో స్నానముచేసి

శంకరాచార్యులవారును ఆ దారిని బోవుచుండిరి. ఆకస్మికముగ ఆ పంచముని స్పర్శ గలిగినది శంకరాచార్యులవారికి. శంకరులు 'ఏమిరా ఇది! నన్ను తాకితివే' అని చుఱుకుగా అనిరి. అతడు ఇట్లు బదులు చెప్పెను — "పూజ్యమహాశయా, నేను మిమ్ము అంట లేదు, మీరును నన్నంట లేదు. వాదింతము రండు. ఈ దేహమా మీరు? మనస్సా మీరు? బుద్ధియా మీరు? మిమ్ము విభజించి చూచుకొండి. నిస్సంగమును, స్వతంత్రమును, సత్త్వరజస్తమము లనెడి త్రిగుణము లచే ఎట్టి మార్పును చెందనిదియు అగు విశుద్ధాత్మయే మీరు".

బ్రహ్మస్వరూపమును మీ రెఱుగుదురా? అది గాలిం బోనిది. సువాసనలను దుర్వాసనలను గాలి మోచుచుండునే కాని, ఆ వాసన లేమో గాలి కంటవు.

నరేంద్రుడు:—చిత్రము, మహాశయా.

గురుదేవుడు:— బ్రహ్మము గుణాతీతము, మాయాతీతము, జ్ఞానమాయకును అజ్ఞానమాయకును రెంటికిని అతీతము; కామినీ కాంచనములే అజ్ఞానాత్మక మాయ; వివేకము, వైరాగ్యము, భక్తి మున్నగు నాధ్యాత్మిక గుణములే జ్ఞానాత్మకమాయయొక్క వెలుగులు. శంకరాచార్యులవారు జ్ఞానాత్మకమైన మాయను నిలుపుకొన్నారు. నీవును, ఈ యితరులును నాయందింత అక్కఱ వహించుటకును ఆ జ్ఞానాత్మకమాయయే కారణము.

నరేంద్రుడు:—నేను సన్న్యాసము పేరు ఎత్తిన కొందఱు కోపపడుదురు.

గురుదేవుడు:— (రహస్యముగ) సన్న్యాసము ఆవశ్యకమే. (తన యవయవములను చూపుకొనుచు) వీనిలో ఒకదానిపై నొకదాని నుంతు మేని, పైదానిని తొలగింపనిదే క్రిందిదానిని అందుకో లేము. అందుకో గలవా?

నరేంద్రుడు:—అందుకో లేము, మహాశయా.

గురుదేవుడు:— (నరేంద్రునితో రహస్యముగ) ప్రతివస్తువులోను దేవుడు నిండియున్నట్లు ఎవడు సాక్షాత్కరించుకొనునో వానికి వే ఱొకటి కనిపించునా?

నరేంద్రుడు:—ఐహికసంగము విడువ వలసినదేనా?

గురుదేవుడు:—ఇప్పుడే చెప్పితిని గదా, ప్రతివస్తువులోను దేవుడు నిండియున్నట్లు సాక్షాత్కరించుకొన్న వాని దృష్టికి వే ఱొకటి కనిపించునా? జగత్తు అనున దొకటి అతని దృష్టిలో నుండునా?

నేను జెప్ప నెంచినది మానసిక సన్న్యాసము. ఇచ్చటికి వచ్చిన వారిలో ఐహికపరుడు ఒక్కడును లేడు. కొందఱకు కామినీ వాంఛను బోలిన ఆశాలేశము ఉండినది. (రాఖాలును - మహేంద్రుడును చిఱునవ్వు నవ్వుదురు) ఆ కోరిక నెఱవేఱినది.

గురుదేవుడు నరేంద్రుని వైపు ప్రేమపూర్ణదృక్కులను పఱపెను. ఆయనలో ప్రేమ నిండి తొనకు చుండెను. భక్తులవైపు చూచుచు, "చాలగొప్ప" అనెను.

చిఱునవ్వుతో నరేంద్రుడు "ఏది చాల గొప్ప?" అని గురుదేవు నడిగెను.

గురుదేవుడు:— (చిఱునవ్వుతో) చాల గొప్ప సన్న్యాసమునకు ఆయత్తపడుచున్నా రనుట స్పష్టముగ కనిపించుచున్నది.

నరేంద్రాది భక్తులు నో రెత్తక గురుదేవుని జూచుచుండిరి. రాఖాలు సంభాషణను మరల తొడంగెను.

రాఖాలు:—(చిఱునవ్వు నవ్వుచు గురుదేవునితో) నరేంద్రుడు ఇప్పు డిప్పుడు మిమ్ము చక్కగా అర్థము చేసికొను చున్నాడు.

(శ్రీ)రామకృష్ణుడు నవ్వి "ఔను, అంతే, ఇంకను పెక్కండ్రు ఇప్పు డిప్పుడే అర్థము చేసికొను చున్నారు. (మహేంద్రునితో) అంతే కదూ?

మహేంద్రుడు:—చిత్తము మహాశయా.

శ్రీరామకృష్ణుడు నరేంద్ర మహేంద్రులవైపు తన చూపును మరల్చి వ్రేలితో సైగ చేయుచు వారిని చూడు డని భక్తులను హెచ్చరించెను. ఆయన మొదట నరేంద్రుని తరువాత మహేంద్రుని చూపెను. రాఖాలు గురుదేవుని సూచనను అర్థము చేసికొని చిఱునవ్వుతో "నరేంద్రునిది నాయకుని వైఖరి. మహేంద్రునిది భగవంతుని చేటివైఖరి. ఇదే గదా మీరు చెప్ప నెంచినది" అనెను.

శ్రీరామకృష్ణుడు నవ్వెను.

నరేంద్రుడు:—(చిఱునవ్వు నవ్వుచు రాఖాలుతో) ఇతడు (=మహేంద్రుడు) ఎక్కువ మాటాడడు, సిగ్గుపడుచుండును. అందు కేనా ఇతనిని దేవుని చేటి యంటివి?

గురుదేవుడు:—(చిఱునవ్వు నవ్వుచు నరేంద్రునితో) సరి, నన్ను గుఱించి నీ అభిప్రాయ మేమి?

నరేంద్రుడు:—నాయకుడును మీరే, దేవుని చేటియు మీరే, వేఱు ఏదైనను మీరే.

ఈ మాటలు శ్రీరామకృష్ణుని దివ్యభావోద్రేకపూరితునిగ చేసినవి. ఆయన తన ఱొమ్ముపై చేయి నుంచుకొని ఏమో చెప్ప నుంకించుచుండెను.

నరేంద్రాది భక్తులతో ఆయన "అన్ని వస్తువులును, ఉన్న వన్నియు ఇందుండి ఉప్పతిల్లిన వని నాకు తెలిసినది" అనెను.

ఆయన నరేంద్రుని "ఏమి అర్థము చేసికొంటివి?" అని సైగ మూలముగ అడిగెను.

నరేంద్రుడు:—సృజింపబడిన పదార్థము లన్నియు మీ నుండి పుట్టువొందినవే.

గురుదేవుని నెమ్మోము ఆనందముతో వెలుగొందెను, "అత డన్న మాట వింటివా" అని రాఖాలును అడిగెను.

శ్రీరామకృష్ణుడు నరేంద్రుని పాట పాడు మనెను. నరేంద్రు డొక పాటను పాడెను. అతని చిత్తము వైరాగ్యభరితమై యుండెను. ఇట్లు పాడెను.

అబ్జదళముపైని అంబువు నిలదు,
నరుని జీవితమును నరయఁగా నంతె.
సాధుసంగతి నుర్కి క్షణకాల మైన
పడవయై దాఁటించు భవసాగరమును.

నరేంద్రుడు మొదట రెండు బంతుల పాట ముగించెనో లేదో శ్రీరామకృష్ణుడు "ఏమి పాటోయి ఇది! సారహీన మైన తీరు ఇది, ఇందు విశేషము లేనే లేదు" అని సైగ చేసి తెలిపెను.

నరేంద్రుడు తన్ను ఒక గోపికగా భావించుకొని, గోపికల కృష్ణతృష్ణను దెలుపు నీ పాటను పాడెను—

ఎంత వింతలె చెలి యెంచి చూడఁగను
బ్రదుకునీతులును మరణనియమములు!
వ్రజవాటియువకుఁడు పాతె నెక్కడికో!
దీన యీ గొల్లైత దివమున కేగు.
నను మించు నందాల నాతుల పైని
వలపు గొన్నాఁడు గోపాలసుందరుఁడు,
తలఁపులోఁ దలఁపనే తలఁపఁడు సూవె
గొల్లని కూఁతును గోలను నన్ను.
అంత కృపాళువు నంత దివ్యుఁడును
వెలి తళుకుల తిరిపెము నాశ పడు న
ని యెవ రూహింపఁగా నేర్తురే చెలియ?
తెలియ లేనైతిని, తెలివి మాలితిని,

వాని చక్కఁదనపు వాసిని జూచి,
వాని పాదాల నా వక్షోజ సీమ
నానించుకొన నొంటి నాశ గూరితిని.
యమున వెల్లువలోఁ బడి మునిఁగి పోదు.
విషమునైనను చెలీ వెసఁ ద్రాగి చత్తు.
మెడకుఁ దీఁగలఁ జుట్టి విడుతు నసువుల.
వర తరుణ తమాల తరువున కైన
నురిబోసికొని పొలియుదు నిముసమున.
ఇవి గాక పోయిన, నెడ తెంపు లేక—
'ఓ కృష్ణ' 'ఓ కృష్ణ' 'ఓ కృష్ణ' యనుచుఁ
బాడుచు విడుతుఁ బో పాడు ప్రాణాల.

ఈపాట విన్న శ్రీరామకృష్ణునకును భక్తులకును హృదయములు ఎంతయు కరగిపోయినవి. గురుదేవుడును రాఖాలును ప్రేమ బాష్పముల కార్చిరి. తమ ప్రాణేశ్వరుడైన శ్రీకృష్ణునెడ వ్రజ యువతుల కుండిన వలపుచేత ఉన్మత్తుడై నరేంద్రుడు డిట్లు పాడెను—

నల్లనయ్యా, దయిత, నా వాఁడవు గద.
ఏమి చెప్పుదు జీవితేశ్వర, నీకు ?
నేఁటికే కాని, యే నాఁటికే కాని,
ఆఁడుపుట్టువను భాగ్యరహిత నైతి.
ఏమి చెప్ప వలెనో యెఱుఁగను నేను.
నా చేతి యద్దంబ, నా సిగపూవ,
ఓ సఖా, ని న్నొక కుసుమముగఁ గొని
తలఁదాల్తు, దాతు నా తలముడిలోన.
అచట నున్న నొరుల కగపడఁ బోవు
తాంబూలదళ మీవె తలఁప వాతెఱకు,

కన్నుల కించెడి కాటుక వీవె,
నిను గొని పెదవుల నింపుదు నెఱుపు,
నిను గొని కన్నుల నింపుదు నలుపు,
మేని కిడుకొన నా మేలి గంధంబు,
కంఠాన కిడఁగ నా కంఠహారంబు —
నీవె, కావున నిను నెఱయ రాచుకొని
యాత్మకుఁ మేనికీ నాహ్లాద మిడుదు.
నిను మెడఁ దాలుతు; నీవు నా యెదను
తటతటపడు గుండె దాపున నుండు;
నా దేహమున నుండు నా సిరి వీవె,
నా గేహమున నుండు నాథుండ వీవె,
పఱచు పక్షికి దాని పక్షాల వెట్లొ,
జలచరములకును జలము దా నెట్లొ,
అట్లె, నా స్వామి, నీ వౌదువు నాకు.

1886 వ సంవత్సరము ఏప్రిలు తే 9 ది శుక్రవారము.

అప్పుడు సాయంకాలము ఐదు గంటలు. కాశీపూరు వన మందిరపు క్రింది అంతస్తున నరేంద్రుడును కాళియు నిరంజనుడును మహేంద్రుడును మాటాడుకొనుచుండిరి. కాళీతారకులతో బోధ్ గయకు యాత్ర వెళ్లి యుండిన నరేంద్రుడు యాత్రనుండి అప్పుడె తిరిగి వచ్చి యుండెను. ఆపుణ్యక్షేత్రమున బుద్ధమూర్తి యెదుట అతడు గాఢధ్యాననిమగ్నుడయ్యెను. బోధివృక్షమునకును ప్రణామములు చెల్లించుకొనెను. ఏ వృక్షము నడుగున బుద్ధునకు నిర్వాణసిద్ధి గలిగెనో ఆ వృక్షమునుండి పుట్టినదే ఈ వృక్షము.

మేడ మీంది పెద్దహాలులో శ్రీరామకృష్ణుడు తన పాన్పుపై కూర్చుండెను. అది సాయంవేళ. గదిలో మహేంద్రుడొక్కడు

మాత్రమే గురుదేవునకు గాలి విసరుచుండెను. కొంతసేపైన తర్వాత లాటు వచ్చెను. నరేంద్రుడును గదిలోనికి వచ్చి కూర్చుండెను. శశియు రాఖాలును మఱి యొక రిద్దఱు భక్తులును గూడ లోపలికి వచ్చిరి. ఇంచుక తన పాదము లొత్తు మని గురుదేవుడు నరేంద్రుని కోరుచు 'భోజన మైనదా' అని అడిగెను.

గురుదేవుడు:—[చిఱునవ్వు నవ్వుచు మహేంద్రునితో] అక్కడకు (=బోధగయకు) పోయి వచ్చినాడు నరేంద్రుడు.

మహేంద్రుడు:— [నరేంద్రునితో] బుద్ధుని సిద్ధాంతము లేవి?

నరేంద్రుడు:— సాధనచే తాను సాక్షాత్కరించుకొన్న దానిని ఆయన మాటలలో ప్రకటింప లేక పోయినాడు. కావుననే లోకులు అతనిని నాస్తికు డందురు.

గురుదేవుడు:— [సైగల మూలముగ] నాస్తికు డెట్లు? కానే కాడు. ఆయన తన అంతరనుభూతులను మాటలలో చెప్ప లేక పోయెను. అంతే. 'బుద్ధుడు' అను పదమున కర్థ మేమో తెలియునా? చిత్స్వరూపమును ధ్యానించి బోధముతో ఐక్య మొందిన వాడు, చిత్తుగనే పరిణమించినవాడు.

నరేంద్రుడు:— ఔను, మహాశయా. బుద్ధులలో మూడు వర్గాల వారు ఉన్నారు — బుద్ధులు, అర్హతులు, బోధిసత్త్వులు.

గురుదేవుడు:— దేవున కిదియు నొక లీలయే, క్రొత్త లీల. బుద్ధుని నాస్తికు డన నేల? ఆత్మస్వరూపమును సాక్షాత్కరించుకొన్న వానికి కొంత అస్తిత్వమును కొంత నాస్తిత్వమును అనుకొన దగిన దశ గలుగును.

నరేంద్రుడు:— [మహేంద్రునితో] ఆ దశలో ద్వంద్వము లేకపై పోవును. జలవాయు ప్రాణవాయువుల కలయికచే నీరు పుట్టును. గొట్టముగుండ నీటి నిగురగొట్టుటకును ఆ జలవాయుప్రాణ వాయువులే ఉపయోగపఱుపబడును.

ఆ దశలో కర్మాచరణమును నైష్కర్మ్యమును రెండును సాధ్యములే. అనగా సాధకుడు సంగరహితుడై కర్మల నాచరించు ననుట.

శబ్దాది విషయ సక్తులైన లౌకికులు దేనినిగూర్చి చెప్పినను 'ఉన్నది' [అస్తి] అనియే చెప్పుదురు. మాయావాదులు 'ఏదియు లేదు' [నాస్తి] అందురు. ఈ యస్తిత్వ నాస్తిత్వముల కతీత మైనది బుద్ధు ననుభవము.

గురుదేవుడు:— అస్తిత్వ నాస్తిత్వములు ప్రకృతికి సంబంధించినవి. పరమ సత్యము ఆ రెంటికిని మీదిది.

భక్తులు కొన్ని నిమిషముల సేపు మౌనముగ నుండిరి.

గురుదేవుడు:— [నరేంద్రునితో] బుద్ధుడు ఏమి బోధించినాడు?

నరేంద్రుడు:— దేవుని అస్తిత్వ నాస్తిత్వముల మాట నెత్త లేదు బుద్ధుడు, కాని బ్రతికినన్నాళ్లు సకల ప్రాణుల యెడ కారుణ్యము చూపినాడు.

ఒకడేగ ఒకపిట్టపై ఉరికి దానిని కబళింప నుండ, పిట్టను కాపాడుటకై బుద్ధుడు తన మేని మాంసమును డేగకు అర్పించెను.

శ్రీరామకృష్ణుడు మౌనముగ నుండెను. బుద్ధునిగూర్చిన యుత్సాహము నరేంద్రునకు హెచ్చు పెరిగినది.

నరేంద్రుడు:— ఆహా! ఎంతటి త్యాగము ఆయనది! రాజపుత్రుడుగ జన్మించి, సమస్తమును విడనాడెను. సంపదయే లేని, ఏమియునే లేని వాని త్యాగమునకు ఏ మర్థము! బుద్ధుడై నిర్వాణము ననుభవించిన పిమ్మట నత డొకసారి స్వనగరమునకు వచ్చి భార్యను పుత్త్రుని రాజకుటుంబములోని యితరులను వైరాగ్యమును సన్న్యసింపుడని ప్రోత్సహించెను. ఎంత గాఢ మైన త్యాగము ఆయనది! మఱి వ్యాసుని నడవడిని జూడుడు. "అబ్బాయీ, గృహస్థుడవుగనే ఉండి

సాధన చేయు" మనుచు ఆయన తన పుత్త్రుడైన శుకదేవుని సన్న్యసింప వలదనెను.

శ్రీరామకృష్ణుడు మౌనముగ నుండెను. ఇంతవఱకొక్క మాటనైనను చెప్పలేదు.

నరేంద్రుడు:— శక్తియు గిక్తియు బుద్ధునకు లక్ష్యము లేదు. ఆయనకు కావలసినది నిర్వాణ మొక్కటే. ఆహా! ఎంతటి వైరాగ్యము ఆయనది! ధ్యానింప బోధివృక్షముక్రింద కూర్చున్నప్పుడు ఆయన "నిర్వాణమే సిద్ధింపకున్న, నా దేహము ఇచటనే ఎండిపోవును గాక" అని ప్రతిజ్ఞ చేసెను. అంతటి దృఢనిశ్చయము ఆయనది!

నిజముగ, దేహమే గొప్ప శత్రువు. దానిని శిక్షించుకొనకున్న ఏదైనను సాధ్య మగునా?

శశి:— మాంసాహారముచే సత్త్వవృద్ధి యగు నని ఉపన్యసించు వాడవు నీవే గా! మాంసమును తినక తప్ప దంటివే.

నరేంద్రుడు:— నేను మాంసాహారినే, సందేహము లేదు, కాని వట్టి అన్నమును, ఉప్పైనను లేని అన్నమును తినియు నే జీవింప గలను.

కొన్ని నిమిషము లైన తర్వాత శ్రీరామకృష్ణుడు మౌనము వీడెను. 'బుద్ధుని తల పైని జుట్టు ఉన్న దేమో చూచితివా' అని సైగమూలముగ నరేంద్రు నడిగెను.

నరేంద్రుడు:— జుట్టు లేదు, మహాశయా. ఏదో ఒక విధమైన కిరీట మున్నట్లున్నది. ఒకదానిపై నొకటిగా చుట్టబడిన రుద్రాక్షమాలలు ఆయన సిగను కప్పి యున్నట్లున్నది.

గురుదేవుడు:— ఆయన కన్నులో?

నరేంద్రుడు:— అవి ఆయనసమాధిలో ఉన్నాడని తెలుపుచున్నవి.

శ్రీరామకృష్ణుడు మరల మౌనము వహించెను. నరేంద్రాది భక్తులు ఆయనవైపు తదేకదృష్టితో చూచుచుండిరి. తటాలున ఒక నవ్వు ఆయన మోమును వెలుగొందించెను. ఆయన నరేంద్రునితో మాటాడ దొడగెను. మహేంద్రుడు విసనకఱ్ఱతో విసరు చుండెను.

గురుదేవుడు:— (నరేంద్రునితో) మఱి ఇక్కడ నేమో మామూలు సెనగలు చింతపండుతో సహా అన్నియు ఉన్నవి. ఉన్నవి కదా?

నరేంద్రుడు:— ఆ దశల నన్నిటిని అనుభవించిన పిమ్మట, ఇప్పుడు తాము క్రిందిస్థాయిలో ఉన్నారు.

మహేంద్రుడు:— (తనలో) ఔను, ఆ లక్ష్యాల నన్నిటిని సాక్షాత్కరించుకొన్న పిదప, ఇప్పుడీయన భక్తుడుగ భగవద్భక్తుడుగ నున్నాడు.

గురుదేవుడు:— ఎవరో నన్ను పట్టుకొని ఈ క్రిందిస్థాయిలోనే పెట్టి యున్నట్లున్నది.

ఆ మాట చెప్పి, శ్రీరామకృష్ణుడు మహేంద్రుని చేతి నుండి విసనకఱ్ఱను తీసికొని "నా యెట్టయెదుట ఈ విసనకఱ్ఱను ఎట్లు చూచుచున్నానో, ఇట్లే దేవుని నేను చూచి యున్నాను. ఇంకను ఏమి చూచితి ననగా —

ఇట్లని, ఆయన ఱొమ్ముపై చేయి నుంచుకొని, "నే నేమంటినో చెప్ప గలవా" అని సైగమూలముగ నరేంద్రు నడిగెను.

నరేంద్రుడు:— నాకు అర్థమైనది.

గురుదేవుడు:— ఏదీ చెప్పుము.

నరేంద్రుడు:— మీ మాటలు నాకు సరిగా వినబడ లేదు.

శ్రీరామకృష్ణుడు సైగమూలముగ మరల నిట్లనెను: "నేను సాక్షాత్కరించుకొన్న దేవుడును నా హృదయములో ఉన్న దేవుడును ఒక్కరే అని నేను తెలిసికొంటిని.

నరేంద్రుడు:—సరి సరి, సోఽహమ్, అతడనే నేను.

గురుదేవుడు:— ఇద్దఱిని ఎడసేయుచున్న ద్రొక్క రేఖ మాత్రమే. నాకు దివ్యానందానుభవము కలుగుటకే ఆ భేదము.

నరేంద్రుడు:—[మహేంద్రునితో] తాము ముక్తి నొందిన పిమ్మట గూడ, మహాత్ములు ఇతరుల విముక్తికి తోడ్పడుటకై తమ యహంకారమును నిలుపుకొని, శరీరసుఖదుఃఖాల ననుభవించు చుందురు.

అది కూలిపని వంటిది. నిర్బంధముచే మనము కూలిపని చేయుదుము. కాని మహాత్ములు తియ్యని తమ యానందమునకై యే అట్లు పనిచేయుదురు.

మరల అందఱును మౌనము వహించిరి. కొంత సేపటికి శ్రీరామకృష్ణుడే సంభాషణను మరల ఆరంభించెను.

గురుదేవుడు:—[నరేంద్రునితో] పైకప్పు స్పష్టముగ కన బడుచున్నది. దాని నందుకొనుట మాత్రము చాల కష్టము.

నరేంద్రుడు:—చిత్తము, మహాశయా.

గురుదేవుడు:—కాని కప్పుమీదికి ఇంతకుమునుపే చేరుకొని యున్న వాడెవడైనను ఒకపగ్గమును జాఱవిడుచు నేని, దానిచే మఱియొకనిని పైకి చేదుకొనవీ లగును.

రాఖాలు:—[ఇతరభక్తులతో] ఇంతతో ఆపుదము. ఇప్పటికే ఆయన ఎంతో మాటాడినాడు, మాటాడుచునే యున్న ఆయన వ్యాధి హెచ్చును.

1886 వ సంవత్సరము ఏప్రిలు తే 13 ది మంగళవారము.

శ్రీరామకృష్ణుడు భక్తులతో కూర్చుండి యుండెను. వెఱ్ఱి వనిత యొకతె గురుదేవుని పీడించుచుండెను. ఆయనయెడ ఆమె కాముకురాలి భావన వహించి, వనమందిరమునకు తఱచు పరుగున

వచ్చుచు గురుదేవుని గదిలోనికి తటాలున చొచ్చుకొనుచుండెను. భక్తులచే ఆమె తన్నులుకూడ తిని ఉన్నది. కాని ఆ తన్నులు ఆమె నాప లేదు.

శశి:—మరల వచ్చు నేని, ఆపె నిచ్చట నుండి గెంటెదను.

గురుదేవుడు:—(ప్రేమతో) వలదు, వలదు, ఆమెను వచ్చి పో నిమ్ము.

రాఖాలు:—ఎవ రైనను గురుదేవుని దర్శింప వచ్చినప్పుడు మొదట మొదట నేనును అసూయపడుచుంటిని. కాని ఎవరు నాకు గురువో, ఆయనే విశ్వ మంతటికిని గురు వను విషయమును ఈయన నాకు దయతో ప్రత్యక్ష మొనర్చినాడు. మనలో ఏకొందఱకొఱకో మాత్రమేనా ఈయన అవతరించినది?

శశి:—అది కాదు నేను చెప్ప నెంచినది. ఈయన వ్యాధి గ్రస్తుడుగ నున్నప్పుడు ఆమె ఎందులకు వచ్చి పీడింప వలెను? ఆమె, అంతటి మహాపీడ!

రాఖాలు:—మన మందఱమును ఈయనను పీడించు వారమే. పరిపూర్ణత నొందిన పిమ్మటనే వచ్చియుంటిమా ఏమి మన మందఱ మును ఈయనయొద్దకు? మనము కలిగింప లేదా ఈయనకు ఎంతో బాధను? నరేంద్రు డేమి, మఱికొంద ఱేమి, మొదటిదినాలలో ఏలాగు నడచుకొన్నారు? ఆయనతో ఎం తెంత వాదములు వాదించినారు?

శశి:—మాటలలో చెప్పిన వాని నెల్ల నరేంద్రుడు తన చేత లలో నెగ్గించినాడు.

రాఖాలు:—డాక్టరు సర్కారు ఈయనవిషయమున ఎంత మోటుతనముతో వ్యవహరించినాడు! ఆలాగు చూతు మేని అపరాధి కాని వాడు లేనే లేడు.

గురుదేవుడు:— [ప్రేమతో రాఖాలును జూచి] ఏ మేని భుజింతువా ?

రాఖాలు:—ఇప్పుడు భుజింపను. తర్వాత భుజింతును.

'ఇచట భుజింతువా' అని శ్రీరామకృష్ణుడు సైగ మూలముగ మహేంద్రు నడిగెను.

రాఖాలు:— [మహేంద్రునితో] దయచేసి ఇచట భుజింపవోయి, భుజింపు మనుచున్నా డాయన.

శ్రీరామకృష్ణుడు తన పాన్పుపై కూర్చుండి యుండెను. ప్రేక్షకుల దృష్టికి ఆయన ఐదేండ్ల బాలునివలె నుండెను. ఆ వెఱ్ఱి వనిత అప్పుడే మేడ మెట్లెక్కి గదియొద్ద నిలబడెను.

మహేంద్రుడు:— [సన్ననియెలుగున శశితో] ఆయనకు మ్రొక్కి పొమ్మనుము ఆమెతో. గలభా చేయకుము.

శశి ఆమెను క్రిందికి పిలుచుకొని పోయెను.

అది బంగాలి సంవత్సరాది. భక్తమహిళలు పెక్కండ్రువచ్చి, శ్రీరామకృష్ణునకును మాతృశ్రీకిని మ్రొక్కిరి. వారిలో బలరాముని సతియు మనోమోహనుని పత్నియు, బాగ్బాజారు బ్రాహ్మణియు నుండిరి. వారిలో పెక్కండ్రు తమతో తమ పిల్లలను గూడ పిలుచుకొని వచ్చిరి. కొందఱు మహిళలు గురుదేవుని పాదములకు కుసుమముల నర్పించిరి. తొమ్మిది పది సంవత్సరాల వయసు గల పడుచు లిద్దఱు కొన్ని పాటలు పాడిరి.

* * * * * * *

అది మధ్యాహ్నానంతర వేళ. మహేంద్రాది భక్తులొక కొందఱు గురుదేవుని సమీపమున కూర్చుండిరి. నరేంద్రుడు గదిలోపలికి వచ్చెను. గురుదేవుడు పలుమార్లు చెప్పినట్లు అతడు ఒఱ వీడిన ఖడ్గమువలె నుండినాడు.

నరేంద్రుడు గురుదేవుని సమీపమున గూర్చుండి మహిళలనిన తనకు గలుగు చిరాకును ఆయనకు వినబడునట్లు వెలిబుచ్చుచుండెను. భగవంతుని సాక్షాత్కరించుకోగోరు వారికి కామినులు ఎంత విఘ్నకారిణులో అతడు భక్తులకు చెప్పుచుండెను.

శ్రీరామకృష్ణు డేమియు బదులాడ లేదు. నరేంద్రుని మాటలను వినుచుండెను.

''నాకు కావలసినది శాంతి. దేవునిసైతము నేను లక్ష్యపెట్టను'' అనెను నరేంద్రుడు మరల.

శ్రీరామకృష్ణుడు నోరెత్తక తదేకదృష్టితో అతనివంక చూచుచుండెను. నడుమ నడుమ నరేంద్రుడు 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' అను వాక్యమును వల్లించుచుండెను.

1886 వ సంవత్సరము ఏప్రిలు తే 16 ది శుక్రవారము.

చందమామ ఉజ్జ్వలముగ ప్రకాశించుచుండెను, తోటబాటలలోను తరువులందును చెఱువునీటియందును, వెన్నెల వెల్లిగొనుచుండినది. గిరీశుడును మహేంద్రుడును లాటును మఱికొందఱు భక్తులును చెఱువుమెట్లపై కూర్చుండి యుండిరి. ఇల్లు చెఱువునకు పడమటి వైపు. రెండవ అంతస్తులోని గురుదేవుని గదిలో దీప మొకటి వెలుగుచుండెను. శ్రీరామకృష్ణుడు తనపాన్పుపై కూర్చుండి యుండెను. గదిలో భక్తులు పెక్కండ్రు ఉండిరి. నాటి సాయంకాలమే నరేంద్ర-కాళీ-తారకులు దక్షిణేశ్వరమునకు పోయిరి. వారు పంచవటిలో దేవుని ధ్యానించుచు రాత్రిని గడప నెంచిరి.

గిరీశుడును లాటును మహేంద్రుడును శ్రీరామకృష్ణుని గదికి పోయిరి. శశియు ఒకరిద్దఱు భక్తులును గురుదేవునకు పరిచర్య చేయుచుండిరి. బాబురాముడు నిరంజనుడును రాఖాలును గూడ గదిలో ప్రవేశించిరి. అది పెద్ద గది. పాన్పునకు సమీపమున

మందులు కొన్నియు ఉపకరణములు కొన్నియు ఉండినవి. గదిలోనికి రాగోరువారు, ఉత్తరపుకోస నుండు వాకిలిగుండనే రా వలయును.

శ్రీరామకృష్ణుని పరిచర్య రాత్రి యంతయు జరుగుచునే ఉండ వలెను. కావున భక్తులు వంతుల ప్రకారము మేలుకొని యుండిరి. పరిచర్య చేయు భక్తుడు శ్రీరామకృష్ణునకు దోమతెర నమర్చి, తాను నేలపైని చాపమీద పవ్వళింపనైన పవ్వళించును, లేదా రాత్రియంతయు కూర్చుండియే గడపును. వ్యాధిచే శ్రీరామకృష్ణునకు నిద్ర లేదు, ఆయనకు పరిచర్య చేయు నతనికిని నిద్ర లేదు.

నాటి సాయంకాలము శ్రీరామకృష్ణుని శరీరస్థితి రవంత మెఱుగుగా నుండెను. భక్తులు గురుదేవునకు నమస్కరించి నేలపై కూర్చుండిరి. గురుదేవుడు మహేంద్రునితో 'దీపమును దగ్గఱకు తె' మ్మనెను. గిరీశునికి హృదయపూర్వకముగ స్వాగత మిచ్చెను.

గురుదేవుడు:—(గిరీశునితో) క్షేమమా? (లాటుతో) అతనికి పొగత్రాగుటకు సిద్ధము చేయుము, తాంబూల మొసంగుము.

కొన్ని నిమిషములకు తర్వాత ఆయన లాటును గిరీశునకు కొన్ని తినుబండములను పెట్టు మనెను. తినుబండములను తెచ్చుట కొకనిని పంపి యున్నా ననెను లాటు.

శ్రీరామకృష్ణుడు కూర్చుండి యుండెను. భక్త డొకడు ఆయనకు పూలమాలల సమర్పించెను. శ్రీరామకృష్ణుడు ఆ మాలల నొక టొకటిగా మెడలో వేసి కొనెను. భక్తు లబ్బురపడుచు ఆయన వైపు చూచు చుండిరి. ఆయన తనమెడనుండి పూలమాలలను రెంటిని తీసి గిరీశున కొసంగెను.

తినుబండములను తెచ్చినారా తెచ్చినారా అని శ్రీరామ కృష్ణుడు మాటిమాటికి నడుగుచుండెను.

మహేంద్రుడు గురుదేవునకు గాలి వీచుచుండెను. పాన్పుపై గంధపుచెక్క విసనకఱ్ఱ ఒకటి యుండెను. ఎవడో భక్తుడు అర్పించు

కొన్న దది. దానిని గురుదేవుడు మహేంద్రున కిచ్చెను. అతడు ఆవిసనకఱ్ఱతో విసురుచుండెను. ఆయన మహేంద్రునకు రెండు పూల మాలలనుకూడ నిచ్చెను.

సుమారు ఒకటిన్నఱ సంవత్సరములకు మునుపు మహేంద్రుని కుమారు డొకడు ఏడెనిమి దేండ్ల వాడు మరణించి యుండెను. ఆబిడ్డ గురుదేవుని ఎన్నో సార్లు దర్శించి యుండెను. లాటు మహేంద్రునిగూర్చి శ్రీరామకృష్ణునకు జెప్పుచుండెను.

ఈ సంగతులు విని శ్రీరామకృష్ణుడు వ్యధ జెందిన ట్లున్నది

గిరీశుడు:—అందులో వింత ఏమియు లేదు. అభిమన్యుడు మరణించినప్పుడు అంతకు ముందే భగవద్గీతోపదేశము విన్న అర్జునుడు దుఃఖముచే మూర్ఛిల్లినాడు.

తినుబండములను ఒక తట్టలో ఉంచి గిరీశున కిచ్చిరి. అందుండి ఒక తునుక శ్రీరామకృష్ణుడు స్వీకరించెను. శేషించిన దానిని గిరీశుడు ప్రసాదముగా గొనెను. గురుదేవు నెదుటనే కూర్చుండి అతడు తిన నారంభించెను. అతనికి త్రాగను నీరు కావలసి వచ్చినది. గది ఆగ్నేయమూలలో ఒక మట్టి కూజా ఉండెను. అది ఏప్రిలునెల. ఆ నాడు బెట్టగా నుండెను. "ఇక్కడ చల్లని మంచినీ రున్నది" అనెను శ్రీరామకృష్ణుడు.

శ్రీరామకృష్ణునకు లేచి నిలబడుట కైనను శక్తి లేదు. అది ఆయన వ్యాధిదశ. కాని శిష్యు లందఱును అమితముగ అబ్బురపడునట్లు వారు చూచుచుండగా ఏమి జరిగినది? వారు చూచుచుండగనే ఆయన పాన్పును వీడి లేచెను, దేహమున ఏభాగమునను వస్త్రము లేని తాను ఆ కూజావైపునకు నడచెను. తానే నీటిని ఒకలోటాలో పోయుటకుపోయినాడు. భయముచే భక్తులకు ఇంచుమించు చలువలు కమ్మినవి. గురుదేవుడు నీటిని లోటాలో నిండుగ పోసెను. చల్లగా ఉన్నదా చూచుటకై ఒకటి రెండు చుక్కలను తనచేతిలోనికి తీసికొనెను. నీ రేమో చాల చల్లగ లేదు. ఐనను

అంతకన్న మేలైనది దొరకనంచున, ఇష్టము లేకున్నను ఆ నీటనే గిరీశున కిచ్చెను.

గిరీశుడు మిఠాయిని తినుచుండెను. భక్తులు చుట్టును కూర్చుండిరి. మహేంద్రుడు శ్రీరామకృష్ణునకు గాలి విసురుచుండెను.

గిరీశుడు:—[గురుదేవునితో] దేవేణ్ బాబు సన్న్యసింప నిశ్చయించుకొనెను.

వ్యాధిచేత శ్రీరామకృష్ణుడు సంభాషింప లేకుండెను. వ్రేళ్లతో పెదవులను తాకుచు "ఇక అతని భార్యకు బిడ్డలకు భుక్తి ఎట్లు గడచును" అని సైగమూలముగ గిరీశు నడిగెను.

గిరీశుడు:—నాకు తెలియదు.

ఇతరభక్తులు మౌనముగ నుండిరి. గిరీశుడు భక్ష్యములను తినుచు మరల మాటాడ నారంభించెను.

గిరీశుడు:—మహాశయా, ఇష్టము లేకే సన్న్యసించువాడు, గృహస్థుడుగ నున్నను భగవత్స్మరణ సదా చేయువాడు— ఈ యిరువురిలో ఎవరి వివేక మధికము?

గురుదేవుడు:—[మహేంద్రునితో] భగవద్గీతలో నీవు చదువలేదా? జగన్మిథ్యాత్వమును గుర్తించి, జగత్తున నుండియు, సకల లౌకిక విధులను నిస్సంగుడై నిర్వర్తించు వానికి భగవత్ప్రాప్తి నిక్కముగ గలుగును.

సన్న్యసింప నిష్టము లేక సన్న్యసించు వారు జఘన్య వర్గమువారు.

గృహస్థ జ్ఞాని స్వరూప మెఱుగుదురా? అతడొక అద్దాల యింట నుండు వానిం బోలును, అద్దాలయింట నుండు వాడు లోపలి వైపును వెలుపలివైపును రెంటిని చూడ గలిగి యుండును.

గదిలో మరల కొంతసేపు నిశ్శబ్దత.

గురుదేవుడు:— (మహేంద్రునితో) ఫలాహారములు వేడి వేడిగా బాగున్నవి.

మహేంద్రుడు:—(గిరీశునితో) ఔను. అది ఫాగుఅంగడిలో కొన్నవి. ఆ యంగడి ప్రసిద్ధ మైనదే.

గురుదేవుడు:— (చిఱునవ్వుతో) ఔను, ప్రసిద్ధ మైనదే.

గిరీశుడు:— ఫలాహారములు నిజముగనే బాగున్నవి. (గురుదేవునితో) మహాశయా, నా మనసు ఇప్పుడు మిక్కిలి ఉన్నత స్థాయిలో ఉన్నది, అది మరల క్రిందికి ఏల దిగును?

గురుదేవుడు:— లౌకిక జీవితము గడుపు వానికి సదా అట్లే జరుగు చుండును. గృహస్థుని మనసు ఒక్కొక్కప్పుడు పైస్థాయుల కెక్కును, ఒక్కొక్కప్పుడు క్రిందికి దిగును. అతనిలో భక్తి ఒక్కొక్కప్పుడు హెచ్చుగ నుండును. ఒక్కొక్కప్పుడు తక్కువగ నుండును. అతడు కామినీకాంచనాల నడుమ నుండుటే ఇందులకు కారణము. గృహస్థుడు ఒక్కొక్కప్పుడు దేవుని ధ్యానించును, నామసంకీర్తనము చేయును, ఒక్కొక్కప్పుడు కామినీకాంచనాలతో వినోదించును. సామాన్య మైన యీగ మిఠాయిమీదను వ్రాలును, పెంటమీదను వ్రాలును, క్రుళ్లుడుకుఱుపులమీదను వ్రాలును. గృహస్థు పట్టి వాడు.

సన్న్యాసుల నడవడి పూర్తిగ వేఱు రీతిది. వారు తమ మనసులను కామినీకాంచనాలనుండి పూర్తిగా మరల్చుకొని దేవునందు ఏకాగ్రముగ నిలుప గలిగి యుందురు. భగవదానందము నొక్కదానిని మాత్రమే వారు అనుభవింప గలరు. నిజ మైన వైరాగ్యము గల వానికి భగవద్విషయము తప్ప తక్కిన దెల్ల మున్నహాము. లౌకికచర్చలు జరుగు తావులనుండి అతడు తొలగి పోవును. పారమార్థిక సంభాషణ వినరే అతడు చెవి యొగ్గును. నిజ మైన వైరాగ్యము గల వాడు దేవునిగూర్చియే కాక వేఱు దేనిని

కూర్చియు ప్రసంగింపడు. మధువు గ్రోలుటకు మధుపములు పుష్పములపైని మాత్రమే వ్రాలును, వేఱు దేనిని గాని అవి అనుభవింపవు.

గిరీశుడు చేతులు కడుగుకొనుటకు చిన్న మేడమీదికి పోయెను.

గురుదేవుడు :— (మహేంద్రునితో) మానవుని మనసు పూర్తిగా దేవునిపై నిలువవలెననిన, అందులకు దేవు నను గ్రహము కావలెను. సరి, గిరీశుడు తినుబండములను తెగ దిన్నాడు. ఇక ఈ రాత్రి కేమియు తిన వలదనుము.

గిరీశుడు గదిలోనికి మరలి వచ్చి గురుదేవు నెదుట కూర్చుండి తాంబూలము నమలు చుండెను.

గురుదేవుడు:— (గిరీశునితో) మంచి దేదో, చెడ్డ దేదో, తథ్య మేదో, మిథ్య యేదో, రాఖాలునకు ఇప్పుడు అర్థ మైనది. గృహస్థుడుగనే ఉన్నాడు. సందేహము లేదు. కాని గార్హస్థ్య మనిన ఏమో అత డెఱుగును. అతనికి భార్య ఉన్నది, కొడుకొకడు పుట్టినాడు. కాని ఇదంతయు మాయ అనియు నశ్వర మనియు అతడు ప్రత్యక్షముగ తెలిసికొన్నాడు. రాఖాలునకు ఐహికసంగము ఎప్పుడునే ఉండదు.

అతడు బురదచేపవంటివాడు. చేప బురదలోనే ఉండును గాని దాని యొడలి మీద బురద జాడయేని ఉండదు.

గిరీశుడు:— మహాశయా, ఇదంతయు నాకు అర్థము కాదు. మీరు తలపెట్టినచో ఎవని నైనను పవిత్రునిగను సంగరహితునిగను చేయ గలరు. గృహస్థు డగు గాక సన్న్యాసి యగు గాక, ఎవడైనను కాని, వానిని మీరు విశుద్ధునిగ జేయ గలరు. మలయ మారుతము ఏ చెట్టు నైనను గంధపుచెట్టుగ మార్చు నని నా నమ్మకము.

గురుదేవుడు:— వానిలో సారము లేకున్న అట్లు మారవు. ప్రత్తిచెట్టువంటి చెట్లు గంధపుచెట్లుగ మారవు.

గిరీశుడు:— దానిని నేను లెక్కింపను.

గురుదేవుడు:— మఱి నియతి అదే.

గిరీశుడు:— మీకు సంబంధించినది ఏ దైనను నియతిని ఉల్లంఘించునదే.

భక్తులు ఈ సంభాషణను ఎంతో అబ్బురముతో వినుచుండిరి. మహేంద్రుని చేతిలో విసనకఱ్ఱ మాటిమాటికిని ఆగిపోవు చుండెను.

గురుదేవుడు:— ఔను. అది నిజమే కావచ్చు. భక్తినది పొంగి గట్లను దాటి నప్పుడు, చుట్టు నున్న భూభాగ మంతటను ఐదున్నఱ గజముల లోతునకు నీరు వెల్లిగొనును.

(మహేంద్రునితో) భగవద్భక్తిని వర్ధిల్ల జేసికొన్న వానికి వే ఱేమియును అక్కఱ లేదు.

మహేంద్రుడు:— ఔను మహాశయా.

శ్రీరామకృష్ణుని తన ప్రియునిగ భావించు చున్న ఆ వెఱ్ఱివనిత ప్రస్తావము వచ్చినది. భక్తులు ఆమెను పాగ్లి (=వెఱ్ఱిది) అనుచు గురుదేవునిదరి చేర నీకుండిరి.

గురుదేవుడు:— (గిరీశుడు మున్నగువారితో) పాగ్లి నాపైని మధురభావము చూప ప్రియపడుచున్నది. ఒకనాడు ఆమె దక్షిణేశ్వర మునకు వచ్చి తటాలున బిగ్గఱగ ఏడ్వ నారంభించినది. ఎందుల కేడ్చు చుంటి వని నే నడిగితిని. 'అబ్బా, నా తల పగిలిపోవుచున్నది' అన్న దామె. [అందఱును నవ్వుదురు]. మఱియొక దినము ఆమె వచ్చినప్పుడు నేను భుజించుచుంటిని. ఆమె తటాలున "నాయందు కనికరింపరా" అన్నది. ఆమె మనసులో ఏ ముండెనో నాకు తెలి యదు, నేను భుజించుచుంటిని. అప్పుడు ఆమె "మీ హృదయము నుండి న న్నేల వెలికి త్రోసితిరి?" అని అడిగెను. 'నేను ఎవర నని నీ తలంపు?' అంటిని. "మీరు నా ప్రాణవల్లభు లని నా భావన" అన్న దామె. "అయ్యో, మహిళ లందఱును జగజ్జననీస్వరూపిణు

లని నా భావన. మగువ లెల్ల నాకు తల్లులు'' అని నేను చెప్పితిని. 'అదంతయు నే నెఱుగను' అన్నది ఆమె. అప్పుడు నేను రామ లాలును పిలిచి ''విన వోయి ఆమె మాటలను, ఏమిటి ఆమె చెప్పు నది? డెందమునుండి వెలికి త్రోసితి ననుట ఏమి?'' అని పలికితిని. ఇప్పటికిని ఆమెకు ఆ భావనయే.

గిరీశుడు:—నిజముగ ఆ పాగ్లి ధన్యురాలు. వెఱ్ఱిదే కావచ్చు. భక్తులచేత తన్నులు తిని ఉండ వచ్చు. కాని దినము 24 గంటలును ఆమె మిమ్మే ధ్యానించుచున్నది. ఏ విధముగ ధ్యానించిన నేమి! ఆమె కెట్టి కీడును గలుగదు.

మహాశయా, అందుంగూర్చి నా యనుభూతులను నే నెట్లు మాటలలో చెప్ప గలను? నేను మొదట ఎట్టుంటినో మిమ్ము ధ్యానించుటచే ఇప్పు డె ట్లైతినో యోచింపుడు. మునుపు నేను వట్టి సోమరిని, ఆ సోమరితనమే ఇప్పుడు 'సమస్తమును దేవునకు విడిచిపెట్టి యిన్నకుండుట'గా పరిణమించినది. పూర్వము నేను పాపిని. ఇప్పుడు నేను వినమ్రుడను. ఇక నే నే మన గలను?

భక్తులు మౌనముగ నుండిరి. రాఖాలు పాగ్లియెడ తన సానుభూతిని తెలిపెను. అతడు ''ఆమెసంగతి 'అయ్యో పాప' మని పించుచున్నది. ఆమె కలిగించు వేధయు ఎక్కువే, దానిఫలితమే ఆమె పడు కష్టము'' అన్నాడు.

నిరంజనుడు:— (రాఖాలుతో) నీ కింట భార్య ఉన్నది, కాబట్టి పాగ్లివిషయమున నీ కిట్లు తోచుచున్నది. మేమా, ఆమెను చంపుట కైనను వెనుదీయము.

రాఖాలు:— (చుఱుకుగా) ఏమి వీరాలాపము! ఈయన (=శ్రీరామకృష్ణుని) యెదుట ఇట్లు మాటాడు సాహస మెట్లు కలిగి నది నీకు?

గురుదేవుడు:— (గిరీశునితో) లోకము అనగా కామినీ కాంచనాలే. ధనమును తమ ప్రాణాధారరక్తముగా భావించువారు

పెక్కండ్రు. కాని ధనముపై నీ కెంత ప్రీతి ఉన్నను, ఎన్నడో ఒక నాడు ఒక్క పైసా ఐనను నిలువక నీ చేతినుండి జారిపోవును.

భగవదారాధనకో సాధువులయు భక్తులయు సేవకో ధనము వెచ్చించు వారు మాత్రమే తమ ధనమును సద్వినియోగము చేయు వారు. వారి ధనము ఫలించును.

వైద్యు లే దైన వస్తువు నిచ్చిన నేను తినలేను. ఎట్టి వైద్యులు? మానవుల కష్టమే తమ లాభోపాయముగ వర్తించు వైద్యులు, వారి పైకము రక్తమును చీమునే.

ఆ సందర్భమున శ్రీరామకృష్ణుడు ఇరువురు వైద్యులను పేర్కొనెను.

గిరీశుడు:— డాక్టరు రాజేంద్రదత్త ఔదార్యము గల వాడు. ఎవరియొద్దను దమ్మిడీ నైన పుచ్చుకోడు. ఇంకను తానే ధనమును ధర్మము చేయును.

1886 వ సంవత్సరము ఏప్రిలు తే 17 ది శనివారము.

అది పున్నమ రాత్రి. కొన్నాళ్లుగా నరేంద్రుడు ప్రతిదినమును దక్షిణేశ్వరమునకు పోవుచుండెను, పంచవటిలో ధ్యానానుసంధానము లలో ఎంతో కాలము గడపుచుండెను. ఈ దినము అతడు దక్షిణేశ్వరమునుండి సాయంకాలమప్పటికి వచ్చివేసెను. కాళీతారకులు అతనితో నుండిరి.

రాత్రి ఎనిమిది గంట లైనవి. వెన్నెలయు మలయపవనమును తోటసొంపును హెచ్చించినవి. ఎందఱో భక్తులు క్రిందిగదిలో ధ్యానించుచుండిరి. వారిని గూర్చి నరేంద్రుడు మహేంద్రునితో "వారు తమ ఉపాధుల నొక్కొక్కటిగా వదలించుకొనుచున్నారు" అనెను.

కొన్ని నిమిషములకు తర్వాత మహేంద్రుడు శ్రీరామకృష్ణుని గదిలోనికి వచ్చి నేలపై కూర్చుండెను. గురుదేవు డతనిని తాను ఉమిసెడిపాత్రను కడిగి తన తువాలును ఉతికిపెట్టు మనెను. మహేంద్రుడు చెఱువులో ఆ రెండు పనులను చేసెను.

మఱుదినము ప్రొద్దున శ్రీరామకృష్ణుడు మహేంద్రుని పిలిపించెను. మహేంద్రుడు గంగలో స్నానము చేసి, గురుదేవునకు మ్రొక్కి, డాబాపైకిపోయి యుండెను. "శోకాతుల మైన నీ పత్నిని ఈ వనమందిరమునకు పిలుచుకొని రమ్ము. ఇచ్చటనే భుజింపనీ" అని శ్రీరామకృష్ణుడు మహేంద్రునితో ననెను.

"రమ్మనుము ఆమెను. రెన్నాళ్లు ఉండనీ, శిశువును గూడ ఎత్తుకొని రానీ" అనెను గురుదేవుడు మహేంద్రునితో సైగల మూలమున.

మహేంద్రుడు:—ఔను, మహాశయా, ఆమెలో దైవభక్తి వర్ధిల్లిన, బాగుండును.

"దుఃఖము భక్తిని పాఱద్రోలును. పాపము ఆ పిల్లవాడు వయసువచ్చియుండినవాడు గదా!" అని శ్రీరామకృష్ణుడు మరల సైగల ద్వారా చెప్పెను.

కృష్ణకిశోరున కిద్దఱు కొడుకు లుండిరి, భవనాథుని వయస్సువారే, ఒక్కొక్కనికి విశ్వవిద్యాలయపట్టములు రెండేసి యుండెను. ఇరువురును మరణించిరి. కృష్ణకిశోరు ఎంత జ్ఞాని యైనను మొదట దుఃఖము నణచుకో లేక పోయినాడు. నా కెవరును లేరు. నే నెంత అదృష్టవంతుడను!

"కిశోరు వచ్చుట లేదే, ఏల?"

ఒకభక్తుడు:—ప్రతిదినమును స్నానమునకై గంగకు వచ్చును.

గురుదేవుడు:—ఇక్కడికి రాకపోవుట ఏల!

భక్తుడు:—నేను రమ్మందును లెండు.

గురుదేవుడు:—హరీశుడు వచ్చుట లేదే, ఏల?

మహేంద్రునింటి పిల్లలిద్దఱు తొమ్మిది పదేండ్ల వారు, గురుదేవునకై లోకజననిమీాది పాటలను ఎన్నింటినో పాడిరి. శ్యాంపుకూరులో గురుదేవుడు మహేంద్రునింటికి పోయి నప్పుడు ఈ పిల్లలే ఆయనకై పాటలు పాడి యుండిరి. గురుదేవుడు వారి పాటలు విని మిక్కిలి ప్రీతు డయ్యెను. ఇక్కడి పాట ముగిసిన వెంటనే, ఆ పిల్లలచేత పాడించుకొని తాము విందమని భక్తులు వారిని మేడక్రిందికి పిలిపించిరి.

గురుదేవుడు:—(మహేంద్రునితో) పిల్లలకు పాటలను ఇంక నింకను నేర్పుచునే ఉండకుము. వారు సహజముగ పాడిన అది వేఱు రీతిగ నుండును. వారు వీరనక ఎల్లర యెదుటను పాడు-చుందురేని వారి లజ్జ చెడును. మగువలకు లజ్జ తప్పక ఉండవలెను.

గురుదేవు నెదుట ఒక తట్టలో గంధపుష్పములు పెట్టబడినవి. ఆయన కూర్చుండి, ఆ గంధపుష్పములను అర్పించుకొని తన్నే ఆరాధించుకొనెను. గంధపుష్పముల కొన్నిసార్లు తన తలపై నిడుకొనెను. కొన్నిసార్లు మెడపై, కొన్నిసార్లు రొమ్ముపై, కొన్నిసార్లు నాభిపై.

కోన్నగరునుండి మనోమోహనుడు వచ్చి గురుదేవునకు మ్రొక్కి కూర్చుండెను. శ్రీరామకృష్ణుడింకను ఆత్మారామపూజ లోనే వ్యగ్రుడై యుండెను. ఒక పూలమాలను తన మెడలోనే వేసికొనెను. కొంతసేపటికి ఆయనకు మనోమోహనునిపట్ల ప్రీతి గలిగిన దేమో అతనికి కొన్నిపూల నిచ్చెను. మహేంద్రుడును ఒక పూవును స్వీకరించెను.

అప్పుడు పూర్వాహ్ణము తొమ్మిది గంటలు. గురుదేవుడును మహేంద్రుడును మాటాడుకొనుచుండిరి. శశియు ఆ గదిలో నుండెను.

గురుదేవుడు:—(మహేంద్రునితో) నరేంద్రుడును శశియు మాటాడుకొనుచుండిరే, దేనిని గూర్చి? ఏమని మాటాడుకొనిరి?

మహేంద్రుడు:—(శశితో) మీరు మాటాడుకొనుచుండినది దేనినిగూర్చి?

శశి:—మేము మాటాడుకొనుచుంటి మని ఎవరు చెప్పిరి? నిరంజనుడా?

గురుదేవుడు:—దేనినిగూర్చి మీ చర్చ? 'దేవుడు' 'అస్తిత్వము' 'నాస్తిత్వము' మున్నగు మాటలు నా చెవిని బడినవి.

శశి:—(చిఱునవ్వుతో) నరేంద్రుని పిలుతునా?

గురుదేవుడు:—పిలువుము.

నరేంద్రుడు వచ్చి కూర్చుండెను.

గురుదేవుడు:—(మహేంద్రునితో) దేనినైనను అడుగుము అతనిని. (నరేంద్రునితో) చెప్పవోయి మాకు, మీరు ఏమి మాటాడుకొంటిరో.

నరేంద్రుడు:—ఏమున్నది మీకు తెల్పుటకు? నాకు అజీర్ణము చేసి యున్నది.

గురుదేవుడు:—నీ అజీర్ణము సరిపడును లే.

మహేంద్రుడు:— (చిఱునవ్వుతో) బుద్ధ ననుభూతులను తెలుపుము మాకు.

నరేంద్రుడు:—బుద్ధుని గుఱించి నన్ను మాటాడు మనుటకు, నేను బుద్ధుడ నైతినా ఏమి?

గురుదేవుడు:— దేవుని అస్తిత్వమును గూర్చి బుద్ధ డేమనును?

నరేంద్రుడు:—దేవు డున్నాడని నీ వెట్లు చెప్ప గలవు? ఈ

జగత్తును సృజించినది నీవే. ఇందుంగూర్చి బెర్క్లి ఏ మన్నాడో నీకు తెలియును గదా.

మహేంద్రుడు:—ఔను, నే నెఱుగుదును. వస్తువులు ఉన్న వనుటకు అవి అగపడుచుండుటే ఆధార మని అతని మతము. ఈ జగము మన యింద్రియములకు గోచరించుచున్నంతసేపు మాత్రమే దీని ఉనికి.

గురుదేవుడు:—జగమునకు స్థితి మనస్సులోనే, దాని లయ మును మనస్సులోనే అనెడి వాడు సజ్జుడు. ఐనను 'నే' ననెడు జ్ఞప్తి ఉన్నంతవఱకును దేవునితో స్వామికింకరసంబంధమునే వహింప వలెను.

నరేంద్రుడు:—(మహేంద్రునితో) దేవు డున్నాడని నీవు తర్కముచే ఎట్లు నిరూపింతువు? అట్లు కాక నమ్మకముపై ఆధార పడుదు వేని, అప్పుడు స్వామి కింకర సంబంధమును నీ వంగీకరింపక తప్పదు. అంగీకరింతు వేని, దేవుడు కారుణ్యపూర్ణుడని చెప్పక నీకు తప్పదు.

లోకములో ఉన్న కష్టాలనే నీవు స్మరింతువు. నీకు దేవుడు ఇంత సుఖము నిచ్చి యున్నాడే, దాని నేల విస్మరింతువు? మానవ జన్మము, బ్రహ్మజ్ఞానతృష్ణ, మహాత్మునాశ్రయము అను నవి మూడును అమూల్యములు. ఈ మూటిని దేవుడు మనకు ప్రసాదించి యున్నాడు. మనయందు ఆయనకు ఎంత దయ!

అందఱును మౌనముగ నుండిరి.

గురుదేవుడు:—(నరేంద్రునితో) నాలో ఎవరో ఒకరు అంత ర్యామిగ ఉన్నట్లు నాకు స్పష్టముగ తెలియ నగు చున్నది.

నరేంద్రుడు మేడ క్రిందికి పోయెను. అతడు తనలో ఇట్లు పాడుకొను చుండెను —

నీ మోము మిదే చూపి నా మనోవ్యథను
బూర్తిగాఁ బోకార్చి ప్రోచితి దేవ.

ఇంద్రజాలమెు నాఁగ నించు నీ సౌరు
మంత్రమై కాదె నా మదిని హరించె.
అంతమే లేని దుఃఖాబ్ధి నున్నట్టి
భువనంబు లేదు నిను బొడగాంచి వెతను
మఱచెడి ననఁగ, నే మఱచుట యరుదె ?
అగతికుఁడం జూవె, యల్పుఁడం జూవె.

నరేంద్రునకు కొంచెము అజీర్ణము చేసి యుండెను. అతడు మహేంద్రునితో ఇట్లనెను — "భక్తిమార్గము ననుసరించు వాని మనస్సు కొంచెము క్రిందికి ఒడలిమీదికి దిగును. దిగకున్న, నే నెవరను? మానవుడను కాను దేవుడను కాను. నాకు ఖేదమును లేదు, మోదమును లేదు".

అప్పటికి రాత్రి సుమారు తొమ్మిది గంట లైనవి. సురేంద్రాది భక్తు లొక కొందఱు శ్రీరామకృష్ణుని గదిలో ప్రవేశించి ఆయనకు పుష్పమాలల నర్పించిరి. బాబురామును, లాటును, మహేంద్రుడును ఆ గదిలోనే ఉండిరి.

సురేంద్రుని పూలమాలను శ్రీరామకృష్ణుడు తన మెడలో వేసికొనెను. అందఱును నిశ్శబ్దముగ కూర్చుండిరి. తటాలున గురుదేవుడు సురేంద్రుని తన సమీపమునకు రమ్మని సైగ చేసెను. శిష్యుడు పాన్పు నొద్దకు రాగానే శ్రీరామకృష్ణుడు తన మెడలో నున్న పూలమాలను తీసి సురేంద్రుని మెడలో వేసెను. సురేంద్రుడు గురుదేవునకు ప్రణమిల్లెను. శ్రీరామకృష్ణుడు తన పాదముల నొత్తుమని అతనిని సైగ చేసి అడిగెను. సురేంద్రుడును, గురుదేవుని పాదములను మెల్లగ నొత్తెను.

పంద్రెండవ ప్రకరణము

# తనభక్తులపైని గురుదేవుని ప్రేమ

1886 వ సంవత్సరము ఏప్రిలు తే 21 ది బుధవారము.

కాశీపూరు భవనారామమున మహేంద్రనరేంద్రులు పచారు చేయుచుండిరి. నరేంద్రునకు తన కుటుంబములో ఆర్థికపు చిక్కులు ఇంకను తీఱనందున అతడు చాల విషణ్ణుడై ఉండెను.

నరేంద్రుడు:—విద్యాసాగరుని పాఠశాలలోని నౌకరి నాకు లక్ష్యము లేదు. గయకు పోవుదము అనుకొనుచున్నాను. అచట ఒక జమీందారునకు జమీనుకార్యనిర్వాహకు డొకడు కావలె నని విన్నాను. దైవము అనున దొకటి లేదు.

మహేంద్రుడు:—(చిఱునవ్వుతో) ఇప్పుడు నీవు ఆలాగు అన వచ్చును, కాని అనంతర కాలమున నీ మాటలు వేఱురీతి నుండును. అవిశ్వాసము అనునది ఒక దశ. భగవదన్వేషకుడు ఈ దశవంటి దశలను దాటి చాల దూరము పోవలెను. అప్పటికి గాని భగవత్ప్రాప్తి గలుగదు. కలుగదని గురుదేవుడు చెప్పుచుండును.

నరేంద్రుడు:—ఆ చెట్టును ఇప్పుడు నేను చూచుచున్నంత ప్రత్యక్షముగా దేవు నెవరైనను చూచియున్నారా?

మహేంద్రుడు:—చూచి యున్నారు. మన గురుదేవుడే చూచి యున్నాడే దేవుని ఆలాగున.

నరేంద్రుడు:—అది భ్రమ కావచ్చు.

మహేంద్రుడు:—ఏదశలో తనకు కలుగు ననుభూతి ఆ దశ ఉన్నంతవఱకును మానవునకు యథార్థమే. ఏదో ఒక తోటకు పోయి నట్లు నీవు కలగాంచుచున్నా వనుకొనుము. కల అగపడుచున్నంతి

వఱకును, నీకు ఆతోట నిజమే. నిద్ర మేల్కాంచుటలో మఱి యొక మార్పు నీ మనసునకు కలిగినప్పుడు, ఆతోట నిజము కాదని నీ వనుకొందువు. దేవుని సాక్షాత్కరించుకొను దశకు నీ మనస్సు వచ్చి నప్పుడు. దేవుడు నిజమే అని నీ వెఱుంగుదువు.

నరేంద్రుడు:—నాకు కావలసినది సత్యము. నిన్న నాకును శ్రీరామకృష్ణునకును పెద్ద వాదము జరిగినది.

మహేంద్రుడు:—(చిఱునవ్వుతో) ఏమి జరిగినది?

నరేంద్రుడు:—'నన్ను కొందఱు దేవు డందురు' అని ఆయన నాతో చెప్పినాడు. "నిన్ను దేవు డని వేయిమంది చెప్పుదురు కాక, నీ దేవత్వము నిజ మని నాకు తెలియువఱకు నేను మాత్రము నిన్ను దేవు డని అననే అనను, నిశ్చయము" అని నే నంటిని. "అనేకులు చెప్పు విషయము తప్పక నిజముగనే ఉండును. అది ధర్మము" అన్నా డాయన. "దేనినైనను ఒకకొందఱు నిజ మని ఘోషింతురు గాక, దాని సత్యత నా అనుభవానకు వచ్చు వఱకును, నేను వారి మాటలు విననే వినను" అని నేను చెప్పితిని.

మహేంద్రుడు:—(చిఱునవ్వుతో) కోపర్నికసు, బెర్క్లి మున్నగు పాశ్చాత్యపండితుల వైఖరి వంటిదిగా ఉన్నదే నీ వైఖరి. కదలుచుండునది సూర్యుడే అని లోకమంతయు చెప్పుచున్నను కోప ర్నికసు వినడాయెను. బాహ్య జగము వాస్తవమే అని ప్రతివా డును చెప్పుచున్నను బెర్క్లి లక్ష్యపెట్టలేదు.

నరేంద్రుడు:— తత్త్వశాస్త్రచరిత్రగ్రంథమును దేనినైనను ఇచ్చెదవా?

మహేంద్రుడు:—ఎవరు వ్రాసినది? లూయీయా?

నరేంద్రుడు:—కాదు ఉబెర్వెగు వ్రాసినది. జెర్మను రచయితలలో నొకని గ్రంథమును నేను చదువవలయును.

మహేంద్రుడు:— "ఆ చెట్టును ఇప్పుడు నేను చూచు

చున్నంత ప్రత్యక్షముగా దేవు నెవరైనను చూచియున్నారా?" అని ఇంతకు మునుపు నీ వడిగితివి కదా. దేవుడే ఒక మానవ రూపములో వచ్చి "నేను దేవుడను" అని చెప్పుకొను ననుకొనుము. అప్పుడు ఆ మాటను నీవు నమ్ముదువా? లాజరసుకథ నిజముగ నీకు జ్ఞప్తి యుండును. తాను మరణించిన పిమ్మట లాజరసు ఏబ్రహాముతో "నేను భూలోకమునకు మరలి పోయి నా బంధుమిత్రుల కందఱకును నరకమును పరలోకమును ఉన్న వని తెలిపి వత్తునా?" అనెను. ఏబ్రహాము "నీ మాటలను వారు నమ్ముదు రనుకొనుచున్నావా? ఇట్టి మాటలు చెప్పు నితడు మోసగాడు అందురు" అని బదులు చెప్పెను. తర్కముచే దేవు నెఱుంగలేమని గురుదేవుడు చెప్పు చుండును. సాధకునకు అతని విశ్వాసమే దేనికైనను, జ్ఞానమున కైనను, జ్ఞానాతిగతకైనను, ప్రాపకము. భగవంతునకు అంతరంగు డుగ నగుటకును భగవత్సాక్షాత్కారమునకును ప్రాపకము విశ్వాసమే.

అప్పటికి మధ్యాహ్నానంతరము మూడు గంటలు. శ్రీరామ కృష్ణుడు శయనించి యుండెను. దక్షిణేశ్వరమునుండి వచ్చిన రామ్లాలు ఆయనకు పాదము లొత్తుచుండెను. సింథి గోపాలును మహేంద్రుడును గూడ ఆగదిలో నుండిరి.

శ్రీరామకృష్ణుడు మహేంద్రుని కిటికీతలుపులను మూసి తనకు పాదము లొత్తు మనెను. గురుదేవుని కోర్కె మేరకు పూర్ణుడు కాశీ పూరునకు ఒక బాడిగబండిలో వచ్చెను. బండి బాడిగను మహేం ద్రుడు ఈయ వలయును. ఇచ్చినాడా అని గురుదేవుడు గోపాలు నడిగెను. ఇచ్చినా డని గోపాలు చెప్పెను.

రాత్రి తొమ్మిది గంటలప్పుడు సురేంద్రుడు రాము మున్నగు వారు కలకత్తాకు బయలుదేఱ నుండిరి. అది ఏప్రిలు నెల, ఉమ్మ దము ఎక్కువ, పగ లంతయు శ్రీరామకృష్ణుని గదిలో వేడిమి చాల

హెచ్చుగ నుండెను. గదిలో చలువకై సురేంద్రుడు గటికతడికలను కొన్నిటిని దెచ్చియుండెను.

సురేంద్రుడు:—ఏల, ఈ గటికతడికలను ఎవరును వ్రేల కట్ట లేదే? ఇక్కడ ఎవరును ఏపనిని గమనించుట లేదు.

ఒకభక్తుడు:—(నవ్వుచు) ఇచ్చట భక్తు లందఱును బ్రహ్మ జ్ఞానదశలో నున్నారు. 'సోఽహం' మను అనుభూతిలో ఉన్నారు. వీరికి జగము మిథ్య. ఆ దశనుండి ఒక్క మెట్టు దిగి రేని, దేవుని స్వామిగను తమ్ము దాసులనుగను భావింతురు. అప్పుడు వారు శ్రీ రామకృష్ణుని పరిచర్యలో హెచ్చరిక వహింతురు. (అందఱును నవ్వుదురు).

1886 వ సంవత్సరము ఏప్రిలు తే 22 ది గురువారము.

సాయంకాలము రాఖాలును శశియు మహేంద్రుడును కాశీ పూరుతోటలో పచారు చేయుచుండిరి.

మహేంద్రుడు:—గురుదేవు డొక శిశువు, గుణములు మూడిం టికిని ఆయన అతీతుడు.

శశియు, రాఖాలును:—అట్లని ఆయనే చెప్పుచుండును.

రాఖాలు;—ఆయన ఒక గోపురముపైని ఉన్నట్లే. అన్నియు ఆయనకు తెలియుచుండును. అగపడుచుండును. ఇతరులు అచటికి పో లేరు, ఆయనను సమీపింపలేరు.

మహేంద్రుడు:—అట్టి దశలో సాధకుడు 'నిరంతరము భగవ త్సాక్షాత్కారము నొందుచుండునని ఆయన చెప్పినాడు. ఆయ నలో ఐహికపరత జాడగానైనను లేనే లేదు. క్షణములో నిప్పంటు కొను శుష్కేంధనమును బోలియున్నది ఆయన మనస్సు.

శశి:— వివిధ జ్ఞానములను ఆయన చారువునకు వర్ణించి చెప్పినాడు. బ్రహ్మప్రాప్తికి సాధనమైన జ్ఞానమే సరియైన జ్ఞానము.

ఒక డిప్యూటి మాజిస్ట్రేటు అగుటకో లాయరు అగుటకో ఒక యిల్లు గలవాడగుటకో ఉపయోగపడు జ్ఞానము జఘన్యము.

మహేంద్రుడు:—ఆహా, ఏమి దివ్యములైన వాక్కులు!

శశి:— కాళి గురుదేవుని ఒక ప్రశ్న అడిగినాడు. ఏమనగా — ఆనందమువలన ఏమి ప్రయోజనము? భిల్లులుసైతము ఆనంద మనుభవింతురు. అనాగరకప్రజాతండములు ఆనందోన్మాదమున సదా పాడుచును ఆడుచునే ఉందురు.

రాఖాలు:—ఆయన ( = శ్రీరామకృష్ణుడు) కాళికి ఇట్లని బదులు చెప్పెను — "ఏమి టోయి నీ వనునది? ఐహికానందమును బ్రహ్మానందమును ఒక్కటేనా? సామాన్యులు ఐహికానందముతో తృప్తిపడుదురు. ఐహికవిషయసంగమును పూర్తిగ వదలించుకొనని వాడు బ్రహ్మానందమును అనుభవింపలేడు. సంపదానందమును ఇంద్రియసుఖానుభవమును వేఱు, భగవత్సాక్షాత్కారానందము వేఱు. అవియు ఇదియును ఎన్నటికిని ఒక్కటి కానేఱవు. బ్రహ్మానందమును ఋషు లనుభవించిరి.

మహేంద్రుడు:— చూచితివా? కాళి ఇటీవల బుద్ధదేవుని ధ్యానించుచున్నాడు. ఆనందమునకు మీఁది దశను గూర్చి అతడు ప్రసంగించుచుండుట కదే కారణము.

రాఖాలు:—ఔను. కాళి బుద్ధునిగూర్చి గురుదేవునికి చెప్పినాడు. "బుద్ధుడు దేవునవతారము. ఆయనకు మఱియొకరిని ఎట్లు సాటి చేయ గలవు? ఆయన గొప్పవాడు, ఆయన బోధనలును గొప్పవే" అన్నాడు గురుదేవుడు. కాళి ఈలాగు అన్నాడు "నిజమునకు ప్రతిదియు భగవచ్ఛక్త్యావిష్కారమే. ఐహికానంద మేమి, బ్రహ్మానంద మేమి, ఆశక్తి దాల్చు రూపమే".

మహేంద్రుడు:—అందులకు గురుదేవు డేమన్నాడు?

రాఖాలు:—'అది ఎట్లు పొసగును? బిడ్డలను గను శక్తియు

దేవుని సాక్షాత్కరించుకొను శక్తియు ఒక్కటేనా?' అని అడిగినాడు గురుదేవుడు.

శ్రీరామకృష్ణుడు రెండవ యంతస్తున తన గదిలో కూర్చుండెను. నరేంద్రుడు, రాఖాలు, శశి, సురేంద్రుడు, మహేంద్రుడు, భవనాథుడు, మున్నగు భక్తులు అచటే ఉండిరి. గురుదేవుని పరీక్షించుటకై డాక్టరు మహేంద్రసర్కారును డాక్టరు రాజేంద్రదత్తయు అటనుండిరి. ఆయన శరీరస్థితి ఏమో నానాటికి క్షీణించుచుండెను.

ఇంటి బాడిగ అరువదియో అరువదిఐదో రూపాయలు. వ్యయములో అధికభాగమును సురేంద్రు డచ్చుకొనుచుండెను. ఆ యింటిని తన పేర బాడిగకు ఏర్పాటుచేసియున్నది అతడే. ఇతర గృహస్థ భక్తులును యథాశక్తి పైక మిచ్చి తోడ్పడుచుండిరి. ఆ యింట నున్న వారి పరిచర్యకై ఒకవంటవాడును ఒకదాసియు నియోగింపబడిరి.

గురుదేవుడు:— (డాక్టరు సర్కారు మున్నగు వారితో) ఖర్చులు పెరిగి పోవుచున్నవి.

డాక్టరు సర్కారు:—(భక్తులను జూపుచు) ఖర్చులను భరించుటకు వీరు సిద్ధముగనే ఉన్నారు. పైకము ఖర్చు పెట్టుటకు వీరు వెనుదీయరు. (శ్రీరామకృష్ణునితో) కాంచనము కావలసినదే అని ఇప్పుడు మీకు తెలిసివచ్చినది కదా.

గురుదేవుడు:— (నరేంద్రునితో) ఆ ప్రశ్నకు జవాబు చెప్పవేమి ?

నరేంద్రు డూర కుండెను. డాక్టరు సర్కారు సంభాషణను మరల నారంభించెను.

డాక్టరు సర్కారు:— కాంచనమును కావలసినదే, కామినియు కావలసినదే.

రాజేంద్రుడు:—ఔను. వంట చేయుచుండునది ఈయన (=శ్రీరామకృష్ణుని) భార్యయే కదా!

డాక్టరు సర్కారు:—(గురుదేవునితో) ఔనా?

గురుదేవుడు:— (చిఱునవ్వుతో) ఔను — కాని చాల చిక్కులు.

డాక్టరుసర్కారు:—మఱి చిక్కులే లేకున్న, అందఱును పరమహంస లగుదురు.

గురుదేవుడు:— స్త్రీస్పర్శ కలిగిన, నేను వ్యాధిగ్రస్తుడ నగుదును. ఆ స్పర్శకు లోనైన భాగమునకు ముండ్లచేపకాటువంటి బాధ కలుగును.

డాక్టరుసర్కారు:—అది నాకు నమ్మకమే. కాని స్త్రీ లేకున్న మీ కెట్లు జరుగును?

గురుదేవుడు:—నా చేతిలో పైకమును పట్టుకొందునేని, చేయి యంతయు మెలితిరిగిపోవును. నా ఊపిరి ఆగిపోవును. కాని లోకములో పారమార్థికముగ జీవితము గడపుటకై, అనగా భగవదారాధనకో సాధువులయు భక్తులయు సేవకో, పైకమును వ్యయించినచో అందు హాని ఏమియు లేదు.

మాయాజగమున తగుల్కొన్నవాడు దేవుని విస్మరించును. అందులకు కామినియే మూలము. మాయగా ఆకృతిదాల్చినదియు కామినిగారూపముగొన్నదియు జగజ్జననియే. ఈ విషయమును బాగుగ నెఱిగిన వానికి, ఈ లోకమున మాయాజీవితమును గడపుటకు ఇష్టముండదు. కాని మగువలెల్లరు దివ్యమాతృమూర్తులే అనుటను యథార్థముగ సాక్షాత్కరించుకొన్నవాడు పారమార్థిక జీవితమును ఇహలోకముననే గడపినను గడపవచ్చును. దైవసాక్షాత్కారము కలుగనిదే కామిని యథార్థస్వరూపము కూడ అర్థము కాదు.

కొన్ని నిమిషములకు తర్వాత వైద్యులు వీడ్కొనిరి. శ్రీరామకృష్ణుడును మహేంద్రుడును సంభాషించుచుండిరి. కామినిని గూర్చిన తన యనుభూతులను గురుదేవుడు మహేంద్రునకు చెప్పుచుండెను.

గురుదేవుడు :— (మహేంద్రునితో) కామినీకాంచనాలు లేకున్న నాకు దినము గడువదనుచున్నారు వారు. నా మనఃపరిస్థితి వారికి బోధపడలేదు.

నేనొక స్త్రీని తాకితినేని నా చేయి మొద్దువాఱిపోవును, నొప్పిచెందును. మైత్రితో ఒక మగువను దరిసి మాటాడ దొడంగుదునేని, మా యిరువుర నడుమ ఏదో ఒక అడ్డము ఉన్నట్లనిపించును. ఆ అడ్డమును దాటుట నాకు శక్యము కాదు.

నేనొంటరిగ నున్నప్పు డొక స్త్రీ నా గదిలో ప్రవేశించిన తత్క్షణమే, నేనొక శిశువ నగుదును, ఆమెను నా తల్లిగా జూతును.

ఈ మాటలు వినుచు ఉచ్ఛ్రితమైన శ్రీరామకృష్ణుని మనఃస్థాయిని కనుచున్న మహేంద్రునకు, నోట మాట వెలువడలేదు. భవనాథనరేంద్రులు కొంత దూరముగ కూర్చుండి మాటాడుకొనుచుండిరి. భవనాథునకు పెండ్లి ఐనది. అతడు నౌకరికై ప్రయత్నించుచుండెను. కావున కాశీపూరునకు తఱచుగ వచ్చి శ్రీరామకృష్ణుని దర్శించుటకు అతనికి అవకాశము లేకుండెను. "విద్యాసాగరుడు క్రొత్తవిద్యాలయము నొకదానిని స్థాపించునని తెలియవచ్చుచున్నది. నా కొక బ్రతుకుదెరువు కావలెను. ఆ విద్యాలయములో ఒక నౌకరిని సంపాదించుట నాకు సాధ్యమగునా?" అని భవనాథుడు మహేంద్రుని అడిగి యుండెను. ఐహికజీవితమున భవనాథునకున్న సంగమును జూచి గురుదేవుడు మిక్కిలి వెత జెందుచుండెను. భవనాథుని వయస్సు ఇరువది మూడేండ్లో, ఇరువది నాలుగేండ్లో.

గురుదేవుడు:—(నరేంద్రునితో) అతనికి ఎక్కువగ ధైర్యము గలిగింపుము.

నరేంద్రభవనాథులు చిఱునవ్వు నవ్విరి. శ్రీరామకృష్ణుడు భవనాథునితో ఇట్లనెను. "గొప్పవీరుడవుగ నుండుము. ముసుగుమఱుగున నీభార్య ఏడ్చినను, దానిని చూచి, నీవు నిన్ను మఱచిపోకుము. స్త్రీల కేమి, ముక్కు చీదునపుడు సైతము ఎంతైనను ఏడ్తురు. (నరేంద్రభవనాథమహేంద్రులు నవ్వుదురు).

నీ మనస్సును దేవునందు తిరముగ నిలుపుము. వీరుడైనవాడు మగువతో జీవితము గడపినను శారీరసుఖసక్తుడు కాడు. నీ భార్యతో ఎల్లప్పుడును భగవద్విషయమునే మాటాడుము.

కొన్ని నిమిషముల తర్వాత శ్రీరామకృష్ణుడు భవనాథునితో 'నేడు ఇచట భుజింపుము' అని సైగచే తెలిపెను.

భవనాథుడు:—చిత్తము, మహాశయా, నన్నుగుఱించి వెతజెందకుడు. నాకు ఆరోగ్యము చాల బాగుగనే ఉన్నది.

సురేంద్రుడు లోనికి వచ్చి కూర్చుండెను. భక్తులు ప్రతిదినమును సాయంకాలము గురుదేవునకు పుష్పమాలల నర్పించుచుండిరి. శ్రీరామకృష్ణుడు ఆ మాలలను కంఠమున దాల్చుచుండును. సురేంద్రుడు గదిలో నెమ్మదిగ కూర్చుండియుండెను. అధికసంతోషదశలో ఉండిన శ్రీరామకృష్ణుడు అతనికి పూలమాలలను రెంటి నొసంగెను. సురేంద్రుడు గురుదేవునకు మ్రొక్కి ఆ మాలలను మెడలో వేసికొనెను.

అందఱును మౌనముగ కూర్చుండి శ్రీరామకృష్ణుని వైపు చూచుచుండిరి, సురేంద్రుడు గురుదేవునకు మరల నొకసారి మ్రొక్కి నిలుచుండెను, వీడ్కొన బోవుచుండెను, భవనాథునితో 'కిటికీలకు ఆ గఱికెతడికలను వేలగట్టు' మని చెప్పెను.

హీరానందుడు తన మిత్రుల ఇరువురను వెంటనిడుకొని వచ్చెను. కలకత్తాకు ఇరువదిరెండువందల మైళ్లు దూరాన ఉన్న సింధ్ అతని స్వగ్రామము. 1883 లో కలకత్తాలో కాలేజివిద్యను

పూర్తి చేసికొని సింధుకు మరలి, 'సింధ్ టైమ్సు' 'సింధుసుధార' అను రెండు పత్రికలకు సంపాదకు డయ్యెను. కలకత్తాలో ఉండగా అతడు తఱచు కేశవచంద్రసేను నొద్దకు వచ్చుచు ఆయనతోడి సన్నిహిత పరిచయము గలిగియుండెను. దక్షిణేశ్వరమున కాళిగుడిలో శ్రీరామ కృష్ణుని సంధించి యుండెను. ఎప్పుడైనను రాత్రివేళ గురుదేవుని గోష్ఠిలో గడపుచుండెను. శ్రీరామకృష్ణుని వ్యాధిని గుఱించి విని, ఆయనను దర్శించుటకై ఇప్పుడు సింధునుండి కలకత్తాకు వచ్చెను. హీరానందుని జూడవలె నని గురుదేవుడును ఎంతో ఉబలాటపడు చుండెను.

శ్రీరామకృష్ణుడు హీరానందుని జూపుచు మహేంద్రునితో "ఇతడు బలే మంచి పిల్లవాడు. నీవు ఎఱుగుదువా ఇతనిని?" అని సైగల మూలముగ ప్రశ్నించెను.

మహేంద్రుడు:—మహాశయా, ఎఱుగుదును.

గురుదేవుడు:—(హీరానందమహేంద్రులతో) దయచేసి మీ రిరువురు మాటాడుకొనుడు. వినవలెనని యున్నది.

ఊరకున్న మహేంద్రునితో గురుదేవుడు "నరేంద్రుడు ఉన్నాడా ఇచ్చట? అతనిని పిలువుము" అనెను.

నరేంద్రుడు గదిలోనికి వచ్చి గురుదేవుని దాపున కూర్చుం డెను.

గురుదేవుడు:—(నరేంద్రహీరానందులతో) మీ రిరువురను మాటాడుకొనుచుండ వినవలెనని యున్నది.

హీరానందుడు కొన్ని నిమిషముల సేపు మౌనముగ నుండి, ఎంతగానో సంకోచపడి, సంభాషణ నారంభించెను.

హీరానందుడు:—(నరేంద్రునితో) భగవద్భక్తులకు కష్టము లేల కలుగును?

అతని మాటలు అమృతమువలె మధురముగ నుండినవి.

అతని డెందము ప్రేమపూర్ణముగ నున్నదని గదిలోని ప్రతివాడును గ్రహింప గలిగెను.

నరేంద్రుడు:—ఈ సృష్టి ప్రణాళికయే రాక్షసోచితముగ నున్నది. నేనే ఐనచో ఇంతకన్న మేలైన జగమును సృజించి యుందును.

హీరానందుడు:— దుఃఖమే లేకున్న సుఖము సుఖ మని పించునా ?

నరేంద్రుడు:—విశ్వమున కొక ప్రణాళికను నే నేర్పరచుట లేదు, ఉన్న ప్రణాళికనుగూర్చిన నా యభిప్రాయమును దెలుపు చున్నాను. అంతే.

మఱి ఈ చిక్కు లన్నియు తీఱిపోవలె నన్న, ఒక్క విష యాన మనకు నమ్మక ముండ వలెను, సర్వత్ర దేవుడు ఉన్నాడను విషయమున. ప్రతిదియు దేవుని స్వరూపమే అను నమ్మకము ఒకని కున్నచో అతని సందేహములు అన్నియు మాయమగును. ఏది జరిగినను అందులకు బాధ్యుడు దేవుడే.

హీరానందుడు:—ఆ మాటల కేమి చాల సులువుగ చెప్ప వచ్చును.

నరేంద్రుడు ఆదిశంకరుల 'నిర్వాణషట్కమును' పాడెను—

ఓమ్॥ *కాను నే బుద్ధిని, కాను నే మనము,
కా నహంకారమక్, గాను చిత్తమను,

* మూలము —

మనో బుద్ధ్యహఙ్కార చిత్తాని నాహం,
న చ శ్రోత్రజిహ్వే, న చ ఘ్రాణనేత్రే,
న చ వ్యోమ భూమిర్, న తేజో, న వాయుః,
చిదానన్దరూప శ్శివో ఽహం శివో ఽహమ్॥

కాను శ్రోత్రంబను, గాను జిహ్వాయును,
కాను ఘ్రాణంబను, గాను నేత్రమను,
కాను గా మన్ను నేఁ, గాను గా మిన్ను,
కా నయూ వాయువఁ, గా నయూ తేజు,—
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ॥ ౧

కాను నేఁ బ్రాణంబఁ, గా నై దుసురులఁ,
గాను ధాతువు లేడుఁ, గాను కోశము ల
యిదుఁ; గాను పాణియుఁ పదపాయువులును;

---

న చ ప్రాణసంజ్ఞో న వై పఞ్చవాయుర్
న వా సప్తధాతుర్ న వా పఞ్చకోశః
న వాక్ పాణి పాదం న చోపస్థవాయూ
చిదానన్దరూప శ్శివో ఽహం శివో ఽహమ్॥ ౨
న మే ద్వేషరాగౌ న మే లోభమోహౌ
మదో నైవ మే నైవ మాత్సర్యభావః
న ధర్మో న చార్థో న కామో న మోక్షశ్
చిదానన్దరూప శ్శివో ఽహం శివో ఽహమ్॥ ౩
న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖమ్,
న మన్త్రో న తీర్థం న వేదా న యజ్ఞాః
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా
చిదానన్దరూప శ్శివో ఽహం శివో ఽహమ్॥ ౪
న మృత్యుర్ న శఙ్కా న మే జాతిభేదః,
పితా నైవ మే నైవ మాతా న జన్మ
న బన్ధుర్ న మిత్రం గురుర్ నైవ శిష్యశ్
చిదానన్దరూప శ్శివో ఽహం శివో ఽహమ్॥ ౫
అహం నిర్వికల్పో నిరాకారరూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేన్ద్రియాణాం
న చాసఙ్గతం నైవ ముక్తిర్ న మేయశ్
చిదానన్దరూప శ్శివో ఽహం శివో ఽహమ్॥ ౬

కా నుపస్థయు, వాక్కుఁ; గా నయా నేను, —
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ॥ ౨

లేదు ద్వేషంబును, లేదు రాగంబు,
లేదు లోభంబును, లేదు మోహంబు,
లేదు మదంబును, లేదు మచ్చరము,
లేదు ధర్మము నాకు, లే దర్థవితతి,
కామముఁ లేదు, మోక్షంబునుఁ లేదు, —
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ॥ ౩

కాను నేఁ బుణ్యంబు, కాను పాపమును,
కాను నే సౌఖ్యంబు, కాను దుఃఖమును,
కాను నే మంత్రంబు, కాను తీర్థమును,
కాను వేదంబు, నేఁ గాను యజ్ఞములు,
కాను భోజనమును, గాను భోజ్యంబుఁ,
కాను నే భోక్తను, కాను కా నయ్య,
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ॥ ౪

లేదు మృత్యువు నాకు, లే దెట్టి భీతి,
లే దెంచఁగా జాతి భేదంబు నాకు,
లేరు తల్లియుఁ దండ్రి, లేదు జన్మంబు,
లేరు బంధులు నాకు, లేరు మిత్రములు,
లేఁడు గురు వొకండు, లేఁడు శిష్యుండు,
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ॥ ౫

నిర్వికల్పుండను నెటి నిరాకార
రూపుండ విశ్వస్వరూపుండ నేను,
సక లేంద్రి యాతిగ సరణిని నుందు,

జ్ఞేయుఁడం గాను మోక్షితుఁడఁ గాఁబోను,
సచ్చిదానందుఁడ, శంభుండ, శివుఁడ॥ ౬

హీరానందుడు:—భళి.

శ్రీరామకృష్ణుడు:— (హీరానందునితో సైగ మూలమున) చెప్పుము వానికి బదులు—

హీరానందుడు:—ఒక గదిని ఒకమూలనుండి చూచినను, దాని నడుమనుండి చూచినను ఒక్కటే. 'దేవా, నేను నీదాసుడను' అని అన్నను "సోఽహం" అని అన్నను అనుభూత మగు నీశ్వర చైతన్య మొక్కటే. ఒక్కగదిలోనికి పెక్కువాకిండ్లగుండ రావచ్చును.

అందఱును మౌనముగ కూర్చుండిరి. హీరానందుడు నరేంద్రుని "దయచేసి, ఇంకను పాడ వోయి" అని కోరెను. నరేంద్రుడు కౌపీనపంచకమును పాడెను—

*వేడ్క యెల్లప్పుడు వేదాంతమందె,
సంతృప్తి నొసఁగ భిక్షాన్నంబె చాలు,
నిశ్చింతుడై భువి నిరతంబుఁ దిరుగుఁ,
గౌపీనవంతుఁడే కడు భాగ్యశాలి॥ ౧

---

* మూలము —

వేదాన్తవాక్యేషు సదా రమన్తో
భిక్షాన్న మాత్రేణ చ తుష్టిమన్తః
విశోక మన్తః కరణే చరన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః॥ ౧

మూలం తరోః కేవల మాశ్రయన్తః
పాణిద్వయం భోక్తు మమన్త్రయన్తః
కన్థా మివ శ్రీ మపి కుత్సయన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః॥ ౨

కమికేఁ డన్నంబె యాకలికి భుజించుఁ,
దరుమూలమునె సదా తగ నాశ్రయించుఁ,
జింపి బొంతను బోలె సిరిని గర్హించుఁ,
గౌపీనవంతుఁడే కడు భాగ్యశాలి॥ ౨

సర్వేంద్రియంబుల సకలవృత్తులును
శాంతింప నొప్పు, ప్రశాంతుం డనంగ,
స్వానందభావాన సంతుష్టి నొందు,
బ్రహ్మరతిని జొక్కుఁ బగలును రేయి,
కౌపీనవంతుఁడే కడు భాగ్యశాలి॥ 3

'బ్రహ్మరతిని జొక్కుఁ బగలును రేయి' అను గీటును విన్నప్పుడు శ్రీరామకృష్ణుడు మెల్లని గొంతుతో 'ఆహా' అనెను. తర్వాత భక్తులకు 'యోగిలక్షణము అదే' అని ఒక సైగ మూలముగ దెలిపెను.

---

స్వానన్దభావే పరితుష్టిమన్తస్
సుశాన్తసర్వేన్ద్రియవృత్తిమన్తః
అహర్నిశం బ్రహ్మసుఖేరమన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః ॥ 3

దేహాదిభావం పరివర్తయన్తస్
స్వాత్మానమాత్మ న్యవలోకయన్తః
నాన్తం న మధ్యం న బహిస్ స్మరన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః ॥ ౪

బ్రహ్మాక్షరం పావన ముచ్చరన్తో
బ్రహ్మాహ మస్మీతి విభావయన్తః
భిక్షాశినో దిక్షు పరిభ్రమన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః ॥ ౫

నరేంద్రుడు కౌపీనపంచకమున శేషించిన భాగమును పాడి ముగించెను—

దేహాదిభావంబు తిలకించుచుండు,
ఆత్మయందునె ఆత్మ నటు చూచుచుండు,
తలఁపఁడు లోపలఁ, దలఁపఁడు బయటఁ,
దలఁపఁడు నడుమను, తలఁచి చూడంగఁ,
గాపీనవంతుఁడే కడు భాగ్యశాలి॥ ४

పావ నాక్షర మైన బ్రహ్మముం బాడు,
బ్రహ్మమే యే నని భావించు చుండుఁ,
దిరిసి భుజించుచు, దిక్కులు చుట్టుఁ,
గాపీనవంతుఁడే కడు భాగ్యశాలి॥ ౫

నరేంద్రుడు పాటను ఇంకను సాగించెను.

ధ్యానింపుమా పూర్ణ నానందరూపు,
మూర్తిరహితుని, జగన్మాల మా వాని,
చెవి నుండి విను వాని, చేత మం దుండి
చింతించు వానిని, జిహ్వాలో నిల్చి
మాటాడు వానిని, మాట కతీతు,
జీవములకు నెల్ల జీవ మా వాని,
స్తుత్యుఁ, బరాత్పరు, నిత్యుఁ, —దలంపు॥

గురుదేవుడు:—(నరేంద్రునితో) "సర్వముః నీవెగా సకల లోకేశ" అనెడి ఆ పాటో!

నరేంద్రుడు పాడెను.

నా డెందమును నాటినాఁడ నీయందు,
సర్వముః నీవె గా, సకలలోకేశ.

నేఁ గాంచుచున్నది నిన్ను నొక్కనినె,
సర్వముగ నీవె గా సకలలోకేశ.
సర్వేశ, హృదయేశ, సర్వనివాస,
నీ కున్కిపట్టు గాని హృదయ మేది?
ప్రతిజీవి హృదయానఁ, బరఁగఁ జొచ్చితివి,
సర్వముగ నీవె గా సకలలోకేశ.
బుద్ధిహీనుఁ డగుట బుద్ధి గల్గుటయు
ముస్లిమో హిందువో మొగి యాట యెల్ల,
నీ యిచ్ఛ చొప్పున నేర్పడు నింతె,
సర్వముగ నీవె గా సకలలోకేశ॥
సర్వత్ర నున్నట్టి స్వామివి నీవె
కాబాయొ నాకమో గా నీదు నెలవు,
ఎల్లరుగ నీముందు నెరగి తీఱుదురు,
సర్వముగ నీవె గా సకలలోకేశ॥
దివినుండి భువికిని భువినుండి దివికి
నెటు చూచినగ నిన్నె యిం పారఁ గాంతు,
సర్వముగ నీవె గా సకలలోకేశ॥
యోచించి తెలిసితి. నొప్పుగాఁ గంటి,
లే దనుమానంబు లేశ మేనియును
నీ సాటి వస్తువుగ నే నెందుఁ గాని
కాన లే నైతిని కడ కొక్క టైన.
*జాఫరు నీకృపఁ జక్కఁగాఁ జూచె,
సర్వముగ నీవె గా సకలలోకేశ॥

---

* మూల గేయ రచయిత.

'ప్రతిజీవిహృదయానఁ బరఁగఁ జొచ్చితివి' అను గీటును విన్నప్పుడు గురుదేవుడు 'ప్రతిజీవిహృదయమునను దేవు డున్నాడు. దేవుడే అంతర్నియంత' అని సైగమూలమున దెలిపెను.

'ఎటు చూచినన్ నిన్నె యిం పారఁ గాంతు సర్వమున్ నీవె గా సకలలోకేశ' అను బంతులను నరేంద్రుడు పాడినప్పుడు, హీరానందుడు 'ఔను, 'సర్వమున్ నీవె గా సకలలోకేశ'. ఇప్పుడు 'నీవే, నీవే, నేను కాను, నీవే' అనుచున్నావు.

నరేంద్రుడు:—నీవు నాకు ఒకటి నిచ్చిన, నేను నీకు పదిలక్షల నిత్తును. నీవు నేను, నేను నీవు, నేను తప్ప వే ఱేదియు లేదు.

నరేంద్రుడు అష్టావక్రసంహితనుండి కొన్ని శ్లోకములను జదివెను. గదిలో మరల నిశ్శబ్దత నెలకొనెను.

గురుదేవుడు:—(నరేంద్రుని జూపి హీరానందునితో) ఒఱనుండి తీసిన ఖడ్గమును హస్తమున ధరించి సంచరించుచున్నట్లున్నాడతడు. (హీరానందుని జూపి మహేంద్రునితో) మాంత్రికు నెదుట పడగ విప్పుకొని నిశ్చలమై యున్న సర్పమువలె ఎంత శాంతి!

శ్రీరామకృష్ణుడు అంతర్ముఖదశలో విలీను డయ్యెను. హీరానందమహేంద్రులు ఆయనకు సమీపమున కూర్చుండి యుండిరి. గదిలో పరిపూర్ణ మైన నిశ్శబ్దత యుండెను, ఇట్టి దట్టి దని చెప్ప రాని నొప్పిచే గురుదేవుని మేను మిక్కుటమైన బాధ నొందు చుండెను. భక్తులు ఆయన పడుచున్న బాధను చూచి సహింపలేక పోయిరి. కాని గురుదేవుడు ఎట్లో ఒకట్లు వారు తన బాధను మఱచునట్లు చేసెను. కంఠమున ఏరోగచ్ఛాయయు లేని వానిం బోలె జాజ్వల్యమానవదనముతో ఆయన అట ఆసీనుడై యుండెను.

భక్తులు తాము ప్రేమతో నివేదించిన పూలను మాలలను ఆయన యెదుట బెట్టిరి. ఆయన ఒకపూవును చేతిలోనికి తీసికొని దానితో తన తలను, పిమ్మట తన కంఠమును, డెందమును నాభిని

త్రాకెను. చూచుచున్న భక్తులకు ఆయన పూలతో ఆడుకొనుచున్న యొక శిశువువలె కనిపించెను.

దివ్యదర్శనములును దివ్యభావనలును గలిగినప్పు డెల్ల తన మేనిలో జ్ఞానప్రవాహము (కుండలినీశక్తి) లేచుచుండు నని శ్రీరామ కృష్ణుడు భక్తులతో చెప్పుచుండుట కలదు.

ఇప్పుడు ఆయన మహేంద్రునితో సంభాషించుచుండెను.

గురుదేవుడు:—కుండలినీశక్తి పైకి ఎప్పుడు లేచినదో నే నెఱుగను. ఇప్పుడు నేను శైశవదశలో ఉన్నాను. పూలతో నేను ఈలాగు ఆడుకొనుచున్న దందుచేతనే. నాకు ఏమి అగపడుచున్నదో ఎఱుగుదువా? వెదురుముక్కలతో చేయబడి గుడ్డకప్పబడిన యొక చట్టము లాగ నా దేహము నాకు కనిపించుచున్నది. చట్టము కదలు చుండును. ఏల? చట్టమునకు లోపల ఎవరో ఉన్నారు.

ఒక్కొక్కప్పుడు నా దేహము, విత్తనములు తీసివేయబడిన గుమ్మడికాయలాగ కనిపించును. ఈ దేహములోపల ఐహికసంగము కాని కామక్రోధాదులు కాని జాడగా నైన లేవు. దీని లోభాగ మంతయు చాల శుద్ధముగ నున్నది. అంతే కాదు......''

నొప్పిచే శ్రీరామకృష్ణుడు ఇక మాటాడలేక పోయెను. ఆయన శరీరము చాల బలహీనముగ నుండెను. భక్తులతో గురుదేవుడు చెప్ప నెంచిన దానిని మహేంద్రుడు వెంటనే ఊహించి ఆయనను ''మీలోపల మీరు దేవుని జూచుచున్నారు''. అనెను.

గురుదేవుడు:—లోపలను వెలుపలను గూడ. అపరిచ్ఛేద్య మైన సచ్చిదానందమును నేను లోపలను వెలుపలను గూడ చూచు చున్నాను. అది (తన మేనును జూపుకొనుచు) ఈ యొఱను ఊరక ఆధారముగ గొని లోపలను వెలుపలను గూడ నున్నది. దాని ఉనికి నాకు ప్రత్యక్షము.

ఆయనగారి భగవ చ్చైతన్యపు టుచ్చైఃస్థాయిని గూర్చిన

ఆ మాటలను మహేంద్ర హీరానందులు ఎచ్చరికతో వినిరి. కొన్ని నిమిషముల తర్వాత ఆయన వారి వైపు చూచి సంభాషణను మరల ఆరంభించెను.

గురుదేవుడు:— మీ రందఱును నాకు ఆత్మబంధువులుగ చూపట్టు చున్నారు. మీలో ఎవనినిగాని పరాయవానినిగ నేను భావించుట లేదు.

మీరు ఇందఱును ఇన్ని ఒఱలవలె అగపడుచున్నారు, మీ తలలు కదలుచున్నవి.

నా మనస్సు దేవునందు లీనమై ఉన్నప్పుడు శరీరబాధ లేనే లేనట్లు అనిపించును.

నాకు ఇప్పుడు కనబడు చున్న దిదే—అపరిచ్ఛేద్య మగు సచ్చిదానందము నొక చర్మము కప్పి ఉన్నది. అం దొక ప్రక్క ఈ కంఠవ్రణమును ఉన్నది.

గురుదేవుడు మరల మౌనము వహించెను. కొన్ని నిమిషములకు తర్వాత ఇట్లనెను — "ప్రకృతి గుణాలు ఆత్మకును ఆత్మగుణాలు ప్రకృతికిని ఆరోపితము లగుచుండును. కావున వ్యాధి దేహమునకు వచ్చినప్పుడు 'వ్యాధి నాకు వచ్చినది' అని మానవు డనుచుండును.

గురుదేవుడు ఇప్పుడే చెప్పిన మాటల అర్థ మేమో హీరానందుడు తెలిసికో గోరెను. కావున మహేంద్రుడు "వేడినీటిచే చేయి కాలినప్పుడు, నీటిచే కాలిన దని జనులు చెప్పు చుందురు, కాని నిజముగ చేతిని కాల్చునది, నీరు కాదు, నీటిలోని వేడిమి"అనెను.

హీరానందుడు:— (గురుదేవునితో) భగవద్భక్తునకు కష్టము లేలకలుగునో దయచేసి చెప్పుడు.

గురుదేవుడు:—కష్టములు కలుగునది దేహమునకే.

శ్రీరామకృష్ణుడు ఇంకను ఏమో చెప్ప నుంకించుచున్నట్లు ఉండెను. విందమని హీరానందమహేంద్రులు ఆత్రపడుచుండిరి.

"తెలిసినదా" అనెను. శ్రీరామకృష్ణుడు.

మహేంద్రుడు హీరానందుని చెవిలో ఇట్లు గుసగుస మనెను— "మానవులకు బుద్ధి గఱపుటకే శరీరకష్టములు గలుగు చుండును. ఇందులకు ప్రమాణగ్రంథము ఈయన జీవితచరిత్రమే. ఈయన దేహ మింత బాధపడుచున్నది కదా, మన సేమో నూటికినూఱు దేవునిలోనే లీనమై యున్నది".

హీరానందుడు:—ఔను. అది క్రైస్తు అనుభవించిన శూలారోపణశిక్ష వంటిది. ఐనను బోధపడని మార్గము ఉండనే ఉన్నది — ఇందఱిలో ఇంతటి బాధ ఈయనకే కలుగ నేల?

మహేంద్రుడు:— ఇది లోకజననిసంకల్ప మన్నాడు, గురుదేవుడు. ఈయన మేనిగుండ ఆమె క్రీడించుచున్నది.

భక్తు లిరువురును ఏమో గుసగుస మని మాటాడుకొను చుండిరి. 'మహేంద్రుడు ఏమి చెప్పుచున్నా' డని శ్రీరామకృష్ణుడు హీరానందుని సైగమూలముగ నడిగెను. సైగ మొదటిసారి హీరానందున కర్థము కాలేదు. శ్రీరామకృష్ణుడు మరల సైగ చేసెను.

హీరానందుడు:—మానవులకు బుద్ధిగఱపుటకే మీకు వ్యాధి వచ్చియున్నది అనుచున్నాడు.

గురుదేవుడు:— అది అతని ఊహ. అంతే. (మహేంద్ర హీరానందులతో) నా వైఖరి మాఱుచున్నది. "నీకు జ్ఞానప్రబోధము కలుగును గాక" అని ప్రతివానితోను ఇకమీఁదట చెప్ప రా దని తోచుచున్నది. కలియుగమానవులలో పాపము ఎక్కువ. వారిలో జ్ఞానప్రబోధము కల్గింతు నేని, వారిపాపభారమును నేను మోయ వలసి వచ్చును.

మహేంద్రుడు:—(హీరానందునితో) సరి యైన కాలము రానిదే ఈయన మానవులలో జ్ఞానప్రబోధమును గలిగింపడు.

మానవునిలో పరిపక్వత కల్గినప్పుడే ఈయన వానిలో జ్ఞానమును ప్రబోధించును.

1886 వ సంవత్సరము ఏప్రిలు తే 23 ది భృగువారము.

అది క్రైస్తు శూలారోహణ జ్ఞాపకార్థము క్రైస్తవులు పస్తుండు శుక్రవారము (గుడ్ ఫ్రైడే). హీరానందుడు కాశీపూరు వనమందిర మునసే మధ్యాహ్నభోజనమును చేసెను. తర్వాత ఒంటి గంట యప్పుడు అతడు గురుదేవునకు పాదసేవ చేయు చుండెను. మహేంద్రుడును సమీపముననే కూర్చుండి యుండెను. లాటు మొదలైన భక్తులొక్కరిద్దఱు గదిలోనికి రాకపోకలు చేయుచుండిరి. హీరానందుని కాశీపూరు వనమందిరముననే కొంత కాల ముండుమని గురుదేవుడు అక్కఱతో కోరుచుండెను.

గురుదేవుని పాదము లొత్తుచు హీరానందుడు ఆయనతో చాల తియ్యగా మాటాడు చుండెను, ఒక శిశువును ఊరడించు నప్పుడు మాటాడునట్లు మాటాడుచుండెను.

హీరానందుడు:—మీకెందుకు ఇంత వెత? వైద్యునినమ్ముడు. నమ్మిన, మీకు నెమ్మది కుదురును. మీరు పసివారు.

గురుదేవుడు:— (మహేంద్రునితో) డాక్టరు సర్కారు నాకు వ్యాధి నయము కాదు అన్నాడే, ఆ వైద్యునందు నా కెట్లు నమ్మక ముండును?

హీరానందుడు:—మఱి అందులకు మీరు వెత జెంద నేల? జరుగవలసినది జరిగియే తీఱును.

మహేంద్రుడు:— (హీరానందుని చెవిలో) ఆయన తన్నుగూర్చి వెత జెందుట లేదు. ఆయన దేహమును నిలుపుకొనుట భక్తుల మేలునకే.

అది బెట్ట దినము. మధ్యాహ్న మప్పటికి గదిలో వేడిమి

చాల హెచ్చెను. కిటికీలకు గటికతడికలు వ్రేలుచున్నవి. హీరా నందుడు వానిని సరిపఱచెను. గురుదేవుడు అతనివంక జూచెను.

గురుదేవుడు:—(హీరానందునితో) దయచేసి పైజమాలను మఱువకుము.

సింధులోనివారు వాడు పైజమాలను ధరించినచో గురుదేవునకు ఎక్కువ హాయిగా ఉండు నని హీరానందుడు లోగడ చెప్పియుండెను. దాని నిప్పుడు శ్రీరామకృష్ణుడు జ్ఞాపకపఱచు చుండెను.

హీరానందుడు సరిగా భుజింప లేదు. అన్నము పక్వముగా ఉడుక లేదు. అందులకు గురుదేవుడు చాల చింతించి 'ఫలాహారములనైన ఏ మేని తినుదువా' అని అతనిని మాటిమాటికి అడిగెను. వ్యాధి బాధచే గురుదేవుడు మాటాడలేకున్నను ఆప్రశ్న నేమో మాటి మాటికి అడిగెను. "నీవును ఆ యన్నమునే భుజించితివా" అని లాటును అడిగెను.

శ్రీరామకృష్ణునకు మొలలో వస్త్రము నిలువ దాయెను. శిశువువలె ఆయన ఇంచుమించు వివస్త్రుడుగనే ఉండెను. హీరానం దుని వెంబడి బ్రాహ్మమిత్రు లొకరిద్ద ఱున్నందున గురుదేవుడు మొలమీదికి వస్త్రమును మాటిమాటికిని లాగుకొనుచుండెను.

గురుదేవుడు:—(హీరానందునితో) నా ఒడలికి గుడ్డకప్పడము లేనందున నేను అనాగరకుడ నని తలంతువా?

హీరానందుడు:—గుడ్డ లేనంతమాత్రముచేత మీ కేమి? మీరు ఒక శిశువే కదా.

గురుదేవుడు:—(బ్రాహ్మభక్తు నొకని జూపుచు) నేను శిశువ నను అభిప్రాయము అతనికి లేదు.

హీరానందుడు వీడ్కొన నుండెను. కొన్ని దినాలలో అతడు సింధునకును బయలుదేఱ నుండెను.

గురుదేవుడు:—(హీరానందునితో) ఒకవేళ నీవు సింధునకు పోకున్నచో, —

హీరానందుడు:— (చిఱునవ్వు నవ్వుచు) నాకు నా పనులున్నవి. వాని చేసిపెట్టుటకు అచ్చట వేరెవ్వరును లేరు.

గురుదేవుడు:—ఏపాటి సంపాదింతువేమి?

హీరానందుడు:— నాపనివలన నాకు ఎక్కువ వచ్చుబడి వచ్చుట లేదు.

గురుదేవుడు:—పోనీ, ఆ వచ్చుచున్నదే ఎంత?

హీరానందుడు నవ్వెను.

గురుదేవుడు:—నీవు ఏల ఇచ్చటనే ఉండ రాదు?

హీరానందుడు ఏమియు బదులు చెప్ప లేదు.

గురుదేవుడు:—నీవు నీ నౌకరిని వదలుకొన్నచో—

హీరానందు డేమియు అన లేదు, సెలవు గైకొన సిద్ధముగ నుండెను.

గురుదేవుడు:—మరల ఎప్పుడు వత్తువు నన్ను జూడ?

హీరానందుడు:—నేను సింధునకు తరలబోవునది ఎల్లుండి. ఎల్లుండి ప్రొద్దున మిము దర్శింతును.

హీరానందుడు వెడలి పోయెను.

మహేంద్రుడు గురుదేవుని ప్రక్కనే కూర్చుండి యుండెను.

గురుదేవుడు:— (మహేంద్రునితో) ఇతడు బలే మంచి వాడు, కదూ?

మహేంద్రుడు:—ఔను, మహాశయా, చాల ఇంపైన స్వభావ మితనిది.

గురుదేవుడు:—సింధు కలకత్తానుండి ఇరువది రెండు వందల మైళ్ల దూరమున ఉన్నదని ఇతడే చెప్పినాడు. ఇంత దూరము నన్ను చూచుటకు వచ్చినాడు.

మహేంద్రుడు:— ఔను, మహాశయా, నిజమైన ప్రేమ లేనిదే ఇట్లు రాలేదు.

గురుదేవుడు:—నన్ను సింధునకు పిలుచుకొని పోవలె నను కోరిక ఇతనికి తీవ్రముగా ఉన్నది.

మహేంద్రుడు:—చాల కష్టమైన ప్రయాణము, రైలులో పోయి చేరుటకు నాలు గైదు దినాలు పట్టును.

గురుదేవుడు:— ఇతనికి విశ్వకళాపరిషత్తు పట్టములు మూడున్నవి.

మహేంద్రుడు:— ఉన్నవి, మహాశయా.

శ్రీరామకృష్ణుడు బడలి యుండెను, ఇంచుక విశ్రాంతి తీసికోగోరెను. కిటికీల తలుపులు తీసి, మంచముపై తివాసి పఱుపు మని మహేంద్రునితో ననెను. మహేంద్రుడు ఆయనకు గాలి వీచు చుండెను. శ్రీరామకృష్ణునకు నిదుర మత్తు ఎక్కెను.

కొంచెము సేపు నిద్రించిన తర్వాత శ్రీరామకృష్ణుడు మహేంద్రుని 'నేను నిద్రించితినా' అని అడిగెను.

మహేంద్రుడు:—కొంచెమే.

అప్పటికి మధ్యాహ్నము దాటినది. గురుదేవుని గదిలో ఎందఱో భక్తులు కూర్చుండి యుండిరి. నరేంద్రుడును శరత్తును శశియు లాటును నిత్యగోపాలును గిరీశుడును రామును మహేంద్రుడును సురేశుడును అట నుండిరి.

కేదారుడు లోపలికి వచ్చెను. ఇప్పటికి కొంత కాలమునకు ఇదే గురుదేవు నొద్ద కతని మొదటి రాక. ఆఫీసు పనులలో ఢాకాలో ఉండిన యతనికి గురుదేవుని యనారోగ్యవార్త చెవి దాకెను. శ్రీరామకృష్ణుని గదిలో ప్రవేశించుచుండగనే అతడు ఆయన పాదధూళిని కొంత తాను తల దాల్చి, సంతోషముతో ఒక కొంతను ఇతరులకు ఇచ్చెను. భక్తులు వినమ్రశిరస్కులై ఆ పాద ధూళిని కైకొనిరి. అందఱును మౌనముగ గూర్చుండిరి. శ్రీరామ

కృష్ణునకో, భావోద్రేకదశ కలుగబోవుచున్నట్లుండెను. భావోద్రేకము నణంచుకొను ప్రయత్నముచేతనో అన దగినట్లు ఆయన గాటముగ నిట్టూర్పు విడిచెను.

గురుదేవుడు కేదారుని దృష్టిని నరేంద్రుని వైపు మరల్చి, "అతడు సమస్తమును త్యజించినాడు" అనెను. (భక్తులతో) 'ఇప్పు డెంత వాదించినను, తర్కించినను, తుదకు హరినామమును పాడుచు నీవు నేలపై పొర్లు కాలము వచ్చు' నని కేదారు డొకసారి నరేంద్రునితో చెప్పి యుండెను.

సురేంద్రుడు తక్కిన భక్తులకు వెనుక వైపు కూర్చుండెను. గురుదేవుడు చిఱునవ్వుతో అతని వంక చూచి, కేదారునితో 'ఆహా! ఎంత ఇంపైన స్వభావ మతనిది' అనెను. గురుదేవుని సూచనను అర్థముచేసికొని, కేదారుడు సురేంద్రుని దాపునకు పోయెను.

సురేంద్రుని హృదయము చాల సున్నితము. కాశీపూరు వనమందిరమున అగుచున్న వ్యయమునకు అచ్చుకొనుటకై భక్త లొక కొందఱు గృహస్థ భక్తుల యొద్ద నుండి పైకము వసూలు చేయుచుండిరి. ఇందులకు సురేంద్రుడు చాల నొచ్చుకొనెను. వ్యయములో అధికభాగమును తానే భరించుచుండిన వా డతడు.

సురేంద్రుడు:—(కేదారునితో) ఈ పరమపవిత్రుల సమీపాన నే నెట్లు కూర్చుందును? కొన్నాళ్ల క్రింద (నరేంద్రుని జూపుచు) వీరిలో కొందఱు సన్న్యాసాశ్రమోచిత కాషాయములను ధరించి బుద్ధగయకు యాత్ర పోయిరి. వారు తమకంటె గొప్ప సాధువులను అట దర్శింప గోరిరి.

శ్రీరామకృష్ణుడు సురేంద్రు నూరడింప ప్రయత్నించుచుండెను. "సీది సరియైన పద్ధతి. వారు పట్టి పసివారు. మంచి దేదో వా రెఱుగరు" అన్నా డాయన.

సురేంద్రుడు:— (కేదారునితో) మనలోని భావాలను మన గురుదేవు డెఱుగడా? ఆయనకు ధనము లక్ష్యము లేదు. మన

హృదయములందలి భావములే ఆయనకు ప్రీతిగొలుపునవి.

సురేంద్రుని మాటలకు గురుదేవుడు ఔనని తల ఊపెను.

భక్తులు వివిధాహారములను గురుదేవునకు నివేదించుటకై తెచ్చి ఎదుట బెట్టిరి. శ్రీరామకృష్ణుడు ఒక మెతుకును నోట వేసికొని తట్టను సురేంద్రుని చేతికిచ్చి ప్రసాదమును భక్తులకు పంచిపెట్టుమనెను. సురేంద్రుడు ఆ ప్రసాదము నెత్తుకొని మేడ క్రిందికి దిగిపోయెను.

గురుదేవుడు:— (కేదారునితో) నీవు క్రిందికి పోయి విషయమును పూర్తిగా సురేంద్రునకు వివరించి చెప్పుము. వారిలో తీక్ష్ణవాదములు పుట్టనీక చూచుకొనుము.

మహేంద్రుడు శ్రీరామకృష్ణునకు గాలి వీచుచుండెను. 'నీ వేమియు భుజింపవా' అని గురుదేవు డతని నడిగి, క్రిందికి పంపెను.

అది దాదాపు మునిమాపు వేళ. తోటలోని చిన్నతటాకమునొద్ద గిరీశ మహేంద్రులు పచారు చేయుచుండిరి.

గిరీశుడు:— * గురుదేవునిగూర్చి నీ వేమో వ్రాయుచున్నావని తెలియుచున్నది, నిజమేనా ?

మహేంద్రుడు:—ఎవరు చెప్పిరి నీకు ?

గిరీశుడు:— ఎవరో చెప్పగా విన్నాను. నీ రచనను నాకిచ్చెదవా ?

మహేంద్రుడు:—నేను దానిని నాకొఱకు వ్రాసికొనుచున్నానే కాని, ఇతరులకొఱకు కాదు. ఇచ్చుట సరి అని నాకు తోచకున్ననే నీయను.

గిరీశుడు:—అనగా నీ భావము ?

---

* శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము మహేంద్రుడు ఐదు సంపుటాల 'శ్రీరామకృష్ణ కథామృతము'ను వంగభాషలో ప్రకటించెను. దాని ఆంగ్లానువాదమే 'గాస్పెలు'. దాని సంక్షేపమే ఈ పుస్తకము.

మహేంద్రుడు:—నేను మరణించిన పిదప నీ కది లభింప వచ్చును.

అది సాయంవేళ. గురుదేవుని గదిలో దీప మొకటి వెలిగింప బడెను. అమృతవసుడు అను నొక బ్రాహ్మభక్తుడు గదిలోనికి వచ్చెను. అతనిని చూడవలెనన్న తన కోరికను శ్రీరామకృష్ణుడు తెలిపియుండెను. మహేంద్రాదిభక్తు లొక కొంద ఱట నుండిరి. గురుదేవు నెదుట ఒక అరటియాకుమీద మల్లె పూల మాల యొకటి యుండెను. గదిలో నిశ్శబ్దత పరిపూర్ణముగ నుండెను. ఒక మహా యోగి మౌనమున భగవద్ధ్యాననిమగ్నుడై యున్నట్లుండెను. గురు దేవుడు పూలమాలను తనమెడలో వేసికో గోరిన వానివలె మాటి మాటికిని దాని నించుక ఎత్తుచుండెను.

అమృతుడు:— (ప్రేమతో) ఆ మాలను మీ మెడలో నేను వేయుదునా ?

శ్రీరామకృష్ణుడు మాలను వేయించుకొనెను. ఆయనకును అమృతునికిని సంభాషణ చాలసేపు జరిగినది. అమృతుడు సెలవు గైకొన నుండెను. అప్పుడు గురుదేవుడు 'మరల రమ్ము' అనెను.

అమృతుడు:—తప్పక, మహాశయా. ఇచ్చటికి వచ్చుట అనిన నాకు ఎంతో ఇష్టము. కాని చాలదూరమున ఉన్నందున, ఎల్లప్పు డును రాలేకున్నాను.

గురుదేవుడు:—తప్పక వచ్చుచుండుము, బండి బాడిగ ఇక్కడ ఇత్తురు లెమ్ము.

అమృతునిపైని గురుదేవుని ప్రేమను గని భక్తులు అబ్బుర పడిరి.

మఱునాడు మహేంద్రుడు తన భార్యను పుత్త్రు నొకనిని వెంట నిడుకొని వనమందిరమునకు వచ్చెను. ఆ బాలునకు వయస్సు ఏడేండ్లు. గురుదేవుడు పిలుచుకొని రమ్మన్నందుననే, మహేంద్రుడు పుత్త్రులలో

నొకని మరణముచే దుఃఖోన్మాదమున నున్న భార్యను పిలుచుకొని వచ్చెను.

ఆనాడు గురుదేవుడు తనకు పరిచర్య కావించు భాగ్యమును మహేంద్రుని భార్యకు పెక్కుమార్లు అనుగ్రహించెను. ఆమె క్షేమమందు ఆయనకు అక్కఱ అతిమాత్రముగ ఉన్నట్లు కనిపించెను. రాత్రి గురుదేవునకు అన్నము పెట్టుటకై మాతృశ్రీ వచ్చెను. మహేంద్రునిల్లాలు దీప మెత్తుకొని ఆమె ననుసరించెను. గురుదేవుడు ప్రేమతో ఆమె కుటుంబ విషయములను గూర్చి పెక్కు ప్రశ్నలడిగెను. ఆమెను మరల వనమందిరమునకు రమ్మనియు, వచ్చునపుడు ఆమెకొమార్తెను పిలుచుకొని రమ్మనియు, వచ్చి మాతృశ్రీతో కొన్నాళ్లపాటు ఉండుమనియు గురుదేవుడు ప్రార్థించెను. గురుదేవుని భోజనానంతరము మహేంద్రసతి తట్టల నెత్తి శుద్ధిచేసెను. ఆమెతో ఆయన కొన్ని నిమిషములసేపు ముచ్చటించెను.

రాత్రి సుమారు తొమ్మిదిగంటలప్పుడు శ్రీరామకృష్ణుడు భక్తులతో తన గదిలో కూర్చుండెను. ఆయన మెడలో పూలమాల ఒకటి ఉండెను. మహేంద్రునితో అతని భార్యను వనమందిరమున కొన్నాళ్లపాటు మాతృశ్రీతో తాను గడపుమంటినని గురుదేవుడు చెప్పెను. గురుదేవు ననుగ్రహాతిశయమునకు మహేంద్రుని హృదయము కరగెను.

మహేంద్రుడు విసనకఱ్ఱతో వీచుచుండెను. గురుదేవుడు తన మెడలోని పూలమాలను తీసి, తనలో తాను ఏమో చెప్పుకొనెను. అంత పరమానుగ్రహముతో ఆ మాలను మహేంద్రున కిచ్చెను.



పదుమూడవ ప్రకరణము

# నిర్యాణానంతరము

1886 వ సంవత్సరము ఆగస్టు నెల తే 15 ది భానువారము నాడు శ్రీరామకృష్ణుడు తన శిష్యులను భక్తులను దుఃఖసముద్రమున ముంచి మహాసమాధి నొందెను. వారు నడిసముద్రమున పగులు వాఱిన నావలోని జీవులవలె ఐరి. కాని దృఢమైన ప్రేమబంధ మొకటి వారిని కలిపి ఉంచెను. ఒకరికొకరి సాహచర్యము ధైర్య ప్రదముగను, విశ్వాసజనకముగను ఉండెను. వారికి లౌకికజనుల మైత్రియందు అభిరుచి లేదు. వారికి సదా గురుదేవుని ప్రశంసయే. ''ఆయనదర్శనము ఇక మనకు లేదా'' — ఇదే వారికి మేలుకొని యున్నప్పటి తలంపు, నిద్రించుచున్నప్పటి కల. ఇతరులతో చేరక వా రాయనకై విలపించిరి. కలకత్తావీధులలో తిరుగుచున్నప్పుడు కూడ వారు ఆయనధ్యానములోనే మునిగియుండిరి. గురుదేవుడు మహేంద్రునితో నొకసారి ''నేను మరణించిన పిమ్మట నాకై మీరు ఏడ్చుచు తిరుగుచుండుటను తలపోసికొంటినేని దేహమును విడుచుట నాకు కష్టమగును'' అని చెప్పియుండెను. వారిలో కొందరు, ''ఆయన ఇక ఈ ప్రపంచములో లేడు. మన కింకను ప్రాణములు ప్రియము లుగ నున్నవే. ఎంత ఆశ్చర్యము! తలపెట్టినచో మనము దేహము లను విడువగలము. కాని విడువమే'' అని అనుకొనుచుండిరి. భక్తులు భగవంతునికై ఉబలాటపడుచు హృదయపూర్వకభక్తితో భగవ న్నామములను కీర్తించిన, వారికి దేవుడు ప్రత్యక్షమగునని శ్రీరామ కృష్ణుడు మాటిమాటికిని వారికి చెప్పియుండెను. హృదయపూర్వక ముగ ప్రార్థించువారి ప్రార్థనకు దేవుడు చెవి యొగ్గి తీఱునని ఆయన వారికి నమ్మ చెప్పియుండెను.

ఇంకను పెండ్లి కాని యువశిష్యులు గురుదేవుని అంతరంగ గోష్ఠికి చేరినవారు కాశీపురవనమందిరమున రాత్రింబగళ్లు ఆయనకు పరిచర్య చేసిరి. ఆయన నిర్యాణానంతరము వారిలో పెక్కండ్రు తమ కిష్టము లేకున్నను ఇండ్లకు మరలిరి. వా రింకను యథావిధిగ సన్న్యసింప లేదు. కొంతకాలము వారు తమ కుటుంబనామములను ఉంచుకొనియే యుండిరి. కాని శ్రీరామకృష్ణుడు మానసికముగ వారిచేత సర్వసంగపరిత్యాగము చేయించెను. వారిలో ఎందఱికో ఆయనయే స్వయముగ పరివ్రాజకోచిత కాషాయాంబరముల నిచ్చి దీక్షనొసంగెను.

గురుదేవుని సేవకులలో ఇద్దఱికో ముగ్గురకో నిలువను నీడ లేకుండెను. వారితో ఉదారహృదయుడైన సురేంద్రు డిట్లనెను: "సోదరులారా, మీ రెచ్చట తిరుగుదురు? ఒకయింటిని బాడుగకు తీసికొందము. మీ రచ్చట వసించుచు దానిని గురుదేవుని ఆలయముగ నొనర్పుడు. గృహస్థులమైన మేమును మా మనశ్శాంతికై అచ్చటికి వచ్చుచుందుము. మే మీ లోకమున భార్యలను బిడ్డలనే చూచుచు పగళ్లను రాత్రులనెల్ల ఎట్లు గడపగలము? కాశీపూరులో గురుదేవునికై నేను ఒకంత ధనమును ఖర్చుచేయుచుంటిని. ఆ మొత్తమునే ఇప్పుడు మీ ఉపయోగమునకై సంతోషముతో నిచ్చెదను" అనెను. అట్లే కలకత్తా పరిసరమందలి బరానగరమున ఒకయింటి నతడు బాడుగకు తీసికొనెను. ఆ భవనము క్రమముగ మఠముగా రూ పొందెను.

మొదట కొన్ని నెలలవరకు ప్రతినెలయు సురేంద్రుడు ముప్పది రూపాయల నిచ్చుచుండెను. మఠములో సన్న్యాసులు ఒకరొకరుగ చేరుచున్న కొలదియు ఆయన తా నిచ్చు విరాళమును రెండంతలుగ చేసెను. మఱి కొన్నాళ్లకు తా నిచ్చు మొత్తమును నూఱురూపాయలుగ హెచ్చించెను. నెలకు ఇంటి బాడుగ పదునొకండు రూపాయలు. వంటవాని నెలజీతము ఆఱు రూపాయలు. మిగిలిన పైకము భోజనమునకు ఖర్చగుచుండెను.

చిన్నగోపాలు కాశీపూరు వనమందిరమున నుండి గురుదేవుని పాన్పు మొదలైన నిత్యోపయోగ వస్తువులను తీసికొనివచ్చెను. కాశీపూరులో వంటవాడుగ నుండిన బ్రాహ్మణుడే క్రొత్తమఠమునను నియుక్తుడయ్యెను. నిలుకడగా మఠమందే ఉండ నారంభించిన వారిలో ప్రథముడు పెద్దగోపాలు. శరత్తు రాత్రులను అచ్చట గడపుచుండెను. మొదటి దినాలలో శరత్తు, శశి, బాబురాము, నిరంజనుడు, కాళి — వీరు తమ అనుకూల్యము చొప్పున మఠమునకు తఱచు వచ్చుచుండిరి. గురుదేవుని మరణానంతరము బృందావనమునకు బోయిన తారకుడు కొన్ని నెలలతరువాత కలకత్తాకు మరలి వచ్చి, అచిరకాలములో మఠమునందే సదా ఉండువాడయ్యెను. రాఖాలును, యోగినును, లాటును, కాళియు బృందావనమున మాతృశ్రీతో నివసించుచుండిరి. మఠము ప్రారంభింపబడినకాలమున ఒకనెల లోపలనే కాళి కలకత్తాకు మరలి వచ్చివేసెను. కొన్ని నెలలకు రాఖాలును వచ్చెను. ఒకసంవత్సరమునకు పిమ్మట జోగినును, లాటును వచ్చిరి. గృహస్థభక్తులు తమ సన్న్యాసిసోదరుల యొద్దకు తఱచు వచ్చుచు పఠనమందును ధ్యానమందును గంటల కొలదిగ కాలము గడుపుచుండిరి.

అచిరకాలములోనే నరేంద్రుడును, రాఖాలును, నిరంజనుడును, శరత్తును, శశియు, బాబురామును, యోగినును, తారకుడును, కాళియు, లాటును సన్న్యసించిరి. కొంతకాలమునకు పిమ్మట శారదాప్రసన్నుడును, సుబోధుడును వారిమార్గమునే అనుసరించిరి. గంగాధరునకు నరేంద్రుడు ప్రాణపదము గావున ఆయన మఠమునకు దినము తప్పక వచ్చుచుండెడివాడు. కాశీ శివాలయమున సాయంపూజాసమయమున అనుసంధింపబడు మంత్రమును సోదరులకు ఉపదేశించినవాడతడే. సాధనలకై అతడు టిబెత్తునకు పోయి యుండెను. అటనుండి మరలి ఇప్పుడు ఈ మఠములో నుండెను. మొదట మఠమునకు ఇష్టము వచ్చినప్పుడు వచ్చుచుండిన హరి త్వరలోనే సన్న్య

స్రాశ్రమమును స్వీకరించెను. అంతటితో గురుదేవుని *సన్న్యాస శిష్యుల పరంపర పూర్తి యయ్యెను.

సురేంద్రుడు నిజముగ ధన్యాత్ముడు. అనంతరకాలమున శ్రీరామకృష్ణ నామాంకిత మైన గొప్పసంస్థకు పునాదులు వేసిన వా డాయనయే. అతనిభక్తిచేతను, అతనిత్యాగముచేతను ఆ శ్రద్ధాళువులకు సన్న్యసించుటకును బ్రహ్మసాక్షాత్కార మొందుటకును శక్య మైనది. గురుదేవుని ఉపదేశములును, కామినికాంచనత్యాగమును,

* గురుదేవుని నిర్యాణానంతరము సన్న్యాసదీక్షను స్వీకరించిన శిష్యుల పేళ్లు —

| | |
|---|---|
| నరేంద్రుడు | శ్రీ వివేకానందస్వామి |
| రాఖాలు | శ్రీ బ్రహ్మానందస్వామి |
| యోగిన్ | శ్రీ యోగానందస్వామి |
| నిరంజనుడు | శ్రీ నిరంజనానందస్వామి |
| లాటు | శ్రీ అద్భుతానందస్వామి |
| బాబురాము | శ్రీ ప్రేమానందస్వామి |
| తారకుడు | శ్రీ శివానందస్వామి |
| హరి | శ్రీ తురీయానందస్వామి |
| శరత్తు | శ్రీ శారదానందస్వామి |
| శశి | శ్రీ రామకృష్ణానందస్వామి |
| కాళి | శ్రీ అభేదానందస్వామి |
| గంగాధరుడు | శ్రీ అఖండానందస్వామి |
| పెదగోపాలు | శ్రీ అద్వైతానందస్వామి |
| శారదాప్రసన్నుడు | శ్రీ త్రిగుణాతీతానందస్వామి |
| సుబోధుడు | శ్రీ సుబోధానందస్వామి |

బాగ్‌బాజారువాడైన తులసి గురుదేవుని కలకత్తాయందును, దక్షిణేశ్వరమునందును దర్శించి దీవన లందియుండెను. ఇప్పుడు తఱచు మఠమునకు వచ్చుచుండి స్వల్పకాలములోనే తానును సన్న్యాసి యయ్యెను. ఆధ్యాత్మికజీవితమున అతనికి ప్రవేశ మొసంగినది శ్రీ వివేకానందస్వామియే. సన్న్యసించిన పిమ్మట అతనిపేరు శ్రీ నిర్మలానందస్వామి.

బ్రహ్మానుభూతియు వారిలో రూపుదాల్చినవి. వారి కీ జగమున జీవితవసతులను శ్రీరామకృష్ణుడే సురేంద్రునిద్వారా ఏర్పఱచెను.

ఆ సన్న్యాసిసోదరులు మఠములో దిక్కు లేని బాలురవలె జీవితము గడపుచుండిరి. కొన్ని సమయములలో వారిచేత ఇంటి బాడుగను చెల్లించుటకు వలసిన పైక మైనను ఉండెడిది గాదు. మఠములో వారికి ఆహారముసైతము లేకుండిన సమయములు గలవు. సురేంద్రుడు వచ్చి ఇట్టి పరిస్థితులను సరిపెట్టి పోవుచుండెడివాడు. ఈ సన్న్యాసుల కతడు జ్యేష్ఠభ్రాత. బరానగర మఠసన్న్యాసులు అనంతరకాలమున అతని హృదయపూర్వకమైన ప్రేమను తలంచు కొన్నప్పుడు కృతజ్ఞతచే బాష్పములు కార్చుచుండెడివారు.

ఈ క్రొత్తమఠమును గురుదేవునిభక్తులు బరానగరమఠ మని వ్యవహరించుచుండిరి. నరేంద్రుడు, రాఖాలు మున్నగు యువశిష్యులు నితాంతవైరాగ్యపూర్ణులై యుండిరి. ఒకనాడు రాఖాల్తు తండ్రి మఠమునొద్దకు వచ్చి కుమారు నింటికి రమ్మని పిల్చెను. రాఖాలు తండ్రితో "ఇచ్చటికి వచ్చు శ్రమ మీ కేల? నే నిచ్చట చాల సుఖముగ నున్నాను. మిమ్ము నేనును, నన్ను మీరును మఱచునట్లు చేయుమని దయచేసి దేవుని ప్రార్థింపుడు" అని చెప్పెను. యువశిష్యులు తమలో తాము 'ఐహికజీవితమునకు మనము ఇక నెన్నటికిని మరలము. కామినీ కాంచనపరిత్యాగమును గురుదేవుడు మనకు విధించినాడు. మనము మనసంసారముల కెట్లు మరలి పో గలము" అని అనుకొనిరి.

మఠములో నిత్యారాధనము చేయు వంతు శశిది. గురుదేవుని శరీరశేషములు, బలరాము నింటి నుండి తేబడినవి. పూజామందిరమున శ్రీరామకృష్ణునకు ప్రతిదినారాధనము జరుగు చుండెను. మఠభవనమునకును అన్ని విషయములకును అవేక్షకుడు నరేంద్రుడు. అత డీ మఠమునకు నాయకుడు. అతడు సోదరశిష్యులతో తఱచు, "భగవద్గీత మనకు విధించిన నిస్స్వార్థకర్తవ్యములు, జపారాధన ధ్యానాదులే గాని ఐహికకృత్యములు గావు" అని చెప్పు

చుండెడివాడు. మఠమందలి సోదరులకెల్ల ఆధ్యాత్మికోత్సాహప్రదు డతడే. ''మనము సాధన చేయవలెను. చేయకున్న మనకు బ్రహ్మానుభూతి కలుగదు'' అనుచుండెడివాడు అతడు వారితో.

అతడును, అతని సోదరశిష్యులును తపోనిష్ఠాపూర్ణులై రాత్రింబగళ్లు జ్ఞానసాధనలు చేయుచుండిరి. బ్రహ్మసాక్షాత్కారమొక్కటే వారి జీవిత లక్ష్యము. తపశ్చర్యకు వేదములందును, పురాణములందును, తంత్రములందును విహితములైన నియమములను తమకు సంతృప్తికరముగ వారు అనుష్ఠించుచుండిరి. శాస్త్రగ్రంథపఠనము, జపము, ధ్యానము — వీనిలోనే గడచిపోయెడిది వారి కాలమంతయు. దేవునిసాన్నిధ్యము అనుభవమునకు రానప్పు డెల్ల వారు చిత్రహింసను పోలిన బాధ చెందుచుండిరి. వారు తపశ్చర్యను ఏకాంతముగ ఒక్కొక్కప్పుడుచెట్లక్రిందను, ఒక్కొక్కప్పుడు శ్మశానములందును, ఒక్కొక్కప్పుడు గంగాతీరమందును చేయుచుండిరి. ఒక్కొక్కప్పుడు మఠములోనే ధ్యానపుగదిలో జపధ్యానములందు దినమంతయు గడపెడి వారు. ఒక్కొక్కప్పుడు అందఱునొకటిగాకూడి ఉద్రిక్తానందమున ఆడుచు పాడుచు నుండెడి వారు. దేవుని చూడవలె ననెడి తృష్ణ వారిని, ముఖ్యముగా నరేంద్రుని తినివేయుచుండెను. అప్పు డప్పుడు వారు, ''దేవుని దర్శనము లభింప కున్న పస్తుండి చత్తమా'' అని ఒకరితో ఒకరు చెప్పుకొనెడి వారు.

1887 వ సంవత్సరము ఫెబ్రువరినెల తే 21 ది సోమవారము.

నరేంద్రుడును, రాఖాలును, శరత్తును, శశియు, కాళియు, బాబురామును, తారకుడును శారదాప్రసన్నుడును మఠములో వసించుచుండిరి. నాడు శివరాత్రి కావున సన్న్యాసులు దినమంతయు ఉపవసించిరి. శరత్తును కాళియు నిరంజనుడును శారదుడును తరువాతి శనివారమునాడు జగన్నాథపుణ్యక్షేత్రమును దర్శింప పూరికి యాత్ర పోవలె నని పన్నాగించుచుండిరి. జోగినును లాటునుబృందావనమం దుండిరి, క్రొత్తచోటును వారు ఇంకను చూడనేలేదు.

తనతండ్రి మరణించినప్పటినుండి తనకుటుంబమున కేర్పడిన యొక వ్యాజ్యమునిమిత్తము నరేంద్రుడు ఆప్రొద్దుననే కలకత్తాకు పోయి యుండెను. ఉదయము తొమ్మిదిగంట లప్పటికి మహేంద్రుడు మఠమునొద్దకు వచ్చెను. అతనిని చూచి తారకుడు శివస్తోత్రములను పాడ జొచ్చెను. పాటలో రాఖాలును కలిసికొనెను. వారు పాడుచు ఆడుచు నుండిరి. ఆపాట నరేంద్రుడు క్రొన్నాళ్ళక్రితమే కట్టినది.

శశి, ఆలయములో ఉదయకాలారాధనమును ముగించెను. అంతట శరత్తు తంబూర శ్రుతిలో శివస్తోత్రములను పాడెను.

నరేంద్రుడు అప్పుడే కలకత్తానుండి వచ్చెను. అతడు అప్పటి కింకను స్నానమైనను చేయ లేదు. వ్యాజ్యమే మైన దని కాళి యతని నడిగెను. "నీ కెందు కయ్యా ఆ గొడవ" అని నరేంద్రుడు చుఱుకుగా బదులు చెప్పెను.

నరేంద్రుడు గంగలో స్నానము జేసి మఠమునకు మరలి వచ్చి వేసెను. తడి దోవతియు కండువాయు ఆయనచేత నుండినవి. శారదుడు నరేంద్రునకు సాష్టాంగ ప్రణామము చేసెను. శివరాత్రికై అతడును ఉపవసించి యుండెను, స్నానార్థము అతడు గంగకు పోవుచుండెను. నరేంద్రుడు పూజామందిరమున ప్రవేశించి అచ్చట నిత్యారాధనము నొందుచున్న శ్రీరామకృష్ణుని పటమునకు నమస్కరించెను. కొన్ని నిమిషములవఱకు అతడు ధ్యానములో నిమగ్నుడై యుండెను.

సాయంకాలము శివారాధనకై ఏర్పాట్లు జరుగుచుండినవి. పూజకై బిల్వదళములు ప్రోగుచేయబడినవి. బిల్వకాష్ఠములు చిన్న చిన్నవిగ ఖండింపబడి హోమమునకు సిద్ధపఱుపబడినవి.

మఠారాధనను చూచుకొనువాడైన శశి సాయంకాలము అచ్చట నున్న వివిధదేవతలయు, దేవేరులయు పటముల యెదుట కర్పూరము వెలిగించెను.

మఠావరణములో నున్న బిల్వవృక్షచ్ఛాయలో శివారాధనము

జరుగ వలసి యుండెను. రాత్రి నాలుగు జాములలోను నాల్గు సార్లు ఆరాధనము చేయ వలెను.

శిష్యసోదరులు బిల్వవృక్షముక్రింద సమావేశ మైరి. భూపతియు, మహేంద్రుడును కూడ నుండిరి. మఠములోని యువసన్న్యాసులలో నొకనికి ఆరాధనము అప్పగింపబడినది. కాళి భగవద్గీతను పారాయణము చేయుచుండెను. అప్పు డప్పు డతడు నరేంద్రునితో వాదించు చుండెను.

కాళి:—నేనే సమస్తమును, సృష్టికర్తను నేనే. స్థితికర్తను నేనే. సంహారకర్తను నేనే.

నరేంద్రుడు:—సృజించుట నా కెట్లు శక్య మగును? వే ఱొక శక్తి నాద్వారా సృష్టికార్యము నెఱవేర్చును. మన వివిధవ్యాపారములకు, మనతలంపులకు సైతము ఆశక్తియే కారయిత్రి.

మహేంద్రుడు:—(తనలో) గురుదేవుడు చెప్పుచుండెడివాడు, ధ్యానించునది తాను అను తలం పుండు నంత వఱకును సాధకుడు ఆద్యాశక్తిపాలనలో నుండు వాడే. శక్తిని లక్ష్యపెట్టక తప్పదు.

కాళి కొన్ని నిమిషముల సే పాలోచించి ఇట్లనెను : "నీవు చెప్పు ఆవ్యాపారము లన్నియు అయథార్థములు. తలంపు అనున దొకటి లేనే లేదు. వీని ప్రస్తావమే నాకు నవ్వు పుట్టించును".

నరేంద్రుడు:—నే నతడను అను వాక్యములోని 'నేను' అనునది ఈయహంకారము కాదు. మనస్సు, శరీరము మున్నగు వానిని వేఱు చేయగా మిగులున దది.

గీతాపారాయణము ముగియగనే కాళి ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః అనెను. నరేంద్రాదిభక్తులు లేచి నిలబడి ఆడుచు పాడుచు వృక్షమునకు ప్రదక్షిణములు చేసిరి. అప్పు డప్పుడు బృందగానముగా 'శివగురు', 'శివగురు' అని పాడుచుండిరి.

ఆనాడు చతుర్దశి. అది అర్ధరాత్రివేళ. దిక్కుల నన్నిటను కటికచీకటి నిండి యుండెను. మానవు లేమి, పశుపక్ష్యాదు లేమి

నిశ్శబ్దముగ (నిదుర గూరి) యుండిరి. యువసన్న్యాసులు కావి బట్ట లను దాల్చి యుండిరి. బిగ్గఱగ వారు పాడిన ''శివగురు శివగురు'' నాదములు వర్షాకాలపు ఉఱుముల చప్పుడు వలె అనంతాకాశము లోనికి లేచి అపరిచ్ఛేద్య మైన సచ్చిదానందమున లీన మైనవి.

ఆరాధన పూర్తి యైనది. ఉదయింప నున్న సూర్యుడు తూర్పు దిఙ్ముఖమును ఎఱ్ఱచేయుచుండెను. ఆ పవిత్ర బ్రాహ్మముహూర్త మున సంధ్యారాగమున ఆ ఆరాధకయువకులు గంగలో స్నానములు ముగించిరి.

ప్రొద్దున భక్తులు పూజాగృహమునకుబోయి విగ్రహము నెదుట సాష్టాంగపడి క్రమక్రమముగ పెద్దచావడిలో సమావేశమైరి. నరేంద్రుడు నూతన కాషాయాంబరముల ధరించి యుండెను. ఆయన శరీర మందలి ప్రతిరోమకూపమును దివ్యజ్యోతిని వెదజల్లు చుండెను. ఆయన దుస్తుల పళపళని కావి వన్నె ఆయనవదన దివ్య కాంతితో మిళిత మైనది. ఆయన నెమ్మోము అగ్నివలె జాజ్జ్వల్య మానముగ నుండెను. కాని ప్రేమశిశిరతయు నిండుకొని యుండెను. ప్రేక్షకుల కతడు సదానందసాగరమున లేచి గురుదేవుని సందేశ మును వ్యాపింప జేయుటకై మానవరూపము దాల్చిన యొక బుడగ వలె గాన్పించెను. ఎల్లర చూపులును అతనిపై నెలకొని యున్నవి. నరేంద్రుని కప్పటి వయస్సు ఇరువదినాల్గు సంవత్సరములు. శ్రీచైతన్య దేవుడు సన్న్యసించినది సరిగా అదే వయస్సున.

భక్తులు ప్రొద్దున భుజించుటకై బలరాముడు మఠమునొద్దకు కొన్ని ఫలములను, భక్ష్యములను పంపి యుండెను. రాఖాలును, నరేంద్రుడును, మఱి కొందఱును వాని నారగించిరి. ఒకటి రెండు సార్లు నోట వేసికొని నంతనే వారిలో కొందఱు, ''నిక్కముగ బల రాముడు ధన్యుడే'' అని కేక లిడిరి. అందఱును నవ్విరి.

నరేంద్రుడు అప్పుడు పసివానివలె తమాషలు చేయజొచ్చెను. శ్రీరామకృష్ణుని అనుకరించుచుండెను. ఒకమిఠాయిని నోట వేసికొని

సమాధిలో నున్నట్లు కదలక నిలుచుండెను. ఆయన కన్నులు రెప్ప పాటును మానినవి. ఒక భక్తుడు ముందునకు వచ్చి నరేంద్రుడు పడిపోవు నేమో అను దిగులుచే అతనిని పడిపోనీయక పట్టుకొను చున్నట్లు నటించెను. నరేంద్రుడు కన్నులు మూసికొని యుండెను. కొన్ని నిమిషములకు పిదప నరేంద్రుడు కన్నులు తెఱచెను. నోట మిఠాయి ఇంకను ఉండెను. "నేను — బాగుగనే — ఉన్నాను" అని దీర్ఘ దీర్ఘముగ పలికెను. అందఱును బిగ్గఱగ నవ్విరి.

తినుబండములు అందఱికిని ఇయ్యబడినవి. మహేంద్రుడు ఆ యానందవిపణిని తేఱి చూచుచుండెను. మహానందమున భక్తులు, "గురుమహారాజునకు జై" అని ఘోషించిరి.

1887 వ సంవత్సరము మార్చి తే 25 ది సోమవారము.

శిష్యసోదరులను చూత మని మహేంద్రుడు బరానగరమఠము నొద్దకు వచ్చెను. దేవేంద్రుడును అతనితో వచ్చెను. మహేంద్రుడు మఠమునకు తఱచు వచ్చుచు, అప్పు డప్పుడు ఒకటి రెండు దినాల పాటు అక్కడే గడపుచు నుండెను. క్రిందటి వారమున నతడు మఠమున మూడు దినము లుండెను. ఈ యువకుల గాఢవిరక్తిని చూడ వలె నను ఆత్రము అతని కెక్కువ.

అది సాయంకాలము. రాత్రి మఠమునందే గడపుద మని మహేంద్రు డనుకొనెను. శశి పూజాగృహమున దీపమును వెలిగించి, భగవన్నామసంకీర్తన చేసెను. వేఱు వేఱు గదులలో ఉన్న దేవతలయు దేవేరులయు పటముల యెదుట కర్పూరము వెలిగించెను. సాయంకాలారాధనము ప్రారంభ మయ్యెను. ఆరాధనమును జరుపువాడు శశియే. మఠసాధువులు మహేంద్రదేవేంద్రులతో గూడ లేచి నిలబడి చేతులు జోడించుకొని ఆరతిగేయమును పాడిరి.

ఆరాధన ముగియగానే నరేంద్రమహేంద్రులు ఒండొరుల తోడి సంభాషణలోనికి దిగిరి. శ్రీరామకృష్ణునితో తనకు ఘటిల్లిన వివిధ సమావేశములను నరేంద్రుడు జ్ఞప్తికి దెచ్చుకొను చుండెను.

నరేంద్రుడు:—గురుదేవుని నేను చూడ వచ్చుచుండిన యా మొదటి దినాలలో ఒకనాడు, ఉద్రిక్తదశలో ఉండిన ఆయన నను జూచి "వచ్చితివా నాయనా" అనెను. "ఎంత ఆశ్చర్యము! ఈయన ఎంతో కాలముగ నన్నెఱిగి యున్నట్లున్నదే" అని నాలో నే నను కొంటిని. తర్వాత ఆయన నన్ను "ఎప్పుడైన వెలుతురు నీ కగపడు చుండునా" అని అడిగినాడు. "ఔను, స్వామీ, అగపడుచుండును. నిద్ర వచ్చుటకు ముందు నా నొసటియొద్ద నొక జ్యోతిసుడియుచు కన్పించును" అని నే నంటిని.

మహేంద్రుడు:— ఆ జ్యోతి నీకు ఇప్పుడుకూడ అగపడు చుండునా?

నరేంద్రుడు:—తఱచు అగపడుచునే ఉండినది. యదుమల్లిక్ వనమందిరమున ఒకనాడు గురుదేవుడు నన్ను తాకి తనలో తానే ఏమో గొణుగుకొనెను. నాకు బాహ్యలోకస్మృతి పోయినది. ఆ స్పర్శ ప్రభావ మొక మత్తువలె నెలదినములు నిలిచి యుండినది.

నాకు పెండ్లి చేయు మాటలు జరుగుచున్న వని విన్నంతనే ఆయన కాళీమాతృపాదములను పట్టుకొని విలపించెను. అశ్రుపూర్ణ నయనుడై "అమ్మా, (పెండ్లిప్రయత్నమును) అంతటిని తలక్రిందులు చేయుము. నరేంద్రుని మునిగి పోనీకుము" అని లోకజననిని ప్రార్థించెను.

మా తండ్రి మరణానంతరము మా యమ్మయు నా సోదరులును తిండి లేక పస్తుండిరి. ఒకనాడు అన్నదగుహ అను నతనిని కలసి కొన్నప్పుడు గురుదేవు డతనితో "నరేంద్రుని తండ్రి మరణించెను. అతనికుటుంబము చాల పేద స్థితిలో ఉన్నది. ఇప్పుడు అతని మిత్రు లెవరైన అతనికి కొంత ధనసాహాయ్యము చేసిన బాగుండును" అనెను.

అన్నదగుహ వెడలి పోయిన తర్వాత నే నాయనను చీవాట్లు పెట్టితిని. "ఆ సంగతుల నన్నిటిని అతనితో నేల చెప్పితిరి" అంటిని.

నేను ఇట్లు చీవాట్లు పెట్టగా ఆయన విలపించి "అయ్యో! నీకొఱకై నేను ఇంటింటికి పోయి యాచించుటకై నను వెనుదీయను" అనెను.

ఆయన మమ్ము వశపఱచుకొన్నది తన ప్రేమచేతనే. కాదా?

మహేంద్రుడు:—అందులకు ఇంచుకేని సందేహము లేదు. పూర్తిగ నిస్వార్థమైన ప్రేమ ఆయనది.

నరేంద్రుడు:—ఒకనాడు తనతో నేను ఏకాంతముగ ఉండగా ఆయన నాకొక సంగతిని చెప్పినాడు, అచ్చట వేఱెవ్వరును లేరు. దయచేసి ఆ సంగతిని నీవును ఎవరికిని చెప్పకుము.

మహేంద్రుడు:—నేను చెప్పనే చెప్పను. ఆయన చెప్పిన సంగతి యేమి?

నరేంద్రుడు:—ఆయన అన్నాడు: "గూఢశక్తులను చూపుట నాకు శక్యము గాదు. కాని నీ ద్వారా అయినచో నేను చూపగలను. ఏమందువు?" "చూపలేరు. మీరు ఆలాగు చూపలేరు" అని నే నంటిని.

ఆయనమాటలకు నేను నవ్వుచుండెడివాడను. ఈ సంగతుల నన్నింటిని ఆయనయే చెప్పగా మీరు వినియుందురు. ఆయనకు కల్గుచుండిన భగవద్దర్శనములన్నియు ఆయనగారి మనోవిభ్రమకల్పనలే అని నే నంటిని.

ఆయన నాతో అన్నాడు: "నేను కుఠి పైకప్పుమీఁది కెక్కి ఓ భక్తులారా, మీ రందఱును ఎచ్చట నున్నారు? రండి నాయొద్దకు. ఓ భక్తులారా, నేను మరణింప నున్నాను. మీరు కనిపింపరేని నాకు మరణము తప్పదు" అని ఆహ్వానించుచుంటిని. భక్తులు తప్పక వత్తురని లోకజనని నాకు తెల్పినది. చూచితిరా, చెప్పినదంతయు నిజమగుచున్నది".

నేను వేఱేమి చెప్పగలను? ఊరకుంటిని.

ఒకనాఁడాయన గది తలుపు మూయించి నన్ను గూర్చి దేవేంద్రబాబుతోను, గిరీశబాబుతోను "అత డెవరో అతనికి తెలిపితి

మేని ఇక నతడు దేహమును నిలుపుకోడు" అని చెప్పెను.

మహేంద్రుడు:—అవును, మేము విన్నదే ఆ సంగతి. దానిని మాతోకూడ ఎన్నోపర్యాయములు చెప్పియున్నాడు. ఒకసారి కాశీపురవనమందిరమున నిర్వికల్పసమాధిదశలో నీ వెవరవో నీవు కనుగొంటివి. నిజమేనా?

నరేంద్రుడు:—అవును. ఆ యనుభవ మప్పుడు నాకు దేహమే లేన ట్లనిపించినది. నా ముఖము మాత్రమే నాకు కనిపించుచుండినది. గురుదేవుడు మేడ పైగదిలో నుండెను. నాకు ఆ అనుభవము కలిగి నది, మేడక్రింద. నేను ఏడ్చుచుంటిని. "ఏమి వాటిల్లినది నాకు?" అని అంటిని. పెదగోపాలు గురుదేవుని గదిలోనికి పోయి నరేంద్రు డేడ్చుచున్నాడని చెప్పెను.

నేను గురుదేవుని దర్శించినప్పుడు ఆయన నాతో "ఇప్పుడు నీకు తెలిసిపోయినది. కాని తాళపుచెవిని నేను నాయొద్దనే ఉంచు కొందును" అనెను.

నాకు పాటిల్లినది ఏమి అని నే నాయన నడిగితిని.

అందుల కాయన భక్తులవైపు చూచి "ఇత డెవరో ఇతనికి తెలిసిపోయిన ఇక నితడు దేహమును నిలుపుకోడు. కాని ఇతని కన్నులకు నే నొక గంతను కట్టిపెట్టియున్నాను" అనెను.

ఒకదినము ఆయన "నీవు కోరుదువేని నీ హృదయములో కృష్ణుని సాక్షాత్కరించుకోగలవు" అని నాతో చెప్పెను.

"కృష్ణునందును, గిష్ణునందును నాకు నమ్మకము లేదు" అని నే నంటిని. (మహేంద్ర, నరేంద్రు లిరువురును నవ్వుదురు).

ఒక వింత విషయమును నేను గుర్తించితిని. కొంతమంది మనుష్యులను, వస్తువులను, స్థలములను చూచినప్పుడు వానిని పూర్వ జన్మములో ఎప్పుడో చూచినట్లు అనిపించెడిది. చిరపరిచితములవలె అవి నాకు తోచెడివి. ఒకనాడు నేను కలకత్తాలో ఆంహర్స్ట్ వీథి లోని శరత్తునింటికి పోయితిని. తక్షణమే శరత్తుతో ని ట్లంటిని:

"ఈ యిల్లు నాకు పరిచితముగ నున్నదే. ఇందలి గదులు త్రోవలు తక్కినభాగములు ఎంతోకాలముగ నే నెఱిగియున్నట్లున్నది".

నేను దేనినిగాని నాకుతోచినట్లే చేయుచుంటిని. గురుదేవుడు ప్రవేశము కల్గించుకొనకయే యుండెను. నేను సాధారణ బ్రాహ్మ సమాజసభ్యుడ నైన విషయము నీ వెఱిగినదే గదా?

మహేంద్రుడు:—అవును, దానిని నే నెఱుగుదును.

నరేంద్రుడు:—బ్రాహ్మసమాజసమావేశములకు మహిళలును వచ్చుచుందు రనుట గురుదేవు డెఱుగును. మహిళ కంటి యెదుట ఉండునేని మానవునకు ధ్యానము సాగదు. కావున ఆయన బ్రాహ్మ సమాజమువారి ధ్యానమును తప్పుపట్టుచుండెను. మఱి, నన్నచ్చటికి పో వలదని ఆయన చెప్పలేదు. కాని ఒకదినము "నీవు బ్రాహ్మ సమాజసభ్యుడ వను విషయమును రాఖాలునకు తెలియనీయకుము; తెలిసిన అతనికిని బ్రాహ్మసమాజసభ్యుడగు బుద్ధి పుట్టును" అని నన్ను హెచ్చరించెను.

మహేంద్రుడు:—నీ మనోబలము ఎక్కువ. కావున నీవు సమాజమునకు పోయినను ఆయన నిన్ను వారింపకుండెను.

నరేంద్రుడు:— మిక్కుటములైన కష్టములను, బాధలను అనుభవించిన మీదట అందులఫలితముగనే ఇట్టి మనఃపరిస్థితి నాకు కుదురుకొన్నది. అట్టి కష్టములను నీ వనుభవింపలేదు. కష్టములును, ఆపదలును లేకున్న మానవునకు అంతటిని దేవునికి విడిచిపెట్టి పూర్తిగ ఆయనపై ఆధారపడియుండు చిత్తవృత్తి కుదురదని నా కిప్పుడు స్పష్టపడినది.

సరి, ఆయన... అంత వినయ విధేయతలు కల్గియున్నాడు. అహంకారగంధమే లేకున్నాడు. అంతటి వినయము అలవఱచు కొనుటకు దారి ఏమైన ఉన్న నాకు ఉపదేశింతువా?

మహేంద్రుడు:—నీ యహంకారమునుగూర్చి ప్రసంగించుచు గురుదేవుడు "ఎవరిది ఆ యహంకారము?" అనినాడు.

నరేంద్రుడు:—ఆయన భావ మేమి?

మహేంద్రుడు:—నీ ద్వారా తాను నిర్వహింపవలసిన పెక్కు పనులకై దేవుడే నీయందు అట్టి యహంకారము నుంచియున్నాడని గురుదేవుని యభిప్రాయము.

ఇతర భక్తుల ప్రస్తావము వచ్చినది.

నరేంద్రుడు:—విజయగోస్వామినిగూర్చి "ఇతడు తలుపుతట్టు చున్నాడు" అనెడివాడు గురుదేవుడు.

మహేంద్రుడు:—అనగా అత డింకను గదిలో ప్రవేశింపలే దన్నమాట. శ్యాంపుకూరులో విజయుడు గురుదేవునితో "మిమ్ము నేను ఢాకాలో ఇంత ప్రత్యక్షముగనే చూచితిని" అని చెప్పినాడు. నీవును అచ్చట ఉంటివి గదా.

నరేంద్రుడు:—దేవేంద్రబాబును, రాంబాబును సన్న్యసింప గోరుచున్నారు. అందుల కెంతో ప్రయత్నించుచున్నారు. ఇక రెండేండ్లకు సర్వసంగపరిత్యాగము చేయుదునని రాంబాబు నాతో ఏకాంతమున చెప్పెను.

మహేంద్రుడు:—రెండేండ్లకు పిమ్మటనా? పిల్లలకు ఆస్తి పాస్తులు చేర్చిపెట్టిన తరువాత గాబోలు!

నరేంద్రుడు:— అంతే గాదు. ఇప్పటి తన భవనమును బాడుగ కిచ్చి ఒకచిన్నయింటిని కొనబోవుచున్నాడు. అతని కూతు పెండ్లికి కావలసిన యేర్పాట్లను ఇతర బంధువులు చేయుదురు.

1887 వ సంవత్సరము ఏప్రిలు తే 8 ది శుక్రవారము.

ఉదయము ఎనిమిదిగంట లప్పుడు బరానగరమఠమున నొక గదిలో ఇరువురు భక్తులు మాటాడుకొనుచుండిరి. అం దొకడు గృహస్థుడు, ఒకడు సన్న్యాసి. ఆ సంభాషణ జరుగుచున్నప్పుడే మహేంద్రుడు ప్రవేశించెను. ఆ భక్తు లిద్దఱి వయస్సు సమానమే. ఇరువదినాల్గేండ్లో, ఇరువదిఐదేండ్లో. మహేంద్రుడు మఠములో

మూడుదినములు గడపుదమనుకొనెను. పూజాగృహమునకు బోయి గురుదేవునకు మ్రొక్కెను. నరేంద్రుని, రాఖాలును, ఇతరశిష్య సోదరులను దర్శించి కడపట ఈ భక్తులిద్దఱును మాటాడుకొనుచుండు గదిలోనికి వచ్చెను. గృహస్థభక్తుడు సన్న్యసింప గోరుచుండెను. ఆ యుద్యమము మానుమని బోధింప జూచుచుండెను సన్న్యాసి.

సన్న్యాసి:—ఈ లోకములో నీకు మిగిలియుండు ఆ ఒకటి రెండు కర్తవ్యాలను నీ వేల పూర్తిచేయరాదు. అచిరకాలములోనే అవి నీకు వెనుకబడిపోవును.

ఒకమానవునితో "నీవు నరకమునకు బోవుదువు" అని ఎవరో అన్నారట. "నరక మనగా ఎట్లుండును" అని అతడు తన మిత్రు నడిగెను. అంతట నా మిత్రుడు సీమసున్నపుముక్కతో నేలపై నరకచిత్రమును చిత్రింప సాగెను. చిత్తరువు వ్రాయుట పూర్తి అయినదో లేదో తక్షణమే ఆ నరకమునకు బోవలసినవాడు ఆ చిత్తరువుపై బడి పొర్లుగింతలు పెట్టి "నరకమంతయు చుట్టివచ్చితిని" అనెను.

గృహస్థుడు:—నాకీ సాంసారికజీవితమునందు రుచిలేనే లేదు. ఆహా! ఇచ్చట మీ రెంత హాయిగా నున్నారు.

సన్న్యాసి:—నీ కంతటి కోరిక ఉండినచో ఏల సన్న్యసింపవు? ఊరక దానినిగూర్చి అన్ని మాట లేల? కాని మఱల చెప్పుచున్నాను. కడసారిగా నీవు ఈ వినోదమును ఏల అనుభవింపవు?

శశి నిత్యారాధనము ముగించెను. సుమారు పదునొకండు గంట లప్పుడు శిష్యసోదరు లందఱును గంగలో స్నానము చేసి మఠమునకు మరలిరి. మడిబట్టలను ధరించి గుడికి పోయి దేవనమస్కృతి చేసి కొంతసేపు ధ్యానించిరి.

దేవునకు నైవేద్య మయినంతనే వారును భుజించిరి. మహేంద్రుడును వారితో భుజించెను.

సాయంకాల మైనది. దేవతలయు, దేవేరులయు పటముల యెదుట కర్పూరము వెలిగింపబడెను. ఆరాధనము జరిగినది. రాఖాలును, శశియు, పెదగోపాలును, హరీశుడును పెద్దకూటములో కూర్చుండి యుండిరి. గుడిలో గురుదేవునకు నివేదించు అన్నము విషయమున ఎక్కువ జాగ్రత్త వహింపవలయునని రాఖాలు శిష్య సోదరులలో ఒకనిని హెచ్చరించెను.

రాఖాలు:—(శశి మున్నగువారితో) ఒకనాడు గురుదేవునకు సమర్పింపబడిన భక్షణములలో కొంతను ఆయన ఆరగించుటకు ముందు నేను తింటిని. దానిని చూచి ఆయన "నీముఖమును నేను చూడలేను. ఇట్టి పనిని నీ వెట్లు చేయ కల్గితివి" అని నన్నడిగెను. నేను విలపించితిని.

పెదగోపాలు:—కాశీపూరులో ఒకదినము ఆయన భుజింపవలసిన అన్నముపై నా నిశ్శ్వాసము సోకినది. అంతట ఆయన "పారవేయుము ఆయన్నమును" అన్నాడు.

మహేంద్ర నరేంద్రులు గతకాలసంభవములను స్మరించుచు వరాండాలో పచారు చేయు చుండిరి.

నరేంద్రుడు:—నాకు దేనిలోను నమ్మకము లేకుండెను.

మహేంద్రుడు:— దేనిలోను అనగా దేవునిరూపములలో దేనిలోను అని అర్థమా?

నరేంద్రుడు:— గురుదేవుడు చెప్పుచుండిన విషయములలో అధికభాగమును నేను ఆమొదటిదినాలలో అంగీకరింప కుంటిని. అప్పుడాయన నన్ను "అంత నమ్మకము లేనివాడవు నీ విచ్చటికి రానేల" అని సైత మడిగినాడు. మిమ్ము దర్శింప వచ్చుచున్నానే గాని మీ మాటలను వినుటకు గాదు, అని నే నంటిని.

మహేంద్రుడు:—అందుల కాయన ఏ మన్నాడు?

నరేంద్రుడు:—ఆయన మిక్కిలి సంతోషించినాడు.

1887 వ సంవత్సరము ఏప్రిలు తే 9 ది శనివారము.

మఠసాధువులు భోజనానంతరము ఇంచుక విశ్రమించియుండిరి. నరేంద్రమహేంద్రులు మఠమునకు పడమట నున్న తోటలో ఒక చెట్టుక్రింద కూర్చుండిరి. అది ఏకాంత మైన చోటు. వే రెవ్వరును అచ్చట లేరు. నరేంద్రుడు, శ్రీరామకృష్ణునితో తనకు కల్గిన యనుభవములను మహేంద్రునకు చెప్పుచుండెను. అప్పటికి వయస్సు నరేంద్రున కిరువదినాల్గు సంవత్సరములు, మహేంద్రునకు ముప్పది రెండు సంవత్సరములు.

మహేంద్రుడు:—ఆయనకును నీకును కల్గిన ప్రథమసమావేశము నీజ్ఞప్తిలో స్పష్టముగ నుండి యుండ వలెను గదా.

నరేంద్రుడు:—ఆ నాడు నేను రెండు పాటలను పాడితిని.

ఆ పాటల నిప్పుడు మరల మహేంద్రునకై నరేంద్రుడు పాడెను.—ఒకటి—

మరలుదము మనస మన నెలవునకు,
మనది గా దీ భూమి, మన మేల యిచట
ఏ లక్ష్యముఁ లేక యెప్డు గ్రుమ్మరుట ?
ఈ మేను మనది గా, దీ ప్రాణు లెల్ల
మన వారు కాఁబోరు, మఱి భూతపంచ
కమున నొక్కటి యైనఁ గాఁబోదు మనది.
ఎవరినో ప్రేమించి యిటుల నో మనస,
నిన్నును నీవారి నేల మఱచెదో ?
సత్యమార్గము పట్టి చక్కఁ బై కెక్కు.
మలయ కో చిత్తము, యీ దారి నీకు
ప్రేమయే దీప మై వెలు గిచ్చు గాక.
పాథేయ మా నీదు భవ్యగుణతతి.
వాని దాఁచు మెలఁకువఁ మానఁ బోకు,

మా ధనంబు హరించు నదనుకై దొంగ
లున్నార లిద్దఱు, లోభ మొక్కండు,
భ్రాంతి యొక్కండును, బరఁగ నీ వాని
హాని నుండి మనుప నాంతర శాంతి
నాత్మ నిగ్రహమును నంగరక్షకులు
గ ననవరతము నీకడ నిల్పుకొనుము.
సాధు సంగతియె యాఁ జక్కని విడిది,
అందుఁ దీర్చుకొనుమ యలసట నీవు.
దారి తెలియ దేని తగ నట నున్న
కాపరి నడుగుము దాపక సుంత.
దారి ని న్నే దేని దద్దరిల్లంగఁ
జేసిన, దేవుని శ్రీనామములను
బిగ్గఱగాఁ బాడు, విడును నీ వెఱపు.
ఆ దారి నేలెడి యధిపుఁ డాతండు
వానికి మ్రొక్కక పాయఁగ లేఁడు
యముఁ డైనఁ గాని, సంయమనీశుఁ డైన.

రెండవది—

దేవాధినాయక దినములు నాకు
నేగనే వలయునే యిటుల రిత్తగను ?
రాత్రింబగళ్లు విరామంబు లేక
తహతహపడుచు సదా కాచి యుంటి,
సర్వలోకము లేలు స్వామివి నీవు,
నేనకించనుఁడను నేర్తునె యడుగ
'ర'మ్మంచు 'నాహృది రమియింపు' మనుచు ?
పేదగుడిసె నాదు పేదహృదయము,

దాని వాకిలి తల్పు తగఁ దెరవఁబడి
యే యున్న, దొకసారి యిం పారు కరుణ
నందుఁ బ్రవేశించి యడపుము దప్పి.

మహేంద్రుడు:— నీపాటలను విన్న పిదప ఆయన ఏ మన్నాడు?

నరేంద్రుడు:—ఆయన సమాధి నిమగ్ను డైనాడు. రాం బాబుతో "ఎవ డీ కుఱ్ఱవాడు? ఎంత బా గున్నది ఇతని పాట". అన్నాడు. నన్ను మరల ర మ్మన్నాడు.

మహేంద్రుడు:— నీకు ఆయనతో రెండవ సమావేశము ఎక్కడ?

నరేంద్రుడు:— రాజమోహను నింట. మూడవ సమావేశము మరల దక్షిణేశ్వరములోనే. మూడవసారి కలసికొన్నప్పుడు ఆయన సమాధిదశ నొందిన వాడై దేవుని స్తుతించుటగా నన్ను స్తుతింప నారంభించెను. "ఓ నారాయణా, నాకొఱకై నీ వి ట్లవతరించితివి" అన్నాడు నాతో. ఈ విషయమును, దయచేసి, ఎవరితోను చెప్పకుము.

మహేంద్రుడు:—ఇంకను ఏ మన్నా డాయన?

నరేంద్రుడు:—ఈలాగు అన్నాడు: "నాకొఱకై నీ వి ట్లవతరించితివి 'కామినీ కాంచన సంగ మించు కేని లేని సద్భక్తులతోడి సమాగమానందము నాకు లభింపకున్న నేను భువిపై బ్రతుకలేనే తల్లీ' అని లోకజననితో నేను మొఱపెట్టుకొంటిని". తర్వాత ఆయన నాతో "రాత్రి నీవు నాయొద్దకు వచ్చి నన్ను నిద్రలేపి 'ఇదిగో వచ్చితి నండి', అంటివి" అని చెప్పినాడు. కాని అందుంగూర్చి నే నేమియు ఎఱుగను. నేను కలకత్తాలో మాయింట గాఢ నిద్రలో నుంటిని.

మహేంద్రుడు:—అనగా నీవు ఏకకాలములో ఉండనుగలవు,

లేకుండను గలవు అన్న మాట. ఇది దేవుని సాకారతానిరాకారతల వలె ఉన్నది.

నరేంద్రుడు:— ఈ సంగతిని నీవు వే తెవ్వరితోను చెప్ప గూడదు సుమా. కాశిపూరులో ఉండగా ఆయన తన శక్తిని నా లోనికి సంక్రమింప జేసినాడు.

మహేంద్రుడు:— కాశిపూరు వనమందిరమున చెట్టుక్రింద నిప్పు రాజచేసికొని దాని కెదుట నీవు ధ్యానించుచున్న దినాలలో కదా అది?

నరేంద్రుడు:— ఔను. ఒకనాడు ధ్యానించుచున్న నేను కాళిని నాచేతిని పట్టుకొ మ్మంటిని. 'నీ యొడలిని తాకిన విద్యుచ్ఛక్తిని తాకినప్పుడు కలుగునట్టి కుదిలింత కలిగినదే నాదేహము నకు' అన్నాడు కాళి.

మఱి ఈ సంగతిని నీవు ఇచ్చట ఎవరికిని తెలుప రాదు. తెలుప నని మాట యిమ్ము.

మహేంద్రుడు:—ఆయన తనశక్తిని నీలోనికి సంక్రమింపజేసి నందుల కొక ప్రత్యేక ప్రయోజన మున్నది. నీద్వారా ఆయన ఎంతో సాధింప నున్నాడు. ఒకనాడు గురుదేవుడు ఒక కాగితముపై "లోకులకు ఉపదేశింపబోవువాడు నరేంద్రుడు" అని వ్రాసెను.

నరేంద్రుడు:—ఉపదేశించుట గిపదేశించుట నేను చేయ నని ఆయనతో నంటిని. అందులకు ఆయన "నీ యెముకలే చేయు నోయి ఆ పనిని" అని చెప్పినాడు. ఆయన శరత్తును నాకు అప్పగించినాడు. శరత్తులో ఇప్పుడు భగవత్తృష్ణ పొటెక్కినది. కుండలిని మేలు కాంచినది. గురుదేవుడు నన్ను నారాయణా అని పిలిచెడివాడు.

మహేంద్రుడు:—ఔను, నే నెఱుగుదును.

నరేంద్రుడు:—కాశిపూరులో ఉండగా ఆయన "తాళపుచెవి ప్రస్తుతము నాచేత ఉన్నది. తా నెవ రైనది తెలిసికొన్న తత్క్షణమే ఇతడు శరీరత్యాగము గావించును" అన్నాడు.

మహేంద్రుడు:—నీవు నిర్వికల్పసమాధిదశలో ఉన్నప్పుడు కదా ఆయన ఆలాగు అన్నది?

నరేంద్రుడు:—ఔను, ఆ దశలో నాకు శరీరము లేనట్లని పించినది. మోముమాత్ర మున్నట్లు తెలియనగుచుండెను.

పరీక్షలకై నే నప్పుడు ఇంటియొద్ద 'లా' (న్యాయశాస్త్రము) చదువుచుంటిని. తటాలున "నే నిప్పుడు చేయుచున్న దేమి?" అని నాలో నేనే అనుకొంటిని.

మహేంద్రుడు:— గురుదేవుడు కాశిపూరులో ఉండినప్పటి కథ గదా అది?

నరేంద్రుడు:— ఒక వెఱ్ఱివానివలె నేను మా యింటినుండి పరుగెత్తి వచ్చితిని. "ఏమి కావలెనోయి నీకు" అని ఆయన నన్నడిగి నాడు. "సమాధిలో నిమగ్నుడనై ఉండ వలెను, అది నా కోరిక" అంటిని నేను. అందులకు ఆయన "ఎంత సంకుచిత మోయి నీమనస్సు! సమాధికి పైదశ నందుకో. సమాధి ఒక లక్ష్యము కానే కాదు" అని చెప్పినాడు.

మహేంద్రుడు:—ఔను, జ్ఞానదశకు పైది విజ్ఞానదశ ఒకటి యున్న దని ఆయన చెప్పుచుండెడివాడు. పైయంతస్తు నందుకొన్న వాడు. మరల మెట్లమీద పైకిని క్రిందికిని రాకపోకలు చేయుట వంటిది, ఆ విజ్ఞానదశ. నిన్ను గుఱించి ఆయన ఇంకను ఏ మేమి చెప్పినాడు?

నరేంద్రుడు:—ఒకసారి ఆయనతో నేను "మీకు అగపడు భగవానుని రూపములు మొదలైనవి మీభ్రాంతికల్పనలే" అని అంటిని. నా మాటలయందు ఆయనకు ఎంత విశ్వాసమో, వెంటనే గుడిలోని అమ్మవారి సన్నిధికి పోయి నే నేమంటినో చెప్పి "ఇవన్నియు భ్రాంతికల్పనలేనా" అని అమ్మవారి నడిగినాడు. ఇవన్నియు సత్యములే అని అమ్మవారు తనకు తెలిపిన దని ఆయన నాతో తర్వాత చెప్పినాడు.

ఆయన నాతో మఱొకప్పుడు అన్న మాట ఇది—"నీవు పాట పాడుచున్నప్పుడు (తన గుండెను తాకుకొనుచు) ఇచట వేంచేసి ఉన్న స్వామి బుసకొట్టి పడగ విప్పి నిశ్చలముగ నిగుడుకొని విను సర్పమువలె వినుచుండును" అని. నీకును జ్ఞప్తి ఉండ వచ్చును ఇది.

నన్ను గుఱించి ఆయన ఎన్నో విషయాలు చెప్పినాడు. సందేహము లేదు. కాని నేనే మనుభవించితిని?

మహేంద్రుడు:— ఇచటి యువకుల కెల్ల నీవు అపేక్షకుడవైతివి. బాధ్యత పూర్తిగా నీదే. ఈ మఠములో ఉన్న నీతమ్ములను పెంచి పెద్ద చేయ వలసిన వాడవు నీవు.

నరేంద్రుడు:— గురుదేవు నాజ్ఞానుసారమే మనము మన జ్ఞానసాధనల నన్నిటిని జరుపుకొనుచున్నాము. కాని మనసాధనలను రాంబాబు ఖండించి మాటాడునే, అది వింత. "శ్రీరామకృష్ణుని మేము చూచి యున్నాము. ఎందులకు ఈ సాధనలు?" అన్నాడు రాంబాబు.

మహేంద్రుడు:—లోకులు తమతమ నమ్మకముల చొప్పున నడచుకొందురు గాక.

నరేంద్రుడు:—మఱి గురుదేవుడు మమ్ము ఈసాధనలను చేయుడు అన్నాడు గా.

నరేంద్రుడు తనపై గురుదేవున కుండిన ప్రేమను గూర్చి మరల మహేంద్రునితో చెప్పు చుండెను.

నరేంద్రుడు:— నాకై ఆయన లోకజననిని ఎన్నిసార్లు ప్రార్థించినాడు! మా నాయనగారు మరణించిన పిమ్మట, నాకు ఇంట తిండి లేక, మా సోదరులును అమ్మయు పస్తుండిన దినాలలో సైతము మాకు ధన మిమ్మని ఆయన లోకమాతను ప్రార్థించినాడు.

మహేంద్రుడు:—ఔను. నే నెఱుగుదును. ఒకసారి నీవే చెప్పితివి నాతో.

నరేంద్రుడు:— మఱి నాకు ధన మేమో కొంచెముకూడ

లభింప లేదు. తనతో లోకజనని చెప్పిన మాటను గురుదేవుడు నాకు తెలిపినాడు. ''కుడువను కట్టను మాత్రము అతనికి లభించుచుండును'' అన్న దట అమ్మ.

నాపైని ఆయన ప్రేమ అతిమాత్రము. ఐనను నామనసులో అపవిత్రభావము ఎప్పుడు ప్రవేశించినను అది వెంటనే ఆయనకు తెలిసిపోవుచుండెను. అన్నదునితో చుట్టుచున్నప్పుడు నేనుఒక్కొక్క సారి దుర్జనుల సాంగత్యమున బడుచుంటిని. అట్టి సందర్భాలలో నేను తాకిన అన్నమును గురుదేవుడు తిన లేకుండెను, అన్నము చేతి లోనికి తీసికొన్నను నోట వేసికో లేక పోయెడివాడు. ఆయన వ్యాధి గ్రస్తుడుగా ఉన్నప్పుడు అట్టి సందర్భ మొకనాడు గల్గినది. అన్న కబళమును నోటి దాక ఎత్తినాడు కాని, అది నోటిలోనికి పోలేదు. ''నీ కింకను సుస్థిరత కలుగ లేదోయి'' అన్నా డాయన నాతో.

అప్పు డప్పుడు నాలో అవిశ్వాసము ఎక్కు వగుచుండును. బాబురాము నింట నుండగా నాకు దైవము మొదలగునవి లే వని, సర్వము 'నాస్తి' యని తోచినది.

మహేంద్రుడు:— అట్టి దశలను తానుగూడఅనుభవించితి నని గురుదేవుడు చెప్పుచుండెను.

మహేంద్రనరేంద్రు లిరువురును మౌనముగ నుండిరి. తర్వాత మహేంద్రుడు ''మీా రందఱును ధన్యులు. రాత్రింబగళ్లు మీా ధ్యానము గురుదేవునిపైనే'' అనెను.

నరేంద్రుడు:—కాని, అది ఎంత స్వల్పము! భగవత్సాక్షా త్కారమేమో కలుగకే ఉండగా, శరీరత్యాగము చేయుద మను బుద్ధి మాకు పుట్టనే లేదే.

అది రాత్రివేళ. నిరంజనుడు పూరినుండి అప్పుడే మరలి వచ్చెను. మఠసాధువులును మహేంద్రుడును మహానందముతో అతనికి స్వాగత మొసంగిరి. నిరంజనుడు వారికి తా ననుభవించిన వానిని తెలుపుచుండెను. అప్పటికి అతని వయస్సు సుమారు ఇరువది యైదు సంవత్సరములు.

సాయంపూజ ఐనది. శిష్యసోదరులలో కొందఱు ధ్యాన వ్యగ్రులై యుండిరి. కాని వారిలో అధిక సంఖ్యాకులు నిరంజనుని పరివేష్టించి పెద్దహాలులో కూర్చుండి, ప్రసంగించుచుండిరి. తొమ్మిది గంటలకు తర్వాత శశి, దేవునకు నైవేద్య మర్పించెను.

మఠసాధువులు రాత్రిభోజనమును ముగించిరి—ఇంట చేసిన రొట్టె, కాయకూర కొంత, బెల్లము కొంత — ఇవే వారు ఆరగించిన పదార్థములు.

1877 వ సంవత్సరము మే నెల తే 7 ది శనివారము.

ఆ నాడు వైశాఖ పూర్ణిమ, కలకత్తాలో మహేంద్రుడు చదువుకొనుగదిలో ఒక మంచముపై అతడును నరేంద్రుడును ఆసీనులై మాటాడుకొనుచుండిరి. నరేంద్రుడు వచ్చుటకు ముందు మహేంద్రుడు వెన్నీసువర్తకుడు (మెర్చంటు ఆఫ్ వెనిస్), కోమస్ అను నాప కాలను బ్లాకీ రచించిన ఆత్మసాధన (సెల్ఫ్‌కల్చర్) అను గ్రంథమును జదువుచుండెను. అవి అతడు పాఠశాలలో తాను పాఠము చెప్పు గ్రంథములు.

నరేంద్రునకును మఠములోని అతని సోదరశిష్యులకును బ్రహ్మాను భవతృష్ణ నిండుగ నుండెను. గాఢవైరాగ్యాగ్ని వారిహృదయము లలో మండుచుండినది.

నరేంద్రుడు:—నాకు ఏదియు లక్ష్యము లేదు. ఇప్పుడు నీతో మాటాడుచున్నాను కదా, కాని ఈ నిమిషముననే ఇటనుండి లేచి పరారి ఔద మని యున్నది.

నరేంద్రుడు కొన్ని నిమిషములు మౌనముగ గూర్చుండి తర్వాత 'బ్రహ్మానుభూతికై నేను ప స్తుండి చత్తును'' అనెను.

మహేంద్రుడు:—అది మంచిది. దేవునకై ఏమైనను చేయ వచ్చును.

నరేంద్రుడు:— ఒకవేళ నేను నా యాకలికి నిలువలేక పోయినచో—

మహేంద్రుడు:—అప్పుడు ఏదైనను కొంచెము తిని, మరల మొదటినుండి ఆరంభింపుము.

నరేంద్రుడు కొన్ని నిమిషములు మౌనముగ నుండెను.

నరేంద్రుడు:—దేవు డున్నట్లే కనిపించుట లేదే. నే నింత మొఱపెట్టుకొన్నను బదులు లేదే, లేనే లేదే!

నాకు గలిగిన దర్శనానుభవములు ఎన్ని! సువర్ణాక్షరపంక్తులుగ వెలుగొందు మంత్రము లెన్ని! కాళికాదేవి దర్శనా లెన్ని! ఇతర దివ్య రూపాలు ఎన్ని! ఐనను నాకు శాంతి లభింప లేదే.

దయచేసి నీవు నాకు ఆఱుకానులు ఇచ్చెదవా?

బరానగరమఠమునకు పోవుటకై నరేంద్రుడు బండిబాడిగ నడిగెను. అప్పుడే సత్కారి ఒకబండిలో వచ్చి దిగెను. సత్కారి నరేంద్రునకు సవయస్కుడే. అతనికి మఠ సాధువు లన్న ఎంతో ప్రేమ. అతని బస మఠమునకు దగ్గఱే, నౌకరి కలకత్తాలో. బండి అతని సొంతము. మహేంద్రుడు ఇచ్చిన ఆఱుకానులను తిరుగ నతనికే యిచ్చి వేసి, నరేంద్రుడు సత్కారిబండిలో అతనితో గూడ పోవుదు ననెను, మహేంద్రునిచే వారికి కొంత ఫలాహార మిప్పించెను.

ఆ మిత్రు లిరువురితో మహేంద్రుడును బరానగరమఠమునకు పోయెను. మఠములోని సోదరులు ప్రొద్దు నెటు పుత్తురో సాధన లెటు చేయుదురో అతడు చూడ గోరెను, శిష్యుల డెందములలో శ్రీరామకృష్ణగురుదేవుడు ప్రతిబింబించుచున్న రీతిని గూడ చూడ గోరెను. నిరంజనుడు మఠములో లేడు, అమ్మను చూచుట కింటికి పోయెను. ప్రపంచములో అతని కుండిన చుట్టము ఆమె ఒక్కతెయే. బాబురామును శరత్తును కాళియు పూరికి పోయి యుండిరి. వారచ్చట కొన్నాళ్లపాటు ఉండ మనుకొనిరి.

మఠసాధువులకు విచారణకర్త నరేంద్రుడు. అప్పటికి కొన్నాళ్ల

నుండి ప్రసన్నుడు* అతి తీవ్ర సాధనల జేయుచుండెను. ఈశ్వర సాక్షాత్కారమునకై మరణాంతనిరశనవ్రతమును పూనవలె నను తన కోరికను నరేంద్రు డతని కొకసారి తెలిపి యుండెను. నరేంద్రుడు కలకత్తాకు పోయియుండినపుడు ప్రసన్నుడు మఠమునుండి పోయెను. పోయిన దెచ్చటికో తెలియదు. ఈ విషయమును విన్నంతనే నరేంద్రుడు "అతని నేల పోనిచ్చినాడు రాజా†" అనెను. కాని ఆ సమయాన రాఖాలును మఠములో లేడు, దక్షిణేశ్వరమునకు షికారు పోయి యుండెను.

నరేంద్రుడు:— రాజాను రానిండు మఠమునకు. అతనిని చీవాట్లు పెట్టెదను. అతడు ప్రసన్న నేల పోనిచ్చినాడు? (హరీశునితో) నే నెఱుగుదును. నీవు దొడ్డికాళ్లతో నిలబడి అతనితో ఉపన్యసించు చుండియుందువు. అతనిని పోనీయక అడ్డగింప లేకపోయితివా?

హరీశుడు మెల్లనిగొంతుతో "మనసోదరుడు తారకుడు అతనితో పో వల దన్నాడు. అన్నను అతడు పోనే పోయినాడు" అనెను.

నరేంద్రుడు :— (మహేంద్రునితో) చూచితివా, ఎంత చిక్కులో పడియున్నానో. ఇక్కడ కూడ నేను మాయాప్రపంచము లోనే చిక్కుకొనియున్నాను. ఈ పిల్లవాడు ఎక్కడికి పోయినాడో ఎవ డెఱుగును?

రాఖాలు దక్షిణేశ్వరమునుండి వచ్చెను. ప్రసన్నుడు మఠము నుండి వెడలిపోయిన వార్తను అతనికి నరేంద్రుడు తెలిపెను.

---

* శ్రీరామకృష్ణుని యువశిష్యులలో శారదాప్రసన్ను డొకడు, శా రంద అతనిని ప్రసన్ను డని వ్యవహరించుట వాడుక.

† 'రాఖాల్రాజ్' అనగా గొల్ల బాలుర ప్రభు వని యర్థము. అది కృష్ణుని పేళ్లలో ఒకటి. రాఖాలును అతని సోదరు లెల్ల 'రాజా' అని పిలుతురు. శ్రీకృష్ణు నంతరంగసహచరులలో నిత డొకడుగ నుండె నని గురుదేవుడు ఎన్నో సార్లు చెప్పి యున్నాడు.

ప్రసన్నుడు నరేంద్రునకొక జాబు వ్రాసి పెట్టి పోయెను. ఆ జాబులోని సారాంశ మిది — "నేను బృందావనమునకు పాదచారినై పోవుచున్నాను. ఇక్కడ ఉండుట నాకు చాల ఉపద్రవకరముగ ఉన్నది. ఇక్కడ నా మనస్సు మార్పుకు లోనౌచున్నది. ఇంతకు మును పెల్ల కలలలో నాకు నా తల్లిదండ్రులును ఇతరబంధువులును కనిపించుచుండువారు. తర్వాత మాయారూపిణియగు మహిళయే కనిపించినది. రెండు నాళ్లు దెబ్బ తింటిని. ఇంటి యొద్ద నున్న చుట్టాల వద్దకు పోవలసి వచ్చినది. కావున వారికి చాల దూరముగ పోవుచున్నాను. 'ఇంటియొద్ద నున్నట్టి నీ చుట్టాలు ఏమైనను చేయగలరు, వారి నెప్పుడు నమ్మకుము' అని గురుదేవుడు నన్ను ఎచ్చరించి యున్నాడు".

రాఖాలు:— అతడు వెడలి పోవుటకు కారణాలు ఇవి. ఒకసారి ఈలాగు కూడ అన్నాడు — 'అమ్మను సోదరులను* చూచుటకై నరేంద్రుడు తఱచు ఇంటికి పోవుచుండును. కుటుంబవ్యాజ్యమును విచారించుకొనుచుండును. అతనిని చూచిన నాకును అట్లే చేయుదమను బుద్ధి పుట్టునేమో అని దిగులగుచున్నది' — అని.

నరేంద్రుడు పలుకకుండెను.

యాత్రలు చేయుటను గూర్చి రాఖాలు వారితో ప్రసంగించుచుండెను. ఇట్లనెను — "ఇచ్చటే ఉండి, మనము సాధించినదేమియు లేదు, దేవుని సాక్షాత్కరించుకొమ్మని గురుదేవుడు సదా చెప్పుచుండెను. మనము సాక్షాత్కరించుకొనగలిగితిమా?"

రాఖాలు నేలపై పరుండెను. ఇతరభక్తులును పరుండియో కూర్చుండియో ఉండిరి.

రాఖాలు:— నర్మదకు పోవుదము.

నరేంద్రుడు:— దిమ్మతిరిగి నీవు ఏమి సాధింతువు? జ్ఞానమును

---

* ఏకశేషవృత్తిచే అక్కచెల్లెండ్రను అన్నదమ్ములను అందఱను కలిపి 'సోదరులు' అనవచ్చును.

గూర్చి ఇంత ప్రసంగించుచున్నావే, అది ఎవరికైనను ఏనాటికైనను సిద్ధించునదేనా ?

ఒకభక్తుడు:—అటు లగుచో, మీ రేల సన్న్యసించితిరి?

నరేంద్రుడు:—భగవత్ప్రాప్తి కలుగక పోయినంత మాత్రముననే పిల్లలను కనుచుండ వలసినదేనా? ఏమిటోయ్ నీ మాటలు!

నరేంద్రుడు బయటి కెక్కడికో పోయి కొన్ని నిమిషములలో తిరిగి వచ్చివేసెను. రాఖాలు ఇంకను నేలపై పరుండియే యుండెను.

పరుండియున్న మఠసాధువు మఱియొకడు భగవద్విరహదుస్సహతను అభినయించుచు శ్రోతలకు చిరాకు గలుగునట్లుగా నిట్లనెను — అయ్యో! ఇక నేను జీవించి లాభము లేదు. ఈ బాధను నేనిక నోర్వలేను. దయచేసి యొక కత్తిని తెమ్ము.

నరేంద్రుడు :— (తీవ్రభావము కలవానివలె అగపడుచు) కత్తియా అదిగో అచ్చట నున్నది. చేయి సాచి తీసికొమ్ము.

అందఱును నవ్విరి.

ప్రసన్నుని గూర్చిన ప్రసంగము వచ్చినది.

నరేంద్రుడు:—ఈ సందర్భమున గూడ మనము మాయలో తగుల్కొన్నాము. మన మెందులకు సన్న్యాసుల మైతిమో నాకు తెలియుట లేదు.

అది మునిమాపు వేళ. శశి పూజామందిరమున శ్రీరామకృష్ణునిపటము నెదుటను, తక్కిన గదులలో నున్న వేఱు దేవతలయు, దేవేరులయు పటముల యెదుటను కర్పూరము వెలిగించెను.

సాయంపూజ ప్రారంభమైనది. మఠసాధువులును ఇతర భక్తులును గుడి వాకిట ముకుళితకరులై నిలబడి ఆరతి చూచుచుండిరి. గంటలును, తాళములును మ్రోగుచుండ వా రందరును శివస్తోత్రమును బృందగానముగ పాడిరి.

వారి రాత్రిభోజన మగునప్పటికి పదునొకండు గంట లైనవి.

శిష్యసోదరులు మహేంద్రునకై ఒకపాన్పును సిద్ధపఱచిరి. అందఱును నిద్రించిరి.

అర్ధరాత్రియప్పుడు మహేంద్రుడు బాగుగ మేలుకొని యుండెను. తనలో తాను, "ఇచ్చట అంతయు మునుపటివలెనే యున్నది. ఇది ఆ అయోధ్యయే. కాని రాముడుమాత్ర మిచ్చట లేడు" అనుకొనెను. మౌనముగ అతడు తనపాన్పును వీడి ఏగెను. అది వైశాఖపూర్ణిమ రాత్రి. బుద్ధదేవుని జన్మదినము, ప్రబోధ దినము, నిర్యాణదినము. ముప్విధముల బౌద్ధులకు పరమపవిత్ర దినము. మహేంద్రుడు గురుదేవుని ధ్యానించుచు గంగాతీరమున ఒంటరిగ తిరుగుచుండెను.

అది భానువారము. అంతకు ముందు దినమే వచ్చిన మహేంద్రుడు బుధవారమువఱకు అచ్చటనే ఉందమని పన్నాగించు చుండెను. గృహస్థభక్తులు మఠమునకు సాధారణముగ ఆదివారము నాడు వచ్చుచుందురు.

యోగవాశిష్ఠపఠనప్రవచనములు జరుగుచుండెను. ఈ గ్రంథ బోధనలనుగూర్చి శ్రీరామకృష్ణుడు చెప్పగా మహేంద్రుడు కొంత వినియుండెను. జగన్మిథ్యాత్వమును, జీవబ్రహ్మైక్యమును ఆ గ్రంథము ప్రతిపాదించును, మహేంద్రుడు మొదలగు గృహస్థభక్తులను అద్వైత మార్గమున జ్ఞానసాధన చేయవలదని గురుదేవుడు నిషేధించియుండెను. ఏల యన ఇంకను దేహమే ఆత్మ యనుకొనుచుండెడివారికి తాము బ్రహ్మముకంటె అభిన్నుల మనుకొనుట చెఱుపు చేయును. తన్ను దాసునిగను భగవంతుని స్వామిగను అనుసంధించుకొనుటే అట్టి భక్తునకు శ్రేయమని గురుదేవుడు చెప్పుచుండెడివాడు.

ప్రసంగవశమున యోగవాశిష్ఠప్రస్తావము వచ్చినది.

మహేంద్రుడు:—సరే, యోగవాశిష్ఠములో బ్రహ్మజ్ఞాన నిరూపణ మేలా గున్నది?

రాఖాలు:—ఆకలి, దప్పి, నొప్పి, ఆనందము — ఇత్యాదు

లెల్ల మాయయే. బ్రహ్మప్రాప్తికి మనోలయ మొక్కటే మార్గము.

మహేంద్రుడు:—మనస్సు లయించిన పిమ్మట ఏమి మిగులునో అది బ్రహ్మము. సరేనా?

రాఖాలు:—అవును.

మహేంద్రుడు:—శ్రీరామకృష్ణుడు చెప్పదలంచిన విషయమే అది. నష్టూడు ఆయన కాలాగే బోధించినాడు.

నరేంద్రాదిభక్తులు స్నానమునకై గంగకు పోవుచుండిరి. మహేంద్రుడును వారి వెంట నేగెను. ఎండ చాల తీవ్రముగ నుండినది. కావున మహేంద్రుడు తన గొడుగును తెచ్చుకొనెను. బరానగరము నుండి వచ్చిన శరత్తు అను భక్తుడుకూడ వారితో కూడ స్నానమునకు పోవుచుండెను. అతడు మఠమునకు తఱచు వచ్చువాడే.

మహేంద్రుడు:— (శరత్తుతో) ఎండ చాల తీక్ష్ణముగా నున్నది.

నరేంద్రుడు:— నీవు గొడుగు తెచ్చుకొన్నందులకు అది సమాధానమా?

మహేంద్రుడు నవ్వెను.

మఠసాధువులు కాషాయవస్త్రములను ధరించి యుండిరి.

మహేంద్రుడు:— (నరేంద్రునితో) ఎండ నిజముగనే చాల దుస్సహముగ నున్నది. ఎండపెట్టుకు మూర్ఛ వచ్చునట్లున్నది.

నరేంద్రుడు:—నాకు చూడగా, నీ వైరాగ్యమునకు నీ దేహమే అడ్డుతగులుచున్నది. అంతేనా? దేవేంద్ర బాబూ, నిన్ను గూర్చి నే ననుచున్నది.

మహేంద్రుడు నవ్వి "ఇది వట్టి దేహమేనా" అని తనలో అనుకొనెను.

స్నానానంతరము భక్తులు మఠమునకు మరలిరి. పాదత్రాణ

నము చేసికొని పూజామందిరమున ప్రవేశించిరి, దేవునకు మ్రొక్కి-పువ్వు లర్పించిరి.

మఠప్రాకారమునకు పడమట విశాలకానన మొకటి గలదు. మహేంద్రు డచట ఒకచెట్టుక్రింద ఆసీనుడై యుండగా తటాలున ప్రసన్ను డగపడెను. అప్పుడు సుమారు మధ్యాహ్నానంతరము మూడు గంటలు.

మహేంద్రుడు:— ఎక్కడ నుంటి వోయి ఇన్నాళ్లును? అందఱును నీకై ఎంతో వ్యథ చెందిరి. సోదరులను చూచితివా? ఎప్పుడు వచ్చితివి?

ప్రసన్నుడు:—ఇప్పుడే. సోదరులను చూచుటకూడ అయినది.

మహేంద్రుడు:—బృందావనమునకు బోవుచున్నా నని చీటి వ్రాసి పెట్టి పోయితివే. నీకై మేము అత్యంతవ్యథపాలైతిమి. ఎంత దూరము పోయితివి?

ప్రసన్నుడు:—కోన్నగరమువఱకే.

ఇద్దఱును నవ్విరి.

మహేంద్రుడు:—కూర్చుండుము. ఆ సంగతి నంతటిని నాకు చెప్పుము. మొదటి మజిలీ ఎక్కడ?

ప్రసన్నుడు:—దక్షిణేశ్వరమందలి గుడితోట మొదటిమజిలీ. రాత్రి అచ్చట గడపితిని.

మహేంద్రుడు:—(చిఱునవ్వు నవ్వుచు) హాజ్రాపరిస్థితి ఇప్పు డెట్లున్నది?

ప్రసన్నుడు:—హాజ్రా నన్నే యడిగినాడు. "నన్ను గుఱించి నీ అభిప్రాయ మే మయ్యా" అని.

ఇద్దఱును నవ్వుదురు.

మహేంద్రుడు:—(చిఱునవ్వు నవ్వుచు) నీ వేమంటివి?

ప్రసన్నుడు:—ఏమియు అన లేదు నేను.

మహేంద్రుడు:—తరువాత ?

ప్రసన్నుడు:—తరువాత తనకై నేను పోగాకు తెచ్చితి నేమో యని అడిగినాడు.

ఇద్దఱును నవ్విరి.

ప్రసన్నుడు:—నన్ను తనకు పరిచర్య చేయు మన్నాడు. (నవ్వు)

మహేంద్రుడు:—అక్కడినుండి ఎక్కడకు పోయితివి.

ప్రసన్నుడు:—క్రమక్రమముగ కొన్నగరుకు చేరుకొంటిని. బట్టబయలులో రాత్రిని గడపితిని. ఇంకను ఆవలికి పోవుద మను కొంటిని. ఆ ప్రయాణమునకు రైలుటిక్కెట్టు కొనుటకు కావలసిన ధనము ఆ యూరిలో చిక్కునా అని కొంతమంది పెద్దమనుష్యుల నడిగితిని.

మహేంద్రుడు:—ఏమన్నారు వారు?

ప్రసన్నుడు:— దొరకిన ఒక రూపాయి దొరకునేమో. ప్రయాణమునకు కావలసిన ధనమంతయు ఎవ రిత్తురునీకు ? — అన్నారు వారు.

ఇద్దఱును నవ్విరి.

మహేంద్రుడు:— నీవు నీతో గూడ ఏ మేమి తీసికొని పోయితివి ?

ప్రసన్నుడు:—ఒకటి రెండు బట్టలు. గురుదేవుని పటము. ఆపటమును నే నెవ్వరికిని చూప లేదు.

శశియొక్కతండ్రి మఠమునొద్దకు వచ్చెను. తన కుమారుని ఇంటికి పిలుచుకొని పోవలె నని ఆయన కోరిక. శ్రీరామకృష్ణుని వ్యాధి దినాలలో శశి వెనుకాడని యుత్సాహముతో తొమ్మిదినెలల పాటు గురుదేవుని ఉపచరించెను. చదువులో అతని ప్రజ్ఞచే ప్రవేశ పరీక్ష అగుచుండగనే అతనికి విద్యార్థివేతనము (స్కాలర్‌షిప్పు) లభించినది. తరువాత బి. ఎ. వరకు చదివినాడు గాని పరీక్షకు

కూర్చుండ లేదు. అతనితండ్రి పాపము పేదబ్రాహ్మణుడు, హిందూ భక్తుడు. విశేషకాలమును సాధనలో గడపువాడు. శశి అతని జ్యేష్ఠ కుమారుడు. చదువు ముగిసినంతనే శశి ధనము గడించి కుటుంబపు ఆర్థిక క్లేశాలను తొలగించు నని తల్లిదండ్రు లాశపడిరి. మఱి శశి బ్రహ్మప్రాప్తికై సన్న్యసించెను. తల్లిదండ్రులను దలచు కొన్నప్పుడు మాత్రము అతని హృదయములో ఎక్కువ బాధ కలిగెడిది. ఎన్నో సార్లు కన్నీరు కార్చుచు అతడు తన మిత్రులతో "నాకర్తవ్యమునుగూర్చి నాకు పాలు పోవుట లేదు. అయ్యో! తల్లి దండ్రులకు సేవ చేయ లేక పోయితినే. వారికి ఎందులకును ఉపయోగ పడలేక పోయితినే. వారు నామీద ఎంత ఆశ పెట్టుకొని యుండిరి! మేము పేదవారము కాబట్టి మాఅమ్మకు నగలే లేవు. ఆమెకై కొన్ని నగలను కొనిపెట్టుద మను కోరిక నా కుండెడిది. మఱి ఇప్పుడు నాకోరిక లన్నియు పటాపంచ లైనవి. ఇప్పు డింటికి మరలుట నా కసాధ్యము. కామినీకాంచనములను విడువు మని నన్ను నా గురుదేవు డాజ్ఞాపించినాడు. ఇప్పుడు నేను ఊరక ఇంటికి మరల లేను". అని చెప్పియున్నాడు.

శ్రీరామకృష్ణుని నిర్యాణానంతర మైనను శశి ఇంటికి మరలి వచ్చు నేమో యని అతని తండ్రి ఆశపడెను. ఆ బాలుడు ఇంట కొన్నాళ్ళు గడపెను. గాని క్రొత్తమఠము నెలకొల్పబడిన పిమ్మట అచ్చటికి తఱచు రాకపోకలు చేయుచుండి అచ్చటనే ఉంద మని కొన్నాళ్ళలో తీర్మానించుకొనెను. ప్రోత్సహించి అతనిని ఇంటికి పిలచుకొని పోవుద మని తండ్రి మఠమునొద్దకు మాటిమాటికి వచ్చు చుండెను. కాని ప్రోత్సహింప లేక పోయెను.

ఈనాడు తమతండ్రి వచ్చినా డని విని శశి వే ఱొక దారి గుండ మఠమునుండి పాఱిపోయెను. తండ్రిని కలిసికొన నిచ్చగింప లేదు.

శశియొక్క తండ్రికి మహేంద్రుడు పరిచితుడే. వారిరువురును మాటాడుకొనుచు వరాండాలో పచారు చేయుచుండిరి.

శశిపిత:—ఈమఠమునకు విచారణకర్త ఎవరు? ఈ దుర్ణయమున కెల్ల కారకుడు నరేంద్రుడే. ఈ యువకు లెల్లరును ఇంగ్లీషుమరలి కొన్నాళ్ళపాటు చదువుకొనుచుండిరి.

మహేంద్రుడు:—ఇక్కడ ఎవరును స్వామి గారు. అందఱును సమానులే. నరేంద్రు డేమి చేయ గలడు? తన కిష్టము లేక ఒక మానవుడు గృహజీవితము విడిచి పెట్టునా? గృహస్థులము మే మున్నాము గదా, మా యిండ్లను విడిచి పెట్ట గల్గితిమా?

శశిపిత:—మీది సరి యైన పద్ధతి. లౌకికమును చూచుకొనుచున్నారు. భగవత్సేవయు చేయు చున్నారు. మీ పద్ధతిలో సాధన చేయరాదా? శశి ఆలాగు చేయ వలె ననియే మా కోరిక. ఇంటి యొద్ద ఉండనీ. ఇచ్చటికి వచ్చుచు పోవుచు ఉండనీ, అతనికై అతని తల్లి ఎంతగా ఏడ్చుచున్నదో నీ వెఱుగవు.

మహేంద్రుడును దుఃఖితుడై నిరుత్తరు డయ్యెను.

శశిపిత:—సాధువులను అన్వేషింప వలె నందు వేని మంచి సాధువును కనుగొనుట నే నెఱుగుదును. శశి అతని నాశ్రయించును గాక.

రాఖాలును, మహేంద్రుడును కాళిగదికి తూర్పున నున్న వరాండాలో పచారు చేయుచుండిరి.

రాఖాలు:— (అక్కఱతో) మహేంద్రా, మేము సాధన చేయుదుము, మేము శాశ్వత సన్న్యాసము చే గైకొంటిమి. సన్న్యసించుటచే భగవత్ప్రాప్తి కలుగలేదే. ఎందుల కీ పశ్చాత్తాప మని ఎవ రైన అధిక్షేపించి నప్పుడు నరేంద్రుడు చక్కని జవాబు చెప్పును. "భగవత్ప్రాప్తి కలుగక పోయినంత మాత్రమున మేము పిల్లలను కనుచుండ వలసినదేనా"—ఇది నరేంద్రుని జవాబు. బళే, నరేంద్రుడు తఱచు చక్కని విషయములు చెప్పుచుండును. నీ వతనినడిగిన బాగుండును.

మహేంద్రుడు:—నీవు చెప్పినది సరిగానే యున్నది. నాకు కూడగా భగవత్కృష్ణ నీలోగూడ హెచ్చెక్కి యున్నది.

రాఖాలు:—మహేంద్రా, నామనఃపరిస్థితిని నే నెట్లు వర్ణింప గలను. నేటి మధ్యాహ్నము నర్మదకు పోవుద మను నుబలాటము నాకు అతిమాత్రముగ కలిగినది. మహేంద్రా, దయచేసి సాధన చేయుము. లేకున్న నెగ్గ లేవు.

మగువ మోము చూచి కున్న చాలు నని అనేకులు తలం తురు. మగువ ఎదుటికి రాగనే చూపును నేలవైపు త్రిప్పుకొన్నంత మాత్రమున నీవు పొందు లాభ మేమి? ఇందుంగూర్చి నరేంద్రుడు నిన్న రాత్రి బలే బాగుగ చెప్పినాడు. ఏ మన్నా డనగా "మాన వునిలో కామ మున్నంతవఱకు కామిని యుండక తప్పదు. కామము పోయిన వానికి 'ఆడ' 'మగ' భేదము కనిపింపనే కనిపింపదు".

మహేంద్రుడు:—ఎంత నిజ మైన మాట అది! శిశువులు 'ఆడ' 'మగ' భేదమును పాటింపరు గదా.

రాఖాలు:— అందు కనియే మనము జ్ఞానసాధన చేయ వలెను. మాయ నతిక్రమింప కున్న జ్ఞాన మెట్లు సిద్ధించును?

మనము పెద్దహాలులోనికి పోదము. బరానగరమునుండి కొందఱు పెద్దమనుష్యులు వచ్చి యున్నారు. నరేంద్రుడు వారితో మాట్లాడుచున్నాడు. అతని మాటలను వినదము.

మహేంద్రుడు గదిలో ప్రవేశింప లేదు. బయట పచారు చేయుచున్నను లోపల జరుగుచున్న సంభాషణ అతనికి వినబడెను.

నరేంద్రుడు:—సంధ్యావందనము మొద లయిన అనుష్ఠాన ములకు కాలనియమము స్థలనియమము లేదు.

ఒకరు:—మహాశయా, జ్ఞానసాధనమాత్రముచేతనే ఈశ్వరుని సాక్షాత్కరించుకొన శక్య మగునా?

నరేంద్రుడు:— సాక్షాత్కారము దేవుని అనుగ్రహముపై నాధారపడియున్నది. దేవు ననుగ్రహము లేకున్న మన పూజా

రాధనలు ఏమియు ఉపయోగపడవు. కావున దేవుని శరణు పొంది తీఱవలెను.

అతడు:—మేము అప్పు డప్పుడు వచ్చి మీకు కొంత నెమ్మది చెఱచుచుందుము. అనుమతింతురా ?

నరేంద్రుడు:—మీకు తోచి నప్పు డెల్ల దయచేసి రండి. మేము గంగలో స్నానము చేయునది మీ ఘట్టములోనే.

అతడు:—అందులకు నే నేమియు చింతింపను. ఇతరులుకూడ ఆఘట్టమునకే రాకుండునట్లు దయచేసి చూడుడు.

నరేంద్రుడు:—మేము మీఘట్టమును వాడుకొనము లెండి, అదే మీ అభిప్రాయ మగుచో.

అతడు:—కాదు కాదు. అది గాదు నా అభిప్రాయము. ఆఘట్టములో ఇతరు లెవ్వరైన మీ కగపడిన అప్పు డచ్చటికి మీరు రాకుండుట మేలు.

అది మునిమాపు వేళ. సాయంపూజ ముగిసినది. అందఱును పెద్దహాలులో సమావేశ మైరి. మహేంద్రుడును అచ్చట ఆసీనుడై యుండెను. ప్రసన్నుడు గురుగీతను చదువుచుండెను.

నరేంద్రుడు ఇట్లు పాడెను:—

వందన మిడెదను పరమ గురునకు,
వందన మిడెదను భక్తి నిత్యునకు,
వందన మిడెదను పావనునకును,
వందనము పరమానందరూపునకు,
వందనము పరమానందప్రదునకు,
జ్ఞాన మోక్షాల సారునకు వందనము,
అద్వైతమూర్తికి నగు వందనంబు,
వ్యాప్తలోకునకును బరఁగు వందనము,
నిష్కళంకునకును నియతి వందనము,

త్రిగుణాతిగునకు నిదే వందనంబు,
సర్వదశాతీత, సాక్షి, యో దేవ,
వేదాంతవేద్య ఇవే వందనాలు.

నరేంద్రుడు మధురకంఠమున పాడుచుండగా భక్తుల మనస్సులు గాలి లేని చోట దీపజ్వాల వలె నిశ్చలము లైనవి.

రాఖాలు కాళీగదిలో కూర్చుండెను. ప్రసన్నుడును అతని యొద్దనే కూర్చుండెను. మహేంద్రుడుకూడ అచ్చటే యుండెను.

రాఖాలు తనభార్యను, బిడ్డను విడిచి సన్న్యసించెను. ఆయన డెందమున రాత్రింబగళ్ళు గాఢమైన రాగ్యాగ్ని మండుచుండెను. ఒంటరిగా నైన నర్మదా తీరమునకో మఱి యొక పవిత్ర క్షేత్రమునకో పోవుద మని అతడు తలపోయుచుండెను. మఠమునుండి పాఱి పోవలదని ప్రసన్నునకు బుద్ధులు చెప్ప నింకను ప్రయత్నించుచుండెను.

రాఖాలు:—(ప్రసన్నునితో) ఎక్కడికి పోవుద మని నీ కోరిక ? ఇక్కడ సాధువుల నడుమ నున్నావు. వారిని విడిచి దూరముగ బోవుట అవివేకము గదా. నీకు నరేంద్రునివంటివాడు వేఱొకడు ఎక్కడ లభించును?

ప్రసన్నుడు:—నా తల్లి తండ్రులు కలకత్తాలో నున్నారు. వారి ప్రేమ నన్ను ఆకర్షించుకొను నేమో అని నా భయము. దూర ప్రాంతముల కెచ్చటికైన నేను పాఱిపోగోరుట అందులకే.

రాఖాలు:—గురుమహారాజు ( =శ్రీరామకృష్ణుడు) మనలను ప్రేమించినంత గాఢముగ ప్రేమింప మన తల్లిదండ్రులకు శక్యమా ? ఆయన ప్రేమకు అర్హత కలవార మగుటకు ఆయనకై మన మేమి చేసితిమి? మన మనశ్శరీరముల సుస్థితికిని ఆత్మక్షేమమునకును ఆయన అంతగా ఆత్రపడుచుండెనే ఎందులకు ? దీని కృతజ్ఞతకిని అర్హుల మగుటకు ఆయనకై మనము చేసిన దేమి ?

మహేంద్రుడు:—(తనలో) భళీ రాఖాలు చెప్పినదే సరి.

కావుననే శ్రీరామకృష్ణునివంటివానిని నిర్హేతుకకృపాసముద్రుడు అని వర్ణించుట.

ప్రసన్నుడు:—(రాఖాలుతో) ఇక్కడినుండి పాఱిపోవుదమను తలంపు నీ కుండ లేదా ?

రాఖాలు:— అవును. అప్పు డప్పుడు నర్మదాతీరమున కొన్నాళ్ళు గడపుద మను కోర్కె కల్గుచుండును. అట్టిచోటున కెక్కడి కైననుపోయి ఒకవనములో సాధనలు సాగింత మని నాలో నే ననుకొనుచుందును. కాని తాళికుటీరోటులలో బసచేయుటకు నేను వెను కాడుచుందును.

తారకుడును, ప్రసన్నుడును పెద్దగాలులలో మాటాడుకొను చుండిరి. తారకునితల్లి చనిపోయినది. అంత్రి రాఖాలువలెనే రెండవపెండ్లి చేసికొనెను. తారకునకుగూడ పెండ్లి అయినది. భార్య మరణించినది. ఇప్పుడు మఠమే అతనికి ఇల్లు. ప్రసన్నుని ఇక్కడే ఉండు మని ప్రోత్సహింప నతడును ప్రయత్నించుచుండెను.

ప్రసన్నుడు:—నాకు జ్ఞానమును లేదు, దేవునందు ప్రేమయు లేదు. నాకు లోకములో అవలంబము ఏమి గలదు?

తారకుడు:—జ్ఞానప్రాప్తినొందుట కష్టమే, సందేహము లేదు. కాని నీకు ప్రేమ లే దని ఎట్లన గలవు ?

ప్రసన్నుడు:—ఇంతవఱకు నేను దేవునకై ఏడ్చి యుండ లేదు. నాకు ప్రేమ యున్న దని ఎట్లన గలను? ఇన్నాళ్ళుగ నే నేమి సాధించితిని ?

తారకుడు:—నీవు గురుదేవుని చూచిన వాడవే గదా. మఱి జ్ఞానము లే దని ఏల అందువు ?

ప్రసన్నుడు:—ఏ రకపు జ్ఞానమునుగూర్చి నీవు చెప్పుచున్నది? దేనిని గూర్చిన జ్ఞానము? నిజముగ బ్రహ్మజ్ఞానమే. మఱి నాకు దేవు డున్నా డనెడు గట్టి నమ్మకము సైతము లేదు.

తారకుడు:—అవును, అది నిజమే. జ్ఞాని మతములో దేవుడు లేడే.

మహేంద్రుడు:—(తనలో) ఆహా! భగవదన్వేషకులు ఇప్పుడు ప్రసన్నుడనుభవించుచున్న దశలను అనుభవింతురని గురుదేవుడు చెప్పుచుండెడివాడు. ఆ దశలో నున్నప్పుడు దేవుడు ఉన్నాడు అను విషయమే ఒక్కొక్కప్పుడు సందేహాస్పద మగుచుండును. తారకుడిప్పుడు బౌద్ధ వేదాంతమును చదువుచున్నాడట. అందువలననే జ్ఞాని మతమున దేవుడు లేడన్నాడు. కాని జ్ఞానికిని భక్తునకును చేరుకొను ప్రాప్య మొక్కటే యని గురుదేవుడు చెప్పుచుండెడివాడు.

నరేంద్రుడును ప్రసన్నుడును ధ్యానాగారమున మాటాడుకొనుచుండిరి. ఆ గదిలోనే మఱియొక వైపు రాఖాలుడును హరీశుడును చినగోపాలుడును కూర్చుండి యుండిరి. కొంత సేపైన తర్వాత పెదగోపాలుడు లోపలికి వచ్చెను.

నరేంద్రుడు భగవద్గీతాశ్లోకములను జదివి ప్రసన్ననకు వివరించి చెప్పుచుండెను —

*"పార్థా, అంతర్యామి. మాయచేత దేహాభిమానులగు జీవుల సంతతిని యంత్రమున నున్న బొమ్మలవలె త్రిప్పుచు నియమించుచు సకల జీవుల హృదయములలో వెలసియున్నాడు. అర్జునా, సర్వతోభావముగ ఆ యీశ్వరునే శరణు పొందుము. ఆయనకృప వలన పరమశాంతిని మోక్షమును పొందెదవు. ధర్మాధర్మానుష్ఠాన

* ఇది శ్రీ నిర్వికల్పానంద స్వాముల యనువాదము. మూలము:—XVIII 61, 62 & 66.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥
త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ ప్రసాదాత్ పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥
సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి, మా శుచః॥

ముల నన్నిటిని త్యజించి గర్భజన్మజరామృత్యువర్జితుడను సర్వాత్ముడను పరమేశ్వరుడను అగు నన్ను ఒక్కనినే ఆత్మరూపమున ఆశ్రయింపుము. నేను ఇట్లు నిశ్చిత బుద్ధి వైన నిన్ను ధర్మాధర్మ బంధనరూపము లగు పుణ్యపాపముల నుండి ముక్తి నంద జేయుదును, శోకింపకుము''.

నరేంద్రుడు:—కృష్ణు డే మన్నాడో గుర్తించితివా? 'యంత్రమున నున్న బొమ్మలు' అన్నాడు. అంతర్యామి మాయచేత సకల జీవులను యంత్రమున నున్న బొమ్మలను త్రిప్పినట్లుగ త్రిప్పుచుండును. దేవు నెఱుంగ గోరుటయా? క్రిములలో ఒక క్రిమి వైన నీవు దేవు నెఱుంగుటయా? క్షణ మాలోచింపుము. మానవు డేపాటి? ఆకసమున ప్రకాశించు కోటానకోట్ల నక్షత్రాలలో ఒక్కొక్కటియు ఒక 'సూర్యకుటుంబ' (సోలార్సిస్టు) మట. ఒకసూర్యకుటుంబములో ఒక భాగము మన భూమి. ఆ భూమియు మన పాలిటికి ఎంతో పెద్దదే. సూర్యునితో బోల్చి చూచిన ఈ భూమి ఒక చిన్న బంతిపాటిది. ఇందులో ఒక క్రిమివలె మానవుడు సంచరించుచున్నాడు.

నరేంద్రు డిట్లు పాడెను :

మట్టినుండియె కాదె పుట్టు వొందితిమి,
మట్టియే మా చూపు మఱుగుపఱచెడి,
పిల్ల లాడిన యట్లె పెద్దలుం గూడ
మట్టి యాటల ప్రీతి మరగి యున్నాము.
దీనుల పాలిటి దిక్కైన దేవ,
మమ్ము రక్షింతు నన్మాట యొసఁగవె.
పెడమోముతో మమ్ము విడనాడు దేని
ఒక తప్పుకై మమ్ము నోడి నుండి స్వామి,
నెట్టి వేసెద వేని, నేఱము మరల
శ్రేయ మొందఁగ, మేము చిరకాల మైన,

దెస మాలి యుందుము దిగ్భ్రాంతి నొంది.
చిట్టి పాపల మయ్యా, చిఱుతమతులము,
అడుగడ్డునను మాకు తడబాటె సుమ్ము.
భీకర ముఖము చూపించెద వేల
బోమముడి నీ మోము బోడ గాంచ నేల?
అల్పుల మో సామి, ఆగ్రహింపకుము.
తప్పు చేసిన నేని దయతోనె పలుకు.
ఉద్ధరింతువు మమ్ము నొగి నూఱు మార్లు.
పడిపోవుదుము మేము పదినూఱు మార్లు.
మనసు నిల్కడ లేక మఱి యేమి గల్గు?

తర్వాత సురేంద్రుడు ప్రసన్ననితో "భగవచ్చరణము శరణు చొరుము. పూర్తిగ భగవత్సంకల్పపరతంత్రుడవుగ నుండుము" అనెను.

శ్రీరామకృష్ణునిమాటలు నీకు జ్ఞప్తి లేవా? దేవు డొక చక్కెరకొండ. నీ వొక చీమవు. ఒక్క రవ చక్కెర చాలును నీ కడుపు నింపుటకు. ఆ కొండనే ఇంటికి చేర్చుకొంద మని నీవు తలపోయుదువు. ఇందులకే నేను కాళిని "ఓరీ మూర్ఖుడా, దేవుని నీ కొలతబద్దతోను నూలుతోను కొలిచెదవటరా" అని చీవాట్లు పెట్టితిని.

దేవుడు దయాసముద్రుడు. ఆయనకు దాసుడవుగ నుండుము. ఆయనను శరణు పొందుము. ఆయన అనుగ్రహించును. "సానుగ్రహమైన నీ మోముతో నన్ను రక్షింపుము. మిథ్యనుండి తథ్యమునకును, చీకటినుండి వెలుగునకును, మృత్యువునుండి నిత్యత్వమునకును నను జేర్పుము. నాకు ప్రత్యక్షమై సానుగ్రహావదనముతో నన్ను నెల్లప్పుడును కాపాడుము" అని దేవుని ప్రార్థింపుము.

ప్రసన్నుడు:—సాధకుడు ఎట్టి జ్ఞానసాధనను చేయవలెను?

నరేంద్రుడు:—భగవన్నామజపమే.

ప్రసన్నుడు:—ఇప్పుడేమో నీవు దేవుడున్నాడనుచున్నావు. చార్వాకుడు మొదలయిన పెక్కండ్ర మతానుసారము ఈ జగత్తు తనంతట ఉప్పతిల్లినదని చెప్పువాడవును నీవే.

నరేంద్రుడు:— నీవు రసాయనశాస్త్రమును చదువలేదా? వివిధ మూలద్రవ్యముల (ఎలిమెంట్సు) ను కలుపు వాడెవడు? జలవాయువును, ప్రాణవాయువును, విద్యుచ్ఛక్తిని కలిపి నీటిని పుట్టించువాడు మానవుడే. జ్ఞానసారమై వీని కన్నిటికిని నియామకమైన చిచ్ఛక్తి యొకటి యున్నదని అందఱును అంగీకరింతురు.

ప్రసన్నుడు:— దేవుడు దయామయుడని మన కెట్లు తెలియును?

నరేంద్రుడు:— వేదములు "నీ దయామయముఖమేదో" అనుచున్నవి. జాన్ స్టువర్టు మిల్లును ఆలాగే చెప్పినాడు. మానవుల డెందములలో కరుణను సృష్టించిన ఆ సర్వేశ్వరుడు ఎంత కరుణామయుడో — అనెను అతడు. "విశ్వాస మొక్కటే కావలసినది. దేవుడున్నాడు. మనకు చాల సమీపముననే ఉన్నాడు. విశ్వాసము ద్వారానే ఆయనను చూడదగును" అని గురుదేవుడును చెప్పుచుండెను.

ప్రసన్నుడు:—నీవు ఒక్కొక్కప్పుడు దేవుడు లేడందువు! ఇప్పుడు ఈ సంగతుల నన్నింటిని చెప్పుచున్నావు. ఒక్కదారివాడవుగావు నీవు. నీ అభిప్రాయములను నీవు మార్చుకొనుచుందువు.

అందఱును నవ్విరి.

నరేంద్రుడు:—సరే నయ్యా. ఇప్పుడు నేను చెప్పిన దానిని ఇక నెప్పుడును మార్చుకోను. మానవునకు లోభకామము లున్నంతవఱకును దేవుడు ఉన్నాడో లేడో అను సంశయ ముండును. చదువు కొంద మనియో విశ్వకళాపరిషత్ పరీక్షలో నెగ్గుదమనియో

పాండిత్యము గడింతమనియో — ఇవియు ఇట్టివియు కోరికలు మానవున కుండును.

భావోద్రేకముచే తన గొంతు కొతుకుపడుచుండ నరేంద్రుడు మరల పాడెను —

జయము మా స్వామికి, జయము దేవునకు,
సర్వార్థదాతకు జయ మౌత సతము,
శ్రేయఃప్రదాతకుఁ జెలఁగు జయంబు,
భయము వోఁగొట్టి యాపదలఁ బోకార్చి
కష్టాలఁ బాపి, లోకాలఁ గాపాడు
జగదీశ్వరా, నీకు జయము మంగళము.
నీ లోఁతగాధము, నీ కంతు లేదు,
నిస్సముండ, వమేయ నిరుపమానుఁడవు,
సర్వగతం బగు సత్యమే నీవు,
పరమాత్ముఁడవు, విశ్వపతి, వఖిలేశ,
జగదీశ్వరా, నీకు జయము మంగళము.
వరకృపాశాలి, విశ్వనుత, దేవేశ,
నీ దివ్య పాదాల కిదె వందనంబు.
బ్రతికియున్నప్పుడు, బ్రతుకు తీఱినను,
ఏకైకశరణంబ వీవె నా స్వామి.
నీ దివ్య పాదాల కిదె వందనంబు.
జగదీశ్వరా, నీకు జయము మంగళము.
దేవ మా వేఁడ్కోలిది యొకటి, వేఱు
వరమును దేనిని గోరఁగాఁ గలము?
ఇపుడు తత్త్వజ్ఞాన మిమ్ము పరేశ

తదనంతరము నీదు దర్శన మిమ్ము.
జగదీశ్వరా, నీకు జయము మంగళము.

మరల నరేంద్రుడు పాడెను. దేవుడు మన కెంత సమీపమున నున్నాడో వర్ణించుచు పాడెను. కస్తూరి, కస్తూరి మృగమునకు ఎంత సమీపమున నున్నదో అంత సమీపమున నున్నా డట దేవుడు మనకు. ఆలాగు చెప్పి నరేంద్రుడు సోదరశిష్యులను దివ్యానంద రసమును ముక్కు మునుగ గ్రోలు డని ప్రోత్సహించెను —

పసిప్రాయమున నేడ్పు, వరయౌవనమునఁ
బడతుల యధికార వశమున నునికి,
కడకు వార్ధకమునఁ గఫవాతపీడ —
ఇట్లుగా నొచ్చుచు నిపుడు శ్మశాన
మునకుఁ జేర్చెడి వాహామునకునై వేతు
విఁక నైన, యో సాధు, ప్రేమపాత్రమున
భగవదానందముం బాన మొనర్చి
మత్తిల్లువమా చొక్కుమా ఎల్ల వేళ.
కస్తూరిమృగనాభి ఘుమఘుమ వలచు
కస్తూరి యున్నది, కాని యా మృగము
నకు దాని దెలుప మనకు శక్య మగునె?
ఎఱుఁగకే యది వన మెల్లఁ జుట్టెడిని.
అట్లె సద్గురుబోధ నంద కెల్లెడల
గ్రుడ్డి నరుఁడు తాను గ్రుమ్మరుచుండు.

వరాండాలో నుండియే మహేంద్రుడు దీని నెల్ల వినెను.

నరేంద్రుడు లేచెను. ఈ యువకులతో ప్రసంగించుచు నాబుట్టి వే డెక్కిన దనుచు ఆయన గదినుండి వెలువడెను.

ఆయన వరాండాలో మహేంద్రుని కలిసికొని "దయచేసి త్రాగుటకు కొంచెము మంచినీళ్లిమ్మ" అనెను.

మఠసాధువులలో నొకడు "అటు లేని నీవు దేవుడు లేడని ఏల చెప్పెదవు" అని నరేంద్రు నడిగెను.

నరేంద్రుడు నవ్వెను.

1887 వ సంవత్సరము మే నెల తే 9 ది సోమవారము.

మఱునాటి ప్రొద్దున మహేంద్రుడు తోటలో నొక చెట్టుక్రింద నొంటరిగ కూర్చుండెను. అతడు తనలో నిట్లనుకొనెను: "శ్రీరామ కృష్ణుడు ఈ మఠములో నున్న సోదరుల నందఱిని కామలోభములను విడనాడునట్లు చేసెను. ఆహా! దేవుని సాక్షాత్కరించుకోవలె నను నుబలాటము వారి కెంత మిక్కుటముగ నున్నది! ఈ చోటు నిజముగ దేవలోకముగ మాఱినది. ఈ సోదరు లందఱును నారాయణ స్వరూపులు. గురుదేవుని నిర్యాణమై పెక్కుదినములు గాలేదు. కావుననే ఆయన భావములును ఆదర్శములును మా రొక్కొందక ఇంచు మించు అట్లే యున్నవి. గురుదేవుడు ఈ సోదరులను గృహములు వదలునట్లు చేసెను. కొందఱిని మాత్రము సంసారములోపల నుంచి నాడు. ముక్తిజెందు ఉపాయము వారికి లేదా?"

చెట్టుక్రింద నొంటరిగ కూర్చుండియున్న మహేంద్రుని చూచి నరేంద్రుడు మేడగదినుండి దిగి వచ్చెను.

నరేంద్రుడు:— లోకములో సంగరహితముగ జీవితమును గడపుట మున్నగు విషయములనుగూర్చి నీవు ప్రసంగింప వచ్చును గాని కామినీకాంచనాలను విడువనిదే నీ కేదియు సిద్ధింపదు. ఎవనికి వేదాంతబోధలందు ఆనందము లేదో, ఎవడు దివ్యానందామృతమును గ్రోలడో, వాని జీవితము వ్యర్థము. సన్న్యసించి కౌపీనసూత్రధారి గానిదే మానవునకు మోక్షము సాధ్యము గాదు. సంసారమును త్యజించి తీఱవలెను. మానవు డేల ఐహికపు వలలో చిక్కుకొని

యుండవలెను? ఏల మాయకు లోబడవలెను? మానవుని యథార్థ స్వరూప మేది? అతడు సాక్షాచ్ఛివుడే, శంకరుడే, చిదానంద మూర్తియే.

నరేంద్రుడు కృష్ణాష్టకశ్లోకములను చదివెను. ఆస్తోత్రమును వినుచున్న మహేంద్రుడు మంత్రముగ్ధుడై యుండెను, తనలో ఇట్లను కొనెను. నరేంద్రుని వైరాగ్యము ఎంత ఉత్కటము. ఈవిధముగనే ఇతడు మఠములో నున్న ఇతరసోదరుల హృదయములలోను వైరాగ్యమును నింపినాడు. వీరి సన్నిధి చాలును గురుదేవుని గృహస్థ భక్తుల హృదయములలో కామినీకాంచన త్యాగాభిలాషను ప్రబోధించుటకు. ఆహా పరిత్యక్తసర్వసంగు లైన ఈ సోదరు లెంత ధన్యులు! గురుదేవుడు మమ్ము కొందఱిని ఏల సంసారములోనే ఉంచినాడు? ఆయన మా కిక దారి చూపునా? వైరాగ్యమును ప్రసాదించునా? లేక ఐహికపరతచేతనే మమ్ము వంచించునా?

భోజనానంతరము అందఱును విశ్రమించి యుండిరి. పెద గోపాలు కొన్ని పాటలను చూచి వ్రాసికొనుచుండెను. నిరంజనుడు తనతల్లిని చూడ నేగి యుండెను. శరత్తును బాబురామును, కాళియు పూరిలో నుండిరి.

నరేంద్రుడు ఒకరిద్దఱు సోదరులతో కలకత్తాకు బయలు దేఱెను. అతడు తన వ్యాజ్యెమును విచారించుకోవలసి యుండెను. సోదరులు అతని యెడబాటు నోర్వ లేరు గావున నాటి సాయంకాల మునకే మరలి వత్త మని అత డనుకొనెను.

మధ్యాహ్నానంతరము రవీంద్రుడు వచ్చెను. చూచుట కతడు వెఱ్ఱివానివలె నుండెను. కాళ్ళకు చెప్పులు లేవు. మొలలో నల్లంచు బట్ట సగము పేలికమాత్రమే యుండెను. వెఱ్ఱివానికిం బోలె అతనికి కనుపాపలు సుడియుచుండెను. 'సంగతి యేమి టోయి' యని అందఱును అతనిని ఆత్రముతో నడిగిరి.

అత డిట్లన్నాడు. "నాకు ఊపిరి తిరిగి రానిండు. ఇప్పుడే

మీకు సర్వవిషయమును చెప్పెదను. నే నింటికి పోననుట నిజము. నేను మీయెల్లరతోబాటు ఇచ్చటనే యుండెదను. ఆమె నిజముగ ద్రోహి. మిత్రులారా, మీకు ఒక సంగతిని తెల్పెదను. ఐదేండ్లుగా సాగుచుండిన నా త్రాగుడును ఆమెకై నేను విడిచిపెట్టితిని. ఇప్పటికి ఎనిమిది నెలలుగా ఒక చుక్క మద్యము నైనను నేను త్రాగ లేదు. కాని ఆమె ద్రోహియే''.

మఠమున నున్న సోదరు లతనితో ''దయచేసి శాంతింపు'' మని 'ఎట్లు వచ్చితి వే' మని యడిగిరి.

అతనివస్త్రములోని రెండవ సగము నెచ్చట పోగొట్టుకొంటివో చెప్పు మనిరి.

రవీంద్రుడు:—ఆమె ఉన్న చోటును వీడి నేను వచ్చుచున్నప్పుడు ఆమె నా వస్త్రమును పట్టుకొని లాగినది. అందుచేత వస్త్రములో సగము చిరిగిపోయినది.

గంగలో స్నానముచేసి సంతాపమును చల్లార్చుకొనుము, తర్వాత నీ కథను మేము విందుము లే – అనిరి సోదరులు.

కలకత్తాలో ఒక పూజ్య కుటుంబమునకు చెందిన వాడు రవీంద్రుడు. అతని వయస్సు ఇరువదేండ్లో ఇరువది రెండేండ్లో. అతడు మొదట శ్రీరామకృష్ణుని దక్షిణేశ్వరమునొద్ద దర్శించి ఆయనచే ప్రత్యేకముగ దీవింప బడి యుండెను. ఒకప్పు డతడు గురుదేవునితో మూడు రాత్రులు గడపి యుండెను. ఎంతో మృదుమధుర మైన స్వభావ మాతనిది. అతనిపైని గురుదేవునకును ఎంతో ప్రేమ యుండెడిది. ఒకసారి రవీంద్రునితో ఆయన ఇట్లనెను — ''నీవు కొంతకాలము వేచి యుండ వలెను. కొన్ని అనుభవములను నీ వనుభవింపవలసియున్నది. ఇప్పు డేమియు చేయ లేము. ఇంట దొంగలు చొరబడ్డ వెంటనే పోలీసులు విశేషించి చేయగల దేమియు నుండదు. వారి దోపిడి ఇంచుమించు పూర్తి యగు సరికి పోలీసులు వారిని బంధింతురు.''

రవీంద్రుడు దైవభక్తుడు, దీనసేవాసక్తుడు. అతనిలో ఎన్నో మంచిగుణాలు ఉండినవి. ఆధ్యాత్మిక గుణాలు ఎన్నో ఉండినవి. కాని అతడు ఒక వేశ్యవలలో తగుల్కొన్నాడు. ఆమెచేత తాను వంచితుడైన సంగతి అతనికి తర్వాత తటాలున తెలిసినది. ఇంత కలవరపడి అతడు మఠమునకు పరుగెత్తి వచ్చుటకును, ఇక సంసారమునకు మరల రాదనెడి యతని నిశ్చయమునకును కారణ మది.

రవీంద్రుడు గంగ కేగి నప్పుడు ఒక భక్తు డతనికి తోడుగా పోయెను. సాధువుల గోష్ఠిలో రవీంద్రునిలో ఆధ్యాత్మిక చైతన్యము మేలుకో వలె ననుట ఆ భక్తుని హృదయాభిలాష. స్నాన మైనంతనే రవీంద్రుని ఆ భక్తుడు చెంత నున్న శ్మశానమునకు పిలుచుకొనిపోయి అట పడి యున్న పీనుగులను జూపి "మఠములోని సన్న్యాస సోదరులు దైవధ్యానమునకు ఇచటికి తఱచు వచ్చుచుండిరి. ధ్యానమునకిది మంచి చోటు. జగము క్షణభంగుర మను విషయ మిట స్పష్టముగ కనిపించుచుండును" అనెను.

రవీంద్రుడు ధ్యానించుటకై శ్మశానములో కూర్చుండెను. కాని ధ్యానము చాల సేపు సాగ లేదు. మనస్సులో అశాంతి యుండెను.

రవీంద్రుడును ఆ భక్తుడును మఠమునకు మరలి వచ్చిరి, దేవునకు మ్రొక్కుటకై పూజామందిరమున కేగిరి. "మఠములోని సోదరులు ధ్యానించున దీ గదిలోనే" అనెను రవీంద్రునితో ఆ భక్తుడు.

ధ్యానింత మని రవీంద్రుడు కూర్చుండెను గాని ఆ చోటను ధ్యానము చాల సేపు సాగ దాయెను.

భక్తుడు:—ఎట్లున్నది నీకు? మనస్సులో అశాంతి హెచ్చుగ ఉన్నదా? కూర్చున్న చోటునుండి లేచితివే, అందులకేనా? ఏకాగ్రత బాగుగ కుదుర్చుకో లేకున్నావేమో!

రవీంద్రుడు:—నేను సంసారమునకు మరలి పో ననుట నిశ్చయమే కాని, మనసుకు కుదురుపాటు లేకున్నది.

మహేంద్ర రవీంద్రులు మాటాడుచుండిరి. వేఱెవ్వరును అట లేరు. మహేంద్రు డతనికి బుద్ధుని జీవిత మందలి చరితములను జెప్పు చుండెను. ఆ దినాలలో మఠసాధువులు బుద్ధుని చరిత్రమును శ్రీ చైతన్యుని చరిత్రమును క్రమము తప్పక చదువుచుండిరి. దేవవనితలు కొందఱు పాడిన యొక పాటను విన్నపుడు బుద్ధునిలో ఆధ్యాత్మిక చైతన్యము మొదటిసారి మేలుకొన్న దట. ఆ విషయమును రవీంద్రు నకు మహేంద్రుడు తెలిపెను.

మహేంద్రుడు ఈ పాటను పాడెను —

విశ్రాంతికై మేము వెక్కుచున్నాము.
విశ్రాంతియా కనిపింప దెప్పుడును
నవ్వులు నువ్వులు మాటిమాటికిని
చక్రగతిని వచ్చి చనుచుండు నెప్డు.
ఎం దుండియో రాక! యెటు వైపొ పోక?
ఈ యాట రసహీన మిది యాడ నేలో!
గంతవ్య మేదియో కనుఁగొన మేము
ఎంత యాత్రమొ గొంటి, మే ఫలము లేదు.

నరేంద్ర - తారక - హరీశులు నాటి రాత్రియే కలకత్తా నుండి వచ్చిరి. కలకత్తాలో ఒక భక్తుడు వీరికి విందు వినోదాలు జరిపినా డట. "బలే, నేడు మనకు జరిగినది పెద్ద విందు" అన్నారు వారు.

మఠసాధువులు పెద్దహాలులో సమావేశమైరి. రవీంద్రుని కథను విన్నాడు నరేంద్రుడు, అతనికి ఉపదేశించుటగా ఇట్లుపాడెను :

విడుము మోహంబును, విడు మూర్ఖబోధ,
దేవు నెఱింగి యీ భవదుఃఖబాధ
నుండి ముక్తునిగ నిన్ను నొనర్చుకొమ్ము
క్షణికసుఖానకై సంపూర్ణముగను

నీ యాత్మనాథుని నిఖిలలోకేశు
మఱచిపోవుట కాదె మఱి సిగ్గుచేటు ॥

కొన్ని నిమిషాల పిదప సోదరులు కాళిగదికి పోయిరి. గిరీశ ఘోషు తన క్రొత్తగ్రంథాలు రెంటిని మఠమునకు అప్పుడే పంపెను. అవి – 'బుద్ధుని జీవితము' 'చైతన్యుని జీవితము'.

క్రొత్తమఠమును స్థాపించినది మొదలు శశి, ఏకాంతిక నిష్ఠతో గురుదేవుని పూజలోను పరిచర్యలోను తత్పరుడయ్యెను. అతని భక్తికి అందఱును అచ్చెరువందిరి. శ్రీరామకృష్ణుడు వ్యాధిగ్రస్తుడై యుండగా ఆయన భౌతిక శరీరము నెట్లు ఉపచరించెనో, వెనుదీయని యటువంటి ప్రతిపత్తితోనే, ఇప్పుడుకూడ శశి పూజా మందిరమున గురుదేవుని ఉపచరించుచుండెను.

మఠసాధువులలో ఒకడు 'బుద్ధుని జీవితము' 'చైతన్యుని జీవితము' అను గ్రంథములలోని కొన్ని భాగములను బిగ్గఱగ చదువుచుండెను, చైతన్యుని జీవితమును చదువునప్పుడు ఇంచుక ఛలోక్తుల నాడజొచ్చెను. నరేంద్రుడు పుస్తకము నతని చేతినుండి లాగికొని "ఇట్లు కదా మంచి విషయమును నీవు చెడగొట్టునది ?" అనెను.

చైతన్యుడు పాఱుని మొదలు పంచమునివఱకు ఎల్లరకును తన ప్రేమ నొసంగెను. ఆఘట్టమును వర్ణించెడి ప్రకరణమును నరేంద్రుడు చదివెను.

ఒకసోదరుడు:— ఒక రొకరికి ప్రేమ నొసంగ లేరని నే నందును.

నరేంద్రుడు:—గురుదేవుడు నా కొసంగెనే.

సోదరుడు:—నీలో ఇప్పుడది ఉన్నదని యేనా నీనమ్మకము?

నరేంద్రుడు:—ప్రేమనుగూర్చి నీ వేమి తెలిసికొనగలవోయి? నీవు దాసవర్గమునకు చెందినవాడవు. మీ రందఱును నాకు పరిచర్య చేయవలయును, పాదము లొత్తవలెను. అంతయు గ్రహించితి

మనుకొని గర్వింపకుడు, నేను పోగ ట్రాగ వలెను, పోయి దానిని సిద్ధపఱుపుము.

అందఱును నవ్విరి.

సోదరుడు:—చేయనే చేయను.

మహేంద్రుడు:— (తనలో) శ్రీరామకృష్ణుడు శక్తిని ఈ మఠములోని సోదరు లందఱిలోనికిని సంక్రమింప జేసినాడు. అది నరేంద్రున కొక్కనికే గుత్త కాదు. ఈ యంతర్జ్యోతి లేనిదే కామినీ కాంచనాల త్యజింప సాధ్యమా?

1887 వ సంవత్సరము మే నెల తే 10 ది.

అది మంగళవారము, దేవి నారాధించుట కది మిక్కిలి మంచి దినము. మఠములో దేవికి విశేషారాధన చేయుటకు ఏర్పాట్లు జరుగు చుండినవి.

మహేంద్రుడు స్నానమునకై గంగ కేగుచుండెను. డాబా మీద ఒంటరిగ పచారుచేయుచుండిన రవీంద్రునకు నరేంద్రుడు పాడు చుండిన నిర్వాణషట్కము వినబడినది.

లేదు మృత్యువు నాకు, లే దెట్టి భీతి,
లే దెంచఁగా జాతిభేదంబు నాకు,
లేరు తల్లియుఁ దండ్రి, లేదు జన్మంబు,
లేరు బంధులు నాకు, లేరు మిత్రములు,
లేఁడు గురు వొకండు, లేఁడు శిష్యుండు,
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ ॥
నిర్వికల్పుండను, నెఱి నిరాకార
రూపుండ, విశ్వస్వరూపుండ, నేను,
సక లేంద్రి యాతీగ సరణిని నుందు,
జ్ఞేయుఁడం గాను మోక్షితుఁడఁ గాఁబోను,
సచ్చిదానందుండ శంభుండ శివుఁడ ॥

స్నానము చేయుటకై రవీంద్రుడును గంగకే పోయెను, క్షణములోనే తడి బట్టలతో మఠమునకు మరలి వచ్చి వేసెను.

"అతడు గంగలో మునిగి వచ్చినాడు, అతనికి సన్న్యాసదీక్ష నిచ్చుట కిది మంచి సమయము" అనెను మహేంద్రునితో నరేంద్రుడు.

నరేంద్ర మహేంద్రు లిద్దఱును చిఱునవ్వు నవ్విరి.

ప్రసన్నుడు రవీంద్రునిచే తడిబట్టలను విప్పించి, కట్టుకొనుటకు కాషాయాంబరములను నిచ్చెను. "ఇప్పు డితడు త్యాగోపలక్షణ మైన వస్త్రమును దాల్ప నున్నాడు" అనెను నరేంద్రుడు మహేంద్రునితో.

మహేంద్రుడు:—(చిఱునవ్వుతో) ఎట్టి త్యాగము ?

నరేంద్రుడు:—ఎట్టిదో ఏల ? కామినీకాంచనాల త్యాగమే.

రవీంద్రుడు కాషాయమును ధరించి ధ్యానమునకై కాళీ గదిలో ప్రవేశించెను.



# అనుబంధము

## శ్రీ చైతన్యుడు

వంగదేశమున గొప్ప వైష్ణవాచార్యులలో శ్రీచైతన్యుడు ఒకడు. ఆయన క్రీ. శ. 1485–వ సంవత్సరమున నవద్వీపమందు అవతరించెను. నవద్వీపమునకే వ్యవహారమున నదియా అను నామాంతరము గలదు. ఆ కాలమున నదియా ప్రసిద్ధ విద్యాపీఠము. ముఖ్యముగ తర్క-విజ్ఞానమునకు అది పెట్టినది పేరు. భారతదేశమున అన్ని ప్రాంతములనుండియు విద్యార్థులు నవద్వీప విద్యాపీఠమునకు వచ్చి చదువుకొనుచుండిరి.

చైతన్యునితండ్రి సద్బ్రాహ్మణుడు, పేరు జగన్నాథమిశ్రుడు. తన చదువును పూర్తిచేసికొనుటకై ఆస్సాములోని సిల్హెట్టునుండి ఆయన నదియాకు వచ్చియుండి, అచట ఒక సుప్రసిద్ధ పండితుని పుత్రిక యైన శచీదేవిని పరిణయమై గృహస్థజీవనమున కుదుటవడెను. ఆయనకు బిడ్డలు పదుగురు జన్మించిరి. అందు కూతుండ్రు ఎనమండుగురు. వారు అందఱును చాల చిన్న వయస్సుననే మరణించిరి. కొడుకులు ఇద్దఱు. విశ్వరూపుడు పెద్దవాడు, అనంతర కాలమున చైతన్యుడని ప్రఖ్యాతి నందనున్న విశ్వంభరుడు రెండవవాడు. నదియాలోని తాత్త్వికవాతావరణము విశ్వరూపుని మనస్సును వశపఱచుకొన్నది. పదునాఱవ యేట అతని పెండ్లి నిశ్చిత మయ్యెను. కాని పెండ్లి జరుగవలసిన నాటికి ముందటి రాత్రియే అతడు సన్న్యసించి, భిక్షాపాత్రను యాత్రాదండమును చేపట్టి జ్ఞానాన్వేషణపరుడై ఐహికముల విడనాడెను.

ఇకను తల్లిదండ్రులకు నెమ్మదిగూర్ప మిగిలినవాడు విశ్వంభరుడొక్కడే. [నింబ=] వేపచెట్టునీడలో ఒక కుటీరమునం దవతరించినవాడగుటచే అతనికి నిమ్మాయ్ అను ముద్దుపేరు

కూడ నొకటి యుండెను. ఐదేండ్లప్పుడు సవయస్కులైన పిల్లలతో అతడును పాఠశాలలో చేరియుండవలసినవాడే ఐనను అమ్మ వలదన్నందున ఇంటియొద్దనే యుండెను. మిగిలిన బిడ్డ ఒక్కడే, వాడును భ్రాతత్రొక్కిన దారినే త్రొక్కునేమో అని శచీదేవి దిగులుపడుచుండెడిది.

నిమ్మాయికి చురుకుదనమును ఆటలపై మోజును మెండు. ధర్మనిష్ఠాపరులైన బ్రాహ్మణపండితులను తన కొంటె చేష్టలచే విసిగించి, ఎంతో కాలమునుండి మార్పొందక వచ్చుచున్న దేశాచార నియమాలను అతడు తాఱుమాఱు చేయుచుండెను. తోడి బాలురతో గూడి యతడు చేయు తోటల దోపిడి మున్నగు నేరములు ముద్దుగొలిపెడివి. పసిబాలికలనుగూడ అతడు సతాయించుచుండెను. విగ్రహాలను అపహరించియు, స్నానము చేయునప్పుడు బట్టలను దాచిపెట్టియు, ఇంక నిట్టి లీలలచే అతడు భక్తిపూజాతత్పరులైన వృద్ధ బ్రాహ్మణులను తఱచు కలవరపఱచుచుండెను. వర్ణ నియమాల నతడు ఇంచుకేని పాటింపడు. అశుద్ధమైన పెంటను, బ్రాహ్మణులకు అస్పృశ్యములైన వానిని, అతడు జంకు కొంకులు లేక స్పృశించెడివాడు. ఆ తెంపును జూచి తల్లిదండ్రులు అదరిపడుచుండిరి. తల్లి తిట్టినప్పుడు "అమ్మా, నన్ను బడికి పంప నంటివి, ఏమియు తెలియని నాకు శుద్ధమేదో అశుద్ధమేదో అదియుం దెలియదు, అన్నియును నా కొక్కటిగనే కనిపించుచున్నవే కాని శుద్ధాశుద్ధవిభేదము అగపడుట లేదు" అని అతడు బదులుచెప్పుచుండెను. ఆ జవాబు, వర్ణ విభేదాది నియమాలను అతిక్రమించిన సన్న్యాస చిత్తవృత్తిని సూచించుచున్నది.

ఇరుగుపొరుగువారి ప్రోత్సాహముచే జగన్నాథుడు తన సుతుని ఆఱవయేట సంస్కృతపాఠశాలలో జేర్చి గంగాదాస పండితునికి శిష్యునిగా అప్పగించెను. ఈ విధముగ అతడు ఆశ్రమములలో మొదటిదైన బ్రహ్మచర్యమున అడుగుపెట్టెను; అతనిది వయస్సునకు మించిన బుద్ధి. అచిరకాలములోనే అతడు తర్క

వ్యాకరణ మర్మములనుగూర్చి పండితులతో వాదింప దొరంకొనెను. చిన్ననాటి చుఱుకుదనము అతనికి పోలేదు. నదియాలో గాంభీర్య గౌరవ సంపన్నులయిన పండితులను ఎగతాళిచేయుటయే అతనికి వినోదముగ నుండెను.

ఇరువదేండ్ల వయస్సప్పటికే నిమ్మాయి పేరుప్రసిద్ధులు దశదిశల వ్యాపించినవి. ఆయన గంగాతీరమున సొంతముగ నొక విద్యాసంస్థను నెలకొల్పెను. ఆయన హాస్యప్రజ్ఞను తర్కనైపుణిని విని కని మోజుపడి విద్యార్థులు లెక్కకు మిక్కిలిగ అక్కడికి వచ్చి చేరుచుండిరి. ఇంతవఱకును తన బుద్ధిని పెంపొందించుకొనుటలోనే ఆసక్తి కలవాడుగ బయటివారికి అతడు కనిపించుచుండెను. అతనిలో గూఢముగ నున్న యాధ్యాత్మికౌత్సుక్యమును ఎవ్వరును గుర్తింపరైరి. ఆ యౌత్సుక్యమే అనంతరకాలమున అతనిని మహాచార్యపీఠము నధిష్ఠింపజేసెను. [తత్త్వవిషయికముగ] తీఱని సంశయములు నదియాప్రముఖుల కందఱకు నున్నట్లే అతనికిని ఉండెను. వారి కున్న ప్రజ్ఞాగర్వము కూడ అతనికి సంక్రమించెను. కాశీ మొదలయిన విద్యాపీఠములనుండి సుప్రసిద్ధపండితులు నదియాకు వచ్చి తర్క-వ్యాకరణాలంకారాది శాస్త్ర వాద గోష్ఠులలో పాల్గొనెడివారు. ఓడినవారు గెలుపొందినవారికి విజయపత్రములను అర్పించు నాచారముండెను. అట్టి వాద గోష్ఠులలో పెక్కింట నిమ్మాయి ప్రతిపక్షుల నోడించెను.

కొన్నాళ్ళకు అతడు పెండ్లియాడి, బ్రాహ్మణాచారప్రకారము రెండవదైన గృహస్థాశ్రమమున కుదురుకొనెను. ఇంచుమించు అదేసమయమున అతని తండ్రి మరణించెను. వెంటనే అతడు తన తండ్రికుటుంబము వసించుచుండిన ప్రాచ్యవంగమునకును అస్సామునకును పోయెను. అచ్చటి విద్వాంసులతో అతడు సాగించిన వాదములచే అతని పాండిత్య ప్రఖ్యాతి హెచ్చెను. తన యూరికి మరలి వచ్చుసరికి అతనికి భార్యావియోగదుఃఖము వాటిల్లినది. భార్య పాముకాటుచే మరణించెను. అమ్మ నోదార్చుటకై అతడు రెండవ

పెండ్లి చేసికొనెను కాని అచిరకాలముననే అతడు, అమ్మను చాల కష్టముతో ఒప్పించి తండ్రికి పిండోదకము లర్పించి వత్తునని గయకు పోయెను.

గయ కేగినది మొదలు అతని జీవితములో గొప్ప మార్పు గలిగినది. ప్రాచీన హిందూ బౌద్ధేతిహాసముల పుణ్యస్మృతులచే ఆ క్షేత్రము పరమ పవిత్ర మైనది. అక్కడ నిమ్మాయ్, ఈశ్వరపురి యను పూజ్య వైష్ణ వాచార్యుల చరణముల నాశ్రయించెను. శ్రీకృష్ణుని పరమప్రాప్య దైవముగ గొలుచు భక్తి మత మర్మము లను ఈశ్వరపురి నిమ్మాయికి ఉపదేశించెను, అచటి పెద్దగుడిలో విష్ణుమూర్తి సన్నిధిని నిమ్మాయి భావసమాధిలో మునిగెను. సయాత్రికులు అతనిని నదియాలోని పాఠశాలకు దెచ్చి చేర్చిరి. అంతవఱకు నతనికి పూర్తి బాహ్యలోకస్మృతి గలుగనే లేదు. అతని యాధ్యాత్మిక దృక్పథ మంతయును మాఱిపోయినది. పాండిత్య గర్వము, స్వప్రజ్ఞాతిశయమం దతిమాత్రప్రత్యయము, వాదములలో ప్రతిపక్షులకు దిగ్భ్రమ గొలిపి వినోదించుట — ఇవి యెల్ల అంత రించినవి. దివ్యప్రేమనుగూర్చి యుపన్యసించుచును, శ్రీకృష్ణనామ మును కల్యాణగుణములను సంకీర్తించుచును అతడు గంటల కొలదిగ కాలము గడపుచుండెను. మహాగర్వి యైన పండితుడు మహావినయ భూషితు డయ్యెను. శ్రీకృష్ణునిగాని అతని దివ్యప్రేమనుగాని ప్రస్తావించిన జాలును, నిమ్మాయి వదనము బాష్పముల వెల్లిని మునుగును.

చైతన్యుడు తన యనుచరులకు తఱచు కావించిన యుప దేశము — "వృక్షమువలె జీవింపుడు. వృక్షము, తన కొమ్మలను నఱకుటకు వచ్చిన వానికిం గూడ నీడ నిచ్చునుగదా, నీరు లేక తాను ఎండుకొనిపోవుచున్నను, నీరు దెమ్మని ఎవరినిగాని అడుగదు; వానలను తుపానులను మండుటెండలను ఓర్చుకొంచునే, కమ్మని పూలను, తియ్యని పండ్లను, ఒసంగుచుండును. ఆ యోర్పును అట్టి సేవను అలవఱచుకొనుడు. అదే మీకు ఆదర్శ మగుం గాక!"

ఉన్నత బ్రాహ్మణ వంశమున జన్మించిన యతడు లోకమునకు వినయమును గఱపుటకై, నది కేగి బరువులు మోసియు, గుడ్డలు ఉతికిపెట్టియు వృద్ధులకును లేవలేనివారికిని సాయపడుచుండును. బ్రాహ్మణునిచేత సేవ నందుట అపచారమని ఎవరైన జంకినచో అతడు "అయ్యా, నిను వేడుకొందును, నన్ను వారింపకుము, ఈ చిన్న చిన్న సేవలే నాకు మహాపుణ్యములు, మీ సేవలో ఉన్నప్పుడే నాకు దేవు డగపడును" అని బ్రతిమాలుకొనెడివాడు.

తీర్థయాత్రలు చేయుచున్నప్పుడు చైతన్యుడు ఒకనాడు ఒకచోట ఒక దేవాలయమున కేగెను. దాని కెదుట ప్రజలు గుంపుగా కూడియుండిరి. వారి నడుమ నొక బ్రాహ్మణుడు ఆనంద పరవశుడై భగవద్గీతను చదువుచుండెను, ఆ బ్రాహ్మణుని మోము బాష్పసందోహములందు మునుగుచుండెను. ఉచ్చారణలో తప్పులును వ్యాకరణస్ఖాలిత్యములును ఎన్నో దొరలుచుండినవి. శ్రోతలు ఎగతాళి చేయుచు నవ్వుచుండిరి. కాని ఆ విప్రుడు దానిని లక్ష్యపెట్టనే లేదు. ఆ దృశ్యముం గన్నంతనే తన హృదయము ద్రవింప నిమ్మాయి "స్వామీ, భగవద్గీతలో ఏ పదములందు ఏ గూఢార్థములను గని మీ కింత యానందపరవశత గలుగుచున్నదో దయచేసి నాకు దెలిపెదరా" అని బ్రాహ్మణు నడిగెను. "అయ్యా, చదువువాసన యైనను లేనివాడను నేను. ఏ పదముల యర్థమును నే నెఱుగను. కాని గీతను జదువుచున్నప్పుడెల్ల అర్జునుని రథమున వేంచేసి అతనికి దివ్య సత్యముల నుపదేశించుచున్న శ్రీకృష్ణుని శ్యామసుందరమూర్తి నాకు ప్రత్యక్షముగ కనబడును. ఆ దివ్యదర్శనమే నా కింతటి యుద్రిక్తానందమును ఉత్పాదించుచుండును" అని యా బ్రాహ్మణుడు బదులు చెప్పెను. చైతన్యు డతనిని గౌగిలించుకొని "గీతను పఠించుటకు నిజమైన యర్హత నీకొక్కనికే కలదు, ఏల యన గీతార్థసారమును నీవు తెలిసికొంటివి"వని కొనియాడెను.

చైతన్యుని పాండిత్యగర్వము అడుగంట అంతరించినది. హిందువుల క్లిష్ట కర్మ కలాపములను అనుసరింపక, అతడు తన

ముఖ్య శిష్యుడైన నిత్యానందునితో దేవాలయములందును భవన ప్రాంగణములందును గాయకులను నర్తకులం గూర్చుకొని సంకీర్తనలను జరుపుచుండెను; శ్రీహరిగుణములను, చేతనులందు శ్రీహరి కున్న వాత్సల్యమును కీర్తించుచు నగరవీథులలో ఊరేగింపుత్సవములను నడపుచుండెను.

నదియాలోని బ్రాహ్మణకులీనులు యువకుడైన చైతన్యుని యుపదేశములలోని భావోద్రేకముచే తాము ఎట్టి మార్పును పొంద లేదు కాని, ప్రజలలో పొంగుచున్న యావేశమును, ఊరేగింపుత్స వాలలో నిమ్నవర్ణములవారు ధారాళముగ కలియుచుండుటయు చూచినప్పుడు మాత్రము వారు చాల అల్లకల్లోలపడిరి. వర్ణనియ మాలను అతడు బహిరంగముగ ఖండింపగా విని బ్రాహ్మణులోర్వ లేరైరి, ప్రార్థించిరి, "నీ కాత్మవినాశము గల్గునురా" అని బెదరిం చిరి, కాని ఉపయోగము లేకపోగా, కడకు వారు మహమ్మదీయ ప్రభువులతో మొఱ పెట్టుకొనిరి. న్యాయాధిపతి మహమ్మదీయుడు. ఉద్రిక్తదివ్యభావముచే జాజ్వల్యమానమై యున్న చైతన్యుని ముఖమును, అతని యనుచరుల యాధ్యాత్మికౌత్సుక్యమును గాంచి నంతనే ఆ న్యాయాధిపతి మనసు కరగిపోయెను. అతడు వారిని శిక్షింపక దీవించి పంపివేసెను. చైతన్యానుచరులలో మహమ్మదీయులు ఎందఱో ఉండిరి.

చైతన్యుడు సన్న్యాసాశ్రమమును స్వీకరింప నిశ్చయించెను. కాని అందులకు అతని తల్లిని ఒప్పించుట చాల కష్ట మనిపించెను. అతడు తన మాతృభక్తి నెల్ల జూపి ఆమె పాదములను బట్టుకొని ఆమె ఉండుమన్న చోటనే ఉందుననియు, మునుపటివలెనే ఆమె కోర్కెల నెఱవేర్చుచుందుననియు వాగ్దానముచేసి ఓదార్చెను. అతడు పూరిని తనకు కేంద్రస్థానముగ జేసికొనినయెడల, తల్లికి అతని వార్తలు సులువుగ అందుచుండుననియు, అంతేకాక నదియాలో అప్పుడప్పుడు అతనిని జూచుటకును వీలగుచుండుననియు, తల్లి కొడుకులు ఉభయులును ఒప్పందము చేసికొనిరి. సన్న్యాసాశ్రమ

స్వీకారము నిర్వర్తిల్లిన వెంటనే చైతన్యుడు, శ్రీకృష్ణుని బాల్య సాక్షికమైన బృందావనమునకు యాత్ర బయలుదేరెను. బృందావనమున నున్నంతకాలమును అతనిని ప్రేమభావసమాధి మాటిమాటికిని పైకొనుచుండెను.

తన జీవితకాలమున తుది పదునెనిమిదేండ్లలోను చైతన్యుడు పూరీక్షేత్రమున జగన్నాథాలయము నొద్ద నుండి భక్తిసిద్ధాంత ప్రచారము చేయుచుండెను. జీవకారుణ్యము, భగవన్నామసంకీర్తనాసక్తి, భాగవతసేవ అను నవి మూడును ఆ సిద్ధాంత మందలి ప్రధానాంశములు. ఆయన తన యనుచరుల హృదయములందు ఉత్కటభక్తి మహాజ్వాలలను రగుల్కొల్పెను. భక్త్యుత్కంఠ ఒక పెను వెల్లువయై ఓఢ్ర వంగ దేశములను ముంచివేసినది. ముఖ్యముగ సామాన్యప్రజల పారమార్థికజీవితము మిక్కిలి పెంపొందెను. అతడు అవతారపురుషు డను సత్యమును అతని యాంతరంగిక శిష్యులు అచిరకాలముననే గుర్తించిరి.

ప్రకృతి రామణీయకమున చైతన్యుని ప్రీతి విశిష్టమైనది. పశ్చిమసంధ్యాకాంతులం గన్నను, ఏదేని మహానదిని జూచినను కుసుమసంభృతమైన అశోకవనముం దిలకించినను, ఆయన హృదయము కరగిపోయెడిది. మచ్చికపడని జంతువులే కాక అడవిని వసించు సకల ప్రాణులును ఆయన ప్రభావమునకు కట్టువడు రీతి అద్భుతావహము. వేలకొలది ప్రజలు ఆయనను ఆరాధించుచుండిరి. వారిలో ఆ ప్రాంతపు గొప్ప భూస్వాములు పలువు రుండిరి. ఐనను ఆయన, మన పూర్వాచార్యు లందఱవలెనే, తీవ్ర తపశ్చర్యయే నిత్యజీవితముగ గడపెను. తనయొద్ద అంతరంగ శిష్యులుగ జేర గోరినవారు ఎవరైనను సరే, నియమాలను ఏమాత్రము తప్పినను, ఆయన వారిని కఠినముగ ఖండించెడివాడు.

పూరీక్షేత్రమున ఆయన యుండిన కాలములో చాలవఱకు దైవోన్మాద దశలోనే గడచిపోయెను. ఆనందపారవశ్యమును బొర

యించు చర్చలు, గాఢ ధ్యానములు, దివ్యప్రేమను రుచిచూపునట్టి యింద్రియాతీగదశలు — ఇవి అతనికి నిత్యసంభవము లయ్యెను. ఒకనాడు హరినామమును బాడుకొనుచు తన్నే మఱచి, ఆయన సముద్రమున బడిపోయెను. వలలు వేసి వెలికి లాగిన పిదప కూడ ఆయన శరీరవిస్మృతి అట్లేయుండెను. ఇట్టి తీవ్రాత్మజ్ఞానుభవము లచే ఆయనశరీరము చాల నీరసించెను. గోస్వాము లను పేర ఆయన స్థాపించిన వైష్ణవ సన్న్యాసుల సంప్రదాయ మొకటి కలదు. తాను ప్రారంభించిన మహాకార్యముల నెగ్గించు బాధ్యతను వారికి అప్పగించి, చైతన్యుడు క్రీ. శ. 1553 లో, తన నలువది యెనిమిదవ యేట అవతారమును ఉపసంహరించెను.

# శ్రీరామకృష్ణుని జీవితచరిత్రాంశముల కాలానుక్రమణిక

1775 శ్రీరామకృష్ణుని తండ్రియైన క్షుదిరాముని జననము.

1791 శ్రీరామకృష్ణుని తల్లియైన చంద్రాదేవి జననము.

1805 క్షుదిరాముని ప్రథమపుత్త్రుడైన రామకుమారుని జననము.

1814 క్షుదిరాముడు కామార్పుకురులో చేరుట.

1826 క్షుదిరాముని ద్వితీయపుత్త్రుడైన రామేశ్వరుని జననము.

1835 క్షుదిరాముడు గయకు యాత్రపోవుట.

1836 శ్రీరామకృష్ణుని జననము ఫెబ్రువరి తే 18 ది ప్రొద్దున 5 గంటల 15 నిమిషములకు.

1843 క్షుదిరాముని మరణము.

1845 శ్రీరామకృష్ణునకు ఉపనయనము.

1850 రామకుమారుడు కలకత్తాలో తన పాఠశాలను ప్రారంభించుట.

1852 శ్రీరామకృష్ణుడు కలకత్తాకు వచ్చుట.

1853 మాతృశ్రీ శారద జననము డిసంబరు తే 22 ది.

1855 దక్షిణేశ్వర కాళికాలయప్రతిష్ఠ – హృదయుని రాక – శ్రీరామకృష్ణుడు మొదట విష్ణ్వాలయములోను పిదప కాళిగుడిలోను పూజారిగ నియుక్తుడగుట.

1856 రామకుమారుని మరణము, శ్రీరామకృష్ణుడు దేవిని సాక్షాత్కరించుకొనుట, మొదటిసారి ఆయన దైవోన్మాదదశ.

1857 గంగాప్రసాదుడను వైద్యుడు శ్రీరామకృష్ణునకు చికిత్స చేయుట.

1858 హాలధారి దక్షిణేశ్వరాన పూజారియగుట, శ్రీరామకృష్ణుడు కామార్పుకురున కేగుట.

1859 శ్రీరామకృష్ణుని వివాహము.

1860 దక్షిణేశ్వరమునకు మరలుట, మథురున కగపడిన దివ్య దర్శనము.

1861 రాణి రాస్మణిమృతి - బ్రాహ్మణితో సమాగమము - ఆమె యుపదేశానుసారము తంత్రసాధనము. రెండవసారి దైవోన్మాదదశ.

1863 తంత్రసాధనలు ముగియుట, పద్మలోచన పండితుని కలసికొనుట. చంద్రాదేవి దక్షిణేశ్వరమున ఉండుటకు వచ్చుట.

1864 జటాధారిచే దర్శితమార్గుడై శ్రీరామకృష్ణుడు వాత్సల్యభావమును అభ్యసించుట - మధురభావాభ్యాసము - తోతాపురిచే సన్న్యాసదీక్ష గొనుట.

1865 హాలధారి స్థానమున అక్షయుడు నియుక్తుడగుట, తోతాపురి దక్షిణేశ్వరమును వీడి యేగుట.

1866 శ్రీరామకృష్ణుడు ఆఱునెలలు అద్వైతదశలో ఉండుట - వ్యాధి - మహమ్మదీయ మతోక్త సాధనానుష్ఠానము.

1867 కామార్పుకురులో శ్రీరామకృష్ణుడు - బ్రాహ్మణివీడ్కోలు.

1868 యాత్ర - గంగామాయితో కలసికొనుట.

1870 మథురునితో ఊళ్లు చుట్టుట - కొలూటోలా హరిసభలో శ్రీరామకృష్ణుడు - కాల్నా నవద్వీపాలకు ప్రయాణము.

1871 మథురుని మృతి.

1872 మాతృశ్రీ దక్షిణేశ్వరమునకు మొదటిసారి వచ్చుట - షోడశీ పూజ.

1873 రామేశ్వరుని మరణము.

1874 మాతృశ్రీ మరల దక్షిణేశ్వరమునకు వచ్చుట.

1875 శ్రీరామకృష్ణుడు కేశవచంద్రసేనుని తొలిసారి దర్శించుట, కామార్పుకురునకు కడపటిసారి పోవుట.

1876 చంద్రాదేవి మరణము.

1877 కేశవునితో గాఢమైత్రి.

1878 మాతృశ్రీ దక్షిణేశ్వరమునకు మూడవసారి వచ్చుట.

1879 శిష్యులు రా నారంభించుట.

1880 రాఖాలుతో నరేంద్రునితో సమాగమము.

1881 హృదయుని బర్తరఫు.

1882 విద్యాసాగరపండితుని దర్శించుట. మాతృశ్రీ మరల దక్షిణేశ్వరమునకు వచ్చుట.

1883 కేశవునిమృతి, శశధరపండితుని కలిసికొనుట, గోపాల్మా, దక్షిణేశ్వరమున ఉండుటకై మాతృశ్రీ కడసారిరాక.

1885 పాణిహాటికి కడసారి పోవుట, వ్యాధి, శ్యాంపుకూరునకు చేరుట, డాక్టరు సర్కారుతో కూటమి, కాశీపూరునకు చేరుకొనుట.

1886 కాశీపూరులో వైద్యము, శిష్యులనొక సంస్థగ కూర్చుట, ఆగస్టు తే 16 ది అర్ధనిశానంతరము ఒంటిగంటయప్పుడు నిర్యాణము.

# శ్రీరామకృష్ణ సూక్తి సుధ

## అకారాది విషయ సూచిక

ప

మ

## శ



## స

హ

# అకారాది గేయసూచిక



